

జంభల విగ్రహము.

[బౌద్ధ సంప్రదాయమున ధనదేవత, కుబేరుని స్థానము నాక్రమించువాఁడు. ఈవిగ్రహము మేతా. ఐ. సి. ఎస్. గారికి నూతనముగ లభించినది.]

శోభ

అసలు సంపుటము. 3
క్రొత్త సంపుటము. ౧
సంచిక. ౧

# కవిత్వప్రయోజనము

దువ్వూరి రామిరెడ్డి

శాస్త్రజ్ఞానము వ్యాపించుకొలఁది కొందఱు కవిత్వ ప్రయోజనమును గుఱించి సంశయింపఁ జొచ్చిరి. కావ్యముయొక్కయు శాస్త్రముయొక్కయుఁ బ్రయోజన భిన్నత్వమును దెలిసికొనక రెంటిని గలగుమ్మటము చేసికొనుటవలన సత్యములేదనియుఁ బ్రకృతి విరుద్ధములగు చర్యలకుఁ దావలమనియు అందువలన మానవుల కేలాంటి యుపయోగము లేదనియు వారినమ్మకము. "ప్లేటో" అను గ్రీసు దేశపుఁ బ్రఖ్యాత తత్త్వశాస్త్రజ్ఞుఁడు కవికిఁ దన "రిపబ్లికు" నందుఁ దావొసంగలేదు. "హెర్బర్టు స్పెన్సరు" అను ఆంగ్లేయ తత్త్వశాస్త్రజ్ఞుఁడు "వీలైనయెడల నేమానవుఁడైనను దనయుద్దేశములను ఛందోబద్ధము గావింపకుండుట మంచిది" అని స్వీయ చరిత్రమున వ్రాసికొనెను!! "ఎలిజెబెత్" రాణికాలమున నింగ్లండునందలి కవిత్వ నిరాదరణము నెదుర్కొనుటకు సర్ ఫిలిఫ్ సిడని వంటివారు గ్రంథములు వ్రాయవలసి వచ్చెను! కాని ఆకాలమునందె షేక్సిపియరు వంటి మహాకవు లుద్భవించి యాంగ్లేయ ప్రతిభను సర్వతోముఖముగఁ బ్రసరింపఁ జేసిరి. కవిత్వమును తన్నిరాదరణమును ఒక్కయుయ్యాల

తొట్టిలోఁ బెరిగి పెద్దలైనవి! కాని కొంతకాలమునకు "నిరాకరణము" ఉరివేసికొని చచ్చినది.

భారతదేశమున నట్టి సంశయ మెన్నడును బుట్టి యుండలేదు. హిందూమతపుఁ బునాది యనఁదగు పవిత్రమైన వేదవాఙ్మయము ఛందోబద్ధమై యున్నది. హిందువులకుఁ గవిత్వ మన్న గౌరవాస్పదమైన శిల్పము లలితకళల కధిదేవతయైన సరస్వతి సృష్టికర్తయగు బ్రహ్మదేవుని భార్య!

శ్లో॥ సంసార విషవృక్షస్య ద్వేఫలేహ్యమృతోపమే।
కావ్యామృత రసాస్వాదః సాధుభిశ్చ సమాగమః॥

కావ్యామృతరసాస్వాదమును, సాధుసంగతియు సంసార విషవృక్షముయొక్క అమృతమయములగు రెండుఫలములంట! ఇందువలన హిందువులకుఁ గవిత్వమునందు నెంత యాదరణ ముండెనో మన మూహింపఁ గలము. కావ్యప్రయోజనములను గుఱించిన మన యాలంకారికుల మతము ఈక్రింది శ్లోకము వ్యక్తపఱచుచున్నది.

శ్లో॥ కావ్యం, యశసేఽర్థకృతే, వ్యవహార విదే శివేతరక్షతయే,
సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే.

ఇందు "సద్యః పరనిర్వృతయే" అనునది ముఖ్య ప్రయోజనము. ఆనందాస్పదమైన రసోత్పాదకత్వమె లలితకళల గంతవ్యము. శాస్త్రముయొక్క కార్యము వస్తుతత్త్వపరిశోధనము. శిల్పముయొక్క పని వస్తువునావరించిన మనోహరత్వమును మూర్తీభవింపఁ జేయుట. మొదటిదాని ఫలితము విజ్ఞానము. రెండవదాని ఫలితము ఆహ్లాదము.

కవి యే మనోవస్థలోఁ దన కావ్యమును రచియించెనో ఆయవస్థనే సహృదయుఁ డాకావ్యమును జదివినప్పుడు పొందును. సంకుచిత

సుస్థిరమైన సంసార పరిసీమలను భేదించుకొని మనస్సు విశాలమైన భావ ప్రపంచమును అనిర్వచనీయమైన యానందము ననుభవించును. కావ్య జగత్తే మనకు సత్యము లగ్నమైనపుడు అదియు బాహ్య ప్రపంచము వలె యథార్థముగఁ దోఁచును. ఒకసారి నే నభిజ్ఞానశాకుంతలముఁ జదువుచుండ, మనోహరారణ్యముల సంచరించినట్లును, శకుంతల పూఁదీవలకు నీరుపోయుచుండ నేను ప్రత్యక్షముగఁ జూచినట్లును, ఆమె పత్తినారింటికి వీడ్కోలుపుటకు నీటికాలువ వఱకు వచ్చిన కణ్వమహర్షియు ననసూయా ప్రియంవదలు మున్నగు సఖులలో నేనుగూడ నొకడననియుఁ దలపోసి వారి సుఖదుఃఖములను నేనును బంచుకొనుచుంటిని. కణ్వుని యాక్రోశము నాకర్ణపుటముల గింగురు మని మాఱుమ్రోయుచుండెను. కాని నేను చదువుచుండినది నాటక మనియుఁ గాళిదాసుని యసదృశమైన రచనాచమత్కృతియుఁ బ్రతి భయు నన్నటుల ముగ్ధుని గావించినదనియుఁ దెలిసికొనుటకు నాకుఁ జాలసేపుపట్టెను. మనసు సామాన్యశ్రుతిలోఁ బడిన వెనుక, కలగని నిదురలేచిన యనంతరము స్మృతి లేశములు స్ఫురించునటులఁ గణ్వుని సంసారము నాభావమునకుఁ బొడకట్టుచుండెను. హెన్రీవుడ్ అనునామెరచియుంచిన "ఈస్టిను" అను నవలలోని కడపటి యధ్యా యమును "ఒథెలో" నాటకములోని "హత్యా-రంగమును" జదువు చుండినపుడు నాకుఁ దెలియకయే నేను గన్నీరు నించుచుంటిని. ఈయ వస్థ నా కెంతసేపుండెనో తెలియదు. తెలిసినప్పుడు, నేలపై జాఱిపడిన వాఁడు తన్నెవరైనఁ జూచుచున్నారాయని యటునిటు పరికించునటుల లజ్జాకరమైన నాస్థితిని నెవరైనఁ గాంచుచున్నారాయని పాఱఁజూచి అచ్చట నెవరును లేకుంట నెఱిఁగి తృప్తిపడితిని. కావ్యలోకము ఆసమ యమునకు సత్యమని తోఁపనిదే మనకు సహానుభూతి యెట్లుగలుగును?

# కవిత్వప్రయోజనము

జర్మను కవిశేఖరుఁడగు "గతే" కావ్యప్రయోజనమును గొంచె మించుమించుగ మనయాలంకారికుల వలెనె నుడివియున్నాఁడు.

"Each age has sung of beauty
He who perceives is from himself set free"

మానవసంఘమున యథార్థముగ నాగరికత నెలకొన్నయెడల ప్రజలయందు సౌందర్యపిపాసయు నభివృద్ధి చెందుచుండును. అట్టికాలమున సామాన్యజనులు గూడ లలితకళల నభిమానించుచుందురు. ఇది యెంతయు సహజము. కాళిదాసుని కాలమున నైనాఁటి సంఘము చాల నాగరకస్థితియం దున్నదనుటకు ఆనాఁటి యాచార వ్యవహారములును, కళాకౌశలమును, సాక్ష్యములుగ నున్నవి. అందుచేఁ గాళిదాస మహాకవియె మొదటితార్కాణము! కవుల కావ్యములందు సమకాలీనమైన సాంఘికపరిస్థితులు, తదభ్యుదయ పరిణామములుఁ బ్రతిఫలించుచుండును. సారస్వతము సంఘముయొక్క యుచ్ఛనీచ స్థితిగతులను దెలియఁ జేయు 'థారమితి' యని చెప్పవచ్చును.

కాళిదాసుని కాలమునఁ జిత్రలేఖనము, నృత్యము, సంగీతము, నాటకము, మున్నగు లలితకళలు చాలవ్యాప్తిలో నుండినవి. మాళవికాగ్నిమిత్రమునం గల యంతర్నాటికయందుఁ గాళిదాసు ఆకాలపు రాజకుటుంబముల నృత్య వినోదములను గాన్పించినాఁడు. శకుంతలను అత్తవారింటికిఁ బంపుసమయమున వనస్పతులొసఁగిన యాభరణములచేతఁ దమసకియ నలంకరింపఁబోవుచు ననసూయ "మేమింత వఱకు భూషణముల నుపయోగించి యెఱుఁగము. అయినను చిత్రరూపు వ్రాతయలవాటునుబట్టి నీయంగములయం దాభరణవినియోగము చేసెదము" అనిపలికెను. వనమున నివసించు ఋషికుమారికలె చిత్రలేఖనము నందంత నిపుణులై యుండ, నిఁక నాగరక యువతుల మాట

వేఱ చెప్పవలయునా? ఆంగ్లేయ కవుల కావ్యము లందైనను దేశకాలములు తెలుపఁగ చిహ్నముల నుగ్రహింపకపోవు. రామాయణ మహాభారతములు ఆ యాకాలము నాటి హైందవ సంఘముయొక్క ఆదర్శక ప్రతికృతులని తెలియవచ్చును.

మన మనోవికారములను, భావములను శిక్షించి సంస్కరింపఁగల యనుభవములు మాటిమాటికి లోకమునఁ దటస్థింపవు. ఒకవేళ తటస్థించినను, అవి పరిపూర్ణముగను, ఆదర్శకప్రాయముగను నుండవు. కాని, అట్టియనుభూతులను గావ్యములందు మనము యథేచ్ఛముగఁ బొందవచ్చును. కవిత్వసంపర్కమువలన సంకుచిత భావము తొలఁగి యఖండజీవనముయొక్క పరతటము నంటఁగలము. క్రమక్రమముగ మనస్వభావము సున్నితముగ మాఱి తిలకించుఁ బ్రతి వస్తువునందు సౌందర్యమును గురించి యానందింపఁగల యభిరుచి హెచ్చును. కావునఁ గావ్యము మానవప్రకృతి నుద్ధరింపఁగల యొక మనోహర సాధనము.

సంఘముయొక్క సంయోగితను బోషించుటకుఁగూడఁ గావ్యము లమోఘసాధనములు. అట్టిప్రబంధముల యందలి సర్వజనీన భావములు ప్రజలనందఱిని నేకసంప్రదాయబద్ధులను గావించి సంఘముయొక్క యైక్యమును బలపఱచును. రామాయణ మహాభారతములు లేకుండిన హైందవసంఘ మేమై యుండునో. హిమవత్పర్వతము మొదలు కన్యాకుమారివఱకుఁ గల యీ విశాలభారత దేశమున నీరెండు జాతీయకావ్యములను జదువని వినని హైందవుఁడుండునా? ఎన్ని శతాబ్దములనుండి యీ కావ్యద్వయము మనసంఘమును బాలించుచున్నది! కాలము మాఱినది. చక్రవర్తులు గతించిరి. రాజ్యములు బంతులవలె నొకరిచేతినుండి మరియొకరిచేతికి దుమికినవి. మతములు

పుట్టిచచ్చినవి ; చచ్చిపుట్టినవి. అన్యదేశ నాగరకతా సంఘర్షణము గలిగినది. ఆచార వ్యవహారములు మాఱినవి. పూర్వార్యావర్తము రూపముమార్చుకొని క్రొత్తదేశమైనది. కాని మన జాతీయకావ్యము లు ప్రాతవడలేదు. వానియధికార మింకను మొక్కవోలేదు. నేఁ దవజీవన ప్రవాహమున ఆకావ్యములు తటములవలె నున్నవి. కాలమా ! నీవుచచ్చితివి ! రామాయణ మహాభారతములు చావ లేదు. అవి చిరంజీవులు !

# ఫలశ్రుతి

నాయని సుబ్బారావు

ఈయగమ్యపర్వతపంక్తు లెక్కివచ్చి
నీగృహప్రాంగణమ్మున నిల్చినాను
నాయెడఁద సంశయావిష్టమై యెఱుంగఁ
బడని యర్థమ్ములైన నీభావగతుల
పరమపదనాధుకొఱకు పార్వతియుఁబోలె
నాకొఱకు యోగముద్ర నున్నావు నీవు!

నీయనంతరూపములకు నిలువనీడ
యైన నానిఱుపేదదేవాలయమ్ము
నెట్లు తగినట్లు కైసేయు టెట్లులని ని
రంతరము నాకు తీఱనిచింత దేవి!

నిమిష నిమిషమ్ము నిట సమున్మిషితతావ
కాంఘ్రినీరేజదివ్యరేఖాంక మిదియు
శబలితవిచిత్రరోచిరుజ్జ్వల మలోక
మధురసౌందర్యసోపానమండితమ్ము
నాదు భాగ్యమ్ము నాలోన నాకె వెఱుగు!

అంతులేనియీయాత్ర నిరంతరాయ
సాంతమయ్యెను నాజన్మ సఫలమయ్యె
ననుచు మూఁపున పూజోపహారసమితి
దించుకొన్నాను నీపాదదీప్త ధరణి

# ప్రహ్లాద—విషాదనాటకము

పాశ్చాత్య నాటకపరిభాషయందలి 'ట్రాజెడి' (tragedy) అను రూపక విశేషమునకు మనభాషయందు 'విషాదాంత నాటకము' అనుపర్యాయపదము వ్యవహారమున నున్నను అనేకులకు దానిలక్షణములుగాని తత్త్వముగాని స్పష్టమైనట్లు తోచుటలేదు. పర్యాయ పదస్వరూపము సైతము ఆరోపమునే నిరూపించుచున్నది. అంతమున నాయకుఁడో, నాయికయో, కాక ఇర్వురునో మృతిచెందు నాటకము 'ట్రాజెడీ' అని యూహించుటచేతనే 'విషాదాంత' మని భాషాంతరీకరించిరి. అది పొరబాటు. 'ట్రాజెడీ' యందు ప్రధానపాత్రము దుఃఖము నొందుట నిజమే గాని యెట్టిసందర్భముల నెట్టి కారణములచే నెట్టికష్టము సంభవించినను విషాదరసము (tragic sentiment) ఉద్భవించునని యూహించుట తప్పు. విషాద రసాత్మకమైన నాటకము 'ట్రాజెడీ' గాని కేవలము విషాదాంతమైననాటకము గాదు. కావున నీవిషాదరసముయొక్క స్వరూపమును అరసి గ్రహించుట ఆవశ్యకము.

లౌకిక సాధారణమై ప్రత్యక్షానుభవమునందు అనేక కారణములచేఁ గల్గు దుఃఖానుభవమునకును, కళాత్మకమైన విషాదరసమునకును భేదముగలదు. సామాన్యముగ మన కాప్తులు గాని, పరిచయములవారు గాని మరణించినచో విచారింతుము; కష్టములపాలైన సానుభూతిఁ జూపి, మనమును దుఃఖింతుము. కాని అట్టి యనుభవము విషాదరసమునకు జెందినదిగాదు. బీదవాఁడొకఁడు, నెవఁడో యొకముసలి బండిక్రింద బడి స్పృహదప్పిన గాయపడి యుండుట చూచిన మాత్రాన విషాదరస ముత్పత్తిల్లుచున్నదనుట అతిశయోక్తియే గాక అసత్యమునగును. ఇట్లు అనేకసందర్భములందు ఇతరుల దురవస్థ గాంచి ఖేదము పొందుచున్నాము గాని ఆసందర్భములే కళారూపములలో నొకటియైన నాటకమున ప్రదర్శించినచో రసపోషణము సంభవింపదు.

విషాదనాటక జీవితమైన రసమునకు గొన్ని ముఖ్యలక్షణములు పరికింపవచ్చును. నాయకుని దురవస్థ వలన సామాజికులకు గల్గువిషాదము సార్వజనీనమైనదిగ నుండవలెను. రెండవది, ఆయవస్థకుఁ గారణము కేవలము పురుషకారమునకు అతీతమై బలవత్తరమైనవిధి గాకూడదు. అప్పుడు నాయకుడు స్వతంత్రుడు గాక విధిచేత కీలుబొమ్మయైపోవును. వ్యక్తిత్వము నశించును. పాత్రపోషణము దుస్సాధ్యమగును. నాలు

గంకముల వరకు ఎట్లో కాలక్షేపము చేసి ఐదవయంకమున ఏపాపమో కరచి నాయకుఁడు మరణించిన మాత్రాన విషాదరసము పోషింపబడదు. విషాదనాటకము నాయకుని దురవస్థకు నాయకుఁడే కారకుఁడై యుండవలెను. ఆదురవస్థ హఠాత్సంభవమును విధివశమును గాక ప్రారంభమునుండియు సామాజికులమనంబునకు గోచరించుచుండవలెను.

నాయకునిదుస్థితికి (మరణమేయుండవలెనని నిబంధనలేదు) నాయకుఁడే కారకుఁడంటిమి. ఈలక్షణము నాటకమూలతత్త్వముపై నాధారపడియున్నది. ధనంజయుడు నుడివినట్లు రూపకప్రయోజనము ఆనందాస్వాదనముగాని త్రివర్గసాధనము గాక పోయినను సహృదయుల కెన్నటికిని ధర్మవిరుద్ధమును, అన్యాయమును, అసంగతమును అగువస్తువు రసవంతము గానేరదు. అందుచే నాయకుఁడు సత్యసంధుఁడును, సర్వసద్గుణోపేతుడునై యుండి అన్యాయముగ కష్టకడకు దురవస్థ చెందునట్లు ప్రదర్శింపబడినయెడల సరసులగువారికి మనఃక్లేశమును, వైముఖ్యమును, అసహ్యతయు ఉద్భవించును. ధర్మమడుగంటుటయు, అధర్మము జయముగాంచుటయు, వస్తువుగాగల నాటకము ఉత్తమకళకుఁ జేరదు. అట్టి సందర్భములందు విషాదరసము కాదుగదా ఏరసమును పోషింపబడదు. కావుననే ఇప్పటి "సారంగధర" అనేకవిమర్శకులు ఏవగించుచున్నది. అట్టి న్యాయప్రవర్తకునకు అట్టియవస్థయా! అతనిగతి చూచి ఇంటికి వెళ్లు సరసునకు లోకమునందు ధర్మము జయించునను వాక్యముకల్లయను సందేహము దృఢమగునుగదా! కావున నాయకునిదుస్థితికిఁ గారణము నాయకునియందలి గుణలోపమో, దుర్గుణమో యై యుండవలెను. అప్పుడే ఆయవస్థ ధర్మానుసారమై సాత్త్వికసాంప్రదాయ బోధకమై రసాశ్రయమైయుండును.

అట్లనుటచే, విషాదనాటకమున నాయకుఁడు దుర్మార్గుడును, [illegible] యుండవలెనని యూహించుటయు అనర్థదాయకమే, ఏలయన కేవలము [illegible] యుండునాయకునకుఁ గష్టము ప్రాప్తించిన విషాదరసనిష్పత్తి దుర్లభమగును. అట్టి నాయకుఁడు సామాజికసానుభూతికి పాత్రుడుగాడు గనుక అతనిదురవస్థకుఁ జింతించు నవసరముండదు. అక్కటికమొక్కింతయులేక, తుచ్ఛవిషయాసక్తిని దవిలి, దార్లుకొట్టి, నోరులేని వారిని హింసించు హంతకుఁడు పోలీసువారి తుపాకీకి ఎరయైన తమాత్రాన మనకు విషాదము గల్గదు.

కనుక కించిత్ లోపముండినను విషాదనాటకమున నాయకుఁడు ఇతరవిధముల నుత్తముడుగనుండుట ఆవశ్యకము. ఈ యంశము కవిసార్వభౌముఁడగు షేక్స్పియరు

వ్రాసిన విషాదనాటకరాజములగు, హామ్లెట్ (Hamlet) ఒతెల్లో (Othello) మొదలగు వానియందు విశదమయ్యెడిని.

ఈదృష్టితో 'ప్రహ్లాద' నాటకమును పరికించిన కొన్ని క్రొత్తవిషయములు బయల్పడగలవు. ప్రహ్లాదనాటకము పౌరాణిక నాటకములలో ప్రసిద్ధిచెందినది. ఆంధ్రజనులందఱకును ఇతివృత్తము పరిచితమే. భక్తిరసపూరితమైన నాటకమని ప్రఖ్యాతి వహించినది. ప్రహ్లాదమహాముని విజయమే అందలి గొప్పవిషయము. దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఇవియే ప్రధానాంశములు. హిరణ్యకశిపు రాక్షసుడు. క్రూరుడు మూర్తీభవించిన దౌర్జన్యము. ప్రహ్లాదుడే నాయకుడు. నాటకము మంగళాంతము. ఇట్టి యభిప్రాయములే ప్రస్తుతము సామాన్యముగనున్నవి. కాని పైవర్ణించిన విషాదనాటకతత్త్వమును దృష్టియందుంచుకొని మరల నీ ప్రాతనాటకమును పరిశీలింపుడు. అప్పుడది గొప్పవిషాదనాటకముగ పరిణమించును. దానికి నాయకుడు హిరణ్యకశిపు. అతనియంతమే విషాదాంతము.

ఈ నూత్నదృష్టి కలుగుటకు ప్రబలకారణము శ్రీతాడిపత్రి రాఘవాచార్యులగారి హిరణ్యకశిపు పాత్రధారణమే. ఆనటసార్వభౌముడే ఆపాత్రమును ప్రత్యుత్తమముగ నభినయించి విషాదరసమును పోషించెను. హిరణ్యకశిపు శీలమును చిత్రించుటయందు గొన్నిమార్పులొనర్చి ఆంధ్రనాటకప్రపంచమున కొక విషాదనాటకరాజము నర్పించెను.

విషాదనాటకమున నాయకుడు తనగుణసంపన్నతచే సామాజికుల సానుభూతిని గౌరవమును ఆకర్షింపవలెనని మున్ను చెప్పియుంటిమి. రాఘవాచార్యులుగారు హిరణ్యకశిపువేషము ధరించి యభినయించినపుడు ఏదో సహజమగు అభిమానము గౌరవము జనింపదు? ఆ తేజస్సు! ఆగాంభీర్యము! ఆశక్తి! తపోనిష్ఠామగ్నుడై మొట్టమొదట మన కనులకుఁ గట్టును. ఆవైభవము రాజసమైయుండునుగాక, కాని తామసమెన్నటికిని గాదు. ఉగ్రతపమొనర్చి బ్రహ్మను మెప్పించినవాడు సామాన్యుడెట్లగును? బ్రహ్మ వరములు గోరుకొమ్మని చెప్పినప్పుడు గంభీరభాషణముల నమరత్వమును అజేయత్వమును వేడినప్పుడును, ఆవెనుక, ఏయేకాలముల నెవ్వరిచేత తనకు మరణము సంభవింపకుండ వలెనని చెప్పినప్పుడును రాఘవాచార్యులగారి యభినయము మొట్టమొదట నాకు అతిశయముగ గన్పడెను గాని విచారించినవెనుక దానియౌచిత్యము బోధపడెను. హిరణ్యకశిపు బ్రహ్మను కరుణించి వరముల నిమ్మని యాచించుటలేదు. తాను శ్రమించి, యార్జించిన ఫలముల నిమ్మని కోరుచున్నాడు. ఈ మొదటిరంగమునుండియే ఇతని

# ప్రహ్లాద-విషాద నాటకము

ధీరోదాత్తగుణములతో బాటు దుర్గుణముసైతము గోచరమగుచున్నది. ఆగుణమే ఇతని కట్టకడపట పిచ్చివానివలెఁ జేసివేయును. తుదకు ఇతని నాశనమునకుఁ గారణ మగును. ఈదుర్గుణము తుచ్ఛగుణములలో నొకటిగాదు. మహాపురుషులని పేరొం దిన యనేకులకును దూరముగానిది.

అహంకారమే ఈదుర్గుణము. స్వర్గమును జయించి, ఇంద్రాదిదేవతలను బానిసలుగ నొనరించు రంగమున రాఘవాచార్యులుగారు ధీరత్వమును, శౌర్యమును బాగుగ పోషింతురు. వానితో నీదుర్గుణమును సైతము సూచించుచునేయుందురు. "నాకన్న నధికులెవ్వరున్నారు. నేనే విష్ణువు" అని గర్జించునపుడు అధైర్యసాహసములను మనము మెచ్చుకొన్నను, అంతయహంకారము తగదని తలపక మానము.

విధిచిత్రముగ నీయహంకారమునకుఁ ప్రబలవిరోధము ఒక్కటే తటస్థించినది. అదియు ముద్దులకుమారుఁడు ప్రహ్లాదుని రూపమున. హిరణ్యకశిపునకు మరింత దుర్భరమైనది. అతనికిఁ గుమారుని యెడల ప్రేమలేదనుట కల్ల. ప్రేమాధిక్యము చేతనే బాధ యెక్కుడాయెను, మొదలు మొదలు కుమారుని తప్పేమియు లేదనియు, ఎవరో గిట్టనివారు దుర్బోధనలు చేయుచున్నారనియు తలచి ఊరక బెదరించును. బుజ్జగించును. ప్రహ్లాదుఁడు హరినామస్మరణము వీడకుండుట గాంచి కోపించును. మరల క్షణమున చింతించి ముద్దిడును. అయినను, కొంతకాలమునకు, ఆయహంకార ప్రవాహము విరోధమును సహింపఁజాలక పోవును. అహంకారభంగముచే జనించిన తీక్ష్ణకోపావస్థయందు, కుమారుఁడని సైతము ఎంచక, శిలపైనుండి పడద్రోయింప నాజ్ఞాపించును. కాని, తోడనే, లీలావతి దుఃఖించుచుండుట గాంచి తనను లోనుండి పొంగి పొరలివచ్చు దుఃఖమును కన్నులలోనే అదుముకొని భార్య నోదార్చును. ఈ క్షోభయంతయు ఆచార్యులవారు సహజ కౌశలములో నభినయింతురు. ప్రహ్లాదుఁడు మడియక సజీవుడై మరలివచ్చినపుడు అతని సంతోషము గాంచిన మనకు జాలిపొడమక మానదు. అయినను అహంకార మాహాత్మ్యము అత్యధికము. దానికి అడ్డువచ్చినవానిని సహింపఁజాలదు. తానెన్ని విధముల ప్రయత్నించినను ప్రహ్లాదుఁడే జయించుట గాంచి హిరణ్యకశిపునకు పిచ్చియేపట్టును. ఆచార్యులవారు ఎన్నియో విధముల ఉన్మాదము నభినయించియున్నారు. ఈనాటకమున అహంకారోన్మాదము నటింతురు. చేతులార కుమారునకు విషము నందించునపుడు అతనికండ్లకు కుమారుఁడు కన్పడుచున్నాడాయను సందియమే కలుగును.

అంత్యరంగమున ఆచార్యులవారు విషాదంపురాజ్యచక్రవర్తి యగుదురు. అట్టి

మహాశక్తి సంపన్నుఁడు అహంకారదగ్ధుఁడై కాలమున నశించుటగాంచిన ఏరసికునకు ఖేదముప్పతిల్లదు? ధర్మమే జయించెనను తృప్తి గల్గినను, అట్టివాఁడు ఆయొక్క దుర్గుణముచే అట్టి దురవస్థ చెందినందులకు మనము చింతింపక మానము. ఆయనుభవమే విషాదరసమున కాధారము. ఆరసము పోషింపబడుటచేతనే 'ప్రహ్లాద' నాటకము విషాదనాటకరాజము

[ఇందు ప్రచురింప బడిన ఫోటోలు 'కళ'కై ప్రత్యేకముగ వి. ఎస్. గోపాలుగారిచేఁ దీయింపఁబడినవి.]

# ధ్వని

## శ్రీ శివశంకరశాస్త్రి : సాహితీసమితి

### వృద్ధరాలు

ఏమి యిట్టు లుంటి వీనాఁడు నాయనా?
వసన మేల యింత వన్నె తరిగె?
ముఖము జూచినంత మూర్తిభవించిన
దుఃఖమో యనంగ దోఁచె దోయి!
జలక మాడి కేశసంస్కార మొనరించి
తిలకరేఖ నుదుట దిద్ది తీర్చి
ధౌతవస్త్రములను ధరియించి, మెడలోన
మల్లికాప్రసూనమాల దాల్చి—
సందెవేళ నెటకొ చనునాఁడె వంతలో
పండుకొంటి వేమి పాన్పుమీఁద?
నీనిగూఢభూరినిరుపమవ్యథల నీ
విమలవేష మెంతొ వృద్ధిచేసె.
ఏల చింతతోడ కాలయాపనచేయు
చుంటి వోయి తండ్రి యొక్క రీతి?
చాలకాలమునకు సాహసంబు వహించి
నేఁడు తరచుచుంటి నీచరిత్ర.
పిల్ల నిత్తు రన్న పెడచెవి బెట్టెద
వేమి కారణంబొ యెరుక పడదు!
చెప్పువారు లేక చెడిపోవుచున్నావు,
శీఘ్రగతిని పెండ్లి చేసికొనుము!
ఒల్లవైతి వెట్టి యుద్యోగ మేనియు,
భూమిపట్ల శ్రద్ధ పూన వెపుడు,

చదువుకొనియు ద్రవ్య సంపాదనము లేదు,
ఇట్టు లున్న నీకు నేమి సుఖము?

నాయకుడు

చిన్ననాటనుండి చేసిన కృషి యెల్ల
పూర్ణ మధురసానుభూతికొరకు,
చదువుకొన్న దెల్ల జ్ఞానోపలబ్ధికి,
కాంచనమ్ముమీద కాంక్ష లేదు.
వ్యర్థజనుడ నేను వ్యావహారికదృష్టి,
కావ్యలోకమందె కాపురంబు.
నడపువాడు లోకనాయకు డున్నాడు,
ఎట్టిలోప ముండ దెప్పుడు నాకు.
ఇన్నియేండ్లు వచ్చె: ఇంక నేమి వివాహ!
మఱియు నాకు విద్యలందె సుఖము.
దేహమును పవిత్ర దేవాలయంబుగా
నెంచి నే నలంకరించుకొందు.

వృద్ధురాలు

అంతమాత్ర మెఱుగ ననుకొంటివా యేమి!
ముసలిదాన నయ్యు మోసపోను.
కాంత యెవరొ చాలకాలముక్రింద నీ
యార్ద్రమైన హృదయ మపహరించె!
ఒక్కనాడు మిగుల నుల్లాసమూర్తివై
పాడుచుందు వేవొ పద్యములను,
మోము ముడిచి మౌనముద్రతో నొకనాడు
కూరుచుందు వొకట గువ్వవోలె.
మరల నొక్కనాడు మందస్మితంబుతో
నేమొ చేయుచుందు వింటిలోన,
శూన్యదృష్టితోడ జూచెద వొకనాడు

ధాత్రి

కరయుగంబు జేర్చి గండపాళి.
ఒక్కనాడు తాల్చి శృంగారమ్ములు ప్రేళ్ళ
కనకహారములను కంఠసీమ;
పరిమళింతువోయి పటవాసములతోడ
సాంద్రసురభిగంధచర్చతోడ.
పెద్దవారితోడ ప్రేమవృత్తాంతంబు
చెప్ప నిచ్చపడరు చిన్నవాండ్రు.
ఎట్టులైన నొక్కయింటిదానివు కమ్ము,
అంతకన్న మాకు కాంక్ష మేది?
ఇంతసేపు పూని [illegible] తాలిమి
వృద్ధురాలి నుడులు వింటివి వయస్య
వెడలిపోదు నింక వెల్గించి దీపంబు,
అలమె తమము మందిరాంతరమున.

నాయకుడు

తలుపు మూసి పొమ్ము ధ్వనిచేయకుండగ,
దీపశిఖను జూడనోప నేడు.
పండుకొనుటె మేలు పర్యంకతలమున
అంధకార మొసగు నధికశాంతి.

* * *

కానరాకయుండు గాఢాంధతమమున
సర్వలోకవస్తు సముదయంబు
దేవి, నీయఖండ దేదీప్యమూర్తి నా
యక్షియుగళి యెదుట నపుడు వెలుగు!

# నాటకము

## భారతుల మార్కండేయశర్మ

### నాంది

గునియు నభవర్గు సుమనః కకుప్పుటముల
సరసమధుగంధలుబ్ధ బంభరమువోలెఁ
బోలయు నా పేరివటుఁడు సమ్ముదితుఁడౌఁత
మీ ప్రదర్శనవిలాస సమీక్షణమున ;

### ప్రస్తావన

నారచించిన యిమ్మహానాటకమున
నేనె నటకులం దొక్కండనై నటింతు ;
నాదృగంతర నిష్క్రమణ ప్రవేశ
కములు నన్నాదుటయె నాటకంబునుండి ;

### ప్రథమచ్ఛాయ

ఈ యపారాంధకార సంవృత్తజగతిఁ
బొట్టకక్కుటెటి స్థలాంతములఁజరించు
నాయపూర్వవిధి విలసనంబుఁ గూర్చి
నాకె నగ వుట్టిపడు కారణంబు గనక ;
కాని తన్మయులైన ప్రేక్షకులు తమ్ము
గన్మొఱఁగు నంతరజ్యోతి గతులకుబ్బి
ననుఁదలంచి యవ్యక్తరోదనముసేయు
నట్టి పాల్గిటునట్టిడం చభినుతింత్రు ;
ఏ నుదధిభంగ భుగభుగాయితరవాను

వాకసంశ్రవణానందపరవశుండ
నాయదృచ్ఛా విహార విహాయసమున
భేదమెనయని సకలజీవి ప్రశాంత
ఖేలనంబునఁ దాండవకృష్ణమూర్తి
నే ; విసీవృదిలాకారయితను నేను
నాపరబ్రహ్మభావకంధరమునందు
కావలసినంత విశ్వమ్ము గానుపించు ;

ద్వితీయచ్ఛాయ

ఉదయ సాంధ్య భానుచతుష్కి నిదుర వీడి
శ్యామకమలినీ కుసుమపల్యంకము దిగి
నూత్నచైతన్యగరిమ మందుటకువోలె
నాయితుఁడనైతిఁ జదువ మంత్రార్థములను ;
భావిఘటనం బెఱుంగని వానిమాద్రి
ముందుపోలేక పోలేక బోవుచుంటి
శ్యామసుందరకంధర శ్రావ్యసరణిఁ
జదువు లన్నింటిపై నిగ్గు జదువుఁ జదువ ;
ఈవిలుంఠితాగమవార్ధు లింకియుండు
నాపరబ్రహ్మబిందుల ననయకున్న
నావిబుధసమాశ్రితసుమనఃప్రతోళి
నెన్నిశిల్పంబు ! లెన్నిసాహిత్యసరణు !
లీ స్వయంకృషి నేరని సృవ్రజంబు
లరయు కృషిశాస్త్రములకు వ్యాఖ్యాత నేను ;
నావచఃకారణమున నున్నారు మీర
లఘుటఘుటనాసమర్థతంత్రార్థమేను ;

తృతీయచ్ఛాయ

కరువలికడంకఁ దార్మారుగాఁగఁ దాల్మి
వడిఁ బ్రతీక్షించి మిన్నులు వడ్డచోట
నేమొ తలపోతుఁ గన్నీరు ప్రామిప్రామి
చికిలి చెక్కుందుటారమ్ము సెమ్మగిల్ల ;
ఇటు లనేకబిందువులె యొక్కటిగ నొక్క
దరినెఱుంగని నిమ్నసాగరము లయ్యె
నిపుడు వార్ధులింకేడు బాహిరలి నన్ను
ముచ్చమునిగించునేమొ యిమ్మోహవేళ ;
తుమ్మెదలు తమ్మిపాట పొత్తమ్ములరసి
యరుణసంధ్యాదినాంతపర్యంతసమయ
ముఱకవల్లించు ననువాకసరణిఁ గాను
శాస్త్రవైదుష్యమనిబడి సంచరింతు ;
ప్రేమ పీయూష సంయోగ పృక్త పాత్రఁ
గొని విలాసప్రపంచంబుఁ దనుపుచుందు
నేను ; మందారసుమకాయమాన విహార
ణప్రియంభావుకమధుప్రియప్రభుండ ;
విస్మయానురాగంబు లూపింపఁ గదలు
నవధి కల్లోలముల నీదులాడుచుందు ;
పులకితామరీ స్వేదబిందులు గుణించు
పనియమును మున్ను మునుకొన్న ప్రాభవంబు ;

తురీయచ్ఛాయ

ఇది భగీరథ ప్రాంజలి కిచ్చగించి
నిజ జటాజూట వేల బంధింప గంగ

శంకరుఁడు ; తద్యశః కరోచ్ఛలితమైన
ప్రకృతి కాన్పించు నొకకాంచపటపరంబు ;
నాధరించిన కవచకుండలము లేను
ద్వాదశార్కబింబాకృతిఁ దాల్చితినను
లాంఛనము లీసురాపగాలంఘనమున
నాదు వీరాంకకీర్తి కానంగఁబడును ;
ప్రళయవహ్ని కీలాభీల వర్తనములు
నన్ను వెన్కొనియె జగన్నాటకమున
నప్పుడప్పుడు ప్రదర్శనీయంబులయ్యె ;
ఇది నడిమిప్రొద్దు విపరీత మీసమయము ;
నావిను నిఘంటులందు దంధనపదంబు
నాచదువుశాస్త్రముల యశోనాశనంబు
నెచ్చటనులేమి నైర్ఘృణ్య మెనయఁబోదు;
పలుకరించెద నొక్క యవ్యాజరేఖ ;
ప్రతిఘటించి యెదుర్కొను పవనములకు
భయదమైన దధీచికోపప్రసక్తి
హృదయనిర్భేది వేళాపరీతబంధ
ముల హరిశ్చంద్ర సత్యనిశ్చలత నేటి
యకలుషధురానిబద్ధమైనట్టి నాల
యాంతమధురరూపంబు వియ్యమునఁ దార్చు ;

పంచమచ్ఛాయ

ఆవయఃకాల సామ్రాజ్యభావిఫలము
సడలి లంబోదరత ప్రశస్తంబుగాఁగఁ
దత్పరిపూర్ణనీతిస్మృతి దరియుచుండు

వలఁగొనఁగల యంతేవాసివారకముల ;
సంసరణవారినిధి మథించఁగ జనించి
నట్టిజ్ఞానామృతము బంచిపెట్టుచుంటి
నాఫలితగర్భశుక్తిముక్తాఫలముల
మలిన మిఱిసెడుగాత ;
వ్యావహారిక పద్మోదరావతార
ములకుఁ బమనోకంషను గూర్పఁబోడమినాడ
నాసచేతనవృత్త మీనాటిదా ? భ
వప్రపీడితదక్షుపన్పటిదికాక ;
నాదు ధర్మావతార పుణ్యమునఁగాదె
ఘోరకలి ఘోరకలి గాకయే రహించు ;

షష్ఠచ్ఛాయ

ఈరసప్రదర్శనమున నెనయులేని
కొఱఁత యింకెందు నేఁ గడల్కొనగవలదె ;
తన్నిమిత్తమ యంగకతతి కృశించె
వయసఱసి నన్నుఁగని హసింపంగవలదు
ఈయమాయికామోదనిభృతకిశోర
పావనాందోళనముల కుబ్బంగఁదలతు ;
మఱియొక ప్రభంజనం బూపుమాద్రిఁదోచు
నోలగంబులఁ దూగుటుయ్యాల లందు ;
ప్రకృతిపురుషుండనై పుట్టి ప్రకృతిఁజెంది
ప్రకృతిసిద్ధవికారసంపదలఁ బొదల
కుంటిఁ ; గాలవాహిని పాఱుచున్నది దరు
లాని ; సైకతద్వీప మెట్లాఁగఁగలదో ?

సప్తమచ్ఛాయ

చరమసాంధ్యరేఖలు దిశాంతరములందు
నాయికానయనారవిందస్రవణము
లనఁగఁ జిప్పిలు నేటివాహ్యాళివేళఁ
నియ్యరిష్టాస్పృశచరిత్ర మిదియనసమయు ;
ఆయనంతాతటంబు మిన్నందుచోటు
నాదృగావరణానఁ గన్పట్టఁదొడఁగ
నటమమాధీశహాసవిస్ఫుటితమయ్యెఁ
గాశ్యపీగోళ మావర్తకములు రేగ
విలయవహ్ని శిఖాళి వీవెనల దూరి
గాడ్పుదేవర రెండురెక్కల మఱంగఁ
ప్రభవమిది ద్వాదశార్కబింబముల కుదధి
విశ్వతోముఖ మయికానిపించె నపుడె ;
నాపునర్జన్మ మింక నేనాటికానో ?

...   ...   ...

ఫలశ్రుతి

ఈ విషాదాంతనటన మీరేడులోక
ముల యుగంబున నొకమాటు వెలయుఁగాక ;
నాయపత్యపారంపర్యనాటకములు
నాబడిఁ బ్రపంచితమ్మాత ; నటనమాత.

ఓఁతత్సత్.

# అమృత ప్రేమ

మునిమాణిక్యం నరసింహారావు—సాహితీసమితి

కటిక చీకట్లఁ గన్నీరు కార్చి కార్చి
సూర్యకాంతి రవంత పైసోకినంత
ప్రణయహృదయకవాటము బారఁదెఱచి
నళిని యేఁటికి పకపకనవ్వుకొనును!

ఘోరనైదాఘతీక్ష్ణతఁ గుమిలి కుమిలి
పొగలు గ్రమ్మెడు నిట్టూరుపులను విడిచి
తొలకరించినయంత నెందులకు పుడమి
కట్టునో యాకుపచ్చని పట్టువలువ!

పగలు పగలెల్లఁ దీరనివగలఁ బొగిలి
కూయనే కూయకున్న చకోరకంబు
పండువెన్నెలవెల్లి చూపట్టి నంత
ఏల యుప్పొంగి బాడుచు నీదులాడు!

ఒంటి నెచటనో యున్న మయూర మేల
యానవాషాఢలక్ష్మి నీలాంబుదంపు
ముసుఁగు కై సేసినంతనే మురిసిపోయి
యవశమై పురి విప్పి నాట్యంబునలుపు?

మబ్బు పట్టిన యంత సంబరముజెంది
యేల చాతకి మినుముట్టి యెగురులాడు!

అటులె స్వర్గీయమైన నీయమృతముగ్ధ
మధుర దరహాస మృదుపరిమళము సోకి

నంతనే పండి పండి ప్రౌఢమైన యట్టి
నాయెద క్షణక్షణోత్సాహానందము.
ఎదియొ తలపోయ నలవికానిది నితాంత
నిరవధిక జీవ గానంబు నిభృతమైన

చిరతరప్రేమ మనజంటకొసగె నీ ప్ర
పంచమును స్వర్గముగ నొనరించుచుండె.

# నాటకాభినయము

నెల్లూరు నాగరాజరావు

నటుడు నిజహృద్గతభావములను, నడకలచేతను, చూపుల వల్లను బ్రకటించుదానిని యభినయమందురు. ఈ యభినయమున కనుకరణము ప్రధానము. జననీజనకులు దమబిడ్డలయెడ జూపు ప్రేమ సూచక కార్యములు అభినయము కానేరవు. అవి లోకసహజములు. అట్లుగాక తల్లిదండ్రుల పాత్రల కొందఱు పిల్లల వేషములు కొందఱు ధరించి ముద్దిడుకొనుట, కౌగలించుకొనుట, మొదలగు ప్రేమసూచక కార్యములుచేయుట యభినయమనబడును. ఈ యభినయము నాల్గువిధములు ఆంగికము, వాచికము. ఆహార్యము, సాత్వికము అని భరతాచార్యులు విభజించియున్నారు. అందు కన్నులు, ముఖము, చేతులు, కాళ్లు మొదలగు వాటిచే మనోభావములను దెల్పుదానిని యాంగికాభినయమందురు. ఒకని బాహ్యేంద్రియ వ్యాపారములను బట్టి యతని మనోగత భావములను తెలుసుకొనవచ్చును. ఒక భావమునే భిన్నవ్యక్తులయెడ గనబఱచుచో భిన్నాభినయముల జూపవలసి యుండును. భార్యపై జూపుప్రేమకును, అక్కచెల్లెండ్రపై జూపు ప్రేమకును, స్వసంతానముపై జూపుప్రేమకును, చాలా తారతమ్యమున్నది. ఒకే రీతిని యీ ప్రేమ ప్రదర్శింప వీలులేదు. మనోవ్యాపార భేదములయందొక్కొక్క విధమున కన్నులు, ముఖము, హస్తములు ఇతరావయవముల సంచలనముచే బ్రకటించుచుండవలెను. దానిని నటులు చక్కగా యోచించి అనుకరించినగాని ప్రేక్షకులకు సంతోషము జనింపదు. ముఖరాగాన్వితాభి

నయమే శ్రేష్ఠమయిన దని చెప్పబడుచున్నది. నేత్రాభినయము ముఖరాగయుక్తమగుచో నెల్ల రసభావముల వ్యక్తబఱుపవచ్చును. ఆంగికాభినయము మూఁడు తెఱంగులు:—౧ ఆంగికము, ప్రత్యంగికము ఉపాంగికములని. తల, చేతులు, ఱొమ్ము, పార్శ్వము, కటి, పాదములు షడంగములు. కన్నులు, కనుబొమలు, ముక్కు, పెదవులు, చెక్కిళ్లు, గడ్డము ఉపాంగములు. భుజములు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు, మణికట్లు ప్రత్యంగములు. మోకాళ్లు మోచేతులు సహా యిందుఁజేరును. ఇం దొక్కొక్కయంగచలన భేదములను నాట్యశాస్త్రకారులు అభినయశాస్త్రమున విస్తారముగ దెల్పియున్నారు. శిరోభేదములు ఆరు విధములు:—(౧) తల మీఁదికెత్తుట (౨) తల క్రిందికి వంచుట (౩) అడ్డముగా రెండుప్రక్కలకు ద్రిప్పుట (౪) క్రిందికి మీఁదికి కదలించుట (౫) చక్రాకారముగ ద్రిప్పుట (౬) ప్రక్కకు ద్రిప్పుట. వీట్ల సాంకర్యమువలన ననేకభావములు బుట్టును. దృష్టిభేదంబులు పదిమూఁడు విధంబులుగ విభజించియున్నారు (౧) మనోహరముగా జూచుట (౨) కొంచెము సంకోచించి చూచుట, (౩) స్ఫుటముగా నేత్రములు విచ్చిచూచుట (౪) కన్నులు మూసుకొనుట, (౫) కడగంటజూచుట (౬) రెండుప్రక్కల ద్రిప్పుట (౭) పైకి నల్లగ్రుడ్డుపోనిచ్చి సగముగా లేక ముక్కాలుగా కన్నులు దెఱచి ఎగువకు మూయుట (౮) కన్నులు దెఱచి యిచ్చుట బుద్ధినుంచక యెక్కడనో యోచించుట, (౯)మీఁదికి నిక్కించి మెల్లగావంపబడిన దృష్టి, (౧౦) నల్లగ్రుడ్డు చక్రాకారముగ ద్రిప్పుట. (౧౧) క్రిందు మీఁదుగ వడిగా త్రిప్పిచూచెడిదృష్టి. (౧౨) క్రిందుగా జూచుట. (౧౩) పైకి చూచుచు నిలిచియుండుట. వీటినెల్ల నటుఁడు గమనించి వచనమునకు తగిన చూపు చూచిన ప్రేక్షకులు ఆపాత్రయొక్క మా

నసిక భావముల శీఘ్రముగా గ్రహింపగలుగుదురు. భ్రూభేదములు అయిదు విధంబులు:—(౧) కనుబొమ్మలను మీదికి నిక్కించుట. (౨) రెండుకనుబొమ్మలను క్రిందికి వంచుట (౩) రెండు కనుబొమలను యెడముగా జేయుట (౪) కనుబొమలు ముడివేయుట. (౫) రహస్యము వినునప్పుడు కనుబొమ్మను వికృతి జేయుట మొదలగునవి. నటుడు చక్కగా సాధన చేసినగాని యెప్పటికప్పుడు మార్పజాలడు.

నాసాచలన భేదంబులు రెండు విధంబులు (౧) సంతోష కాలమున ముక్కుపుటము లుబ్బించుట (౨) కోపానసహ్యాది సమయములందు ముక్కు సంకోచింప జేయుట.

అధరోష్ఠచలన భేదంబులు ముత్తెరగులు: (౧) కోపాదిసమయంబుల పెదవి వణకించుట, (౨) మూతి ముడుచుకొనుట. (౩) హాస్యాద్భుత సమయంబుల విప్పుట. మరల నవ్వు అయిదువిధంబులు (౧) చిఱునగవు (౨) సహజమయిన నవ్వు (౩) ఒడలు తెలియని నవ్వు (౪) పరిహాస యోగ్య మయిన నవ్వు, (౫) తొలుత నవ్వు గలిగిన దానికి కారణ మూహించుకొని మాటిమాటికి నవ్వుట.—ఇట్లే యనేక విధములైన సాధనలు, నటుడు సందర్భానుసారముగ తన పాత్రమున కెంతవఱ కుపయోగించునో తెలుసుకొని రంగస్థలమున ప్రదర్శింపవలెను. నియమముల ననుసరించుచు తనలోకజ్ఞానమును అనుకరణ శక్తిని, ఉపయోగించి యభినయించినయెడల ప్రేక్షక హృదయరంజిక మగును.

మాటలచే తెలుపునది వాచికాభినయము. ఈ వాచికమువల్లనే భావములు వెల్లడియగును. ధ్వని కాకుస్వరము విరామాది మార్పులచే వాక్యముల పెక్కుఅర్థములువచ్చునట్లు చేయవచ్చును. కాబట్టి పాత్రోచితభాష యుండవలెనని తెల్పియున్నారు.

ఇట్లని యాంధ్ర నాటక మాడుచు హూణ, మహమ్మదీయ పాత్రము లకు వారి స్వభాషనే వాడి చూపరాదు. ప్రేక్షకులకు నిన్నిభాషలు తెలియక పోవచ్చును. వారిగతి యేమి? ఆడునది తెనుగునాటకము. పాడునది హిందుస్తాని పాటలు. వచనము మధ్య మధ్య హిందీ. మరల వెంటనే తెనుగు పద్యములు పాడుట. ఇట్లుచేసిన పాత్రౌచిత్యాభినయమగునా! యోచింపుడు!

సాత్వికాభినయము ఎనిమిది విధంబులు. (౧) ఏమియు దోచకుండుట. (౨) అతిమోహముచే నగు మూర్ఛ. (౩) కన్నీళ్లు (౪) చెమట (౫) గద్గదవాక్య ముచ్చరించుట (౬) పులకాంకురము (౭) వణకుట (౮) వెలవెలబోవుట మొదలగునవి. మరల వీటిలో సంచారీభావములు ముప్పదిమూడున్నవి. ఈ భావములన్నియు నన్నిరసములందు గలవు. పరుల సుఖదుఃఖములను తనవిగా నెంచినగాని యీసాత్వికభావములు కలుగవు. నటుడు తానభినయించు భావమును తాను స్వయముగా అనుభవమునకు తెచ్చుకొనవలెను. అనుకరించవలెను. అనుకరణశక్తిలేనివాడు నటుడు కాజాలడు. నటులెల్లరు నన్నిరకముల రసముల ననుకరింపజాలరు. కొందఱికి కొన్నిరసములు అభిమానములై యుండు. మరి కొందఱకు మరికొన్నిరసములు ప్రీతిపాత్రములుగ నుండును. కాబట్టి యెవరెవ రేరసముల ననుకరింప గలరో వారికట్టి భూమికలనే నొసంగుచుండవలెను. లేకున్న వికటించును. నిక్కమయిన యభినయము నేర్చుకొన నెంచిన యెడల లోకములోని జనుల యాచార వ్యవహారముల యాచరణమును చక్కగ పరిశీలించి, వాని ననుకరింపవలెను. నాటకాభినయమునకు శాస్త్రముకంటెను లోకానుభవజ్ఞానమే తోడ్పడును. కేవలము నియమములనే యనుసరించుచు నటు డభినయించుచో ప్రేక్షక హృదయమునకు

ఆనందముకలుగదు. అభినయ సంప్రదాయముల దెల్పిన పిమ్మట భరతాచార్యులవారు నాట్యశాస్త్రమందు ౨౫ వ అధ్యాయాంత ములో చిత్రాభినయాధ్యాయమం దిట్లు లిఖించియున్నారు.

శ్లో॥ యాని శాస్త్రాణి యే ధర్మాయాని శిల్పానియాః క్రియాః
లోకధర్మ ప్రవృత్తాని నాట్యమి త్తభిసంజ్ఞితం
నచశక్యంహి లోకస్య స్థావరస్య చరస్యచ
శాస్త్రేణనియమం కర్తుం నానాచేష్టావిధింప్రతి
నానాశీలాః ప్రకృతయః శీలేనాట్యం ప్రతిష్ఠితం
తస్మాల్లోకప్రమాణం హి జ్ఞేయం నాట్యం ప్రయోక్తృభిః॥

కావున నాట్యమునకు లోకమే ప్రబలప్రమాణమని తెలియవలెను.

# ప్రేమ గీతాలు

గిరికుమార

౧౦౧

నేను మాయమ్మ యొడిలోన నింతవాడ
నైన యపుడ నాలోన నీయఖిల మిమిడి
యుండఁ గావలె, నేటికి న్గుబికివచ్చి
చిత్రచిత్ర భావాకృతుల్ చెలువుమిగులు
పాడుటకు మున్ను కంఠగర్భమున నెలుఁగ
రాక యవ్యక్తమైయున్న రాగమువలె
నిభృతచిక్కణమూర్తులు నీవు, నిసువు
లిన్నిసుఖములు దాగినా రెటుల దేవి!
అస్మదీయ హృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగా నుండి విశ్వమింత
యిది బహిర్గతమయ్యె నా యెఱుక లేక
అంతయవ్యక్తశిశుమూర్తినైతి నెట్లొ?

౧౦౨

ఇవి యథాకంఠనిర్గత మ్మివి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి! నీయ
పాంగరేఖాచలస్మందహాసవాహి
నీతరంగాల నాడుగుండియ చలించి.
ఈ విశాలకృష్ణాతటి నీవిలాస
మృదుశబలశారదాంబుసంపదల కదలు

లాడు జమిలి నావలకు సామ్యము కుదుర్తు
నీప్రశాంతాస్యదుభయమూర్తిప్రథలకు.
ఇది విచిత్రమ్ము నాకు నాకే మదీయ
హృదయమున నన్నునేఁ బ్రతిష్ఠించుకొనుచు
స్నిగ్ధదేవతామూర్తిని నేన పూజ
చేసికొందు నన్ను వరలక్ష్మిదయితుని.

౧౦౩

ఇది యొకశతమ్ముతో నాగునేకద యని
నలుగడలఁ గోటఁగాఁగట్టినాను గాని
జలజల స్రవించు నీసెలజాలునకును
నేనకే యధికారిని నీవుగాక
ఇంత పొంగాపలేను నూవే! యివే! ప్ర
పంచమర్యాద లెఱుగని భావములివి
నాయెద జనించు నాగుండెలోయలోకి
నన్నదుము తాక్యమైనయాంధ్యమ్ముక్రమ్మి
బయట నందఱుఁ జీకటుల్ ప్రచ్చెనంద్రు
ననుఁ బరిహాసములుచేసి నవ్వుకొంద్రు
కాని నాయెదలోపలఁ గదలి మినుకు
మినుకు మనుచున్న జ్యోతిస్సు కనెదరోటు ;

౧౦౪

ఈ యనంతప్రయాణమ్ము నేగుచుంటి
నా! ప్రతిమలుపునందు నీవైయిదె కను
మింతదూరమ్ము వచ్చినా వీపటుంచు
జ్ఞాపకము నాకు చేయుచున్నావు దేవి!

ప్రతిమలుపునందునుం జానపదులబాల
వలె నసంస్కృతములు రాగివైన కేశ
ములును నివ్వెఱపోవు దృక్కులును ధూళి
పిహిత దేహంబుతోడఁ గన్పించుచుంటివి.
కనులఁబొడిచితి వీయనాగరకజాన
పదకుమారికామూర్తివి ప్రథమమందు
నేను నివ్వెఱపోతి నూహించుకొలఁది
నాకనుగొలంకు నిండుచున్నది జలాన.

# కథలెల్లా వ్రాస్తాను?

నోరి నరసింహశాస్త్రి: సాహితీసమితి

౧

మేము చిన్నవాళ్లంగా ఉన్నప్పుడు ఒకసంవత్సరం, ఈరోజుల్లోనే, నేనూ మా బావమరదీ మా పెత్తల్లిగారింట్లో ఉండడము తటస్థించింది. ఒకనాడు ఉదయం మేము చద్దన్నాలు తింటూ ఉండగా రాజమ్మ-మా పెత్తల్లి అత్తగారు-"హ్హా హ్హా హ్హా హ్హా హ్హా" అంటూ అక్కడికి వచ్చింది. మా మామ్మ అప్పుడే దూడను విడవడానికి పశువుల కొట్టం లోకి పోయి ఉన్నది. ఎప్పుడూ నవ్వి ఎరగని రాజమ్మ అప్పుడు నవ్వడానికి ఏదో ప్రబలకారణం ఉండకపోతుందా అని మే మిద్దరమూకూడా పకపకా నవ్వసాగినాము. కాని కాస్తసేపు ఆవిడ "హ్హా హ్హా హ్హా" విన్నమీదట అది ఏడుపే గాని నవ్వు కాదని మాకు తెలిసింది. ఆమె చేతులారా పెట్టుకున్న తోటకూర మడి ముదరష్టపు ఆవు ఎక్కడిదో వచ్చి మేసినంత మేసి తక్కినది నలగదొక్కి పోయిందట. అక్కడ ఎవరన్నా పెద్దవాళ్లుంటారేమో చెప్పిపోదామిని ఏడుచుకుంటూ వచ్చింది. కాని మేము తప్ప మరెవ్వరూ అక్కడ లేకపోవడంవల్ల మేము చిన్నవాళ్లమైనా మాతో చెప్పుకున్నది.

ఆమె నవ్వడం లేదని తెలియగానే మేము తెల్లబోయినాము. మానవ్వూ బిగిసిపోయింది. మాకా రాజమ్మను చూస్తేనే అసలు భయము!—ఎప్పుడూ నవ్వని వాళ్లను చూస్తే ఎవరికి భయం వేయదు! అందులో మే మప్పుడు చిన్నవాళ్లమాయెను!—మా బావమరది నాకంటె కూడా చిన్నవాడు కావడం చేత వణికి పోయినాడు నేనుమాత్రము కాస్త తెప్పిరిల్లుకొని "అయ్యో! పాడుఆవు! ఎవరిదేమిటి అది! బందిలి దొడ్డిలో పెట్టిద్దామా?" అని, ఈ విధంగా మాట్లాడి ఓదార్చినాను. అన్నం తింటున్న వాణ్ణి కంచందగ్గరనుంచి లేచేదా అనికూడా అడిగినాను. కాని అటువంటి వీరకార్యము అవసరం లేకపోయింది. ఆ ఆవు పారిపోయి అప్పటికే చాలా సేపయింది.

మే మారోజు లేచినవేళ మంచిది! ఆమె ఏడుపులో మేము మొదట నవ్వడం ఆమె కంట బడలేదు. నేను ఓదార్పు ప్రారంభించేదాకా అసలావిడఒళ్లే ఆవిడకు తెలియలేదు. ఆరోజు మధ్యాహ్నం మా మామ్మను "ఏమమ్మా, తోటకూర మడి,

ఆవు తొక్కిపోతే నవ్వుతున్న దనుకొని నవ్వినాను. ఇట్లా ఏడ్చేదేం?" అని అడిగ నాను. "సరే మంచివాడవే గాని మీరు నవ్వడం ఆవిడ చూసిందా, [illegible]! మా మామగారు పోయినప్పుడు కూడా ఆవిడ ఇంత ఏడవ లేదు!" అన్నది మా మామ్మ.

రాజమ్మ ఏడుపు విని నవ్వని మేము భ్రమపడడము నాకు మరుపు రాలేదు, తర్వాత ఎన్నాళ్లదాకానో ప్రతివాళ్లతో ఈ సంగతే మాట్లాడుతూ ఆవిడచేత తిట్లు పడడము కాస్తలో ఎట్లా తప్పించుకున్నామో చెప్పి పొట్ట పగల నవ్వుతూ ఉండే వాణ్ణి. కాని నా ఏడుపుకూడా రాజమ్మ ఏడుపు గతే పట్టబోతున్నదని అప్పుడు నా కేమాత్రము తెలిసి ఉన్నా అట్లా ఆగడంగా కనపడ్డ మనిషితో నల్లా చెప్పి ఉండే వాణ్ణి కాదు. పాపము! ఆవిడ ముసలిది. భారీమనిషి. కండలు జారిన దవడలలోనుంచి ఏడుపు రావలెనంటే "హ్హా హ్హా హ్హా" అనికాని వచ్చింది కాదు. చిన్నతనం [illegible] మొదట నవ్వు అనుకున్నాను.

నాకు దవడ లేమీ జారలేదు. కాని పెద్దలూ చిన్నలూకూడా నేను ఏడ్చినా నవ్వినా నవ్వే అనుకుంటారు. నాకన్నమే నాస్నేహితులలో కొందరికి కూడా పట్టింది. "హాస్యగాడికి తేలుకుట్టినట్లు" అనే సామెత మనలో ఉన్నది. మేము హాస్యగాళ్లము కాకపోయినా మాకు హాస్యగాళ్ల గతే పట్టింది. ఒకవేళ మేము హాస్యగాళ్లమే అనుకున్నా షేక్స్పియరు నాటకాలల్లో వచ్చే హాస్యగాళ్లవంటివాళ్లము గాని [illegible] నాటకాలల్లో వచ్చే హాస్యగాళ్లము కాము.

౨

హాస్యగాడికి తేలుకుట్టడమంటే జ్ఞాపకం వచ్చింది! సామెతలో హాస్యగాడికే గాదు; మాకుకూడా తేళ్లు మండ్రగబ్బలు పాములూ అనుభవమున్నది.

మా స్నేహితుడొకాయన ఉప్పలూరులో ఓవరుసీయరుగా ఉంటున్న రోజుల్లో ఇంకొక స్నేహితుడు ఆయనను చూచిపోదామని వెళ్లినాడు. వాళ్లిద్దరూ సాయంత్రము షికారు వెళ్లి వస్తూ ఉంటే ఆరవీసుకాలవ ఒడ్డున ఓవరుసీయరు పాదము నీటిపాము పీకింది స్నేహితుణ్ణి తేలు కుట్టింది. ఆ బాధతోనే వాళ్లింటికి వచ్చి మందులు వేసుకుంటూ ఉంటే ఏదో గాయమయిందనీ ముల్లుగుచ్చుకున్నదనీ ఇంట్లో అనుకున్నారే గాని నిజము చెప్పితేకూడా నమ్మలేదు. పైగా "మమ్మల్ని ఆట పట్టిస్తారా? మేం మంతిపిచ్చివాళ్ల మనుకున్నారేం? పాము కరిస్తేనూ తేలు కుడితేనూ ఇంత నిశ్చలంగా ఉంటారా?" అన్నారు. తందనా లాడితే తప్ప పాము కరిచినట్లూ తేలు కుట్టినట్లూ కాదు కాబోలు!

# కథ లెల్లా వ్రాస్తాను

చిన్నప్పటినుంచీ నాకు ఎప్పుడూ తేలు కుట్టలేదు. నా గదిలోకి రాత్రిళ్లు ఏన్నో సార్లు దీపం లేకుండాకూడా పుస్తకం కోసమో ఉస్త్రీకిగానికో పట్టుబట్ట పెట్టిరావడానికో వెళ్లుతాను గాని ఒక్కసారికూడా నన్ను తేలుకుట్టలేదు. కాని మరెవరైనా చీకట్లో నా గదిలో అడుగు పెట్టినారా, వాళ్లకు తేలు కుట్టిందన్నమాటే. నాకూ ఇది విచిత్రంగానే ఉండేది. ‘‘మీ కందరికే తేళ్లు కుట్టించుకునే శక్తి ఏదో ఉన్నట్టున్నది’’ అంటాను నేను. ‘‘నీ గదిలో ఇతరులను అడుగుపెట్టనీయకుండా తేళ్లను కాపలా పెడతావా ఏమి?’’ అంటారు వాళ్లు.

నన్ను తేలు కుట్టదనే అతిశయము చివరకు ఒకనాటి రాత్రితో అణిగింది. ‘‘ఎంత పైకెక్కితివో అంత పడతావు!’’ అని మహాకవి అన్నాడు. పాతికేళ్లదాకా తేలు ఒక్కటీ కుట్టకపోతే ఇక అప్పుడు తేలు పని చేయదేమో నని మండ్రగబ్బ వచ్చింది.

మా బావమరిది వివాహానికి బ్రాహ్మణ కోడూరు వెళ్లినాను. సదస్యంనాడు సాయంత్రం ఒంట్లో ఉత్సాహంగా లేక ఊరేగింపు వెంట వెళ్లక విడిదిలోనే దిగబడ్డాను. కాని ఇంతలోనే స్నేహితు డొకాయన ఊరినుంచి దిగినాడు. అతను కాళ్లు కడుక్కున్న తర్వాత పెళ్లికొడుకును చూసి వత్తాము రమ్మన్నాడు. స్నేహితుడు రావడం వల ఉత్సాహం వచ్చి లేచినాను. ఊరేగింపు ఎదురు కుందా మని దగ్గర వీధిని వెళ్లినాము. ఊరేగింపు దగ్గిరికి వచ్చినాము. లైట్లు మాకు కనబడుతున్నవి గాని వాటి వెల్తురు మాకు ఉపయోగించడం లేదు. నా కాళ్లకు చెప్పులు ఉండనే వున్నవి. ‘‘అబ్బా! తేలుకుట్టింది’’ అని కేక వేసినాను. పక్క ఇంట్లో ఒకరు హరికేను లాంతరు వెలిగించి తెచ్చినారు. చూడగా అక్కడనే మండ్రగబ్బ, ఒకటి నడయాడు తున్నది. నా స్నేహితుడు సన్నటి చేతిబెత్తంతోనూ నేను చెప్పుతోనూ కొట్టి దాన్ని సంహారము చేసినాము. పక్కన నే నొక అరుగుమీద కూలబడేప్పటికల్లా అక్కడికి పెళ్లివారు వచ్చినారు. మండ్రగబ్బ కుట్టిందని బంధువులంతా నాచుట్టూ మూగినారు ఐతే మండ్రగబ్బ కుట్టిందని పేరే గాని నేను ఏడవడంలేదు, గంతులు వేయడంలేదు. ‘‘ఊరకే గిట్టలతో పట్టి వుంటుంది’’ అన్నారు అంతా. ‘‘కుట్టనూ కుట్టిం’’ దని చెప్పి పెళ్లికొడుకు తెప్పించి సిద్ధంగా ఉంచిన పొటాషియము పర్మాంగినేటూ టార్టారిక్ ఆసిడూ వేసినాను. వెంటనే కాస్త బాధ తగ్గింది, కాని ఇంకా చాలా బాధ ఉన్నది. నన్నేదో మహావస్థలో ఉంటే ఓదార్చి పోదామనే ఆత్రంతో వచ్చిన వాళ్లు నేను నిశ్చలంగా ఉండడము చూసి నిరుత్సాహపడి ముఖాలు చిన్న బుచ్చు

కున్నారు. పాపము, వాళ్లను సంతోష పెట్టడము కోస మన్నా కళ్ల నీళ్లు పెట్టి రాగా లు తీతా మనుకున్నాను గాని చివరకు ఊరుకున్నాను. వాళ్లిక లాభం లేదని తెలిసి "ఊఁ! మంద్రగబ్బ కుడితే అట్లా ఉంటూడా! దానికి గిట్టలలో కూడా కొంచెము విషముంటుంది'' అన్నారు.

తర్వాత ఎంత సేపటిదాకానో మనుష్యులు వచ్చి పోతూనే ఉన్నారు. కాని అందరికీ ఉత్సాహ భంగమే. మొత్తాన నాకు పాదము మీద యూదుచోట్ల బాధగా ఉన్నది. అందులో మధ్యను బాధ తీవ్రము. వాగం పదిగోజుల దాకా పాదము జెణికి నట్లుండి బాధ పెట్టింది. బాగా రెండు గిట్టలతోనూ పట్టుకొని కసితీర కొండితో అంట పొడిచి ఉంటుంది. కాని ఏమి లాభము, ఎవ్వరూ నమ్మలేదుగా! "మమ్మన్ని అంతా తేలు కుట్టించుకునే తెలివి తేటలు గలవాళ్ల మని ఎక్కిరించే వాడివే, నీకు ఇవ్వాళిటితో పరాభవ మయిందా?'' అన్నారు మావాళ్లు. "ఐనా నా గదిలో కుడితేగా నాకు పరాభవము! నేను పుట్టిన ఊళ్లోకూడా పుట్టలేదు. అసలు నన్నుకుట్టింది తేలు గాదు, మంద్రగబ్బ'' అన్నాను. నా వాదను ఎట్లాఉన్నా పరాభవము స్పష్టమే.

3

కాబట్టి నేను ఏడ్చినా నవ్వినా ననుకుంటూరని చెప్పినాను. కొంతిమంది నవ్వినా ఏడ్చి నట్లుగా ఉంటుంది. కాని వాళ్ల అదృష్టం నాకు లేదు! ఈమాట వింటే అంతా నవ్వుతారు కాని ఏడుపుకు జనాదరణ ఎంత కావలెనో తెలిసినవాళ్లు నవ్వరు. నవ్వి నప్పుడు పక్కనున్న వాళ్లు నవ్వినా నవ్వక పోయినా నవ్వినవాళ్లకు నవ్వు సంతోషమే కలిగిస్తుంది. నవ్వుతున్న వాడి పక్కనున్న వాడు ఏడుస్తున్నా నవ్వే వాడికి కోపం రాదు. కాని ఏడుపుతత్వ మది కాదు. నలుగురిలో ఏడుపు మనస్సుకు సంతృప్తి కలిగించవలెనంటే పక్కనున్న వాళ్లు అంతా ఏడవ వలె. ఏడుస్తున్న వాడి పక్క నుండి ఎవరన్నా నవ్వితా ఏడ్చేవాడికి ఎక్కడిలేని కోపం వస్తుంది. "నేను ఏడుస్తుంటే నీకు నవ్వుగా ఉందేం నాయనా!'' అంటూరు. మన పూర్వులకు ఏడుపు తత్వం బాగా తెలుసును. అందువల్లనే మనదేశంలో ఎవరన్నా మరణిస్తే వాళ్లముఖ్యులవద్దకు ఆప్తులేగాక ఎక్కడెక్కడి వాళ్లూ కూడా వచ్చి కన్నీళ్లు పెట్టుకొని ఏడ్చిపోతారు. ఇటువంటి ఏర్పాటు మనలో ఉండబట్టే, చనిపోయిన భర్త కోసం వీధి ఎగిరి పోయేట్లు రాగాలు పెట్టడము భార్యకు మహాభోగంగా ఉంటుంది.

కాబట్టి మా ఏడుపును ఇతరులు నవ్వనుకుంటే చెప్పలేని బాధగా ఉంటుందని చెపుతున్నాను. కొన్నాళ్లు నాకిదే ఆలోచన పట్టింది. ఎందువల్ల ? చివరకు నావద్దనే ఏదో లోపమున్నదని తోచింది. ఆ బాధ నాకు కలిగినప్పుడు ఒంటరిగా ఉంటే చిరునవ్వు నవ్వుకుంటాను. నలుగురిలో ఉంటే ఫక్కుమని నవ్వువస్తుంది. అది ఒక్కొక్కరి స్వభావం తీరు !

కాని ఒకటి అంటే ఇతరులు ఇంకొకటి అనుకోవడము మాకు దినదినానుభవమే !

ఒకసారి సాయంత్రం వెన్నెట్లో బయలుదేరి కాలినడకను ఒక స్నేహితునితో కలిసి పదిమైళ్లదూరంలో ఉన్న పల్లెటూరికి పోదామని బుద్ధి పుట్టి ఇంట్లో వంట త్వరగా చేయమన్నాము. మేము భోంచేస్తూ ఉన్నప్పుడు మావాళ్లు "ఏఊరు వెళ్లుతారు ?" అనిఅడిగినారు "ముట్లూరు" అని మేము నిజమే చెప్పినాము. "కాదు లెద్దురూ, నిజం చెప్పండి. ఆరుగంటలగైలుకు తెనాలికాదూ పోవడము ?" అన్నారు మావాళ్లు. మే మిద్దరమూ ఎంత చెప్పినా వాళ్లు నమ్మలేదు. "అందులో దుబారాఖోరులైన మీ ఇద్దరూ ముట్లూరు నడచివెళ్లుతున్నారంటేనా మేము నమ్మేది ?" అన్నారు,

పట్నంలో చదువుకుంటూ మాంబళంలో ఉంటున్న రోజులలో ఒకసారి పొద్దున క్రాపు చేయించుకుందామని పట్నం వెళ్లుతూ స్నానానికి తువాలాలు వెంట తీసుకొని వెళ్లినాను. మళ్లీ సాయంత్రం దాకా ఇంటికి రానని కూడా చెప్పినాను. కాని మా వాళ్లకు నేను సముద్ర స్నానానికి వెళ్లినా ననే నిశ్చయము. సముద్రస్నానానికని వెళ్లినవాళ్లు సాయంత్రందాకా రాకపోతే ఏమని దిగులు పడుతారో అట్లా మా వాళ్లు దిగులు పడ్డారు. కాని చివరకు నేను షోకుగా క్రాపుకత్తిరించుకొని పట్నమంతా తిరిగి సినీమాకు వెళ్లి ఇంటికి వచ్చేటప్పటికి, ఏమున్నదీ ?

నాకొక వైష్ణవ స్నేహితు డున్నాడు. ఆయన శుద్ధ శ్రోత్రియుడు. వైష్ణవ మతాచార్యులైన శ్రీరామానుజుల వారే అనాచారమంతా నిశ్శేషంగా ఆచరించి ఉన్నారు. కాబట్టి వారి మతస్థులైన వారికి సాంప్రదాయమే మిగిలింది. అందువల్లనే వైష్ణవుల కంత ఆచారము ! వాళ్ల ఆచారము 'ఆచారి' అని పేరులోనే ఉంటుంది. మా ఆచార్లుగారు కూడా అంతే, అందువల్ల వారు దేవతార్చనాది విధులలోనే కాకుండా సామాన్య లౌకిక విషయాలలోకూడా ఆచార బద్ధులై ఉంటారు. నేను ఎక్కువ మనశ్శాంతితో ఉన్నప్పుడు ఎక్కువ మాట్లాడకుండా ఉంటే "మీరివ్వాళ కులాసాగా లేరేం ?" అని అడుగు తారు, "ఇవ్వాళ నామనస్సు మహా శాంతముగా ఉన్నది" అంటాను. "కాదు లెండి నాకు తెలియదా !" అంటారు ఆచార్లుగారు.

"ఐతే ఎట్లా ఉంటే నాకు ఉల్లాస మున్నట్లు ?" అంటాను. "మీరు కులాసాగా ఉంటే అల్లరి చేస్తూ తాగినవాడివల్లే మాట్లాడుతారు కాదా ?" అంటారు. కాని పాప మా ఆచార్యుల గారికి ఏం తెలుసు ? నా మనస్సు ఎందువల్లనైనా అశాంతిగా ఉన్నప్పుడే గాని అల్లరిగా వాగుతూ ఉండనని అయినను చెపితే మాత్రము విశ్వసిస్తాడా ?

౪

లోకంలో ఎవరికైనా ఏదో కారణం చేత ఎప్పుడైనా మనస్సు కలత పడుతూ ఉండక పోదు. కాని నేను సామాన్యంగా మాత్రము బయటికి కులాసాగా కనపడతాను. ఐనప్పటికీ ఒక్కొక్కసారి అకస్మాత్తుగా అకారణంగా ఆ వేదన వస్తుంది. ఉన్నవాణ్ణి ఉన్నట్లు ఉండగానే అది అట్టే వచ్చి కడుపులో చెయ్యిపెట్టి కలిచివేస్తుంది. వైద్యులు దాన్ని జబ్బు అంటారు. కాని "నయమయ్యేదాకా డబ్బు దమ్మిడీ ఇయ్యను. మందు ప్రారంభించు" మంటే వాళ్లు అందుకు ఒప్పుకోరు. ఇక, మానసిక శాస్త్రంతో ధర్మశాస్త్రం జోడించి చదువుతున్న లాయర్లు "బహుశః, నీ వేదో గొప్ప పాపము రహస్యముగా చేసి ఉండవలె!" అంటారు. పూర్వజన్మలో ఏ నేరమున్నా చేసినానేమో చెప్పలేను గాని, వాళ్ల ధర్మాన, ఈ జన్మలో మాత్ర మేమీ చేయలేదు.

ఆ బాధ ఎప్పుడు వస్తుందో ఎందుకు వస్తుందో చెప్పలేను. అది వస్తే ఒక్కొక్కప్పుడు బోర్లబొక్కలా పడుకొని చేతులుచాపి అచేతన పదార్థంవల్లే నిశ్శబ్దంగా నిశ్చలంగా ఉంటాను. ఒక్కొక్కసారి వెల్లికిలా పడుకొని "ఉః!" అని బిగ్గరగా మూలుగుతాను. మరణవేదన పడుతున్నవాళ్ల మూలుగు రాత్రిపూట లోకము నుంటు మణిగి ఉన్నప్పుడు వినబడితే ఎంత భయంకరంగా ఉంటుందో, అది అట్లా ఉంటుంది. అప్పుడు ఇతరులు నాపక్కన ఉండలేరు. ఉన్నారా, వాళ్లకూ ఆ బాధ అంటువ్యాధివల్లె ప్రసరించిందన్నమాటే !

ఎక్కువ ఉల్లాసంగా ఉండని ఒకానొక కొత్తస్నేహితుడు నేను బయట అత్యుత్సాహంగా మాట్లాడడము విని అటువంటి నాతో కలిసి కొన్నాళ్లుంటే తనకు కూడా ఉల్లాసం వస్తుందనే ఆశతో నాగదిలో వచ్చి ఉంటానన్నాడు. నేనూ స్నేహితుడు గదా అని అందుకంగీకరించినాను. మేమిద్దరమూ కలిసి ఆగదిలో ఉండడం మొదలుపెట్టి పదిహేను రోజులు గడిచేలోపల ఆ ఆవేదన తెర నాకు మూడుసార్లు వచ్చింది. మూడవ సారితో నా స్నేహితుడు బెదిరి నాగది విడిచి పారిపోయి నెలరోజుల దాకా నాకు ముఖం మళ్లీ కనపరచలేదు.

# కథ ఎల్లా వ్రాస్తాను

౫

ఈ ఆవేదన సామాన్యంగా ఇన్నిరోజుల కొకసారి అనివస్తుంది. వారంరోజుల కొకసారి రావడం మామూలు. కాని ఒక్కొక్కసారి హెచ్చు తగ్గుగా రావడం కూడా కద్దు. ఎంత ఆలస్యమైతే అంత దుర్భరంగా ఉంటుంది.

పట్నంలో హోటల్లో భోంచేస్తూ నేను చదువుకుంటున్న రోజుల్లో ఒకసారి అది రెండు నెలలపాటు రాకుండా ఉండి ఒక్కరోజున పొద్దున్నే నిద్ర లేవంగానే అట్టైవచ్చింది. వరసను అన్నాళ్లు బిగవేయడము ఎన్నడూ లేదు. ఇక అన్నాళ్లకు రాక రాక వచ్చినప్పుడు. నాకు కలిగిన బాధ వేరే చెప్పడమెందుకు! తొమ్మిది గంటలైతే కాలేజి వేళ అవుతున్నా అది వదలడంలేదు. అప్పుడిక అదివదలక పోతే మనమున్నాదాన్ని వదిలించుకోక పోతే మర్యాదకాదని బలవంతాన లేచి ముఖప్రక్షాళనముచేసుకొని స్నానం చేసి తల జాగ్రత్తగాదువ్వి తిలకం తీర్చి కోటూఅదీ వేసుకొని ఉల్లాసంగా ఉండవలెనని ప్రయత్నిస్తూ హోటలుకు వెళ్లినాను.

నాపక్కనే ఎరిగినాయన ఒకాయన భోంచేస్తున్నాడు. ఆయన తాను తెలివిగలవాడైనట్లు ప్రదర్శించుకోవలెనని సంభాషించే వేళలలో ప్రయత్నిస్తూ ఉంటాడు. ఆయన ఆరోజున తల ఎత్తి నావైపు తిరిగి "ఏమండీ, కవులు విచారగ్రస్తులై ఉంటారంటారు. కాని మీరెప్పుడు చూసినా నవ్వుతూ కులాసాగా ఉంటారు" అన్నాడు.

"అట్లాగా! ఇవ్వాళ ఎట్లాఉన్నాను?" అని చిరునవ్వుకూడా నవ్వకుండా నిశ్చలంగా అన్నాను.

"ఇవ్వాళా మామూలువల్లే కులాసాగా ఉన్నారు" అన్నాడు.

ఇక నాకు చిరునవ్వు రాకతప్పిందికాదు. కలవరిస్తున్న చిరునవ్వొకటి ముఖాన తాండవిస్తూ ఉండగా "అట్లాగా! ఐతే పోనీ నేను కవిని కానులెండి!" అన్నాను.

"ఎబ్బే అందుకోసం కాదండీ! మీరు 'లాఫింగ్ ఫిలాసఫరు' వంటి వారండీ" అన్నాడు.

ఇటువంటిమాటలు మాట్లాడ దానికి ఈ తెలివిగలవానికి సరిగ్గా ఈరోజే దొరకవలెనా, రోజూ హోటల్లో ఒకరికొకరము కానవము ప్రత్యక్షమయ్యేవాళ్లమేగా! నాకు విభ్రాంతికలిగింది. ఇంత చెప్పలేని బాధపడుతున్న ఈరోజే ఇతగాడికి కులాసాగా కనపడుతుంటే-ఇంకా ఏముంది? అంతట ఊరుకోక నేను ఫక్కుమని నవ్వి "అయితే నిజంగా ఒక్కవిషయము చెపితే నమ్ముతారూ? ఇవ్వాళ నేను పడుతున్న యాతన ఈసంవత్సరంలో మరెప్పుడూ అనుభవించలేదు" అన్నాను.

అంతటితోనైనా ఆయన ముఖాన విశ్వాససూచనలు కనిపించలేదు. ఒక చెంపన నేను నవ్వుతూ యాతన అనుభవిస్తున్నానంటే పాపమా బ్రాహ్మడు ఎట్లా నమ్ముతాడు! అందులో ఆయన తెలివిగలవాడాయెను! తెలివి తక్కువ ఘటమైతేగా! చివరకు నాకు విసుగుపుట్టి "మనకు చింతగా ఉన్నదిగదా! అని అది ముఖాన ధరించి లోకానికంతా చాటిస్తూ పోవలెనా ఏమిటి!" అన్నాను.

ఇది తలుచుకున్నప్పుడల్లా నా కొకానొక స్నేహితుడు జ్ఞాపకం వస్తాడు, అతనెప్పుడూ గంభీరంగా ఉంటాడు. దుఃఖము వస్తే స్త్రీలవల్లే అది బయటికి కనపరుస్తామా అని అతని అహంభావము! కాని ఎవరికైనా దుఃఖాలు రాక ఊరుకోవు. దుఃఖము ఏదోవిధంగా ప్రకటనగాక తప్పదు. అతను దాన్ని లోకాచారము ప్రకారము గాక దాచిపెట్టవలెనని ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో అతిగా పోయి నవ్వుతాడు కూడాను, రెండుసార్లు నేనిది స్వయముగా చూసినాను.

అతనికి చాలా కాలానికి కుమార్తె పుట్టింది. ఆపిల్లను ప్రాణంగా పెంచుకుంటున్నాడు. సంవత్సరం దాటకముందే పెద్దదైనట్లుగా భావించి ఈవిధంగా చదువు చెప్పిస్తాను. ఈవిధంగా పెంచుతాను. ఈవిధమైన భర్తను వెదుకుతాను. అని ఆపిల్ల సంగతే మాట్లాడుతూ ఉండేవాడు. పాప మా పిల్ల సంవత్సరం దాటక ముందే ఈ లోకము దాటింది. ఈవార్త విన్నతర్వాత ఆతన్ని చూసి రావడానికి నాకు మనస్సొప్పలేదు. చివర కొకనాడు ఓదారుద్దాముగదా అని జంకుతూ విచారము సూచించే మూరెడు ముఖం పెట్టుకొని అతని వద్దకు వెళ్లినాను. నన్ను కిటికిలో నుంచి చూచీ చూడడంతోనే అతను పకపక నవ్వుకుంటూ ఎదురుగా వచ్చాడు. ఏమాటలు మాట్లాడి ఓదారుద్దామా అని నేను రెండురోజుల బట్టీ ఆలోచించి తయారు చేసుకున్న మాటలన్నీ మాట్లాడకుండా వృథాగా ఊరుకోవలసి వచ్చింది. ఆమాటలు మాట్లాడేందుకు వీలు చిక్కనిస్తేనేనా!

ఇంకోసారి! నేను పట్ణంలో చదువుకుంటూ ఉండగా ఏదోపనిమీద పట్ణం వచ్చి నెలరోజు లున్నాడు. నా విలాసానికే అతని ఉత్తరాలు వచ్చేవి. ఒక రోజున తంతి వస్తే గాభరా పడుతూ అతనున్న చోటు వెదికి ఇచ్చినాను. విప్పి చదువుకొని ఫక్కుమని నవ్వినాడు. ఏమిటో నవ్వు మాట కాబోలు ననుకొని నేనూ నవ్వినాను. ఇంతలోకే ఆతను "ఇదేమిటో తెలుసునా? మానాన్నగారికి అకస్మాత్తుగా ప్రాణం మీదికి వచ్చిందట. ఈ సాయంత్రమే వెళ్లవలె!" ఆన్నాడు. ఆమాటలు వినేటప్పటికి నిర్ఘాంతపోయినాను.

అప్పటినుంచీ ఆస్నేహితుని స్వభావం నాకు తెలిసి పోయింది. కాని లోకు లంతా అట్లా అనుకోరు. "అతని కేమి కష్టం వచ్చినా ఎంతమాత్రము పట్టించుకోడు" అనుకొని కొందరు ఆశ్చర్యపడతారు. మరికొంతమంది కటికి గుండె వాడని దూషించనుకూడా దూషిస్తారు. కాని నాకుమాత్రము అతను నవ్వినా డంటే ఏదో దుఃఖములో ఉన్నాడని నిశ్చయంగా తెలుస్తుంది.

నవ్వుగాని ఏడుపుగాని అక్షర సమామ్నాయ మవసరము లేని సంగీతము వంటి భాష. తాటిచెట్టును వేపచెట్టుఅని, వేపచెట్టును తాటిచెట్టు అనీ లోకమంతా వ్యవహరించి నట్లయితే ఏమీ ఇబ్బంది ఉండదు. ఆపేరులు వట్టి సంకేతాలు. అట్లాగే మా పూర్వోక్త స్నేహితుడు ఏడుపును నవ్వుతో ప్రచురిస్తాడు. ఇంతేకాని మా స్నేహితునికి దుఃఖము లేదని కాదు. ఇక్కడ ప్రత్యేక వ్యక్తి భాష సంఘభాషతో భేదించినదే కాని సంఘానుభవాలకూ మా స్నేహితుని అనుభవాలకూ తారతమ్య మున్నదనలేము !

౬

ప్రస్తుత విషయానికి వద్దాము. నేను కథ లెల్లా వ్రాస్తాను ? నేను మొదట హాస్య ప్రధానమైన కథలు వ్రాసేవాణ్ణి కాదు. కథలన్నీ దుఃఖముతో మొదలుపెట్టి దుఃఖముతో పూర్తిచేసేవాణ్ణి. కాని ఆ కథలు వ్రాసేప్పుడు నాకు బ్రహ్మానందంగా ఉండేది. కొంతమంది నన్నప్పుడు "ఇంత కఠినంగా వ్రాయడానికి నీమనసెట్లా ఒప్పుతుందయ్యా ? మేము చదివేప్పుడే బొటబొట కన్నీళ్లు కార్చాము. ఇక నీకు వ్రాసేప్పుడెట్లా ఉన్నదో !" అని అడిగినారు. కాని పద్మాసనంలో నిశ్చలంగా కూర్చునే బ్రహ్మదేవునికి సృష్టికాల మప్పుడు ఉండే ఉత్సాహము కంటె, తాండవేశ్వరునికి ప్రళయకాల మప్పుడు నాట్యము చేయడములో ఉత్సాహ మెక్కువ ఉంటుందని వాళ్లకేం తెలుసును ! కథ వ్రాసేప్పుడు అందులో ఎంత మంది మనుష్యులను చంపడానికి వీలవుతే కథకు డంత సంతోషిస్తాడు. కథాంతాన సర్వనాశనము చేయగలిగినాడా, ఇక నటరాజమూర్తికి ఉండే బ్రహ్మానంద మే అతనికి !

మొదట నేను విషాద కథలే వ్రాస్తున్నప్పటికీ నెమ్మదిగా హాస్యకథలు కూడా వ్రాయడంసాగించినాను. కాని అటువంటి కథలు ఒకటి రెండు వ్రాయకముందే నాకు హాస్యకథా రచయిత నని పేరు వచ్చేసింది. అట్లా పేరు రావడానికి మరేమీ కారణం లేదు. నాస్నేహితులలో ఇద్దరు మొదటినుంచీ హాస్యకథలే వ్రాస్తున్నారు. కాబట్టి నన్నుకూడా వాళ్లతో కలిపి నావద్దలేని హాస్యము లోకము నాకు ఆరోపించ సాగింది.

అది అసత్యమైనా ఏదోవిధంగా క్రొత్త డిగ్రీ తీసుకునే గ్రాడ్యుయేటు వలె నూతన గౌరవంగా అంగీకరించినాను. తర్వాత కొన్నాళ్లకు హాస్యకథలు వ్రాయడము నాకు పరిపాటి ఐపోయింది.

కులాసాగా వ్రాసే విషాదకథలు ఎల్లా వ్రాస్తానో చెపితే చమత్కారం మేమీ ఉండదు. కాబట్టి ఈ హాస్యకథ లెల్లా వ్రాస్తూ ఉంటానో చెప్తాను. ముందు హాస్య కథలు నే నెల్లా వ్రాస్తానో చెప్పక నా స్నేహితు లిద్దరూ వాళ్లవి ఎల్లా వ్రాస్తారో చెపుతాను. ఆ ఇద్దరు స్నేహితులలో ఒకరిది మోటు హాస్యము, ఒకరిది సున్నితమైనది.

ఆ మోటు హాస్యపు స్నేహితుడు ఆకారంలో కూడా అట్లాగే ఉంటాడు. జమానువంటి మనిషి, చూస్తే పిల్లలు జడుసుకుంటారు. ఒకసారి వాళ్లింటికి భోజనానికి వెళ్లి "మీరు కథ లెట్లా వ్రాస్తారండీ?" అని అడిగినాను.

జవాబుకు తడుముకోకుండా ఆయన "ఎట్లా వ్రాస్తా రేమిటయ్యా? ఏమున్నది! ఏ స్నేహితుడన్నానో పబ్లిషర్లో వ్రాయమంటేనో, ఖజానాలో డబ్బు తక్కువగా ఉంటేనో లేచి కూర్చొని కలం చేతులో పట్టుకొని తోచిన దల్లా కాగితంమీద పెట్టేస్తాను!" అన్నాడు వెంటనే.

నేను కొంచెము జంకుతూ "కాస్త ఆలోచించవద్దా?" అన్నాను.

"ఆలోచనఏమిటి! నీవు ఆలోచిస్తూ వ్రాస్తావు కాబోలు! అందుకనే ఎవ్వరూ నీకథలు మెచ్చుకోరు. కథ వ్రాయడానికికూడా ఆలోచన కావలెనట! ఈ స్వల్ప విషయాలకే ఆలోచిస్తూ కూర్చుంటే డబ్బు సంపాదించేదెట్లా!" అన్నాడు.

నేను కొంచెము నిర్ఘాంతపోవడమే కాకుండా నా కథలను పరిహసించినందుకు చిన్నబుచ్చుకున్నాను కూడాను. కాని వెంటనే కోలుకొని సంగతి తెలుసుకో వలెనని ఉన్నాను కాబట్టి పట్టు విడవక "అట్లా ఐతే ఎవరన్నా ఏమన్నా అంటారేమోనని భయంలేదా?" అన్నాను.

"భయం నాకా? ఎవ రన్నా నన్నంటే ఎరగిరూ! ముక్కు బద్దలు కొడతాను!" అన్నాడు. అప్పు డాయనను చూస్తే నాకు భయం వేసింది.

"సరే లెండి కాని సాపు వ్రాసేప్పు డన్నా ఆలోచించరా;" అన్నాను.

"నీవు వట్టి చాదస్తుడ వల్లే ఉన్నావే. కథలకు సాపు వ్రాస్తూ కూచోవడం కూడానా; ఆపాడు సంగతి విడిచి పెట్టి కడుపునిండా భోంచెయ్యి, ఏమి తిండీ అది! పిచ్చిక మేత మేస్తావు!" అని నన్ను మళ్లీ ఆవిషయ మెత్తనీయక, మర్నాడు అజీర్తితో ఉపవాసం చేసి పడక వేసేట్లు బలవంతాన భోజనం చేయించినాడు.

# కథ లెట్లా వ్రాస్తాను

ఆ స్నేహితుని కథలను ఆంధ్రదేశమంతా, పండితులనక పామరులనక ఏక గ్రీవముగా పొగడుతున్నారు. ఆయనను ఎడ్డిసన్ వంటి గొప్పగొప్ప హాస్యకథకులతో పోలుస్తున్నారు. ఇంత హాస్యకథాకర్త ఇంకొకరు లేరని కూడా అంటున్నారు. మధ్య నేనొకణ్ణి మోటు హాస్యమని అంటే మాత్రము నా మాటలకు విలువ ఏం వుంటుంది!

ఇక రెండవ స్నేహితుడు. ఆయన పొడుగ్గా సన్నగా జబ్బుమనిషి వలె ఉంటాడు. ఊదితే పడిపోతాడా అని భయము వేస్తుంది. ఆయన మాట్లాడుతుంటే కంఠము సన్నగా శ్రావ్యముగా ఉండి విన సొంపుగా ఉంటుంది. ఎప్పుడన్నా నవ్వితే వెండి చిరుగంటల నాదాన్ని తలపుకు తెప్పిస్తుంది. పిల్లవాడి వల్లే కనపడడమేగాక మాట్లాడుతూకూడా ఉండే ఆయనను చూస్తే ఎవరికి గౌరవించ బుద్ధి పుట్టుతుంది?

ఒకనాడాయన మా ఊరు వచ్చినాడు. మే మిద్దరమూ గదిలో పడక కుర్చీల్లో పడుకొని కబుర్లు చెప్పుకుంటున్నాము. నే నప్పుడు నెమ్మదిగా మొదటి స్నేహితుణ్ణి అడిగినట్లుగానే "మీరు కథ లెట్లావ్రాస్తారు?" అన్నాను.

ఆ ప్రశ్న నేను వేయగానే నాస్నేహితుని ముఖాన ముగ్ధమైన చిరునవ్వు చిరుగాలివల్లే మలసింది. "మీరూ కథలు వ్రాస్తారుగా!" అన్నాడు కొంతసేపటికి.

నేను కాస్త ఆలోచించి "ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వ్రాస్తారుగా! అంత సరస మైన హాస్యకథలు వ్రాసే మీ అనుభవ మేమిటో తెలుసుకోవలె నని కోరిక!" అన్నాను.

"మీరు నవ్వుతా రేమో! ముందు మీరు కథ లెట్లా వ్రాస్తారో చెప్పండి, నాకూ తెలుసుకోవలెనని కుతూహలంగానే ఉన్నది" అన్నాడు.

నేను ఫక్కున నవ్వి అన్నాను, "నా కథ లెట్లావ్రాస్తానో కొద్ది రోజుల్లో వ్రాతపూర్వకంగా ప్రచురించబోతున్నాను. అది ఇప్పుడే చెపితే మీరు చదవ వచ్చే ప్పటికి దానిలో మజా పోతుందేమో! కాబట్టి నన్ను ప్రస్తుతము వదలి పెట్టి మీ రెట్లా వ్రాస్తారో చెప్పండి! నేనెట్లా వ్రాస్తానో అనేది వ్రాయడం కోసమే మీ రెట్లా వ్రాస్తారో కూడా తెలుసుకుందామని అడుగుతున్నాను."

"అయ్యో బాబూ! మీ కథలో నన్నెక్కిస్తారా ఏమిటి? అయితే అసలే సిగ్గుగా ఉంటుంది" అని ఫక్కున నవ్వినాడు నాస్నేహితుడు. ఆ నవ్వు నాకు వెండి చిరుగంటల నాదంవల్లే వినవచ్చి సంతోషము కూర్చింది.

"వెండి చిరుగంటల నాదంవల్లే ఉండే మీనవ్వు వల్లెనే మీ కథలలోని హాస్య ముంటుంది. అవి వ్రాసే మీరు ఎట్లా వ్రాస్తారో చెప్పడానికి సందేహించవలసిన

అవసరం లేదు. అదీ ఒక చిత్ర మనోహరతతో కూడి ఉంటుంది" అన్నాను.

నా స్తోత్రానికి ఆ స్నేహితుడు కొంచెము తల వాల్చినాడు. సిగ్గుతో ఆయన ముఖము వివర్ణమైనది. ఇక చెప్పకుంటే సరసంగా ఉండదని మస్కపస్క ఆగుతూ ఈ విధంగా ఆయన మంజుల కంఠస్వరముతో చెప్పసాగినాడు!

"బాబూ, మీరంతా నాకథలనూ నాహాస్యాన్నీ పొగడుతారు. కాని అవి వ్రాయడానికి నేను మహాచెడ్డబాధ పడతాను సుమండీ! కొన్నాళ్లు కథ మనస్సులో మాటిమాటికీ తోస్తూ వేరే ఏమీ ఆలోచనీయదు. సవతిపోరు సహించని భార్య వల్లే ఉంటుంది దాని స్థితి. చివరకంతా తయారవుతుంది. ఆపైన, ఇప్పుడు పడక కుర్చీలో పడుకున్నానే, సరిగ్గా అదే విధంగా పడుకొని, ఒక చేతులో కాగితాల కట్టా, రెండోచేతులో పెన్సలూ పట్టుకొని వ్రాయడం మొదలుపెడతాను. కథ పూర్తి అయ్యేప్పటికి నా ఒంట్లోఉన్న ఓపిక అంతా సాఫయి పోయి మూర్ఛ పోయినట్లు పడిపోతాను. అప్పుడా కథ మీద విరక్తి పుట్టుతుంది. వెంటనే విసరి అవతల పడవేస్తాను. ఒకవేళ ఎందువల్లనైనా అది మళ్లీ చదవడం తటస్థించిందా, అని చింపివేసినా నన్నమాటే. అందువల్లనే నా వాటిల్లో చిన్నచిన్నలోపాలు ఉంటూ ఉంటవి. ఆ లోపాలు సర్దుకోవలెననుకుంటే కథే సర్దుకోవలసి వస్తుంది! మీకు చెప్పినాను గాని ఇదంతా మీకథలోకి ఎక్కించేరు సుమా,, అని పూర్తి చేసినాడు.

నేనంతసేపూ చిరునవ్వు పెదవుల మీద నటింప జేస్తూ చాలా శ్రద్ధగా విని, చివరకు "మీకేం భయ మవసరము లేదు. నేను ఇది నా కథలో ఎక్కించినా మీరు సిగ్గుపడవలసిన అవసరముండదు. కాని నా కథలోకి మాత్రము చాలా అవసర మవుతుందేమో!" అన్నాను.

"ఏమో, మీదయ!" అన్నాడు, పాప మాస్నేహితుడు!

౨

ఇంతవరకూ వ్రాయకుండా అట్టేపెట్టినప్పటికీ నేను కథ లెట్లా వ్రాస్తానో ఇక చెప్పక ఊరుకునే వీలులేదు. కాని ఇద్దరు స్నేహితులు కథలెట్లా వ్రాస్తారో చెప్పిన మీదట నాలో వాళ్లిద్దరి స్వభావాలూ కలిసి ఉన్నవి కాబట్టి నా పద్ధతి వేరే ఎక్కువగా చెప్పవలిసిన అవసరంలేదు.

నేను ఎవరన్నా కథలు వ్రాయ మంటే వ్రాయను, వ్రాయలేను కూడాను. కాబట్టి కథలతో శతావధానాలు చేయలేను. ఆశుకవిత్వాలూ చెప్పలేను. చాలా వరకు కథకు నేను లోబడి ఉండవలసిందే గాని కథ నాకు లోబడి ఉండదు. కథలు

# కథలెట్లా వ్రాస్తాను

ఇతరులకోసము ప్రచురిస్తున్నమాట నిజమేకాని వ్రాయడము మాత్రము నా కోసమే. నవ్వువచ్చినప్పుడు నవ్వకుండా ఊరుకుంటే ఏమవుతుందో, కథ వచ్చినప్పుడు వ్రాయకుండా ఊరుకుంటేకూడా అదే అవుతుంది. ఒక్క కవిత్వమే మనస్సునిట్లా వేధిస్తుందని అందరూ అనుకుంటారు గాని కథలూ అంతేనని నా అనుభవము. అదే విధముగా ప్రతి లలితకళాసాధకుడికీ ఉంటుందని తోస్తుంది. నాకూ సహసంగా వ్రాసే నాస్నేహితునికి మల్లేనే కథ మనస్సులో కొన్నాళ్లు మథన మవుతుంది. కథామథనము చేసేది నేను కాదు, అదే ఏదో అగోచరమైన శక్తి ప్రోద్బలమువల్ల జరిగిపోతూ ఉంటుంది. కాని నాస్నేహితునికివలే ఒకటే తప్ప వేరేమీ రాకుండా ఉండవలసిన అవసరము లేదు. ఒక్కొక్కసారి మూడునాలుగు కథలు కూడా, ఆఫీసు ఆల్మైరాలో కాగితాలవలె, ఒక్కసారిగానే మనస్సులో రూపము పొందుతూ ఉంటవి. ఒక్కొక్కప్పుడు వాటిలో ఒకటిరెండు వెనుక్కు పోవడము కద్దు. ఎట్లా ఐనా ముందు ఒకదాని ఆకారం పూర్తిఅవుతుంది, కథ ఎప్పుడైనా అ పరిణామదశకు వచ్చేప్పటికి సామాన్యంగా సాయంత్రమవుతుంది. అప్పుడు భోజనం చేసి దీపంవద్ద తీరికగా కూర్చుంటాను. పడక కుర్చీలో మధ్యమధ్య విశ్రమిస్తూ కూర్చునే, కలంతో వ్రాస్తాను. చిన్నదైతే ఆరాత్రే ఐపోతుంది. పూర్తిఅయ్యేప్పటికి ఏ పన్నెండో ఒంటిగంటో అవుతుంది. అప్పటికి అలుపు వస్తుంది. పడుకుంటాను.

కాని పైత్యాధిక్యంవల్ల ఎంతకూ నిద్రరాదు. మరేమీ తోచదు. ఎందుకు కథ వ్రాయవలె నని బుద్ధి పుట్టిందా అని చింతిస్తాను. ఈ బుద్ధి ఉన్నవాణ్ణిగా దేవుడు నన్ను ఎందుకు సృష్టించినాడా అని దేవుణ్ణి దూరబడతాను. కాని ఎవరిని దూరినా నిద్రపట్టదు. నిద్ర పట్టడానికి పుస్తకాలల్లో చదివిన ఉపాయాలన్నీ అనుష్ఠించి ప్రయత్నిస్తాను. కాళ్లూచేతులూ చన్నీళ్లతో కడుక్కుంటాను. మనస్సు ఏకనిష్ఠముగా ఉంచవలెనని ప్రయత్నిస్తాను. విసుగు వల్లనైనా నిద్ర వస్తుందేమోనని ఏరామజపమో చేస్తాను. మనస్సు భావహీనముగా ఉంచవలెనని యత్నిస్తాను. సూర్యోదయ కాలాన్ని మనస్సులో చిత్రించుకొని ధ్యానిస్తాను. ఏమిచేసినా ఏమీ లాభం లేదు. తల తిరుగుతూ ఉంటుంది. ఏవో చిత్రచిత్రమైన ఆకారాలు కళ్లముందు తేలిపోతూ చిరాకు పుట్టిస్తవి. వాటి కొక్కొక్కప్పుడు చెప్పలేనంత వికృతాకారాలుకూడా ఉంటవి. భయపడే రోజులుకూడా కద్దు.

చివరకు ఏ తెల్లవారుజాముకో దాని అంతట అది నిద్ర పడుతుంది. కాని ఆనిద్రమాత్ర మేమి నిద్ర! మధ్యమధ్య భయంకరమైనవో బాధాజనకములైనవో

కలలు వస్తవి. ఉలికి ఉలికిపడి లేస్తూ ఉంటాను. మర్నాడు పొద్దుటికి దేహము జ్వరము జారిన వానికి వల్లే ఉంటుంది. మధ్యాహ్నం బాగా భోజనంచేసి నిద్ర పోయి లేచిన తర్వాత మళ్లీ మనుష్య లోకంలో పడతాను.

కథ పెద్దదై, ఆరాత్రి ఒంటిగంటా రెండింటికి పూర్తికాక పోయిందా, అక్కడి నుంచీ ఆరాత్రి అల్లా బాధ పడడమే గాక మర్నాడు పగలల్లా అదే ధ్యాసంతో ఉంటాను. ఎట్లాఐనా కథ పూర్తి అయ్యేప్పటికి మళ్లీ మరుసటి రాత్రి రావలసిందే, ఆ బాధ పడవలసిందే!

నేను పడే బాధ చూడలేక మాఇంట్లో వాళ్లు "లేని పోనిది ఊరికే ఒళ్లంతా హైరాన పెట్టుకోవడ మెందుకు?" అని అంటూ ఉంటారు. వాళ్లకు ఒక్కొక్కసారి జవాబే చెప్పను. ఒక్కొక్కసారి కసురు కుంటాను.

హాస్యకథలు వ్రాసేవాళ్లంతా నావల్లే బాధ పడతారో లేదో నాకు తెలియదు కాని హాస్యకథ వ్రాయడమే శిక్షగా నేనెంచుతాను, అందు వల్లనే ఎవరి మీద నన్నా కోపము వస్తే ఒకటే తిట్టు తిట్టుకుంటాను. "ఇతనికికూడా హాస్యకథలు వ్రాయ వలెనని బుద్ధి పుడితే బాగుండును!" ఇంతకంటె నేను తిట్టుకోలేను.

మా మామగారిమీద ఈ మధ్య కోపము వస్తే కూడా ఇట్లాగే అనుకున్నాను. అందులో వారు ఈమధ్య "ఏముందీ కథలు వ్రాయడము! నేనూ వ్రాయగలను. గోడ మీద పిల్లి, పిల్లిమీద కుక్క, కల్పించివ్రాయడమేగా!" అన్నారట. అందు వల్ల నా కసి తీరేట్లుగా పదేపదే, "తథాస్తు, తథాస్తు! వారికికూడా హాస్యకథలు వ్రాయవలెనని బుద్ధి పుడుతుందిగాక!" అనుకున్నాను.

కాని కథ వ్రాయడంతోటే పూర్తిఐనట్లు కాదు. సరసహాస్యపు స్నేహితుని వల్లే పూర్తిఐన తర్వాత వాటిని చూడడానికి నాకు భయ మేమీ ఉండదు. మనుష్య ప్రపంచకంలో పడ్డతర్వాత రెండురోజులు లాగుతాను. ఇంతలో అక్కడక్కడ చేర్చ వలసిన చిన్నచిన్న విషయాలేమన్నా తోస్తవి. మళ్లీ కథ రెండుమూడుసార్లు చదివి నెమ్మదిగా శ్రద్ధగా సాఫు వ్రాస్తాను. ప్రతివాక్యములోనూ ఏదో ఒక చిన్న మార్పైనా ఉంటుంది. సాఫు పూర్తి ఐన తర్వాత మళ్లీ ఇంకొకసారి చదివి తోచిన దిద్దు బాట్లు చేస్తాను. అంతటితో దానికీ నాకూ ఉన్న ఋణము తీరిపోతుంది.

ఇక దాన్ని ఏ పత్రికలోనో పుస్తకంలోనో ప్రచురిస్తాను. కొంతమంది చదవనే చదవరు. వాళ్లకిదే పనా! కాని చదవకుండానే "పాడు కథ!" అంటారు ఇంకా కొంతమంది అశ్రద్ధగా చదివి అశ్రద్ధగా వ్రాశాడంటారు. మరి కొంత మంది

లోపమేదైనా చూపక పోతే తమ విమర్శ దృష్టికి కళంకము కలుగుతుందని లోపాలు వెదుకుతూ ఉంటారు. చివరకు వాళ్లకు అచ్చులోపా లైనా కనపడతవి. ఇక కొంత మంది "ఈ భాగంలో ఇట్లా వ్రాస్తే బాగుండేది, ఇక్కడ ఇట్లా!" అని మాట విరుస్తారు. కొంతమంది "ఎందుకూ, కూటికీ గుడ్డకూ అక్కరకు రాని వ్రాతలు!" అంటారు.

మరి కొంత మందికి భక్తి ఉండవలె! మొదటిసారి బయాస్కోపు మా ఊరు వచ్చినప్పుడు ఊళ్లో జనమంతా చూడడానికి పొర్లబడి వెళ్లుతున్నారు. మా నాయనమ్మనుకూడా నేను తీసుకొని వెళ్లి చూపించినాను. పెద్దది ఆవిడ కదిలేప్పటికి మా సందులో ఆడవాళ్లంతా బయలుదేరినారు. అది చూసి వచ్చిన మర్నాడు మా దొడ్లో తులసి కోట అరుగుమీద వాళ్లంతా సభచేసి బయస్కోపు సంగతులు మాట్లాడు కుంటూ ఉన్నారు. చివరకు వాదన పూర్తి ఐన తర్వాత తీర్మానము చేసినారు, "అక్కడ ఏమున్నది, కృష్ణా? రామా?" అని ఆమాటలు విన్ననాకు మండుకుపోయింది. వాళ్ల దగ్గిరికి పోయి "సరే కానీయండి కాని రేపటినుంచీ రోజూ పావుగంట సేపు 'కృష్ణా' అనీ 'రామా' అనీకూడా అంటూఉంటాను. టిక్కట్లు పావలా ఇచ్చి కొనుక్కు పోతూ ఉండండి!" అన్నాను. మా నాయనమ్మ ఆమెసావాసగత్తెలూ అన్నట్లుగానే మా కథలను చూసి కూడా కొంతమంది "ఏముందీ కథలలో? కృష్ణా రామా?" అంటారు.

మరి కొంతమంది "నీతిబోధ లేదే, ఎందుకు వ్యర్థ" మంటారు. ఒక వేళ ఆ కథ ధ్వనిమాత్రంగా నీతిబోధ చేస్తూ ఉంటే "ఇంకా స్పష్టంగా చెపితే బాగుంటుంది, లేక పోతే నూతన విద్యా పద్ధతులకు సరిపోదు" అంటారు.

ఎవరేమంటే నేమి! ప్రచురించిన తర్వాత నా కథ కర్మ నాది కాదు. ఒక్కసారి నాచేతులు దాటి అచ్చులోకి ఎక్కిందా అంటే నాబాధ విరగడ అవుతుంది. తాము కన్నబిడ్డలను పాలుపోసి నానాశ్రమపడి పెంచే తల్లుల కున్నట్లుగా, ఆపైన బాధపడవలసిన అవసరంలేదు. భూలోకంలో కని పారవేస్తే అవి జీవిత మున్నన్నాళ్లు బతుకుతవి. కథకునికి ప్రసూతి వేదనే గాని ఆపైన వేరే వేదన ఏమీ ఉండదు.

నే కథ లెల్లా వ్రాస్తానో చెప్పడ మింతటితో చాలదూ?! ఇప్పుడు రాత్రి పదిఘ్మ్రప్పా వయింది. నాకీ రాత్రి ఏవేళటికి నిద్ర ప్రాప్త మవుతుందో, ఎలాంటి నిద్ర పోతానో, ముందే చెప్పిఉన్నానుగా!

# స్వాగతము

**ఈశ్వర**

ఈ దరీద్వార భూమియం దీకరోర
శైలతటమున, సంధ్యా ప్రమీలకాంతి,
నీకొఱకె వేచియున్న ఇవ్యేకతమున
స్వాగతము, స్వాగత మహానిశాకుమారి!

నేటి ఈతొలుసారి కన్నీటిజాల్పు
నందణఁగియున్న మౌన మగ్నానురాగ
శూన్యత రచించు లజ్జా ప్రసూనశయ్య
స్వాగతము, స్వాగత మహానిశాకుమారి!

ఈ రహశ్శయ్య లేఁగల తేరుచున్న
దీ నిదురకన్నె,—దానిమనోనిగూఢ
భావమున రగుల్కొనెడి యౌవనపుటాశ
స్వాగతము, స్వాగత మహానిశాకుమారి!

# 'చిత్రాంగి'

వేలాల. రామచంద్రయ్య

ఇట్టి * కృతులు ఆంధ్రసారస్వతమునకు మిక్కిలి యాదరణీయములు. ఆంధ్రనాటకరచన యారంభమై కొంతకాలమే యైనను నాటక సంఖ్య మిక్కిలి యెక్కువయైనది. కాని గుణసంపద విరళముగ గోచరించెడిని. వస్తువిన్యాసమునందేమి, పాత్రపోషణమునందేమి, నాటక రచనయందేమి నాటకకర్తలు గొఱ్ఱెలయట్లు ఒకరినొకరు అనుసరించుచుండిరే కాని (మిక్కిలి కొలది మందితప్ప) స్వతంత్రతయు నవ్యతయుఁ జూపలేదు. 'చిత్రాంగి' నాటకమునందలి మూలకథ ప్రాతదైనను వస్తుకల్పనావిన్యాసముల యందును పాత్రపోషణమునందును తక్కిన విషయములను నాటకము స్వాతంత్ర్యశోభాయమానమై పాఠకప్రేక్షకుల మనంబుల చూరగొనుననుటకు సందియము లేదు.

క్రొత్తనాటకమునకును ప్రాతనాటకమునకును నామకరణమునందును భేదమున్నది. ఇది 'చిత్రాంగి' అది 'సారంగధర'. రెండును విషాందాంతములే కాని చిత్రాంగియే నిజముగ విషాదాంతము. 'సారంగధర' యందు కడపట శివుడు ప్రత్యక్షమై బాహుపాదప్రదానము చేయుటచే కొంత రసభంగ మగుచున్నది. కాని 'చిత్రాంగి' యం దిట్టి యసంగతమైన దేదియులేదు. మఱియు 'సారంగధర' యందు సారంగధరుడు ముఖ్యపాత్రము. 'చిత్రాంగి' యందు చిత్రాంగి ముఖ్యపాత్రము. ఆమెచరిత్రయే విషాదకరము, ఆమెజీవితమే విషాదాంతము.

---

(* గ్రంథకర్త: గుడిపాటి. వెంకటాచలంగారు B. A, L. T.,)

పూర్వనాటకమున ముసలివాఁడగు రాజరాజనరేంద్రుని చాపల్యమునకు విసుగును, చిత్రాంగి కులటాత్వమునకుఁ గోపమును, సారంగధరుని పితృమాతృ భక్తులకును ఉదాత్తతకును గౌరవభావమును పాఠకప్రేక్షకులకుఁగలుగును గాని వీనికన్న గాఢతరములగు ననుభావము లేవియు నుదయింపవు. పైపాత్రలలో వేనియందును సానుభూతి గలుగదు. సారంగధరుని వర్తనమున కమితగౌరవభావము మాత్రమే కలుగును. ఉద్వృత్తికిఁగలుగు పాట్లకు విసుగు, కోపము, నాస్తిక భావము తప్ప తక్కినదేదియు జనింపదు. అదియుగాక నాటకమునకు ముఖ్యగుణమగు హృదయమునందలి యాందోళన, విరుద్ధగతులకును భావములకును గలుగు పెనగులాట యే పాత్రయందును కానుపించదు. నాటక పఠన దర్శనానంతరము పాఠకప్రేక్షకులకుఁ గోఁపత యే మిగులును కాని సంతృప్తికలుగదు.

మనపూర్వులకు విషాదనాటకములులేవు. ఆంధ్రమున నిప్పుడే కొన్నికొన్నిపుట్టుచున్నవి. అవియు పూర్తిగ ప్రేక్షకుల మన్ననవడయ లేదు. విషాదాంతనాటకరచనమున పాశ్చాత్యనాటకములే మన యాదర్శములు. తద్రచనావిధానమే మనకు లక్ష్యము. 'సారంగధర' నాటకకర్తలు ఈలక్ష్యమునైన దృష్టియం దుంచుకొనిన ట్లగపడదు. నాటకనాయకుడగు సారంగధరుడు ఆభిజాత్యమును ఉదాత్తవర్తనమును గలవాఁడేకాని యతనియం దేలోటును కానిపించదు. నాటక వస్తువునందు చిక్కులు (critical situations) గల యవస్థ లేవియుఁ గానిపించవు. పాత్రల హృదయమున విరుద్ధభావసమ్మర్ధన మేదియుఁ గోచరింపదు. దుశ్శీలుడు (Villain) ఎవ్వడునులేడు. తప్పేమియుచే యనివాడు కులట చిత్రాంగి మానము గాపాడ బ్రయత్నించినందులకు మూర్ఖుడగు రాజరాజనరేంద్రునిచే కాళ్లుచేతులు గొట్టివేయబడును.

న్యాయమునకు గలిగిన ఫలమిది. సారంగధరునకని చిత్రాంగిని దెచ్చి తాను పెండ్లిచేసికొని సారంగధరుని జంపి చిత్రాంగిజీవితము వ్యర్థము సేసిన రాజరాజు చెక్కుచెమరక ఆరోగ్యసంపదతో వర్ధిల్లును. ఇట్టినాటకము దర్శించుటచేఁ బ్రేక్షకులకుఁ గొఱతగాక మఱియేమి కలుగును?

నూత్ననాటకమున నిట్టి యసంగతము లేవియులేవు సరిగదా రసపోషణము చక్కగ గావింపబడియున్నది. చిత్రాంగి పాత్ర ముదాత్తపరుపబడియున్నది. రాజనరేంద్రుని పాత్రముయొక్క క్రౌర్యము జగన్నాథ పాత్ర (దుశ్శీలుఁడు) కల్పనముచేఁ గొంత శమింపబడియున్నది. సారంగధర పాత్రమున కేవల దైవప్రకృతిగాక మానవప్రకృతి మిశ్రీకరింపబడియున్నది. క్రొత్తనాటకమునకును బ్రాతనాటకమునకును గలతారతమ్యము బోధపడుటకై 'చిత్రాంగి' కథ టూకిగ వ్రాసెదము.

చిత్రాంగి సారంగధరులు అతిగాఢముగ పరస్పరము వలచియున్నారు. దుశ్శీలుఁడగు జగన్నాథముప్రేరణముచే వృద్ధుడగు రాజరాజ నరేంద్రుడు తనయంతరాత్మ బాధించుచున్నను లోకపుమేలు కనియు, సారంగధరుని మేలుకనియు, తన్నే మోసపుచ్చుకొని చిత్రాంగి పెదతండ్రి (పెంచుతండ్రికూడను) యుగంధరవర్మ, అతని కుమారుడు సుబుద్ధి—వీరియిష్టముల నిరాకరించి బలాత్కారముగ చిత్రాంగిని పెండ్లియగును. చిత్రాంగి తన పూర్వవర్తనము వదలినట్లును రాజనుప్రేమించునట్లును నటించును. కాని తాను వలచిన సారంగధరునిపై నస్ఖలితప్రేమ గలిగి రాజనరేంద్రుని కరమునైతము తన దేహముపై సోకనీయదు. చిత్రాంగివేడికోలు ననుసరించి రత్నాంగీ సారంగధరులను చిత్రాంగియున్నమేడకు తేర యోచించుచుండ జగన్నాథము

రాజును మందలించి చిత్రాంగీ సారంగధరు లొకమేడయందే యుండిన బ్రమాదమువచ్చునని బోధించి చిత్రాంగిని బరీక్షించుటకై రాజు నూరి బయటి కనుపును. అప్పుడు చిత్రాంగీ సారంగధరులు ఒకరినొకరుగూడి తమప్రేమల వెలిబుచ్చుచు వితర్కించుకొనుచు తమపాట్లకుఁ బరిత పించుచు తుదకు నొకరినొకరు వీడ్కొనలేక వీడ్కొనుదురు. మూర్ఛ వోయిన చిత్రాంగి సారంగధరునిగూర్చి కలువరించుచుండ రాజనరేంద్రుడు వచ్చి చిత్రాంగి నలిగిన దేహమును జూచి సారంగధరుని 'కత్తి కోటును' గుర్తించి యతనిపై సందేహపడి విచారణ సలిపి మూక భావముదాల్చిన సారంగధరుని నోటినుండి మాటతీయలేక యతనిపై నేరమువోపి కాళ్లుచేతులు తెగవ్రేయ నాజ్ఞాపించును. అతనిసేవకులు రాజాజ్ఞ నెరవేర్తురు. చిత్రాంగి మూర్ఛదెలిసి సారంగధరునకుఁ గలిగిన శిక్ష రాజరాజునోటినుండి విని తనమేడనుండి దుమికి సారంగధరుడు పడియుండిన మెట్టకుబోయి యతనియవస్థ చూచి తన్నుపొడుచుకొని చచ్చును.

చదువరులకుఁ బూర్వప్రస్తుతనాటకములకుఁ గలభేదము, తారతమ్యము, ఇదివరకే బోధపడియుండును. రెంటియందునువస్తువుచిన్నదే కాని ప్రాతనాటకమున నిరర్థకముగను, అనావశ్యకముగను, కథపెంచి వ్రాయబడెను. ఇచ్చట మధురముగ క్లుప్తముగ వ్రాయబడి యున్నది. ఇందు అందులోవలె కొలువు, అసమకాలీనమగు విచారణాడంబరము లేవియు లేవు. చిత్రాంగీ సారంగధరులకు వకీళ్లు లేరు. అందులేని పాత్ర మిందు ఒకటి నూత్నముగఁగల్పింపబడినది. జగన్నాథము రాజుగారి యాత్మీయ మంత్రి. ఇతడే కథలోని దుశ్శీలుఁడు. (Villain) ఇతనిచేత రాజరాజు కీలుబొమ్మ. నాటకవిషాదమున కితడే కారకుఁడు.

## 'చిత్రాంగి'

పూర్వప్రస్తుతనాటకములయందలి రాజరాజనరేంద్రుని వర్తనము గర్హ్యమే కాని పూర్వనాటకపు రాజరాజు ప్రస్తుతనాటకపు రాజనరేంద్రునివలె మనకరుణకుఁ బాత్రుఁడు కాఁడు. పాఠకప్రేక్షకుల సానుభూతివడయలేడు. పూర్వపు రాజనరేంద్రుడు స్వతంత్రుడు. ఒకరి చేతిలోనివాడు కాడు. పేరుప్రఖ్యాతులు పడసినవాడు. ధర్మవేత్త అన్యాయమని తెలిసియుఁ దనకుమారునకని నిశ్చయించినకన్యను వివాహమాడెను. ఆవల కులట చిత్రాంగి మాయమాటల నమ్మి సారంగధరుని వృత్తాంతము బాగుగవిచారించి నిజ మరయక కామాంధుడై సద్వర్తనమునకు పెట్టినపేరని వెలసిన సారంగధరుని యందు కన్నను కొన్నిదినములకుఁ బూర్వమే తనయింటిమెట్టెక్కిన చిత్రాంగి యందు నమ్మకముంచి కుమారుని శిక్షించెను. కాని ప్రస్తుత రాజరాజును జూడుడు. ఇతడు స్వంతబుద్ధిగలవాడు కాడు. ఆత్మీయమంత్రియగు జగన్నాధముచేతి కీలుబొమ్మ. అసలు చిత్రాంగీ సారంగులకే పెండ్లియగునట్లు సంకల్పముండెను. కావుననే సారంగధరుడు యుగంధరవర్మ యింట చిత్రాంగితోడ రెండునెల లుండుటకు రాజనరేంద్రుడు సమ్మతించెను. ఆవల జగన్నాధము ప్రేరణచేతనో లేక చిత్రాంగినిజూచియో లేక రెంటిచేతనో చిత్రాంగియందు చాపల్యము వహించెను. తన నూత్నవివాహమునకై రత్నాంగి యనుజ్ఞ గైకొనఁ బ్రయత్నించునప్పుడు రత్నాంగి సంరంభసభృతవాక్యముల వలదని మందలింపగా వెనుతీసెను. ఆవల సుబుద్ధి సకలధీరజనసమ్మతముగా రాజనరేంద్రుడు సారంగధరునకని యేర్పఱచిన చిత్రాంగి నెంత మాత్రము పెండ్లికాగూడదని పట్టుపట్టగా నెందుకని ఊర్కొనఁ జూచెను. తుదకు జగన్నాధము చిత్రాంగిని పరీక్షింప నతని పురికొల్ప 'ఈగోలంతా నాకెందుకు? ఎవరికర్మ ప్రకారమట్లా జరుగును.

మనము అడ్డేదేమీ లేదు.కదా! నాకెందుకీశ్రమ' యని వైముఖ్యము జూపెను. కాని ఖడ్గభారము కార్యభారము జగన్నాథముది గదా. అతడు రాజనరేంద్రుని లోటుల నెఱుగును. కుమారునియందలి గాఢ ప్రేమ యొకటి. రెండవది. తనపౌరుషమునందలి యహంభావము. ఈరెంటిని రగిల్చి జగన్నాథము తనపట్టుదల కొనసాగునట్లు చేసెను. రాజనరేంద్రునికి మనస్థైర్యవిహీనతయే కాదు, కొంచెమవివేకత్వము ను గలదు. చిత్రాంగి పైవేషములకు ఒక నిముసమున మోసపోయెను. ఇన్నాళ్లు సారంగధరుని గాఢముగ వలచెనని దెలిసియు వలపు వదలె నని యెట్లు నమ్మెనో? నమ్ముటయే కాదు. చిత్రాంగి కలవరింతల విని సారంగధరుడు బలాత్కరించెనని నిశ్చయించెను. స్త్రీమోహముచే చిన్నప్పటినుండియు సారంగధరుని శీలమెఱిగియు నతనిపై నేరము మోపుట మతిలేమియే కదా.

'సారంగధర'లోని చిత్రాంగికిని 'చిత్రాంగి' లోని చిత్రాంగికిని చాలభేదముకలదు. మొదటి చిత్రాంగి సామాన్యపు స్త్రీ. సారంగ ధరుని మొదట చూడలేదు; వలవలేదు. రాజనరేంద్రుని పెండ్లియయిన వెనుక సారంగధరునిఁ జూచి మోహించి తిరస్కరింపబడి తనకసి దీర్చుకొన నిశ్చయించుకొని సారంగధరుని చావునకుఁ బ్రయత్నించి నది. 'చిత్రాంగి' లోని చిత్రాంగి మొదటినుండి కొనవఱకు సారంగ ధరునే వలచినది. అతనిపై నస్ఖలితప్రేమ వహించినది. ఆమె యభి ప్రాయముల ననుసరించిన నామె గొప్పపతివ్రతయే యనవలయును. కృతికర్త చిత్రాంగిపాత్రమును ప్రస్తుత కాలపు కుంచెతో చిత్రీకరిం చెను. చిత్రాంగీ సారంగధరులవలపు గాంధర్వమని చెప్పుటకువీలులేదు. అందు కొంత నవనాగరకత కలిసియున్నది. పాశ్చాత్యవిధానము గొంత యనుసృతము. చిత్రాంగివివాహమునకుఁ బూర్వము రెండునెలలు

## 'చిత్రాంగి'

చిత్రాంగీసారంగధరులు కలిసియుండిరి. చిత్రాంగి తండ్రిలేనిబిడ్డ. ఆకారణమున పెద్దతండ్రియింట నల్లారుముద్దుగా పెరిగినది. అదియును గాక పెద్దతండ్రి మిక్కిలివృద్ధుడు. కావున వారి రెండు నెలల జీవనము గడు విచ్చలవిడిగనుండెను. చిత్రాంగి పందొమ్మిదేండ్లస్త్రీ యైనను బాల్యతత్వ మింకను పోలేదు. ఆమెనడవడి, మాటలు అన్నియు బాల్యమునకుఁ జేరినవే. అంతియకాదు. బాల్యమునకు సహజమగు దుడుకుదనమును పోలేదు. ఆదుడుకుదనమే మితి మీరుటవల్ల ఆమె జీవితము నింత గోలకు దెచ్చెను. జగన్నాథమును చెట్టుకొమ్మనుండి క్రిందికి ద్రోసి యవమానపఱచకున్న తన కట్టిగతి సంభవించి యుండదు కాబోలు.

చిత్రాంగి గుణము లన్నిటియందును ఆమెప్రేమ యత్యాశ్చర్యకరము, అత్యద్భుతము. ఆమె సారంగధరుని అతిగాఢముగ వలచినది. ఆమెప్రేమతత్వము సారంగధరునికిగూడ బోధపడలేదు. అతని వలపు ఆమెవలపుయొక్క యున్నతి వహించలేదు. 'నేను చిత్రాంగినని మరిచి పోగలను గాని సారంగధరునిదాన్నని మరిచిపోను'. సారంగధరుని రూపము 'నారక్తంలో, నానరాల్లలో, నామెదడులో చిన్నప్పణ్ణించి కలిసి పెరిగిన' దట.

చిత్రాంగికి లోకన్యాయములతోఁ బనిలేదు. ఆమెయంతరాత్మకు సరియనితోచినదే న్యాయము. సారంగధరుని ఎల్లప్పుడు చూచుచుండుటకు, దేనికైనను ఆమెహృదయము సమ్మతించును. అందుకైయేకదా రాజరాజనరేంద్రుని పెండ్లియగుటకు సమ్మతించి యతనిపై వలపు నటించెను. 'నీతో వుండడానికి కాకపోతే, యీముసలిని నేనెందుకు పెళ్ళిచేసుకుంటానూ?' ఆమె ప్రేమతత్వము గాంచుడు (పేరుప్రతిష్టలను) నేను వదులు కొంటాను. నీకోసం ఇక్కణ్ణించి

తప్పించుకొని, నీతోవుండే విధమే ఉంటే, ప్రతిరోజూ, ప్రతివారూ, నామీద వుమ్మివేస్తున్నా ఆనందంగా అదృష్టమని వారినికూడా ప్రేమిస్తాను. నీప్రేమతో పవిత్రమయిన యీ శరీరం, ఎవరెన్నితిట్టినా, మలిన మవుతుందా?'.

సారంగధరుని వలపు చిత్రాంగి వలపువలె లోకాచారములను, లోకన్యాయములను, తిరస్కరింపదు. అతనికి పెద్దల యాచారములందు వారు విధించిన ధర్మములందు పేరుప్రతిష్టలయందు నమ్మిక గలదు. చిత్రాంగి రాజనరేంద్రుని పెండ్లియయిన తర్వాత చిత్రాంగిని ప్రేమించుట తప్పని యంతరాత్మ బాధించుచుండెను. మనసు వదల లేదు. ఆమెయు మరపునకురాదు. తాను 'చేసేది పాపమని మరపునకు రాదు'. ఈ రెండువిధములగు భావములకు నెరయగుటచేత నే యతనికట్టిగతి సంభవించెను. సంపూర్ణముగ లోకాచారముల యందు నమ్మకముంచి ఆమెమాట యెత్తకున్న రాజనరేంద్రునికోప మాధ్యములకుఁ బాత్రుడై యుండడు. లేక లోకన్యాయముల దిరస్కరించి చిత్రాంగిని లేవదీసికొనివెళ్లిన 'కథ అడ్డంగా తిరిగి' యుండును. ప్రస్తుతము రెంటికిం జెడిన రేవడై మృతిబొందెను.

జగన్నాథము పరమదుశ్శీలుడు. ఒకరికి కీడుచేయుటయే అతని స్వభావముకాబోలు. అతని నిందింపని వారు లేరు. సారంగధరునికి రత్నాంగికి, చిత్రాంగికి, సుబుద్ధికి అందఱికి నతనిగుణము తెలియును. అయినను 'వృథాస్వార్థభంగము గావించెడివారి' గోష్ఠిలోనివాడు కాడనితోచెడిని. ఏదియెట్లున్నను, చిత్రాంగివివాహవిషయమున కారణములేక వర్తింపలేదు. చిత్రాంగి యతని చెట్టుకొమ్మనుండి త్రోసి యతని ముసలితనమును వెక్కిరించి యవమానపరచుటకు అతడు ఆమెజీవితమునే వ్యర్థపఱచుట. నేరమునకె న్నో రెట్లు హెచ్చగు శిక్ష

కావచ్చును. కాని దుండగీలకు సాకుగలిగిన చాలదా తమవిషము ప్రజ్వలింప చేయుటకు?

దుండగముతో బుద్ధిసూక్ష్మత చేరిన ఫలితము భరింప శక్యము కానిది. జగన్నాథము వర్తన మట్టిదే. రాజనరేంద్రుని తనచేతితో నాడించుచున్నను తానే స్వతఃగా చేయుచున్నట్లు అతనినోట జెప్పించుచుండెను. ఎన్నటికిని తనకు దేనియందును బాధ్యతలేనట్లు చూపించుకొనుచుండెను. చిత్రాంగితోడి వివాహమున కంగీకరింప జేయుచు రాజనరేంద్రునితో 'మళ్లీ బాగా ఆలోచించుకోండి. చివరికి నేను చెపితే యేదోబలవంతంమీద వొప్పుకొన్నట్లు కనపడుతుంది. ఆఖరికి తమకే' అని తప్పించుకొనుచున్నాడు. రాజుమనస్సున సందేహములలేవదీయుటకు అతడే కారకుడు. ఆవల 'లేనిపోని అనుమానాలెందుకు?' అనిదెప్పిపోడుచువాడు నతడే. అనుమానములు తీర్చుకొనుటకు పన్నుగడలచేయువాడు నతడే. అందఱిని (అందఱితో తనను) గోలకుదెచ్చినవా డతడే, దుశ్శీలురు కలకాలము రాజ్యమేలుచుండగలరా? సుబుద్ధిచే నతడు చచ్చునప్పుడు అతనికి తగిన శిక్షయైనది చెప్పువారు తప్ప నతని కనికరించువా రుండబోరు.

నాటకములోని పాత్రలన్నిటిలోను సుబుద్ధి పాత్రము అత్యద్భుతము. అతడు ఇరవై ఆరేండ్ల ప్రాయమువాడు. నిర్భరోత్సాహము గలవాడు. అన్యాయవర్తనమునకు గుత్సించువాడు. అతిధీరుడు. భయమెరుగనివాడు. చిత్రాంగిని రాజనరేంద్రుని పాలబడకుండ తప్పించుటకు ప్రాణములైనను సరకుగొననివాడు. విషపుచ్ఛమగు జగన్నాథము నితడే చంపెను. సద్వర్తనముదుర్వర్తనమునుభంజించుటలో వింత యేమియులేదు గదా. 'నిజంగా యీశ్వరుడే వుంటే యీవొక్కపనికే

నాకువెంటనే స్వర్గమిస్తాడు' అన్నవాక్యము హాస్యరసోత్పాదకమైనను ఆతని అన్యాయ విముఖత్వమును సూచించుచున్నది.

నాటకమునందలి యితరవిషయముల కొంత గమనింతము. ఇది యేకాంకనాటకము. 9 రంగములు గలవు. కథ చిన్నదియు విభజనసౌకర్యము లేనందునను కాబోలు అంకవిభజన చేయలేదు. కృతికర్త నాటకమునకు కాలపరిమాణ మిచ్చియున్నాడు. కథ సోమవారము ఉదయ మారంభమై శనివారము రాత్రి ముగియును. కథకు ఈకాలపరిమితి కన్న నెక్కుడు అనావశ్యకము. కథ వాడుకభాషలో వ్రాయబడియున్నది. కావున పాత్రలు చదువరుల హృదయ సమీపమున నుందురు. చదువరుల యన్నదమ్ములకును అక్కచెల్లెండ్రకును కష్టసుఖములు గలిగిన సానుభూతి కలుగునట్లే పాత్రలతోడను సానుభూతి కలుగును. నాటకములోని భావములు కథాభాగములు వర్తమానకాలము ననుసరించినది. వివాహపూర్వము చిత్రాంగి సారంగులు రెండునెలలొకటిగా నుండుట 11 వశతాబ్దమున నసంభవము. 'ప్రతిరక్తనాళమూ నీమీది ప్రేమతో మండిపోతూవుంటే, నిన్ను కోరడం వ్యభిచారమున్నూ, అసహ్యంతో శరీరం జలదరిస్తోవుంటే తాతగారిని కావిలించుకోవడం పాతివ్రత్యమునా?'. 'అబ్రాహ్మిడి మంత్రాలు ఇంకొకరి దాన్ని చేశాయా నన్ను'. ఇట్టి భావములు ఆకాలపువి కావు ఈకాలపువే.

చిత్రాంగి చెమట కంపు గూర్చి మాట్లాడుట మొదలగునవి కొంతయసహ్యకరము. ఇట్టివి కృతికర్త మానియుండవచ్చును. నాటకమున గొన్ని అసమకాలీనములు (anachronisms) గలవు. ఆకాలమున ముక్కుపొడుము, కంటియద్దములు, పొగచుట్టలు లేవేమో అయినను భావము లీకాలపువైన ఈనాటి పరికరము లుండగూడదా?

మొత్తముమీద ఆంధ్రలోకమున ప్రత్యక్షరాస్యుఁడును ఈగ్రంథము చదువవలయును. ఇట్టిగ్రంథములఁ జదువుటవలన పూర్వదురాచారవిసర్జనభీతి, నూత్నసద్వినిమయపరిగ్రహణసంకోచము తొలఁగి పోవును. స్వయంచింతన (Independent thinking) నిర్భీతి, త్రికరణశుద్ధి యేర్పడును. సంఘపరివర్తనము కలుగును.

# చిత్రకళ

మంత్రవాద వెంకటరత్నము

(చిత్రకారుడు. శారదానికేతనం)

౧

చిత్రకళ మహారాజునకుంగుబిడ్డ. అతడామె నతిగారాబముగ పెంచెను. ఆమెకాతనియందు నిండుభక్తి.

చిత్రకళా ప్రియసుతుడు చిత్రకారుడు. రాజాతని నాస్థాన చిత్రకారునిగ నియమించెను. బహుకాలమునుండి చిత్రకారుడు రాజును సేవించుచుండెను.

ఒకనాడు చిత్రకారుని సముద్రమును చిత్రింప రాజాజ్ఞాపించెను

కాలముగడచెను. చిత్రకారునకు మతివిభ్రమము గల్గినదని కొలువుకూటమున సభ్యులకు దెలియవచ్చెను. చాలకాలమునుండి రాజును సేవించు చిత్రకారునకు గల్గినదుర్దశ కందఱు చింతించిరి. తా రచించిన చిత్తరువు చేబూని చిత్రకారుడు రాజాస్థానము ప్రవేశించెను. మతివిభ్రమ మున్నటుల గోచరించుటలేదు. ఆతనిముఖమున నిర్మలానంద తేజ ముట్టిపడుచున్నది. అతనిహృదయాంతరాళమున నిర్మలములై సాగరాతీతములైయున్న విశాలభావములు దేలి యాడుచున్నవేమో.

“అతనికీ మతివిభ్రమ మేలగల్గె” నను ప్రశ్న ప్రతియువకుడును మరొకని యడుగ నారంభించిరి. కాని ప్రత్యుత్తర మొకరును ఈయజాలకుండిరి.

“మతివిభ్రమము చిత్రకారునకుగాదు. అతని నెఱుంగలేని మనుజులకని” యొక స్త్రీ కంఠరవ మారాజసౌధమును ప్రతిధ్వనింపజేసెను. సభ్యులాశ్చర్యమొందిరి.

మహారాజు చిత్రమును వీక్షింపసాగెను. చిత్తరువు "సముద్ర దృశ్యము" అదెట్లున్నది?

రాజు ముఖము నొక్కమారు చిట్లించెను. అట్టె యూరకుండి పక్కన నవ్వెను. భీభత్సరస మాతనిముఖమున పలుమారు గోచరించుచున్నది.

"సముద్రమా ఇది?" యనుచు చిత్రమును అజాగ్రత్తతోను నిర్లక్ష్యముగా క్రింద బడవేసెను. సేవకు డొకడు చిత్తరువును రాజున కందీయబోయెను గాని రాజు తీసికొనలేదు. తరువాత చిత్రము రాజాజ్ఞప్రకారము ప్రజలకును సభ్యులకును ప్రదర్శింపబడెను. సభ్యులెల్లరు నొక్కమారుగ వికటహాసమొనరించిరి. చిత్రకారునకు మతివిభ్రమమున్న దనుకొనిరి.

చిత్రకారు డొకింత మందహాస మొనరించెను. అత డట్లేల చేసెనో దెలసికొనలేక పోయిరి. మతిచాంచల్యమున కదొకగుర్తనుకొనిరి. అంతయు నిశ్శబ్దమాయెను.

"ఇట్టి చిత్తరువుల నావద్ద కెన్నడును దేవలద" ని రాజు కఠినముగ చిత్రకారున కాజ్ఞచేసెను. అందఱు నిర్విణ్ణులైరి. మరల సభ నిశ్చలమయ్యెను.

"ఈ చిత్తరువు తీసి వేయుటకు హేతువేమి? వలదు. చిత్రము త్రోయవలదు. ఎట్టి చిత్రమునైన భావహీనముగ వ్రాయుటకుచిత్రకారు డంత అవ్యక్తుడుకాడు. చిత్రమును నన్ను జూడనిండ" ని బలుకుచు త్వరితగతి నడచు రాజతనయంజూచి సభ్యులాశ్చర్యనిమగ్నులైరి.

"ఆహా! ఎంతరమణీయముగ నున్నదీ చిత్తరువు. సాగరదృశ్యమా ఇది? ఏమిసాగరము? మానవసాగరము. దుర్భిక్షసాగరము. అయ్యయో - ఎందరుకృశించియున్నారు. కృశించిన శరీరములతో

కండ్లు తిరిగి నేలకొరగుచున్నారు, మనుజుల మనుజులు భక్షించుచున్నారు. ఎచ్చట చూచినను రోదనముచేయువారె. వారిప్రక్కఎముకలు లెక్కించుటకు కూడ వీలగును. పాప మాబాలగోపాలము ప్రాణవాయువుల గోల్పోవుచున్నారు. ఈబహుజన సమావేశమున కావల సముద్ర మతి తీవ్రముగ పొంగి పొరలుచున్నది. చిత్తరువున కనుకూలముగనుండియు చూచుట కతి కంటకముగ రచింపబడినరంగు శిల్పినైపుణ్యమును దెల్పుచున్నది. ఏమికల్పనాశక్తి? ఇట్టి చిత్తరువును వ్రాసిన చిత్రకారునకా, రాజు కఠినముగ శాసించుట? చిత్రకారుడె చచ్చుట'' అని తనదృక్కుల నతిత్వరితముగ నిగిడించు చిత్రకళను జూచి సభ్యులెల్ల రొక్కుమారుదిగ్భ్రమజెందిరి. రాజూరక చూచుచు నిశ్చలుడై యుండెను. ప్రజల కిపుడా చిత్తరువు గోచరించినది. వారా చిత్రమును గ్రహించిన కొలది వారికా చిత్రకారునియందు గౌరవము హెచ్చుచుండెను. ఆకాలమున వారిదేశమునందు వాటిల్లిన కరవును చిత్రకారు డతిరమణీయముగ, కడుజాగ్రత్తగ చిత్రించెను. ఆచిత్రమున క్షామదేవత తాండవించుచున్నది. రాజు నేత్రములా చిత్రము నాకర్షింపలేదు.

* * *

౨.

కాలముగతించెను. మఱియొకనాడు రాజు చిత్రకారుని వీక్షించి ''పూర్ణిమాచంద్రు'' ని చిత్రింపమనెను.

సవినయముగ చిత్రకారుడు రాజాజ్ఞ శిరసా వహించి కొంత కాలమునకు చిత్రమును రాజు సమక్షమునకు దెచ్చెను. రాజు చిత్రమును చేతబట్టి చూచుచుండెను. తానూహించినటు లాచిత్తరువు లేదు. కాని మరెట్లున్నది?

# చిత్రకళ

బృందావనము - వివిధవృక్షములతోను, అనేకములైన లతా గుల్మములతోను, మంచిపుష్పజాతులతో నిండియున్నది. యమునా నదీ నిర్మల తరంగములు పరుగిడుచున్నవి.

శ్రీ కృష్ణుడు వృక్షాగ్రమున వేణువునూదుచున్నాడు. ఆవేణు గాన మాధుర్యమున ఉన్మత్తులై గోపిక లందఱు నృత్యము చేయుచు న్నారు. నిద్రించుచున్నారు. ఏడ్చుచున్నారు. ఆనందము పట్టజాలకు న్నారు. నిర్మలానందమూర్తి శిఖ పింఛము మెరయుచున్నది. కస్తూరీ తిలకము నుదుటదిద్ది, తలయం దడవిమొల్లలు తురుముకొని పీతాం బరధారియై పిల్లనగ్రోవిధరించియున్నాడు. ఆమూర్తి కావల నీలాకాశ మున్నది. అచట పూర్ణిమాచంద్రమండల మతిరమణీయముగ ప్రకా శించుచున్నది. మందమారుతము కూడ వీచుచున్నదేమొ. చంద్రబిం బము యమునలో ప్రతిబింబించుచున్నది. ఈ విధముగ నున్నదా చిత్రము.

రాజు దానిని జూచెనుగాని ఏమియు బోధపడలేదు. ఆతడాజ్ఞా పించినది పూర్ణిమాచంద్ర దృశ్యమె. కొని చిత్రకారుని కల్పనము మాత్ర మాతనికి గోచరింపలేదు, నీరసహృదయుడై యూరకుండెను.

సభ్యులా చిత్రపటమును చూచి యొక్కమారుగ తెలివిమా లిన నవ్వునవ్విరి.

"నవ్వవలదు. చిత్రమును పరిశీలింపుడు. చిత్రమును గ్రహించి శిల్పి నాశీర్వదింపుడు. నాకాచిత్తరువు నిండు. నేజూడవలయు" నని చిత్రకళ పటము నందుకొనబోయెను.

పట మామె చేతులం దుంపబడెను. ఆమె చిత్రపటమును నిరీ క్షించుకొలది ముఖకమలమున చిరునగవు హెచ్చగుచున్నది. "ఎంత మనోహర సృష్టి. కడురసవంతముగ సృష్టించినాడు. ఏడీ యాశిల్పి"

యని సభ్యుల నడిగెను. సభ్యు లందఱొక్కమారు చిత్రకారుని వంక జూచిరికాని చిత్రకారుడు లేడు. ఎచటకేగెను?

రాజున కెంతప్రయత్నించి చూచినను చిత్రము బోధపడ లేదు. తనబిడ్డయొక్క హృదయభావము దెలియలేక చిత్రపటము లోని గోపికవలె అట్లె యుండి పోయెను. మరల మరల ప్రయత్నించెను గాని నిష్ఫలమాయెను.

*　　　*　　　*

౩.

మఱొకనాడు రాజు ఏకాంతగృహమున కూరుచుండి శిల్పిని బిలచి "శిల్పరాజా! యీగోడనున్న చిత్రపటమును దిలకించితివా? అయ్యది సూర్యాస్తమయము యొక్క ఛాయాపటము. నీ వీతరి ఇట్టి చిత్రమును చిత్రింపవలయును. అప్పటికైన నీనిపుణత్వమే నెఱుంగలేక పోను. చిత్తరువ్వ నతిరమణీయముగ చిత్రింపవలయు" నని రాజాతని నడిగెను.

రాజాజ్ఞ శిరసావహించి చిత్రకారుడు వెడలిపోయెను. తనఏ కాంత గృహమందు కూర్చుని తదేకముగ నేదియో యోచింపసా గెను. చిత్తరువు నేవిధముగ వ్రాయుటకును పాల్పడుటలేదు. కుంచ చేబూని ఏదియొ వ్రాయ మొదలిడెను. అంతయు వ్యర్థమగుచుండెను. ఇంతలో సాయంకాల మాసన్నమాయెను.

విహారార్థము చిత్రకారుడు వనమునకు బోయెను. ఆయుద్యా నవనమం దచ్చటచ్చట విహారులకు విశ్రాంతినిచ్చుట కమర్చబడిన పొదరిండ్లున్నవి. ఆపొదరిండ్లలో చంద్రకాంతశిలాపీఠము లమర్చబడి యున్నవి.

తొలకరివానలు తెరలు తెరలుగ వర్షించుచున్నను అప్పుడ

ప్పుడు మేఘమండలమును భేదించి తనలేతకిరణముల ప్రసరింపచేయు చున్నాడు. ప్రకృతి ప్రశాంతసముద్రమున మందవాయుతరంగము లతో పరువులిడుచున్నది. అప్పుడె యొక్కమారు వర్షించి వెలసెను. సూర్యకిరణముల వలన వర్షపుచినుకులు ముత్యములై యుద్యానవ నమున ముత్యముల వర్షము వర్షించుచున్నటులుండెను. ఆ సాంధ్యరాగ సమయమున యొకజవ్వని తనయేకపుత్రునితో శిలావేదికపై కూరు చుండి బాలునకానందము గూర్చుచున్నది. ముగ్ధమోహనమూర్తియైన బాలుడు తల్లివదనమును తదేకముగ దిలకించుచున్నాడు. ఆమూర్తి నిర్మల యధరోష్టముపై లేతనవ్వు తాండవించుచున్నది. మాతృసంద ర్శన పరవశోన్మాదము ఆనేత్రద్వయమున దేలుచున్నది. పుత్రవీక్షణో త్సవమును జూచి పకృతి హర్షించుచున్నది. వృక్షములు నవ్వుచు న్నవి. ఆమహోత్సవదర్శనాపేక్షతో పడమటిదిశ మేఘావృతమైన యాకసమునుండి సూర్యుడొక్కమారు తన సాంధ్యరాగ కాంతుల వెదజల్లెను.

చిత్రకారుడు కుంచ బూని అస్తమయ చిత్రమును పూర్తిజే సెను. ఆపటమున ప్రశాంతత తేటబడుచున్నది. మాతాపుత్రుల వాత్సల్యము విశదమగుచున్నది. సహజప్రకృతి సృష్టింపబడినది. సూ ర్యాస్తమయ మతిరమణీయముగ చిత్రింపబడెను.

* * *

౪.

అంతటితో తృప్తినొందడా చిత్రకారుడు. గ్రీష్మఋతువు నంద లి యస్తమయముకూడ చిత్రింపసాగెను. కొలదికాలములో ఆచిత్రము కూడ బూర్తియైనది. అదెట్లున్నదో చూతము.

గొప్పభవనము - అందువివిధములైన చెక్కడములు - చిత్ర

పటములు అలంకరింప బడియున్నవి. భవనాంతర్భాగమునం దొక ప్రక్క గవాక్ష మొకటి తెరువబడియున్నది. గవాక్షమునకెదుట మంచ మొకటి యున్నది. భవనమునుండి గవాక్షమునకు దృష్టిసాచినచో నొకనది - ఆవలకొండవరుసలు - అటుపై నాకాశము గోచరించును

ఆ వేసవికాలపు సాంధ్యవేళ రక్తసిక్తమై దేహమునందంతటను గాయములతో సేనాధ్యక్షుడొక సౌధమును ప్రవేశించెను తోడనె మంచముపై బడిపోయెను. మరల లేవలేదు. క్రమక్రమముగ దేహము శుష్కించుచున్నది. శక్తి విహీనమగుచున్నది. ముఖము ముడతలు పడుచున్నది. కన్నులు దిగుచున్నవి. చూపులు నిలుచుటలేదు. చేతనున్న కృపాణ మంతటనె జారి నేలబడుచున్నది. రక్తము గాయములనుండి స్రవించుచునేయున్నది.

సైనికుని ప్రియపత్ని భర్తకు ఔషధసేవ చేయుటకు ఔషధము చేబూని ప్రియుని నోట పోయబోవుచున్నది. కానిపోయలేదు. ఆతని చెంతకూర్చుండి ముఖమును జూచుచున్నది. ఆమె కేమియు దోచుట లేదు. ముఖమున నతి చిత్ర విచిత్ర భావములు పొడలుచున్నవి. భర్త అకాల మరణవేదన జూచు భార్య ఎట్టి యవస్థయందుండునో ఆమెయు నట్టిదశ యందె యున్నది. దుఃఖపూరితమగు నామెభావము వ్రాయుటకు వీలుగాకున్నను పటమునందలి యామెముఖమున చిత్రకారుని కుంచ వ్రాయగల్గినది.

సైన్యాధిపతి ముఖమునకును - ఆతనిసతి ముఖమునకును నడుమ వారిబిడ్డ, వినిర్మలహృదయభావ మూతని నేత్రద్వారముల గోచరింప, ఒకపరి తండ్రి ముఖమును మరొకపరి తల్లి ముఖమును చూచుచున్నది. ఆబాల కేమియు బోధపడుటలేదు.

గవాక్షమునుండి చూచుచో భయంకర యుద్ధభూమి కాన్పిం చును. రక్తము కాల్వలుగట్టి ప్రవహించుచున్నది. పీనుగులు కుప్పలు వేయబడుచున్నవి. తెగిపోయినశిరములు నదీప్రవాహమున కొట్టుకొని పోవుచున్నవి. సూర్యుడు క్రుంగిపోవుచున్నాడు. భూనభోంతరాళములు ఎఱ్ఱగ ప్రకాశించుచున్నవి. గగనకాంతులు నదిని సహితఎఱ్ఱగ చేసి నవి. యువకుని గుఱ్ఱము గుండుదెబ్బచే నేలకొరగుచున్నది. ఘనం చీకట్లు నలుదిసలక్రమ్మినవి. యువకుని ప్రాణవాయువులు ఎగసిపోవు చున్నవి.

*   *   *

౫.

రెండు చిత్తరువ్వుల దీసికొని రాజుసన్నిధికి చిత్రకారుడు చెడ పోయెను. రాజు సమయమున ఏకాంతగృహమున విశ్రమించియుం డెను. చిత్రకారుని పటములను జూచెను. మొదటి చిత్రము చూచున ప్పటికి అతని ముఖము ప్రశాంతముగ నుండెకాని చిత్రము బోధప డలేదు. ఇక రెండవ చిత్రము చూడబోయెను. నేత్రము లెఱ్ఱవారెను ముఖము కందెను. అతనిచూపు లతితీవ్రగతి బొందెను.

"నిజముగ నీకీ మతివిభ్రమ మున్నదని ఇంతవరకు నే దలచ లేదు నీవిభ్రమము మితిమీరిపోయెన" నని రాజు జాలిగల్గు మాటలతో వాక్రుచ్చెను.

చిత్రకారున కేలనో పట్టరానినవ్వువచ్చినది. అతడు దాని నాప లేక నవ్వసాగెను.

రాజింక నొకనిముసమైన నిలువక "దూరముగబొమ్ము. నావ ద్ద కెన్నడు మరల రావలదు. ఇట్టి చిత్రముల రచించు నీవేటి చిత్రకారు డవు? నాయాస్థానమున నీ కింక తావులేదు. ఆవలకుబొమ్మని" తీవ్ర

# చిత్ర వివరణములు.

—:0:—

1. గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు :— వీరి వాసస్థానము కర్నూలుమండలములో చేరిన ఎఱ్ఱగొండపాలెము (దిగువపాలెము) వీరు కొంత కాలము గద్వాల సంస్థానకవులుగాను, దైవము దిన్నె శ్రీరామారెడ్డిగారి యాస్థాన కవులుగా నుండిరి. వీరు సంస్కృతాంధ్ర భాషలయందు "శతావధానములు" పెక్కు పట్టణములలో నొనర్చిన లబ్ధప్రతిష్ఠులు, ప్రస్తుతము నంద్యాల సంస్కృత పాఠశాలలో నుపాధ్యాయులుగా నున్నారు. శ్రీమదహోబిల మహాత్మ్య మాంధ్రీకరించిరి. కర్నూలు జలప్రళయము మున్నగు పెక్కు గ్రంథములు వ్రాసియున్నారు. ఈ ఈ పత్రికయందలి "భారతమాత" అను వ్యాస కర్తలు.

(2) అనుముల వేంకటశేష కవిగారు :— వీరు నంద్యాల కాపురస్థులు. ఆంధ్ర భాషలో సరసమైన కవితఁ జెప్పఁగలరు. అష్టావధానులు. "అభినవ తారాశశాంకము" అను నాటకము తన 18వ వత్సరముననే వ్రాసిరి. స్వీయ "సుఖము" మున్నగు పెక్కు గ్రంథములు వ్రాసి యున్నారు. ప్రస్తుతము నంద్యాల మునిసిపల్ మహామడన్ మాధ్యమిక పాఠశాలయం దాంధ్రోపాధ్యాయులుగా నున్నారు. ఈ పత్రిక యందలి "రవివర్మ" "కవితా నిరూపణము" అనువ్యాసములకు కర్తలు.

3. గౌరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రిగారు :- వీరి జన్మస్థానము బాపట్ల. నెల్లూరు మండల మందలి అనంతవరాగ్రహారము వాసస్థానము. (రామకృష్ణ సుబ్రహ్మణ్యకవుల) లో నొకరు వీరిర్వురు బాపట్ల శంకర విద్యాలయమందును శ్రీ కురుగంటి పిచ్చయ్యశాస్త్రిగారివద్దను గీర్వాణ భాషను పఠించిరి. వీరు బ్రహ్మశ్రీ, తిరుపతి వేంకటేశ్వర కవుల శిష్యులు. పెక్కు పట్టణములలో శతావధానము లొనర్చి సువర్ణ పతకముల నందిరి. వీరు శ్రీరామనిర్యాణము, కలిచర్యా, ఇందుమతీపరిణయము, నీలాకల్యాణము, (హాస్య కథలు మున్నగు గ్రంథములు రచించిరి. ప్రస్తుతము "కృష్ణబోధామృత" మను ప్రబంధము వ్రాయుచున్నారు. సహపాఠి సుబ్రహ్మణ్య శాస్త్రి స్వర్గస్థులగుటచే వీరు తమ సోదరులగు సీతారామశాస్త్రిగారు (రామకృష్ణ సీతారామ సోదర కవులు) కలిసి గ్రంథములు వ్రాయుచున్నారు.

(4) కీ॥ శే॥ అక్కిపెద్ది సుబ్రహ్మణ్య శాస్త్రి గారు :—వీరివాసస్థానము గుంటూరు జిల్లాయందలి కశ్యాపురము. (రామకృష్ణ సుబ్రహ్మణ్య కవుల) లో నొకరు. శతావధానులు; వీరు క్రోధన జ్యే॥ శు॥ 3 సోమవారమున శరీరరుగ్ణతచే బాపట్లగ్రామంబున స్వర్గస్థులైరి.

గారా వఝ్ఝల సీతారామశాస్త్రిగారు :— వీరు శ్రీరామకృష్ణశాస్త్రిగారి సోదరులు. (రామకృష్ణ సీతారామ సోదరకవులలో) నొకరు. ఈ పత్రికయందలి "ఆంధ్రభాష, వసంతగ్రీష్మఋతువులు, శ్రావణలక్ష్మి" అను వ్యాసములు రచించినారు. ప్రస్తుతము, నంద్యాల మునిసిపల్ హైస్కూలునందు ఆంధ్రోపాధ్యాయులుగా నున్నారు. వీరి జన్మస్థానము అనంతవరాగ్రహారము. వీరు "బాలనీతి, వేంకటేశ్వర శతకము" మున్నగు విద్యాశాఖాధికారులచే నామోదింపఁబడిన గ్రంథములను వ్రాసియున్నారు.

(6) యం. సి. కణ్ణశ్రేష్ఠిగారు :— వీరి జన్మస్థానము తిరుత్తణి; వాసస్థానము చెన్నపురి. వీరు రబ్బరుస్టాంపు వ్యాపారాధ్యక్షులు. "హిందూ శ్రీ" పత్రికకు సూత్రిచతురులు, ఉదారులు.

(7) డాక్టర్ పి.ఆర్.జే. సుంగరంగారు :— వీరు మధుర తిరుమల్ నాయక్ వంశీయులు. ప్రస్తుత వాసస్థానము నంద్యాల. వీరు ఆయుర్వేద, యూనాని, ఇంగ్లీషు, హోమోపతిక్ చికిత్సయందలి నిపుణులు. ఆయుర్వేద వైద్యశిఖామణి పరీక్షయందారి తేరినవారు. శ్రీ పండిత గోపాలాచార్యులవారి శిష్యులు. వీరు నంద్యాల ఆనరరి మేజస్ట్రేటుగాను, తాలూకుబోర్డు మెంబరుగాను, సెషన్ జూరి, అస్సెసర్ గాను యున్నారు. ప్రస్తుతము మహానందియందు ఆయుర్వేద కళాశాల రు. 50,000 లు వేల రూప్యములతో పెట్టించవలయునని ప్రయత్నించుచున్నారు. వైద్యమునందు పెక్కు యోగ్యతా పత్రికలు పొందియునారు.

(8) పాలపర్తి - సూర్యనారాయణ రావుగారు :— వీరు ఆంధ్రభాషయందు సరసమైన కవిత్వముఁ జెప్పగలరు. వీరు హిందీ భాష నుండి మేవాడ్ పతనము మున్నగు నవలలాంధ్రీకరించిరి. ప్రస్తుతము చాగలమఱ్ఱియందుపాధ్యాయులుగా నున్నారు. ఈ పత్రికయందలి "దృఢచిత్తము" అను వ్యాసమునకు కర్తలు.



# హిందూశ్రీ

## మాసపత్రిక.

1 వ సంపుటం | 1927 సం॥రం జూలై నెల 1 తేది | 1 వ సంచిక

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

## = ఆశీర్వాదము =

బ్రహ్మశ్రీ కావ్యతీర్థ' మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
(కవితాసామ్రాజ్యము, నంద్యాల)

---

క. పొందిక మైన వ్యాసంబుల,
నందం బై చిత్తరువుల, నానందం బై
సందర్భవిషయముల నీ
"హిందూశ్రీ" వెలయుఁ గాత సర్వేశుకరుణన్.

శా. లోకంబందున నెన్నిపత్రికలొ వెల్గున్ వేలు గాఁ బుట్టు చే
కై కాహంబున కంతరించుటయుఁ బ్రత్యక్షంబ యాంధ్రంబునన్
శ్రీకృష్ణానుపమప్రభావమున నీరీతిం బ్రచారింప క
స్తోకస్వాస్థ్యమునన్ మెలంగుతను హిందూశ్రీ యథాకాలమున్.

మ. పురుషుం దీఱక కొన్ని, కొన్ని నెలలుం బూర్ణంబు గాకుండ, వ
త్సరముల్ నిండక కొన్ని, యొండ్లుచని నిస్తంద్రంబులుం గొన్ని, ద
త్తరసామండలిఁ బత్రికల్ వెలయ నుత్సాహించు నాబ్రహ్మ బం
ధురదీర్ఘాయువు నీఁదలంచుతను "హిందూశ్రీ"కి నైనం గృపన్.

---

# విజ్ఞప్తి

ఆయువు నానాట వృద్ధి బొందుచున్నదనియు, కొందరు నానాట క్షీణించు చున్నదనియు, వృద్ధి క్షీణములకు మానవుడే కారణమనియు, వాద ప్రతివాదములు జరుగుచున్నవి. ఈ వాదప్రతివాద తార్కాణముల మధ్య యే కొంతకాలమో ఈశ్వరసేవయో! ముముక్షుర్ధ రహస్యమో! దేశసేవయో! సంఘసేవాభి వృద్ధియో స్వార్థ పరత్యాగముతో సాధించిన విజ్ఞానశక్తి యొకింత మాత్రము ఫలించునని పెద్దల వాక్యము.

కాలానుగుణ్యముగా, దక్షిణ మండలమందును ఆంధ్రదేశమునందంతట అనేక పత్రికలు ప్రకటించు చుండుట విదితమె. ఇన్ని పత్రికలు దేశసేవ జేయుచుండ వానికే తగువసతిలేమి పడరానియిడుమలఁబడి స్వార్థత్యాగముతో సాధించుచుండు పత్రికాధిపతులధీరత కడుశ్లాఘనీయము.

మా "హిందూశ్రీ" మాసపత్రిక కొలది సంవత్సరముల నుండియు దేశసేవ చేయుటకై ప్రయత్నపడి తగు సహాయము లేమి ముందంజ వేయుచు వెనుకంజ వేయుచు నితర పత్రికా పుత్రికలను చూచినప్పుడంతయు నువిల్లూరుచు తనయల్ప జ్ఞత్వమునకు కొంత కుందుచు "స్థిరప్రతిజ్ఞః కురుతే ప్రయత్నం యత్నేకృతే సిద్ధ్యతి కార్యజాతమ్" అనువాక్యము స్మరించుకొనుచు కొంతకాలము గడపెను.

కొలదిమాసముల క్రిందట ఇంద్రావతి సాధనాది తోడిచెలియండ్రతో మనవిఁ జేసికొనినది కాంభోలు తన చిన్నిశ్లోకమునకు మారుగా "షడ్భిర్మాసవయత్నా నాం సప్తమం దైవచింతనం" అనువాక్యమును స్మరించుకొనుచు కొంత ధైర్యసాహసములతో దేశసేవ చేయుటకై బయలు దేరినది.

భాషాభిమాన మహాశయులారా! ఈ పత్రికాపుత్రికకు పాఠకమహాశయులందఱు సోదర సములు. పోషక మహాశయులందఱు జనకసములు. వ్యాసకర్త మహాశయులందఱు గురుసములు. ప్రకటన విషయవిధాన సత్యాసత్య నిర్ధారణవిచక్షణు లందఱు బాంధవులు. కావున నీపత్రికాసుపుత్రికను రక్షించుభారము భారతీయులదియే. ఏతత్పత్రికాపోషక స్వాములసేవాభాగ్యములభించి నందుల కానందించు మీసేవకులు.

వి. ఆదిశేషు, నిత్యానంద. | ఎం. రామసుబ్బయ్యశ్రేష్టి, ప్రొప్రైటరు. | మునికోటి శ్రీనివాస అభయానంద గీతాత్రిపాది.




బ్రహ్మశ్రీ శతావధాని గాడేపల్లి. వీరరాఘవ శాస్త్రిగారు (కవితాసామ్రాజ్యము నంద్యాల.)

శ్లో. సుజలాం సుఫలాం సౌమ్యాం సస్యశ్యామలకోమలాం,
నిత్యైకసత్యదాం శాంతాం వందే భారతమాతరమ్ ॥.

సీ. భృకుటిమాత్రంబున ♦ సకలశత్రుక్ష్మాపాలుర నడుము భూ ♦ పాలురుండి
కల మెత్తినంత దు ♦ ర్గర్వసర్వారాతి బలమడంపఁగ గవి ♦ బ్రహ్మలుండి
తలఁచినంతనే కులా ♦ చలసంచయంబైన నలచివైచెడు ముని ♦ నాథులుండి
అలిగిన విలయరు ♦ ద్రాకారులై జగత్త్రితయంబు మ్రింగెడు ♦ ధీరులుండి

తే.గీ. కాలవశమున బడువాట్లు ♦ గాంచినావు
మంచిరోజులు నివె యరు ♦ దెంచె నమ్మ
నీదుసుతులకు ధైర్యంబు ♦ నెఱపవమ్మ
పరమసుగుణావలంబ శ్రీ ♦ భారతాంబ

ఉ. శ్రీరమణీవిలాససర ♦ సీరుహమై భవదీయమంగళా
కారము విఱ్ఱవీఁగుతఱి ♦ కట్టడి సూనులు పుట్టి నీయసా
ధారణకీర్తి మాపి రని ♦ దైన్యముఁ జెందకు మమ్మరో! నమ
స్కారముపూర్వరీతు లికఁ ♦ గాఁగల వన్నియు దేశమాతరో!!

చ. జరగిన యున్ని నాళ్ళవలె ♦ సర్వులు కన్నులు మూసి పూర్వపుం
జరితల నేటఁగల్పఁగల ♦ సాహసు లౌదు రటంచు ఖేదముం
దొరలఁగనీకుమమ్మ విబు ♦ ధుల్ సుపథుల్ శపథంబు దాల్చి రీ
సిరులు నిరంతరాయములె ♦ సేమము గాంచుము దేశమాతరో.

# గీతా ప్రశంశ.



భగవద్గీతారహస్యమును ఇదివరలో శంకరులవారు మొదలుకొని భాష్యాచార్యులవరకును టీకా తాత్పర్యవిశేషార్థములతో వ్రాసియున్నారు. త్రిమతస్థులు త్రివిధములగు అర్థములు వ్రాసినను వారిఅనుభవమున సూత్రములయందు వారుట చూడగా నిశ్చయముగు వేదరహస్యమునకు తోడ్పడు కర్మ జ్ఞాన రహస్యముల కాధారముగ చెప్పినటుల తెలుచున్నది.

ప్రకృతము కొంతకాలముక్రిందట బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యస్వాములవారు (తిరువాన్కూరు సంస్థానపు దివానులుగానుండినవారు) గీతారహస్యమను పేర మూడువిధములగు పుస్తకములను రచియించి కీర్తిపురుషత్వమును వహించినారు.

కీ॥ శే॥ బాల గంగాధర తిలకుగారు గీతారహస్యమును అనుభవార్థములతో చేర్చి అనర్గళమగు అనుభవమున కర్మరహస్యమును, జ్ఞానరహస్యములను, విభూతిరహస్యమును, సన్యాసరహస్యమును వెల్లడించి లోకమున కెంతయో యుపకారమును జేసియున్నారు. కాని! వేదరహస్యమగు మూడవపాదమగు గీతారహస్యమందలి నిజమగు అర్థమును కొంత విచారించవలసియున్నది.

ప్రథమమున వేదములును, వేదములనుండి వెలువడిన ఉపనిషత్తులును, ఉపనిషత్తులనుండి గీతలుగను తరువాత శ్రుతిస్మృతి పురాణ శాస్త్రములుగా, వేదభాగములనుండివిభజింపబడి మానవ ప్రపంచమునకు సులభశైలికి తేబడెను. మూడవ పాదమగు గీతలయందు ప్రతిఅధ్యాయాంతమున "ఉపనిషత్సుగీతాసు" అని ప్రయోగింపబడెను. కాన వేదములనుండి యుపనిషత్తులుగా మారుటకు కారణమేమి? ఉపనిషత్తులనుండి గీతలుగామారుటకు కారణమేమి? ఈ విషయములను ఆలోచించిచూడ వేదభాగములు అతి సూక్ష్మగ్రాహ్యములనియు అజ్ఞానావస్థచే ఆవరింపబడిన జీవుని జ్ఞాతృభావశక్తి అనుభవమునకు తోడ్పడదనియు అందలి భాగములు విచ్ఛిన్నముగ విభజించి ప్రపంచానుభవమునకు సాక్షి చేయుటకై ప్రయత్నించబడినదని తేలుచున్నది.

శబ్దార్థము నొకింత విచారించినయెడల వేద శబ్దమునకు విద్ :—ధాత్వర్థము. ఉపనిషత్తునకు "అసీత్యర్థసాక్షి చైతన్య ఉపసాధన" మితి ప్రయోగం. గీతాయాం, గం తంపవా దితిగీతా (ఉత్తరసాంఖ్యాం) అనగా? నిత్యపరిపూర్ణ సత్యత్వమునుండి ప్రకృతిమాయావరణ తత్త్వమునకు తేబడిన జీవసాక్షాత్కార రహస్యమును మరల జ్ఞాతృత్వమునకు నిలుపుకొనుటకై సూచించిన "అసిత్యర్థ" రహస్యమనియు అందునుండి ఆవరణశక్తికిలోబడిన అజ్ఞానమును జ్ఞానావస్థకు మరల్చుటకై చూపింపబడిన రహస్యములను తెలుపునది "గీత" యనియు ప్రతిపాదింపబడినది. కనుకనే కర్మనుండి ప్రారంభించబడి కర్మరహస్యములు వెలిపుచ్చు జ్ఞానకర్మ రహస్యములతో ముగించబడినది

వేదము సత్యము. ప్రపంచము సత్యము. సర్వము ఈశ్వరస్వరూపము. అందు అజ్ఞానావస్థచే ప్రకృతి సత్యత్వము స్థిరపరచలేమి అసత్యమనియు అజ్ఞానమనియు లేని పోని దారుణములు గల్పించుకొని తార్కాణమున కంతరాయమగు ఆంతర్వ్యవస్థలలో తర్కించి తర్కించి

తుదకు సత్యము తెలిసినమాటనే సమత్వముస్థిర పడును గాన, శ్రీ సర్వులయొక్క పరిపూర్ణ పీఠాధిప తులగు శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ సత్యానందపరమహంసాత్ర స్వాములవారిచే ఆజ్ఞాపింపబడి కృత, త్రేత, ద్వా పర యుగములనుండి పరంపరగ నడచుచుండు (అనగ పూర్వము ప్రతి బాలుడును తన 8వ ఏట నుండి మఠములను ఆశ్రమములను చేరి 24సంవ త్సరములవరకును కర్మ, జ్ఞానాది మోక్ష సన్యా సమువరకు గురుసేవచే గ్రహించి, అచ్చటనుండి వారిసెలవుపొంది 6 సంవత్సరములు దేశాటన ముచేసి, తనస్వగృహమునుచేరి గృహస్థాశ్రమ మున వేదవిదులై జ్ఞానకర్మాదుల సంసారసుఖముల ననుభవించి తన 80 వ యేట (లేక తన అంతరాయమునకు 12సం॥లు నిలుచుట తెలసి ఏతత్ పూర్వము సంప్రదాయ పొందిన సన్యాసా శ్రమధర్మమును గృహమునుండియే స్వీకరించు విధి) కర్మమును కర్మజ్ఞానమును జ్ఞానకర్మమును అంతమునకు ముముక్షుత్వసాధనమునకుతగు రీతి ప్రతియొక శ్లోకమునకును అయిదర్థములతో ప్ర పంచమునకు వారి వారిశక్తి కొలది విజ్ఞానమును సాధించుకొనుటకు వీలగునట్లు మొదటి అధ్యాయ ము తయారగుచున్నది. అందలి ఉదాహరణ మునకై యొక శ్లోకము ఇందు ఉదహరింపఁ బడుచున్నది.

తత్త్వసృష్టి.

ఓం.

తారకప్రథమపీఠము—గీతాః = గంతవ్యాదితిగీతా

తారకపూర్వపీఠము—గీతాః = గత ంస్యాగతమితి గీత

సాంఖ్య ప్రథమపాదము—గీతాః = త్యాగాదితీవ, గీతి

సాంఖ్యవృత్తరపాదము—గీతాః = తెం గంతవ్యాదితి, గీత

బీజసాంఖ్యం—2.7=27 తత్వములకు అధికారి. సాంఖ్య రహస్యం—7+2= సూక్ష్మసాంఖ్యాధికారి. 2+9, 3+9= లింగశరీరం. 4 అంతఃకరణ చతుష్టయము. లు, జ్ఞాతృ 1, 23

ఆ-మనస్క-ము గం-షణ్ముఖి, తం-భూచక్రం, ఈ-శక్తిస్వరూపం, అ-ప్రణవ బీజ ప్రథమాధికారం గీతాః గీతా= తప

ఓం శాంతి, శాంతి, శాంతిః

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే। సమవేత యుయుత్సవః॥

దృష్ట్వాతు పాండవానీకం। కిమ కుర్వాతు సంజయ॥

(సశేషము)

శ్రీమన్నారాయణాయనమః.

# "హైందవశ్రీ"

## స్వాగతము.

బ్రహ్మశ్రీ వేలమూరి జానకిరామశాస్త్రిగారు. (పుల్లారెడ్డిపల్లె కంభం తా॥

---

మ. ఘనతం జెంది పురాపురాతనకథా ♦ కాండంబులో మోదనం
జనకంబయ్యు జగత్ప్రియమ్మన గడుః ♦ సంచారముంజేయుచుః
జనవాత్సల్యముకేని ప్రాపగుచు ని ♦ చ్ఛాభివృద్ధిమాహైందవం
బనుకన్యామణిశ్రీ విశ్వమందుబుధగే ♦ యం బొచు వాసించెడిః.

తత్త్వశార్దూలమాలిక.

బాలారిష్టములెన్నియో కలిగి చె ♦ ప్పఁరాని దోషంబులం
గోలంజెందుచు మాసముల్ ఋతువులుం ♦ గొప్పైన సంవత్సరం
బైలాలిత్యము గొల్చుచుండి కడు న ♦ ల్పాయుస్స్థితిం బత్రికా
బాలాజాలము దత్తమండలమునం ♦ బ్రస్తావనల్లేకయే
తూలం జూచుచునుంటి మిప్పటికి "హై ♦ ందవశ్రీ" భవత్కీర్తి వి
ద్యాలావణ్యము స్వీయసౌఖ్యగుణ వా ♦ ర్తానందకందంబుగా
వాలాయమ్ముగ సత్యమార్గకలనా ♦ వ్యాపారపారీణవై
లీలాతాండవ సుందరప్రభల బా ♦ లిశామీర జాతి ప్రమా
కాలాహిం దిగద్రమింగి నవ్యకవితా ♦ గౌరవ్య దివ్యప్రభః
వీలైనప్పుడు దేశసేవకును సం ♦ విస్ఫూర్తి యత్నించి యా
కాలంబందున నింపు సొంపుగను వా ♦ క్యశ్రీలఁ జెన్నొందిదు
ర్శీలాధ్వంబును మాని జ్యోతిషకళా ♦ చిత్రప్రభాయుక వె

సౌలభ్యంబుగ వేదశాస్త్రముల వి ♦ న్యాసంబుఁ జేకూర్చి యీ
వీలోకంబున సర్వకాలము కళా ♦ వృద్ధిం బ్రశంసింపఁగా
నాలోకింపఁగ నెల్ల వారలకు బ్ర ♦ హ్మానందముం గొల్పి యే
వేళ న్నిన్ను గనంగ ధర్మములు హ్రా ♦ ద్వోధిక్ లసత్కాంతితో
లీలన్నిల్చి జగత్ప్రసూఘతను బా ♦ లిక్ మీఱ బోకార్చి చ
ర్చాలావణ్యము నప్రతర్క్యముగఁ బా ♦ రావార గంభీరతాఁ
వేలానిస్సరణ ప్రమాణకలనా♦విఖ్యాతచైతన్య తే
జోలాలిత్యము జూపవే నెరపవే ♦ సూక్తి ప్రభాగీతముల్
బాలజ్యోతిష వృద్ధవైద్యముల తే♦వర్ణించి నెల్లపుడుల్
హేలాలీలఁ జరింపుమా నిరతముల్ ♦ ప్రేంబుద్ధి నీయొంటఁ బో
దోలంగావలె నెప్పటప్పటికి స ♦ ద్యోధర్మమర్మక్రియా
కాలవ్యాప్తియె నీకు శ్రేయముసుమా ♦ కల్యాణచిహ్నాంబగుం
మాలం జేయు మధర్మబుద్ధి మది "హిం♦దూశ్రీ" కళాపత్రికా.

క. పొందుగ "ప్రభవాబ్దంబున" "హిందూశ్రీ" జననమయ్యె♦ నెంతే మోదం
బందింపగ డీకొను. నే, సందేహము లేదు దేశ♦సంసేవ కిలన్.



## రవివర్మ (1897—1906).

అనుముల వేంకట శేషకవి (కవితాసామ్రాజ్యము) నంద్యాల.

భారతదేశము మొదటినుండియు కళాప్రాగల్భ్యము నకుం బుట్టినిల్లు. ఎందరు చిత్రకారులో-ఎందరుకవులో-ఎందరు శిల్పులో—ఎందరుగాయకులో, తెల్పుటకు నేటియల్పరకు మనకు చరిత్రజ్ఞాన మించుకయు నుపయోగకారి గాంజాలదు. కాలము వెంట కర్మమును, కర్మమువెంట మన శ్రద్ధలేమియు—జాలవఱకు హానిచేసినను నిప్పటికి మన చిత్రకారులనుగూర్చి శిల్పులనుగూర్చి తెలుసుకొనుటకు మన దేవాలయములయందును రాచనగరుల యందును, చెక్కడపు పనులయందును, వలసినంత సాక్షిక సామగ్రి కలదు. ఒక్కొకసారి కళావిషయమే దేశమున నశించినటులుండెడిది. కాని వెంటనే యెవండోయొకండే కవిత్వమో - శిల్పమో - చిత్రకారకమో నేర్చికొని పూర్వవైభవమును స్మృతికిం దెచ్చుచుండుట తటస్థించుచున్నది. అట్లు చిత్రకారకవృత్తిం బనిలోం దలయెత్తి ప్రసిద్ధిజెందిన వారిలో సురేంద్రనాథగాంగులీ, అవనీంద్ర నాథ టాగూరు, మెహతరు, రవివర్మయు నగ్రగణ్యులు.

అందు మనమిప్పుడు రవివర్మను గూర్చి తెలిసికొందము. రవివర్మ కళాప్రవీణత జీవితపర్యంత మెన్నండును దరిద్రతా పిశాచముతోం దగవులాడినమైన నెఱుంగడు. గొప్పగొప్ప కళా ప్రవీణుల నెవరినైనం బరికింపుడు! సాధారణముగా వారి ధీశక్తికి బద్ధవిరోధియగు దరిద్ర దేవత వారి నాశ్రయించియే యుండును. గొప్పవారి దారిద్ర్యము సారస్వత లోకమునంగల ముఖ్యమగు తమాషాలలో నొకటి. కాని వారిలోం గొందఱైనను చాలవరకదృష్టశాలురగు వారుండకపోలేదు. అట్టి వారిలో రవివర్మ యొకడు.

రవివర్మ 1848 సం॥ తిరువాన్కూరు రాజ్య ముఖ్యపట్టణమగు తిరువేంద్రమున కుత్తరమున ననేకయోజనముల దూరములోనున్న కిలిమనూరను గ్రామమున జన్మించెను. అతని కుటుంబ మాదేశ చరిత్రలో మిగులం బ్రసిద్ధిం జెందినది. గౌరవనీయమైనది. కొన్నాళ్లకుం బూర్వమా కుటుంబము వారా దేశములోం గొంతభాగమును బరిపాలించిరి. విద్యావిషయిక కృషిలోం దిరువాన్కూరు కడు ప్రసిద్ధి వహించినది. కాని, మొట్టమొదట కిలిమనూరే యీవిషయమునకు పీఠస్థానమని చెప్పనగు. ఎట్లయినను నట మిక్కిలి గర్వింపదగినదియు, విచిత్రమయినదియు నగు విషయమొండుగలదు. క్రమముగా రవివర్మ దేహనాళముల నెప్పుడెయ్యది ప్రవేశపెట్టబడెనో యేతత్కళాకుశలతలోని భాగ్యవంతములగు రక్తనాళములు మొదటనుండియు నతని కుటుంబ సామాజికులలోం బ్రవహించుచునేయుండెను,

రవివర్మతల్లి స్వయముగాం గొంతవరకుం గవిత్వములోను, చాలవరకు విద్యావిషయిక కృషిలోను బ్రవేశముగలది. అతని పినతండ్రి రాజవర్మకూడ నొక విధముగ మంచికళాకుశలుండు. అప్పుడప్పుడు రవివర్మ యతని పనినిగని పెట్టి చూచుచుండెడివాండు. అప్పటికింకను నాంగ్లభాషయంత వ్యాపకమునలేమి నతండు బాల్యములో సంస్కృత పాఠశాలలో బ్రవేశించెను. ఇతర బాలురవలె నతండు తరగతి పాఠములగమనింపక పుస్తకములావలం బారవైచి యెప్పుడును గోడలపైబొమ్మగీతలు గీయుచుండెను. ఇట్టి విద్యార్థి దశ ననుసరించి యింక రాబోవు నదృష్టమును నిర్ణయింప దలచుటకంటె బుద్ధిహీనమగు పని వేరొకయుండదు. ఇదిగాక వంశక్రమాగతమగు మఱియొక కథగలదు—అది కథయేయగుగాక-తప్పక వ్రాసియుంచందగినది. రాజవర్మ (అతని పినతండ్రి) యొకానొక సమయమున నొక చెట్టును చిత్రింపం దొడగెనట! అతండు సగము వ్రాసి యావలకేగగనే రవివర్మ యందుం బ్రవేశించి దానిపై నొక చిలుకను రచించెనట! ఆ చిలుకవలన చెట్టుగూడ చెడిపోయి యుండునని నానమ్మకము; కాని, రాజవర్మ యాపిల్లవాని కుతూహలమును దీసివైవంజాలక పటము నున్నదున్నట్లే ముగించివైచెనట! చిత్రము నశించినను కథమాత్రమిప్పటికిని మనహృదయములలో నాటుకొనియే యున్నది.

1862 సం॥ అతనికి చాలముఖ్యమైనది. (eventful) అప్పుడతనిపినతండ్రితో నతండు తిరువాన్కూరు మహారాజును దర్శింపంబోయినపుడు 14 వత్సరముల వయస్సు. విద్యార్థిదశలో నున్న యాకుమారునకు పినతండ్రి మహారాజు పరిచయమును గలిగించెను. రాజుగారతనిని మెచ్చుకొని యతనికొక రంగులపెట్టెను బహుమానముగ—(అది 1862 సంవత్సరము నందలి రాజబహుమానము.)—నొసంగెను. కాని, బహుమానమున కది తగిన సమయముకాదు. ఈ కాలపు పరిస్థితులను బట్టి యిప్పటి కత్యంతమనోహరమగు నా రంగులపెట్టె చాలవిలువగలదనుటకు సందియము లేదు. రవివర్మ మాత్రమట్లు తలంచియుండండనియే నా యభిప్రాయము.

తర్వాత కొంతకాలమున కట్టి దివసమొందు లభించెననుటలో నాశ్చర్యమేమియు లేదు. ఐనను రవివర్మ ఆ పెట్టెల నింపనిచో చాలవరకింకను నభివృద్ధి జెంది యుండవలసినవాడు ఇట్టి సందర్భమున

* Full many a gem of purest ray serene
The dark unfathomed Caves of Ocean bear

గీ॥ సాంద్రదినకర కిరణంబుసరణి ధరణిఁ
బ్రబల కాంతిఁ దనర్చెడి వజ్రవితతిఁ
గలిగియుండును గాఢాంధకార బంధు
రాబ్ధి యందలి గూఢ తరంగసమితి.

* అని గ్రే (Grey) వచించియున్నాడు

పినతండ్రి, లేక తనకుటుంబములోని యితరులయట్లుఁ గాక రవివర్మ నారంగుల పెట్టె సహజ కళాకుశలతనుండి తప్పించెను. ఇంతకుముందాతఁడుపయోగించు వానికంటె భాగ్యవంతములును—రసాయన శాస్త్ర పద్ధతిప్రకారమొకదాని నొకటి కలుపుటవలన నేర్పడినవియు నగు పలు తెఱంగుల రంగుల వంక కాతని దృష్టి నారంగుల పెట్టె మరలించెను. ఒక పద్ధతి నవలంబించుటయు—దాని వలన ననేకములగు రంగులు సృష్టింపఁదలంచుటయునొకటినై నొకటి యభివృద్ధికొరకేర్పడిన దివ్యసోపానములు

పూర్వాచారములింకను నగ్నముగాని విషమసమయమున—రవివర్మ కారంగుల పెట్టె కడుస్వల్పముగా గనపట్టెను. స్వల్పవిషయములే యాకాలమునందలి ముఖ్యవిషయములు హిందూధర్మ రహస్యముల లోకమునఁ దెలుపుటకు రవివర్మ పాశ్చాత్యపద్ధతుల రంగులుపయోగింప నిశ్చయించెను. ఈ కోరిక యెంతవరకు విజయమందుటచే నుపకారమేర్పడెనో విచారింతము.

ఏడేండ్లవరకును రవివర్మ నీళ్లరంగుల (water colors) తో నీదులాడెను. ఈమధ్యకాలములో నతనిచిత్రమేదియు ప్రచురణకు రాలేదు — అనగా నతడేదియు నితరులచేతులకెక్కునట్లొనరింపలేదు. ఆతనికేవిధముగాచూచినను సరియైనశిక్షణము లేదు. ఏమివ్రాసినను నతనికతడే మెచ్చుకొనుటయో నిందించుకొనుటయో యొనర్పవలసియుండెను. 1865 సం॥రము తిరువాన్కూరు రాజకుటుంబమునకుచేరిన యొక స్త్రీ నతడు వివాహమాడెను; భావిభాగ్యమున కిదియొక గుర్తుగానుండెను. అతడు రాజనగరిలోనే యుండుట కలవాటుపడి యచటి చిత్రకళాసౌందర్యమును రుచిచూడఁజొచ్చెను.

1868 వ॥ తిరువాన్కూరు మహారాజుగారు తమకుటుంబికుల ప్రతిమలను చిత్రింపించఁగోరి యందులకై యూరపునుండి వచ్చుటకు * జాన్సన్ అనునొక చిత్రకారునకాహ్వాన మంపిరి. ఆతడువచ్చి తిరువాన్కూరు ప్రజలెల్లరద్భుతమందునట్లు నూనెరంగులతో ప్రతిమల జిత్రించెను రవివర్మ దృష్టి యీనూతన సృష్టివంకకు మరలెను. వెంటనే దానినతఁడు పరామర్శించూచి మెచ్చుకొనెను. నీటిరంగులకు గొప్పతనము లేక పోలేదు; కాని, నూనెరంగుల చాతుర్యమును గ్రహించిన చిత్రకారుఁడెవ్వఁడు నాపద్ధతి ననుసరింపక పోఁడు. కాని, రవివర్మకొక కష్టమేర్పడెను— ఆకష్టమేయతని జీవితమునంతయు నధఃపతితము గావించివైచెను—ఏమనిన, నతనిని తగినశిక్షకు పాల్పరచి విద్యాక్రమము నేర్పువారు లేరు అతఁడు జాన్సను నర్థించెను. అసూయచేతనో మఱియేకారణముచేతనో దురదృష్టవశమున నతఁడందులకంగీకరింప లేదు. తన కళను చూచుటకుమాత్ర మవకాశమిచ్చెను. అందువలన నింతకు ముందతఁడెన్నఁడెఱుంగని కళాకౌశల్యము కొంత రవివర్మ నేర్చుకొనెను. తరువాత యేడేండ్లవరకును రవివర్మను గూర్చి మనకేమియుఁ దెలియదు. తమలో నొక చిత్రకారుఁడుండుట రాజకుటుంబమునకెల్ల సంతోషదాయకమే గాని యతనిని ప్రోత్సహించువారెవరును గానరాకుండిరి. వారికంటికది యొకతమాషగానుండెను. అతడత్యంత చిత్రవిచిత్రములగు బొమ్మలు చిత్రించినను—వంశ పరంపరాగతమవిద్యయగుటచే వారికతనియందంత గౌరవము లేకుండెను. అయినప్పటికి నతని పినతండ్రి పలుమారు హెచ్చరించుచు వచ్చెను. అదియు, నెప్పుడో యొకసారి దక్కనతని నోటినుండి విలువగల పలుకులు తఱచు వినరాకుండెను.

1873 సం॥ (మదరాసు చేతిపనుల పాఠశాల సూపరింటెండెంటుగా నుండిన) కిషాక్ గారు తిరువేండ్రమునకు విచ్చేసి, రవివర్మను కనుగొనిరి. సహజముగ నలవడిన యతని చిత్రకళాకౌశల్యమునకు వారెచ్చెరువందిరి. రవివర్మ యింతవరకును సరియైన పద్ధతిని నడచుకొనకుండెను. అతని నట్లేవదలిన యెడల క్రమముగా కళనశించిపోవునని కిషాక్ గారెంచిరి. కావున వారతని నొక చిత్రము నెటులయిన కష్టపడి వ్రాసి దానిని పైసంవత్సరము మదరాసు ఎగ్జిబిషన్‌నకు తీసుకొనిపోవలసినదిగా హితబోధచేసిరి. ఘనతచెందిన మహారాజుగారు సైతము కిషాక్ వంటి గొప్పజడ్జిగారి ప్రోత్సాహమున కాశ్చర్యపడి యందులకు కావలసిన ధనసహాయమొసంగిరి. రవివర్మయు నికఁ నదేపనిమీద తనకాలమున

[illegible]. 1874 సం॥ ఏప్రిలులో నాచిత్రప్రతిమ ప్రదర్శింపఁ బడెను. తలలో మల్లెపూలదండ నలంకరించుకొను నొక "నాయరు లేడి" యందుఁ జిత్రింపఁబడెను. వస్తుపరిగ్రహణమే ప్రత్యేక సంతోషదాయకముగ నుండెను—అందులో నది నవీన భావపరంపరకు బుట్టినిల్లయి తనరారుచుండెను. మదరాసునకు నాయరుల చక్కఁదన మొక విధమగు మనోల్లాసమును గలిగించెను. చిత్రపటమునందొక విధమగు జీవకళయగుపడెను. దానిని పరికింప గుంపులుగుంపులు త్రోసికొనివచ్చిరి, జనసామాన్యము రవివర్మ శక్తిని గుర్తించెను. జడ్జీలందఱుఁ 'గలసిగవర్నరు మేడలు' నిచ్చునంతటి మెచ్చికోలు నాప్రతిమ బడయఁగలిగెను. హోబర్టు ప్రభువు చిత్రప్రతిమఁజూచి మిక్కిలి తహతహపడి స్వయముగా రవివర్మతో చాలాసేపు ప్రసంగించెను. అప్పుడెక్కడలేని కార్యానుక్రమణికలఁ గూర్చిన కథలు పెక్కులు జరిగియుండునని మన మూహింపవచ్చును.

రవివర్మ స్తుతి పరాఙ్ముఖుఁడై, కౌన్సిలునువీడి తిరువేంద్రమునకేతెంచెను. మహారాజా పటము తనసొంతమైనట్లెంచి చాల సంతసించెను. మునుపటిదానివంటిదే మరల రెండవ సంవత్సరము 'వీణవాయించు నొక యరవపిల్ల' చిత్రింపబడియెను. ఇది తొల్లిటికన్న నేమియు భావోన్మేషణము నగాని, పరిసమాప్తిలోఁగాని యంత బాగుండకపోయినను—రెండవసారి బంగారుపతకమును సంపాదింపఁజాలెను. 1875 సం॥ యువరాజు [ఎడ్వర్డు చక్రవర్తిగారు] మదరాసునకు వచ్చియున్నపుడు సందర్శింపఁబోయి తిరువాన్కూరు మహారాజువారికిఁ గొన్ని రవివర్మ చిత్రపటములు సమర్పించిరి. అందులో 'నరవపిల్ల' యొకటి పాశ్చాత్యవిద్యా పరిచయ లాభము లేకున్నను రవివర్మచూపిన కళాప్రావీణ్యమునకు యువరాజుగారాశ్చర్యపడెను,

1876 సం॥ మరల మదరాసులో చిత్రకళా ప్రదర్శన మొనర్చెను. అదిశకుంతల దుష్యంతునకు లేఖవ్రాయుప్రతిమ. కథ యందఱకును దెలిసియున్నదగుట చిత్రము—వెంటనే జనసామాన్యముయొక్క—మనసుల నాకర్షించెను. హైందవనాటక స్వతంత్రోత్పాద్యములతో పరిచయము జేసికొనుటకతనికిదే మొదటిసమయము — భావప్రకటనముగూడ చాతుర్యముగనే యుండెను. చాలమంది అప్పుడు విమర్శనలతో గుంపులుగూడిరి. కాని యివియెల్ల సామాన్యాభిప్రాయమునే గప్పిపుచ్చఁబడెను. హిందువుల పురాణగాథలలో నొక విధమగు కదలిక గలిగినట్లయ్యెను. ఈచిత్రపటమును హోబర్టుతరువాత మదరాసు గవర్నరుగానేగుదెంచిన డ్యూక్ ఆఫ్ బకింగ్ హామ్‌గారుకొనిరి.

తరువాత రెండేండ్లలోపల రవివర్మ గవర్నరుయొక్కయు, నతని కుటుంబ సామాజికుల యొక్కయు, ప్రతిమలను చిత్రించెను. ఇందలి మొదటి ప్రతిమ ఇప్పటికినిగవర్నమెంటు హౌసులోనున్నది. ఉన్నదున్నట్లు గౌరవముగానుండుటతప్ప యింకేమియు నట విశేషములేదు. చిత్రకారుఁడా ప్రతిమ యెడ నంతగా శ్రద్ధచూపినట్లగపడఁడు. అయినను మరియొకవిధమున నది స్తుతిపాత్రముగ నున్నది. ఎట్లనిన పూర్వపు హిందూచిత్రములు విశేషించి భావప్రధానములు. రవివర్మ యా నిగూఢ పద్ధతికి బిట్టువ్యతిరేకముగా సంచరించెను.

**1878–81**సం॥రము వరకును రవివర్మ నిర్బద్ధముగ కష్టపడి పనిచేసెను సర్వత్ర పేరువ్యాపించుటచే, నవీనప్రతిమల కొరకు దక్షిహిందూదేశ జనసామాన్యమతనిచేతులు నింపెను. అప్పటి చిత్ర ప్రతిమలన్నియు చాలవరకు క్రమ క్రమముగా దక్షిణ హిందూస్థానమున ప్రతియింటిలోను నిండిపోయెను. అందుఁ గొన్నిటిని చూడగలిగి నప్పుడంతయు నింక కొంచెము మతవిషయ ముండియుండిన బాగుండునని నే ననుకొనెడివాఁడను. ఈకాలమునందతఁ డొక్క పురాణ విషయములనే యెక్కుడుగా చిత్రించి యుండలేదు. అయింతలో నొకా నొకఁడైన నొకింత చెప్పఁదగిన విషయమును గలిగి యుండక పోలేదు. అట్టివానిలో 'సీతామానసపరీక్ష' యొకటి సమూహాముతో గూడి యుద్రేక పూరితముగా నున్నది. కథయందఱకుఁ దెలిసినది; కానిచో చిత్రమునుండి యెవ్వరు నర్థమూహింపఁ జాలరు. సీత, రాముఁడు భూదేవి వీని నొకటొకటిగాఁ దీసికొని చూచినచో బాగుగనేయున్నవి పరీక్షకు నిలిచిన సీత శాంతి, రాముఁడువిడనాడి నప్పటి యామె హృదయావేదనము, చక్కగప్రకటింపఁబడినవి. కాని వెనుకటి చిల్లరబొమ్మలపద్ధతియు చెడిపోయి యంత తృప్తికరముగ లేవు. ఎందు పరీక్షించినను రవివర్మ లోతునకు దిగియుండలేదు—బట్టబయల నతఁడొక పసిబిడ్డవలెనుండెను. లక్ష్మణుడు నిక్కముగ భావహీనుఁడు. సాధారణ సంగతులలో రవివర్మభావము లతిగభీరములు—ఇంకను మొండికిబడి ముప్పదియేండ్ల యువకుని విమర్శించుట తెలివిహీనతయే. సర్. టి. మాధవరావుగారి దృష్టి దానిపైఁబడి, యాయన మిగుల నాశ్చర్యచకితుఁడాయెను. అతఁడా చిత్రమును

దెచ్చి ఘనతఁజెందిన గాయక వార్ (బరోడా) గారికి సమర్పించెను. ఈ సమర్పణము, మరుసటిసం॥రము తన పట్టాభిషేక మహోత్సవమున కళాకోవిదుని పిలిపించుటకు గాయకవారుతో తగిన పరిచయముఁ గలిగించెను. కొంత కాలమతఁడు బరోడాలోనే నిలిచి రాజకుటుంబము వారి యొక్క ప్రతిమలను చిత్రించెను. రాజకుమారుఁడు తన జీవితాంతము వరకు నీతని మఱచిపోనంతటి మహానంద మందుట కాచిత్రములే హేతువులయ్యెను. అతఁడటనుండి తిరిగి వచ్చినతోడనే చిత్రకారుఁడును నతని పినతండ్రియు నగు మహాశయుఁడు గతించెను. 1885 నుండి యతని మృతి (1806) పర్యంతము రవివర్మ జీవిత మొకటిరెండు మాటలలోఁ జెప్పివేయవచ్చును. ఇందందు దిరిగి చిత్రములు వ్రాశి పేరు సంపాదించుటతోడనే యీ కాలమంతయు గతించెను. ఒకటి రెండు తప్ప యీకాలమున మనము జ్ఞాపక ముంచుకొన దగిన విషయములంతగాఁ జూపట్టవు. 1685 సం॥ మహీశూర మహారాజుగారి **Private Secretary** యొక్క చిత్రము రవివర్మకు కీ॥ శే॥ మహారాజుగారి పరిచయముగలిగించెను. మహారాజతని నాదరించెను. కొన్ని ప్రతిమలు చిత్రింపబడెను. పుదుక్కోట కుటుంబమువారి ప్రతిమలు గూడ నతడు చిత్రించెను. దానిచే నప్పటి మదరాసు గవర్నరుగానుండిన (**M. E. Grant Duff**) యమ్. ఇ. గ్రాంట్ డఫ్ గారి పరిచయ మొక్కంత లభించెను.

హిందూపురాణ, చరిత్రాత్మకములగు చిత్రముల నతఁడు పెక్కింటిని వరుసగా రచించెను. రామాయణ మహాభారతములే యందు ముఖ్యములు. అతఁడు చనిపోవునప్పటికి మనకు పూర్వగాథలలో చాలవరకు తెలియనివే లేకుండెను. రాజాదరణము, ప్రజానురాగముకూడ నతని గొప్పదనమునకు కారణములయ్యెను. దానివలన నతఁడెంత యెక్కువగా గాకపోయినను—చాలవరకు లాభమును సంపాదించెను. దీని కొరకతఁడొక ముద్రాయంత్రమును సంపాదించెను. ఏకంగున కారంగతఁడచ్చుఁ గొట్టించెను. కాని దీనివలన కళకు లాభమేమియు కలుగదనుట యటుండ—నష్టమే చాలవరకుండునని యే నా యభిప్రాయము. రవివర్మ హిందూదేశపు చిత్రకారులకెల్ల నాయకమణివంటివాఁడు. అతఁడు చాలమంది శిష్యులను సంపాదింపఁగల్గెను. సద్యశముమిన్ను ముట్టవలసిన దినములలో—నతనిప్రాణము తే మిన్ను ముట్టుటచే వెన్నెల దినములుపోయి కడకు చీకటిదినములు వచ్చెను. చావు తరువాత నతనికి గలిగిన సంతోషములో ముఖ్యమైనది 1000 సం॥ తిరువాన్కూరునకు వచ్చి కర్జన్ ప్రభువు గారతని చిత్రముల సందర్శించి మెచ్చికోలు దెలుపుట. క్రమముగా నారోగ్యము నశించుటచే రవివర్మ 1906 సం॥రము అక్టోబరునెల 2 తేది నాడీలోకమును విడిచి, కీర్తిశేషుఁడాయెను.









బ్రహ్మశ్రీ రామకృష్ణ సీతారామ సోదరకవులు, (శతావధానులు. అనంతపురము.)

---

ఉ. వాగనుశాసనాది కవి*వర్య వచో రచనా చమత్క్రియో
ద్వేగ విలాస దివ్య పద*పేసముపస్థిత, నార్య భూవర
త్యాగ గుణానుకూల బరి*తస్త వనీయ మహాంధ్ర భారతిక్
స్వాగత మిచ్చి గౌరవము * సల్పుడహో! రసికావతంసముల్ !

సీ. కోవిదావళికి ముం*గొంగుబంగారంబు శబ్దార్థసమితికి * జననసీమ
ఉపమాద్యలంకార*నిపుణత కాలయం బమరవాగ్రమణికి నె*య్యంపుఁజెలియ
బహుళశయ్యావృత్తి*పాకంబులకు తావు హావభావముల వి*హార వనము
నవరసంబులకుఁ గా*ణాచి ఛందోబద్ధ వృత్తసంతతికి ని*వేశ గృహము

గీ. పుష్పసాయక సాయకో*ద్ఘాత శర ప
రంపరోపమపద్యవి*చరణ దక్ష
కవివరాళికి నాట్యరం*గస్థలంబు
ఆంధ్రభాషావధూటి బు*ధాళులార!

మ. ప్రభువుల్ బంగరుపల్లెరంబులను రూ*ప్యంబుల్ సమర్పించి తా
మిభయానంబుల నుత్సవంబులను జే*యింపంగ, విద్వద్వరుల్
సభలెన్నెన్నియొనర్చి స్తోత్రముల స*ల్పన్ బూర్వకాలంబునం
దభిమానంబున నాంధ్రవాగ్జనని వా*హ్యాళిక్ విడంబింపదే ?

సీ. రాజరాజనరేంద్రుఁ * డోజమై స్థిరతర కరుణార్ద్ర దృక్కుల*నరయకున్న
కృష్ణరాయలు దయా*మృతవారిరాశిలో ముంచియు నోలలా*డించకున్న
మనుమసిద్ధి నృపాల*మహాళి కూరిమిముద్దు పట్టి చందానఁ జే*పట్టకున్న
చాళుక్యనరలోక*సార్వభౌములు గజో త్సవముల వేడుక*సలుపకున్న

గీ. కంజభవ కంజనేత్ర ష * ట్కంజయుగళ
మంజుమంజీర సింజాన * మాననినద
సమవచోధాటి యాంధ్రభా * షావధూటి
యస్తమింపక నిలచునే? * యాంధ్రులార!

ఉ. రాయలఁ గన్నగేటి కవి * రాజుల నాల్కలమేనుపూటి ; సైన్
మాయల హూణాంతకారియయి * మాటికి మాటికి రాజరాజులన్
డాయుచు ; దూరమేగుచును * డా ప్రపదాప్రపయోగ పెట్టి భ
ద్రాయత పీఠమెక్క మన * యాంధ్రవచోంగనతోటి వారిలోన్.

మ. కలవెన్నెన్నియొ బాసలీజగతి ని * క్కాలంబునన్ ; వానిలో
పల;శర్కార్ద్ర రసాలవాలమయి; భా * స్వన్మల్లికాసూన పే
శలమై; యిక్షురస ప్రవాహమయి; రా * జత్కీర్తియై;యొప్పు నీ
తెలుఁగున్ బాసనుతింపఁ గాఁ దగదె? పృ * థ్విన్ బండితగ్రామణుల్ !

ఉ. నన్నయకన్నవాఁడు; కవి * నాథుఁడు తిక్కన పెంచినాఁడు; వి
ద్వన్నుతుఁడైన పెద్దన స * దారసపుష్టి నొసఁగెనాఁడు ; పో
తన్న యఖండభక్తి రస * మబ్బఁగఁజేసినవాఁడు ; దేశముల్
గ్రన్నన ద్రిప్పె నీ తెలుఁగు * గన్నినిలన్ గవిసార్వభౌముఁడున్.

ఉ. భర్గజటాటవీ లుఠద * భంగ తరంగ వియద్ధునీ జవా
నర్గళ నిర్గతామలర * సాధిక సాధువచో విలాసనై
సర్గిక పాండితీగరిమ * జాలిన వేములవాడ భీముఁడీ
మార్గము మంచిదంచుఁ గద * మానక యాంధ్రకవీంద్రుఁడౌటయున్ !

ఉ. అర్జున భీష్మకర్ణ భయ * దాహవ రంగతలాగ్ర కార్ముకో
త్సర్జిత వాయువేగ శర * జాల సమాన మహాశుపద్య వా
గూర్జిత కీర్తిశాలియన * నొప్పుచుఁ బెల్గిన భట్టుమూర్తి తా
నార్జనఁజేయఁడే? నరవ * రాధిప దత్తజయాంకముల్ ధరన్ !

చ. అమర వరప్రసూన విను ♦ తాభరణా భరణాయమాన వి
భ్రమ సుకుమారసార నవ ♦ రమ్య విలాస కళావిలోల ను
త్యమత మనోజ్ఞ సౌమ్య కవి ♦ తా వనితా మహితానురాగ ధీ
ప్రమద మెలర్పఁ దిమ్మనకవి ♦ భాసిలఁడే? కవులెల్ల మెచ్చఁగన్ ?

ఉ. పొంగిన పాల చందమునఁ ♦ బోయెడి దివ్య కవిత్వ వాహినీ
రంగదభంగ మంగళ త♦రంగ మృదంగ నినాద నిస్తులా
పాంగి సమానయాన మృదు♦భావ విలోలత నందియాలలోఁ
బింగళి సూరనార్యకవి ♦ పెద్దతనంబున బిట్టుమీఁగఁడే ?

సీ. త్రైలింగభూప సా♦మ్రాజ్య రమామనో హార ముఖాలంకార ♦ మాంధ్రభాష
కర్ణాట కేశ్వర ♦ ఘనజయలక్ష్మి ము ఖాంభోజ దరహాస ♦ మాంధ్రభాష
వేమ భూమీశ్వర ♦ వితత రాజ్యేందిర హార మాణిక్యమా ♦ యాంధ్రభాష
మనమక్షితీశ సం ♦ పత్కామినీ శిరః ప్రాంగణ మంజరి ♦ యాంధ్రభాష

తే.గీ. సుందర నవార విందమ ♦ రందపాన
మత్తబంభర గానాస ♦ మానపండి
తాళి చిత్త సముల్లాస ♦ మాంధ్రభాష
నాదరింపఁగ వలయునో ♦ యాంధ్రులార!

సీ. ఆసేతు తుహినహి ♦ మా చలావధి భూమి సంస్కృతవాణి ♦ ముంచునాఁడు
"ముందునే నేజన్మ ♦ మంటితి"నని యరవంబు తాదండెత్తి ♦ వచ్చునాఁడు
"దానికన్నను దొలి ♦ నేనె, నే"నని కన్నడంబు వాదింపఁ దొ ♦ డంగునాఁడు
ప్రతిపట్టణమున నా ♦ ప్రతిభ సాగింతు నటంచు హిందీ బెద ♦ రించునాఁడు

తే.గీ. ఒక్కరిని బోవనీయక ♦ హూణభాష
మించి చెవులను బట్టియా ♦ డించు నేడు
తనఘనత సుంత యేనియు ♦ దఱుఁగనీక
సంచరించెడు యాంధ్రభా ♦ షావధూటి.

# కవితానిరూపణము

బ్రహ్మశ్రీ అనుముల వేంకటశేషకవిగారు, (కవితాసామ్రాజ్యము నంద్యాల.)

The poet in a golden clime was born,
With golden stars above;
Dowered with the hate of hate,
The scorn of scorn,
The love of love.
He saw through life and death, through good and ill
He saw through his own soul,
The marvel of the everlasting will,
An open scroll,
Before him lay: with echoing feet he threaded
The secretest walks of fame
The viewless arrows of his thoughts were headed
And winged with flame.

Tennyson.

లోకమున దేనికిని శాశ్వతము లేదు. నేడు చూచెడి వస్తువు రేపును, రేపు చూచెడి వస్తువా మఱునాడును నుండదని మన మెఱుంగుదుము. అట్లయిన దేనికిని శాశ్వతము లేదా? ఎవ్వరును చిరంతనము వర్ధిల్లరా? యని సందేహము కలుగవచ్చును. నిజముగా నది సందేహింపవలసిన విషయమే. యోచింపగా నట్టివాఁడొక్కఁడు మాత్రమే యున్నాఁడు. అతఁడత్యంత ప్రతిభావంతుఁడు. "ప్రజ్ఞాన వనవోన్మేషశాలినీ ప్రతిభామతా" యని మనశాస్త్రకారులు వచించిరిగదా? క్రొత్త క్రొత్త కల్పనలఁ జేయు బుద్ధి వికాసముతో నతఁడు స్వర్గలోకమునకును, మధ్యమలోకమునకును, మధ్యనిలచి సృష్టికర్తయై, సర్వశాస్త్రములు-సర్వధర్మములు బోధించి, సర్వశక్తులుఁగలిగించి, సర్వశుభములు సమకూర్చి యనవరతముఁ బరోపకారమొనరించుటయందే తనయావజ్జీవమును వినియోగించుచుండును. పురుషార్థమును చవిజూపి, జగతీచక్రమునంతయుఁదన చూపుమేరకు సాగునటులొనరించును. మంత్రరహస్యములెల్ల వెల్లడిచేసి, కష్టసుఖముల గడించి, దేశకాలపాత్రాదికములఁ దెలిపి, పాపపుణ్యములఁ బరిగణించి

కాలము వెంట - కర్మము వెంట మనోవేగమునఁ జరించుచుఁ బ్రపంచమున సుస్థిరుఁడై నెలకొనును.

అతఁడెవఁడు ? అతఁడే ప్రకృతికంటెను ప్రకృతి దురాపమగు సత్తామాత్రము కంటెను, మనముకనులఁగాంచు ప్రతివ్యక్తికంటెను, కనులకుఁ గనరానిదేవతలకంటెను, నంతకన్న నధికులగు వారందఱికంటెను నధికుఁడై-మునియై-కీర్తికాయుఁడగు కవి. అతఁడే ప్రకృతి కాధారమై, యనంతమగు భావవీధిఁ దిరుగఁ గలుగు తత్వజ్ఞుఁడు. అతఁడే సకలహృదయ కేదారసీమల దున్ని పదునుచేయఁగల కృషీవలుఁడు. అతఁడే నవరసబీజములనాటి, మొలకలెత్తింపఁ జేసి, కవితాలతను బెంచి పెద్దఁజేసి, సుకృతిసుమములఁ బూయఁ జేయఁగల తోటమాలి. అతఁడేదివి—అతఁడేసర్వమును—అతనికంటె నధికమే లేదు.

విశ్వవిశ్వంభరాపురోభివృద్ధికి మూలకారణుఁడు కవి, చరిత్రజ్ఞానమునకుఁ బునాది వైచినదికవి. కవులు లేని దేశమే లేదు. యింతయేల? కవులులేని భాషయేలేదు. కవులు లేని ప్రపంచమే లేదు. వాల్మీకిలేకున్న రామకథ తెలుపో—నలుపో. యెవ్వరికైనఁ దెలిసియుండునా ? వ్యాసుఁడు పుట్టకున్న పాండవుల మనమెఱుఁగనైన. నెఱుఁగుదుమా ? కాళిదాసు జన్మింపకున్న శకుంతలా దుష్యంతుల మనము కన్నెత్తియైనఁ జూచియుందుమా ? "రవిగాననిచో కవిగాంచునే గదా?" యనుటసత్యము. కవికిఁదెలియని విషయమే లేదు. కవియెఱుంగని శాస్త్రమే లేదు. సర్వమును కవి నిర్మితము. కవి రచితముకానిది లేనే లేదు. కవి దేవునివంటి వాఁడు.

సృష్టికిఁ బ్రతిసృష్టి యొనర్చుటలోఁ గవి మనంబు సునిపుణమ్ము. వీరుని కత్తియైన నొకవేళ పదును గోల్పడి వ్రేటు గుఱితప్పి పోవునేమోగాని కవీశ్వరుని కలము మొక్కపోదు. లక్షలకొలఁది వీరభటులకంటె, నొక్కఁడైనను కవియేరాజ్యమున కత్యంత సౌఖ్యమొనగూర్చుటయందధికుఁడు. భూలోక వృక్షములన్నియుఁ గలములుచేసి, సప్తసముద్రములు శిరాబుడ్లుగా, నాకాశమను కాగితపుఁ బుట్టపై వ్రాసినను నతని మహాత్మ్యమింతంతయని చెప్పుటకు వీలు లేదు.

నిరంజనుఁడును, నిర్వికారుఁడును, నిరామయుఁడును, నిర్వికల్పుఁడునగు భగవంతుఁడు కొందఱు భక్తులను మాత్రి మాకర్షింపఁ గలిగెను. తత్వశాస్త్రజ్ఞులా యింతప్రజ్ఞయే మహా గొప్పయని యొప్పుకొందురు. కాని కవీశ్వరుఁడో—లోకమునంతయుఁ దన చూపుమేరకు మఱలించెను. మాటలతోఁ విసిగిపోయి లోకము పాటలకొఱకు కవీశ్వరుని వెంబడించెను. చూచితిరా! కవిమహిమ? కావున నే-

ద్విపద.

కురిసెను వాన మేల్కొనెఁగవీంద్రుండు
పుర సిపద్యలఁబడి పోయెనాతండు
మలయానిలుఁడు సూర్య మండలమునుండి
లలిపీచె ; నీడ తరఁగలు గోధుమల
పైరుపైఁబడె : నొంటిపాటనను గడి
దీరి, మేఘాలలోఁ దెల్లవోనంచ ,
పాదంబులక్ భరద్వాజంబు పడఁగఁ

దా॥ దీనెరాగమాత్రం డింపునిరాజ.
పిట్టతటుక్కునక వీడవేరాడ
నట్టె తానడంగెం బామది రెమ్మక్రింద
నెటోకాళ్ల నాహార మిరికించు కొనుచు
నటవిశ్వేసము నిల్చెనటె ముక్కుమీద
"నేనాడో జరుగంబోయెడి దెజెంగించు
నీనాడితం", డంచు నిటులెంచె శుకము—
"పాటలెన్నియొ నేనుం కాడితింగాని
పాటయింతటి సౌఖ్యపరమైన దెఱుంగ"

అను కవి గీతమున 'టెన్నిసన్" కవి మహిమం ప్రకృతి కతీతముగ వర్ణించియున్నాండు.

---

# భద్రగిరి సీతారామ శతకము

"అభినవ నన్నయభట్టు" బ్రహ్మశ్రీ రాళ్లబండి నృసింహశాస్త్రి గారు (అనంతవరాగ్రహారము)

మ. వెనుకన్ముందర రెండుప్రక్కల నభోవీథిన్ ధనుస్త్రాణ మా
ర్గణులై తమ్ములు నీవు నీభటుల హోరాత్రంబులన్ సంధ్యలన్
నను రక్షింతురుగాత? దుర్విషయ చింతం బాసి సంతోషినై
దనియన్? భద్రగిరీంద్రధామ! జయ సీతారామ! దేవోత్తమా !

మ. సిరులివ్వం దగినట్టివారలు; మరునాక్షేపింపఁ జాల్వారలు; సం
గరమందడ్డములేని వారలు; హరువిల్ ఖండించిగార్వేలు; మేల్
దొరయన్ రాతిని నాఁతిజేయు నరకాలున్ గల్గు నిన్నెన్న నా
తరమా! భద్రగిరీంద్రధామ! జయసీతారామ! దేవోత్తమా !

శా. ఊరుర్వల్లెలు వేఁడ; భోగములు నుద్యోగంబులున్ సొమ్ములున్
గోరన్ రాజ్యముగీజ్యమిమ్మనుచుఁ జిక్కుల్వెట్ట; నంజేరఁగా
రారా! సత్కృపజూడరా! పలుకరా! రక్షింపవేరా! మహో
దారా! భద్రగిరీంద్రధామ! జయసీతారామ! దేవోత్తమా !

శా. కానంజేరిన; నాకులందినిన; వేడ్కన్ బెంజడల్ దాల్చినన్
మానన్ బూనిన; నీటదాఁగినను; యుష్మన్నామ మంత్రంబు చం
దానం బాపము మాపినిత్య సుఖ మందంజేయునే? దీనసం
త్రాణా! భద్రగిరీంద్రధామ! జయసీతారామ దేవోత్తమా !

శా. దారాపత్య ధనాదికంబులను నిత్యంబంచు భావించి సం
సారాబ్ధింబడి దొర్లు దుర్మతి నిమేషంబైన నీనామమున్
నోరారం బఠియింప బ్రహ్మపదమొందుంగాదె; లోకత్రయా
ధారా! భద్రగిరీంద్రధామ! జయసీతారామ! దేవోత్తమా !

మ. పరులన్ బ్రార్థన సేయనంటి; నిఁకనా♦భారంబు నీదంటి; మ
స్త్ర మాయంబడనీకుమంటి ;యముచెం♦తన్ జేర్ప వద్దంటి; కా
పురమున్నమ్మిన మోసమంటి; కృపచేఁ♦బోషింపుమంటిన్; జగ
ద్భరణా! భద్రగిరీంద్రధామ! జయసీ♦తారామ! దేవోత్తమా !

మ. శరణన్నంత విభీషణుండలర రా♦జ్యంబివ్వవే; సత్కృపా
పరతన్ రాతిని నాఁతిఁజేయవె; ధరా♦భారంబు వారింపవే;
పరమార్థంబుఁ దలంచి యిత్తఱినన్♦బాలింపరాదే! విప
ద్ధరణా! భద్రగిరీంద్రధామ! జయసీ♦తారామ! దేవోత్తమా !

మ. ఉపవాసంబుల కోర్వఁజాల; గుహలో♦నుండంగజాలన్; సదా
జపముల్ సేయఁగఁజాల; మౌనము ధరిం♦చంజాల; దుష్టాత్ములన్
గృపబుట్టన్ బతిమాలఁజాల; ననుర♦క్తిన్ బ్రోవరా! ధీర! స
త్యపరా! భద్రగిరీంద్రధామ! జయసీ♦తారామ! దేవోత్తమా !

శా, అంభోజాసన పాకశాసనులు మో♦హభ్రాంతులై స్రుక్కి నీ
శుంభన్మాయఁ దరింపలేరట గదా?♦శోధించినన్నట్లు ని
ర్దంబత్వంబున నుద్ధరించెదో? లస♦న్మందార శాఖాభదో
స్తంభా! భద్రగింరీద్రధామ! జయసీ♦తారామ! దేవోత్తమా !

మ. మహినెందాక నరుండు, మోహలత ♦ ద్రుంపంజాలఁడందాక దు
స్సహతాపత్రయ వహ్నిచేఁగనలి, సం♦సారాంధ కూపంబునన్
బహుబాధల్ బడుగాని నిన్నెదఁ దలం♦పన్ లేఁడు పాపాటవీ
దహనా! భద్రగిరీంద్రధామ ! జయసీ♦తారామ! దేవోత్తమా!

మ. మృతికాలంబునఁ జిత్తమెవ్వనిపయిన్♦మేకొల్పినం గర్మ సం
చితదుఃఖంబులఁ ద్రుంచి నిత్యసుఖమున్♦జెందించునో తన్మహా
వ్రతశీలుం బరమాప్తు భక్తసులభున్♦బ్రాజ్ఞున్ నినున్గొల్తు స
ద్గతి కై భద్రగిరీంద్రధామ! జయసీ♦తా రామ! దేవోత్తమా!

శా. నానాయోనులఁబుట్టి పుట్టి ఖలులన్♦యాచించి యాచించి లో
లోలోనంగోర్కుల స్రుక్కి స్రుక్కి దినముల్♦పోఁత్రోచి ప్రోఁద్రోచి ని
స్త్రాణంజెందితి చేలనైతి గరుణన్♦రక్షింపవే భక్త సం
త్రాణా! భద్రగిరీంద్రధామ! జయసీ♦తారామ! దేవోత్తమా!

(సశేషము.)

# దృఢచిత్తము

[ఏకాంక రూపకము]

బ్రహ్మశ్రీ పాలపర్తి సూర్యనారాయణరావుగారు (చాగలమఱ్ఱి.)

(గంగా గర్భమున నీట శైవలినీ ప్రతాపులు)

(రంగము ౧ గంగాగర్భము)

ప్రతా॥ శైవలినీ ! నీ వెట్లు రాఁగలిగితివి.

శై॥ నీపైఁగల ప్రేమచే రాఁగలిగితిని. నీపైఁగల మమతను విడువఁజాలక ఫాస్టరుతో లేచిపోతిని. నీవు నన్ను వదలించి నీ యింటు విడిచినంత నిన్ను సిపాయీలు పట్టుకొని పోవుటం గాంచితిని, పిదప బెంగాలు నవాబు మీర్ ఖాసీం పరారియై యున్న తనభార్యయైన దలినీ బీబీ నీయింట నున్నదని విని సేవకుల బుత్తెంచిన మీ వెంటనే ఆంగ్ల సైనికులచే గొంపోబడిన దళినీబీబిం గానక వారు నన్నుగొని పోయిరి. నేనాతని సతీవృత్తాంతమంతయు నెఱిఁగించి మిమ్మును బీబీని వదలించెదనని యతని నమ్మించి యొకనావ నెక్కి మిమ్ముంగలిసికొని యున్మాదినివలె నటించి భోజనమునకై మీదాపునఁజేరి మీ బంధనములు వదలించి యీ విధముగ నిరువురము బయటఁబడితిమి.

ప్రతా॥ శైవలినీ ! చిరకాలవర్ధితమైన ప్రేమ నిష్ఫలమైనది. ఇంతకాలము భరించితిని కాని భరింపఁజాలను రమ్ము శైవలినీ. ఇందుచే నీభర్త చంద్రశేఖరున కపరాధము సలిపినవారమగుదుము కాని విధిలేదు. ఒకపరి కౌగలించుకొని యీ గంగాగర్భమున శాశ్వతానందమునకై మునిగిపోవుదము.

శై॥ ప్రియతమా ! నేను మహాపాపాత్మురాలను విశ్వాసఘాతకురాలను గాను. ఒకపరి మనబాల్యమును స్మరించుము. మనమిరువురము పుష్కరిణి యందీదులాడుచు నిరువురము మునిగిపోవ నిశ్చయించుకొంటిమి. మాటు మేఱకు నీవు మునిగితివి. ప్రాణభయమున నేను మునుగలేదు. ఎంతసేపటికి పైకి రానందున మరణించితివని ప్రేమబంధమును సడలించి వెడలిపోయితిని. పిదప చంద్రశేఖరునితో వివాహమయినది. విశ్వాసఘాతకురాలినయ్యు నీపైఁగల మమతను వీడఁజాలక నాతని సుఖమును, నా సుఖమును చెడగొట్టితిని. నీప్రేమ దృఢమయినది. అస్మల్లాలసాపూర్వకమైన ప్రణయ ప్రార్థనల ధర్మాసక్తతఁ ద్రోసిపుచ్చితివి. అప్పటికిని మహాపాపినై లారెన్సుఫాస్టరు వెంట లేచిపోయితిని. అతనింగాంచి కాదు. నీప్రాపునందుటకు నేనేలేచిపోయియు, నాతనిచే నిల్లెందుకుఁ గొల్లగొట్టించితినో యెఱిఁగితివా ? బలవంతమున ఫాస్టరు నన్నుగొనిపోయెనని భావించి నీవు క్రోధఘూర్ణితహృదయమున మద్రక్షణార్థమవశ్యము వత్తువని చేసితిని. అట్లేయయినది. అప్పటికిని నీకు నాపై నెనరు కలుగలేదు. కాని పాపమునకు మరణప్రాయశ్చిత్త మంగీకరించి నన్ను చేరదీయ నెంచితివి. నేనుమహాపాపినిని దూష్యలోలసాత్మను. నేను మరణింపఁజాలను.

ప్రతా॥ శైవలినీ ! అదో మన నావ యగుపడుచున్నది యారోహింతము రమ్ము.

(ఇరువురు నీదుకొని నావంజేరి పోవుదురు.)

[రెండవ రంగము]

బ్రహ్మచారివేషమున చంద్రశేఖరుడు ఉన్మాదావస్థయందు శరీరమంతయు గాయములతో శైవలినిని, చెంత ప్రతాపుడు, ఒక మహాయోగియునుందురు.

యోగి॥ చంద్రశేఖరా ! ఈమంత్రజలము నామె కొసంగుము [చంద్రశేఖరుడట్లుచేయుచుండును]

ప్రతా॥ యోగి నాథా ! ఈమె నావెంట నావపై వచ్చుచు నదీతీరమున నావ యాపినంత యదృశ్యమైనది. నేనది మొదలుకొని పిచ్చివానివలె పరిభ్రమించుచుంటిని.

యోగి॥ కుమారా! యావద్వృత్తాంతము నెఱింగించెద వినుము. శైవలిని యాంగ్లేయునితో లేచిపోయినంత గ్రామాంతరమరిగియుండిన చంద్రశేఖరుఁడు మరలివచ్చిన పిదప నెఱింగి విరక్తిఁబూని బ్రహ్మచారివేషమున నన్నుంగలసికొనియెను. అది మొదలు మేమిరువురము సంచరించుచు మీయందరి హృదయములఁ బరీక్షించుచుంటిమి. దళినీ బీబి యన్నతో వాదులాడి యొంటిపై చేటియగు కులసమ్‌తోగూడ సంచరించుచుండ బ్రహ్మచారివేషంబున నితఁడు మహమ్మదీయకాంతల నిరువుర మాయింటఁజేర్చెను. నీవదే సమయమున శైవలినితోఁ గూడ నింట బ్రవేశించి పిదప నాంగ్లేయులచే బందిగొంపోబడితివి. మహమ్మదీయ కాంతలు నష్టేయయిరి. నీవు శైవలినిచే విడిపింపఁబడి నావపై వచ్చునపుడు శైవలిని తనపాపచిత్తమునకు వ్యథనొంది మనస్సు చెడి నడవులవెంటఁ బఱుగిడి గిరినెక్కి మిగులడస్సి వానచే బాధింపఁబడి సంపూర్ణ పశ్చాత్తాప మొందెను. పిదప చంద్రశేఖరుఁడామె నొక గుహయందుచేర్చెను. ఆమె చంద్రశేఖరునకై పలవించుచుండ నేనామెను చంద్రశేఖరు నందే స్థిరహృదయము కలిగియుండునట్లు నియమించి వారమురోజులు నిరాహార వ్రతముపదేశించితిని, ఆమె యట్లేగావించి దృశ్యములన్నియు చంద్రశేఖర రూపములేయని భావింపఁ జొచ్చెను. అంత నామెకుఁ జంద్రశేఖర దర్శనమిప్పించి పశ్చాత్తప్తహృదయ యగుటయు నిరాహార వ్రతమున శోషిల్లినదగుటయు నున్మాదినియగుటయు, చైతన్య విహీనయై యున్న యీమె నిటుగొని తెచ్చి యోగచికిత్స జేయించుచుంటిని. ఈ రోజుతోఁ జికిత్సపూర్తియైనది. అన్నియు నామెయే చెప్పగలదు. చంద్రశేఖరుఁడామెతో సంభాషించుచున్నాఁడు వినుము.

చం॥ నీ పేరేమి? నీవెవరిభార్యవు.

శై॥ శైవలిని యనుదానను చంద్రశేఖరుని భార్యను.

చం॥ ఫాస్టరు నిన్ను బలవంతముగా నెత్తుకొనిపోయెనా?

శై॥ లేదు. స్వేచ్ఛచేఁ జనియుఁ బ్రతాపుని దర్శనలాలసచే నట్లుచేయించితిని.

చం॥ నీవు ఫాస్టరున కుపపత్నివిగా యుండలేదా?

శై॥ లేదు.

చం॥ భోజనమెట్టుల చేసితివి.

శై॥ నేనే పాకముచేసికొనుచుంటిని.

యోగి॥ చంద్రశేఖరా! ప్రతాపుని విషయమున నామె నిర్దోషి. యిందుకు గారణము ప్రతాపుని దృఢచిత్తతయే. ఇఁక మనకు లారెన్సు ఫాస్టరువల్లనే విషయములు ప్రమాణీకరింపఁబడవలయును.

(ఇంతలో నవాబుసేవకులు వచ్చి వారినందఱిని రావలసినదిగా యాజ్ఞాపింతురు.) అందరును శైవలినిం బల్లకీపై నెక్కించి వెంటనంటి వెళ్లుదురు.

### [మూడవ రంగము]

నవాబు సభాభవనము

(మీర్ ఖాసింనవాబ్, ఫాస్టరు, సుబేదారు. చంద్రశేఖర శైవలినులు) ఉందురు.

నవాబ్॥ చంద్రశేఖర్ గారు! మీరు గంగాతీరమున భ్రమించు నా భార్య నొకపరి కాపాడి మరల నాంగ్లేయులచేఁ జిక్కి గంగాతటమున నర్ధరాత్రమున నొంటిగా విడువబడిన నాబీగమును సుబేదారుచెంతఁజేర్చితిరి. వాడు ద్రోహచింతచే నామె ఫాస్టరున కుపపత్నియని వ్రాసెను. నేను యుక్తాయుక్తములాలోచింపక నామెను మడియింప నాజ్ఞాపించితిని. ఈ దుష్టుఁడామెను వధించెను. ఈ విషయమున ఫాస్టరు దళినీబీబి శీలము వివరించవలెను. కులసముచే విని పరితపింపబడితిని. ఈసుబేదారు సమక్షమున నామె శీలము నిరూపింపవలయు. నీతని దగినరీతి దండింపవలయు.

చం॥ అయ్యా! నాభార్య శైవలినియు ఫాస్టరుచెంతనుండెను. ఆమె శీలము నాతఁడే నిరూపించునట్లు ఆజ్ఞాపించుఁడు.

నవాబ్॥ ఫాస్టర్ నీవు చాలా ముష్కరుఁడవు. హిందూ స్త్రీలఁ బలువుర నవమానించితివి. మీకంసెనివారిని మోసగించి వారిచే వెడలగొట్టబడి మారువేషకిడుకొని తిరుగుచుంటివి ఇప్పటికైన పశ్చాత్తాపమునొంది శైవలినీ దళినీబీబుల శీలమును ఋజువుచేయుము.

అయ్యా! నేను పరమ కిరాతుఁడనని నిరభ్యంతరంబుగా నొప్పుకొనుచున్నాను. నేనే శైవలినిని తీసికొనిపోయితిని నానావపై నెక్కించుకొని గోవిందపురమునుండి కలకత్తాప్రయాణ మొనర్చితిని.

నవా॥ ఆమె నీ కుపపత్నిగా ప్రవర్తించినదా?

ఫా॥ లేదు ఎప్పుడును లేదు. నేనామె నొకగదిలోనుంచితిని ఒకనాడు తత్సౌందర్య ముగ్ధుఁడనై మోహావేశమున నామె.

యుండు గదిలోనికేగితిని. ఆమెనుపల్కరించితిని. ఆమెయొక చిన్నకత్తిని తన హస్తతలమందమర్చుకొని యింకనీగది ప్రవేశించిన నినువురి ప్రాణములు దక్కవనిశాసించెను. నేనామెను నురలఁజూడఁబోవలేదు.

నవా॥ నీయన్నమే తినుపించుచుంటివా ?

ఫా॥ లేదు. ఆమెయే స్వయముగా వండుకొనుచుండెను. కొన్నిదినములకు ప్రతాపుకు నన్నొక శతఘ్నీఘాతమున నీటఁద్రోసి యామెతోఁగూడ వెడలిపోయెను.

నవా॥ నీ యనుపదులేల నాభార్య దకీనీబీబీని. ఆమె నెకిత్తై కులసమును బంధించుకొని పోయిరి.

ఫా॥ నన్నట్లు హింసించిన ప్రతాపుని పట్టుకొనవచ్చుచు నతనియింటనున్న వారిని కూడ బంధించుకొనివచ్చిరి.

నవా॥ దకీనీబీబి నీ కుపపత్ని గానున్నదనుట వాస్తవమా?

ఫా॥ లేదు ఎప్పటికిని లేదు. ఆమెతో నేను మాటాడనైనలేదు. ఆమె నేవిధినైన నాతావునుండి తప్పించవలయునని యూహించి యామెను నదీతటమున దింపివైచితిని.

నవా॥ సుబేదార్ ! నీవాయుబద్దము నేల సృజింతివి. నీవు మనుష్యుఁడవుగావు పందికంటెను హీనుఁడవు నీముఖము మాడరాదు.

(ఇంతలో ఆంగ్లసైనికులు ముట్టడింతురు. శతఘ్నీధ్వనులు వినబడును.)

అం॥ ఆంగ్లేయులు యుద్ధమునకువచ్చినారు. ఇఁక తప్పించుకొన నవకాశములేదు పరుగెత్తుడు. (సుబేదారు నవాబు, ఫాష్టరుతప్ప నందరు పరుగెత్తుదురు)

నవా॥ సుబేదార్ ! నీకీయుద్ధమున జచ్చుయోగ్యతయుం యుండకూడదు నాచేతనే హతుఁడవగుము. (అని యత విని పొడచివేసి యుద్ధమునకు వెడలిపోవును.) ఫాష్టరు వెడలిపోవును.

## 3 వ. రంగము.

చంద్రశేఖర శైవలినీ యోగులు ప్రవేశము.

యుద్ధరంగము.

చం॥ మనమీయుద్ధరంగమునుండి తప్పించుకొనుటయెట్లు? నేటితో మహమ్మదీయ ప్రభుత్వమంతరించినది. ఆంగ్లప్రభుత్వమారంభమైనది. అమ్మా ! భరతవర్షమా ! నీ సంతాన [illegible] హిందువుల మహమ్మదీయులు జయించి [illegible] వర్షశతాబ్దములు గడచిన పిదప భేదములేక మనసంకటము నశించి నశింపకమున్నె మరియొక జాతి ప్రభుత్వమునకు దొరకొనుచున్నది. విధికృతము తప్పింపవీలులేదు.

యోగి॥ కుమారా ! ఇందాశ్చర్యమేమియును లేదు. కలకాలముండునదియేదియును లేదు. అంతయు మధ్యనశించునదే ప్రకృతిస్వభావమేయది తెలివిగలిగిన వాఁడదిగ్రహించి యేదియు నంటనంటక కుమ్మరపుర్వుబోలె, తామరాకుమీఁది నీటిబిందువువలె వర్తించుచుండును. ప్రస్తుతము మీరిరువురీయాపత్సముద్రమునుండి తప్పించుకొనుట యెట్లు ?

(ప్రతాపుఁడు ఏబదిమంది సైనికులతో ప్రవేశించును.)

ప్రతా॥ రండు మిమ్ము సురక్షితముగా యుద్ధక్షేత్రమును దాటించివచ్చెదను.

[సైనికులు వారిమువ్వురిచుట్టును పరివేష్టింప యుద్ధక్షేత్రము
ను దాటిపోవుచుందురు.]

శై॥ (ప్రతాపుని చెంతకరిగి) ప్రతాపరాయా ! నీ యుపకారమును మరవఁజాలను. నానాథుఁడు నన్ను క్షమించినాఁడు.

ప్రతా॥ శైవలినీ ! సంతోషము ఇహసౌఖ్యమునదించి పరము నొందుము.

శై॥ ప్రతాపా ! నేను సుఖింపఁజాలను నీవునాకగుపడునంతకాలము నాకుసుఖములేదు నాకికను నీవగుపడరాదు.

ప్రతా॥ నీకేకాదు. ప్రపంచమున ప్రతాపుఁడే యింక నుండజాలఁడు.

(అనిపలుకుచు గుఱ్ఱమును వెనుకకు మరలించి యుద్ధ
మునకు పోవును.)

చం॥ గురువరా ! శైవలినీ మనఃఫలకమునుండి ప్రతాపుని పేరును చిత్రము తొలఁగలేదు. అందుచే నామె సౌఖ్యమునకై స్థిరచిత్తముగల ప్రతాపుఁడు మరణింపఁ జనుచున్నాఁడు. ప్రతాపా ! ఏమి నీదృఢచిత్తము. మరణమునకైన నొప్పుకొంటివికాని శైవలినీ సంగమమున కొప్పుకొనవైతివి. శైవలినీపై నీప్రేమ యెంతదృఢమైనదో యిప్పటి నీ యుద్యమము చెప్పుచున్నది ఇట్టిదృఢతర ప్రేమపాశబద్ధుల విడదీయు, తల్లిదండ్రులు నింద్యులు

యోగి॥ (ప్రతాపునిచేరఁజని) ప్రతాపా ! నీవు యుద్ధమునకు వెళ్లవలదు. తిరిగిరమ్ము

ప్రతా॥ యోగిరాయా! క్షమింపుఁడి. నాదేశమునకై నా ప్రభువునకై ఋణవిమోచనమునకై యొక్కింతపాటు పడెదను. నన్ను విడువుఁడు (నిష్క్రమించును.) వెంటనే యోగి వెడలిపోవును.

(చంద్రశేఖర శైవనులు పట్టణాభిముఖులగుదురు.)

## 4 వ రంగము.

నిశీధము. యుద్ధరంగము (పీనుగులమధ్య యోగి సంచరించుచుండును. హస్తమునకాగడాయుండును.

యోగి॥ ఎట్టి భయానకదృశ్యము ప్రపంచమున నెట్టి ఘోర హత్య జరుగుచున్నది. అశాపిశాచమా! ఎందఱి నింక ప్రాణముల నీపొట్టఁబెట్టుకొనుచున్నావు. జీవహింస పరమ దూష్యంబని చాటు మతగురువుల బోధనలే మంటఁగలసెను. అబ్బా! ఈక్షతవుల మూల్గుల మర్మాఘాతములగుచున్నవి. ఈ శవమధ్యమున నెందును ప్రతాపుఁడగుపడఁడే. ప్రతాపా సుగుణకలాపా! కులదీపా; ఏమయితివి ఎందుఁగూలితివి మహాఋషుల కసాధ్యంబగు నింద్రియఁజేతువు. నీమహాత్మ్య ని కెవ్వఁడెఱుంగ గలఁడు. (కొన్ని శవములను పరిశీలించ నొక శవగణాంతరమున కొనయూపిరితోనున్న ప్రతాపుని దేహమును బయటికిఁదీయును.)

ప్రతాపా!

ప్రతా॥ స్వామీ! కడసారి నమస్కారములు.

యో॥ ఏమిచేసితివి ఏలయింతటి సాహసము.

ప్రతా॥ ప్రేమకొఱకు.

యో॥ నీవు శైవలిని ప్రేమించితివా?

ప్ర॥ ఇంతయని నే నెఱుంగఁజాలను. వచింపఁజాలను. నా కాయాసము.

యో॥ యోధాగ్రేసరా! ఇంద్రియజేతా! నీకై స్వర్గ కవాటములు తెఱచియున్నవి. విమానము వచ్చి కాచుకొనియున్నది. ధన్యుఁడవు నీజితేంద్రియత్వమునకు ప్రణుతు లొనరించుచున్నాను.

(ప్రతాపుని ప్రాణవాయువు లెగిరిపోవును.)

యో॥ మనుష్యశ్రేష్ఠా పొమ్ము! నేను నీకీర్తిగానమును ప్రపంచమున కంతయు వినిపింతును.

(నిష్క్రమించును.)

సంపూర్ణము.



# యువతీ యువకులు

యఱ్ఱగుంట్ల సుబ్బరావుగారు నంద్యాల.



యువకుడు.

ఇలను నీకన్న నాకెవరిందువదన
పలుకవు ? నాతోడ నెందుకింత
అలుకసేయుదు జెప్పుమా యవసరముగ
మదనతాపము నే నోర్వమందయాన! ౧

పలుకకున్నను మోహంబు పట్టజాల
పలుకకున్నను ప్రాణముల్ పరము జెందు
పలుకవు నాతోడ నెఱుఁగ జెపుము
కోమలాంగిరో నీకింత కోపమేల ? ౨

సరిగ కోకలదెచ్చెద సరళనయన
సరిగెరవికెల దెచ్చెద సరసవదన
ఊరడిల్లుము నీవింక యుజ్వలాంగి
పోయిరమ్మని సెలవిమ్ము పొలతిమిన్న! ౩

పూర్వస్నేహము విడువకు పువ్వుబోడి
పోయివచ్చెద వైళంబ పొలతినేను
కరుణయుంచుము నాపైన కంబుకంఠి
తప్పులున్నను క్షమియించు తరళనయన! ౪

విశ్వసింపుము నాపల్కు విరులబోడి
ఆదరింపుము నాపల్కు లబ్జనయన
మరువజాలను నీప్రేమ మందగమన
పోయిరమ్మని సెలవిమ్ము పొలతిమిన్న! ౫

యువతి

పిలిచినను పలుకలేదని యిగువజేల
రమ్ము సెజ్జపై బవళించు రాజరాజ!
తలదు నాపైన కోపంబు వన్నెకాడ
పగలుకోర్కెల దీర్చెడి మగువలుండ. ౬

యువకుడు

బాలచందురుఁబోలు నీ ఫాలముఖము
కమలకాండముబోలునీ కమలకరము
లేతగొమ్మనుబోలునీ లేమగాను
రంభ తరువునుబోలు నీ రమణియూరు
మరల నెన్నఁడుఁజూచెదో మగువ యెఱుఁగ ?

యువతి

తడవుసేయక వైళంబ తరలిరమ్ము
నిన్నుఁజూడక నిమసంబు నిలువలేను
కోరినవి యెల్లఁగొనిరమ్ము కోమలాంగ
నీవురాకకు మసలుదు నిశ్చలాత్మ !—



## ద్వితీయరత్నము



సాంఘిక **కలియుగదర్పణము** నాటకము

( అయిదంకములు )

గ్రంథకర్త :—కల్వటాల జయరామారావు.

త్వరపడుడు! కలిపాతకనిరసనము!! ఖలవిదారక చండశాసనము!!!

వృద్ధవివాహములు, అతిబాల్యవివాహములు, కలియుగానర్థకములనియు, వ్యభిచార పరివర్ధకములనియు, యౌవనకంటకములనియు ప్రదర్శించుటకు "కలియుగదర్పణ"మే దర్పణము. బాలవితంతువగు సుమతి దుఃఖమును, చదివిన నెంతటి రాతిగుండెయైన నీరగును. ఇందలి పద్యములు రసవంతములు. మోహవార్ధి మునింగిన జనార్దనుఁడు ముక్తిమార్గమునుజూపించును. వ్యభిచారివిరాగియగును. నీతిబాహ్యుఁడు, నీతిబోధకుఁడగును. ఇది దుండగీడులకు సమ్మెటప్రేటు. దుష్టయౌవన విద్యార్థులకు వివేక బోధిని. వేశ్యావృత్తికి దవానలము. వేయేల ? చదివిచూచిన హృదయము రంజిల్లును.

పుస్తకములు వలయువారు— వెల పోస్టేజిగాక రు 1-0-0 మాత్రమే.

శ్రీబాలభారతీ గ్రంథనిలయము నంద్యాల. అని వ్రాయవలెను.

# సన్మైత్రి

శ్రీమతి రాజమ్మగారు, నంద్యాల.

మానవకోటిలో ప్రతి మానవునకు మైత్రి ముఖ్యావశ్యకము. మైత్రి రెండు విధములు. మొదటిది సన్మైత్రి రెండవ దుర్మైత్రి. ప్రతిమానవుడును యిది మంచిది యిది చెడుది యిది కపను, యిదితగదు, అని తెలిసినవారలే! ఐనప్పటికిని అట్టి సజ్జనుల సహవాసము చెడుదారికి పోవునని త్రిప్పగలుగుచున్నది. "అభ్యాసంకూసువిద్య." దుర్మార్గుని సహవాసము చేయగా చేయగా కొన్ని దినములకు దుర్గుణములు పట్టుబడి సంసారమున కనేక సంకటములు గలిగి దరిద్రులై పడరాని అవస్థలపాలగుచున్నారు. కాబట్టి సజ్జన సహవాసము సుఖమునకు మొదటి మెట్టన వచ్చును. దుష్టుల సహవాసము వలన ఎవ్వరును వృద్ధికిరారు. ఒకరి సహవాసము చేయ తలచునెడ కొన్ని దినములు వారి గుణగతములను తెలుసుకొని మిత్ర లక్షణము లెరిగి మైత్రి జేయవలయు. యిదిసామాన్యము గాదొరకనిది. దొరికిన నెన్నటికి జెడనిది యగును. దీని వలన మనుష్యునకు కలుగు లాభములు అనేకములు గలవు. లోకములో యోగ్యుల సహవాసము చిక్కడనరు ఏ, కాబట్టి స్నేహము జేయునెడ ఒక్కొక్కని గుణవర్తనములను కొంత కాలము పరీక్షించి వానియందు యేలాటి దుర్వర్తనములు లేవని నిశ్చయించి అప్పుడు మనసిచ్చి స్నేహము చేయవలయును. అట్టివాడు మరణాంతము చెడని స్నేహితుడగుచున్నాడు. యే ప్రయోజనము లేకనే యేయిరువురకు ప్రేమ ప్రేణి హెచ్చునో వారిదే స్నేహము. సజ్జనుల సహవాసము అపదలందు ధైర్యము ఐశ్వర్యములందు వోర్పు కార్యావసరంబున ఆలోచన అన్నివిధముల సౌఖ్యము నిచ్చును. మన కష్టసుఖములు మిత్రునితో చెప్పుకొన్నందు వల్ల మనస్సు నందుండు విచారము తగ్గును. మనమెరుగని ఎంత ఆలోచన చెప్పగలిగిన వారమయ్యును మన కార్యములందు సమర్థులము కాజాలము. ప్రాణప్రియుడగు సహవాసగాడు దొరకుట కంటె మనుష్యునకు వైభవ మేదియు లేదు లోకజ్ఞానము తెలియనివారు ప్రతి వారిని మిత్రులని తలచి వారిరహస్యమును తెల్పి మోసపోవుచున్నారు. నిజమైన స్నేహము మొదట రుచికరముగా నుండక కాలము గడచు కొలది వృద్ధియై వీడనిదగును. సకలమార్గము లందును ధర్మమార్గము ప్రధానము. అట్టి ధర్మమునకు ఆధారము సజ్జనులే! అట్టిసజ్జన సహవాస మెన్నటికి వ్యర్థము కాదు. యెంత దుష్టుడైనప్పటికిని కొంత కాలము సన్మార్గులలో మెలగిన యడల క్రమముగా సన్మార్గుడు కాగలడు. పదిమంది సన్మార్గులలోయొక దుర్మార్గుడుండినప్పటికి సన్మార్గుడగుచున్నాడు. పదిమంది దుర్మార్గులలో ఒక్క సన్మార్గుడుండినప్పటికిని దుర్మార్గుడగుచున్నాడు. కాబట్టి ప్రతి మానవునికి సజ్జన సహవాసము యిహపరసౌఖ్య సాధనము. సకల భూతములయందు దయగలిగి యుండుట మనస్సుతో గాని మాటచేత గాని శరీరము వలనగాని యితరుల యడ నొప్పికలుగ జేయకుండుట కరుణాసముద్రుల లక్షణములు. వారిహృదయ సరస్సుల యందలి జ్ఞానమను నలినములు కలవు లోకమునందు ధర్మాత్ములైనవారు ఎన్నికష్టములు వచ్చినను తామొనరించు ధర్మకార్యములను విడువరు. వారికి సంతాపముపుట్టదు. స్థిర చిత్తముతో నుందురు. లోకములో వారివారికి నియతములైన ధర్మము లాచరించువారు అరుదు. ఉండురేని అట్టివారి సహవాసమున సమస్త పాపములు నశించును కాబట్టి అట్టివారిలోకమునందలి సమస్త తీర్థములకన్నను నధికులు. ప్రతిమానవుడును మంచి ప్రవర్తనయందే బుద్ధికలిగి యుండవలయును. సజ్జనస్నేహము బంధముతో కూడుకొని యుండును, ఆబంధమునకునిల్చి పూర్ణభావముతో స్నేహము చేసిన యడల తనపూర్వ వికారములను మైత్రిచే నశింపజేసుకొని పుత్తముడగుచున్నాడు. స్నేహితుడు యీవికారములు నశింపజేయుటలేదు. ఐనను స్నేహమువల్ల తనవికారమును తానే నశింప జేసుకొనుచున్నాడు. పనసపండునుజూచి గరుకులున్న వని లోపల మధురమైన వస్తువున్నది గానక విడచిపెట్టి పోయినట్లు సజ్జనులకు స్నేహితులు విశేషముండరు.

ఉండినను అట్టివారి పుట్టుకలో మనస్సు సుసుఖ్యమైనది కాదు. పిదప తానే భేదము గలిగించుకొనుచున్నాడో. ఆభేదము నశింపజేసి కొనుటకు మార్గము సజ్జన స్నేహమే. సజ్జనుడు లోకపూజ్యుడు. ఐనను లోకము నన్నే పూజించుచున్నది గదా! అనెడు గర్వము సజ్జనునికి నశించి యుండును. దుర్జనునికి అదే పరమార్థమని భ్రమించి ప్రపంచములో పలువిధములైన బాధలకు లోనై చింతించుచున్నాడు. యింత చింత తనకు తానే యేల పెట్టుకొనవలెను. ఎంత అభిమానము, ఎంతపిచ్చి, అన్నలారా! మనము సర్వులము పుట్టినది గిట్టుటకేయనుట వివేకమైనసంగతి. మరి యెప్పటికిని గిట్టెదమనే గమనములేక ప్రపంచమాయకు లోనై భ్రమించి అశాశ్వతమని కానక పలువిధములైన బాధలకు లోనగుచున్నాము. యీబాధలన్నియు సజ్జన స్నేహమువల్ల నశింపజేసుకొనిన యెడల పిదప తన్ను తానే తెలుసుకొని ఆనందపడుచున్నాడు. అట్టిసాధనా పరునికి సర్వావస్థలయందు ఆనందము అతడే భేదరహితుడు, సర్వమును దేవమయమేక మానుచున్నాడు. అట్టి సత్యాత్మునిను కనుగొని స్నేహముచేసి వారి సేవచే మార్గములను కనుగొని ఆనందించెదరని నాప్రార్థన.



# వసంత గ్రీష్మ ఋతువులు

బ్రహ్మశ్రీ రామకృష్ణ సీతారామ సోదరకవులు,
(శతావధానులు అనంతవరము.)

వసంతమా మాధవ వివాహ । వైభవంబు
జరుగ; వల్లీమతల్లికా । సముదయంబు
సల్లుస్సలసంగను । మల్లెమొల్ల,
లుల్లసిల్లెను సర్వ పు । రోపవనుల

పలకీజాలడ్డోలికా । కేళిఁదేలు
బాల రోలంబునకుఁ జల్ల । గాలివీచు
బాలకుఁబుగాఁగఁగోయిల । జోలఁబాడు
లీల నటియించె మధుమాస । కాలమందు.

విరహిణీ జనపాళిని । వేఁటలాడఁ
"జిత్రజుఁడు దంపువెడలె జా । గ్రత్త" యనుచుఁ
వెలుపు రీతిగ వనములఁ । జిలుకగములు
గోయిలలు గూయఁజొచ్చెఁ గో । కో యటంచు.

కమ్మ పుప్పొను లెగఁజిమ్మ । తమ్మివిరుల
నేఱులై పాఱుమకరంద । ధారలాని
నీటుగాఁ బాటఁబాడుచుఁ । దేఁటిబోఁటు
లాటలాడఁగ నొప్పెఁ బూఁ । దోటలెల్ల.

పుష్పవతులైన తీవె పూఁ । బోఁడులందు
సంచరించిన, కతనకా । సారములను
మజ్జనంబాడి వలిగాలి । మఱలఁదాఁకు
వెఱపుచేనేమొ ? మెలమెల్లఁ । దిరుగఁజొచ్చె.

బొండుమల్లియలందంబు । నిండియుండె
మల్లెమొగ్గల సోయగం । బుల్లసిల్లె
సంపెఁగలు సొంపుమీరె ని । ద్రింపబుద్ధి
బొడముచుండెను మానవ । పుంగవులకు.

అందమైనట్టి మల్లెపూ । పందిరులను
జేరియల్లన ముచ్చటల్ । జెప్పుకొనుచు
జీరలోడిఁ గట్టి మొగ్గలఁ । జిదుమసాఁగి
రపుడు కన్నియ లెల్లది । నాంతములను.

తనపదంబును శాత్రవ । జనముఁగోరఁగ
జోగియై పోవునట్టి యు । ద్యోగిపగిది
కాననముల వసంతుఁడా । క్రమణఁజేయ
శశిఋతువు సందుగొందుల । సంచరించె.

అధముఁడధముండు ఘోరావ । హంబొనర్చి
పుణ్యపూరుషులను ద్రుంపఁ । బోవుకరణిఁ
దరువు తరువును రాపిడఁ । దరవివహ్ని
కాఱడవులను గాల్పఁగాఁ । గడఁగెనపుడు.

మున్నుదానిచ్చినట్టి య । ప్పూలనువడ్డి
తోడరాఁ బట్టుకొను చేర । గాఁడనంగ
మున్ను దాఁనిచ్చినట్టి య । ప్పూలను జండ
కిరణుఁడైకొనుచుండె భా । స్కరుఁడు ధరణి.

పగలు నీరులభింపమి । వగచిరేల
వెన్నెలబయళ్ళ నిద్దుర । వీడి ప్రౌఢ
కామినీకాముకులు నొక్క । గతిగఁ గూప
ముల జలంబులఁ గడవల । మోయుచుండ.

ఎండవేడిమికీయిల । నుండభీతి
గొని మహేశజటాటవీ । కుహరమునను
దాఁగఁగా నేఁగెనో ? యనఁ । గాఁగడాల
వేసి వెతకిన గంగక । న్పింపదయ్యె.

భానుకిరణాళి కడలికృ । శానుఁడాప
గాదుల మునింగెనో?యన । నహోరహంబు
మీనములు మిట్టిపడఁగర । మైన నిసఁగ
పేలుగాకుండ సలసలఁ । గాతె జలము.

అవని నెల్లర దాహంబు । నార్పఁజాలు
తక్రమేడప్పిగొని నీరుఁ । ద్రావఁదొడఁగె
నందఱుఁజల్లఁదనమిడు । నట్టితనులు
గొప్పకొమ్మల మైనిండఁ । గప్పుకొనియె.

చండశాసనుఁడగు రాజ । చంద్రమునకు
వెఱచి సాధునృపాలుని । మఱుఁగుఁజొచ్చు
ప్రజలవలె;సూర్యకిరణాళి । బాధకెఱలి
తరువరంబులఁబులుఁగులు । తొఱఁజొచ్చె.

"తలఁచినను గందిపోవు డెం । దంబు;నోట
బలుక నోరెల్లఁ బొక్కుఁ;దద । త్ప్రభను గాంచఁ
గన్నుఁగవవాఁడు"నని జను । లెన్నుకొనఁగ
నంతకంతకు నెండలు । నతిశయిల్లె.

హరిపఱుండెను దుగ్ధసా । గరమునందు
వలిమలల్లుండు గంగను । తలధరించె
శారదాపతి తొలి జల । జంబుఁజేరె
నెండవేఁడిమి భరియింప । కుండుకతన.

చండకిరణ తప్త । జంతు సంతతులను
దనముగర్భమందు । దాఁచుకొనఁగ
గరుణ గలిగి యేమొ? । తెఱపియిచ్చె ననంగఁ
బలువిధములనేల । పరియలయ్యె.

మానవేశ సభాముఖ । మంటపముల
వారిపూరిత కలశముల్ । బారుదీర
నహరహము భూసురాళి శి । వాలయములఁ
జేయఁబూనిరి రుద్రాభి । షేకములను.

ఱెక్కలల్లార్చి తన పెంటి । దిక్కుఁజూచి
కొలను కొలనారయుచు నెండ । జలముఁగాన
కడవులను దిరుగాడె వి । హంగమంబు
వేసవిని రెండుజాముల । వేళయందు.

హాలికులు దమ పొలముల । యందు దుక్కి
దున్ని యలసటచే మేనఁ । జిన్న చిన్న
చెమటబిందువు లలరార । సేదదీఱ
దరువ రచ్ఛాయ కేఁగఁగాఁ । దరలిరపుడు.

చల్లగానుండెడు విహార । శాలనూత్న
భాండతోయంబుద్రావి బి । ట్టెండవేళఁ
దాళవృంతంబు కరమున । గ్రాలధనిక
మానవులు మాటలాడఁగాఁ । బూనిరపుడు.

కాంతకౌఁగిలి నొకక్షణ । కాలమేని
బాయకుండెడు యువకులా । వాసరముల
సురత ములరోసి చలువ పం । దిరుల నొంటిఁ
జల్లగాలికిఁ బవళింప । సాఁగిరపుడు.

ఆల మందల నీరును । గ్రోలఁజేసి
తరువర ఛాయలను నిల్పి । సరస వంశ
నాళసంగీత సౌఖ్యాబ్ధిఁ । దేలుచుండె
నాలకాఁపరి యాగ్రీష్మ । కాలమందు.

ఎండటెండలో విశ్రాంతిఁ । జెందితన్ను
"పాంథజనకల్పనగ"మని । ప్రస్తుతింప
నిర్మలంబైన యొక్కకో । నేటి దరిని
పాదుకొనియుండె నొకచూత । పాదపంబు.





# పురాతనపు వైద్యగ్రంథకర్తలు.

ధర్మ ఆయుర్వేద డిస్పెన్సరి అధ్యక్షులు

(డాక్టర్ పి. ఆర్. జె. సుందరం ఎ. వి. యస్. నంద్యాల.)

కల్యాణ గుణుండును దయార్ద్రహృదయుండును నగు బ్రహ్మ తాను సృజించిన ప్రాణులకాధారంబగు దేహము లారోగ్య స్థితిలోనుంచుటకు తగిన సాధనంబగు నాయుర్వేదమును 1 శల్యము 2 శాలాక్యము 3 కాయచికిత్స 4 భూతవిద్య 5 కౌమారభృత్యము 6 అగదతంత్రము 7 రసాయనతంత్రము 8 వాజీకరణతంత్రము 8 భాగములుగా రచించి మానవుల సంరక్షణార్థము తనకుమారుడగు దక్షప్రజాపతి కుపదేశించెను. ఆదక్షుండు సూర్యపుత్రులగు నశ్వినీదేవతలకును అశ్వనేయులు సహస్రాక్షునకును సహస్రాక్షుడు భారద్వాజునకును భారద్వాజుడాత్రేయ అగ్నివేశ, భేడ, పరాశర ధన్వంతరి చరక సుశ్రుతుడు, మున్నగు మునిశ్రేష్ఠులకుపదేశించినటుల గ్రంథరాజంబుల వలన వెల్లడియగుచున్నది. ఈ ఋషిశ్రేష్ఠులు వైద్యశాస్త్రము, నభ్యసించివారి వారికిగల యనుభవమును బట్టి వేరు వేరు గ్రంథములను రచియించి మిగుల వన్నెగాంచిరి.

అశ్వనీదేవతలు :—వీరుదేవవైద్యులుగానుండి కాయచికిత్సమీదను శస్త్రచికిత్సమీదను చికిత్సాతంత్రమాదిగాగల యనేక వైద్య గ్రంథములను రచియించి మిగుల కీర్తిగాంచిరనియును నెట్టిభయంకరమైన వ్యాధులనైనా నతిచమత్కారముగా చికిత్సచే కుదిర్చిరనియును ఋగ్వేదమునుబట్టి వెల్లడియగుచున్నది.

ఆత్రేయుడు:—ఈఋషిశ్రేష్ఠుండు రచియించిన గ్రంథములలో నొకటి "ఆత్రేయ సంహిత" అనుగ్రంథము 5 భాగములు కలిగి దాదాపుగా 46 రు వేల శ్లోకములతో విలసిల్లుచున్నదనియును యిప్పుడున్న వైద్యగ్రంథరాజములలో నీయాత్రేయ సంహిత మిగుల ప్రాచీనత వహించియుండెననియును చెప్పుచున్నారు.

అగ్నివేశుడు:—ఈఋషివర్యుండు రచించిన గ్రంథరాజము, వైద్యమునందసమాన ప్రజ్ఞగల చరకమహాముని వలన సవరింపబడి యిప్పటివరకు చరకసంహితయని చాల ప్రఖ్యాతిగాంచుచున్నది.

చరకమహాముని: —విశుద యను మునికుమారుడై క్రీ॥ శ॥ 320 వ సంవత్సరమునకు, పూర్వము వారణాశినగరమునందు జన్మించి నటులజెప్పుదురు. (ఆకాలములో నీచరకునికంటె మించిన వైద్యశ్రేష్టుడు లేడనుట నిర్వివాదాంశము. ఈ చరకుడు సకలశాస్త్రవేత్తయగు నాదిశేషునియొక్క యవతారమని వాడుకొనుచుండిరి ఈ ఋషివర్యుడు రచియించిన వైద్యగ్రంథమగు చరక సంహిత శ్లోకస్థానము, కల్పస్థానము, శిద్ధస్థానము, నిధానస్థానము, విమా

నస్థానము, శరీరస్థానము, ఇంద్రియస్థానము చికిత్సస్థానము, అని యెనిమిది భాగములుఁగలిగి (120) యధ్యాయములుగా, సవరించివ్రాసెను. ఈసద్గ్రంథము, కాయచికిత్సాదివిషయములను బోధించుటయందుత్తమమైనది. ఈచరక సంహితను సంస్కృతభాషనుండి 8వ శతాబ్దమందరేబియా దేశస్థులు తమభాషలోనికి తర్జుమాఁజేసికొనిరి. అవి సెన్నరాజస్, సిరిపియాను, మొదలగువారు రచియించిన లాటిన్ భాషా గ్రంథములలో. నీచరకమహాముని తరచుగా గాన్పించున్నాడు. ఈ చరక సంహితను కలకత్తాయందలి వినాచ చంద్రకవి రత్నముగారాంగ్లేయభాషలోనికి తర్జుమాచేసి యిప్పటికి మూడు నాలుగువంతులు ముద్రింపించినారు వీరితర్వాతవారు సుశ్రుతుడు.

సుశ్రుతుడు:—ఈ మహనీయుడు శ్రీరామునికాలములోనివాడగు విశ్వామిత్రుని కొమారుడనియును తండ్రియనుమతిమీద తనపడుగురిసోదరులతోను, కాశివాశియగు దివోదాసునియొద్ద వైద్యశాస్త్రమును నభ్యసించెననియును, చెప్పుదురు. దివోదాసుడు శస్త్రవిద్యయందసమాన ప్రజ్ఞ గలిగిన దేవవైద్యుడగు ధన్వంతరి యొక్క అవతారమని వాడుచుండెడివారు. ఈ సుశ్రుతుఁడు ధన్వంతరిచే నీయబడిన యుపన్యాసములు మొదటి ఆయుర్వేధ అనుచరణముగా మార్పులుజేసి సుశ్రుత సంహిత యనుగ్రంథరాజమును రచియించెను. ఈ గ్రంథము శస్త్రచికిత్సాదివిషయములను శారీరశాస్త్రవిషయమైన సంగతులను బోధించుటలో నుత్తమమయినది. శస్త్రవైద్యమునకు గొప్పప్రమాణ గ్రంథముగా హిందూవైద్యులవలన మిగులకొనియాడబడుచున్నది. ఈ గ్రంథమునందు రోగాదులు వెంటనే కుదుర్చుట కనేకములైన యంత్రసాధనములను విశేషముగాచెప్పబడినది. ఈసుశ్రుత సంహిత క్రీస్తు పుట్టిన తరువాత 800 సంవత్సరములకు అరేబియా భాషలోనికి తర్జుమ చేయబడెను.

వాగ్భటాచార్యుడు:—ఈమహనీయుడుఁ క్రీస్తు పుట్టుటకుముందు 2వ శతాబ్దములో ప్రశిద్ధిజెందెను. పడమటి యిండియా లోనిదగు సింధూదేశములో జన్మించెను. ఈయన రచియించిన గ్రంథము అష్టాంగహృదయము. తనకుపూర్వులు చరక సుశ్రుత అగ్నివేశ భేలమున్నగు ఋషిశ్రేష్టులు రచియించిన గ్రంథరాజంబుల ననుసరించి చక్కని మార్పులతోరచియించి పూర్వపుగ్రంధములన్నిటికి ఖ్యాతిదెచ్చెను. మరియ నీయన అష్టాంగ సంగ్రహమునకు ఇంక నొక గ్రంధమునుకూడ రచియించెను.

మాధవాచార్యుడు :—ఈ మహనీయుడు ప్రస్తుతము గోలకొండయని పిలువబడుచున్న కిష్కింధయందు 12 వ శతాబ్దమందు జన్మించెననియు విద్యానగరరాజగు వీరబుక్క రాజునకొక ప్రధానమంత్రిగానుండెననియు తెలియుచున్నది ఋగ్వేదమునకు వ్యాసకర్తయగు నాయనయొక్క సోదరుండు ఈమాధవాచార్యుండు హిందూవేదాంతముమీద "మాధవ వేదార్థప్రకాశమను గ్రంథమును భాషావిషయమై మాధవవృత్తియను గ్రంథమును వైద్యమువిషయమై మాధవనిదానమను గ్రంధమును జ్యోతిషమువిషయమై కాలమాధవము అనుగ్రంథమును న్యాయశాస్త్రవిషయమై వ్యవహారమాధవము అను గ్రంథమును రచియుంచిమిక్కిలి వన్నెకెక్కెను ఈమాధవు నిదానమందు రోగోత్పత్తియను దాని లక్షణములును వివరముగావ్రాయబడినది. ఇయ్యదిరోగ నిదానమునందు ప్రబలప్రమాణగ్రంథమనుటనిర్వివాదాంశము. రోగినిదానమునందు మాధవచార్యునికి రోగి నేయవస్థలయందే ప్రకారము కాపాడవలెనో వైద్య

శాస్త్రవిధులను బోధించుటలో , వాగ్భట్టాచార్యునికిని చికిత్సవిషయమై చరకాచార్యునికిని చాలినవారు లేరు ఈ మాధవాచార్యుడు తన వార్థకదశలో సన్యసించి విద్యారణ్యుండని పేరు బడసెను.

భావమిశ్రుడు:—ఈవైద్యశ్రేష్ఠుండు 1550 వ వత్సరములో మద్రదేశములోనుండి చాలప్రఖ్యాతిగాంచెను. భావప్రకాశమను గ్రంథమును రచించెను. పూర్వము ప్రసిద్ధిగాంచిన వైద్యశ్రేష్ఠులందరి యనుభవమును తనగ్రంథములో సంగ్రహముగ వివరించివ్రాసెను. హిందూదేశమునందలి వైద్యులవలన యీ భావప్రకాశమను గ్రంథమత్యంతోపయుక్తమైనదనియును బాహుళ్యమగు నార్యవైద్యగ్రంథసముదాయమునుండి యుపయుక్తంబగు విశేషాంశంబుల నిందుచేర్చెను. ఈభావమిశ్రుడు కాశీలోనివశించి యుండెననియును పెక్కుమంది విద్యార్థులీతని చెంతనుండిరనియును చెప్పుదురు.

శార్ఙ్గధరుడు:—ఈతండు ముప్పది అధ్యాయములు కలిగిన శార్ఙ్గధరసంహితయను గ్రంథరాజమును యుపయుక్తంబగు విశేషంబులను జూపుచు రచియించెను. మరియును వైద్యామృతమును రచియించిన బట్టమోరేశ్వరుడును వైద్యజీవనమును రచియించిన చక్రదత్తుడును చక్రదత్త ముక్తావళియను గ్రంథములను రచియించిన చక్రపాణియును చికిత్సాసారంబును రచియించిన గోపాళదాసుండును అగ్నిపురాణమును రచియించిన వ్యాసుండు అమృతసాగరమును రచియించిన ప్రతాపసింగుడును యింక లెక్కలేని వైద్యగ్రంథకర్థలు రచియించిన గ్రంథరాజంబులు పెక్కులున్నట్టు గాన్పించు చున్నది ఒక్కొక్కటి యొక్కొక్కవిషయమును గూర్చి విశేషముగా బోధించుచుండును శస్త్రచికిత్సాదివిషయములను బోధించుటకు సుశ్రుత సంహితయుత్తమమయినది. కాయచికిత్సాది విషయములను బోధించుటకు చరకమనునది శ్రేష్ఠము శాస్త్రరహస్యములను బోధించుటలో అష్టాంగ హృదయము అష్టాంగ సంగ్రహము అనుగ్రంథములును రోగముల లక్షణములు నిదానమును తెలియజేయునది మాధవ నిదానమును రసములు ఉపరసములు లోహములు నవరత్నములు వీని భేదములు సమ్మేళనములు మారణానుపాయములను బోధించునది రసరత్నసముచ్చయము, రసరత్నకరము, నాగార్జునీయము మొదలగు గ్రంథంబులును ప్రసిద్ధిచెందియున్నవి బహుళ్యమగు నీ వైద్యశాస్త్రము తరచిన కొలదిని గ్రంథకర్తలును గ్రంథములును వెల్లడియగుచున్నవి వైద్యగ్రంథములన్నియును సంస్కృతభాషయందుండుటచేతను అట్టి సంస్కృతభాషానభ్యసించువారలు వేయింటకొక్కరైనను లేకుండుటచేతను యత్యంతోపయుక్తంబగు వైద్యగ్రంథరాజముల నామములనైన తెలుసుకొనలేనట్టి యసమర్థులమైనందులకు చింతింపవలసిన యవస్థలో నున్నారము.

హిందూదేశవాసులమైన మనమందరమును సమస్తముండియు ననుభవింపవలసిన రీతిగ ననుభవింపలేకున్నాము. పరోపకారపారీణులగు ధనవంతులగు మహారాజులు జమీందారులు హిందూవైద్యులకుతగు సహాయమొసంగియాయుర్వేద మెల్లతావులయందును వెల్లడియై హిందూదేశ మందారోగ్యదేవత తాండవమాడునటుల జేసి యాయుర్వేదమునకు పూర్వపు మహోన్నత దశవచ్చునటుల ప్రయత్నించి సద్బుద్ధి భగవంతుడు కలుగజేయుగాత.



# పిపీలికాప్రపంచము

———:o:———

బ్రహ్మశ్రీ కేసరి ఆదినారాయణశర్మగారు S. T. C.

భగవల్లీల లనంతములు. సృష్టియందంతటను
పరమేశ్వరుని యపారప్రజ్ఞ ప్రతిబింబిత మగు
చుండును. ప్రపంచమున గొన్ని జంతువులు మ
నోహరాకృతిచేత మానవలోకమున కానందదా
యకములగుచున్నవి. మఱికొన్ని తమపృథు
లాకారపరిమాణమున బొచ్చెము లేని యచ్చెరు
వునకుఁ గారణములగుచున్నవి. శుకపిక మయూ
రశారికాదులును భ్రమరాది కీటకములును మం
జులాకృతికిని, మహాంగ, దంతావళ తిమింగిలము
లును, గోరిల్లా, ఖడ్గమృగము, ఉష్ట్రపక్షిలోన
గునవి, పృథులాకారపరిమాణములకును నుదా
హరణములుగ గైకొననగును. కొన్ని జీవులు తమ
సూక్ష్మాకృతిచేత జక్షురింద్రియమున కలవిగాక
యంత్రసాహాయ్యమునఁ జూడ సాధ్యమగు చు
న్నవి. ఇట్టి సూక్ష్మక్రిములు వాయు ప్రపంచము
నందంతటను నిండియుండి ప్రాణికోటికి మేలు చే
యు గొన్నియును, కీడు సలుప మఱికొన్నియును
సమర్థములుగను, సహాయకారులుగానున్నవి.

మనుజులందువలెనె ప్రాణికోటులలో సయి
తము కొన్నింట సంఘీభావమును వైర భావము
ను, కలవను విషయమును సృష్టిపరిశీలనా చ
ణునకుద్యోతముకాక మానదు. పక్షులయందు
ను మృగములందును క్రిమికీటకాదులయందును
అన్యోన్యసాహచర్యమును, సంఘీభావమును భ
గవంతుఁడొదవఁజేసి యున్నాఁడు. సంపాదితా
ర్థమునొకచోఁ జేరిచి, వలసినయదనున నావస్తు
సంచయమును సంపూర్ణ సాప్తప దీనతతో న
నుభవించుటలో మధువ్రతనికరములు ప్రబల
సాదృశ్యములు. సృష్టిపరిశీలనా పేశలురగు ఁగో
ల్డు' 'హ్యూబర్' ఫోరెల్, వేస్మన్, మున్న
గువారలు చీమలలో లెక్కకు మిక్కుటములగు
తెఱగులు కలవనియు, నితరమృగములు, క్రిము
లు, కీటకాదులకన్న వీనియందు సంఘీభావము
సమత్వము ఉచితార్థ సంగ్రహణాభిలాష స్వజా
త్యభిమానము మొదలగునవి కలవను విషయ
మును సయితము దీర్ఘపరిశ్రమజేసి కనుగొన
గల్గిరి.

ప్రపంచమునగలనానావిధ పిపీలికజాతులలో
నేరెండుజాతులకును సమానస్వభావమును, అ
లవాటును గలిగియుండుట అరుదు. ఒక్కొ
క్క తెగకుజేరిన చీమలకొక్కక తెఱగు నలవా
టుండును. వానిజీవిత పరిమితి సయితము కొన్నిం
ట దీర్ఘముగ నెయుండును.

"లైటు ఆనరబుల్ లార్డు ఏవబరిగారు"
చీమలకొఱకయి నేనొక నివసనమును గట్టించితి
ని. అందుగొన్ని చీమలనివసింపజేసితిని అందొక
చీమ యేడేండ్లువయసుకలది. ఆచీమలకన్నిటి
కిని రాణి (Queen) యగుదానికి బదునైదు
వర్షములప్రాయము అనియొకచో వాక్రిచ్చి
యున్నాఁడు పిపీలికాసంఘమున వయసుచెల్లిన
వాటికిఁదోడుగ (కార్మికశాఖకు సంబంధించిన
చీమలును శైశవముననుండు పిపీలికములును కొ
న్నియుండును. సాంఘీక వ్యవహారముల నీ కా
ర్మికశాఖయందలి చీమలు నిర్వహించుచుండును.
పసిచీమల బోషింపసయితము వీనియందొక శా
ఖయుండును. వయసువారిగనుండు శిశు పిపీలిక
ముల అపాయమునుండి కాపాడుచు నాహార
ము నొసంగి పెంచుచుండుట వీనిపని, ఇటుల

దమసాంఘికకార్యముల నిరవద్యముగ నెఱవేర్చుకొనుచుండుటయు చిఱుతచీమలకు వయసునకుదగినటుల పోషణశిక్షణాదుల నొసంగుచుండుటయుజూడ లార్డు "ఏవబరి" గారికప్పట్టు (చీమలనివాసస్థళము) క్రిమశిక్షణము నొసంగుచుండు నొక పాఠశాలవలె జూపట్టెడిదట.

అంగల భూమినుండు చీమల తెగలలో, పనిచేయునట్టివి (workers) యగు చీమలు తదితర పిపీలికములకన్న బరిమాణమున దప్ప తక్కుంగల విషయములన్నింటను నొక్క తెఱగు పోలికనే కలిగియుండును. ఐరోపాదేశమున నితరభాగములనుండు చీమలట్టులగాక నానా విధములయిన చీమలకుబలు తెఱంగులయిన యాకృతులును, బరిమాణములుండును. ఈ యాకారభేదములు వానివయసునుబట్టికాని, వర్ణముపయినాధారపడికాని, యుండవు. వానివానివ్యాపారభేదముల ననుసరించియుండును. సాంఘిక క్షేమమునాశించి జాగరూకతను మెలంగుచు నదనొదవినయెడ శాత్రవానీకములతో బోరవలసిన చీమలకు పెద్దతలలును, గొప్పదవడలును వాడియగు ముక్కులు నుండును, రాణి (Queen) యను వృద్ధ పిపీలికమీ చీమలకు దల్లిగానుండును "మాతృదేవోభవ" యనునీతి వీటసయితము కలదు. తక్కిన చీమలన్నియు నీ తల్లిచీమ నప్రతిమానగౌరవభావమునం జూచుచు భోజ్యపదార్థముల నొసంగుచు నొకచోటనూరక గూరుచుండ నియమించును తల్లికి లేశమయినగష్టమువచ్చెనా, తక్కుంగల చీమలాదుష్ట పిపీలికమును, ఎదిరించి ధైర్యమునం బోరి యద్దానిం బరిమార్చును, లేకదిట్టముగనయిన గఱచును.

—పిపీలికాసంఘము—

ఒకతెగచీమలుకొన్నిచేరి యొక సంఘముగ నేర్పడును. ఈతెగచీమలే మఱికొన్ని యింకొక సంఘముగ సయితముండును. సుమారయిదు లక్షల చీమలొక సంఘమున నుండునట. ఒకే సంఘమునకు సంబంధించిన యేరెండుచీమలును కలహించుకొనుచుండుట గానము. ఒకతెగలోని చీమ మఱియొక సంఘమునందలి చీమలతో నేస్తమునెఱపంబోయినచో, అందలి చీమలద్దానిని, కాలునోతలనో పట్టియీడ్చి బహిష్కరణముగావించును. మనముకావలయుననియొకగుంపునందలి చీమను మఱియొకగుంపున బ్రవేశింపజేసితిమేని యయ్యది యచట నర్థాశిక్షననుభవించుటకాని, లేకమృతినొందుటకాని తటస్థించును.

—జ్ఞాపకశక్తి—

ఒక సంఘమునకుంజేరిన పిపీలికము నొకదానిని గొంపోయి యెటనయిన గొన్ని వత్సరముల కాలము పెరుగనిచ్చి మగలదెచ్చి యద్దానిం దనపూర్వ మిత్రులజేర్చినచో దక్కుంగల చీమలానవీన వయస్సున సతికాలమునను గుఱితించి తమతోడమైత్రిని మెలంగనిచ్చును నేడుచూచిన మనుజునొకనెలనాటికి మఱలగనినచో గ్రొత్తవానినిగ దలచుట మానవస్వభావముగనుండ హీనజీవులుగ బరిగణింపబడుచుండు నీచీమల యసదృశ మేధాసంపత్తిం గంటిరా?

—అన్యోన్యసహాయము—

ఒకతోడేలుకాని, వంచకముకాని, వ్యాధిగ్రస్తముగనుండు తఱి యా జాతి జంతువులా జబ్బుమెకమును సంఘబహిష్కరణ మొనర్చుటయో తుదకు అమ్మృగమును తుదముట్టించుటయో తటస్థించును. చీమలట్లుకాదు. ఒకచీమకు కాలువిరిగియో మఱియేయవయవమున కయిన, నూనముతటస్థించి కదలమెదలలేని స్థితినుండునపుడు సంఘశ్రేయోభిలాషులగు చీమలా వ్యాధిబాధిత పిపీలికము నొద్దకువచ్చి తగినచోటు స్వస్థముగ బఱుండవెట్టి యాహారము నొసం

గుచు సంపూర్ణారోగ్యము నొందువరకు నచ్చో టునువాసిచనవు. తన్ను మున్నెన్నడయిన నెదిర్చియో తన కెగ్గొనరించియో తప్పించుక పోయిన చీమ తనకంటబడెనా మఱి పడిచీమల సహాయమున నాశత్రువును జయించుటయో లేక చంపుటయో యగు నంతవఱకును చీమ విడువదు.

—ఐకమత్యత—

ఒకచీమ తాసంచరించు ప్రదేశమున నెద్దియేని యాహారయోగ్య పదార్థముఁ జూచెనా, వెంటనే పర్వుపర్వునబోయి తన నేస్తులకాయుదంతము నొక విధమగుసన్న, మూలమున దెలుపును ఈ సంజ్ఞాప్రకరణమును, తమ ముఖమున మీసముల బోల్కి దీర్ఘములుగ బెఱిగియుండు వెండ్రుకలమూలమున బాలభటులు పతాకసంజ్ఞలచే దమయభిప్రాయముల దమజుట్టువారల నెఱుక పఱచినరీతి నెఱింగించును. చీమలపుట్టను త్రవ్వి పరిశోధింపగల్గితిమేని యందు వివిధ విశేషములను గమనింపవలసుపడును వీనియందు గృహనిర్మాణశాఖను, పారిశుధ్యశాఖను (Sanitation) సంబంధించిన ~~మలు కూడ యుండును ఒకపుట్టకిరుప్రక్కలను లోన బ్రవేశింపగనే చిఱుతగదులఁబోలిన సొరంగములకు జొరవనొసంగు సన్ననిమార్గములును సన్ననిదారులకుజేర్చు పెద్దత్రోవ మఱియొకటియు గానవచ్చును ఇటులనె ముప్పది నలువది గదులవరకీ పెద్దత్రోవపోవుచుండును ఈ త్రోవక్రొత్తగ నమర్పబడినరోడ్డును చిన్నత్రోవలు తచ్ఛాఖలను ననుకరించుచుండును. వర్షాధిక్యమున గాని, మఱియేకారణమున నేని యాపుట్టయొక్క ముఖద్వారమును సీరుచోరువనున్నవుడు కార్మిక సంఘముఁ కుజేరిన చీమలగు యును వాకిలికడకేగి యతినైపుణ్యముతో నీటినానీటి కడ్డమువైచి నేటిమార్గమును ద్రిప్పుటయో, లేకదానిని గప్పుటయో యొనర్చును.

సొరంగములజేరియుండు ధాన్యపుఁబొట్టును క్రిమికీటకాదుల యస్థిపంజరములు, డొక్కలు మున్నగువానిని కొన్ని పిపీలికములు బయట ద్రోయుచుండును ఆపనిని సేకరించిన యాహారపదార్థములను దాఁచ నుగ్రాణములు నానొప్పు గదులసయితమీపుట్టలోనగుపడును, ఈయుగ్రాణములు జేర్పఁబడినధాన్యాములను, శుష్కఫలము లను, వర్షఋతువున నెటుబోవన్వీలులేక యాహారపదార్థ సంపాదనమునకు గష్టముగ నుండునెడ, విధిలేక తినుచు బ్రాణధారణముజేసికొనుచు మరల ఫలితకాల మాసన్నమగువఱకు గాలయాపనము జేయుచుండుటయును సమయజ్ఞతయూ ప్రాప్తార్థసంతృప్తియు నీపిపీలికము వలననేరిచికొనదగు విషయములు ఇంకను నిట్టి విచిత్రము ల ననేకము ల నీపిపీలికా సంఘము ల నుండి గ్రహింపవచ్చును. సృష్టిలోనంత్యజీవి పిపీలికము అగ్రము పరబ్రహ్మము ఈయంతరమున గల జీవరాసులకు సయితె మిట్టి బుద్ధి కుశలతను పరమేశ్వరుఁ డొసంగియుండ మేధాసంపత్తినన్నింటికెన్న మిన్నతానయను నహంకారపాశబద్ధుఁడయిన మనుజుఁడు జీవితావిధి నెఱింగి ప్రపంచమున మెలంగుచుండినచో నాతనికి సర్వమును గరతలామలకముగ నుండుననుట యతిశయోక్తి కానేరదు.

"ఇయ్యది బ్యూటీస్ ఆఫ్ నేచర్ నుండి నాచేననువదింపబడినదని విన్నవించ
పండితాఖండలుల పాదసేవకుఁడు"

---

# మోహ విభ్రమము

డాక్టర్. చల్లా సుబ్రహ్మణ్యంగారు L. M. P.

—————:O:—————

(1)

అదియొక బౌద్ధమతాంతర్భాగము ఒక వైపున విశాలమగు మండపముండెను. మరియొక వైపున స్ఫటిక జల పూరితమగు పుష్కరిణియుండెను. అందలి నిర్మలతోయ మొకగండిని ప్రవేశింప ప్రతిముఖమునను న్న దానిగుండ ప్రవహించి పోవుచుండెను. చుట్టును తులసికోటలును, స్తూపములును నెలకొనియుండెను. నల్గడల శ్రీబుద్ధ భగవానుని విగ్రహములుండెను. సిద్ధార్థుని మహాత్యాగమును బోధించి చిత్రవిచిత్రములగు ప్రతిమలెల్లడల నాటి శిల్పులచాతుర్యమును ప్రకటించుచుండెను. పుష్కరిణికి కవ్వలనుండిన పూదోట నుండి పరతెంచు వివిధకుసుమ సౌరభమెంతయు హాయిగొల్పుచుండెను.

తనప్రభావమెంతయున్నను పాటింపక, నైజదుస్స్వభావము నుజ్జగింపని మర్త్యుల దురాచారముల నైపలేని లోకబాంధవుఁ డప్పుడే దారుణారుణగాత్రుఁడై కడుఁదాఁగిన యపరంజి భాండమువోలెఁ బశ్చిమాద్రిని వ్రేలబడిపోవుచుండెను. పారతంత్ర్యమెఱుంగని యసంఖ్యాకములగు శకుంత సంతానములు గగనతలంబున బారులుగట్టి స్వదెసలఁ బయనము సేయుచుండెను. చిఱుగంటల సవ్వడిననుసరించి దోగాడు ధూమోపరాగము గోగణంబుల నతిదూరంబునఁ బురప్రవేశ మొనర్చుట సూచించుచుండెను. కరుణ రససంజనకములగు లేదూడల "అంభా" యను యరపులును, ఉండి యుండి శ్రవణపుటగోచరమగు "టొక్కు టొక్కు" మను పక్షికూజితంబులును, గోపకుమారుల హృదయమధుర మురళీరవంబును ఘోరకల్పిత సంక్షుభిత మానససరోవరంబులకైన శాంతి నొదవింపగల్గియుండెను.

విరాగులగు బౌద్ధపరివ్రాజకు లచ్చటచ్చట గుమిగూడి శాస్త్రవిచారంబునో, భగవన్నామ సంకీర్తనంబునో సంధ్యానియమితానుష్ఠానంబులనో జల్పుచుండిరి. సుమనో మనోభిరామమగు నావాటికయందొక ఐదేండ్ల బాలుఁడొక నెమలిపుంజును దరుముచు కిలకిలమని నవ్వుచుఁ దన్నుతిలకించుచుండిన తల్లికి నంద మొదవించుచుండెను. సోయగమున్న యాయన్నుమిన్న "నాయనా! మహేంద్రా! వలగరా పరుగెత్తకుమురా దానినినీవు పట్టజాలవు రమ్మోయినాయనా రారమ్ము" అని గారాబమున మందలించుచుండెను. ఆ దుండగీడిసుమంతయు సరకుసేయక యుద్యానవనాంతరమున జారబారిపోయెను. అదృశ్యుఁడైయున్నను బాలకుని మంజులహాస మామెకు వినబడుచుండెను.

"ఆహా! ఎట్లనుభవింతును విశ్వామిత్రా నీవాక్చమత్కృతిని మరువగలనా నీ శౌర్యపరాక్రమముల మరువగలనా నీనిజిలశాస్త్ర ప్రవీణతను మరువగలనా నీయశస్సౌభాగ్యమును మరువగలనా నీసుందరపురుష విగ్రహమును మరువగలనా దేనిమరుతునన్నను నాయెడనవ్యాజముగ జూపిన నీక్రౌర్యము మరువజాలను ఈబుడుత డిప్పటినుండియే నిన్ననుకరించుచున్నాడు. సకలసద్గుణగరిష్ఠుఁడవయ్యుఁ గ్రూరుఁడవగుట నామందభాగ్యముకదా. వివాహమునకు బూర్వ

మీవు జూపిన ప్రేముడికి వేచుడుంగులుగ నీచిన్నికౌమార జన్మకాలమునుండియుఁ జూపుచుంటివి అట్టుపైనన్నిట్లు నిష్కారణముగ విడనాడుట కెట్టిపరాగతమొనర్చి యుంటినని? కటకటా కాలమహిమ. అయ్యో! ఎంతటి దుస్సహ దురభిప్రాయ మొదవకున్న నట్టి కఠినశాసనము బంపియుందువు తలచినంతనె గుండెలవియుచున్నవి. సహజమార్దవార్ద్రమగు నీ మనోరాజ్యమెట్టి యీర్ష్యాతపముచే శుష్కించి దహించెనోగదా! మాత్సర్యానిలసంక్షోభితమయ్యె దుర్నిరీక్ష్య తేజోవైదగ్ధ్యంబున నెసలారు నీబుద్ధినిరుపమానమైనది. ఎంత యున్న నేమిఫలము. ఆడుపుట్టుక కడుదౌర్భాగ్యము స్వాతంత్ర్యమే హుళిక్కిగదా. స్వకీయస్థూలసూక్ష్మ శరీరంబుల సంపూర్ణముగ మగనియధీనము జేసియు నాతని మెప్పువడయుట యరుదు. ఇహమందునసెకాక యాముష్మికంబందును తనయధికారమే నెగడవలయునని మగడుగోరుచుండు. ఔరా మగవాని యహంభావమున కెట్టి మేరయు లేదుగదా. స్త్రీలయందగు పడిన ఘోరకిల్బిషావహములగు గుణములు తనయందున్న నైలాటకములనియు, గౌరవనీయములనియు గొన్నిపట్ల విధివిధానములనియు సమర్థింపగలడు.—ఇందేమున్నది. మదీయశ్రేయోకాంక్షితుఁడగు మేనమామ సద్గుణఖనియు భిషజ్మణియుఁనగు చాణుక్యభట్టారకుడు నాతో నొంటరిపాటున ముచ్చటించెనట. వచ్చెననర్థము. ఎంతటి యుపహాసముగ నున్నది. సకలనీతివిశారదుడు సర్వానుభవ విరాజితుడు పూతచరిత్రుడు, మిత్రగుప్తసార్వభౌమ సంతతి వాని సుమంత్రిశేఖరుడు ఈ విశ్వామిత్రునకింతటి యుట్టిపాటువ ననూయాభావ ముద్భవించెనన్న నమ్మవారెవ్వరు?—కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యముల చర్యలతిభయంకరములు అవి యుత్పత్తిల్లుటకు బూర్వజన్మ దుష్కర్మ పరిపాకమె కాని యన్యకారణ మనావశ్యము. అందున నీమాత్సర్యానలము విజృంభించెనేని మనోరాజ్యము నొక్కుమ్మడి దహించివేయగలదు. ఈ ప్రచండదుర్గుణము జనింపకుండవలయుగాని సంభవించుచో నున్మూలింప నెవ్వరి తరము. కటకటా దుర్భరము. జన్మాంతమునకైన నాకిఁక విశ్వామిత్రుని సేవలభింపగలదా కల్లకల్ల. పునర్దర్శనమైన కల్గించుకొనెదమనిన నాతని చండతరశాసన మప్రమేయ మహా మహీధరమైయున్నది." అనియావిలాసవతి జోటజోటుగాను కన్నీటితో వాపోవుచుండెను.

ఇంతలో వేరొక యేలబ్రాయంపు లేమ గంధగజేంద్రయానంబు నవ్వనాంతర్భాగంబున జరుగిడుచుండిన యాచిఱుతవాని నెత్తి ముద్దాడుచు సమీపించెను. ఆమె సంభ్రమముతో "గిరిజా! వీఁడా దుష్యంతకుమారుని మించునట్లున్నాడు సుమీ" ఇప్పుడే వీనికెంత పౌరుషము ఆనెమలిపై కొక్క శునకము శరవేగమునరా నదల్పబోవుచు గర్జించుచున్నాడు" అనెను.

గిరిజ:—సావిత్రీ! కాలాహికవిషానలము సహజ సౌభాగ్యము ఇందుకింత యచ్చెరువేల?

సావిత్రి:—అన్నా! ఏటికింత నిరుత్సాహయైయుందువు!

గిరిజ:—లేక యేమి కొదమసింగమునకు భూరిపరాక్రమమే భూషణము. అట్లనిదానిని ముద్దాడుట సమంజసమగునా. నిరాడంబరమై ధర్మైకపరాయణత నెసలారు దివ్యపరాక్రమంబునే భళియనవలయుగాని స్వార్థపరత్వాంకారాదికఠోరకుతారసము పొజ్జితంబగు మగవాని రాక్షస పరాక్రమంబు నింతలుసేసి శ్లాఘింతునేల

సావిత్రి:—ఇదియా! బోధపడినది. స్వార్థపరత్వము పురుషునికొక కళంకమేకాని యాతని సహజపరాక్రమమెల్ల మమత్వచోదితమని క్రోడీకరించుటపోలదు.

గిరిజ:—నీవేమన్నను సరియే పురుషజాతికున్నదెల్ల నయవంచనయే పరాక్రమమైన నెందున్నది? తనయానందము, తనసౌకర్యము, తనయధికారము, తనవిద్యాపాటవము, తన నిరంకుశత్వము జూచుకొనువాడె కాని వీనిని నిజసహధర్మచారిణికిఁ బంచియిచ్చిన యుదారు నొక్కనినైన జూపగలవా వానికౌదార్యమేదీ. మనత్యాగ మొక్కింత బరికించుము. దైవసములగు తలిదండ్రుల వీడితిమి. చిన్ననాటి మిత్రుల నెడబాసితిమి పుట్టినయింటికిదూరమైతిమి. మగని నిరంతర సేవకు,బూనుకొంటిమి. అతని యానందమినుమడింప చిన్నికందువలరూపమున మనదేహముల విభజించి సమర్పించి కండువాటియుంటిమి. మనసారగొల్చుచుంటిమి. తనకష్టసుఖములు మనవిగనె భావించి యనుభవించుచుంటిమి. దుర్బలమగు మనమానవశరీరమింతకన్న నెక్కుడేమిచేయగలదు.

సావిత్రి:—అనుభవవేద్యమగు నీమాటకాదనలేను దురంత దుఃఖపీడితవగు నీ యాశయమునకు దురభిప్రాయవశుఁడైన విశ్వామిత్రుని పరాఙ్ముఖత్వమే కారణము. ఇట్టివిశ్వామిత్రులకు లోకమున గరవులేదు. కానిధర్మబద్ధమగు ప్రపం

చరణిని నీవన్నంతవిపరీతముగ లేదు. పరమపురుషుడు పురుషుడు ప్రకృతి స్త్రీ పురుష ప్రకృతుల యన్యోన్యానురాగముననే విశ్వమెల్లయు విలసిల్లుచున్నది. ఇచ్ఛాతారతమ్యమున్నచో సమత్వముండదు. సమత్వముననేగాని ప్రేముడి యలవడదు ప్రకృతిపురుషుల వ్యక్తపరబ్రహ్మయొక్క వ్యక్త పరిస్థితులేయనదగు. గ్రహించితివా వీరియందెవ్వరిని ఘనులనందగును ఇట్టిదే సంసారమందలి యాందోళనమునకును గారణము మనకిన్ని బాధ్యమి పురుషుడెంతకాల మీమహాస్వాతంత్ర్యము ననుభవింపగలడు?

గిరిజ:—నిజమే సావిత్రి ఇంతయధికారమున్నదాన వేటికి మగనాలుకా నొల్లనైతివి సన్యసించితివేల?

సావిత్రి:—గొప్ప ప్రశ్న. సతీపతులపొడిమి యిట్లుండవలయునంటినిగాని పత్నిత్వము స్త్రీకప్రమేయమని నుడువలేదు. నాస్వాతంత్ర్య సూత్రము ననుసరించియే బ్రహ్మచర్యము ననుష్ఠించుటకు పురుషునకున్న పాత్రత మనకునుగలదని యెఱుంగవా తాపత్రయ సంక్షోభిత సంసారనీరధియందు దరిదాపులేక యల్లాడి దొప్పదూగుటకంటె స్వచ్ఛంద బ్రహ్మచర్యవిహారమున నీ సర్వ సర్వం సహాశేముషీ ధౌరంధర్యమును విలోకించి యానందించుట పోలదా?

వీరిట్లు వితర్కించుచుండగ మతాంతరముననున్న దేవాలయములోనుండి ఘంటానినాద మతి గంభీరముగ వినబడెను. శ్రీబుద్ధభగవానుని సంధ్యార్చనకు సమయమైనదని యమ్మైత్రకాశినులిరువురు బాలునిదోడ్కొని మందగమనమున లోనికేగిరి.

రాజాంతఃపురములకు వాసియు వన్నెయు సమకూర్పజాలు నీవిదుషీమణులిట్లు విరాగులై సన్యసించియుండుట కడు నక్కజముగదోపక పోవదు.

[2]

“భ్రమరికా! ఏటికిట్లు చేలవై విలపించెదు. ధైర్యమూనుము.

భ్రమరిక:—నాథా ఎంతటి సాహసినిగానున్న నిట్టి విపరీతములందిలకించియుఁ బ్రాణములబాయకుంటిని అయ్యో! ఎట్టి దుర్ముహూర్తమున నాప్రాపునీకుఁ గల్గెను నాయట్టి హతభాగ్యురాలెవ్వరైన గలరా హా హతవిధీ!

నాథుడు:—వలదుడుగుమా. ఇంతమాత్రమునకే యింతవలవంతతగునా? ఇప్పుడెంత దుస్సహముగనున్నను సుస్థితి శుభపరిణామమేయగునని యాసగలదు.

భ్రమరిక:—ఇంకను అడియాసలేటికి? కృపామయుఁడగు సార్వభౌముఁడన్యదేశమేగియుండునేని మనదురదృష్టము ఈయుపజాత వేదన కక్కటికముగయుండునని యూహింతు?

నాథుఁడు:—సందేహమేమి? చెలువా! పురుషవృషభుఁడగు విశ్వామిత్రునెంతి కేరడముగ బల్కుచుంటివి! అణిమాద్యష్టాంగసాధకుఁడై, నిగమవేత్తయై, ధర్మైకతత్పరుఁడై నిష్కపటదీక్షాపరాయణుఁడై, నిత్యసత్యవ్రతుఁడై, యశఃకాముఁడై, సూరజనచూడామణియై యొప్పారు విశ్వామిత్ర భట్టారకునే చెప్పఁదలంతువా! ఎంతటివాఁడుగానున్న లోకజనకుఁడా సార్వభౌముఁడీతనిఁ దనప్రతినిధిగా నొనర్చి నిరాటంకముగా దిగ్విజయము సేయఁబోయెను. న్యాయైకశీలుఁడీమహోదారమనస్కుఁడు మనకొక్కరుపను వాటిల్లనీయఁడు ఇంతకు నానేరమైననేమి? నినువంచించి విడనాడనెంచితినా? మోసగించి బలిమినైన యొడబరచితినా? మనయుద్వాహముచే నీయాభిజాత్యము వమ్మగునా? లేక నందయశోదలిందున కంగీకరింపరా? మనమేమి వ్యభిచరించితిమా? నేనెట్టి కలుషము గావించితినని శిక్షింపఁగలఁడు ఇదిగో చెప్పుచుంటిని నిన్నటియభిషేక సమయమున నన్నాతఁడెంతయో జాలితో జూచెను. భ్రమరికా! నీవిట్లశుభముగ మరపిల్లనేటికి?

భ్రమరిక:—అయ్యో పిట్టపిడుగున మాచంద్రగుప్తుని మరణమేకల్గకుండిన నిట్టిదుర్గతి మనకు సంభవించియుండదు. శివశివ! ఇంతలోననే నాపాపాంకురము మొగ్గదొడగి పుష్పించి ఫలించవలయునా!

నాథుఁడు:—భ్రమరికా భగవత్ప్రసాదితమగు నీయపూర్వ సౌభాగ్యమునకు సంతసింపవా? అన్నా! కాలవిపరీతము సంతానోదయము కానున్న నలరి యువ్విళ్ళూరక దుఃఖించి దూషించుకొననయ్యెనా. పరమేశ్వరా-జగజ్జనకా. దయానిధే మమ్మింక నెన్నిభంగుల నాశనమొనర్ప నెంచితివి?

భ్రమరిక:—మిమ్మొకమాటుగ గబళింప నెంచిన ఘోరరాక్షసిని-అయ్యో ఈపాపార్జనమునకు మూలమగు మహాపాపిని నన్ను మన్నింపగలరా?

నాథుఁడు:—పరమేశ్వరా మాకికదిక్కు లేదా”

అని వాపోవుచున్న ఘనశ్యాముడగు నవయువకుని న
యనయుగళినుండి ఘర్మాశ్రుకణంబులు కలసి జాలువారు
చుండెను. వాని విశాల బాహుపంజర [illegible]
నుండుటచే నెమ్మొగము వివర్ణమై పరితాపంబున శోషించు
పూర్ణచంద్ర బింబమువోలె గళాహీనమై యుండెను. కాలువ
గట్టి పారుచున్న యాహారిణాక్షి యుష్ణాశ్రుతోయ మామె
యురస్థలిపై వల్లెవాటుగనున్న జిలుగుపయ్యెదను దడుపుచుం
డెను.

శోకాగ్నిచేదహించి కర్పూరమువలె కరగుచున్న దంప
తులజూచియుం జూడనేరని కారాగృహాధికారి ప్రతిముఖ
మునందున్న తనయాస్థానమున బదిలముగ గూర్చుండక పచా
రుచేయనారంభించెను. పాటలీపుత్రమందు మగధరాజన్యులు
నిర్మించిన కారాగృహము కడుగొప్పది. ఇంచుమించుగ న
త్రినిహిందూస్థానమంతయు నాక్రమించిన సామ్రాజ్యమును
శాసించు చక్రవర్తికంటెబిదొడ్డ 'బందిఖానా' యుండనిచో
సాగగలదా. నేను నాకాలమున బ్రిటిషుసామ్రాజ్యమందు
న్నట్లు ప్రతిగ్రామమందును బంధనాలయములుండెను గనుక
నాకారాగృహాధిపతి కాళీదాసు నిష్కపటవర్తనుడు. అను
దినమును దస్రమోల బ్రదర్శింపబడు యమానుష దృశ్యములం
దిలకించివచ్చుటచే దయారసమాతని హృదయ భాగమున
నింకిపోయెను కాని నేడుమాత్రము తనప్రకృతికి భిన్నుడై
వర్తించెను. యుండియుండి "విశ్వామిత్రుచేటిగువ్వల జట్టి
సాధించుచున్నాడు" అని యవుకేకలు కీడుగవచ్చు నిజభట
వర్గముతోననుచుండెను. ఆజన్మాత్మల జీవితములచే గణ
డువాటేన యా మొఱలవినుడిం బాటింపక్వైరి.

ఎవ్వడో రాజభటుడొక తాళపత్రసంచికను గొనివచ్చి
వినయవిధేయతలుట్టిపడ కారాగృహాధికారి కందించిపోయెను.
నడిమివయస్సునిరిన వాడగుటచే దృష్టిమాంద్యమును సరకు
గొనుటకై వెలుగునకేగి, పాఱజూచి పంక్తులననుసరించి తల
యూపుచు సంచికయందలి వ్రాతనిట్లు చదివెను.

శ్రీశ్రీశ్రీ మౌర్యవంశపయఃపారావార రాకాసుధాకర
జగదేకవీర చతుస్సముద్రితమగధ సామ్రాజ్య సింహాసనా ధీ
శ్వరుడగు మిత్రగుప్త సార్వభౌముని యాస్థానంబున రాజ
ప్రతినిధి ప్రధానామాత్యాది బిరుదాంకితుడగు విశ్వామిత్ర
భట్టారకుని సమక్షమున జరిగిన యభియోగ విమర్శనము.

నింతితుడగు విష్ణుగుప్తుని కడగొట్టుకొడుకు మోహనగు
ప్తుడు విద్యావంతుడయ్యు, సంపన్నుడయ్యు, ముక్కి వె
నుకలాలోచనసేయక నియోగదమున, పుత్రశోకోద్వేలితుడను
వృద్ధుడగు నందగుప్తుని పుత్రికను ఘోరపరిస్థితులను కన్య
ను మంత్రతంత్రకుటిలోపాయములచే లోబరచి భంగపరిచె
ననియు, సకారణమున నామంగళ [illegible]
కుల హీనయై, నిర్భాగ్యురాలై పోయెననియు నేరమారోపింప
బడినది. నిజముహింతిక ఘనవంతుడగు రాజుగ్రాహ్య [illegible]
చినచో తనయింటిదశకొంత యుద్ధరింపబడనని యెంచి మ
నమడెఱుగునేని యాగ్రహాపరవశుడై తన్ను పుత్రీయుతముగ
వెడలద్రొబ్బునను భయముచే యశోద ఈ రహస్యమును
సంగుప్తముగావించెననియు రూఢింపబడినది. సాక్షుల వా
జ్మూలములు విశ్వసనీయములునగుటచే వానిపై నాధార
పడు తీర్మానము ధర్మబద్ధముగనుండదని నాయనుమానము
ఆరోపణకర్తనుపక్షమున కొనితేబడిన గ్రామదరికవాక్యములీ
విధమున నున్నవి. "జగత్సాక్షి యగు పరమేశ్వరుని సన్ని
ధిని బ్రమాణమొనర్చి పల్కుచున్నాను. త్రికరణశుద్ధిగా
మోహనగుప్తుని భర్తగా వరించియున్నాను అవ్యాజమై
అవిలంఘనీయమై, గాఢతరమయిన మాయన్యోన్యానురాగ
మీ యభాగ్య ప్రదర్శనమునకువచ్చుట నాపూర్వజన్మ దు
ష్కర్మ పరిపాకమునసే యని భావింతును. ఇందు నాకుల
గౌరవ మేమియుగంటలేదు. వివాహితులమై సుఖావహము
గు జీవనమునొవ్వెంచితిమి గాని విధివశమున ననేక కారణ
ములచే వలనుకాక పోయెను. ఈ సందర్భమున నాతండ్రి
కెట్టి యనుమతియు లేదని నాయభిప్రాయము."

వృద్ధుడు నందగుప్తుడిట్లనుచున్నాడు. ఈకైలాటమంత
యు నేనేమియుంగను మోహనగుప్తుడింతటి ద్రోహియని నే
నెన్నడు దలంచియుండలేదు. నేనాతనియెడ జూపుచుండి
న వాత్సల్యకారణముననే యంతటి చనువున నాయింట దిరు
గాడుచుండెను ఈ కల్లోలమంతయు సంభవింపకుండిన మా భ్ర
మరిక నాతనికిచ్చి పెండ్లిజేయుటకు మిగుల సంతోషించి
యుండునుకాని అభశుభము లెఱుగని యాయమాయకురాలి
నిట్టికొఱమాలినదానిగ జేయుటచేతను నాయునికి నేమరచి
తూష్ణీంభావమున నన్నొక వెఱ్ఱిబొమ్మగ బరిగణించుటచేత
ను మోహనగుప్తుని నేనెంతమాత్రము క్షమింజజాలను
రంధ్రాన్వేషణమున నీయప్పులెల్లను దీర్చి నీకు నారింజపండం
త బంగారమిచ్చు నట్లాజ్ఞాపించెదను—— మోహనగుప్తుని క్ష
మింపగలవా" యని నేనన్నమాటకు "ప్రభో! న్యాయ

మూర్తీ బంగారముసైనియాసచే సౌంసపుత్రిక నొకయపాత్రునకు విక్రయించ గల్గునంతటి చండాలుఁడగాను వలయు నన్నా నాథః ధికుని కానుకలు గాజేంద్రుని కోశాగారమున నే బడనింపు ఇచ్చుటలేకున్న బరమేశ్వరుఁడే న్యాయమివ్వ గలఁడు నిరుపేదల నాతఁడింకను విడనాడలేదు" అని క్రుద్ధుఁడై వృద్ధుఁడా పాదపుస్తకము వడకిపోయెను — ఒళ్ళసరియగు యశోదయూరక ఓగాత్ర్యము సేయుచు వొకప్రశ్నకైనఁదగు సమాదానమిన్వలేదు. ఇకనిందితునివాదము "నే నెన్నఁడసత్యమాడి యెఱుగను. ప్రమాణ మొనర్పఁగోరునప్పుడే సహజముగ గల్గలాసువాడననియు నిప్పుడట్లుచేయకూడదని దేవరనన్నాజ్ఞాపించునట్లు భావించుచున్నాను. నిష్కపటవర్తనుఁడనగుటచే నావాక్యములవిధేయతా సూచకములుగ దమకుదోచినచో నాకది నుఱియొక నిష్కారణ దౌర్భాగ్యమేయగును. భ్రమరికను నేనెట్టి మాయోపాయములకు లోబరచియుండలేదు. మాయన్యోన్యానురాగము కేవలము స్వభావజనితము. భ్రమరికను యదావిధిగ బరిణయమాడవలయుననియే నాయుద్దేశము కాని నందగుప్తునికుండిన కష్టపరంపరలలో దైవికముగ సంభవించిన పుత్రశోక మిందులకభ్యంతరమయ్యెను నాకే కానుకలక్కఱలేదనియు, వివాహమునకగు వ్యయమంతయు నేనే భరింతుననియు, తన్ను జననీజనకులతో మాయింటికే గొంపోయెదననియు, బుత్రశోకమునగుందుచుండిన తండ్రికీచర్య దుస్సహముగనుండుననియు, బుత్రశోకమున గుఱింగుచుండిన యావృద్ధదంపతుల నట్టిసమయమున వివాహవిషయమయి బాధింపరాదనియు నాయభిమానవతి నన్నువారించుచుండెను. తన్నెడబాసియుండుట నాకెంతయో దుర్భరమయినను ఓపికతో వివాహసంవిధానసమయమున కెదురుచూచుచు నిక్కల్యాణి సందర్శనము దీక్షతో వాంఛించుచునే యుంటిని. కాని యొకనాటి యొకక్రూర ముహూర్తమున మహాత్మ భగవంతుడు చిన్నచూపుచూచెను. ఆహా! వింతలయ్యెను=దుర్భరము దుర్భరము హతవిధీ భ్రమప్రమాదజనిత దోషము—మోహవిభ్రమము—మోహవిభ్రమము హా దౌర్భాగ్యము=ఘోరతరావమానము హా హా "యని మ్రగియుచున్నది. నిందితుఁడు మూర్ఛితుఁడగుటచే నభియోగమప్పటి కాపుదలచేయవలసివచ్చినది.

ఎల్ల యభియోగములందును సందర్భముల సమాహ్వాలించి సమీచీనాభిప్రాయ మొసంగు భారము న్యాయాధిపునిపాలనే బడియున్నది. ఈ యువిగారాత్రతచర్య ప్రాయికము విషాదకరముగనుండును. ఇటువంటి యుల్లంఘనలకు యువతీయువకులు సత్యసంకల్పానురాగబంధితులు. వీరి సంయోగమున వీరికులగౌరవమునకు రూపుమాసెననుట కే హేతువును లేదు. అయినను వీరియెడ నన్యోన్యాభివృద్ధినొందిన ప్రేమయు, సంశయాస్పదములగు పరిస్థితులయందునయినిట్లు పొడచూపుచున్నది. సుందరియగు పుష్పమొకటి తన్నెవరింపగలదో యారామమున నీతఁడే లేని సంగ్రామములబన్నియుండ నుండవచ్చును. అజ్ఞానదుష్చనపుడు నిఖిలవిద్యా, వయో రూప, సౌభాగ్యముల యున్నతిని గెలుచుకునియుండవచ్చును. ఆలసించినచో నెలప్రాయముననున్న నీవనము నెవరైనచో నాకర్షింపబడునను యాలోచనమున దిట్టమగు యశోదకుమార్తెను ప్రోత్సహించి యిట్టి నొచని చుకర్తనమున దోపించియుండవచ్చును. ఏదెట్లున్నను జరిగిన నేరమొనర్చినది మోహాసగుప్తుఁడేయనియు, తగుయత్నములజేసి తోడ్పడినది యశోద యనియు నిర్ధారము. జరిగినది నేరమేయనుటకెట్టి సందియము లేదు. ఏలనన:—విధివిధానమున నుద్వాహమయినగాని స్త్రీకి కన్యత్వమంతరించదు. వివాహమున మంత్ర సంబోధితులైన సమయమున, సమావేశమున పెద్దలయెదుట వధూవరుల యన్యోన్యాంగీకారము యుక్తముగను, వారితలిదండ్రుల సమ్మతితోడను కన్య వరుని భాగధేయము వరుడు కన్యకు భర్తయునగుట. ఇందెట్టి నియమము నుల్లంఘించినను స్త్రీయొక్క కన్యాత్వము నపహరించిన [illegible]మేయగును. అట్టిచర్యయందలి నిందితుఁడు పురుషుఁడే, న్యాయసూత్ర నిర్ణేతలు కరుణానిధానులగుటచే నబలలకీయభయహస్తమిచ్చియున్నారు. కన్యతనస్వాతంత్ర్యమును బురుషునకుగానుకగ నొసఁగుచుండుటచేఁ బురుషుఁడెట్టి పన్నాగమైన బన్ని కన్య నొడంబరచిన నట్టిది శాస్త్రసమ్మత వివాహముగానేరదు. కన్యస్వకీయచర్య సమగ్రముగ నెఱిఁగి యుండవలయును అట్లుగాక యజ్ఞపశువువలె కన్యను ధారవోసినను గ్రహించినను శిక్షార్హమగు చర్యయగును. వివాహవిధానమింత ధర్మబద్ధమైయుండగ నవివాహితుఁడై నిందితుఁడొనర్చిన దుండగమునకు మేర లేదు. విద్యాగంధమాస్వాదించియు నీతఁడిట్లు చరించియుండుట కేవలము సాహసముగనున్నది. "భ్రమప్రమాదజనితదోషము"ని యీతడు కొంత పశ్చాత్తాపము నటించుచున్నాడు. మానవమానసమునకున్న కళంకమే భ్రమ. లోకమునగల్గు నేరములన్నియు దానవే. అటులని

క్షమింప నేరితేరము. నందగుప్తుఁడన్నట్లే భ్రమరిక అమాయకురాలు, పాలబడినది పంచాప్రతమని యుపాప్యాంగెను. ఈయభియోగముచే నామె వ్రీడాభారమున గ్రుంగిపోవుచున్నది. తల్లి దుశ్శాసన మతిక్రమింపజాలనయవిధేయు, మోహానుని మోహనమూర్తిఁదేటిచూడ నేగనిచపలచిత్త, కన్నతండ్రి కష్టములకోర్వనోపరి కరుణాంతరంగి, మూఁడేన ముప్పునైన నరయకున్న ముద్దరాలి భ్రమరికను జూచిన గడు జాలిగొలుపుచున్నది. “భ్రమప్రమాదజనిత దోషముల”నే యము నీచపలచిత్తుఁడనతికాలమున నరియొక “భ్రమరికను” జూచుకొన్నచో వింతయేమున్నది? తేదిప్పటి భ్రమరికనే యేలుకొనుమని వాలాయముగ శాసించుటకేరికెట్టి యధికారముయినగలదా ?

కావున నే నాకెంత విషాదకరముగనున్నను ఇట్లాజ్ఞాపించుచున్నాను.

[1] యశోదను జన్మమున్నంతకాలము కారాగృహమందుండవలయు.

[2] ఈనిందితుని మాఘ బహుళ ఏకాదశి. శనివారము అనగా ఏకాదశి మూఁడవ నాటి యుదయమున సూర్యోదయ సమయమున భీష్మమున— రాజుగారివ్యాఘ్రములకు బడవేయవలయును.

విశ్వామిత్రభట్టారకుఁడు.

ఇంతలో సేద దేరియుండిన భ్రమరిక కాళిదాసు విచిత్ర పతనలీలఁబరికించి మోహానుని జూచి చిరునవ్వునవ్వెను. పాపమామిథునమున కాలేఖయందలి యశనిపాతమెట్లు తెలియగలదు! కాళిదాసు జక్కవకవవోలె నుండిన వారి జూచి దుఃఖమువ్వారిగాగ నశ్రుజలపూరితముల నయనములతో లోనికేగి “అమ్మో” యనుచు దనపీఠముపై తారుమారుగ గూలబడిపోయెను.

[3]

రాజప్రతినిధి విశ్వామిత్ర భట్టారకుఁడు మోహానగుప్తునకు మరణదండన విధించిన విషయము వెల్లడి యయ్యెను. పాటలీపుత్రమంతయుఁ బురబురఁబొక్కిపోయెను. నిజాంతర్గతంబులనున్న వివిధాభిప్రాయముల బౌలు బాహాటముగ సూచింపఁజొచ్చిరి దుర్వారమగు జనవాక్యమును బంధింప నెవ్వరితరము.

చావుపుట్టుకలఁ గడచి బ్రదికెడు వారెవ్వరు రేపకడ మోహానగుప్తుఁడిట్లంతరించిన మీరుబాసటమై నిలువగలరా” యని మర్త్యలోకము నెకసెక్కెము సేయు చాడ్పున చండభానుడు మంజుప్రాంగుడై పశ్చిమాద్రింగ్రుంకెను కడగండ్లఁ గుందు వారికేమంగడ సౌందర్య రసామృతాస్వాదనమొకా నున తారకము బోధింమనగరలక్ష్మి సంశ్యోతీత దీపికాజ్వాలలతో, పుష్పమాలికల వివిధకుసుమ ప్రదర్శనముతో విటవాటీ జన్యస్వైర విహారంబులతో, బాలికాబాలకుల క్రీడాజనిత కోలాహలంబులతో, భజనపరుల భగవత్సంకీర్తనంబులతో నుజ్జీవితమై విజృంభించుచుండెను. రాజవీధిని వెడదయురముతో నిడుదబాహువులతో, గరకుమీసముల దువ్వుచు తను త్రాణదారులైన రాజభటులు ఇట్టుటువీర బాహాబాహిని హుటాహుటిని బోవుచు మిత్రగుప్తసార్వభౌముని వైభవమును జాటుచుండిరి

అపుడా సావిత్రి కారాగృహాధికారి కాళిదాసును వెన్నాడి రాజవీధిని ససంభ్రమమున బోవుచుండెను. నీలములై నిడుదలైయుంగరములు గట్టి నిగనిగలాడుచు బాహువల్లరులమైన నుపిఱుందులవరకు నల్లాడు విముక్తకేశపాశియు, శుభోన్నతమై చిరుచెమ్మటచే జెమ్మగిల్లి చెలువొందు విశాల ఫాలభాగంబును, దట్టముగ బెరిగి మనోహరముగ వక్రతనొందిన కన్బొమలును, విచలితవిస్ఫారితములై శరచ్చంద్రికా జాలమువోలె మనోహరదృక్చంద్రికావారము వెదజల్లుకన్గవయు సూటియై సొబగునించునాసికయు, విచ్చిన దొండపండువలె నున్న పాటలాధరంబును, అతుల్యమగు నా దంత మౌక్తిక పంక్తియు, శీర్షికలేని శ్రీకారములట్లున్న కర్ణయుగళియు, అచ్చపు గజదంతంబున దొలచినట్లున్న స్నిగ్ధంబులగు బాహుదండంబులును విరాగియు నిరస్తభూషితయునగు నారాజ బింబాస్యకుఁబెట్టని భూషణములై యొప్పియుండెను. జిలుగు చెంగావి వలువచే గాటముగ బంధింపఁబడియుఁ గూలబడని పయ్యెద యందలి శృంగారముల యొడుదుడుకును, తాకినకందువారు మొటిమబుగ్గల బూరటింపును ఆమె యవ్వనప్రాదుర్భావంబును శరీర పాటవంబును మొగమోటములేక జూపుచుండెను. నిజాంగంబున విభూతిరేఖల దీర్చి రుద్రాక్షమాలికల దాల్చి తాళపత్రగ్రంథ మొకకేలను, పుష్పమాలిక యొకకేలను ధరించిన యాబ్రహ్మచారిణి భువినవతరించిన కాత్యాయనియో కాదంబరియో యన దోపట్టుచుండెను.

కాళిదాసు:—అమ్మా! రావణున కీడుసేయు రౌద్రము గలవాడీతఁడు నీవెట్లు జంకు గొంకులేక యర్థింతువో

సావిత్రి—: రౌద్రమేగాని రాగము లేదుగదా.

కాళిదాసు:—తప్పు తప్పు ఆధర్మస్వరూపుడైన నీకట్టి భీతి వలదు.

సావిత్రి:—సంతోషము ఇక నాపని యయినట్లే కాని ఆ దావు రెండు క్రోసులీయొక్క సీమయందే వచ్చితిమే ఇంకను నగరు చేరనైతిమి,

కాళిదాసు— ఇదే వచ్చితిమి. కొంచెము ఓపిక బూనుము లోనికేగి వచ్చెదను. ఈద్వారపాలకుడతి యమితారుడు కొంత విశ్రమింపుము" అనుచు జంద్రశిలానిర్మితమగు నొక దివ్యతర సౌధాంతరమున జొరబడి పోయెను. అనన్యరూపరేఖ సముజ్వలాంగియగు సావిత్రి గాంచిన ద్వారపాలకాది తటస్థుల యలపలమాగిపోయిన సంగతియు కాళిదాసుగుడు దనుక నామెవడసిన సంభావణ సత్కార్య సపర్యల వివేకించ నవసరము లేదుగాని యాచర్యలందు నాగరకతా భావము దంచితమై యుండెనన్న జాలును.

కాళి:— మంత్రివర్యుడిప్పుడు శాంతిమండప మందనుష్టానము ముగించి విశ్రమించియున్నాడు. తగుసమయమునకే రాగల్గితిమి. ఎట్లైనట్లో యొప్పించితిని. దుర్లభమగు నాతని దర్శనము లభించుట యొక శుభశకునము, భయపడకుము. విజయిని వగుదువుగాక. పితృసమానుడగు నీతండే నీసోదరికి ప్రాణదానము సేయగలడని జ్ఞప్తియందుంచుకొనుము. అని సావిత్రికిబోధించుచు లోనికిగొనిపోయి విశ్వామిత్రుడున్న ప్రమదావనంబున బ్రవేశపెట్టి తాను ద్వారము వెలుపల నక్కియుండెను.

సహజ కోమలయగు నమ్మానవతి వ్రీడాభరంబున దూగాడు తనూవల్లరితో స్మేరాంకురిత గండభాగంబులతో పిడచగట్టిన నాలుకతో చిడిముడిపాటుతో నల్దెసలగాంచుచు నయ్యావరణముం బ్రవేసించెను॥ రాజసౌధాంతర నందనోద్యాన మగుటచే నెంతయు వర్ణనీయమై విలసిల్లవలసియున్నను ధీరోదాత్తుడును విరాగియునగు విశ్వామిత్రుని ధీనమై యుండుటచే జలకమాడుటకొక కొలను, నిత్యానుష్టానముల నిర్వర్తించుటకొక చిన్న మండపము, అందలియొక చిత్రాసన ముందప్ప మరెట్టి చిత్రవిచిత్రములును లేవు.

ప్రశాంతమగు నచ్చోట సంధ్యాప్రార్థనాది నిత్యనియమితానుష్టానంబుల నిర్వర్తించి యేదోయొక గ్రంథము మున్నిడికొని తదేకధ్యానమున బఠించుచుండిన విశ్వామిత్ర భట్టారకుడు సమాధియందున్న బృహస్పతియో, వసిష్టుడో, ధూర్జటి యను నట్లామెకు గోపట్టెను అతని వక్షణపార్శ్వమున నతిమూరమున నున్న దీపిక వనోవీధియందలి శాంతిగాత్మనొక మండపమును వెల్గించుచుండెను.

కేశఘ్నమగుటచే రవకాంతిని మిలమిలలాడు విశాలోన్నతఫాలభాగ ప్రసన్న సుధీవైదగ్ధ్యమును, సోగలై ప్రోదియగు నల్లని కన్బొమలు సహజపాటిమమును, పొడవై సూటిదై చివర నొకింత వక్రరేఖ గల నాసిక వృషసంకల్పమును, లోతునుండియు నక్షత్ర తేజోకంపములగు నయనంబులు పరేంగితావగాహిత్వమును, నిర్మలమైన వైదిక బ్రహ్మచర్యదీక్షయు, కర్ణకుండల ప్రభాపటలిచే వెల్గొందు నిడుదచెక్కుల ఐశ్వర్యవిభూతియు, మందహాసద్యుతులాభిజాత్యమును, కురుచదనమై నెరసియుండిన శిఖ వయోనుభవజ్ఞానమును, మాంసలంబులై వర్తులంబులైన బాహుదండములు శరీరపాటవంబును, విశాలోన్నతోరస్థలము కరుణాంతరంగమును, ఏకాంతగ్రంథపఠనలీల ముముక్షుత్వమును ఆమహావ్యక్తికి వెలసియుండుట జాటుచుండెనని విదుషీమణియగు సావిత్రి దర్శనమాత్రమున గ్రహింపగల్గెను. ఆమె నావరించియుండు భయసందేహంబు లాక్షణమ్మున పటాపంచ లాయెను. ప్రఖ్యాత చరిత యాబ్రహ్మచారిణి వినయ వినమిత వదనయై నమస్కరించి తాదెచ్చిన పుష్పమాలిక మంత్రివరుని పాదములకడనుంచి చెదరుచున్న ధైర్యము జిక్కబట్టి "తండ్రీ ధర్మభక్తుడవగు నీమ్రోల నావిన్నపమొసర్ప సాహసించి నీ సమాధి కంతరాయము గల్గించుచున్నందుకీ దీనురాలిని క్షమింపుము. నాగారాబుతమ్ముడు, అవివేకి, నీతిబాహ్యుడు మోహనగుప్తుడొనర్చిన మహాపరాధమును కాదని సమర్థింపవచ్చిన మూర్ఖురాలనుగాను, కాని దయానిధీ నీదండతర శాసనము.—

విశ్వామిత్రుడు:—అబలా ఆశాసనము నాదిగాదు మరొక్కనిదిగాదు. కేవలము ధర్మశాస్త్రనిర్ణీతము. ఔపయిక మప్రమేయము. దానిబాటింపకుండుట యసాధ్యము.

సావిత్రి:—పురుషవరా మామోహనుడీ నిందలతోనే బుట్టియుండలేదు. దుర్వర్తనమాతని ప్రవర్తనమే, పరివర్తనదొలగించుటకై పరివర్తకుడనే దెగటార్చుట రోగనివారణమా [illegible]

విశ్వామిత్రుఁడు:—బాలా "అంగవ్రాతములో జికిత్సకుఁడు దుష్టాంగము ఖండించి శేషాంగశ్రేణికిఁ బ్రోదిసేయు క్రియ" కన్న నాచర్యభిన్నము కాదు. అతీపతితుఁడగు మోహనసేనుఁడు సంఘమునం గుండఁదగఁడు. అనినకటుభ్రకుటిమై పరాఙ్ముఖుఁడయ్యెను.

సావిత్రి:—ఓహోరా! కామధేనువగు ధర్మదేవత భీకరకరావదన గహ్వరయై రుధిరాంగియై ఇట్లు పరిఢవిల్లుచున్నదా ? కొండంతయాసతో వచ్చియుంటిని ఇకవాని మరువ బ్రయత్నింప నేమిసేయుదును." అని యనుకొనుచు వెనుకంజవేయుచు ద్వారమువైపుజూచెను. పాపము కాళిదాసు దలమోదికొనుచు కార్యమంత సునాయాసముగ గాజాలదనియు, కడుంగడుదీనయై బార్థింపవలయుననియు సచిహ్నముగ బ్రోత్సహించెను.

సావిత్రి:—పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా అహో! పురుషవరా అమాయకుఁడగు మా వెఱ్ఱిమోహనునిపై ఇంత చలమా సంహరింపనేవలయునా వాని సంస్కరించి సముద్ధరించుటపోలదా. శివశివ మా దౌర్భాగ్యము ; నీకింతయైన గరుణజనింపదాయెగా.

విశ్వామిత్రుఁడు:—చతురిణి నీపెడగువేడబుల కెడమేమియులేదు. చాలించి వెడలుము.

సావిత్రి:—ధీరవదాన్యా! చిరంజీవమగు కారుణ్యవైభవ మెఱుంగని వాడవుకావు. ధర్మవాదంబున దయాదాక్షిణ్యములకెనవచ్చునేది! చూడవా బహుదేహధారియగు మేఘుఁడు ప్రచండపవనచోదితుఁడై ధరాధరశృంగతాడితుఁడై జలుజల్లుమని వర్షంబుగురియుచున్నాడు. సర్వవ్యాపియగు కరకలి నిఖిల జీవగణంబులచే నహర్నిశంబులఁ గలింపఁబడియు నసువులనొసఁగుచున్నాఁడు, కరుణారసప్రపూరితయీ సర్వసర్వంసహాప్రాదేశ మాత్రుఁడగు కృషీవలుని నాగేటిపోటు మన్నించి కడుపార యారగింప సస్యసమృద్ధినిచ్చుచున్నది, నిరవధికబల సంపన్నమగు మహామహీధరము శతఘ్నీనియములచేఁ జీల్పఁబడి పసిండికుప్పల బరిదానము సేయుచున్నది. అగాధయనన్యగంభీర సమోపేతయగు ప్రాయేఱు మర్మభేదన మోర్చి నవరత్నముల బ్రసాధించుచున్నది. తేజోనిధానుడగు లోకబాంధవుఁడు దూషింపఁబడియు, నిరసింపఁబడియుఁ దనమైత్రివిడువకున్నాఁడు. పంచమహాభూతములే ఇట్లు తమకుదగ్గఁబాటింపక దయాదాక్షిణ్యముల జూపుచున్నవి. గిల్లఁబడికుసుమము సౌరభమునింపుచున్నది. బక్షింపబడి ఫలము మృతరసము నీనుచున్నది. ఛేదింపఁబడ వృక్షము మనుజునకాశ్రయమై యెసఁగారుచున్నవి. పవనమంది పట్టుపురుగు జిలుగుపట్టంబగుచున్నది. దండతాడితమై యశ్వము శరవేగమున ఒయనముసాగించుచున్నది. నిర్బంధింపబడినకోయిల సహజగానమాధురీఝరిలహరిచే సెవులపండువు సేయుచున్నది. అల్పములగు నీసజీవ నిర్జీవతిర్యగ్సమూహము లెల్లయు సమయ సందర్భములగాని పాత్రాపాత్రగాని సరకు సేయక తమ్మునాలిన ధర్మమేచేయుచున్నవి. ఇంతేకదు విశ్వసంపోషణకున్న కీలకమేయిది. అట్లుండ మానవశ్రేష్ఠుడవగు నీవు మామోహనునికి బ్రాణదానము సేయుటపోలదా. నీయధికారమునాకున్ననింతమాత్రమున కభ్యర్థినింత గవ్వసేయుదునా ?

విశ్వామిత్రుడు:—కల్యాణి (ఇఁకవిశ్వామిత్రుడోర్వలేకపోయెను.) నీవాగాడంబరము స్త్రీప్రాంజలులగు ప్రపవతంసుల పేరోలగంబుల జూపడగినది—మోహావిభ్రమమున మున్నమిన్నగానక, స్వీయాభిజాత్యమున గర్వించి, విద్యావయో సౌభాగ్యముల దుర్వినియోగించి కల్లకపటమెఱుంగ నేరని క్రొత్తడిని వంచించి మానధనంబపహరించిన నృశంసునా క్షమింపుమనుచుంటివి ? చాలుచాలు నిక మగలుము.

సావిత్రి:—చిత్రముగనున్నది. ఇట్టిదుడుకొనర్పని దెవ్వరు ? ఒనర్చి శిక్షింపఁబడిన దెవ్వరు ? భ్రమప్రమాదజనితదోషమున గూల్పడని యాయస్ఖలితులైన వెవ్వరు ? శ్రీహరివినోదమునకు మోహినియై నాట్యమాడినపుడు నిరంతర స్మశానవాసియు మహావిరాగియునగు నాగస్వామింగరాజుని గతియేమయ్యెను. వనవాసముచే సమసి యుపవాసముచే నలసి యౌవనము వాసినగౌతముని పత్నిఁజూచిన నాజన్మంపుటోగిరముతేగాని యారగింపని యావేల్పులరాయని ముమ్మరమేమాయెను. చినిగినగుడ్డకట్టుకొని చింపిరితలతో మహాదుర్గంధ భూయిష్టమైయున్న మత్స్యగంధిగాంచిన పరాశరుని చిత్తస్థైర్యమేమయ్యెను. ముసలిదానిఁ యొకడు మోటుదానిఁజూచియొకఁడు తమ తాల్మిగోల్పోయిరి. అహా ! యెట్టిపిటాగ్రేసరులు. లోకులెల్లరు వీరినగ్గించువా

రె కాని నిందించువారు లేరట. కులవయోరూపంబులం గొనరాని కోమలిం గోరినందుకై మీసలురాని మోహానునకు శిరచ్ఛేదనమా ? ధర్మమెంత వక్రగతినొందినది. హా! హతవిధీ. ఇంతహృదయభేదనమా.

విశ్వామిత్రుడు:—చతురవచోవిలాసినీ ! నీనుడుల నాయాశయములతో ననువొందకున్నను నామానసము నలరించుచునే యున్నవి. కాని గత్యంతరము లేదుడుగుము.

సావిత్రి:—ధీరవదాన్యా ! కామధేనువుకడ గడ్డిపరకను గోరినట్లు నేను నాయీచిన్ని మొర విన్నవించితిని. నీఘటనాఘటన సామర్థ్యమునకుం బారముగలదో ? ఒకత్రుటిలో నాఘోరవిహ్వలగ్లానిని జల్లార్పంగలవు. మోహానుని బ్రతికించిన నిన్ను భూషింపనివారుందురా ? ఏటికిట్లలయింతువు కానిచో వానిదేశాంతరమునకైనం బంపివేయుము. కరుణింపుము [అని శోకభరంబున నాతనిపాదములపైంబడెను.]

విశ్వామిత్రుడు:—ఉన్మాదినీ! ఈనీప్రార్థన సమంజసమైనచో విష్ణుగుప్తుండే జోక్యము కలిగించుకొని యుండునని యూహింపంజాలవా ? ఇకంజాలింపుము సత్వరముగ వెడలుము. [అని యించుక తొంగిచూచును.]

ఆహా ! అలనాండు పతివ్రతాశిరోరత్నమగు సావిత్రి పరేతనాయకుని తన జీవితేశ్వరు రక్షింపుమని యింతసకారణముగ సకరుణముగ అడిగియుండలేదు. అతండింత నిర్మొగమాటముగ తృణీకరించియు నుండలేదు. తుదకింతయేనా !

సంక్షుభితకరుణాంతరంగ తరణితరంగ మాలకాడోలికలెల్ల నానిశ్చలనిష్కళంక నిర్ధారిత మహోత్తుంగ పాషాణముపై దుత్తునియలై విరళింపవలసినవేనా ? చటచటనొద్భట ఘటనాఘటనవధరించు మిన్నేటిజూటి నాటిపోయిన ధూర్జటి యాదలంబంకింపండా ? అకుశ బ్రహ్మచారిణీ వదనప్రభాగుంభిత తపణారుణ కిరణవారంబునై యాహిమవంతుండు కరగి యమృతతోయంబులం బ్రసాదింపండా ! ఏమో మాతము...

యల్లాడుచుండెను. చేగాలున నొకగాలి విశ్వామిత్రుని యశాదలపైబడి యధోముఖముగం బ్రాకిపోయెను. సకలశాస్త్రపారంగతుండగుటచే శకునసూచనను బాటించుమూర్ఖుండుగాని సమయజనితాందోళనమున నప్రయత్నముగ నవ్వెను. నిజాంతరంగమునం గూలంకషముగ దుఃఖమునొందుచున్నను, మహాసంత్రియైనను సునుజుండే యగుటను జాటిన యాతని తత్తఱపాటునుగాంచి యామోహము నవ్వునాపుకొనంజాలకపోయెను. ఇంకేమున్నది ఇంద్రజాలమై పోయినది. తన్నెక్కుపెట్టి చూచినట్లుండిన యామూఢ్కి విద్యుల్లతవోలె మెఱసిన యాదివ్యతేజము, కిన్నెర మీటినట్లుండిన యామంజులహాసము, గనుగొన్న విశ్వామిత్రుని హృదయకలశము, భగ్నమై మోహావిభ్రమరసంబు గురియందొడంగెను. పాడుబల్లీ !! యెంతపనిచేసితివి.

విశ్వామిత్రుడు:—నెఱజాణవు నీవిన్నాణమెంతయున్నది నీపేరైనం దెలుపవైతివిగా.

సావిత్రి:—నాపేరు సావిత్రియందురు. మీరు సదయహృదయులగుట మామోహానుండు పునర్జీవితుండని యెంచుచున్నాను. నేనీరుణమెట్లు తీర్పంగలను.

విశ్వా:—నీవున్న మోహానున కేమి కొదువ ? కానినీవెంతచక్కని పేరు. నీవిషయమే ముచ్చటగనున్నది.?

సావి:—పితృసమానులగు మీరికను యుగ్రగడింపుట నాదుర్దృష్టమే ఘోరావమానాస్పదమైన కరాళ నిందాస్త్రాని మామోహాను నెట్లు సేయుదురు.

విశ్వా:—నీయిచ్చవచ్చినట్లొనరింతము. త్రిలోకసుందరులని పేరెన్నికంగన్న మోహినీ అహల్యసత్యవ్యగంధుల నిరసించుటకు నీవెతగుదువు?

తోడనే యామె దండతాడిత భుజంగమువోలె నొక్కత్రుటిలో దనసహజలాలిత్యము నుజ్జగించి ప్రత్యక్షదుర్గంబోలె నత్యంత గంభీరముగ నాలీఢయై నిలచి, దక్షిణహస్తాగ్రమునుండి యాగ్రహావాహినిం గేంద్రీకరించి నిశితభ్రుకుటితయై యట్టహాసమొనర్చి పండ్లుగిటకరించుచు రూక్షేక్షణయై మంత్రశేఖరు నుద్దేశించి యిట్లనియె.

ఆత్మస్తుతిపరనింద సర్వసామాన్యదోషము కాని యొరులయెడనున్న నింద్యము తమయందు నంద్యముగభావించుట భవాదృశులకేతగును. అనుచు నాతని హృదయకూపముంగలయగావించునొక గాటంపుచూడ్కి చూచెను.

అంత విశ్వామిత్రుఁడు "విదుషీమణీ! ఎన్నటికిని కాదు. ప్రమాదమున భ్రమించుటొక్కటి భ్రమప్రమాదమునఁ జరించుటొక్కటి. మోహాంధభ్రమ మీ రెండింట సమానమేయైనను, భ్రమించియు సమర్థించుకొని నిర్వ్యగ్రుఁడై న్యాయమార్గానుసంధాయియై గడతేరువాఁడెంత శూరుఁడో భ్రమించి సమర్థింపనేరక దుశ్శీలం జరించువాఁడంతటి యధముఁడు. శృంఖలాముక్తమయి విహరించు మత్తకరీంద్రమునకు వెలుకఁగూల్చువాఁడు శూరుఁడు. గత్యంతరముగానక దాని పాదతాడనమున మ్రగ్గువాఁడధముఁడు వీరిరువురకును సూర్యఖద్యోతాంతరమున్నది. నీవెట్టిమోహానుఁడు నాకొక యుజ్జియా?

సావి:—భ్రమప్రమాదజనిత దోషము స్త్రీలోకమునకు గూడ సామాన్యమేకాని యహంకారపూరితులగు పురుషులీ పాటిసాటిఁపరుగదా!

విశ్వా:—అదివారి ఛాందసమేకాని పౌరుషము కాజాలదు.

సా:—తామింతవఱకు గ్రహించినఁజాలును. ఇఁక దాపనేల! పురుషవరా! నేనవివాహితయగు కన్యను మీ రెంతకప్పిపుచ్చినను, మీయింగిత మెఱుఁగనివానఁగాను. అని మందహాసమొనర్చెను. ఇఁకేమున్నది? మంత్రశేఖరుని జ్ఞానదీపిక యంతరించినది. విశ్వామిత్రుని యంతరంగమునావరించిన రాగాంధకారము బాహ్యగాఢాంధకారముతో నేకీభవించెను.

"ఓ చంద్రవదనా! తటిల్లతాసదృశనూతలతా! ఓనా బంగారుబొమ్మా! యనప్రియత్నముగ నుచ్చరించుచు సావిత్రిహస్తగ్రహణ మొనర్పనుండు నంత నామె తప్పించుకొని

(4)

కశ్యపుఁడు పాటలీపుత్రమునఁ దుండి బౌద్ధసంఘాధిపతి అస్ఖలితబ్రహ్మచారి. మౌనమాతని బాహ్యగుణములందలి ప్రధానాంశము. ఆతఁడెన్నఁడును సేలగనిఫేనుసటిం బాత్రి డయ్యెనన్న నాపరివ్రాజకుఁడెంతటి సద్గుణసంపన్నుఁడో యెట్టి కర్మయోగియో యూహించుఁడు. చిన్ననాటి స్ఫోటకపు మచ్చలచే నాతనివదనము వికారమైయుండెను కుడికన్ను కాయకాసి దృష్టివిహీనయయ్యెను. కారుసబ్బునుబోలిన కాయమువాఁడు. బోసినోటముసలిఁడు. బక్కపలుచని దేహమును పిప్పిడిముక్కును, చిట్టినేత్రములును, అసహ్యముగనుండెను. మూర్తికిని గుణస్ఫూర్తికిని పరస్పరసంబంధముండుట స్వాభావికమని యెల్లరనుచున్నట్లుగ కశ్యపుఁడెంత వికారముగదోచుచుండెనో అంతసద్గుణవంతుఁడు. అంతరింద్రియమందు జ్ఞానదీపిక గల నాతనికేమిటఁగొదువ. ఆతని నెఱుఁగనివారు, పాటలీపుత్రమున నరుదు. అతనిపాదముల కెఱుఁగనివారునులేరు భగవంతుఁడగు బుద్ధదేవుఁడంతరించిన పిమ్మట నాతనికి సాటివారులేరని చెప్పవచ్చును.

కశ్యపుఁడప్పుడప్పుడు చెఱశాలకు వెళ్ళి యచ్చటి నిందితులకు సదుపదేశము గావించుటకుగూడ నవకాశముండెను. కూపస్థమండూకమువలె నన్యమెఱుఁగని కాశ్యపునుగూడ తరింపఁజేయవలయునని యాతఁడు తలచుచుండెను. ఇప్పటికే కారాగృహాధికారి తనవితండవాదములను మెఱపుదనము నువదలి సామాన్యమనుజుల లోఁబడసాగెను. భ్రమరిహా మోహముల దీనస్థితినిజూచి వహించినకరుణయే యాతనియందలిమార్పునకుఁ దార్కాణము కశ్యపుఁడు రాజగృహంలో నొక బౌద్ధపరిషత్తునుస్థాపించి బౌద్ధధర్మముల వెల్లడిఁజేయుచుండెను.





# శ్రావణలక్ష్మి.



బ్రహ్మశ్రీ, రామకృష్ణ సీతారామ సోదరకవులు, శతావధానులు.

సకల శుభవాసరములకు । జనన సీమ
బాలికారత్నములకుఁ జు । ట్టాలసురభి
శాడబావళిపాలిఁటి । పాడిపంట
కాఱుమబ్బులకెల్ల వి । హారవనము
మత్తబర్హిణులకు నాట్య । మందిరంబు
నగుచుశ్రావణమాసంబు । సొగసునింపె
నిరుపమానందకరము లౌ । నిస్వనముల
భావగీతంబులను నదుల్ । బాడఁదొడఁగె ;
నభినవతృణాంకురముల శ । య్యాతలమునఁ
బండిభూసతి నూతన । ప్రసవవేద
నల ననుభవింప ; బుధులు సు । స్నాతులై ప్ర
భాతవేళల నరుణ మంత్ర । పఠనసేయ ;
జిలుఁగు పావడఁ గట్టి మం । జీరమంజు
ళారవము ముగ్ధజనుల మో । హమునముంపఁ

గోరపుం బ్రేమ నూత్న వ । ధూటియత్త
వారి యిలుఁజేర మెలమెల్ల । పయనమయ్యె ;
"అత్తవారింటి కోడల । వమ్మ ! నయము
భయముఁ గలిఁగి నాథునిత్య ప్రీఁ । బరపుమమ్మ!
తల్లి ! నీవ్రత దివసముల్ । దాఁటువెనుక
నాన్న యరుదెంచు నెమ్మి నా । చిన్నికూన !
కనుల నీర్నింపఁగారాదు ; । కలికి వేగ
పోయి రావమ్మ ! " యని తన । పుత్రినపుడు
పంపఁగాలేక జనని దా । బంపుమండె ;
పసుపు కుంకుమ గంధము । పచ్చ నక్షు
తలుగలుగు పాత్రికమ పాణి । తలమునందు
వరలఁ బ్రతియింటి కేఁగి సు । వాసినులకుఁ
జిన్నికన్నెలు బెట్టిరి । చిట్టిబొట్లు ;
ఆగి యారకయున్న నీ । లాలకముల
వాలు జడనల్లి జిలుఁగు దు । వ్వలువఁ గట్టి
కేలఁ బాత్రిను గైసేసి । పూలకోఁట
కరిగె నొకకన్నె దా వ్రత । మాచరింప
గరమునను వెండికుంకుమ । భరిణమోయఁ
దరుణి వలపులభరణి మం । దమగుకరణి.
వెంటఁజెలులేగఁ దేర "మా । మాయింటఁ జేరఁ
టు"మ్మనుచు బొట్టుఁ బెట్టిమో । దమ్ముతోడఁ
బిలువఁదొడఁగెను ముత్తైదు । వులవధూటి ;
ఏమినోమునో? దేవత । లెవరో ? ఫలము
దేమొ? చేయఁగఁలదగువిధు । లేమొ? సలుపఁ
జాలుదురొ? లేదొ? కానియే । బాలికలను;
గన్నముత్తైదువులఁ జీర । గడఁగిరపుడు;
"భౌమవారవ్రతంబు త । ప్పక మతెన్ని
పనులుగల్గిన మీరు రా । వలయు"ననుచు
మాటమాటికిఁ దేనియ । లూటలూరఁ
బిలచి రతివలఁ దొలికాలు । చెలియలెల్ల;
అపుడె పరిణయం బయి । నట్టి యబల

నిన్న మొన్న నీడేరిన । కన్నెమిన్న
చీర సింగారమెఱుఁగని । చిగురుఁ బోఁడి
పావడా లింక విప్పని । బాలసొగసు
మాటలాడెను ప్రౌఢ వ । ధూటి ; మెల్ల
మెల్లఁగావచ్చు పసిపిల్ల । తల్లి ; పలిత
శీర్షయగు నవ్వ యత్యంత । హర్షమునను
తోడివారలతోఁగూడి । వాడవాడ
లరసిప్రాయంపుచేడియ । లధికభక్తి
పసపుకుంకుమ కాటుక । ఫలయుతముగ
విడెము శనగలు కరమునం । దిడుచు "దేవి
యిస్త్రివాయన మియ్యదే । యిస్త్రివాయ
నం" బనుచుఁ బల్కఁగృపనాశి । షంబులొసఁగి
కర్ణపేయమ్ముగాభావ । గర్భితముగ
నెందుచింతలు మోసల । నెత్తునటుల
నొకరి నొకరుజయించెడు । నుత్సుకతను
కేలఁదాళంబుదట్టుచు, । బాలచూత
పల్లవగ్రాస పరభృత । వల్లకీని
నాదసమకర మధురిమ । మోదమొసఁగఁ
బాటలను బాడి; తమపాలి । పంట యనఁగ
వరలు శ్రావణ మంగళ । వాసరముల
సంజవేళల పురరమా । సతులనంగ
సంచరించె సువాసినీ । సంఘమపుడు



# పరిశ్రమలు.

## మా సూత్రచతురుడు.



మా మాసపత్రికయందు ప్రతియొక మాసమును క్రింద వివరించియుండు పరిశ్రమలను చర్చింతుము. మరియు స్వల్ప పరిశ్రమలను గూర్చియు ధనమార్జించు విధములను గూర్చియు వ్యాసములను ప్రచురింతుము గాన మా చదువరులు పంపు వ్యాసములకు ప్రచురింపబడిన ప్రతివ్యాసమునకును రూ 3-0-0 లు గాని ఒక సంవత్సరమునకు మాపత్రికను ఉచితముగా గాని పంపుదుము.

మరియు పరిశ్రమలను గూర్చి సూత్రములు గాని ఆంగ్లేయ మందులకు పదునాల్గు భాషలలో తర్జుమాగాని మా సూత్రచతురునికి వ్రాసిన ఉచితముగా మాసంచికయందు ప్రచురింపబడును. లేక ప్రత్యేకముగా తపాలుద్వారా గోరువారు నాలుగణాలు తపాలుకర్చులకై పంపకోరెదము.

ఇవిగాక వ్యాపార విషయమై జర్మనీ అమెరికా మొదలగు ఇతర రాజ్యములయందుండు గొప్ప వ్యాపారస్తుల చిరునామాలు ఉచితముగా కోరినయెడల ప్రచురింపబడును.

పై విషయములకై చర్చింపగోరువారు ఈ క్రింద వివరించియుండు మా విలాసమునకు వ్రాయవలెను.

రాబోవు సంచికలలో ప్రచురింపబడు

## పరిశ్రమల వివరము.

2-వ సంచిక—విద్యుద్యంత్రములు.
3-వ సంచిక—విద్యుచ్ఛక్తిద్వారా బంగారు, వెండి, రాగి, తెల్లరాగి, మొదలగు పూతలు పూయుట.
4-వ సంచిక—సిమెంట్లు మొదలగునవి.
5-వ సంచిక—మైనపు వత్తులు.
6-వ సంచిక—చెప్పులకుపయోగించు మెరుగు పదార్థములు.
7-వ సంచిక—సబ్బు ప్రకరణము.
8-వ సంచిక—వాసన ద్రవ్యములు.
9-వ సంచిక—షర్బత్తులు.
10-వ సంచిక—సిరా ప్రకరణము.
11-వ సంచిక—చాయాపట ప్రకరణము.
12-వ సంచిక—తంత్ర చాయాపటములు.

విలాసము :—

సూత్రచతురుడు, హిందూ శ్రీ, నంద్యాల.



బ్రహ్మశ్రీ,
అనుముల వేంకటశేషకవి
గారు.



బ్రహ్మశ్రీ గాడేపల్లి
వీరరాఘవశాస్త్రిగారు
శతావధాని.

బ్రహ్మశ్రీ గౌరావఝ్ఝల రామకృష్ణశాస్త్రి శతావధానిగారు
కీ॥ శే॥ అక్కిపెద్ది సుబ్రహ్మణ్యశాస్త్రిగారు



శ్రీయుత యం. సి. కణ్ణ
శెట్టిగారు సూత్రచతురుడు
"హిందూశ్రీ"



బ్రహ్మశ్రీ గౌరావఝ్ఝల
సీతారామశాస్త్రిగారు
శతావధాని.

# SMALL TRADES & INDUSTRIES

## (By our Farmulæ Expert.)

We publish in every issue of ours, topics on industries, arts & crafts. These sujbects, are open for discussion in the respective issues as follows. Such of them as are willing to send in their articles are requested to communicate the same to the Formulæ Expert c/o Hindhu Sree in either English or Telugu. Every one of the articles sent for publication and accepted will be paid for at the rate of Rs. 3/- per article or this journal will be supplied free for the period of one year.

Our Formulæ Expert will publish free of charge, answers for queries; and give addresses of American and German business firms. Generally questions will not be sent by post; but such of them as are desirous of receiving the answers by post are requested to send As. 4/- in stamps to defray postage and other stationary expences.

## Articles to be Published in the coming Issues.

2nd issue—Electric Batteries.
3rd issue—Electro plating and Electro typing.
4th issue—Cements, Glues, pastes and Mucilages.
5th issue—Candles.
6th issue—Boot Polishes.
7th issue--Soap and its by-products.
8th issue—Perfumes and Hair oils.
9th issue—Syrups, Sherbets and cool drinks.
10th issue—Inks and their manufacture.
11th issue—Photography.
12th issue—Trick Photography.

All Communications to be addressed to:—

**THE FARMULÆ EXPERT,**
**C/O**
**THE HINDHU SREE,**
**NANDYAL.**

## మీకు కావలయునా!

# మత, సాంఘిక,
# అపరాధ పరిశోధక,
# పౌరాణిక, చరిత్రాత్మక
# నవలలుగాని
# నాటకములుగాని

ప్రతి రెండు మాసములకు ప్రచురింతుము.

మా గ్రంథ నిలయమునకు ఎనిమిదణాల చందాను పంపి

ఆంధ్ర భాషాభివృద్ధి జేయుడు.

# శ్రీ బాల భారతీ గ్రంథ నిలయము,

నంద్యాల.

పై పుస్తకములు ఇతర పుస్తక వ్యాపారస్తులవద్దను దొరకును.



# రామచంద్రుఁడు

—: ఉమర్ అలీషా కవిగారు :—



రామచంద్రుఁడు దశరథ-రాజతనయుఁ
డై యయోధ్యాపురంబున - నవతరించె
గడిపె హితులతో తన బాల్య-కాలమెల్ల
కాలమంతయు గడియలై - గడచిపోయె
కానికాలంబు రాముని - గానివాని
సుగుణచారిత్ర ములగాని - సుంతయేని
మఱువలేదు మరెన్నడు - మఱువబోదు
దేవుఁడే దేహదారియై - దివిని విడిచి
భువికి దిగిరా నవసరంబు - బుట్టదెపుడు
ఎవరు బాల్యంబునుండి జి - తేంద్రియు లఘు
దేశసేవ యొనర్తురో - దేవుడట్టి
వారిహృద్వీథిలోనుండి - వరలుచుండు
మాటలేల తక్కినవన్ని - బూటకములు
రాముఁడాదర్శమూర్తి బా-ల్యంబు నుండి
తప్పనాడ డెవ్వరి బెట్టి-దములు పలుక
డాడి తప్పడు కలనైన - ననృత మన్న
మాటయెఱుఁగడు కాంతల-మాటలెపుడు

ఉబుసునకునైన ఎత్తఁడే-మున్నగాని
మిగుల మొగమాటులజ్జా వి-విశ్రితుండు
సఖులు సోదరు లనిలేక - సంచరించు
నమలప్రేమార్ద్ర పొంగిపొ-ర్లాడుచుండ
నిండు సంతోషమున దూగు - చుండు నెపుడు
నియమముల మీరి చెడుగురా - నీయ డెదను
మదము మాత్సర్య మనునవి - మొదలె లేవు
సదయహృదయుండు బహుసాధు - సజ్జనుండు
అతని సారూప్య మందఁగ - కబ్బవలయు
అతనివిజ్ఞాన మందఁగ - కబ్బవలయు
నతని నర్థించి యట్టియో-గ్యత గడించి
మాతృదేశంబు పూజించి - మనుట లెస్స
ఒక్కనాడు ప్రాతఃకాల - ముదయశైల
శిఖర మరుణాకృతిని దాల్చి - చెన్నుమీఱ
పక్షులు దయగీతంబులు - పాడుచుండ
కుసుమ సౌగంధములు మోసి - కొనుచునుండ
మందగతి పిల్లవాయువు - మాటిమాటి

కొండలు పులకితముగఁ జేసి - వేడుచుండ
అత్రిబ్రహ్మమహాత్మాన - ఆప్రశాంత
సమయమందు విశ్వామిత్ర-సంయమీంద్రుఁ
డరుగుదెంచె కషాయచే-లాంచలములు
నలుదెసల దగద్ధగితమై - యలరుచుండ
కక్షపాలయు దండంబు - యక్షమాల
కాంతులీనఁగ తనతపో-గర్వ నిరతి
తెలిపె బహ్మచర్యమునందు - తేజమపుడు
అతని కెదురుగ దశరథుఁ - డరుగుదెంచి
పాదలను మ్రొక్కి పూజించి - యతనిరాక
కేమి కారణ మన వహాని - యిట్టు లనియె
రామభద్రుని నాయజ్ఞ - రక్షణార్థ
మడుగుచున్నా నొసంగుఁడ - భ్యంతరంబు
లాడకని యర్థియైవచ్చి - యడిగి వాని
వెంట గొనిపోయె దండక ! విపినమునకు

* * * * *

రామునకు పదారేడుల - ప్రాయమైన
కౌశికునివంటి తీవ్ర స-న్యాసిగూడ
శిరమువంచి నమస్కృతి - చేసినాఁడు
చేతులారంగ నతనిపూ-జించినాఁడు
తల్లి దండ్రుల మాటలు - తప్పకుండ
సత్యము వచించువారిని ! సద్గుణాఢ్యు
లైనవారిని బ్రహ్మను ! లైనగాని
గౌరవింపక పోవ రే - కులమునైన (?)
మొగలియాకులు కురుచగా - ముళ్ళు నున్న
సౌరభంబుల్ ప్రతివారు - సన్నుతింత్రు
రటులె జ్ఞానముచే వృద్ధు - లైనవారి
నెల్ల వారును పూజింతు - రిందు నందు
కౌశికుండును రాముండు - కాన కే[illegible]
[illegible] సమ్మూరాలి దు-ర్వారఘోర

తాటకాసుర శిక్షించి - మాటలాడె (?)
నొక్కవ్రేటున తల రెండు - ముక్కలగుచు
బ్రయ్యనేసెను గుణమును - వట్టి రాము
డంతుల భయంకరుఁడు తీ-క్ష్ణావరుఁ (?)
డంత కౌశికుఁ డత్యంత-సంతసమున
పొంగి రామునిఁ గీర్తించి - కౌగిలించి
క్రమ్మరమున వశిష్ఠాశ్ర-మమ్మునకును
నడిచె నట పర్వ దినమొండు - గడుపుటకును
నాడు తత్ప్రాంతతపసిజ-నంబుగూడ
జూడవచ్చిరి ఆవశిష్ఠుని - కుటీర
మాదినము నిత్యకల్యాణ-మై దనర్చె
అందులో బ్రహ్మఋషులు మ-హాత్ములైన
దేవఋషులు రాజఋషులు - దీర్ఘ తేజు
లగుచు కోలాహలంబున - నలరుచున్న
నంత వసిష్ఠతపసి - యట్టెలేచి (?)
వార లొసగు ఫలపుష్ప - పత్రములను (?)
రోసి సూన్య హస్తుఁడయి జి-జ్ఞాసనొక్క
మూల నిలుచున్న శ్రీరామ-మూర్తిఁ జేరి
అర్థి పూజించి తెచ్చి య-గ్రాసనంబు
నొసఁగ నెల్ల రాశ్చర్యంబు - నొందిదాని
హేతువేమని యడిగి రా - ఋషిని ఋషులు
శిష్టగుణగరిష్ఠుండు వ - శిష్ఠుఁ డిట్టు
లనియె వినయము రేకెత్తు - నట్టు లపుడు
ఓ మహామునులార ! యీ-రామచంద్రుఁ
డతి సుగుణసాంద్రుఁ డీతఁడు బా-ల్యంబునుండి
దుర్గుణంబులు నెదలోన - దోలినాఁడు
సొంత ధనమును తృణముగా - జూచినాఁడు
పరుల కాత్మారములు ద్వార-వాసినాఁడు

పాడిపండగు తాటక - బట్టిదాని
చీల్చి చెండాడి జగతికి - క్షేమ మొసఁగి
శాశ్వతఫలంబుకన్న వృ-థాఫలంబు
లెన్ని మీరిచ్చినను వేట్క - నొసగబోవు
ఇట్టి ఫలములె మన మపే-క్షింపవలయు
చెడ్డ ఫలములు మనము వ-ర్జింపవలయు
నితనికన్న మహాత్ముఁడే - యిలనెవండు
ఎన్నితపములు చేసిన - నెన్నిజన్న
ములు నొనర్చిన తన స్వార్థ-మునకెగాని
అధికమేమున్నది మహా - పృథుయశుండు

స్వార్థము పరిత్యజించి లో-కార్థమాత్మ
దేహము సమర్పణము చేసి - దేశసేవ
సంఘసేవను నీ రీతి - సలిపినాఁడు
ఇతఁడు పూజ్యుఁడు గాక మ-ఱేమయగును
ఎవ్వఁడు జితేంద్రియులునై - యీశ్వరార్ప
ణంబుగాగ పరోపకా-రంబు సేయు
వారు బ్రాహ్మణు లైనను - బ్రాహ్మణేత
రాది జాతులవారైన - ప్రణుతి గాంచి
వసుధ పూజింపఁబడుటది - వాస్తవంబు.





# అద్దంకి పురష్టావధానము

(బ్రహ్మశ్రీ రామకృష్ణ సుబ్రహ్మణ్యకవులు, శతావధానులు.)

———:o:———

ఉ. ఎక్కడనో వధానముల ♦ నెన్నఁడొ జేసినవారమంచు మే
మిక్కడఁ జేయఁబూనితిమి ♦ కెందుసఁ బప్పునఁగాలువేసి త్రై
తక్కుల నాడనీయక సు♦ధామధురోక్తుల నీయుమమ్మ! నే
మ్రొక్కెదనమ్మ! నిదయ య♦మోఘ మటంచుఁ బలంచి శాంకరీ!

రా. శా.

సీ. ఏనీదు కరుణచే ♦ మానిత సుకవితా, వనితాకరంబును♦బట్టినామొ?
ఏనీదు కరుణచే♦నెసఁగ బాల్యమునందు, శబ్దశాస్త్రంబును, జదివినామొ?
ఏనీదు కరుణచే♦గానవిద్యాసక్త, ప్రజ్ఞానమృద్ధిని బడసినామొ?
ఏనీదు కరుణచే♦భూనాథ సత్సభా, గారంబులకుఁ బోవఁ♦గడఁగినామొ?

గీ. అట్టి భవదీయకరుణ మాయందుఁజూపి, ప్రేమనొనరించు నద్దంకి♦నీను సభను
జయముఁజేకూర్ప నిజనమ♦స్కారమమ్మ, ఆంధ్రబాల సరస్వతీ! ♦యజుసిరాశి

సు. శా.

## 1 ఈశ్వరుఁడు (తలకట్లు)

కం. అనయముఁదావక పదముల, మనమునఁ దలపంగఁజాలు♦మానవులకుఁ జా
వనపదమారయ శంకరుఁ, డనఘుండష్టావధాన♦మందుఁదగన్

## 2. ఖడ్గతిక్కన మత్తకోకిల

పాలుమాలక మన్నసిద్ధి నృ♦పాలశాశ్రవ వీరులన్
బాలిమై నెదురింపఁజాలక♦వచ్చినన్ సతి నవ్వఁగా
నాలమందునఁ జొచ్చివారల♦నంతమందఁగఁ జేసె ధీ
శాలినాఁదగు ఖడ్గతిక్కన♦శౌర్యమెన్నఁగ శక్యమె

## 3. శరత్కాలమందలి చంద్రోదయము

సీ. నిష్ఠాగరిష్ఠులౌ♦నైష్ఠికుల్ సంధ్యాది, విధులు నిర్వర్తించి♦వెడలుచుండ
అందందుఁ బొడసూపు♦నట్టి తమోరాసి, సందుగొందుల దూర♦సాగుచుండ
పూర్వదిక్కామినీ♦ముఖపంకజమున నూ, తనకాంతి పుంజముల్♦దనరుచుండ;

గీ. అందమైన శరత్కాల♦మందుఁబూర్ణి, మా నిశీథిని జంద్రుండు♦మానవాళి
చిత్తమున సంతసంబిగు♦రొత్తుచుండ, నుదయమయ్యెను గంటివే?♦సదయహృదయ!

4. సింగరికొండ నృసింహస్వామి, ఆంజనేయులు, భవనాసి, వచ్చునట్లుగా, వర్ణన:

చ. నరదురితంబు బాపు భవ♦నాశి యటంచుఁ దలంచి భక్తులన్
మఱి మఱి బ్రోవ నిద్దరొక♦మాటగ యోచనఁ జేసివచ్చి సిం
గరగిరి నారసింహుఁడనఁ♦గాఁబవమానసుతుండనంగఁ దా
వరలెదు దేవులిద్దరని♦వారణ దిగ్విజయంబొసంగతన్

5. "వ్యస్తాక్షరి"

శ్లో॥ మ్లేచ్ఛాహి యవనా స్తేషు; సమ్యక్ఛాస్త్ర మిదంస్థితం
ఋషివత్తేపిపూజ్యాం తే కింపునర్దైవవిద్ద్విజః

6. (సమస్య)

కం. ఆవ్వనమున విహరించెదు ; జవ్వని మోహాబ్ధిమునిఁగి♦జలజాంబకునిన్
నవ్వి; యటుపైన వెలుపుఁ (బువ్వునుఁ గని యొక్క పువ్వు♦బోడిభయపడెన్)

7. (సమస్య)

కం. సౌభాగ్యవతిగ వినినా, కౌభాగ్యమటంచుఁ బెండ్లి యాడఁగఁజని కాం
తా భాల్యరోమ రేఖయ(శోభన మనిదలఁచి పురుఁడు♦శోకించెమదిన్)

8. (సమస్య)

మ. జిష్ణుపాత్రిభవ కీర్తిశాలి నరుఁడా♦శింగాంచి వైరాటినిన్
దూష్ణీభావముఁబొందఁ గౌరవభట♦స్తోమంబుఁ జెండాడి వ
రిష్ణుండై తనరారఁగాఁగలవు చిం♦తిల్ పంగ నీకేల? నీ
(యుష్ణీషంబునఁ గట్టవచ్చును మద♦వ్యూహంబు నెల్లప్పుడున్)

9 గంటలు 74

10. చీట్లపేక ; ఆటడ్డీలు

11. వేణుగానము.

**13.** గణితము మొత్తం 984

| | | |
|---|---|---|
| 329 | 324 | 331 |
| 330 | 328 | 326 |
| 325 | 332 | 327 |

(అవధానము సంపూర్ణము.)

(బంగారు పతకము లిచ్చునప్పుడు చెప్పినపద్యములు)

ఉ. ఇంకఁగొంత ధీరునటు♦లెంతయు నొక్కమెడల్సువైచి య
ద్దంకిపురాన వైదికులు♦దద్దయు గౌరవ మాచరించిరీ
కింకవిరాజమత్తగజ♦కేసరి తిర్పతి వెంకటేశనా
మాంకిత శిష్యులక్ మము బు♦ధాగ్రణులక్ సభలోన శాంకరి!

అ. సు. శా.

సీ. కరుణామృతరసాబ్ధి♦కవిచంద్రములను దే, లించినాఁడు యశంబుఁ♦గాంచినాఁడు.
కన్నసంతానంబు♦కరణి నాశ్రితుల ర, క్షించినాఁడరుల శి♦క్షించినాఁడు
శ్రీరమానాథ ప♦దారవిందంబుల, ర్చించినాఁడఘముల♦దృంచునాఁడు
తనబంతిభోజన♦మొనరించువారిలా, లించికానుకల న♦ర్పించినాఁడు

గీ. ఘనుఁడుసర్కిలినస్పెక్ట♦రనఁగ ధరణి, నున్నతోద్యోగపదవిఁజే♦కొన్నవాఁడు
రామచంద్రాభిదుండున♦గ్రాసనాథి, పత్యమువహించి బంగారు♦పతకమొసఁగె;

గా. రా. శా.

(ప్రస్తావనగాఁ జెప్పిన పద్యములు వ్రాయలేదు.)

(పండితాభిప్రాయములు.)

శ్లో. వత్సరే రుధిరోద్గారా-శ్రావణ్యాం శుక్లపక్షకే
పంచమ్యాంగురువారేచ-అవధానం విశేషతః
సాయంకాలేఽవధానంతు-చక్రతుఃకవిపుంగవౌ
గురుపాదభక్తిరతౌ-శాంతి దాంతి విచక్షణౌ
సుబ్రహ్మణ్యరామకృష్ణౌ-ఉద్యోగిప్రాప్తవేతనౌ
పురాకృత్వావధానంతు-అత్యవాప్తయ శోధనౌ
వ్యస్తాక్షరాదిప్రశ్నేషు-ఘంటానాదాను బోధనే

సమస్యానాం ప్రపూర్త్యాచ - వంశనాదాభివర్ధనే
సర్వేష్వేతేషు పరిశ్లేషు - సర్వేజన్మని తామపి
ముదమత్యంతపరమాం - కారయామాసతుస్తథా
దృష్ట్వావధానం ముదితాః - యువాభ్యాం గిరికల్పితాః
సభ్యారేతత్పారితోషం - దత్తం వాం స్వీకురుష్వథ.

ఇట్లు
చల్లా శేషయ్య శాస్త్రి, అద్దంకి.

(కొన్ని వ్రాయలేదు.)

---

బ్రహ్మశ్రీ॥ "శతావధానులు" రామకృష్ణ సీతారామ శాస్త్రులు వారి
రామకృష్ణ సుబ్రహ్మణ్య శాస్త్రులచే విరచితములు

## విక్రయమునకు సిద్ధముగా నున్న గ్రంథములు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీరామనిర్యాణము (నాటకము) | 0 | 12 | 0 | గంగిమ్మకథ (కల్పితము) | 0 | 1 | 0 |
| కలిచర్య (చక్కని పద్యములు) | 0 | 2 | 0 | స్త్రీల వేడుక పాటలు | 0 | 8 | 0 |
| సిలాకల్యాణము (హరికథ) | 0 | 4 | 0 | బాలనీతి (చక్కని నీతులు) | 0 | 1 | 0 |
| ఇందుమతీ పరిణయము (హరికథ) | 0 | 4 | 0 | భోగముపిల్ల (పార్సు) | 0 | 6 | 0 |
| కృష్ణాపుష్కరమహాత్మ్యము | 0 | 2 | 0 | | | | |

## ముద్రణలోనున్న గ్రంథములు.

1 శ్రీకృష్ణబోధామృతము (ప్రబంధము)
2 సత్యవతి (నాటకము)
3 శివలీలలు (నాటకము)
4 వెంకటేశ్వర శతకము
5 పెండ్లి పేరంటాండ్రు (పార్సు)
6 అత్తవారింటి క్రొత్తకోడలు (పార్సు)
7 స్త్రీల వేడుక పాటలు (300 పాటలు)
8 సీతమ్మ చిందులాట (పార్సు)
9 పాపాసాని (పార్సు)
10 అత్తగారి అద్భుతచర్యలు (పార్సు)

గ్రంథములు వలయువారు క్రింది చిరునామాలకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

☞ [illegible] — సీతారామశాస్త్రి,



# శ్రీ కన్యకాంబ.



(బ్రహ్మశ్రీ) వేలుపుల సుబ్బనరసయ్యగారు—కొండజూటూరు.)



సీ॥ ఆశ్రయించినవారి * కఖిలార్థములొసంగు
కామధేనువు గదా ! * కన్యకాంబ ;
ఎడలేక పూజ జే * సెడువారి కొంగుబం
గారమైనది గదా ! * కన్యకాంబ ;
వైశ్యవంశమున సం * భవమందినట్టి శ్రీ,
కల్పభూజము గదా ! * కన్యకాంబ ;
సిరిసంపదలలోన * చిందులాడించెడి
కన్న తల్లియె గదా ! * కన్యకాంబ ;

గీ॥ కనకమృదుగాత్రయే గదా? * కన్యకాంబ
యట్టిశ్రీకన్యకాంబ ద*యారసంబు
వెల్లివిరియగ నెపుడు వ*ర్ధిల్లుగాత,
కందనోలు మండలపు ప్రతి*కామతల్లి.



# భక్తిప్రభావము

[శ్రీయుత మునికోటి శ్రీనివాసరావుగారు, నంద్యాల.]

:o:

భక్తియనునది యగమ్యగోచరము భక్తియనునది భగవంతుని కేతక్కఁ దక్కినవారికి దాని ప్రభావమిట్టిదని నిర్ణయించుటకు వీలులేదు. కారణమేమన? సృష్టియందలి ప్రతి ప్రాణి జనించుటకుపూర్వము జనియించిన పిదప జీవుని కర్మావరణరహస్యమును యీశ్వరుఁడెరిగి యుండును తదుపరి జీవి నానాటికి వృద్ధియగుకొలఁది జీవిచే జరిపింపఁబడు ప్రతి విషయములు సర్వాంతర్యామియగు సర్వేశ్వరునకు గోచరమగుచుండునుఁ గాని భక్తియనెడు రెండక్షరముల మహామహిమ యిట్టిదని తెలుపుటకు మానవప్రపంచమునకు అర్హతలేదనియే చెప్పవచ్చును భక్తుఁడు తనలో దానానంద పడుచున్నాఁడు. అంతలోనే తృప్తిఁ జెందుచున్నాఁడు. ఇంతకన్న వేరులేదనుచున్నాఁడు ఇదియేసర్వమనుచున్నాఁడు. మరల రెండవసోపానమునకు వెళ్ళినవెంటనే మరచుచున్నాఁడు. అప్పటికి యే యానందమని తలఁచుచున్నాఁడు. ఈరీతిగ ముక్తిని చెందువారును భక్తిన్యే ప్రధానముగా నెంచుకొని దాని యాధారముచేతనే భక్తి ప్రారంభమునుండి వృద్ధిచేసుకొనుచు ముక్తిని బొందుచున్నారు. అన్ని యోగములకును అన్ని భోగములకును అన్ని విధములగు పరిపూర్ణావస్థలకును భక్తియే ప్రధానము భగవంతునియందు [illegible] చేయునదియు భక్తియే.

సద్గురువు నాశ్రయించి సద్ధర్మములఁ దెలుసుకొను నట్లుఁ జేయునదియు భక్తియే. ఐహికసుఖానుభవముల సాంగముగ సాధించునదియు భక్తియే. వేదవేదాంగరహస్యములఁ దెలిపి పరిపూర్ణత్వమును ప్రాప్తింపజేయునదియు భక్తియే. భక్తియను రెండక్షరముల మహిమ పిపీలికాది బ్రహ్మపర్యంతర మేవస్తువునందైనను సరియె యొకింత తప్పదేని నటినుండియు భక్తి, యుక్తి, ముక్తి, యనుయీ మూడవస్థలును తన్ను విడుచుటకై ప్రయత్నించును. మోక్షసాధనమునకుఁ బరమప్రథమసోపానముగ భక్తిచే ప్రారంభింపఁబడి తదుపరి జ్ఞానవైరాగ్య సాధనసంపత్తులని తెలుపఁబడుచున్నది. భక్తి తనయందావిర్భవించి నానాటవృద్ధిఁ జెంది పరిపూర్ణావస్థను జెందినఁగాని జ్ఞానావస్థకు చోటుకలుగదు. అట్టి జ్ఞానావస్థ ప్రారంభించిన వెంటనే జ్ఞానమునకు తోడు భక్తి చేసినగాని జ్ఞానావస్థ వృద్ధిపొందదు. భక్తిజ్ఞానములు రెండునుఁ గూడి నానాటవృద్ధిఁ జెంది పరిపూర్ణావస్థఁ జెందినఁగాని వైరాగ్యము సిద్ధింపదు. అట్టి వైరాగ్యమునకు భక్తిజ్ఞానములు రెండునుఁ దోడ్పడినఁ గాని సాధనసంపత్తి దొరకదు. భక్తిజ్ఞానవైరాగ్యములు త్రివిధావస్థలు సత్యావస్థతో నేకీభవించినంగాని ముముక్షుత్వసాధకత్వమునకు నర్హతగలుగదు. పై త్రివిధావస్థలును ముముక్షుత్వసాధక

త్వముతో నేకీభవించినఁగాని ముముక్షుత్వము సిద్ధి బొంది జీవి నిశ్చయత్వ శివత్వమును పొందుటకు అర్హత పొందజాలఁడు. అన్నిటికిని ప్రథమాధారమగు భక్తియే మానవజీవిత కాలచక్రమునకు ముఖ్యాంశమని యెఱుఁగవలయును. ఇట్టి భక్తిస్వరూపమెయ్యది? లక్షణమెయ్యది? స్థానమెయ్యది? ఏరీతిగ జనించుచున్నది? ఎట్లు వృద్ధి బొందుచున్నది? ఏరీతిగ పరిపూర్ణత్వమునుం జెందుచున్నది? దీనినిగిదా మనమాలోచింపవలయును. ఈవిషయమై ఆలోచించినట్లయిన "పితృపుత్రికాన్యాయము" రీతి వారివారి యనుభవమును తెలుసుకొని యానందపడవలసినదేగాని వక్కివంచనలేక వారి వారి యనుభవమును వెల్లడిచేయుట వేదధర్మము. భక్తియనునది పట్టుపడుటకు పూర్వజన్మసంస్కారము వలనను సత్సాంగత్యమువలనను పట్టుపడునని వేదపురాణములు తెలుపుచున్నవి. పూర్వజన్మ సంస్కారమునుండి జనించినభక్తి విషయమై ఆలోచించితిమేని యీభక్తి తనంతట తనలో కలిగి అజన్మావస్థనుండి బయలుదేరి నానాటవృద్ధిపొంది తుదకు పరిపూర్ణావస్థఁజెందునని విశదమె. ఇఁక ఇహజన్మవిషయమై సత్సాంగత్యము వైపు నాలోచించితిమేని కొన్ని యనుమానములు తగులకపోవు అవస్థాభేదము లెట్లున్నను, ప్రతియొక్క యవస్థకును మానవుడే కారణ మని వేదములందు వక్కాణించుచున్నది. అట్లయిన-చో భక్తియొక్క యవస్థాలక్షణ మెట్టిదని మనమాలోచింపక తీరదు. భక్తియనునది మానవజీవితచక్రమునందు తొలుత భక్తికై ప్రారంభించఁబడి పలువిధములగు నాందోళనములచేత తన ప్రవర్తన సత్యాసత్యములకొలది యిటువైపు భుక్తితోగాని లేక అటువైపు ముక్తితోగాని పూర్ణమగుచున్నది. ఇందుకు కారణమేమన బాల్యావస్థయందు తనకేమియు తెలియనికాలమున తన తలిదండ్రుల పోషణలో నేమియు తెలియక కొంతకాలము పెరిగి ఆబాల్యావస్థనుండి వృద్ధియై బాల్యావస్థలో తనబుద్ధికికొంత బలము కలిగి ప్రాపంచిక వాసనాబలిమి నానాటవృద్ధియగుచు కష్టసుఖములు సుఖదుఃఖములు కొంతకొంత తెలిసినవెంటనె తన మనసునకు సరిపోనివన్నియు తనకు కష్టములుగ తోఁచి వాటినుండి విముక్తిపొందుట యెటులనా! యని ప్రపంచమువైపు ఊరక చూచుచున్నాడు! తన యట్టివ్యక్తులే నారాయణ శివ కేశవాది నామములచే స్తోత్రము చేయుట వినుచున్నాఁడు! ఇవియన్నియు ఏటికని తనలో తాను తర్కించుకొనుచున్నాఁడు! దీనికితోడు పురాణములు శాస్త్రములు పెద్దలవాక్యములు కొంత స్థలమిచ్చుచున్నవి. తాను తన ప్రపంచయాత్ర జరుపుటకు యిదియే సత్యమార్గమునియు బుద్ధిపోత్సాములచే తనకోర్కెలు నెరవేరుననియు కొంత నిర్ధారణచేసుకొని భక్తులపాలిట చేరుచున్నాడు. దూరపుకొండలు నునుపనుటే యాలోచింపము ఎట్లుకబోనని తెలుపను.

(సశేషము.)

# Using Life's Strangest Law to Make Money

## Some Have Been Made Wealthy Through the Wise Use of the Law of Averages—the Law Which We Cannot Escape

By UTHAI VINCENT WILCOX

(WITH APOLOGIES TO THE SPARETIME MONEY MAKING).

MAYBE you think that you are different from all other human beings in your conduct and in your habits and even in your thinking. And you may be different. But the chances are that you will average up about the same in most things as will, your neighbour across the street, and Timken, the fellow next door who is always wanting to borrow something.

The fact of the matter is that human beings, when you average them up, are surprisingly alike. And human impulses are a fairly constant quantity. Equipped with a knowledge of all items entering into a situation, you yourself would forecast precisely how a man would react under a given set of circumstances.

Big and little business has come to use the law of averages in a profitable way. Individuals are leaning to use it for their pleasure as well as their profit. Perhaps the chief reason that insurance companies are so wealthy is because they have, apparently, an uncanny understanding of the future. They know that under certain conditions--age, climate, occupation, and other factors—so many men and women will die before the year closes. They know in advance the number that will be burned out of their homes and those that will be struck by automobiles. They know that out of all the buildings insured a certain definite number will be struck by lightning.

### Those Having Number Nine Shoes.

Yet there is nothing uncanny about this knowledge. It is merely an application of the law of averages.

If you are going into the millinery business you will be told by manufactures that you should have in stock only a small percentage of women's hats that are large, and a great number that are small. If you sell ready-made clothing, you will be told to stock a certain percentage of stout sizes for fat men. If you are selling shoes and doubt the advice given you by the manufacturers, you might play a little game by way of testing out the law of averages.

Stop five hundred people at random on the street, and ask them the size of their shoes. Then, in order to try out the law, go to another city or to another street and ask another five hundred, and your answer will check up with the advice of the shoe manufacturers and the two streets will give you the same results. All because, by the law of averages, each five hundred will have the same percentage of people who wear number nine shoes.

To get a working understanding of the law of averages for your own purposes, for your own home, you begin by keeping records. It is certain that the accurate knowledge possessed by life insurance companies is all a matter of accurate records. It may be that Lloyd's

other Tuesday was, that on the previous night the president of the United States had appeared before a joint session of Congress and delivered his message asking for a declaration of war. The next day men read their papers and became more thoughtful. Much ordinary business was forgotten and men were inclined to smoke and talk and sit and think. Thus the law of averages throughout the nation was proved by the conduct of all the men.

In St. Louis is a well-known hardware firm that is constantly making some use of the law of averages. For example, each day they take the little stacks of sales slips that come in by mail from the men on the road, and weigh them. Thus they know, without further study, just how much money the sales represent. Each ounce of the little slips means so many dollars. One slip may be for a bill of goods amounting to the thousands, and the next may cover a quarter's worth of nails, but a stack, or even a computation of the slips, averages a certain amount which experience has shown varies but a few cents.

This same company gathers all sorts of other information which is important in the example, they ask their men to send in information and daily reports on the weather, temperature, rainfall, and so on— and also information regarding crops. They even arrange to get information on the state of the weather in England.

In getting the information from England, they are merely obtaining advance knowledge as to certain business that the law of averages assures them will be theirs in time. For, an unusually warm, rainy spring in England will mean a demand earlier than usual on English manufacturers for pruning shears, scythes, and such articles. This in turn will mean that the manufacturers will be less able than usual to make prompt shipments of such goods to America. Wholesalers in this country, therefore, must either get their orders in early or arrange to get the goods elsewhere.

Also, a rainy March and April in any section of the United States means that there will be a big demand for scythes and sickles and lawn mowers in June. Under the law of averages a certain number of men will buy lawn mowers, but the number who get new ones depends upon how luxuriant the grass grows. In the same way, a dry spring and sales on garden hose have their relation.






ప్రీతి హృదయ స్థాన ప్రరిశ్రమ

# స్వవిషయము

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి
చన్ద్రోవికాసయతి కైరవ చక్రవాళమ్
నాభ్యర్థితో జలధరోఽపి జలందదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగః
భర్తృహరి సుభాషితం.

ఏమండలము కృష్ణదేవరాయాది భాషాపోషకులచేఁ బాలింపఁబడినదో? ఏ మండలము అష్టదిగ్గజము లని పేరొందిన "ఆంధ్రకవితా పితామహుఁడ"గు అల్లసాని పెద్దనాది కవికుంజరములకు జన్మస్థానమో; ఏ మండలము పోతనాది భక్తశిఖామణుల కునికిపట్టో! ఏ మండలము "అభినవాంధ్రవాల్మీకి" "వాసుదాసా"ది ఆధునిక కవివరేణ్యులకు వాసస్థానమో! ఏ మండలము మహానంది శ్రీశైల పుష్పగిరి విరూపాక్ష అహోబిలాది పుణ్యక్షేత్రములచే పావనమైనదో! అట్టిదత్తమండలము నానాటికి భాషయందు తక్కిన మండలముల కంటె వెనుకంజవేయుచున్నదనియొక వదంతి గలిగి యున్నది. ఈమండలమందు నేటికిని నిష్ణాతులగు పండితులు లేక పోలేదు, ధనవంతులు లేక పోలేదు, దాతలు లేక పోలేదు, భాషాభిమానులు లేక పోలేదు, కాని నేటికెట్లో గండము లన్నియుఁ గడచి మా "హిందూశ్రీ" పత్రికామతల్లి బయటపడి మీకెల్లరకును కన్నులపండువొనర్పఁ గలిగినది. ఇఁకనీకాంతను పెంచుభారము భాషాభిమానులందరి యందున నుంచియున్నాను, ముంచినను తేల్చినను, మీయదియే భారము. కొందఱు పండితులకు వ్యాసములంపుడని మనవి పూర్వకముగాఁ దొలుతనే వ్రాసియుంటిని, కొందరభిమానముంచి వ్యాసము లంపియున్నారు కొందరి వ్యాసములు మా కార్యాలయమునకాలస్యముగా చేరినందున వానినీమాసమున ప్రచురింపఁజాలనందులకు క్షమింపఁ బ్రార్థితులు ఈపత్రికకు వ్యాసములు ఛాయాపటములు పంపి దీని తమ మిత్రులను ప్రోత్సహించి, వెలువడునట్లోర్చిన వ్యాసకర్తలకు మావందన సహస్రంబులర్పించుచున్నాము.

ఈప్రథమ కుసుమమునకు చిరునామాలు తెలిసియున్న మట్టునకు పండితులకును, భాషాభిమానులకును, చందాదారులకును, పంపియున్నాము; ఈ పత్రిక చేరినవెంటనే భాషాభిమానులెల్లరు చందాలను మనియార్డరుద్వారా పంపి చందాదారులగాఁ జేరి మాకుత్సాహము గలిగింతురు గాక, యీనెల 20 వ తేదీలోగా తమ చందాలుగాని ఆర్డర్లుగాని మాకుచేరనిది రెండవపత్రిక తమకంపుటకు వీలుండదుగాన వెంటనే తెలుపఁ బ్రార్థితులు పండితులెల్లరును అభిమానముంచి తమవ్యాసములను ఛాయాపటము

ఆంధ్రదేశమునందు ఆంధ్రులగు దంపతులచే, నూతనముగాను, స్వానుభవముతోడను, తయారు చేయబడినదియు వెళ్లిన ప్రదేశమునందు ప్రతిచోటను దిగ్విజయపరంపరలు పొందుచు న్నదియునగు, మహాఘనత వహించుచున్న మహామహాత్మ్యాష్ట ఔషధరాజము.

భగవత్కటాక్షితమే! త్రికరణశుద్ధిగానమ్ముడు.

A. O. NO 20, F R.

# ఇంజక్షన్ లేహ్యము.

40 దినములకు సరిపడు 5 తులముల డబ్బీ 1 కి రు. 4_0_0

సర్వప్రపంచకమునకును దీనివల్లనే సర్వవ్యాధి నివారణమును, వంశోద్ధారకము గలకుం ప్రపంచములో దీనికి సాటిది లేనెలేదని గ్రహింపప్రార్థన.

కుష్ఠురోగములు, కుష్ఠువ్రణములు, సవాయి, సెగ, జాడ్యములు, మూర్ఛ, పిచ్చి, చెవ్రషం మశూచికములు, వాటి అంగవికృతులు, మేహరోగములు, పాండురోగములు, గాల్లి నపుంసకత్వ ము ఇంద్రియనష్టము ఉబ్బసవ్యాధులు ఉబ్బుజాడ్యములు మొదలగునవి జీర్ణించి బాధపెట్టుచున్న మహాకష్టతరవ్యాధు లెల్లను పూచీగానిర్మూలించును. స్త్రీలయొక్క కుసుమ రక్తస్రావము, జల్లు లు మొదలగు దారుణరోగములు సమస్తము చెప్పినట్లు నివారణ కాగలవు గ్యారంటీ! గ్యారంటీ!! గ్యారంటీ!!!

జర్మనీ జపాన్ ఇంగ్లాండు అమెరికా ఆఫ్రికా టర్కీ గ్రీసు పారిస్సు మొదలగు మహాదే శములందున్న మేధావంతులు దీని నిర్మాణరహస్యమెరుంగరు. ఆంధ్రమండలమునందిది మాచేత నే నూతనముగా తయారుచేయబడిన అపూర్వశక్తిగల అద్వితీయౌషధరాజము,దీనికిమేమే యాజ మానులము దీనిగొప్పశక్తికిమేము మిక్కిలి గర్వించుచున్నాము.

పటాటోపప్రకటనల జూచి మోసపోయినవారు దివ్యౌషధముల త్రుణీకరించుటవల్ల గొప్ప కష్టముల నొందెదరు.

☞:ఇప్పటిమాయమందుల ప్రకటనాద్భుతములజూచి మోసపోకుడు:☜

దీనిమూలమున మీ వ్యాధి నివారణకానిచో మీసొమ్ము మీకు తిరిగి నిరాక్షేపణగా పంపివేయుదుము.

వివరములకు:_ 0_2_0 ణాలు స్టాంపును, కేటలాగునకు రు. 1_0_0 న్నీ పంపవలెను. కార్డువ్రాసిన జవాబీయబడదు. ఆర్డరుతో సగము సొమ్మున్నూ రోగియొక్కచాయాపటమున్ను పంపించవలెను.——

చిరునామా:__The German Injection Leghya Manufacturing Co.,
Vrudha gautami Gadilanka, Mummidivaram Post.
East Godavari Dt. (Madras Presidence)

షరా:_అనేకులు ఛాయాపటములు లేవని వ్రాయుచున్నారు. అట్టివారు వారి రోగ చరిత్ర పూర్తిగా వ్రాసిపంపించవలెనని కోరుచున్నాము.



# జ్ఞానోదయము.

S. L. V. I. K. పీఠం శ్వేతగిరిగృహ.

జగద్గురు వవతరించు నని గ్రామమంతయు చాటలను ప్రకటింపబడెను. 'సత్యకాల' బయలుదేరు నని కొందరును, 'పాపు లందరును మరణింతు' రని కొందరును, జగద్గురు వవతరించినవెంటనే మనము కనులపండువుగఁ జూచి సంతోషించవలె నని కొందరును, వారివారికి తోచినరీతి యూహలు పడుచుండిరి. సోమసుందరుఁడు సిక్స్తుఫారము చదువుచుండెను. పాఠశాలకు పోవుదారిలో వచ్చుచుండగా రామస్వామిదేవాలయం ప్రాకారపు గోడకు పెద్ద అక్షరములతో 'జగద్గురువు అవతరించును. జన్మసాఫల్యము నొందుడు' అని వ్రాసియుండుటను చూచెను. చదివెను.

చిన్నప్పటినుండి సోమసుందరునకు భగవత్ భక్తి యలవడియుండెను. అయినను తన తండ్రిగారు డెప్టీకలెక్టరుగా యుండి తియాసఫీ సంఘమున చేరినవారగుటచే విగ్రహారాధన, భజన మొదలగువాటిని అప్పుడప్పుడు దూషించుచుండుటను వినుచుండెను. నేడు ఈ వాక్యమును చదివిన వెంటనే నిస్తబ్దుడై అరగంట కాలగు అచ్చటనే నిలువబడెను. మనస్సున ఆందోళనము జనించెను. తనలో యిట్లు తర్కించుకొనసాగెను. 'జగద్గురువు' అనగా నెవరు? వారి రాక యేమిటి? "ఈశ్వరుం డొక్కడే సర్వప్రాణులకును గురువు" అని చెప్పుచుండగా, మానవులు గురువులా? యెచ్చట భ్రాంతి? యేమి యీ పిచ్చిప్రపంచము! గురువుల మని పేరిడుకొని శిష్యుల విత్తాపహారణము చేయు మాయా గురువులు అవతరించవలయునే గాని, ప్రత్యక్షముగా అంతరిక్షమునుండి జగద్గురువు అవతరించునా? అనుకొనుచు ప్రపంచమును దూరుచున్నాడు. మనోసముద్రమున పరంపరలుగ ఆలోచనలు బయలుదేరుచున్నవి.

ఇంతలో ఆయక్షరములపై నికనుచూపు దేవాలయము గోపురమువంక మరలినది. అచ్చట రాధాకృష్ణ రతిక్రీడా బొమ్మలు కానవచ్చినవి. మఱింత మనస్సు చంచలమైనది. ఏమది! మన తండ్రిగారు చెప్పుచుండిన వాక్యములు నిశ్చయమే!! లేనియెడల దేవుని సాన్నిధ్యమునకు వచ్చువారికి నేర్పు విద్యయా యిది. లేక బాల్య

వనేయుండగా యవ్వనము వచ్చునరికి గురుశిష్య లేకయే నేర్చుకొను ఆచార్యసూత్రములా? అన్నియు అవకతవకలే. అధ్వాన్నపు నడతలే. పూర్వీకుల పాదస్థానమునకు మేరయే లేదు.

అని యేమేమో గొణుగుకొనుచు ముందునకు నడువబోయెను. తన చంకనుండి పుస్తకములు కాలిక్రింద జారిపడి అందున హిందూదేశచరిత్ర యందలి కాగితములు తెరువబడి బుద్ధుని విగ్రహము కనుపించెను. ఫక్కున నవ్వసాగెను. పూర్వీకుల ఆచారములను వ్యవహారములను దలచుకొనుచు మరింత నవ్వసాగెను.

ప్రపంచ చిత్రపటములు మరికొన్ని జ్ఞప్తికి వచ్చి తన కన్నులయెదుట నిలువబడెను. నవ్వు అపరిమితమాయెను. కన్నుల బాష్పము రాల ప్రారంభించెను. ఈ తెలివి తక్కువ హిందువుల ఆచారములకన్నను పాశ్చాత్య నాగరకతయే మిన్న యని మనస్సున తలచుకొనుచు పుస్తకముల వైపునకు వంగెను. దేవాలయము నుండి 'భం శంకర్, భం శంకర్' అను శబ్దము తన చెవినిబడెను. ఆశబ్దము వెంటనే ముక్కులు మూత పడునట్లు గాంజాయి వాసన గుప్పుగుప్పున రాదొడగెను. సోమసుందరుని సంతోషము పెరిగెను. ఆలోచనా సముద్రమునకు మరింత మారుతవేగము తాకి అలలు మిక్కుటమాయెను.

ఈశ్వర సాన్నిధ్యమున ఆచారమున అతి భక్తితో చిత్తచాంచల్యము లేక శాంతమున యీశ్వరోపాసన చేయు మానవ సంతతికి చిత్తవైకల్యము కలిగించు గాంజాయి, కల్లు, మదత్తు మొదలగు మత్తుపదార్థములా! అట్టి మత్తుపదార్థములు సేవించుటకు యీ కైవాటిక సన్యాసులకు పవిత్రప్రదేశములా యివి. వీరు సన్యాసులమని పేరిడుకొని అమాయకులగు మానవులను వంచించి పైవేషమునకుమాత్రము శంకరావతార మని యనిపించుకొని హృదయమున సంకరావతారము దాల్చిన యీ సన్యాసులను సర్వేశ్వరుడు రక్షించునా లేక శిక్షించునా? నా తండ్రియుద్యోగమైనను తుదకు యీ కాలమున నాకు లభించియుండిన యెడల వీరినందరిని ఏమిచేయుచుంటినో యని యనుకొనుచు పుస్తకములను సంకబెట్టుకొని దేవాలయమువైపునకు వెళ్లెను. మహాద్వారము దాటినవెంటనే సుమారు మూరెడు గడ్డముచు, తలపాగాకన్నను మూడునాలుగంతలు యెత్తగు శిఖయు, కుడిచేత బంగిగొట్టమును, యెడమచేత సంకకు తగిలించుకొన్న అర్ధచంద్రాకృతితో చేరిన రెండుమూరల కట్టెయొకటి కలిగి ఆవ్యక్తికి యిరుప్రక్కలను కొందరు కన్నులు అరకన్నులువేయుచు సన్యాసికి బంగు పొట్లమునకు సాయంకాలమునకు డబ్బు యెచ్చట తెత్తుమా యని యాలోచించువారివలె తదేక దృష్టితో నుండుట చూచెను. తనలో మనోవికారము కలుగకున్నను అది యేలకో నడుముల క్రిందనుండి పిరుదుల వైపుగా కాళ్లను చూచుచున్న రెండు హస్తములు ముఖము వైపునకు అకస్మాత్తుగ మరలెను. రెండు చేతులు జోడింపబడెను. తనలో తాను వితర్కించుకొనుచుండ, ఆ సన్యాసి యోరచూపుతో మందహాసముగ "మనసంతే మహాదేవ్, శంభో! మనసా మాధవం" అనెను.

(సశేషము.)



# మహానంది "హిందూ శ్రీ" ఆశ్రమం.

**MOTTO.**

## "DO GOOD AND BE GOOD."

## ప్రీతిహృదయస్థాన పరిశ్రమ సేవాదళము—మహానంది.

ఆర్యా! రాబోవు మాసమునుండి "సాధుబృందావన" సంఘసేవాభివృద్ధికై విరాళ మగు ధనము ప్రోగుచేయుటకు బయలుదేరుచున్నారు. సంగీతము, సాహిత్యము, పటుత్వము, ధాతృత్వము జన్మావస్థనుండియే కలుగవలయును. కోరినవారికి కోరినరీతిగా నావారి ప్రశ్నలకు తగు సమాధాన మిచ్చి (లేక సమాధానము తీసుకొని) సేవ చేయుటకొఱకే సిద్ధపడి నెల్లూరు కుమ్మంబాళ్ ఆశ్రమ వాసు లగు శ్రీ శ్రీ శ్రీ స్వామి రాజరత్నం స్వాములవారి యాజమాన్యముక్రింద 5 విధములగు పరిశ్రామిక సంఘములతో బయలుదేరుచున్నారు.

1. హరికథ (హరి కథ? - హరి ఎచ్చటనున్నాడనెడు ప్రశ్నయే కదా?) ఈ ప్రశ్నకు తగు ప్రత్యుత్తర మిందుకు రూ. 116 లు బహుమతి.

2. గీతా.—"గతం స్వాగత మితిగీతా" ప్రతి అధ్యాయమునకును ప్రతి శ్లోకమునకును మూలార్థములతో ఉపన్యాసములు ఇవ్వబడును. ప్రతి అధ్యాయమునకు రూ 106 లు బహుమతి.

3. చిత్రకళ.— వాటర్ పెయింటింగు, ఆయిల్ పెయింటింగు, ఎన్లార్జిమెంట్లు, ఫోటోగ్రాపు మొదలగునవి. వీటికి రూ 25 లు మొదలు రూ 500 లు వరకు బహుమతి.

4. ఉపపరిశ్రామిక వ్యాపారాధిక, స్వదేశ విదేశవార్తలు, వ్యాపార రహస్యములకు తగుసలహాల నొసగుట. సూత్రచతురులకు కోరినవారికి కోరినట్లుబహుమతి.

5. "హిందూ శ్రీ" మాసపత్రికకు, "సాధుబృందావన" మునకు చందాదారులను మెంబరులను చేర్చుట.

దేశసేవా ధురంధరులు అందరు ఈ కార్యమునకై తోడ్పడి స్వామికార్యమును స్వకార్యమును సాధించుకొనుడు.

N.B.— పై సేవాదళము ఏగ్రామమునందు క్యాంపు చేయునది పత్రికలలో వెలువడుచువచ్చును. ఉత్తరములు వ్రాయకోరువారు ఆయా అడ్రస్సులకు వ్రాయుడు.

ఇట్లు;

సేవాసంఘము,

సాధుబృందావనము, "హిందూ శ్రీ"

# స్వామిరాజరత్నం స్వాములవారి లేఖ.

(కుమ్మందార్ ఆశ్రమము.)



ఆ॥ మొదటిహేతునరయ । మోక్షంబు దానిపై
నిత్యలీనవస్తు । నిచయమగు న
ద్దానిపై నశమము । దమముజితేంద్రియ
త్వంబు సాధనములు । తలచిచూడ॥

దీనిని విమర్శించగా బాలురకు అక్షరాభ్యాసమునుండి ప్రారంభించి యుక్తవయస్సులో సర్వవిద్యలను సాధించి కలియుగధర్మముల అనాయాసముగ నెరవేర్చగలరు. గాన యిందుకు ద్వంద్వము సంసారికమును ఆశ్రయించి కష్ట సుఖములను ఓర్పుతో నెరవేర్చి జ్ఞానమార్గము కొరకు సత్సంఘము నేర్పరచవలయును. అనగా (ఓంనమః) అను అక్షరములనుంచి భారత భాగవత రామాయణములును యుక్త గ్రంథ అనుష్ఠాన పద్ధతిని చూచుటకు యోగ్యత గలిగినది. యిదేప్రకారము గృహస్థాశ్రమములను కొద్దిరోజులు ఆచరించి గృహస్థులకు సేవకా వృత్తులు జరిపి తదనంతరం గ్రామ సేవయు పిదప దేశసేవయు చేసి సత్కార్యాచరణకై మెలగవలసిన విధము.

ఆ॥ వినుట మొదటిత్రోవ । వినివిమర్శించుట
దాని లెస్స నిలిపి । తలచుచుంట
భీతిఁ జెందకుంటఁ । బెరవారి దుర్బోధ
చెవినిఁజేర్పకుంట । శ్రేష్టమగును॥

అని ఆచరణ జ్ఞానులు నుడివియున్నారు. గాన పైకనిన అంశములను ఆచరించుటకు ఆధారము (ధ్యానము) అనగా ఈశ్వరధ్యానము ధ్యానమనగా యేమి అని సంశయము కలుగును. ఆత్మ అంతరంగము; హకీకత్తుల్ ఇక్ సాక్; కాక్ మక్ బేటు అను యీ మూడు పదములకు మూలము ఒకటే. వారివారి ఆచరణపరికారములవల్ల భేదములు కనుపించుచున్నది. వీటికి ముఖ్యమయిన ఆధారశాసనముగా ఏర్పరచబడియుండు జన్మము. ఇందులో రెండువిధములు :

గీ॥ ఆత్మలకు లోననుండు య । నాత్మలకును
కలుగుబేధంబునీకిదే । తెలియఁజేయు
వాఁడ దానిఁలెస్సగా । చూడవలయు
మఱువకుండను తావక । మానసమున॥

తే॥ చీము నెత్తురు మాంసము । స్త్రిక్కములును
నెమ్ములును తోలు వీనిచే । నిర్మితమయి
కాలుసేతులు తల వీపు । కడుపు రొమ్ము
యిట్టి యవయవములఁగాంచ । నిల్లుబోలు॥

క॥నాయిల్లు నాది వాకిలి
నాయది పెండ్లాముధనమునాయది। యనుచున్
బాయకఁదలఁచుచునుండెడు
నాయదియే స్థూలదేహ । మందురు పెద్దల్॥

ఇట్లుండగా పామరత్వమునకు స్థూలాభిమానమును వదలి సూక్ష్మాభిమాన సాధనలు ఆచరించి ఆత్మదృష్టిని అనుష్ఠానవంతులై శేకరించి యీ ఆత్మను యీశ్వరుని శాశనములకు లోబరచి సర్వజీవులయందు మనసును అసూయత మార్గముగా లోబరచక నిష్ఠసమాధి లక్షణము చేత ఇంద్రియములను బంధించి సర్వత్రా ఈశ్వరానుగ్రహపాత్రులగు తన 'హిందూశ్రీ' యను పత్రికను ప్రతి మానవకోటి స్థూలాభిలాషవంటి అభిలాష యుంచి పోషించడమునకు ప్రోత్సాహపరులగుదురు గాక.

ఇట్లు,
దేశపరిచారకుడు.



---



# ఏ దైవము?

అయ్యా గురువులకు పెద్దలకు బ్రాహ్మణులకు నమస్కారాలు. తక్కినోళ్ళకుకూడా దండాలు! నమస్కారాలు!! బాలుడు గనుక తమ ఆశీర్వాదంతో బతకాలి; పెద్దల ఆశీర్వాదం వుంటేనేకాని పిల్లలకు శ్రేయస్కరం కాదుగదా!! మొదట పెద్దల అనుగ్రహం కలగాలి, పిమ్మట దేవుని అనుగ్రహం యల్లకాలం ఉండే యుంటాది. ఆ! లోకంపలువిధాలు నమ్మినోనికి నమ్మినంతావుంది. పిల్లోణ్ని గనుక పిల్లబుద్ధులే! ఏదైనా తప్పులుంటే మన్నించాలి.

ఆ! మరి నా పేరు తమకంతా తెలుపాలని చాలా కుతూహలం వుంది కాని: రెవ్వరో ఒకడు ఏవో చెడ్డకార్యంచేశాడని వానిపేరు వాళ్లంతా ఆదేపనిచేస్తారా ఏమిటి? రాళ్ళంతా దేవుళ్లైతే రత్నాలంటా రాళ్లైతే వెలతెలియడం ఎవళ్ళవశం.

ఆ! ఆ! ఆ! ఊరికె ఆలోచించకండి. మానాన్నగారు ఏదోమంచి పేరుపెట్టక యిట్లాంటి పేరుపెట్టాడె అని ఆలోచిస్తాను కాని సమయానుకూలముగ ఒక్కొక్కప్పట్లో పనికి బహు అర్జెంటుగ కలిసివస్తుంది. నా పేరువేరు! నేను వేరు! యిప్పట్లో యీవిషయాలంతా ముచ్చటిస్తుంటే కాలహరణం అవుతుంది. ఏదో కస్తదబ్బు సంపాదించాలి అని గంపెడాశతో దేశాలంతా తిరిగేశాను మందులైనాయి మంత్రాలయినాయి స్వామ్యులైనాయి శాస్త్రులైయినాయి వాదాలయినాయి వాదం అంటెవాదంగాదు; బంగారు గట్లుగట్లు పోయ్యాలని ప్రయత్నంచేసాను మంత్రాలతో దేశమంతా ఒక్కసారి తూరి కట్టైయాలని ప్రయత్నించాను. యోగాలతో ప్రయోగంచేసి ప్రపంచాన్నంతా అరచేతులో ఆడించాలని చూశాను. యీ అవస్థలలో నాకష్టాలు నాతైతక్కలు నాప్రయోగాలు కొండవీటిమల్లప్ప తిమ్మప్ప కోటిలింగేశ్వరుడే విచారించాలి. యిట్లాంటపుడు మరచితి ఒకమాట! నావంటివాడే మా అన్నకూడాను; వాడుకూడా దేశసంచారములో పై ఉద్యోగములలో నాకన్నా ఫస్టుక్లాస్ సర్టిఫికట్ పొందియున్నాడు. వాడప్పుడప్పుడు నాతో కలుస్తూవుండేవాడు. యిట్లాంటి కష్టాలలో వాడేవో కొన్ని ముక్కలు చెప్పి తప్పించేవాడు. యిప్పుడుకూడా దేశమంతా తిరుగుచూ ఏదేవో రహస్యాలు గ్రహించాలని ప్రయత్నిస్తూ అప్పుడప్పుడు వైర్ లెస్ టెలిగ్రాంగా నాకు సంగతులంతా విపులముగా తెలుపుతూ ఉంటాడు.

ఒక్కొక్కటైంలో నా పేరువాడు మార్చుకొనేవాడు వానిపేరు నేను మార్చుకోవడము కూడాను!! యిట్లాంటి విషయాలలో సత్యమైనపేరు యట్లాచెప్పాలి అని రెండు పేర్లు వెల్లడి పెడతాను. ఆ! కొంచెము ఆగండి! అల్ల మరి ప్రకృతము దేశభాషచాలా యింప్రూవుమెంటు స్థితిలో యున్నది. ఏదైనా రెండు ముక్కలు ప్రచురం చేస్తామా అంటె గ్రామ్యంల ఆంధ్రములో కలిసి ఆంధ్రం ఆంగ్లేయములో కలిసి ఆంగ్లేయ మన్నిటిలో కలిసి అవకతవకలై అబద్ధాలతే వ ప్పెరుమాళ్లె అల్లాడేకాలం వచ్చింది.

అయ్యా! కోప్పడాకండి; మరి యిష్టట్లో అన్ని చూచి ఆఖరుకు దేశసేవమైనా చేతామని భ్రాంతితో ఆలాబయలు దేరాను. తిరిగితిరిగి మొన్న మొన్ననే శ్రీశైలంవెళ్ళి అచ్చటనుండ్ అదేదారిగా మహానందిక్షేత్రం వెళ్ళాలి అని సంకల్పించి అయిదారు రోజులలో మహానందిచేరినాను. ఆరోజు సుమారు మధ్యాహ్నము 12 గంటలుకావచ్చినది. క్షేత్రము మహా సౌకర్యముగానున్నది. జనులు గుంపులు గుంపు

లుగా చేరియున్నారు. అచ్చట కొంచెము దాహము పుచ్చుకొని మార్గాయాసముతో చెట్టుక్రింద అలాచకితిల బడ్డాను.

అబ్బో! అబ్బో! ఏమిదేశసేవ! ఏమిస్వార్థత్యాగము ఏమి అల్లకల్లోలము! ఏమి అగబగబలు! ఏమివాదప్రతివాదాలు! ఏమివీరావేశాలు! చింతగుంటజోగులు అవుకుదాసురులు పల్లెపకీరులు వీరు ముగ్గురూ జతగలశారా ఏమిటా? యని ఆలోచించాను. యస్టాబ్లిష్మెంట్లు మీద ఎస్టాంబ్లిష్మెంట్లు; ఆర్గడ్లు బయలుదేరుచున్నవి. ఏమా యీఅవస్థలన్నియు అని కొంచెము సొసైటీవద్దచేరాను అందులో సుమారు ముప్పది సంవత్సరముల వయసుగల యువకుడొకడు అంతకుముందేమి చెప్పెనో నడచిన ఆయాసముచేతను విననైతినిగాని నేవినిన సంగతులివి.

"ఖరీదు మాత్రము సంవత్సరమునకు షుమారు రు. 5000 రూపాయలుపట్టును. వ్యాసకర్తలకు స్టాంపుబిల్లలు అందాజా మాసమునకు రు. 5—0—0 అయిదురూపాయలైనా యుండవలయును. భిన్నాభిప్రాయములగువ్యాసము లెట్టివైనను మనము ఖండించియే తీరవలయును. మనపట్టీ ప్రకారం దస్కతుచేసినవారలలో దేశసేవచేయుటకు తుదకు ప్రతిడిస్ట్రిక్టుకు మగ్గురైననూ పోవలయును. ఆంధ్రదేశమంచంతట యిదివరలో యెన్నియో పత్రికలు వెలువడి ఉగ్గునిలువకముందు కొన్ని బాలారిష్టములలో కొన్ని దేశారిష్టములు కొన్ని భావభేదములచే కొన్ని కృంగుచూ లేచుచూ యుండుట చూచుచునే యున్నాము. ముఖ్యముగ దత్తమండలమున ఏ రెండు మూడు పత్రికలో తప్ప తక్కిన వన్నియు ముందంజవేయుటకు అల్లాడుచునే యున్నవి. [illegible]హిందూశ్రీ పత్రికాపుత్రిక జననావస్థ సుఖోదయముగ జరిగి నామకరణము సప్తఋషి ప్రతిష్ఠా సుభముహూర్తము జరిపి బాల్యక్రీడలతో కొంతకాలము జరిగి విద్యాగురువులకై ప్రయత్నించుచున్నది. దత్తమండలమైననూ తుదకు విదేశము వరకును యీ పత్రికా పుత్రికను ప్రఖ్యాతి పొందునటుల విద్యగరపి యీపుత్రికను సత్యవ్రతాచరణకు పేగోరుటకు మన సభాధ్యపతి సంఘాధ్యక్షుడు సహసంఘాధ్యక్షుడు వీరు ముగ్గురు కంకణబాధ్యులగుచున్నారు గాన మనలో యీకార్యదీక్షాపరుల సహాయసేవ చేయుటకు పూనుకొనతలంచిన వారు ఎవరో చేతులు పైకెత్తుడు అనెను."

అంతలో సభయందుండు వారందరునూ ఏకగ్రీవముగా చిన్న యనక పెద్దయనక ముందువెనుకలు ముసలమ్మపండుగ ఏదిరాయని ఆలోచింపక అందరును గండాలవలె లిమహాస్తములపై కెత్తిరి. అబ్బా! అప్పుడు హైదరాబాదున జరిగిన పీర్లపండుగ తటుక్కున జ్ఞాపకమునకు వచ్చినది. ఘనస్వామిని నాలోనేను ఏకగ్రహించుకొనుటలో నవ్వు అపరిమితమైనది.

యీసందడిలో వారు ఎవ్వరెవ్వరికో ఏమేమిటికో జేయ్, జేయ్, అనేశబ్దము మాత్రము వినబడినది. అందరిలో ఉపన్యాసకర్త మాత్రము నావైపున ఊరక చూచుచుండెను. ఉపన్యాసము చాలించి తోటలోనికి కొందరును కోనేటివొడ్డునకు కొందరును దేవాలయము వైపునకు కొందరు పరుగిడసాగిరి. ఏమిటికాయని యూరక ఆలోచించుకొనుచుండ యింతలో దేవాలయములోనుండి ముగ్గురునోటియందు శిగరెట్టు పొగ గుప్పుగుప్పున విడుచుచూ స్పెన్సర్ బొమ్మలవలె తట్టలపై మూతవేసుకొని ఏదోపదార్థములు తెచ్చుచుండుటచూచి బ్రతికితిరా బాబోయి యని కొంత కంఠము సవరించుకొనుచూ వారి వైపునకు మరలితిని. ఇంతలో అకస్మాత్తుగా నావీపున ఫెడేలుమని దెబ్బపడినది. ఆదెబ్బతో తొందరపాటున ఎదుటచేతి కర్రతో కంటి అద్దములతో నిలువబడి నాముఖమువైపున ఊరక చూచుచుండిన వ్యక్తిని చూచి నన్ను వెక్కిరించుచున్నాడు కాబోలునని తలచి ఏమిటయ్యా; దేవుడు నోరుయిచ్చియున్నాడని లేనిపోని ప్రగల్భాలునరకడం; ఒక్కజీవికి భూతత్పృప్తి చేయని వా

డు దేశమంతా నీకు బొల్లిమాటలుచెప్పి డబ్బులాగుట కొరకా! టోపివేయుటకా! అని బిగ్గరగా కేకవేసితిని. ఇంతలో యెవరో ఒక కావిగుడ్డ దాల్చిన సన్యాసికాబోలు నా యెదుట అగపడి ఆతని సుమారు 10 యేండ్ల పిల్లకాయకు సరిపోవునంత కొంత ఫలహారమునుంచెను. మాటలునురచి విస్తరిపైచేయివేసితిని యింతలో నాప్రక్కన నిలువబడిన యువకుడు కొంచెము తాళుము యీశ్వరతీర్థప్రసాదములు వచ్చుచున్నవియనెను. శివాయని యూరకుంటిని. నాయువకుడు అయ్యా, మీరెవ్వరు యిచ్చటికి ఏకార్యార్థము వచ్చితిరి. తీర్థయాత్రకా లేక దేశసేవకా? మా యుపన్యాసము పూర్తియై కరతాళధ్వనులచే సంతోషించుచుండి నప్పుడు మీకేలకో నన్ను చూచి హాస్యకరమగు నవ్వు నవ్వితిరి. అప్పటినుండియు నాకేదో మీయందనుమానము కలుగుచున్నది. దయచేసి తెలపవలయునని అయ్యా; ఆకలికోర్వలేను కొంత అన్నపానములు హృదయమునందు ప్రవేశించినంగాని మాటలాడలేనంటిని. అంతలో నచట పార్వతీపతయే హరహరమహాదేవ అనికేకలు వేయుచు తక్షిణవారంగరూ వచ్చుచుండుటచూచి నాయువకుడు తిరుకేక తెలపనెను. శంకర శంకర యనుకొనుచు తక్షిణవారికి తీర్థప్రసాదములు చేసు లోపల వారు యిచ్చిన ఫలహారం పూర్తిచేసాను. బంతులు సాగినవి. వడ్డింపబడుటకు ప్రారంభించిరి. సభికుల ప్రథమోపాసనతో నా భోజనముగిముసెను. ఆ సభలో కొందరు బ్రాంహ్మణులు కాబోలు నావైపున పూరకచూచుచు సభాధిపతి వైపున యీరీతి చూచుచూ ఏమేమో గొనుగుకొనుచుండిరి. దేశమంతా యీలాగే భ్రాంతి జన్యమైపోయిందని నాలో నేను గొనుగుచు లేచి కోనేటి యొద్దకు వెళ్ళితిని అహ్హ! బాబు అనిర్మలజలం చూసేసరికి స్నానంచెయ్యాలని కుతూహలం కలిగింది. సుభ్రముగా స్నానంచేసి గట్టుచేరేసరికి నెయ్యని కొందరు సూపమని కొందరు ఫగమాన్నమని కొందరూ? పాటలుకొందరు పద్యములుకొందరు శ్లోకములు కొందరూ? చెప్పుకొనుచూ గోలపెట్టుచుండిరి. యింతలో మౌనరాగములో ॥శ్లో॥ ఆమోదే భువనే ప్రమోద ఉతసమ్మోదేపి సంకర్షణం పద్యుమ్నంచతథానిరుద్ధ మపితాం సంహారస్సృష్టిస్థితాన్ కుర్వాణాన్ మతిముఖ్యమణవన్ శ్రీయుగాత్మకాన్ వ్యూహోదిష్టిత వాసుదేవమపితం వైకుంట నాథం భజే॥ యనుకొనచూ మౌనరాగముతో ప్రవేశించాను. అంతలో సభాధిపతిదయచేయండి అప్పుడేదో శలవిస్తానంటిరే యింకనైనా శలవా అనెను. అయ్యా సభాధిపతిగారు మీపేరేమిటో నాకు తెలియదు. క్షమించాలి తమసభలో నావిషయము కొంత చెప్పాలని తలచాను. కొంత దేశసేవ చెయ్యాలి అను అభిప్రాయముతో యింతకుముందుగ జంఘాలశాస్త్రి రంధ్రాన్వేషవారి సంఘములోని వాడను గనుక జంఘాల శాస్త్రి ఆంధ్రదేశమంతా సంచారము చేసాడు యీపద్య రంధ్రాన్వేషి అప్పుడప్పుడు ఒకొకప్పుడు కలుసుకుంటు ఉంటాడు. వారిసేవకుతగు స్వాములు లభించి వారి కష్టాలు నివారణజేసినందున వారి పేరు ప్రఖ్యాతికివచ్చినది. నేను కూడా కొంతదేశసేవ చెయ్యాలి అని తగుస్వాముల కొరకై చూస్తూ అలా సంచరిస్తూరాగా రాగా మొన్న మొన్ననే నందిమండలములో ఏదో పత్రిక బయలుదేరుచున్నదని దాంలో ఒకకాగితపు ముక్క దొరికగా దానిని చూచి సంతోషించి అచటికి పోవాలీఅని వచ్చాను. కొంతకాలము క్రిందటనే జంఘాలశాస్త్రి రంధ్రాన్వేషి మొదలగువారు స్థలవిషయమై పోరాటం జరిగి వారివారి హద్దులకు డిమార్కేషన్ రాళ్ళు స్థాపించుకోవాలని ప్రియత్నించినటుల మొన్న మొన్ననే విన్నాను. నాశక్తివంచనలేక వారిస్నేహం సంపాదించి నాప్రదేశాలకు కూడాను సర్వేచేయించుకొని మీరు ప్రారంభింపబోవు హిందూశ్రీకి నా సరిహద్దులలో గల వార్తలు శక్తివంచన లేక తమకు తెలుపాలి అని నా యభిప్రాయము. ఏదో ఉడుతకు ఉడుతాభక్తి నేను కొంత సంచారంచేసి తగు సమాచారములు తెచ్చి నాప్రదేశాలికి తగుసర్వే డిమార్కేషన్ పూర్తియగు వరకు కొంత ఆలస్యం అగును గాబోలు క్షమించాలి (యింతలోసభయంతయు నవ్వుతో అయ్యా తమనామధేయమేమి శెలవియ్యండి అనికేక) అయ్యా; నాపేరా! అభాండభూతి ప్రకాశం.

సశేషము.





# అహోబిలక్షేత్ర శాసనములు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౫౦౭ అను నేటి తారణ సంవత్సర మాఘ బ ౧౮ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీర రంగ రాయ దేవ మహారాయులంగారు పెనుగొండ నగరమందు వజ్రసింహాసనారూఢులై పునహా శ్రీమద్వేదమార్గ ప్రతిష్టాపనాచార్య పరమ హంస పరివ్రాజకాచార్య సర్వతంత్ర స్వతంత్ర ఉభయవేదాంతాచార్యులును, శఠగోపజియ్యం గారి కార్యకర్తలయిన వరుణాచాణర జియ్యం గారున్ను శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర రంగరాయదేవ మహారాయలు అయ్యవారి కార్యకర్తలయిన రాజప్ప గారున్ను, శ్రీఅహోబిలస్థానంవారున్ను, కాశ్యపసగోత్ర ఆపస్తంభసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన సూర్యవంశోద్భవులైన మూరురాయర బలవశంకర గుత్తిహన్నిబ్బరగండ యెరంయూరి పురాధీశ్వరులయిన శ్రీమన్మహా మండలేశ్వర గుండ్రాజు తిమ్మరాజుగారి పుత్రులయిన వెంకట్రాజుదేవ చోడమహారాజులంగారికి యిచ్చిన శిలాశాసనక్రమమెట్లన్నను :

బహుధాన్య సంవత్సరాన విభురామువారు హండేవారిని గూడుకొని సీమఅంతా చరామారచేసి అహోబిలస్థళం యావత్తు ఆక్రమించి తమవశముచేసుక నడుస్తూవున్న నిమిత్తం శ్రీ అహోబిలేశ్వరులు సన్యాసం ప్రసాదింప ఆదిమమయిన శ ఠ గో ప జి య్యం గా రి కి

* * * * * * * * * * * *

(12) ఆళ్వారుల ప్రతిష్ఠచేసి. ముకుందదేవుచేత పూజగొని రామానుజ దర్శనోద్ధారకుడైన శ్రీ పరాంకుశ మహాముని శిష్యులయినటువంటి శ్రీ పరాంకుశ శఠగోప స్వామివారు స్థళం యీ తీరున అయిన నిమిత్తం శ్రీ రంగరాజుదేవ మహారాయలు సముఖానకు తాము విచ్చేసి మీరు యీతీరున రత్నసింహాసనారూఢులై యుండిన మీకులస్వామి అయిన అహోబిల స్థళం తురుష్కాక్రాంతమై యున్నది. వారిని పోగొట్టి ఆప్రాంతం అంతా సాధించి అహోబిల స్థళం జీర్ణోద్ధారకం చేయవలయునని రాయలవారి తోను ఆనతియ్యగాను రాయలవారు తామె దండెత్తి విచ్చేసి మేమే సాధించి యిచ్చేమని పయనసన్నాహం కాంగాను అందుకు అయ్యవారు ఆనతిచ్చిన వివరం * * విభురాంవారికి నిత్యంమీరు రావద్దు. శ్రీ అహోబిలేశ్వరులు స్వప్న మాత్రానకు నిజదాసులైన మీ బంధు అయిన కొండ్రాజు, తిరుమలరాజు, వెంకటాద్రిజు గారు వున్నారు. వారిచేతనే యీకైంకర్య ములు అంతపడును * * * * * * * * * * అని అహోబలేశ్వరులు మాతో ఆనతిచ్చినారు. వారికి మీరు రాయల నంపితేను వారిచేతనే సకల కైంకర్యాలు చేయించుదురు. అని రాయలవారితో ఆనతియ్యగాను రాయలవారు అటువంటి నిజదాసులు * * * * * * * * * చిత్తులై రాయసమును పిలుపించి * * * * * నరపదకాలు అయినటువంటి దివ్యాభరణాలున్ను తమముద్ర మనుష్యులచేత అయ్యవారివెంట అంపగాను ఆ వెంకటాద్రిరాజ తిరుమలరాజుగారు యెదురుగావచ్చి అది అంతవట్టున్నూ శిరసా ప్రతిగ్రహించుకొని ఆహారిమంచిర, రథగజతురగ పదాతులు మొదలయిన చతురంగ బలాలను కూడుకొని అయ్యవారిని ముందరబెట్టుక తాము అహోబిలానకు కదలివచ్చి ఆ విభురామువారికి సహాయంబయిన హండివారు మొదలయినవారికి అందరిని విరుగగూల్చి ఆసీమ అంతా కట్టించి అహోబిలం జీర్ణోద్ధారణంచేసి అయ్యవారిని అహోబిలం స్థళాన నిల్పి అహోబిల స్థళం పూర్వాని కంటె యినుమడిచేసే నిమిత్తమె అయ్యవారు అతి సంతోషచిత్తులై వుపకారం చేసినవారికి ప్రత్యుపకారం మరియేమి చేయ లేమే. అహోబిలేశ్వరులకు మీరు నిజదాసులు గనుక మీరు అహోబిలేశ్వరుల తిరునిధులకు వేంచేసేటప్పుడు మీకు పరియవడమును తీర్థమును ప్రసాదమును కరుణించి తళిహాపూజ ప్రసాదమున్ను మీకు తిరుపన్నేరమున్నూ. * * * * * * మీ పుత్రపౌత్రపర్యంగా నడుపవలెనని రాయలవారి అనుమతిని నూకాలవారిని గూర్చుకొని వెంకటాద్రిరాజుగారికి ప్రసాదించినారు. గనుక యీ పరియవడము మొదలయిన సామ్యం మీపుత్రపౌత్ర పారంపర్యమై ఆచంద్రార్క స్థాయియై అనుభవించగలవారని ప్రసాదించి శిలాశాసనం వేయిస్తిమి. ఆప్రకారానవే పుత్ర పౌత్ర పారంపర్యంగా యాత్రవాచకంగా అనుభవించగలవారు. శ్రీ శ్రీ శ్రీ. * * *

ఇకమీద వెలువడు స్థానికశాసనములను ఒకటొకటిగా ప్రచురణకు పంపుదును. అవి అహోబిల చరిత్రను తెలిసికొనుటకు చాల సహాయకారిగా నుండును.

(సం) అనుముల వెంకటప్పయ్య, ఆళ్లగడ్డ.

శ్రీ బాలభారతి గ్రంథనిలయము వారి

రానున్నది!   9వ రత్నం   బయలుదేరుచున్నది!

# మాయలసొరంగం




అత్యద్భుత మగు అపరాధ పరిశోధక నవలా రాజీయము

ప్రారంభించినది మొదలు తుదివరకును నవరస భరితము.

యస్. జి. ఆచార్యా, "సమదర్శని" సంపాదకుని ప్రణీతము.

వలయువారు:—ప్రొప్రైటర్, శ్రీబాలభారతి వెల్‌కం ప్రెస్,

నంద్యాల.

☞ రాబోవు మాసమున ప్రకటించబడును.

గమనించుడు ! గమనించుడు !!

# “డైలి మార్కెట్టు పత్రిక”

## ప్రతివ్యాపారస్థులకున్ను, ఉద్యోగస్థులకున్ను, సంసారులకున్ను ఉపయోగము.

బొంబాయి, కలకత్తా, మదరాసు రేట్లు, నంద్యాలలో ప్రతిదినము నడచు మార్కెట్టుల రేట్లు వివరముగా ఇందు పొందుపరుపబడి యుండును.

అనగా, ఉప్పు మొదలు పత్తివరకు నాణ్యము లోహము మొదలగు అన్ని వస్తువుల ధరలు ప్రతి దినము ఉదయము ౮ గంటలలోపల మీ గృహములకు వచ్చిచేరును.

## రేట్ల వివరము.

| స్వగ్రామమునందు. | | | ఇతర గ్రామమునకు. | |
|---|---|---|---|---|
| నెల | 1-కి | **0—8—0** | పోస్టేజితో | **1—2—0** |
| సం॥ | ,, | **6—0—0** | ,, | **12—0—0** |

నేడే చందాదార్లుగా చేరుటకు ప్రయత్నింపుడు.

విలాసము :—

ఎడిటరు,

డైలీ మార్కెట్టు, బాల భారతి బిల్డింగ్సు,

నంద్యాల.

మీ ప్రకటనలు! ప్రకటనలు!!

# "హిందూశ్రీ"

## మాస పత్రికయందు ప్రకటింపుడు.

---

ఇప్పటికే సుమారు రెండువందల ప్రకటనలు, వ్యాపారస్తుల సలహాలు చేరినవి.

మీ ప్రకటనలను మా పత్రికలో వెలిచేయుటకు ఇదియే తగిన తరుణము!

యీ పుస్తక పత్రిక 2000 రెండు వేల చందాదారులతోను

జమీందారులతోను రాజపోషకులతోను మెలగుచున్నది.

వ్యాపారస్తులకు సహాయకారి.

ప్రకటన రేట్ల వివరమునకు :—

మానేజరు, "హిందూ శ్రీ" మాసపత్రిక,

నంద్యాల.

అని వ్రాయవలయును.

# కవితాసమితి వార్షిక సంచిక.



# కవితాసమితి.

---

లోకమును నడుపునది శక్తి. అది ప్రభుశక్తి మొదలగు పెక్కురూపుల నుండును. అందు, జ్ఞానశక్తి ఒకటి. అది ప్రపంచమున పలుదేశములలో పలుభాషలలో పలుగ్రంథములయందును- పలుపురుషులయందును వెలయుచుండును. గ్రంథములు, వేదములు- శాస్త్రములు- పురాణములు- ఇతిహాసనులు మొదలగు బహుభేదముల విలసిల్లుచుండును. ఇవి అన్నియు మొత్తముమీఁద కావ్యభేదములే అనఁ జను. కావ్యరచనయే కవిత. కావున, కవితయు ఒకశక్తియే; లోకమును నడుపునదే.

శక్తి మేలును చేయును; కీడును చేయును. సజ్జనులశక్తి సత్కార్యములు చేయుటకు వినియోగపడి- లోకమునకు మేలును, దుర్జనులశక్తి దుష్కార్యములు చేయుటకు వినియోగపడి- కీడును చేయుచుండుట ఎల్లరకును తేటతెల్లమే. అటులే కవితాశక్తియు మంచిదారిపట్టుచో లోకులను మంచిదారిని నడిపించి మేలును, చెడుదారి పట్టుచో దుర్మార్గమున నడిపించి కీడును కలిగించుచుండును.

కావున, కవితాశక్తి సహజముగా లభించినయువకులకు, అది సన్మార్గమును పట్టి, ఆత్మహితమును- దేశహితమును సమకూర్పఁగలదిగా వృద్ధిపొందుటకు వలయుప్రయత్నము చేయుట పరమధర్మము అట్టివారు కొందఱు సుమారు సంవత్సరమునకు క్రిందట 'కవితాసమితి'గా ఏర్పడిరి. తమకంటె పెద్ద లగువారిని కొందఱను చేర్చుకొనఁగలిగిరి. ఇప్పటికి సమితిసభ్యులు--చిన్నలును, పెద్దలును-- సుమారు ౩౦ మంది.

దేశహితమునకు సాధన మగు తెనుఁగువాఙ్మయము సర్వవిధములను అభివృద్ధి పొందుటకై పాటుపడుటయే కవితాసమితికి పరమాదర్శము. పక్షపాతమునకు లోనుగాక మాతృభాషాసేవకుల కెల్లరకును మాసమితి స్వాగత మొసంగును; అందఱసాయమును కోరును.

ఆదర్శము ననుసరించి మాసమితివారు తెనుఁగువాఙ్మయమున కున్నలోపమును తీర్చి- సంపూర్ణతను సమకూర్చువివిధవిషయములనుగూర్చి వానియం దభిమానముకలవారు వ్రాయువ్యాసాదులు సంచికారూపమునను, గ్రంథరూపమునను ప్రకటించుచుందురు. పైపత్రికలకును సమితిసభ్యులు వ్యాసాదులు వ్రాసిపంపుచుందురు. అంతియ కాక, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు శ్రీపీఠికాపురసంస్థానాధీశ్వరునిపోషణమున కూర్చుచున్ననిఘంటువులో సాధనసామగ్రి లేక ప్రాకృతసమాదిపదోత్పత్తివిషయము వదలివేసినట్లు దానిమచ్చుపదములపీఠికలో వ్రా

యుటచే మాసమితివారు వీ లున్నంతవఱకు ఆసాధనసామగ్రి సంపాదించి- ఉత్పత్తి తెలుపుటకును, వారు వ్యుత్పత్తి తెలిపినపదములకే కాక, తక్కినవానిలో వీలగువానికి వ్యుత్పత్తి తెలుపుటకును ప్రయత్నించెదరు. వారి నిఘంటువులోని చేరనిపదములుకూడ చేర్చెదరు. వారు తలపెట్టియు ఏకారణముననో ఇప్పటికి రచింపఁబూనుకొననిసమగ్రవ్యాకరణముకూడ రచించుటకు పూనుకొందురు. వీనితో పాటు 'తెనుఁగు మహాభాష కాదు' -- 'తెనుఁగువాఙ్మయము సంపూర్ణము కాదు.'— అనునిందలను తొలఁగించుటకు సాధనములగుతక్కినప్రయత్నములును చేతనగునంతవఱకు చేసెదరు.

కాని, ఆంధ్రసాహిత్యపరిషత్తువారును, ఇతరసంఘములును చేయఁజాలనిపని మాసమితివారుమాత్ర మెట్లు చేయఁజాలుదురు? అని ఎవరుగాని సహజముగా అడుగవచ్చును. పైపని అంతయు తామే చేయఁగల మని మాసమితివారు తలంచుట లేదు. పెక్కురసాయము పొందియే కార్యసిద్ధిని పొందుటకు వారు నిశ్చయించుకొన్నారు. అందు, పండితసాహాయ్యము మెండుగా కావలసియున్నది. కాన, వారు తమకు తెనుఁగునందుఁ గలఅభిమానమే ముఖ్యముగా ఎంచి, వలయుకృషి కావించి, పైని తెలిపినసాధనసామగ్రిలోపము తీర్చి, నిఘంటునిర్మాణప్రయత్నమునమాసమితివారికి సాయ మొసఁగి, శాశ్వతకీర్తి గడించెదరుగాక! అటులే వ్యాకరణరచనాదివిషయములందును వారు తోడ్పడుదురుగాక! భాషాసేవకు ఫలము దానివలనకలుగుఆనందమును- కీర్తియుమాత్రమే అని భాషాభిమానులగుపండితులు తలంతురుకాని, వేఱొండేదియు ముఖ్య మని వారు గణింపరుకదా?

అయిన, ఇంతవఱకు బాగుగానే ఉన్నది; సరే. డబ్బో! అది ఎక్కడనుండి వచ్చును? అని మనవారు కొందఱు మరల ప్రశ్నింపవచ్చును. తెనుఁగునాడు గొడ్డుపోయినదా? మాతృభాషాభిమానము మ్రగ్గినదా? అనియే దానికి జవాబు. 'దేశభాషలందు తెనుఁగు లెస్స' అనుమాట సార్థము కాఁదగుయోగ మున్నచో ధన మెట్లో వచ్చును. ఇంతకు సంశయాత్మ నాశనకారణము. దానికి లోనై సత్ప్రయత్నము మానుట పురుషలక్షణము కాదు. కాన మాసమితివారు తమశక్తి కొలఁదిని తెనుఁగువాఙ్మయమున కున్నలోపము తీర్ప ప్రయత్నించి చూచెదరు. ఫలమా? దైవాధీనము సత్సంకల్పము సఫలము కాదని ఏల జంకవలె? అనుకొన్న దంతయు చేయఁగలుగుట ఎవరికిఁగాని తఱచుగా అరిదియే. కాన, మాసమితివారు తామనుకొన్న దంతయు తమతరమున చేయఁజాలకున్నను, కొంత అయిన చేసి దారి చూపవచ్చు నని ఆసించుచున్నారు; తమతలంపులు తోడివారికి తెలుపుటకు ఈవార్షికసంచిక ఇప్పటికి ప్రచురించినారు.

కావున, మాతృభాషాభిమానము కల తెనుఁగువారందఱును, తెనుఁగునం దభిమానము కలతదితరులును, మాసమితిప్రయత్నమునకు భాషాకృషి చేసియు- ధనసాహా

య్యము చేసియు- వాక్సాహాయ్యము చేసియు, పుస్తకపత్త్రికాదిపరికరదానము చేసియు తెనుఁగుగొప్పఁదనమును హెచ్చించి, తా మెన్నిక కాంతురుగాక!

ఇప్పటి బాలకవుల కవితాచరిత్రము లయిన నిక్కములయినవి లభించునేమో అని మాయువకసభ్యులు వ్రాసినపద్యములు కొన్ని వారు వ్రాసినట్లే ప్రచురింప నయినది.

ఈసంచికకు అభిమానపూర్వకముగా వ్యాసములును- పద్యములును వ్రాసినసమితిసభ్యులను, తదితరులను మాకార్యనిర్వాహకపక్షమున ఎంతయు అభినందించుచున్నాఁడను.

విరాళము లిచ్చిన సమితిసభ్యులకును- అభిమానులకును, అచ్చుపనిలో సహాయ మొనర్చిన కాకినాడముద్రాక్షరశాలవారికిని సమితివా రెంతయు కృతజ్ఞులు.

విభవసం॥ శ్రావణ శు ౫ సోమవారము.
ది ౨౦-౮-౨౮ విశాఖపట్టణము.

మారేపల్లి రామచంద్రశాస్త్రి.
అధ్యక్షుఁడు.

# అనుక్రమణిక.

# కళాసమితి

## వార్షికసంచిక.

* విభవ *

### ప్రబోధగీతిక.

[పురిపండా అప్పలస్వామిగారు.]

ఇది మనోజ్ఞదినోదయాంచిత
సదమలాతిపవిత్రసమయము
బాలభానుసువర్ణ రేఖా
జాలదీపితము.

* * * *

దీర్ఘకాలనిరీక్షణమ్మునఁ
దేజరిల్లె ననంతదీధితి
సకలభువనారామనికరో
జ్జ్వలవిభాకర మై.

* * * *

అదె విపులమాకందశాఖా
భ్యంతరంబుల కంఠ మెత్తెడు
సుకవిచయ మత్యంతలలిత
స్ఫూర్తిరాగశ్రీముతోన్

పల్లవితకోరకిత మై సుమ
వల్లరీతతి తలల నూఁపును
పవనచాలితపృథుమహీరుహ
బాహువులఁ బెనఁగి.

* * * *

ఈయపూర్వప్రత్యూషమ్మున
నింక శయనించెద వి దేటికి ?
మేలుకొను మో తెనుఁగుకొమరుఁడ !
చాలు నీనిదుర.

* * * *

మాతృపూజాధ్యానతత్పర
మతిఁ బవిత్రస్నాతుఁడవు నై
విశ్వమందిరపుణ్యభూమికి
వెడలి రావోయి.

# ప్రణయభిక్ష.

[ పూడిపెద్ది వేంకటరమణయ్యగారు ]

"కమ్మపూఁదావిఁ జిమ్ముసీ గాలితరఁగ
లందు మెల్లఁగఁ దూఁగుచు నగుగుదెంచు
నీనినద మార! యొయ్యంతి యింపు నింప
మీటువీణారవంబు కాదోటు? కాదు;
వెలఁదిముంగురుతీవల వెడలి వచ్చు
ప్రణయసంబాధ మైనలావణ్యగీతి!
సాంధ్యరాగారుణప్రభ చానచెక్కు-
టద్దములఁదోఁచు! కాదు; మోహార్ద్రహృదయ
నీవు జనియించి మోమునఁ జిమ్ము వలపు!
వనితకీల్జడలోని పువ్వులకాంతి
యిం దలము! కాదు; పెదవులఁ జిందులాడ
లేమ పచరించు వలపించు కేఁతనవ్వు!

* * * *

అతివిశాలానురాగమారుతములోన
నీలతాతన్వి చలియించె నేమొ? కాదు;
మనసు చెదరఁగ నాపాదమస్తకమ్ము
వడఁకుచున్నాను నేను తాపమునఁ దూలి!
పడఁతి ననుఁ జూచి సిగ్గుచేఁ బాద నోడ
క్షణములోపల నింతనిశ్శబ్ద మయ్యె.
కాదు; నాడెందమున రేఁగి క్రమ్ముకొనుచు
వచ్చు ననుతాపముల తడఁబాటులోన
నామనోవీథి క్షణము శూన్యత వహించె!
ఇంతి దిగ్గన లేచి పోయెడిని బోలు
దడదడయటంచు నడుగుచప్పుడులు దోఁచు!
కాదు; వలపున నాగుండె కలఁతఁ జెందు!

* * * *

కన్ను లుండియు గాఢాంధకారమునను
బోలె నేఁ దొట్రుఁబాటునఁ బొరలుచుందు!
జ్ఞాను లెల్లరు మోహాంధకార మనరె!

* * * *

ఒసఁగినా, కుంటుపడనట్టి యసమలలిత
సరససౌందర్యవిభవరాజ్య మ్మొసంగు;
త్రోసెనా గాఢదుఃఖసందోహజనిత
తీక్ష్ణదావాగ్నికీలలఁ ద్రెళ్ళఁ ద్రోయు,
ప్రణయమున కింక వేఱుమార్గమ్ము లేదు!
ప్రేమభూయిష్ఠ మై మున్ను సృష్టి వెలయు
ప్రేమమూలాన జగమెల్ల వృద్ధిఁ బొందు.
కడ మొదలు లేనిజీవితకాననమున
నోసర నర్మిలియె వసంతోదయమ్ము
అఖిలజీవులఁ గలవివిధానురాగ
సార మనఁ దగుఁ బ్రణయరసమ్ము దలఁప
దుఃఖభాజనమో సౌఖ్యతుందిలమ్మొ
అనుభవింపఁగఁ దగుఁ బ్రణయం బొకండె!

* * * *

ఏల నీవ్యాసరచన మీసృష్టి లేని
పనియొ? యొకకాంతఁ బురుషుఁడు వలచికొనుట
ధరణిఁ బ్రేమకు విధినిషేధములు గలవె?
పల్లమున నీరు ప్రవహింప వలను పడదె?
ప్రజలభయ మేల? అమృతసేవనము సేయఁ
బథ్య మేటికి? నన్యానుపాన మేల?

* * * *

ఒడలఁ దాపంబు, డెందానఁ గడలుకొనెడు
దడదడలు, వేఁడియూర్పు, గద్గదిక, నొసట
జిల్లుమని క్రమ్ముకొనివచ్చు చెమట, పిఱికి
తనము, దైన్యము, వగపు, తత్తఱము గలిగి
జనసమూహమ్ములోఁ జిక్కికొనిన బాలుఁ
బోలి నే నిట్లు తహతహఁ బొంద నేఁ?"
అని పురందరుఁ డింతసాహసముతోడ
నల్లనల్ల సుదేవి డాయంగ వచ్చె.

* * * *

"ఏల? కటకటా! నే బుద్ధిహీన నగుచు
వీని ప్రణయాంకురంబులఁ బెరుఁగ నిచ్చి
మిన్న కుంటిని? తొలుదొల్త నున్నయెల్ల
నున్నయట్టుల వచియింప నోగి నితండు
మరలి పోవక యాసించి మరులుగొనునె?
నాయొయ్యారము నాతీరు నాహొరంగు
నావిలాసవిహారాలనవ్యశోభ
లరసి యాతఁడు నాను ప్రణయాన మునిఁగి
తేల నాయనురాగంపుఁదృణముకొఱకు
కరములను జాఁచుచున్నాఁడు కడఁక నిపుడు!
అతని మరలింపఁ గొన్ని యువ్యాపదేశ
వాక్యములఁ గూర్చి గీతానఁ బాడి చూతు.

* * * *

భ్రమరమా! సృష్టిఁ గల్గుపుష్పముల నెల్ల
విడిచి యీసంపెఁగను జూచి వెఱ్ఱి వగుచుఁ
దారులాడఁగ నేల? ఇఁదలిరసమ్ము
మున్న పవనార్పితమ్మయి పోయె వలపు
గాఢ మయ్యెను వానిలోఁ గడలుకొనియె
రాగ మేకము; విభజింప రాదు చూవె!
జాలిచే నిన్నుఁ జూచి యీచంపకంబు
వలవలమని హిమాంబుబాష్పముల రాల్చు"
అది విని పురందరుఁడు పిడుగడచినట్లు
కూలఁబడి లేచి నిలిచి వాకొనియె నిట్లు:—
"ప్రణయమా! గూడు కూలినపక్కి వైతి
వకట! యీసృష్టి నీ కడియాస మొందు!
నెలఁతచిఱునవ్వులేఁత వెన్నెలలఁగాని
మెసవ, వెలనాఁగరూపసమీరజనిత
వీచికలఁగాని ఱెక్కల విప్పి యెగుర
వలివమంజులవాక్ప్రవాహమునఁగాని
ప్రబ్బికొనివచ్చునీడగఁ బాపికొనవు,
పడఁతినును లేఁతకరపల్లవములఁగాని
వాల, వతిగూఢమై చేర వలనుపడని
యతివసలలితహృత్కులాయమునఁగాని
విశ్రమింపవు! నీముద్దు వెడలె నేఁడు
పల్లవితభవదుద్యానవాటిలోనఁ
జిమ్మచీఁకటి గ్రమ్మె! కార్చిచ్చు పుట్టె!
అతులజంఝానిలప్రవాహమ్ము గదిరె!
పటుతర మ్మోఁగొప్పతుపానుపట్టె!
ప్రణయమా! గూడు కూలినపక్కి వైతి
వకట! యీసృష్టి నీ కడియాస మెందు
కదలిపొమ్మిఁక! కన్నీటఁ గరఁగిపొమ్ము!"
అని పురందరుఁ డనుకొని కనుల నీరు
గ్రుక్కుకొని క్రుక్కుకొని వచ్చి కొంతవడికిఁ
దెప్పిరిలి మెల్లమెల్ల సుదేవి డాసి
నిలిచి యిట్లనె దైన్యమ్ము మొలక లెత్త
"ఉరుఫలాపేక్ష నున్నతతరువు నెక్కి
కూలఁబడితిని. తీరనికోర్కెచేతఁ
బడఁతి! నాడెంద మిటు పటాపంచ లయ్యె
శాంతి లేదింక నార్తికి చావు లేదు

కడపెదను నాదుజీవితకాలమెల్లఁ
గటికిసన్యాసి నగుచు నేకాకి నగుచుఁ
బెట్టు మే దైన భిక్ష సంప్రీతితోడ"
నన విని సుదేవి నిలువు నీ రైనయట్లు
బ్రాన్పడఁ బురందరుం డిట్లు మరలఁ బలికె
"జగముతో నింక నాకుఁ బ్రసక్తి లేదు
అలుకకులుకులు లేనిసన్యాసి నేను
వేఁడికొంటిని చేఁ జాఁచి భిక్షకొఱకు
ఓసుదేవీ! భవద్వీణ నొసఁగు దేని
దానిఁ గొని మీటి ప్రణయగీతాలఁ బాడి
మఱతు నన్నియు వానిలో మాయ మగుచు"
కనికరముచే సుదేవికన్గల్వ లట్టె
చెమ్మగిల్లెను హృదయంబు చెదరె నేమొ!
తూర్పుకొండను మెల్లఁగఁ దొంగి చూచు
నిండుచందురుమోము గన్పించె నంతఁ
దత్తఱమున సుదేవియుఁ దంత్రి నెత్తి
ప్రణయసన్యాసికేలను బాదుకొల్పి
దాన మిడియెను గన్నీట ధారవోసి.

---

# శ్రీ ఆంజనేయవినుతి.

[స్థానాపతి సత్యనారాయణశాస్త్రి గారు.]

సీ. హుసుమంజిముత్యాలసరములజన్నిద మురముపై బలితంపుహరువు జూప
తాటంకయుగరుచి దశదిశల్ వెల్గుచు గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
పాదుకోజ్జ్వలకాంతి పాతాళమం దెల్ల పటుతరం బగుచును బరిఢవిల్ల
కరతలస్థగదోరుకఠినసమీరముల్ పర్వతావళికెల్ల భయము గొలుప

గీ. చెలఁగి రయమున పయనమై సీత నరయ, జలధి నవలీల దాఁటినసత్వమూర్తి
బుధజనోల్లాస వైశాఖపురనివాస, యార్తరక్షణోపాయ వీరాంజనేయ.

సీ. అతిగుణాన్విత యగునంజన నీయవ్వ రాకాసిమూకతో నీకు చివ్వ
ప్రణుతింతు వేవేళ రాముఁడు నిను దువ్వ నిత్యమున్ ఫలములు నీకు బువ్వ
మెఱయు నీమెడలోడి మేలువజ్రపురవ్వ భక్తుల బ్రోతు నివ్వాళు లివ్వ
నిగిడె రావణుఁ డట్టె నీవు మీసము దువ్వ నెక్కు వౌ మాయ నీ కొక్కగవ్వ

గీ. మొఱ వినవుగద నాతోడ మొనసినవ్వ, వరదుఁడవు నీవు మాకును భళిర వావ్వ
బుధజనోల్లాస వైశాఖపురనివాస, యార్తరక్షణోపాయ వీరాంజనేయ.

---

# మనదేశచరిత్రము - స్వకీయాధారములు.

[ఐతిహాసికకులపతి శ్రీపరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారు.]

## I. ఉపోద్ఘాతము.

ప్రస్తుతము మనదేశమునకు సాంగమైన చరిత్రగ్రంథ మొకటియైనను లేదు. కాని యిందువిషయమై ప్రయత్నములు జరుగక పోలేదు. ప్రప్రథమమున నీవిషయమునఁ బ్రబలప్రయత్నములం జేసినవారు పాశ్చాత్త్యులు. వా రనేకవిమర్శకసంఘముల నేర్పఱచి మనప్రాచీనగ్రంథములను, దానశాసనములను, ప్రశస్తులను, నింక ననేకేతరనిదర్శనములను విమర్శించి మనదేశచరిత్రాంశముల ననేకములం గనిపెట్టి వ్యాసరూపముల వానివి దమతమసంఘపత్రికలద్వారమున ప్రకటించుచు వచ్చిరి. ఇప్పటికిని నాసంఘము లట్టివిమర్శలం జేయుచునే యున్నవి. ఇటీవల మనదేశస్థులును వానియనుకరణముగ నట్టిసంఘముల నేర్పఱచి మనచరిత్రవిషయముల విమర్శించుచునే యున్నారు. కాని యీసంఘము లన్నియు నింకను బాల్యదశలోనే యున్నవి. ఇందుకు ముఖ్యకారణము ద్రవ్యలోపమున సాధనసామగ్రి స్వల్ప మగుటయే. ఇంకను చరిత్రవిమర్శకత్వప్రాముఖ్యతను మనదేశస్థులు తెలిసికొని దానికై తాము కొంతవితరణమును నొసంగుట యావశ్యకమై యున్నది. ప్రస్తుతము పాశ్చాత్త్యులయొక్కయు, మనదేశస్థులయొక్కయు ప్రయత్నములవలన మనదేశచరిత్రమునకుఁ గొంతవఱకుఁ బుధాన మేర్పడినది. తదనుసరణముగఁ బ్రాచీనకాలమునుండి నేఁటివఱకు మనదేశచరిత్రమును విమర్శింపఁ బూనినచో తద్బాహుళ్యత నది యొకవిమర్శకునకు సాధ్యము కాకున్నది. ఈయసాధ్యతను తప్పించుటకు తచ్చరిత్రమును కొన్నిభాగములుగ నేర్పఱుప వలసి యున్నది. అట్టి యొక్కొక్కభాగమే యొక్కొక్కవిమర్శకునకు విమర్శింప సాధ్య మగును. మఱియు నీచరిత్రవిభాగము యాదృచ్ఛికము కాక చరిత్రమునం దెప్పటనెచట గొప్పమార్పులు కాన్పించుచున్నవో యచటనచట నే చేయఁబడుచున్నది. ఏతద్రీతిగ విభజించినచో మనదేశచరిత్రమున నాలుగుభాగము లేర్పడును. ఇం దొక్కొక్కభాగమునందును రాజ్యాంగవిషయమునం దేమి, పరిపాలనాపద్ధతులవిషయమునం దేమి, సాంఘికవ్యవస్థలయం దేమి, వాఙ్మయవిషయమునం దేమి, ప్రత్యేక ప్రత్యేక లక్షణములు విలసిల్లుచున్నవి. వరుసగ నీ నాలుగుభాగములును ౧ ప్రాచీనదశ, ౨ పూర్వదశ, 3 మాధ్యమికదశ, ౪ నవీనదశ, యనఁ దగియున్నవి. పాశ్చాత్త్యులవ్యవహారమున నివి 1 Ancient India 2 Early India 3 Mediaeval India and 4 Modern India— అని యనఁబడుచున్నవి. ఇం దొక్కొక్కభాగమును విమర్శించుటకే యొక్కొక్కవిమర్శకునిజీవిత మంతయు పట్టును.

ఇందు ప్రాచీనదశ యన చరిత్రప్రారంభమునుండి మహాపద్మనందునిరాజ్యాంతము నగుకాలపుదేశచరిత్రము. మనదేశచరిత్రమున నిదియే యతిధార్మిక మగుకాలము. ఇందు మన్వంతరముల చరిత్రములు, ఐక్ష్వాకుని సూర్యాదివంశంబులవిస్తృతి, ఋషివంశానుకీర్తనంబు, వేదసంహితలయొక్కయు, బ్రాహ్మణకల్పవాఙ్మయములయొక్కయు, నావిర్భావంబు, మగధరాజ్యప్రతాపంబు, మొదలగువిషయములు కలవు. కాలప్రమాణమున కీప్రాచీనదశ సుమారు 3000 సంవత్సరములు గలది. మహాభారతయుద్ధ మిప్పటికి 4028 సంవత్సరములకు మున్ను- అనఁగా క్రీ॥ పూ॥ 2100 సంవత్సరములకిందట జరిగినట్లు సిద్ధాంతము చేయఁబడినది. * కాన నీప్రాచీనదశ యిప్పటికి 5528 సంవత్సరములకు మున్ను ప్రారంభమైనది (3600-600 క్రీ॥ పూ॥) ఈ ప్రాచీనదశాభాగము మన యిప్పటి చరిత్రగ్రంథములలో చాల తక్కువగ నున్నది. ఇందలిచరిత్రవిషయము లింకను విమర్శింపఁబడి సిద్ధాంతీకరింపఁబడ నున్నవి. ఈకాలపు చరిత్రమును విమర్శించుటకు సాధనభూతము లగుసామగ్రులన్నియు కేవలసంస్కృతగ్రంథములు. అందుకొన్ని వైదికభాషయం దున్నవి. కాఁబట్టియే యీభాగములలోని విషయములు చాలమందికి విమర్శించుటకు సులభసాధ్యములు కాకున్నవి.

ఈప్రాచీనదశకం తరువాతి చరిత్రభాగమునకు పూర్వదశ యని పేరు. ఇక్కాలచరిత్రమును వ్రాయుటకు సంస్కృతగ్రంథము లంతగ సహకారులు కావు. ఇందులకు శిలాశాసన తామ్రశాసనములును, ప్రశస్తులును, ముఖ్యాధారములు. ఈదశ సుమారు 1600 సంవత్సరముల కాలప్రమాణము కలది. అనఁగా క్రీ॥ పూ॥ 6 వ శతాబ్దమునుండి క్రీ॥ వె॥ 10 వ శతాబ్దాంతమువఱకు వ్యాపించి యున్నది. కాఁబట్టి యీదశాభాగచరిత్రను వ్రాయుటకు శాసనపరిశోధకులే ముఖ్యాధికారులు. ప్రాచీనాగారముల పరిశోధకులును వారికృషులునుగూడ వీరికి సహాయులే. ఈ దశాభాగమున మహాపద్మనందుని చక్రవర్తిత్వము, మనదేశమునకు యవనుల (Greeks) సంబంధము కలుగుట, అశోకమహారాజుయొక్క ధర్మపరిపాలనము, ఆంధ్రగుప్త దామన్ వంశీయుల పరిపాలనములు, శ్రీహర్ష దేవమహారాజుల చక్రవర్తిత్వము, పూర్వపశ్చిమ చాళుక్యుల రాజ్యతంత్రములు, బౌద్ధ జైన మతముల వ్యాపకము, తిరిగి హిందూమత ప్రబల్యము, పురాణములయొక్కయు స్మృత్యాది ధర్మశాస్త్రములయొక్కయు నుత్పత్తి సంస్కృతసాహిత్యవాఙ్మయముయొక్క యభివృద్ధి మొదలగువిషయములు గలవు. ఈ పూర్వదశాభాగచరిత్రవిషయమునవిన్సెంట్ స్మిత్, (Vencent Smith) అను పాశ్చాత్యమహానుభావుఁడు వ్రాసిన "Early History of India" అనుగ్రంథము మిక్కిలి యెన్నిక గలది. ఈభాగములో హిందూరా

*See Chronology of Vedic authors, pp. 10.

జులరాజ్యములును వారిస్వతంత్రపరిపాలనము లును నంతరించిన వనఁదగి యున్నవి.

ఇంక మాధ్యమికనవీనదశ లనుఉత్తరభాగములు రెండును మనదేశమునఁ గ్రమముగ మహమ్మదీయులయొక్కయు, పాశ్చాత్యుల యొక్కయు, స్వాతంత్ర్యసంపాదనములను దెలుపును. ఈ కాలపుచరిత్రము వ్రాయుట చాలసులభము. కొందఱు చరిత్రకారులు తమతమ కాలపుచరిత్రములను వ్రాసియున్నారు. పాశ్చాత్యులుఁగూడ మనదేశమునఁ బ్రవేశించినదిమొదలుకొని యెప్పటివిషయముల నప్పుడు తమదేశమునకుం దెలుపుటకుఁ గాను Transactions అనియు, Reports అనియు, సూచనలను వ్రాసియేయున్నారు. కావున, పూర్వాపరసందర్భానుసారముగ నిట్టిగ్రంథముల నేకీభవింపఁ జేసినచో నీకాలపుదేశచరిత్రము సులభముగ నేర్పడును. ఈయుత్తరభాగములు రెండును విమర్శింపఁబడి యీ విషయమున ననేకగ్రంథములుకూడ వ్రాయఁబడియున్నవి. కాఁబట్టి ఈకాలపుచరిత్రవిషయమున పాటుపడవలసినది చాల స్వల్పము. మఱియు నీకాలపుచరిత్రమును విమర్శించి వ్రాయఁదలఁచినవారు ముఖ్యముగ నరబ్బీ, పారసీ, హిందుస్థానీభాషలను, పాశ్చాత్యదేశభాషలను బాగుగ నభ్యసించినవారై యుండవలెను.

ఇట్లు మనదేశచరిత్రములోని నాల్గుభాగములస్వరూపజ్ఞానమును దెలిసికొని వీని నిర్మాణసాధనము లగుగ్రంథాదిసామగ్రినిగూర్చి యొక విమర్శింతము. ఉత్తరభాగములరెండింటియొక్క గ్రంథాదిసామగ్రివిమర్శనమును మఱియొకవ్యాసమునకై విడిచి, మొదటిరెండుభాగములయొక్కవిషయములనుగూర్చియే యిందుఁ జర్చింతము. మనదేశచరిత్రమునఁ బ్రథమభాగ మగుప్రాచీనదశాచరిత్రమును వ్రాయుటకు సాధనభూతము లెవ్వియో వానిస్వరూపావతరణము లెట్టివియో చూతము. ఈప్రాచీనకాలమున మనదేశమున కితరజనసంపర్కము లేదు. కావున, నేమాత్రము నను దేశచరిత్ర వ్రాసియుండినచో మన భారతీయులే వ్రాసియుండవలెను. ఈవిషయమునఁ బాశ్చాత్యవిమర్శకు లొకదురభిప్రాయమునకు లోనగుచున్నారు. మనదేశస్థులకు దేశచరిత్రమును వ్రాయుట యలవాటు లేదనియు, నీవిషయమునే వీరు గమనించియుండ లేదనియు, వారు తలంచుచున్నారు. ఇది కేవలము కల్ల. మనపూర్వులొక్కొక్కశాస్త్రమునందును బాశ్చాత్యవిద్యలమించినయభివృద్ధిని యెంతయో ప్రాచీనకాలముననే చేసియుండఁగా వీరికి చరిత్రముమాత్రము వ్రాయుట చేతఁగాదనుట కేవల మసంగతము. మనదేశచరిత్రము మన పూర్వులచే వ్రాయఁబడియే యున్నది. అదియే పురాణము. మిగిలినశాస్త్రములకువలెనే దీనికిని సంప్రదాయముకూడఁ గలదు. దీనికే "ఐతిహాసికసంప్రదాయము" అని పేరు, కాని యీపురాణశబ్దమునకు కాలభేదమున నర్థభేదముకూడ సంభవించినది.

## II. పురాణము-పురాణసంహిత.

పురాణశబ్దమునకు కాలక్రమాగతార్థభేదము నింక విమర్శింతము. పురాణశబ్దార్థమిట్లు వివరింపఁబడినది.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం॥ అని.

(వాయు. I. 4. 10.)

అనఁగాఁ జరాచరాత్మక మగు జగత్తుయొక్క సృష్టివర్ణనంబును, దానిసంహారవర్ణనంబును, రాజవంశఋషివంశానుకీర్తనంబును, మన్వంతరముల వివరణమును, వంశానుచరితరూపంబు లగు నుపాఖ్యానకథనంబు నను నీవిషయంబులు గలగ్రంథము పురాణము. ఈలక్షణ మిప్పటిపురాణగ్రంథముల కెంతవఱకు పట్టినదో విమర్శింతము ఇప్పటిపురాణగ్రంథములలో పైవిషయము లన్నియో కొన్నియో మాత్రమే గాక నదీమాహాత్మ్యములు, స్థలమాహాత్మ్యములు, వ్రతమాహాత్మ్యములు దానధర్మమాహాత్మ్యములు, శ్రాద్ధకల్పము, పితృోపాఖ్యానము, పూజావిధానములు, మంత్రోద్ధారములు మొదలగు ననేకగృహ్యవిధానవిషయములు చేర్పఁబడి యున్నవి. శైవమతానుసారిగ శివమాహాత్మ్యప్రతిపాదకకథలు కొన్నిటియందును, వైష్ణవమతానుసారిగ విష్ణుమాహాత్మ్యప్రతిపాదకకథలు కొన్నిటియందును, దేవ్యుపాసకుల కనుగుణముగ దేవీమాహాత్మ్యము కొన్నిటియందును, నిట్లే యితరములగు ననేకకథలుకూడఁ జేర్పఁబడియున్నవి. మఱికొన్నిటియందు సర్వమతసామ్యత్వప్రతిపాదకముగఁ ద్రిమూర్తుల నేకత్వబోధకకథలు చేర్పఁబడినవి. ఇట్లనేకవిధములుగ మతబాహుళ్యానుసారముగ గ్రంథబాహుళ్యముకూడఁ గల్పింపఁబడినది. కాఁగా నిప్పటిపురాణగ్రంథములు కేవలమతవిషయకగ్రంథములై యట్టివిషయములకుఁ బ్రమాణభూతము లయినవి. కాని వీనియందుఁ గేవలచరిత్రాత్మకము లగుప్రాచీనపురాణభాగము లన్నియుఁ గాని కొన్నిగాని యుండుటచే వీనిపేరులందుఁ గాని కర్తృత్వమందుఁ గాని మార్పు కలుగ లేదు. కాక యట్టిమార్పు లేకుండుటయే వానిప్రామాణ్యతను హెచ్చించు నుగదా! కాఁబట్టి పురాణము తొల్లి పంచలక్షణాత్మక కేవలచరిత్రబోధకమై యనంతర మది మతవిషయికప్రమాణోపయోగి యైనది. ఇన్నిశాస్త్రము లుండ నీపురాణశాస్త్రమునకే యేల నీయవతారవిశేషమురవస్థసంభవించిన దన్నచో నిందులకు కారణము సులభముగనే యూహ్యము. ఈయొక్క శాస్త్రమునందే మనువు, విష్ణువు, రుద్రుఁడు, ప్రజాపతి, ఋషులు మొదలగు పురాతనలోకైకవీరులయొక్కయు, జ్ఞానవంతులయొక్కయు నుపాఖ్యానంబులును, చరిత్రలును గలవు. మఱియు నిందే జగత్తుయొక్క సృష్టిసంహారముల వర్ణనములును, దేవాసురరాక్షసాదులయుద్ధాదిచరిత్రంబులును గలవు. కాఁబట్టి యీచరిత్రలే మతమాహాత్మ్యముల వెల్లడించుకథలయవతారములను సులభముగఁ బొందినవి. ఇదియే పురాణశాస్త్రముయొక్క ప్రాచీననవీనస్థితుల భేదము

ఇంక నైతిహాసికసంప్రదాయ మెట్టి దో చూతము. పురాణాఖ్యానము చాలఁ బ్రాచీనము. కేవల గురుశిష్యానువాదరూపమున నిది చాలకాలము ప్రవర్తించినది. ప్రథమపురాణకథనము పురూరవచక్రవర్తి కాలమున జరిగినట్లు కనఁబడుచున్నది. ఇది నైమిషీయులకు వాయుఋషి చెప్పినదిగా నున్నది. పురూరవచక్రవర్తికాల మనఁగా చరిత్రప్రారంభ కాలము. దీనినిబట్టి చూడ పురాణకథన మతిప్రాచీనముగ మనభరతవర్షమున నున్న దనుట యెంతమాత్రము సాహసము కానేరదు. ఇట్లన వాదరూపమునం జాల కాలము ప్రవర్తించి తుదకు మహాభారత యుద్ధకాలమున నిది సంహితానామమున గ్రంథముగ వ్రాయఁబడినట్లు తెలియవచ్చుచున్నది. పురాణసంహితాగ్రంథకర్తయు, మహాభారతమున కాదిగ్రంథ మగు జయసంహితను రచించినవాఁడును వ్యాసమహర్షియె. ఈయన పరాశరమహర్షి కుమారుఁడు. కాని వేదమును విభజించిన వేదవ్యాసుఁ డీయన కాఁడు. వీరిద్దఱికిని సుమారు $1\frac{1}{2}$ శతాబ్దముల యంతర మున్నది.* వ్యాసమహర్షి యీ పురాణసంహితను ఆఖ్యానములతోను, ఉపాఖ్యానములతోను, గాథలతోను, కల్పవాక్యములతోను రచించె నని యున్నది.

శ్లో॥ ఆఖ్యానై శ్చాప్యుపాఖ్యానై ర్గాథాభిః కల్పజోక్తిభిః । పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః॥

(వాయు. I. 60. 21.)

వ్యాసమహర్షి యీసంహితను దన యైదవశిష్యుం డగుసూతమహర్షికి చెప్పెను. ఈసూతమహర్షి యీసంహితను తిరిగి తన యార్గురుశిష్యులకును జెప్పెను. ఈయార్గురిలోను ముగ్గురుమాత్రమె సంహితాకర్తలైరి. ఇట్లు నాలుగుమూలసంహితలు పురాణశాస్త్రమున కేర్పడినవి. ఈనాల్గుసంహితలును వేదశాఖలువలె కేవలపాఠభేదములు మాత్రమే గల వనియు, నొక్కొక్కటియు 4,000 గ్రంథసంఖ్యగలిగిన దనియు, నొక్కొక్కదానియందు నాల్గుపాదములు గల వనియుఁ జెప్పఁబడినది. ఈవిషయము లన్నియు వాయుపురాణ† బ్రహ్మాండపురాణ‡ ప్రసిద్ధంబులే.

పురాణసంహితయందలి నాలుగుపాదములకును వరుసగ (౧) ప్రక్రియాపాద మనియు, (౨) ఉపోద్ఘాతపాద మనియు, (౩) అనుషంగపాద మనియు, (౪) సంహారపాద మనియు నామము లిడఁబడినవి.

శ్లో॥ ప్రక్రియా ప్రథమః పాదః కథ్యవస్తుపరిగ్రహః । ఉపోద్ఘాతో నుషంగశ్చ ఉపసంహార ఏవచ ॥ ఏవం హి పాదా శ్చత్వార స్సమాసా త్కీర్తితా మయా॥ అని.

(వాయు. I. IV. 12. 14)

ప్రథమపాద మగుప్రక్రియాపాదమున సూతాగమనంబును, నైమిషీయాఖ్యానంబును, సమాసకథనంబును, ప్రాకృతసర్గముల వర్ణనంబును, వైకృతసర్గములవర్ణనంబును ననునీయంశంబులు వివరింపఁబడి యున్నవి.

* See my History of Panchala (Vedic period) p. 20.
† వాయు. I. LXI. 55-61 ‡ బ్రహ్మాండ I. XXXV 63. 69.

రెండవయుపోద్ఘాతపాదంబున ద్వాదశమానసనుతోత్పత్తియు, స్వాయంభువప్రజాసర్గవర్ణనంబును, ద్వాదశమానససుతప్రజాసర్గంబులును, అగ్నినిచయమును, పితృవంశానుకీర్తనంబును, దక్షయజ్ఞకథాకథనంబును, స్వాయంభువమన్వంతరవివరణమును, భువనవిన్యాసంబును, జ్యోతిర్విన్యాసంబును, నతీతమన్వంతరములవర్ణనంబు నను నీయంశంబులు విశదీకరింపఁబడి యున్నవి. మూఁడవయనుషంగపాద మంతయు వైవస్వతమన్వంతరవిన్యాసంబె. ఇందు ధర్మ, ఈశ్వర, కశ్యప, పులహప్రజాసర్గంబుల వర్ణనంబులును, బ్రహ్మమానసపుత్రుల యుత్పత్తియు, వారివంశానుకథనంబును, వీరిమంత్రకర్తృత్వమును, ఋషులచతుర్విధభేదంబును, పితృవంశానుకీర్తనంబును, ఐక్ష్వాక్వాదిరాజవంశకీర్తనంబును, మాగధరాజవంశకీర్తనంబును, యదువంశకీర్తనప్రసంగంబున ద్వాదశదేవాసురయుద్ధవర్ణనంబును, భవిష్యద్రాజానుకీర్తనంబు ననువిషయంబులు విస్తరింపబడి యున్నది. నాల్గవసంహారపాదమునందు ననాగతమన్వంతరంబుల వర్ణనంబును, జగత్సంహారరూపంబగుమహాప్రళయవర్ణనంబును గలవు. ఇదియే పురాణముయొక్క కృత్యసముద్దేశము. కాఁబట్టి పురాణసంహితాభాగమున కేవలచరిత్ర (History and Geography) విషయముతప్ప మతవిషయక (religion) సంపర్కమే లేదు.

ఇట్లు పురాణసంహితాజ్ఞానసంపన్నులపై యిుక నిప్పటిపురాణగ్రంథములఁగూర్చియు, వానికి నీపురాణసంహితకును గలసంబంధవైలక్షణ్యములనుగూర్చియును జర్చింతము. పురాణగ్రంథములు మహాపురాణములనియు, నుపపురాణము లనియు, ఖిలము లనియు మూఁడువిధములు. ఇందాఖరు రెండువిధములగ్రంథములును కేవలమతవిషయకగ్రంథము లగుటచు బ్రస్తుతవిషయమున నవిత్యాజ్యంబులు. మహాపురాణంబులు పదునెనిమిది ప్రసిద్ధంబులు. వీనినామముల స్మారకముం జేయుచోద్య మగుశ్లోక మొకటి గలదు.

శ్లో॥ మద్వయం భద్వయం చైవ బ్రత్రయం
వచతుష్టయం। అ ప నా లిం పురాణాని
కూ స్కం గారుడ మేవచ॥ అని.

ఇది యొకచాటుశ్లోక మని తలంచెదను. దీనితాత్పర్యము. మకారము నామాదియందుఁ గలవి రెండును, నిట్లే భకారమాదియందుఁ గలవి రెండును, బ్రివర్ణ మాదియందుఁ గలవి మూఁడును, వకార మాదియందుఁ గలవి నాల్గును, అకార, పకార, నాకార, లిం వర్ణము లాదియందుఁ గలవి యొక్కొక్కటియు, కూ వర్ణమును, స్కం వర్ణమును నాదియందుఁ గలవి యొక్కొక్కటియు, గారుడ మొకటియు నని పురాణములనామములును వానిగ్రంథసంఖ్యయు నీక్రింద వివరించెదను.

| | | | |
|---|---|---|---|
| 1 | మార్కండేయపురాణము | | 9,000 |
| 2 | బ్రహ్మపురాణము | ... | 10,000 |
| 3 | వామనపురాణము | ... | 10,000 |
| 4 | లింగపురాణము | ... | 11,000 |

| | | |
|---|---|---|
| 5 | బ్రహ్మాండపురాణము ... | 12,000 |
| 6 | మత్స్యపురాణము ... | 14,000 |
| 7 | భవిష్యపురాణము ... | 14,500 |
| 8 | కూర్మపురాణము ... | 17,000 |
| 9 | భాగవతపురాణము ... | 18,000 |
| 10 | బ్రహ్మవైవర్తపురాణము | 18,000 |
| 11 | గరుడపురాణము ... | 19,000 |
| 12 | విష్ణుపురాణము ... | 23,000 |
| 13 | వాయుపురాణము ... | 24,000 |
| 14 | వరాహపురాణము ... | 24,000 |
| 15 | నారదపురాణము ... | 25,000 |
| 16 | పద్మపురాణము ... | 55,000 |
| 17 | స్కాందపురాణము ... | 81,000 |
| 18 | అగ్నిపురాణము ... | 15,000 |

పైనామావళిలో భాగవతపురాణస్థానమున దేవీభాగవతమును, వాయుపురాణస్థానమున శివపురాణమును గొందఱు పరిగణించెదరు. కాని, యీమార్పు పైశ్లోకమునకు సరిపడదు. కొందఱు వాయుపురాణమునకే శివపురాణ మని కూడ వ్యవహారము కల దందురు. స్కాందపురాణాగ్నిపురాణముల గ్రంథసంఖ్యయందుఁగూడ భేదము చెప్పుదురు. కొందఱు స్కాందపురాణము 1,13,000 ల గ్రంథ మనియు, నగ్నిపురాణము 16,000 ల గ్రంథ మనియును జెప్పుదురు. మఱికొందఱు అగ్నిపురాణము 23,000 లగ్రంథ మనియును జెప్పుదురు. భవిష్యపురాణమున రాజపుత్రస్థానపుకొందఱువీరులచరిత్రంబులును, శంకర-రామానుజ-కబీరాదిమతప్రవర్తకులచరిత్రంబులును, బాబరు-అక్బరు-ఔరంగజేబు మొదలగుమహమ్మదీయచక్రవర్తులకథలును, గారుండు అనుపేరున పాశ్చాత్త్యులచరిత్రములును, క్రీస్తుమతగ్రంథమగు "హోలీబైబిల్" (Holy Bible) లోని కొంతభాగమును గూడఁ గలవు. పురాణములందుఁ జరిత్రవిషయము కొంచెముకొంచె ముండినను, చాలభాగము కేవలమతవిషయకమాహాత్మ్యము లయియే యున్నవి. ఈవిషయము కేవలచరిత్రాత్మక మగుపురాణసంహితయొక్కయు, మతప్రమాణగ్రంధము లగునీపురాణగ్రంథముల యొక్కయు, గ్రంథసంఖ్యలను తైపారువేసిననే మనకు విశదము కాఁగలదు.

ఈపురాణములలోఁ గొన్నిటికిని, పురాణసంహితకును, గొంతసంబంధము కలదు. వాయుపురాణబ్రహ్మాండపురాణమత్స్యపురాణములందు సంహితాభాగములు కంఠోక్తిగా నున్నవి. వీనిలోఁగూడ విశేష మే మన్నను, మత్స్యపురాణముకన్న బ్రహ్మాండపురాణమందును, బ్రహ్మాండపురాణముకన్న వాయుపురాణమునందును సంహితాభాగములు మెండు. విష్ణుపురాణమార్కండేయపురాణములందుఁగూడ సంహితాభాగము లతిస్వల్పముగాను గంఠోక్తిగాను నున్నవి. కాని యీరెండిఁటికి పరస్పరభేద మే మన్నను, విష్ణుపురాణమున సంహితాభాగములు కొన్ని కంఠోక్తిగ లేకున్నను, దద్విషయ మంతయు రూపాంతరమునఁ గలదు. మార్కండేయపురాణము నన్నన్నో రూపాంతరమునఁగూడ లేదు. మార్కండేయపురాణము పూర్తి కానిగ్రంథ మని తోఁచుచున్నది. లింగపురాణమునఁగూడ

కొంచెము సంహితాభాగము కలదు. మిగిలిన భాగములు రూపాంతరమునఁగూడ నిందు కానరావు. భాగవతమున సంహితాభాగము లన్నియు రూపాంతరముననే యున్నవి. దేవీమాహాత్మ్యముగూడ ప్రాచీనచరిత్రబోధకమే. ఇది మార్కండేయపురాణవామనపురాణములందే కాన్పించుచున్నది. ఇది సంహితాభాగ మగునో కాదో తెలియరాకున్నది. ఇంక గరుడపురాణాగ్నిపురాణములు పురాణశబ్దమున కపకీర్తిప్రదములు. వీనిని పురాణము లనివ్యవహరించుటయే లజ్జాకరము. ఇందు పురాణవిషయములు లేకుండుటయే కాక, యగ్నిపురాణమున నమరనిఘంటువులోనికొంతభాగమును,శల్యతంత్రమగుసుశ్రుతసంహితలోని కొంతభాగమును, మఱియొక యలంకారగ్రంథములోని కొంతభాగమును గూడఁ గలవు. గరుడపురాణమున మంత్రశాస్త్రభాగము కలదు. ఇంతకన్న నసందర్భము మఱియొకటి యుండ దని తలంచెదను.

సంహితాభాగములం గఁతోక్తిగాఁ గలవాయుబ్రహ్మాండాదిపురాణములయవతారమును గూర్చి నే నిట్లూహించెదను. పురాణసంహితయె కాలక్రమమున మతప్రామాణికత్వసంబంధము కలదై తత్తదుపయోగముగాఁ బ్రక్షిప్తభాగములు చేర్పఁబడి యీ పురాణములయవతార మెత్తియుండును. కావుననే సంహిత ప్రత్యేకగ్రంథముగ నెచ్చటను గానరాకున్నది. ఈకారణముచేతనే పురాణములకర్తృత్వముగూడ వ్యాసమహర్షియందే యుంపఁబడినది.

శ్లో॥ అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః॥

అని యందురు. ఈవివక్ష యీనూతనగ్రంథములప్రామాణ్యత్వమును హెచ్చించుటకుగదా.

ఇంక నొక్కవిషయమును జెప్పి యింతటితో నీపురాణవిషయవిన్యాసమును సమాప్తిచేసెదను. పురాణసంహితను గఁతోక్తిగాఁ గలవి పురాణములే కాక మఱియొకగ్రంథముకూడ నున్నది. మహాభారతమునకు 19 వ పర్వమై ఖిలపర్వమని ప్రసిద్ధిచెందిన హరివంశమునఁగూడ సంహితాభాగములు కఁతోక్తిగాఁ గలవు. కాఁబట్టి చరిత్రవిషయమున వాయ్వాదిపురాణము లెంతముఖ్యములో యీహరివంశముగూడ నంతముఖ్యమైనది. సంహితాభాగముల హరివంశపాఠము మత్స్యపురాణపాఠము ననుసరించియున్నది. బ్రహ్మాండపురాణపాఠము వాయుపురాణపాఠము ననుసరించియున్నది. ఈరెండువిధముల గుపాఠములును రెండుమూలసంహితలనుండి కలిగియుండ వచ్చును.

కాఁబట్టి పురాణములను హరివంశమును మిక్కిలియుదారబుద్ధితో వ్యాసంగము చేసి క్షీరనీరన్యాయమున మతవిషయభాగముల వదలి చరిత్రభాగములమాత్రము గ్రహించినచో మనదేశచరిత్రమునందలిప్రాచీనదశాచరిత్రము సవిశదముగఁ దెలిసికొన వచ్చును. ఇట్లు తెలిసికొనినచరిత్రాంశముల దృఢపఱుచుటకు మఱికొన్నియితరగ్రంథనిదర్శనములు గూడఁ గలవు. ఇట్టితరగ్రంథనిదర్శనమున

దృఢపడినవియే నిర్వివాదసిద్ధాంతము లగును. ఈయితరగ్రంథనిదర్శనములందు ముఖ్యమగునది వేదము. కల్పముగూడ నప్పటి సాంఘికస్థితిబోధకము.

### III. వేదము—కల్పము.

వేదము సాధారణముగ భాగత్రయాత్మక మని చెప్పుదురు. ఈభాగములకు మంత్రము, బ్రాహ్మణము, ఉపనిషత్తు- అని పేర్లు. కాని ప్రాచీనవ్యవస్థ మంత్రబ్రాహ్మణములరెండింటి కేయీ వేదనామమునునియమించుచున్నది. ఆపస్తంబపరిభాషాసూత్రమున-

సూ॥ మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయం॥ (అ॥ ప॥ 1-33) అని చెప్పఁబడియున్నది. క్షీరస్వామియు, రాయముకుటులునుగూడ వేదశబ్దమున కిట్లే యర్థనిర్ణయము చేసిరి. వీరిమతమున నుపనిషత్తులు బ్రాహ్మణములలోఁ జేరినవియే యని యభిప్రాయము. ఎట్లయినను కేవలపరిభాషావ్యవస్థభేదముగాని గ్రంథభేదము లేదు. మంత్రభాగము పద్యగద్యాత్మకముగ నున్నది. వైదిక పరిభాషను పద్యరూపమునకు "ఋక్" అనియు, గద్యరూపమునకు "యజుస్" అనియు వ్యవహారము. కావున మంత్రభాగము కొంత ఛందోబద్ధముగను, గొంత గద్యరూపముగను నున్న దని తెలియ వచ్చుచున్నది. ఆదికాలమున గద్యపద్యాత్మక మగుమంత్రభాగమంతయు నేకముగా నుండె ననియు, దానిని వేదవ్యాసమహర్షి యజ్ఞార్థము నాల్గుభాగములుగ నేర్పఱచి యీనాల్గుభాగములును నాలుగుశాఖలుగ లోకమునఁ బ్రవర్తింపఁజేసె ననియుఁ బురాణప్రసిద్ధము. ఈనాలుగుశాఖలే ఋక్శాఖ, సామశాఖ, అధర్వణశాఖ, యజుశ్శాఖ-యను నామములఁ బ్రసిద్ధంబులు. యజ్ఞమున హోత పఠించున దంతయు ఋగ్వేదముగను, ఉద్గాత పఠించునది సామవేదముగను, బ్రహ్మ పఠించునది యధర్వవేదముగను, అధ్వర్యుఁడు పఠించునది యజుర్వేదముగను, వ్యవస్థ చేయఁబడినది. ఇది యజ్ఞములు లోకమునం బ్రబలియుండినకాలమునం దత్సౌకర్యార్థము చేయఁబడినది. కాని కాలక్రమమున యజ్ఞములప్రాముఖ్యత నశించినయీకాలమున నిట్టివ్యవస్థ కేవలనామమాత్రప్రయోజకము. శాస్త్రపరిశోధనమే (Critisism) ముఖ్య మగునీకాలమున నర్థోద్దేశ్యావిర్భావంబులే ముఖ్యములు. ఈనాలుగుశాఖలమంత్రభాగములందు నొకదానిలోని భాగములు మఱియొకదానియందుఁ గలవు. సామవేదమంత్రభాగ మంతయు ఋగ్వేదములోనిదే. అధర్వవేదములోని సుమారు సగముభాగము ఋగ్వేదమునం గలదు. కావున ఋక్సామాధర్వణంబులగుమంత్రభాగంబులు ఋగ్వేదంబుతో నందు లేనియధర్వణమంత్రభాగము చేర్చిన సిద్ధించుగ్రంథముతో గతార్థ మగుచున్నది. యజుర్వేదసంహిత శ్రౌతసూత్రమువంటి యజ్ఞముచేయుట కుపయోగించు కేవలవిధానగ్రంథము. కావున నిర్దుష్ట మగుమంత్రభాగము ఋగ్వేదమంత్రభాగమునకు, నందు లేనియధర్వణమంత్రభాగంబును జేర్చిన సిద్ధించుచున్నది. దీనినే నిర్దుష్టమంత్రభాగ మని మన మిటుపైని వ్యవహరింతుము.

ఈనిర్దుష్టమంత్రభాగముయొక్క లక్షణములఁ గొన్నిటిం జూతము. ఈమంత్రభాగ మంత యుఁ బద్యాత్మక మనఁగా ఋక్కులరూప ము గలది. ఈఋక్కులు కొన్నికొన్ని చేరి యొకసూక్త మగుచున్నది. సూక్తమునకు ఋక్సంఖ్యానియమము లేదు. కాని ఋగ్వేద మంత్రభాగమున 58 దికి మించినఋక్కులు గలసూక్తము లేదు. సాధారణముగ 30 ఋక్కులకు లోపుగనే యుండును. సాధార ణముగ నొకసూక్త మొకదేవతాకముగను, నొకఋషిప్రోక్తముగను నుండును. ఈసూ క్తములకు కర్తలు ఋషులు.

ఇఁక నీఋషులంగూర్చి కొంత విమర్శిం తము. ఋషు లనఁగా నెవ్వరు? వీరిలోని తెగ లెన్ని? వీ రెంతకాలపువారు? అను నీయంశములను ముందుగఁ బరిశీలింతము. మనభరతవర్షములో పూర్వకాలమున నుం డినమనుష్యజాతులను మన నైతిహాసికులు నాలుగుగణములు చేసి వానికి ధర్మప్రజా సర్గ మనియు, ఈశ్వరప్రజాసర్గ మనియు, కశ్యపప్రజాసర్గ మనియు, పులహప్రజాసర్గ మనియు, *పేరు లిడిరి. ధర్మప్రజాసర్గమున సుమా రైదుజాతులును, నీశ్వరప్రజాసర్గ మునఁ బదిసంతతులును, గశ్యపప్రజాసర్గ మున సుమా రేడుజాతులును, బులహప్రజా సర్గమున సుమా రెనిమిదిజాతులును, జేర్గొ నఁబడినవి. ఇందు రెండవయీశ్వరప్రజాసర్గ ములోని పదిసంతతులవారే ఋషులు. ఈ పదిసంతతులలోను ముఖ్యము - లగుసంత తులు భార్గవులు, మరీచులు, ఆత్రేయులు, ఆంగిరసులు, వాసిష్ఠులు, కాశ్యపులు, మా నవులు-అని. ఈసంతతు లన్నియు సమకాలీ నములు కావు. ఇం దాఖరునం జెప్పినమాన వులుతక్క మిగిలినసంతతు లన్నియు నొక దానితరువాత నొకటి ప్రసిద్ధిం బడసినవే. ఇంతఁ బ్రాచీననవీనసంతతుల యవాంతరకా లము సుమారు 1,000 సంవత్సరము లుం డును. ఈసంతతు లన్నియు భారతయుద్ధము నకు ముం దుండినవియె.

ఈఋషిసంతతులయాదిపురుషుల కీ శ్వరు లని పేరు. అందుచేతనే యీప్రజా సర్గమున కీశ్వరప్రజాసర్గ మని పేరు వచ్చినది. ఈయీశ్వరుల సంతతివారే ఋషులు. ఈ ఋషిసంతతివారికి ఋషీకు లని పేరు. ఈ ఋషీకులసంతతివారికి ఋషిపుత్రు లనిపేరు. ఈనాలుగుతెగలవారికిని వారి వారి తపో జ్ఞానసంపదలచేఁ గ్రమముగ పరమర్షు లని యు, మహర్షు లనియు, సత్యర్షు లనియు, శ్రుతర్షు లనియు, నామాంతరములు ప్రసి ద్ధంబు లయ్యె. ఈనాలుగుతెగలలోను మొ దటిరెండు నగునీశ్వరమహర్షిబృందములే మం త్రిభాగమునకుఁ గర్తలు. వీరే భారతయుద్ధ మునకు ముం దుండినవారు. వీరిసంతతివార లగుఋషీకఋషిపుత్రులు భారతయుద్ధానం తరకాలపువారు. కాన మహాభారతయుద్ధ కాలముతో మంత్రిభాగము సమాప్తిఁ జెం దినది. ఈమంత్రికర్తలలో ముఖ్య మగువారి

* See my Ancient Indian Trilees the Bhutas, A, PP. B, PP. 31-33.

సంఖ్య తొంబదియొకటి యని పురాణమునం జెప్పఁ బడినది.

శ్లో॥ ఇత్యేకనవతిః ప్రోక్తా మంత్రాయైః
ఋషిభిః కృతాః॥ అని.

(బ్రహ్మాండ. I. xxxii. 122)

కాని వీరియందఱినామములును, వీరు చేసినసూక్తములవివరణమును, వీరిసంపూర్ణ సంఖ్యయు, కాత్యాయనులు చేసినఋగ్వేదానుక్రమణియందును, శౌనకప్రోక్తం బగుబృహద్దేవతార్షానుక్రమణులయందును వివరింపఁ బడియున్నవి. వీరిసంపూర్ణసంఖ్య రమారమి మున్నూటువదఱకుండును. ఇందు సుమారు పాతికమంది స్త్రీలుకూడ నున్నారు.

కాని వేదము "అపౌరుషేయము" అనియు నెవరును దానిని రచింపలే దనియు లోకప్రవాదము. అమానుషత్వవిషయము మటుండ సహజముగ రచన లేకుండ గ్రంథము లోకమున సిద్ధింపదుగదా! ఇట్టివిషయమున వేదమున కేల యీప్రవాదమును గల్పించిరి? దానియందొకగౌరవమును నారోపించి దానిప్రామాణ్యతను హెచ్చించుటకే కాని యసత్యానువాదమున గౌరవారోపణము కేవలకపటగౌరవ మగును. ఇట్టిపని నిందార్హముగాక స్తోత్రార్హ మగునా? ఈపాపమునకుఁ బ్రప్రథమమున నొడికట్టినవారు పూర్వమీమాంసకులు. వేదములను భగవంతుఁడు చెప్పఁగా ఋషులు విని వానిని లోకమునఁ బ్రవర్తింపఁజేసి రని చెప్పుదురు. ఈయభిప్రాయమునే కొంచెమునవరించి నవీనకాలానుగుణముగ నీశ్వరావేశమున ఋషులే వీనిం జేసి రని కొందఱు చెప్పుచున్నారు. కాని వేదమున కపౌరుషేయత్వమును లోకానుభవవిరుద్ధము కాకుండ సాధింప వచ్చును. అపౌరుషేయ మనఁగా నీశ్వరప్రోక్త మని గదా పర్యాయము. అగుచు. వేద మీశ్వరప్రోక్తమే. ఇది పురాణప్రసిద్ధంబె. వేదమంత్రములం జేసినవారు పరమర్షులుగదా! పరమర్షులే యీశ్వరనామంబున ప్రసిద్ధిపొంది యున్నప్పుడు వేద మీశ్వరప్రోక్త మనుటకు సందియ మే మున్నది? కావున యీశ్వరప్రోక్తం బనునర్థంబున "అపౌరుషేయ" పదమును ధారాళముగ మన మంగీకరింప వచ్చును. ఇందువలన వేదమునకుఁ గపటగౌరవము రాదు. దానియందలిప్రామాణ్యబుద్ధియుఁ దగ్గదు. తపోజ్ఞానచారిత్రసంపదలచే నీశ్వరతుల్యు లగునీశ్వరులచే రచియింపఁబడినగ్రంథములసర్వోత్కృష్టతకు శంకింపవలసిన దే మున్నది? ఈశ్వరశబ్దమునకుఁ గాలాంతరమునఁ బరమర్షి యనునర్థము వ్యవహారము తప్పి కేవలభగవద్వాచకమే యయి యీశ్వరప్రోక్తపదము మీమాంసకులకుఁ గపటగౌరవారోపణసహకారి యైనది. కావున యీశ్వరశబ్దమును దానిప్రాచీనార్థమునఁ దీసికొనిన నేదియు లోకవిరోధంబు కలుగ నేరదు. పురాణము నసత్యము కా నేరదు.

మంత్రములస్వభావమునుగూర్చి పురాణ మిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ మంత్రా నవవిధ ప్రోక్తా ఋగ్యజుస్సామలక్షణాః। స్తోత్రం, నిందా, ప్రశంసా, చా

క్రోశ, స్తోష, స్తథైవచ । ప్రశ్నా, నుజ్ఞా,
తథాఖ్యాన మాశాస్తి ర్వ్యథయోమతాః॥
(బ్రహ్మాండ. I. XXXIII. 42-48)

అనఁగా ఋగ్యజుస్సామలక్షణంబు లగు మంత్రంబులు స్తోత్రము, నింద, ప్రశంస, ఆక్రోశము, తోషము, ప్రశ్న, అనుజ్ఞ, ఆఖ్యానము, ఆశాస్తి యనుతొమ్మిదివిధములై యుండు నని తాత్పర్యము. ఛందోబద్ధము లగు మంత్రముల కిట్టిస్వభావము నైసర్గికమె. సాహిత్యకులపతులుకూడ పద్యావిర్భావము న కిట్టికారణములనె కదా చెప్పుచున్నారు. సుఖదుఃఖాదిమనోధర్మంబు లత్యుత్కృష్టంబు లగునెడ విద్వాంసులకుఁ దత్తజ్జనితానుభవంబులు పద్యరూపమున నబుద్ధిపూర్వకముగఁ గూడ బయలు వెడలు ననిగదా వారు సాధించియున్నారు. మంత్రము లన్నియు మొదటినుండియు యజ్ఞార్థమే వ్రాయఁబడిన వనుట పైశ్లోకములంబట్టి నైతిహాసికమతవిరుద్ధము గదా? వేదసూక్తములుకూడ కావ్యములవలెనే పుట్టి యనంతర మొకకాలమున యజ్ఞోపయోగిత్వమునుం బొందినవి కాని దీనింబట్టి యజ్ఞార్థముగనే వ్రాసినమంత్రములు లే వని చెప్ప లేము. ఈమంత్రములం దచ్చటచ్చట చరిత్రవిషయములు కూడ సందర్భానుసారముగ సూచింపఁబడియున్నవి. ఒక ఋషి తన కొకరాజసన్మానము కలిగినను, లేదా తనకాలమున నున్నవా రొకగొప్ప యజ్ఞమును జేసినను, లేదా రెండుదేశముల ప్రజల కొకయుద్ధము జరిగినను, లేదా తన కొకప్రసిద్ధపురుషునివలన సహాయము కావలసి యుండినను, నింక నిట్టివిషయములు తన కాలమున జరిగెనేని వానిం బ్రసక్తానుప్రసక్తముగ వర్ణించుసందర్భములు మంత్రములం గలవు. ఇట్టిసూచనలె చరిత్రశోధనమునకు సహకారు లగుభాగములు. ఇవి చరిత్రాంశముల దృఢపఱచి నిర్వివాదాంశములుగ సిద్ధాంతీకరించును కాని యీసూచనల వెదకి గుర్తించుటకుఁ గొంతకాలము పట్టును. ఇది కాక విమర్శకునిపట్ల నెంతయో యోర్మికూడ నిందుల కపేక్షితము.

ఇంక బ్రాహ్మణము లనుగ్రంథములం గూర్చి కొంత తెలిసికొందము. ఇవియు మంత్రములవలె చరిత్రాంశముల దృఢపఱచు సూచనలం గలిగి యున్నవి. ఇవి యజ్ఞముల యందలివిధానవిశేషములనే గాక మంత్రవివృతరూపము లగుభాగములంగూడ గలిగి యున్నవి. ఇందు యజ్ఞములవిషయమం దైననేమి? మంత్రములవిషయమం దైననేమి? సంప్రదాయబోధకాఖ్యానములుగూడఁ గలవు. ఈబ్రాహ్మణగ్రంథములు భారతయుద్ధానంతరము వ్రాయఁబడినందునను, మంత్రభాగమునందు శాఖాప్రవర్తనము భారతయుద్ధమునకుఁ బూర్వమే గలిగి యుండుటచేతను, బ్రాహ్మణములు శాఖావ్యవస్థితములయియే రచింపఁబడెను. ఋక్శాఖకు సంబంధించినబ్రాహ్మణములు ప్రస్తుతకాలమున రెండుకానవచ్చుచున్నవి. ఇవియె నైతిరేయబ్రాహ్మణమును, గౌషీతకిబ్రాహ్మణమును, సామశాఖకు సంబంధించినయెనిమిదిబ్రాహ్మణములలో ముఖ్య మగున ది తాండ్యబ్రాహ్మ

ణము. దీనికే పంచవింశబ్రాహ్మణ మనియు, మహాబ్రాహ్మణ మనియు నామాంతరములు. అథర్వణశాఖకు సంబంధించినది గోపథబ్రాహ్మణము. యజుశ్శాఖకు సంబంధించి బ్రాహ్మణలక్షణములు గలది శతపథబ్రాహ్మణము. తైత్తిరీయబ్రాహ్మణమున మంత్రభాగముకూడ కలిసియుండుటను కేవలబ్రాహ్మణముగ దీనిం బరిగణింప శక్యము కాదు. ఈ బ్రాహ్మణములకర్తలు ఋషీక-ఋషిపుత్రులని పురాణప్రసిద్ధము. వీరే సత్యర్షి - శ్రుతర్షి నామములం బ్రసిద్ధులు మంత్రభాగమందువలెనే యిందుకూడ చరిత్రాంశసూచనలు మిక్కిలి యోపికతో వెతకి తీయవలసియున్నది.

ఉపనిషత్తులుకూడ బ్రాహ్మణభాగములనియె కొందఱిసిద్ధాంత మని యింతకుముందు చెప్పఁబడినదిగదా? పురాణములంబోలెను పనిషత్తులుగూడ కాలక్రమమున రచియింపఁబడుచు వచ్చినవి. రానురాను వానిసంఖ్య సంఖ్యాతీత మగుటను నూటయెనిమిదియె వేదసంబంధప్రయోజనము గల వని వ్యవస్థ చేయఁబడినది. వీనిసంఖ్యాతీతత్వమును, గాలక్రమాభివృద్ధియునుగూడ నక్బర్ చక్రవర్తి కాలమున రచింపఁబడిన యల్లోపనిషత్తువలననే స్పష్ట మగుచున్నది. ప్రస్తుతాదరణమునన్నున్న నూట యెనిమిది యుపనిషత్తులలోను ప్రాచీనములై బ్రాహ్మణభాగములనఁ దగినవి సుమారు పది, పండ్రెండుమాత్రమే యుండును. మిగిలినవానిలోఁ గొన్ని సన్న్యాసప్రతిపాదకంబులును, గొన్ని యోగశాస్త్రప్రతిపాదకంబులును, మఱికొన్ని మంత్రశాస్త్రప్రవర్తకంబులును, నింక నితరములు కొన్ని యధ్యాత్మకవిషయంబులుచు నై యున్నవి. ప్రాచీనోపనిషత్తులలో సామశాఖానుబంధ మగునది ఛాందోగ్యోపనిషత్తును, యజుశ్శాఖానుబంధ మగునది బృహదారణ్యకోపనిషత్తును, అథర్వణశాఖానుబంధ మైనది ప్రశ్నోపనిషత్తును, ఋగ్వేదానుబంధ మగునది యైతరేయోపనిషత్తును ముఖ్యమైనవి. మంత్రబ్రాహ్మణభాగములందువలెనే యిందుకూడ చరిత్రాంశసూచనల మిక్కిలి యోపికతో వెతకి తీయవలసి యున్నది.

కల్పసూత్రములుకూడ శాఖభేదానుసారముగ రచియింపఁబడినగ్రంథములే. ఇవి కేవలసూత్రాత్మకంబు లగుటను వీనికి సూత్రము లని నామము కలిగెను. సూత్రమన నల్పాక్షరమయమై యసందిగ్ధార్థమును గలదై యనవద్య మగువాక్యము.

శ్లో॥ అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖం । అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః॥ అని—

(బ్రహ్మాండ. I. 33. 58)

ఇట్టిసూత్రములు గలగ్రంథమునకుఁ గూడ సూత్ర మనియే పేరు. కాని యావ్యవస్థ నవీనకాలమునఁ జెడి యిట్టిసూత్రములు గలగ్రంథము సూత్రపాఠ మని పిలువఁబడుచున్నది. కాని యీకల్పగ్రంథములవిషయమున సూత్రములనియే యిప్పటికిని వ్యవహారము. ఈకల్పసూత్రములలో యజ్ఞాది

విధానములం జెప్పువానికి శ్రౌతసూత్రములనియు, గృహ్యకర్మలవిధానములం జెప్పువానికి గృహ్యసూత్రము లనియు, వర్ణాశ్రమధర్మవ్యవస్థను నిర్ణయించువానికి ధర్మసూత్రము లనియుం జేర్లు కొన్ని శాఖలవారికిమూండువిధము లగుసూత్రముల నొకఋషియే రచించెను. మఱికొన్ని శాఖలకొక్కొక్కదాని నొక్కొక్క ఋషి రచించెను. యజుశ్శాఖోపయోగార్థ మాపస్తంబఋషి మూండువిధము లగుసూత్రములను దానే రచించెను. ఋగ్వేదమునకుంగూడ నాశ్వలాయనఋషి యట్లే మూంటిని దానే రచించెను. సామశాఖకు శ్రౌతసూత్రము ద్రాహ్యాయణఋషి కృతమును, గృహ్యసూత్రము ఖాదిరఋషి కృతమును, ధర్మసూత్రము గౌతమఋషికృతమును నైయున్నవి. మూండువిధము లగు సూత్రంబులందును దేశచరిత్ర కుపయోగించునవి ధర్మసూత్రములె. మిగిలినరెండిటియందును జరిత్రాంశసూచనములు క్వచిత్తుగ నుండును. ఈధర్మసూత్రముల సహాయమున వానికాలపుసాంఘికస్థితి యెట్లుండెనో తెలిసికొన వచ్చును. రాజ్యతంత్రపరిపాలనములవలెనే సాంఘికస్థితిగూడ దేశచరిత్రమున ముఖ్యమగు నంశమేగదా. మఱియు వర్ణాశ్రమధర్మముల కేవల స్వరూపజ్ఞానమేగాక యవి యేయేకాలమున నెట్లుండెనో యను దాని చరిత్రముకూడ నీగ్రంథమువలనం దెలిసికొన వచ్చును.

మనదేశచరిత్రమునం బ్రాచీనదశాంశంబుల విమర్శించుట కుపయోగ మగుముఖ్యగ్రంథముల స్వరూపముల నింతవఱకుం బరిశీలించితిమి. ఇంకొక్కవిశేషమును మనము ముఖ్యముగ గమనింప వలెను. కేవల గ్రంథసామగ్రి యున్నమాత్రమునం జరిత్ర వ్రాయుట సాధ్యము కాదు. అట్టిచరిత్రకారునికిసవిశద మగుబుద్ధికూడ ముఖ్యాపేక్షితము. ముఖ్య మన నేల? ప్రథమాపేక్షితము. విశదబుద్ధి లేనివారు వ్రాసినచరిత్రాంశంబులు సత్యములు కానేరవు. విశదబుద్ధి యనంగా నాయభిప్రాయ మిది. మంచిభాషాపాండిత్యము, భాషాస్వాతంత్ర్యమును, ఊహయును సంపూర్ణ మైన యుదారత్వమును, (liberal thinking) సంకోచితత్వము లేకుండుటయు, (not conservetive) పూర్వసంకల్పితసిద్ధాంతబుద్ధి లేకుండుటయు, నిర్ధారితసిద్ధాంతములతోం బ్రవర్తించుటయు, (void of pre-settled ideas and prejudiced ideas.) మతసంబంధత్యాగబుద్ధియు, (rejection of religians interference) నప్రతిహతతర్కవాదమును, (unfallacius logical thinking) అపవాదభీతిత్యాగమును, (void of the fear of censure) అనునీమొదలగు గుణగుంభిత మగుబుద్ధియే విశదబుద్ధి. ఇదియే చరిత్రాంశవిమర్శనమునకు ముఖ్యప్రాణము. ఇట్లు ప్రాచీనదశాచరిత్రంబు వ్రాయుటకుం గావలసినముఖ్యవిషయములను జర్చించితిమి. ఇంతటితో నీవిషయమును విరమించి యిఁక రెండవ భాగ మగుపూర్వదశావిషయవిమర్శనమును గొంత పరిశీలింతము.

### IV. శాసనాదిశోధనము-

### ప్రాచీనవస్తుశోధనము.

పూర్వదశాచరిత్రమునకు ముఖ్యాధారములు శిలాశాసనములును, తామ్రశాసనములును, ఇతరశాసనములును, ప్రశస్తులు మొదలగుపూర్వలేఖలును. వీనిం బరిశోధించువారె పూర్వలేఖశోధకులు. వీరుకూడ మంచివిశదబుద్ధితో విమర్శింప వలెను. లేకున్నచో బహువిపరీతార్థములు కలుగును. ఈ విషయమున నొకచిన్నకథ* గలదు. చనువృతేని మార్వాడదేశస్థుం డొకఁడు గుజరాతుదేశమున నున్నయొకబంధువునకు వ్రాసిన యుత్తరమున నిట్లుండె నఁట.

కకఅజమరగయాఛకకకటఛ।

దీని నొకఁ డీక్రిందివిధమునఁ జదివి యతిదుఃఖకర మగువార్తను జెప్పెను.

కాకా అజ్ మర్ గయాఛే కాకీ కుటేఛే।

అనఁగా "పినతండ్రి యీరోజునఁ జనిపోయెను. పినతల్లి యందుకు దుఃఖించుచున్న" దని. ఆయుత్తరమునే మఱియొకఁడు చదివి సంతోషకర మగువార్త నిట్లుచెప్పెను.

కాకా అజమేర్ గయాచే కాకీ కోటోఛే।

అనఁగా "పినతండ్రి అజ్మీరునకు వెళ్ళెను. పినతల్లి కోఠాలో నున్న" దని.

---

* The following curious extract in supplied to me by my brother, S. P. V. Ramanujaswamy M. A. (now Principal of the Maharaja's Sanskrit College, Vizianagaram). It is taken from J. B. B. R. H. S. Vol. XVII. Part ii. Article iii. Memoir of the late Pandit Bhagavanlal Indragi L. L. D. P. H. D. Page 31.

"a.........very curious importance was attached by scholars to more correct readings of old inscriptions. It was in fact the only condition on which Indian archeology depended for its progress. Nothing illustrates the truth of this proposition better than an anecdote, which points to a serious moral, but which passes as a current joke in Guzarat even at the present day (1888). The story goes that a letter addressed by a native of Marwad to a relative in Guzarat, contained intimation couched in the following sentence.

क क अ ज म र ग या छ क क क ट ध।

By one person the sentence was read as:—

काका आज मरी गया छे काकी कूटे छे।

"i. e. uncle died today (and) aunt bewails his loss. But this meloncholy news gave way to a cheerful feeling on another person deciphering and interpreting the same sentence as:—

काका आजमेर गया छे, काकी कोटे छे।

i. e. uncle has gone to Ajamere (and) aunt is at Kotah.

ఈకథనుబట్టి చూడ శాసనశోధనమున నొక్కొక్కయక్షరమును జదువునెడ నెంతజాగరూకతతో నుండవలెనో చూడుఁడు. శాసనములకృషివిషయమున రెండుగొప్పపత్రికలు ప్రచురింపఁబడుచున్నవి. అందొకటి "Indian Autiquary" అను మాసపత్రిక. ఇందనేకశాసనములు ప్రచురింపఁబడినవి. ఇంకను బ్రచురింపఁబడుచునేయున్నవి. ఇది బొంబాయిపట్టణమున వెలువడుచున్నది. దీని కనుబంధముగ రెండవ దగు "Epigrahıca India" అను త్రైమాసికపత్రిక మనయిండియాగవర్నమెంటువారిచేఁ బ్రచురింపఁబడుచున్నది. శాసనములవిషయమున నీరెండుపత్రికలును జాల ముఖ్యము లయినవి. వీని యందు గొప్పగొప్ప పండితులయొక్కయు, పరిశోధకులయొక్కయు, విమర్శలు ప్రచురింపఁబడును. చరిత్రకారుల కివి చాలసహాకారములు. మనగవర్నమెంటువారుకూడ వారి రాజ్యతంత్రమున శాసనశోధనముకూడ నొకయంగముగ నేర్పఱచి యిందుకై కొంతమంది యధికారుల నియమించియున్నారు. ఈశాఖవారు, గవర్నమెంటువారికిఁ బంపుసాంవత్సరికనివేదికలుకూడ చరిత్రకారుల కత్యంతోపయోగులే.

శాసనములందలివిషయము లెంతముఖ్యములో శాసనముయొక్కలిపికూడ నంతముఖ్యమయినది. ఈశాసనలిపులంగూర్చి చర్చించుశాస్త్రమునకు "పేలియోగ్రాఫీ" (Paleaography) అని నామము. మనదక్షిణాపథములోని శాసనలిపులఁగూర్చి బర్నెల్ (Burnell) మహాశయుఁడు "Paleaography of Southern India" అను గ్రంథమును రచించియున్నాఁడు. ఇది చాల నుపయోగకరమగు గ్రంథము.

ప్రాచీనవస్తుశోధకులుకూడ చాలచరిత్రవిషయములం గనిపెట్టుచున్నారు. వీరు పాడుపడినప్రదేశములం జాలవ్యయప్రయాసములతోఁ ద్రవ్వించి, యచ్చట ప్రాచీనములగుకట్టడములను, నగరస్థానములను, బౌద్ధజైనస్థూపములను బయలుపెట్టుచున్నారు. ప్రాచీనశిల్పవిద్యల పరిస్థితుల రీతులనుగూడఁ గనిపెట్టుచున్నారు వీరి సాంవత్సరికనివేదికలుకూడ చరిత్రకారులకు చాల నుపయోగములు.

పూర్వదశాచరిత్రము వ్రాయుటకు నివియే ముఖ్యసాధనములు. ఇవి గాక బౌద్ధజైనగ్రంథములుకూడ నున్నవి. ఇవి పాళీభాషలో నున్నవి. ఆభాషాభ్యాసంగము జేసినవారికిఁ గాని వానిపరిశీలన శక్యము కాదు. ఇందు కొన్ని ముద్రితములు. కొన్ని యింకను నముద్రితములే. వీనిసంపాదనముగూడ బహుధనసాధ్యము.

## V. ఉపసంహారము.

మన మీవ్యాసమునఁ జర్చింపఁదలఁచిన విషయములంగూర్చి యింతవఱకు విమర్శించితిమి. దీనిప్రయోజనము మనదేశచరిత్రమును యథాభూతముగ నిర్మించుటయే. కాని దేశచరిత్రయొక్కయావశ్యకతను మనము తెలిసికొనినఁగాని యిప్పుడు మనము చేసిన

దంతయు వృథాకాలక్షేపముగఁ బరిణమించును. బుద్ధిమంతుల కిది తగదుగదా? కాన చరిత్రావశ్యకతనుగూర్చి కొంచెము పరిశీలించి యంతటితో నీవ్యాసమును బరిసమాప్తి చేయుదము. బుద్ధిమంతులు దేశచరిత్రమును జారిత్రాదర్శముగఁ జెప్పుదురు. మానవునకుఁ జారిత్రముగదా జన్మసాఫల్యము నిచ్చునది! లేనిచోఁ దిర్యగ్జంతుకోటియందత్సముఁడుగ మానవుఁడుకూడ పరిగణింపఁబడవలసియే యుండునుగదా? బుద్ధియుఁ, దత్ప్రవర్తకంబు లగుననుభవవిమర్శనవివేకంబులును (Experience, power of comparision, and judgement) కలిగి మానవుఁడు దాని నుపయోగింపనిచో నద్వితీయ మగు నీగుణసంపదను గలిగియుండునంతయదృష్టమును బొందని తిర్యక్కులకంటె నీచుఁడగుటకు సందియ మే మున్నది? కాఁబట్టి సర్వవిధములను, సర్వప్రయత్నములను స్వచారిత్రరక్షణమే సర్వజనులకును బ్రథమకృత్యము. ఇందులకు దేశచరిత్రమే నావకుం జుక్కానుహోతె ముఖ్యమార్గదర్శి చరిత్రముల ననే పురాతనపురుషుంజీవితంబులును, వారి ప్రవర్తనంబులును, సత్ప్రవర్తనాసిరోధంబులును, దుష్ప్రవర్తనాదుష్ఫలంబులును మనకుం దెలియ నగును. వేలకొలఁది సంవత్సరములక్రింద నేది యెట్లు జరిగెనో చూచుటకుఁ జరిత్రమే జ్ఞాననేత్రము ఈనేత్ర ముండినచో మనము చారిత్రాంధులము కానేరము. సంఘవిద్యాహాకకీర్తిని బొంద సమర్థులమగుదుము అశాశ్వత మగునీభౌతికశరీరము త్యజించినను శాశ్వత మగుయశఃకాయముతో మానవకోటి యున్నంతకాలము జీవించియుందుము. ఇంతకన్న మన మీజన్మఫలితముగ నపేక్షింపవలసిన దే మున్నది? కాఁబట్టి మన మందఱము మనదేశచరిత్రమును యథాభూతముగ నిర్మించి, తత్సహాయమున స్వసచ్చారిత్రసంపాదనమును నిర్వహించి, శాశ్వతయశమును బొందుటయందుఁ దదేకకృషి చేయుటయే ప్రథమధర్మముగా నాచరింతముగాక!

---

# ప్రణయధర్మము.

[అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి ఏ, బి. ఎల్.]

వేడుకల కైన నను విడనాడ లేవు;
ఇతరదేశాలకడఁ కేఁగితోయి?
పరనివాసము తోఁచదే భారమంచు?
భారమని తోఁచియును బాయువారె? నాథ!
చిన్నినీమది శోకంబు గన్న వేళ
సరసఁ గూర్చుండి తాపోపశాంతి గాఁగ
చిత్తరంజన పూలీల సేవ చేయు
భాగ్యవిభవము లేనాఁడొ ప్రాణనాథ!
ఉఁడి ఉడిగియు నిముసంబు లొక్కటొకటె
పెండ్లినడకలు పచరించి వెడలుఁగాని
కలసి మన మిర్వురము మున్ను గాంచినట్టి
రభస మించు కేనియుఁ గాన రాదు నాథ!
ఒండొరుల మన మెడఁబాయకుండు వేళ
ఘూర్ణుచుండఁగ చంద్రుండు సూర్యుఁడాయె;

నేఁడు వారలవెల్గువెన్నెలలులేని
అంధకారమె నాయాత్మ నావరించె.
ఒంటరిగ నాథ! యేరీతి నుంటివోయి
మది తెలియువారు లేనియామండలమున?
కాల మేలీల ప్రాణేశ! గడపుదోయి
కావలయువారు లేనియాగహనసీమ?
పెదవులకు నీముద్దులు వెత్తి యాయె;
ఒడలు నీప్రేమకౌఁగిళ్ళ లోఁద దాయె;
లోచనములకు నీమూర్తి లోప మాయె;
ప్రాణసతిఁ జేర రావోయి ప్రాణనాథ!
కదలిఁ జంద్రుఁడు సుద్దాడు టుడుగ లేదు,
పిట్టలొండొంటి నెడఁబాయువిధమె లేదు,
మహియు నింగియు కౌఁగిలి మాన లేదు,
జానకిని బాయు నీ కేల ప్రాణనాథ?

---

# వసంతము.

[అప్పిళ్ళ చక్రవర్తి వేంకటరంగనాథస్వామిగారు.]

తియ్యమామిడిగున్నతియ్యనిచిగురాకు గొనసుచు మెక్కదే కోకిలంబు?
జుమ్ముజుమ్మని రేఁగి కమ్మనిమకరంద మానవే భృంగంబు లాసతోడ?
సలిలచందనగంధమిళితపుష్పపరాగధన్యత గోరరే దంపతులును?
ఇంపుగాఁ జేయరే సంపంగిపూలతో మన్మథపూజల మగువగములు?
సకలసుఖదాయకసుమకిసలయజనన, సమయసౌభాగ్యగరిమచే శ్లాఘ్య మగుచు
సంతతానందసౌభాగ్యసౌఖ్య మిచ్చు, నెంతయో యింపుగా నీవసంత వేళ.

# ప్రబంధపరమేశ్వరుఁడు.

[కావ్యస్మృతితీర్థ- జనమంచి శేషాద్రిశర్మగారు.]

కం. వినఁ దగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగ పడక వివరింపఁ దగున్
కని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ.

రసికశిఖామణుల యంగీకారమును బడయని ప్రబంధము వాసి కెక్కఁజాలదు. ఎన్ని గుణము లున్నను ఫలింపవు. అట్టి గుణయుక్తమగు ప్రబంధమును రసికు లేల యౌఁదలఁ దాల్పరని యడుగవచ్చును.

శ్లో॥ ఉర్వ్యాం కోఽపి మహాధరో లఘుతరో దోర్భ్యాం ధృ
తో లీలయా। తేనత్వం దివి భూతలే చ సతతం గోవర్ధ
నో గీయసే। త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో
రగ్రే నతద్గణ్యతే। కింవా కేశవ భాషణేన బహునా
పుణ్యైర్యశో లభ్యతే॥

అని శ్రీకృష్ణకర్ణామృతమునఁ జెప్పఁబడినట్లు పూర్వపుణ్యము తోడ్పడినఁగాని యశస్సు రాదనుట నిక్కము. ఆయశస్సు మిత్రుల తోడ్పాటున నొకప్పు డెట్టికావ్యకర్తకైనఁ గలిగిన నది శాశ్వతము గాదు. క్షణభంగుర మనఁ దగును. అట్టియశస్సును గవి కోరరాదు కావునఁ బూర్వపుణ్యము తోడ్పడఁగా సత్కావ్యరచనముం బూని యది నెఱవేర్చిన దాన వచ్చుయశస్సు చాల కాలము నిలుచును. అట్టికీర్తిని గొందఱు మార్పఁ జూతురు. కాని యది మార్పు నొందదు సహజశోభ యెన్నఁటికిఁ దఱుఁగదు గదా. పుట్టువునఁ దొడరనిశోభ యెన్ని భంగుల నుద్దీపింపఁజేసినను నిలువక చంచలఁ బోలి క్షణభంగురత్వము నొందును.

నియమబద్ధముగాని దేదియు సజ్జనాదృతిం గాంచదు కుజనాదృతిం గాంచును గాని యది యశాశ్వత మగుట నట్టిదానిని గవి కోరఁడు. నియమబద్ధము గాని కావ్యముం బోలి యొక్క కుటుంబవ్యవహారముగూడ సాగక కుంటుపడును. కావునఁ గొన్ని నియమము లుండవలయును. నియమబద్ధము గావుననే ప్రభుత్వము మార్పు నొందకుండును. నియమబద్ధము కావుననే యుద్ధము క్రమముగా సాగును. నియమబద్ధులు గావుననే భటులు వనుసఁ దప్పక యుద్ధము చేయుదురు. నియమబద్ధురాలు కానికాంత విఖ్యాతి నొందఁజాలదు ఎన్ని విధముల యోజించినను నియమబద్ధమగు కార్యమే విజయము గాంచును.

"నిరంకుశాః కవయః"—అను సూక్తి కలదు. కాని యు దేవిషయమునందు? అన్న ప్రశ్నము రాక మానదు. ప్రతివిషయమునను నిరంకుశుఁ డగుకవి యున్మత్తుఁ డనఁ బరఁగును. వానిపేరు సైకతశాసనమువంటి దగును. జలలిపి యన్న నంగీకరింపఁ దగినదే. లోకజ్ఞానము గలకవి తన తెలివిని సహస్రధా వెలయించి సహృదయహృదయాహ్లాదకరముగా గ్రంథమును రచించి శాశ్వతయశఃకాయమును గాంచవలయును. అట్టివారిగ్రంథములు లోకమునకు మహోపకృతిం గావించును. ప్రబంధమునకుఁ గావ్యమునకు భేదము గానరాదు. కొందఱు ప్రబంధ మనఁ గూడ దందురు. కాని నియమములఁ బట్టి యాలోచించినఁ గావ్య మన్నను ప్రబంధ మన్నను ఒకటియే యని యందఱు అంగీకరింపక తప్పదు. ఈవిషయమున భేదభావము లుండిన నుండవచ్చును. ఆచర్చ ప్రకృతకార్యమున కుపకరించునది కాదు. రసాత్మకము కావ్య మనుట సర్వజనసమ్మతసిద్ధాంతము. రస మెదవు లెట్లను ప్రశ్నమునఁ బెక్కుభేదము లున్నవి కాని రసము లేనికావ్యము కావ్యము కాదనుటలో భేదాభిప్రాయములు లేవు. కాఁబట్టి కావ్యస్వరూప మెట్టిది? అను నీమొదలగువిషయములను గూర్చి వ్రాయను.

మనుజులబుద్ధు లేకరీతిగా నుండ వనుట సర్వసమ్మత మని నాభావము. నాలుగుగ్రంథములఁ గాంచినపు డొక్కొక్కరి కొక్కొక్కగ్రంథముపై నభిమానమును వేఱొకగ్రంథముపై నించుక యసూయయుఁ గలుగుట సహజము. కాళిదాసమహాకవి "భిన్నరుచిర్హి లోకః" అని యనువదించెను. ఇది పై నాభావమును దృఢపఱచుచున్నది. కాలము మాఱినకొలఁదిని జరిత్రవిషయములు మాఱుచుండును. ఏలయన: వాని కొకమా

ర్గము లేదు. ఏది యిష్టమున్న దాని కొకమార్గము నెట్లో కల్పింపవచ్చును. ఆకల్పనలు కొందఱ కంగీకారములు కావచ్చును. ఊహా, లాకాశరామన్న పంచాంగములు కదా. కొలఁదిదినముల కాయూహాలు దురూహ లని కొందఱు సాధింపవచ్చును. ఇట్లు డోలికాగమనాగమనములవలె నూహాలు మాఱుచుండుట నే సిద్ధాంతముచేయును సాధ్యపడదు. కావున నెవరి కేగ్రంథము బాగుండు నని తోఁచునో వారు దానిం బొగడుచుందురు. ఇంతకంటె సత్కృష్టగ్రంథరత్నము లే దని కొందఱును, లేదు- కలుగఁబో దని కొందఱును జెప్పుదురు. ఈరెండుభాగముల కొక్కబహుమానమే కాని తారతమ్య మం దుండఁ బనిలేదు.

సభాముఖమున నొకగ్రంథము చదువఁబడఁగా నందున్న సుహృదయుల కెల్ల నాకస్మికముగా నొక్క మాఱు ప్రమోద మేది యీయఁజాలునో యది రసవంతముగా నుండునన్న నౌ ననవచ్చును. సుహృదయులకుఁ బక్షపాతము గలుగరాదు. రస మనఁగా మనస్సున వచింపశక్యము గానియానంద ముదయింపఁజేయుటయే కదా. ఆయానందము తెచ్చిపెట్టుకొనునది కాక తనంతన యుదయించునది. కాన నందుఁ బక్షపాతమునకుఁ జోటు లేదు. అట్టిరసమును వర్షించుగ్రంథ ముత్తమోత్తమ మని సుహృదయులు వచింపక నిలువఁజాలరు. ఆగ్రంథకర్త ప్రశంసార్హుఁడు, పుణ్యైకచతురుఁడు, సత్కృతి- అని పలుకవచ్చును. గ్రంథపఠనమునకు ముందే నాగ్రంథమును మెచ్చుకొని యాతాంబూలము నాకిప్పింపుఁ డని యొప్పందమువలె నొకకట్టుపాటు చేసికొని సమయమున నౌను, సెబాసు, బాగున్నది- అనుమెప్పులకుఁ బాత్ర మగునది రసికజనసమాదృతిఁ గాంచనేలేదు. ఆతాంబూలగౌరవము చాలగడియలు నిలువదు.

అనఁగా రసికశిఖామణులయంగీకారమును బడసిన గ్రంథమే సద్గ్రంథ మగు ననియుఁ దత్కర్తయే సత్కవి యనియుఁ బ్రపంచమున విఖ్యాతిఁ గాంచు నని దీని సారము. భారతకవులు మువ్వురు నిట్టిగౌరవమును జిరకాలముగఁ గాంచుచుండిరి. వారి గౌరవతాంబూలము నీవలకు నిటు నటు కదలింపఁజాలువారు లేకుండి రని నా జ్ఞానము. ఉండినను వారిసంఖ్య యత్యల్పము. ఆమువ్వురకుఁ గవిత్రయ మని పేరు. వారికి మర్యాద చేయుపట్టుల నగ్రస్థాన మీయఁబడినది. ఆస్థానమును దొలఁగించి వారిచోటున నెవ్వరిని గూరుచుండఁబెట్టవలయునన్న నిర్ణయించుట కష్టము. త్రిమూర్తులభంగి వారి కేకాసన మిప్పించుట రసికులకు మర్యాద యని నే నెంతును. వారి యపూర్వపూర్వజన్మసుకృతపరిణామమే తత్కవిత్వ మనక తప్పదు. ఇప్పటికిని వారిమర్యాదకు నగ్రతాంబూలమునకు క్షతి రాదు. రాఁ గూడదు రాఁ బోదు. అనియే నా పంచభూతసాక్షిక మగువిశ్వాసము. వారికిం బ్రమాదములు గలుగవా యనునది యొక గొప్పప్రశ్నము గాదు.

ఆమువ్వురిలో మూఁడవవాఁడుగ లెక్కింపఁబడుచున్న ప్రబంధపరమేశ్వరునికవిత్వమునుగూర్చి నాలుగు మాటలు వ్రాసెదను. ఈవ్రాఁత వారియందు నాకుఁ గల భక్తిని దేటపఱచునేగాని నాయోగ్యతను దెల్పఁజాలదు. వారిగ్రంథముల నిట్టిగుణవిశేషములు గల వని చెప్పఁజాలినంతయోగ్యత నాకు లే దనుట సర్వజనాంగీకృతిం బడయం దగువిషయము. భారతశేషమును రచించినతరువాత నెఱ్ఱప్రగ్గడ యనుపేరు గలశంభుదాసునకుఁ బ్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదము వచ్చిన దని నానుడి కలదు. ఏసంవత్సరమున నేనెలలో నేపక్షమున నేశుభదినమున నేశుభవారమున నేసుముహూర్తమున నేసభలో నెవ రిది యీఁదగు నని యుపపాదించిరో మ ఱెవ్వరు బలపఱచిరో ఎవ్వ రామోదించిరో యెందఱు కరతాళధ్వనుల దిక్కులఁ బిక్కటిల్లఁ జేసిరో నిర్ణయింప వీలుపడదు. ఈవిషయమును దెలుపుశాసన మెందున్నదో వెదకుట, ఉండక తప్ప దని నిర్ణయించుట, ఇం దుండవచ్చు నని యూహించుట, దానిని వార్తాపత్రికలకు వ్రాయుట యనునీమహాకార్యములు నాకు సాధ్యములు గావు. ప్రబంధపరమేశ్వరబిరుదము వారియనంతరమో వారిశక్తి తెలిసినతర్వాతనో యేనిర్మలాత్ములో యిచ్చియుందు రని నే నూహించువాఁడను. ఎప్పు డెట్లు వచ్చినను ఆబిరుద మాసత్కవిశేఖరునకుఁ దగిన దని భగవన్నామమువలె దానిని స్మరించుటకన్న నే నేమియు నెఱుఁగను.

భారతకవులుమువ్వురును గథాసందర్భము ననుసరించి పర్వాంశముల నెక్కువగా ననఁగా మూలము నతి

క్రమించి చెప్పవాడుక గలవారే. కాని యవి వారికిం గలయత్యద్భుతలోకానుభవమును దేటపఱచును. అం దతిశయోక్తులుగాని యస్వభావవిషయములుగాని యుండవు. కవిసమయము లని కొన్ని గలవు. పంకజాక్షి యను పదియుఁ గవిసమయసిద్ధమే. కమలములతోఁ గన్నులు పోల్చుటకవిసమయము. ఆకవిసమయ మేమి సామాన్యమా? విపులతమలోకజ్ఞానపరిణామమే. దానిని మార్చి యింకొక్కవస్తువుతోఁ గనులను బోల్ప వీలులేదు. కవిసమయము లన్నియు నిట్టివే యించుకయుఁ గదల్ప సాధ్యములు కావు మనము మార్చివేయుద మనిప్రతిజ్ఞలు చేయవచ్చును. హరిణాక్షి యనపదమును మార్చి బిడాలాక్షి యనుటగూడదా యనుకొందము. కొందఱకు బిడాలేక్షణము లుండుటయు సహజమే. కాని యామాట సర్వజనాంగీకారమునకుఁ బాత్రము మాత్రము కాదు. బిడాలేక్షణము లందఱికన్నులకు మెప్పుపుట్టింపవు ఇట్టి వన్నియు నాలోచించియే పండితాఖండలులు సర్వజనాంగీకృతగ్రాహ్యములుగా సమయముల నేర్పఱచిరి. వాని మీఱినఁ బాపమని చెప్ప సాహసింపఁజాలను గాని స్వభావవిరుద్ధముగాఁ జెప్పనెంచిన ట్లగు నేమో యని భయంపడుచున్నాఁడను. అట్టిప్రాజ్ఞసమయముల మీఱక మహాత్ముఁడు శంభుదాసుఁడు కవితాకన్యకను భూషించెను.

ఎఱ్ఱాప్రగడ హరివంశమును యథామూలముగాఁ గాక భారతపద్ధతి నవలంబించియే తెనిఁగించెను. నాచన సోమనాథకవి యుత్తరహరివంశమును వ్రాసెను. సోమనాథుఁ డేమి సామాన్యుఁడా? కాఁడు. ఈకవిపాత్రము సమగ్రముగా దొరకకపోవుటంబట్టి యతనినియమము లిట్టివని యెఱుంగ సాధ్యము కాదని కొందఱనుచున్నారు. ఉత్తరహరివంశమును జదివినవారిలోఁ గొందఱుమహానుభావులు కవిత్రయమున కొసంగినతాంబూలమును సోమనాథునిపజ్జకుఁ ద్రోయఁబూనిరి. మఱికొందఱు వలదు వలదు. అది మహాసాహసకార్య మని ప్రార్థించుచున్నారు. వీరిప్రార్థనలఁ జెడచెవిం బెట్టి తమపట్టుదలను సాగింపఁ గొందఱు హస్తములకుఁ గంకణములఁ గట్టుకొని నిలువఁబడిరి. ఈమహాహవ మెట్లు లగునో తుదకుఁ జేతులు చేతులు కలుపఁ దగినంతస్థితికి వచ్చునో యెఱుఁగఁ జాలకున్నాఁడను. మాటలపోటులాటతో నీపని చక్కఁబడినచోఁ బుణ్యమే యని భగవంతుఁ బ్రార్థించుచున్నాఁడను. భగవంతుఁడు నామొఱ్ఱ యాలించును గాక.

తొలుదొలుత శ్రీపరవస్తు చిన్నయసూరిగారి వాదమహామునకు స్వస్తివాచనకర్మము నడపిరి. మూఁడవ కన్ను దాఁచిన యీశ్వరుఁడే యనిరి. సోమనాథశబ్దమును శ్లేషించి మూఁడవకన్నొక్కటి తక్కువగాని శంకరుఁడే యని వారి భావమై యుండనోపు. వారివెనుకఁ జెక్కుమంది యనఁజాలను గాని కొందఱు కవిత్రయ మీ సోమనాథకవిముందు నిలువఁజాల రనిరి అనఁగా భారతకవుల మించినకవి స్వయము చెప్పుమహాత్ముఁ డని ప్రకటింప సాహసించిరి మఱికొందఱంతతో నిలువక యీమహానుభావుఁడే కవిగాని తక్కినవా రేటికవు లనుచున్నారు శంభుదాసుకవిత్వ మీతనిముందఱ నిలువఁగలదా యని యింకను గొంద ఱధిక్షేపించుచున్నారు. హరివంశము ఉత్తరహరివంశముముందు నునుపఁదగిన గ్రంథమా యని కొందఱు యజ్ఞోపవీతముల మెడకుఁజుట్టుచు వాదించుచున్నారు. సోమనాథునితర్వాత శంభుదాసునకుఁ బ్రబంధపరమేశ్వరబిరుద మూడిపోయిన దనుచున్నారు. ఇన్ని స్తుతులకుం గారణ మాయుత్తరహరివంశము నలుగుకొనుటకే యని యొక్కకొందఱు పలుకుచున్నారు. ఈవాదములలో నేపక్షమునఁ జేరినను జీవాట్లు తప్పవు కావున నావంటి యసమర్థుఁ డూరకుండుట మంచిది. అయినను హరివంశమును జదివి యుత్తరహరివంశమును జదివి యీరెండింటికిఁ దారతమ్యము గలదా యని యాలోచించిన నావంటిమందమతికిఁ బైవాదము నిరర్థక మని తోఁచినది. హరివంశమునెదుట నుత్తర హరివంశము నిలువఁ గలదా యన్నంత యుత్సాహము గలిగినది. కాని యామాట సాహస మూనివచింపఁదగినదే. "శంకరశ్శంకరస్సాక్షా ద్వ్యాసో నారాయణో హరిః। తయో ర్వివాదే సంప్రాప్తే కింకరః కింకరిష్యతి" అన్నట్లు వీ రిరువురు సమాను లగుదు రనవచ్చును. కాని శంభుదాసునకిడిన తాంబూలమును జరుపుటమాత్రము పాడి గాదు. శంభుదాసుని లోకజ్ఞానమనుపమానము. సోమనాథుని లోకజ్ఞానము దానిముందు ఖద్యోతమండలముముందు ఖద్యోతమువంటి దని కొంద ఱనఁగా విన్నవాఁడను. నే నామాట పలుకఁజాలను గాని స్వభావోక్తులు పల్కుటలో శంభుదాసున కున్నంత

చమత్కృతి సోమనాథునకు లే దన నంకించి జంకుచు న్నాఁడను. వీరితారతమ్యచర్చ నాపని కాదు. ఇంచుక యిద్దఱిపద్యములు వ్రాసి యేది బాగున్న దని ప్రశ్నించి విడలెదను. అటులైనఁ గొన్ని చీవాట్లు తప్పును.

శంభుదాసునకుఁ గవిత్వశక్తి యుగ్గుతోఁ బెట్టి నట్టిది. కావునఁ బదములు తమంతన దొరలుచుండును. భావము మందాకినీసముత్తుంగరంగత్తరంగపంక్తిశీకర సమ్మిళితమందమారుతమువలె సహృదయహృదయానంద ప్రదమైనది. స్వభావోక్తి యీతనికి భగవదనుగ్రహమున లభించిన దని నే నమ్ముచున్నాఁడను ఆభావము తేటపడఁ గొన్ని పద్యముల నుదహరింతును.

కంసుఁడు కూఁతుం జంప రాఁగా దేవకీదేవి యార్తయై యిట్లు వేఁడుచున్నది.

కం. అన్నా యలుగకుమీ నా
కన్నది యిదె యాఁడుబిడ్డ ! గావుము నీనిన్
నిన్నొకటి చేయఁ గలదే
కన్నియ యతిలోకపురుషకారసమగ్రున్.

౧౦-ఆ ౧౨౧౦-ప.

అతిలోకపురుషకారసమగ్రున్, కన్నియ- అను నీరెండుపదములఁ గలయర్థచమత్కృతిఁ జూడుఁడు దీర్ఘసమాసములు లేవే యని తత్తఱపడకుఁడు.

ఈఘట్టముననే మహాకవి పోతన్నగారు

ఉ. అన్న శమింపు మన్న తగ ! దల్లుఁడుగాఁ డిది మేనకోడ లా, మన్నన సేయు మన్న విను ! మానిని జంపుట రాచపాడి గా, దన్న సుకీర్తివై మనఁగ ! దన్న మహాత్ములు పోవుత్రోవఁ బో, వన్న భవత్సహోదరిఁ గ ! దన్న నినున్ శరణంబు వేఁడెదన్.

పైదానికన్న నిది నీరస మని చెప్పనెంచను. సుకుమారముగ రెండుపదములతో నెంతయర్థమును శంభుదాసుఁడు కందపద్యమున నిమిడించెనో యారయుఁడీ యనిమాత్రము విన్నవించెదను. ఇం కొక్కయుదాహరణము.

తే. పురిటిపాఁపనిఁ దొట్టిలోఁ ! బొందుగాఁగఁ
బెట్టి పాడించుకొన్ని తాను ! బ్రియసతియును
మేటిగుజ్జులఁ గట్టిన ! పాటబండి
యెక్కి శిఖమ్రింబ మందకు ! నేగె నెలమి.

౧౦-ఆ. ౧౪౨౧-ప.

ఇది శ్రమపడి చెప్పిన కవిత్వమా? సహజముగా వెలువడినదియా? ఇం దేపదమునైనఁ దీయ వీ లున్నదియా? పరికింపుఁడు. స్వభావోక్తికి నుదాహరణముగా నొకవచనమునఁ గొలఁదిపంక్తులు వ్రాసెదను. పైపద్యము తర్వాత దీవచనము.

వ. "ఇట్లు చని పుష్పితఫలితానేకతరుమండమండితం బగు కాళిందీతటంబున నలుదెసలం బొడవుగా నమర్చిన 'బలితంపుగుబ్బలిపెలుంగులం గరంబు జకనంబులై యొప్పునెడ దొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేఁకువం బోఁకుమేసి వచ్చి రోమంథనవచనంబుల' విహితకేయులై సుఖియించు కదుపులలోనఁ 'బేరుపేరం బిలువం బాచత్తిల్లుచు నల్లసిత్రహుంకారంబు లగువదనంబులతో నున్ముఖలగుతల్లులకు నభిముఖంబులై హస్తప్రతినిరదంబులు పాదలం బొదులనుండి యొడ్లొంత్రి దాఁటుకొని కలయు బాలవత్సంబుల యుత్సవసంచారంబుల వలన' వెదయావుల వెనుకం దగిలి యొండొంట్రిం జేటనీక ఒలియుఱుంకెలం బొదివి కాలు ద్రవ్వి క్రొడాడుచుఁ బొగరు మిగిలి కఱకొమ్మన మెసలుచు వలుదమూఁపురంబులును వెడఁదవీఁపులును దొరంపుగంగడోళ్ళునునై క్రాలుకృపభంబుల దిగ్విహారంబువలనను, 'మొదవుల నొరసురవులుం బెయ్యల రేణంబులుం బాలకుండలమసులుం నందవయొసఁగులకు నెనపడని తోడవులుగాఁ బిదికియు రతార్భ్యం దలుగులుం తలమోలలంజుట్టి యిట్టునట్టునుం గలయంబాఱి క్రేపుల నేర్పఱించువారును."

స్వభావోక్తి యన నిట్టి దని చూపినమహానుభావుఁడు శంభుదాసుఁడు కాక మఱొక్కఁడు గలఁడే యని చెప్పవచ్చును. పదములకూర్పును, అది లోకాచారమును బాటించుచున ట్లుండుటయు నింపుఁ గనఁబడు. అంతయుం దెన్నఁడును గోవ్రజములం జూడకున్నను జూచినట్లే దీనిం జదువ నగును. సంశయము లేదు. ఇట్టి వీమహామహునికవనమున నెన్నియో తావులం గలవు.

పూతనాసంహారఘట్టమునందు

ఉ. ఎత్తిలి కావు కావు రన ! నేడ్చి తదీయపయోధరాగ్రముల్ । కుత్తుకదాఁకఁ బెట్టుకొని ! క్రోలెఁ గ్రమంబునఁ జన్నుఁబాలతోఁ। నెత్తురు మున్నుగాఁగ గణనీయములై చనుసప్తధాతువుల్। పొత్తుగఁ

ప్రాణముల్ చెనఁటి । బొందియు ద్రిక్కఁగ నొక్క-
వ్రేల్మిడిక.

౧౦-ఆ. ౧౨౧-ప.

ఇందు బాలకుఁడు పాలుత్రాగుచున్నప్పటిస్థితి చక్కఁగా వర్ణింపఁబడినది. క్రమవిరుద్ధ మిం దేమేఁ గలదా? ఈపోల్కి భాగవతమున సీసపద్యమునఁ గనఁబడుచున్నది కాని-

"బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి" అనుచో స్వభావవిరుద్ధ మించుక గానంబడియెడిని. రసికుల కది తోఁచువిషయము సులభము గాన వదలితిని.

శ్రీకృష్ణుని బాలక్రీడల వర్ణించు ఘట్టము.

సీ. పాలుపారఁగా బోఁ।గిలి పాన్పు వాల్గుమూ
లలకును వచ్చును । మెల్లఁగి మెలఁగి
ఉలిఁ గపోలంబులు । గిలిగిలింతలు పుచ్చి
నవ్వింపఁ గలకల । నవ్వి నవ్వి
ముద్దులు దొలఁకాడ । మోఁకాలఁ గేలను
దడవుచు నెందును । దారి తారి
నిలుచుండఁ బట్టి యం।గుళు లూఁత చూపఁగాఁ
బ్రీతిఁ దప్పడుగులు । వెట్టి వెట్టి
తే. యన్నఁ గంటిఁ దండ్రిని గంటి । నయ్యఁ గంటి
నిందు రావయ్య విందుల । విందవనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడ।యాడి యాడి
యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశ।వోత్సవముల.

౧౦-ఆ.౧౫౩-ప.

ఈపోలిక భాగవతమునఁ గనుపట్టును గాని మొదటినుండి యున్న చేష్ట లిట్లు వర్ణింపఁబడ లేదు. స్వభావవిరుద్ధ మిం దేమాత్రమైనఁ గలదా? బాలచేష్టల వర్ణించినట్లే శ్రీకృష్ణుని యౌవనారంభము నిట్లు వర్ణించెను.

సీ. నెఱుల నున్ననికప్పు।నుఱఁగలి గొనఁగూడి
పొదలి వెండ్రుకలు కొ।ప్పునకు నెయిద
నూఁగారు మీసలు।తోఁ గాఁతిదళుకొత్తు
మొగము గన్నులఁ గ్రొ।త్త జిగిదలిర్ప
నడుము కటిత్రవ గాఁగ । వెడఁదయై కఱ కెక్కు-
రొమ్మువార వెలసి ప్రే।పురము దనర
మూఁపులు పొడవులై । చాఁచ్రుఁ జక్కఁదనంబు
గలిగి చేదోయి యుగ్గలిక చూప

తే. వెన్ను పఱపయి, కంఠంబు । విప్పుపెరసి
పిఱుఁదు పెడఁగొంది, నడపునొ।ప్పిదము వింత
తెఱఁగు గైకొన గోపాల।దేవమూర్తి
యఖిలశోభాకలాపక।ల్యాణి యయ్యె. ౧౦-ఆ.౧౭౦-ప.

బాల్యయౌవనములను దెలుపువర్ణనములఁ దిలకించితిరి గదా? మచ్చునకు నింతమాత్రము చూపితిని. అన్నియు నిట్టివే యనవచ్చును.

ప్రబంధములలోఁ గవివర్యులు ఋతువర్ణనము చేయక మానరు. ప్రబంధలక్షణములలో నది యొకటి కదా. అందు స్వభావ మేమియుండునో గాని పదముల చమత్కృతి ఋతుస్వాభావికశృంగారమును మించియుండును. శంభుదాసుఁడు వర్షారంభమును, వర్షాత్యయమును వర్ణించినాఁడు. వానిం జిత్తగింపుఁడు. తరువాతివారి వెట్టివో తెలియఁగలవు.

వర్షారంభము.

సీ. శివుదిక్కునందు వేఁ।కువఁ గోల మెఱుఁగులు
మెఱసె నభోవస।మీరణుండు
పుట్టి తీవ్రత సేల । బెట్టుగాఁ జఱచుచు
విసరె బీటెండతో। నెసఁగెఁ నుమ్మ
లిఁగ మిక్కుటము మయ్యె । నెఱనింగిఁ గడుమించె
నిడుదలై తిలకించె । నీరుకాల్వఁ
బడమటి నిరుదెసఁ । బ్రతిసూర్యములు దోఁచె
నంబరంబునఁ జేర్చె । నాఁగదపలు
తే. పిన్నబిడ్డ లెయ్యెడలఁ బిం।పిళ్లు గూసి
రంఘ్రితలములు సిమసిమ । యనియె జనుల
కఖిలతృణలతాతరునిచ।యంబుఁ జీడ
పట్టె నిట్టలంబుగ జడి।పట్టుపొంటె.

ఇం దొక్కటియైన స్వభావమునకు మీఱినవిషయము కలదా? కవి లోకజ్ఞానము కలవాఁడు కావలయును. లేకయున్న నిట్టివిషయములు తోఁచునా? వర్షర్తువర్ణనమునఁ బోతన్నగారు స్వభావమునే తెలిపిరి గాని సామాన్యలోకజ్ఞానము నది సూచించును. శంభుదాసునిలోకజ్ఞాన మసమానము.

వర్షాత్యయము.

సీ. వాఁకలఁబడి నీరు । వలియఁ బాఱఁగ మిట్టి
లొండొండ బలసి తృ।ణోత్కరంబు

తుదలు నిశ్ఛదనంబు। తోఁ దలసూపంగఁ
దీఁగ లొయ్యన కొంకు। జేతి కొనలు
మొగ మెత్త మెత్తన। యిగురాకు దోఁపంగఁ
దరువులు తనుగాడ్పు। కపనరుచులు
గాంచి సహ్రిణించి। క్రిమ్మఱఁ గొమ్మలు
గదలించి నర్తన। క్రియ మొనర్ప
తే. నెలవు తేర్పడి క్రిమ్మరు। నెరవు లెఱిఁగి
మృగకులంబులు భ్రమవాసి। మెలఁగఁజొరఁగ
నాటవికకోటి తమజాడ। లరసి తిరుగ
నడవు లొప్పారెఁ జండవ। ర్షాత్యయమున.

ఇందు పై రెండుతావుల గుఱుతు లుంచితిని. అవి ప్రాచీనపాఠములు కావు. ఈవర్ణనము మఱెవ్వ నిట్లు గానఁబడదు. ఇదొక్కటియే శంభుదాసుని యపూర్వలోకతత్త్వజ్ఞతను వేనోళ్లఁ గొనియాడుచున్నది.

రుక్మిణీకళ్యాణఘట్టము.

సీ. సౌకుమార్యమునకు। సౌకుమార్యస్ఫూర్తి
గలిగించు నవయువ। కల్పనంబు
సౌందర్యమునకును। సౌందర్యసంపద
యొదవించు లావణ్య। సోగరుచియు
సౌభాగ్యమునకును। సౌభాగ్యవిభవంబు
గావించు సరసరే। ఖాక్రమంబు
సౌశీల్యమునకును। సౌశీల్యకలనంబు
నందించు నాభిజా। త్యస్థితియును
తే. దనకు నైజంబులుగ నొప్పు। ధన్యజన్య
రుక్మిణీదేవి యానంద। రుచిరమూర్తిఁ
బాణిపంకజగ్రహణక। ల్యాణలీలఁ
బ్రీతి గడలొత్తుచుండఁ బ। రిగ్రహించె.

అనన్వయాలంకారమువోలె నీపద్యమున కీపద్యమే సాటి.

శంకరుసలిలవిహారము.

సీ. తలమీఁది యేటిక్రొ। త్తరఁగలతో మించు
తరఁగలు పొరిఁ బొరిఁ। దార్కొనంగ
సడలిన నిడుసికెం। జడలును ముదిరిపం
డినచాఁచుఁదీఁగలఁ। బెనఁగొనంగ
నెలచందురుని క్రొత్త। మెఱుఁగులు నంచ సొ
క్కులయచ్చ తెలుపులఁ। గలయఁబడఁగ
నతిక్రొన్నలుపుఁగం। పకునల్లఁగలువప్పు
వ్వుల నిండుజిగియును। జెలిమిచేయ
తే. నంగముల భూతిపోలుపుగ। నంబమూర్తి
మిసిమి దెలు పెక్కి మొగిచిన। మీఁదికంటి
యొప్పు పద్మరేణువు లంటు। నొప్పు మిగిలె
నభవుఁడు గంగసలిలవి। హారలీల.

ఉత్తరభాగము. ౭-ఆ ౮౨.

భవానీశంకరుల జలవిహార మెంతముద్దుగ వర్ణింపఁబడినదో పరికింపుఁడు. దీనిం బోలినయుత్తరహరివంశములోని పద్యమును జూడుఁడు.

సీ. సుడిగొన్న చిగురాకు। జొంపంబు గంపొందు
తలమీఁదిమల్లికా। దామ మడఁచి
నిడుదతామరతూఁడు। నెట్టెంబు చుట్టునెఁ
బటికంపుఁగడియంపు। భాగ మడిమి
తోన యాక్రేవఁ జెఁ। గావ తేఁకు వాత్రించి
మెడనక్కఁ గస్తూరి। మేడి చిపూసి
పాయగొమ్ముల నల్లఁ। బట్టు దగిల్చి య
క్కొనయాకుపై వెండి। క్రొర పెట్టి
తే. ధవళకేతకి ధూళిగా। త్రమునఁ జెరిఁగి
మోకమామిడి కొకకాంత। మొగ్గ నిలిచి
యొడలిలోఁ జక్క సగము సా। కొసఁగు మనుడు
నద్రికన్యక తల వాంచె। హరుఁడు నవ్వె.

౫-ఆ.౧౯౬-ప.

ఈరెంటికి తారతమ్యము జూపఁ బూనను. ఇందేపద్యమున నెక్కుడుచమత్కారము కలదో రసికులు నిర్ణయించుకొందురుగాక! నాచనసోమనాథుఁడు కవిత్రయమునకన్న మిన్న యన్నప్రాఁబలుకు సత్యేతరమో యసత్యేతరమో మది నెఱిఁగినఁ జాలును. మొదటి పద్యమందున్న స్వభావవర్ణనము రెండవదానియందుఁ గొంతయని నేననుచున్నవాఁడ.

ఈక్రిందిపద్యములఁ గాంచినఁ దారతమ్యము తేటగఁ గన్పట్టెడిని.

సీ. కలలోన నొండొరుఁ। గలసిన యుప్పటి
యానందపూర్ణ ధ। న్యత్వములును
తెలిసి యొండొరులపైఁ। బ్రేముడి పెరసిన
సంతాపబహుళద। శాంతరములు

నెమ్మి నొండొరులకు నచ్చెలికతమున
నబ్బిన యసమభాగ్యాతిశయముఁ
గ్రియల నొండొరులకుఁ గీలొన్న యొదవిన
తావకోచితకళావ్యాప్తివిధముఁ
తే. జెన్నుమిగుల నొండొరులకుఁ జెప్పుకొనుచు
నద్భుతంబులు భయములు నాదరములు
గౌతుకంబులుఁ బోరఁ బోరఁ గాఁగఁ బ్రియుఁడుఁ
బ్రియయుఁ గ్రోలిరి నూతనప్రేమరసము.

హరివంశము. ఉత్తరభాగము ౭ ఆ. ౨౮ ప.

ఇఁక నాచన సోమనాథుని పద్యము బరికింపుఁడు.

సీ. తెమలించి పొర లొత్తఁ దివియలే కటు మున్న
కదిసిన కెమ్మోవిఁ గమిచి కమిచి
వెడవెడ సోఁకి పై నదరలే కటు మున్న
యలవడ్డ కౌఁగిట నదిమి యదిమి
వలువెడలింపఁ జేవాటులే కటు మున్న
పైకొన్న జఘనంబుఁ బ్రాఁకి ప్రాఁకి
తమకించి కొసరుపంతంబులే కటు మున్న
కదిపిన చిత్తంబుఁ గరఁచి కరఁచి
తే. తుది మొదలికంటెఁ దుదికంటె మొదలు చాలఁ
జవులగను శైవతులకుఁ జనవు లిచ్చి
పూవిలుతుచేత జంత్రింపుబొమ్మఁ జేసె
మానినీతిలకంబుఁ గుమారవరుఁడు.

౫-ఆ ౨౧౨-ప.

ఈ రెండు పద్యరత్నములఁ బరికింపుఁడు. రెండును స్వభావవిరుద్ధములు కావు. కాని రెండవది శ్రుతికటువుగఁ గన్పడును. మొదటిది శ్రుతిహితముగఁ గన్పడును. ఈ నాచనసోమనాథుని పద్యరత్నమును గాంచియే కాఁబోలు, ఆంధ్రకవితాపితామహుఁడు దీనికి మెఱుఁగు పెట్టినట్లు "సహసానఖంపచ స్తనదత్తపరిరంభము" అని వర్ణించెను. ఇట్లు వర్ణించుట గొప్ప కాదు కాని శంభుదాసునివలె సరసపదములఁ గూర్చి భావామృతమును బోసి రసికజనుల హృదయములకు సంతృప్తి చేయుట మాత్రము సామాన్యకార్యము కాదు. సభాముఖమునఁ జదువ నెవ్వరికిని లజ్జ తోఁపరాదు.

కావున శంభుదాసునకు మొదట నీయఁబూనిన సభాతాంబూలమును సోమనాథునిచెంతకు సాగనంపుఁడని వినయమునఁ జేతులొగ్గి ప్రార్థించుచున్నాఁడను. సోమనాథునియందు నాకు విశ్వాసము లేదను భ్రాంతిని వదలి యత్యంతభక్తి కలదని నమ్మి శంభుదాసునికన్న సోమన్న మిన్న యని యెన్నఁబూనక కవిత్రయమునకు సాటి కవిత్రయమే యన్న విఖ్యాతిని గాపాడ రసికజనశేఖరుల పాదములకడ శిరస్సొగ్గి వేఁడువాఁడను ఏమైన గుణ మున్న గ్రహింపుఁడు. లేకున్నఁ దిట్టఁబూనకుఁడు అది మీ గొప్పతనమునకుఁ గొంత నాపాదించును. ఎఱుంగఁజాలక యిట్లు వ్రాసెనని తమ రూహించిన నది నన్నుఁ గారవించినట్లే భావించెదను. నేను విమర్శింపఁబూనినవాఁడను గాను. ఆపద్ధతి వేఱు. కవిత్రయమునందు మనపూర్వు లునిచిన మర్యాదను స్మరించుటయే నా యభిప్రాయము గాని వేఱొకటి కాదు. వారికన్న మిన్న కాఁదగినవా రుందురు. వాల్మీకిని మించఁగలవా రీయిలను లేరు కదా. అట్లే భారతకవులు తెలుఁగుబాసకు జనకు లని మనము నమ్మవలయును. సదా వారి నామములను స్మరించుచుండవలయును. అది మన కిహపరసాధకము. దాని కించుకంతయు వెనుకదీయరాదు.

# సుధానిధి.

[మహామహోపాధ్యాయ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు]

శ్రీమ ద్దివ్యనిజప్రభావగరిమం జిత్రంబుగా నంతరా
శామేయస్థితిఁ గాలకారణగతిప్రాప్తిన్ ఖగోళంబు లి
చ్ఛామాత్రంబునఁ బోలెఁ జెందెడి నవస్థాభేద మెవ్వానిచే
నామోదంబున నప్పరాత్పరున కత్యంతంబుఁ గేల్మోడ్చెదన్.

పట్టిన దెల్లఁ బైఁడి యగుభంగినిఁ బల్కినపల్కు పద్య మై
యుట్టిపడంగఁ జెప్పినది యొప్పగు వేదముఁ గాఁగ సత్కథల్
గొట్టినపిండిగాఁ గవితఁ గూర్చినధన్యుల లోకమాన్యులం
బుట్టను తిప్పనుం బొఁకమి పూజ్యతఁ గాంచిన వారి నెంచెదన్.

పదపద్యాకృతి నాంధ్రభాషఁ గల శోభామాధురీరీతిసం
పద లే దొండొకదేశభాష కనుచందం బద మై యొప్పు సొం
పు దలిర్పంగను రామభారతకథల్ మున్ గావ్యముల్ గా రచిం
చి దయన్ శాశ్వతకీర్తిఁ గన్నకవులన్ జింతింతు నశ్రాంతమున్.

సుకవులు వంద్యు లన్పలుకు చోద్యము గా దది యెల్లవారలున్
గుకవులు నింద్యు లందు రిది కూడదు కబ్బపుటద్ద ముండఁగా
నొకరికవిత్వవైఖరి మఱొక్కరు దూఱఁగ నేటి కందునన్
సకలము దేటతెల్లము కనంబడ కుండునె చూడఁ గల్గినన్?

కవి యై యెవ్వఁడు నవ్యకావ్యరచనాకౌతూహలం బాత్మలోఁ
జివురింపం దనయూహాశక్తిఁ గవితాసీమంతినిన్ నూత్నమా
ర్గవిహారం బొనరింప నీక కడు నిర్బంధించెడిన్ గట్టుఁబా
ట్లు విడం జాలక వానిధర్మములు చాలుం జాలు సంరోధముల్.

సలలితమంజులపదగతి, నలరింపుచు ముద్దుఁ గులుక నమృతం బొలుకం
బలికినచోఁ గృతిబాలిక, గలిగించు సుఖంబు లెఱుక గనువారలకున్.

నాకులగోత్రముల్ మీకు నెఱింగింపఁ దాతముత్తాతలఁ దడవ నేల?
తనవంశ మొకగొప్ప దని చెప్ప నొప్పునే యాత్మస్తవంబు నింద్యంబు గాదె?
యుక్తంబు ప్రకృతోపయుక్తి కెంత వచింప నంతియ వచియింతు నధిక మేల?
అనుదినంబుఁ ద్రిసంధ్యమును ద్విజావళిచేత భక్తి నుపాసింపఁబడెడి తల్లి

త్రిపదసాంఖ్యాయనసగోత్రి దివిజవినుత, దేవి గాయత్రి నిత్యంబుఁ దేజరిల్లు
నామెగోత్రమె నాగోత్ర మనుటకంటె, నేమిచుట్టఱికము గణియింపఁగలను ?
ఆవిమలగోత్రసంభవు లస్మదీయ, వంశ్యు లెల్లరు గౌతమీప్రాంతవాసు
లందు మాజనకుండు దా నచట వెడలి, వచ్చె నాగావళీనదీప్రాంతమునకు.
పూర్వ మాచంట మాకుఁ గాఁపురము గాన, నూరిపే రింటిపేరుగా నొప్పె నాదు
జనకుఁ డాచంటబాపిరాజప్రధాని, జనని నరసాంబ, యగ్రనందనుఁడ నేను.
కృతి రచించెద జననియానతినిఁ బడసి, చదువుకొను వారు స్వయముగాఁ జదువుకొనుఁడు
ఒరులు చదువంగ నూఁకొనఁ దన్నవార, లిదిగో కథ వచ్చుచున్న దదెట్టు లనిన.
కల దొకశైల మీభరతఖండమున న్నుచక్కి నున్నతిం
గులగిరులందు మంచుమలకుం దగునీడు జోడు నా ననం
జెలఁగుచు నార్యు లెల్ల మును జేరి వసించినపుణ్యభూమికిన్
వలపలిచక్కి మేర యయి భాసిలి వింధ్య మనంగ నొప్పుచున్.
తరువులు గుల్మముల్ లతలుఁ దద్గిరిపాదము లాశ్రయించి ము
ప్పిరిఁగొని యేపునం బెరిఁగి పెంపడరం గటకంబు లెక్కి భా
స్కరకిరణాళిలోనికడు సన్నపుఁదున్కకు నైన దూఱునం
తర మిడకుండఁ బైఁ బొదువ దాఁగెడు నచ్చటఁ జిమ్మచీఁకటుల్.
ఘనకులగోత్రగౌరవము గన్నది గావున భక్తిఁ బశ్చిమాం
బునిధితరంగహస్తములఁ బొందుగఁ బాదము లంట రా నెదు
ర్కొని ధరణీధరంబు కడుఁ గూరిమి చేతులు సాఁచెనో యనన్
దనరు నదద్వయంబు గిరిదాపునఁ బాఱుచు వార్ధిఁ జేరుచున్.
ఎడనెడ నించుకంత ఘటి యిల్లినకొమ్మలసందునన్ బదం
పడి నునుగాడ్పుచేఁ దొడిము వట్టెడలం బడుపండుటాకు పెం
బడిఁ బ్రసరించుభానుకిరణంబుల నెండయు నీడయుం దగన్
దడఁబడుచున్ నితంబముల దాఁగుడుమూఁతలనాడు నగ్గిరిన్.
ఘను లగువారికేని గలుగంగల వొక్కపు డెచ్చుతగ్గు లెం
తని సరిపెట్టికొందురు తమంతనె యంచు ఘనుండుగాన జీ
వనదమహత్వ ముప్పతిలఁ బర్వతశృంగము లావరించి పై
కొని సరిపెట్టు మేఘుఁ డనుకూలపదస్థితి నెయ్య మొల్కఁడే?

---

# భాష - దాని పరిణామము.

[ఉమర్ అలీషా గారు.]

శ్రు॥ "ఏతస్మాజ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణిచ। ఖం వాయు ర్జ్యోతి రాపః పృథ్వీ విశ్వస్యధారిణీ."

అని వేదములందు వినంబడుచున్న మానవుండు సృష్టియం దొకఅద్భుతపరిణామ మని తోంచక మానదు. మానవునకు నాగరికత (వివేకము) అనాదిసిద్ధము కాదనుక్రమపరిణామ మనివాదించువైజ్ఞానికుల (Scientists) వాదమున కర్థము వ్యర్థము. వాస్తవమునకు మానవునకు జ్ఞానము బాల్యమునం దలవడక పదంపడి ప్రవర్ధమానమై సహజముగ విరాజిల్లు ననుట యుక్తియుక్తముగాని అత్యంతప్రాచీనకాలమున- అనగా మానవసృష్టియొక్క ఆదిమదినములయందు నాగరికత (Civilization) లేదనుట సాహసము. ఏ మనిషి బంగారుపిచ్చుక గూడు నేండల్లుట నేర్చికొనిన దనంగలమా? కాకిగూడు ప్రాచీనము కాదా? కోయిల నేండు పంచస్వర మేపాఠశాలలో నేర్చికొన్నది? చాతకము ద్యోధునీజలమునకు వాపీకూపతటాకములం బరీక్షించి విడిచి యలవాటుపడిన దని చెప్పంగలమా? నేండు గొంగళిపురుగు సీతాకోకపురుగగుట క్రొత్తయా? ఇట్లే జగత్తు నొకసారి చూచిన పరిణామము సృష్టికి స్వల్పకాలముననే ప్రారంభమై నాంటికి నేండు నదీప్రవాహమువలె రథచక్రమువలె వచ్చుచున్నదే కాని మానవనాగరికతకు లక్షలయేండ్లుపట్టిన దనుట దుర్వాదము. మొగ్గ నాండులేనిసువాసన గులాబికి విచ్చిననాండు వచ్చినట్లు మానవవ్యక్తి బాల్యము దాంటినవెంటనే జ్ఞానతేజస్సుదయించిన దని యొప్పుకొనక తీరదు. కావునం బ్రత్యేకవ్యక్తికి జ్ఞానము పరిణామలభ్యముగాని సంఘమునకుం గాదు.

ఈమానవసంఘమునుగూర్చి పాశ్చాత్యులు పెక్కువిమర్శనములు గావించి సిద్ధాంతములు రోదసీకుహరంబుల నింపివేసినారు. అందు థేల్సు (Thales) మొదలు లుక్రీషియసు (Lucracious) వఱకును, బఫను (Buffon) మొదలు లయలు (Leyell) వఱకును, లామార్కు (Lamark) మొదలు చార్లసు డార్విను (Charles Darwin) వఱకును ప్రసిద్ధకీర్తి వహించిన శాస్త్రకర్తలుగా నెన్నంబడుచున్నారు. కాని వీరంతఱు పొరపడి, మానవుని యథార్థస్వరూపసంజనితసంవాసనా- ఇది మిథ్య మని చెప్పలేక మహాగాధజలమునం బడిపోయినారు. మాన్యతుల్లరుని ఈరానులోయసిద్ధాంతము కొంతవఱకు నిజము కానోపును. అనంగా ఈరాన్ (Persia) దేశములోనిలోయయే మానవసంజాతమునకు నాదిమమని కనిపెట్టిన ఒరాంగు (Orang) మధ్యాసియావలి యుష్ణమండల (Torrid Zone) వాసియనునదియే వాస్తవము. ఈవాదము నిన్నవెనుక పైవాదములన్నియు లొంగిపోయినవి. తుద కీతండు దైవజ్ఞానము క్రమపరిణామ మనుచున్నాండు. కాని మావాద మదిగాదు. మానవు లీరాకలోయలోం దొలుత నదయించి దశదిశలకుం జెదరిపోవుటైనపదప్రిన మాపాదించుసరి కొన్నిరోలతులసంవత్సరములు పట్టియుండును. అలాగా వారు నాగరికులై పెక్కువిషయము లలవఱచుకొన్నా రనునది ఒకసిద్ధాంతము. అందంతర్భాగమైనది భాష.

ఈభాష వాఙ్మయముననే గాక అక్షరసాంకేతమునం బడినప్పు డొకపెద్దవివాద మేర్పడినది. యూరపునందలి (Hellos) హెల్లొనులను గ్రీకుదేశీయులు, ప్రాచీనభారతదేశమునందలి దాక్షిణాత్యులు, లిపి యెడమునుండి కుడికిని, ఈరానువారు (అరబ్బులు) ఆర్యులు మున్నగు మధ్యాసియావాసులు కుడినుండి యెడమునకును, చీనాదేశీయులు పైనుండి క్రిందికిని వ్రాయుపద్ధతి కల్పించి తమస్వాతంత్ర్యమును జెంపొందించి కలహింప నారంభించిరి. ఆవాసనావేశ మొకరిలో నొకరి కిప్పటికినిం జూడంబడుచున్నది. మన మంకెలు వేయునప్పుడు చీనావారిలిపిపద్ధతి (హారాలు) పైనుండి క్రిందికి వాడుచున్నాము, వహ్ని, కల్హార,

బ్రాహ్మణ, కణజ—ఇత్యాదిపదములు వ్రాయుచో అరబుపారసీలభాషలని అనుసరించుచున్నాము. సంస్కృతమునకు మొదటిలిపి బ్రాహ్మి. అది అరబ్బీవలె కుడినుండి యెడమకు వ్రాయుచుండిరి. అది ఇప్పటికిని హర్షవర్ధనుడు మున్నగువారి కాలమునందలి శాసనముల వలన దెలియుచున్నది. ఇంకను సంప్రదాయము లీచార్య (ఈరాన) కుటుంబమునకున్నట్లు గోచరమగుచున్నది. చతుస్సముద్రముద్రితధరాచక్రమున నెన్నియో భాష లేర్పడి యెన్నియో లిపిభేదములచే నలరారుచున్నను మే మెఱింగినవఱకు "అ" అనువర్ణమే లిపి కాదియం దగపడుచున్నది. సంస్కృతము మున్నగు భారతదేశములోని ముఖ్యమైన ౨౧ భాషాలిపుల కాదిని "అ" యే అగపడుచున్నది. ఇంగ్లీషు మున్నగుయూరపుభాషలకు "A" అను "అ" యే అగపడును. అరబ్బీ, పారసీ, సురియాని మొదలగులిపు లన్నియు "అలిఫ్" అనగా "అ" తోనే ప్రారంభమైనవి. ఇంక చీనా బర్మా లిపులకును, "అ" యే ప్రథమాక్షరము. కావున సంస్కృతాక్షరతత్త్వజ్ఞులీ "అ" కు "అకారార్థో విష్ణు ర్జగదుదయరక్షాప్రళయకృత్" అని అకారము బ్రహ్మ యని ప్రతిపాదించినారు. ఇదే కాక పెక్కుగ్రంథముల కీ "అ"కారమే మొదటిదిగ దోచుచున్నది. ఋగ్వేదము:- "అగ్ని మీళే పురోహితం" అని. ఖురాన్:— "అల్ హందొలిల్లా" అని. పూర్వమీమాంస:-అథాతో ధర్మజిజ్ఞాసా. వ్యాకరణమహాభాష్యము:-అథ శబ్దానుశాసనమ్. వైశేషికదర్శనము:-అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః"అని. యోగశాస్త్రము:-అథ యోగానుశాసనః. సాంఖ్యశాస్త్రము:-అథ త్రివిధదుఃఖాత్యంతనివృత్తి రత్యంతపురుషార్థః. వేదాంతసూత్రము:-"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని. ఇట్లే పెక్కు లుదాహరింపవచ్చును. ఈ "అ" ప్రకృతిస్వరూప మని తోచును. గోవుగూడ "అమ్మా" అని అఱచును. ఈ "అ" ఓంకారము (ప్రణవము) లోనియొకస్వరూప మని తత్త్వజ్ఞు లనుచున్నారు. అది గోవుఅఱపులో వినబడుటచే గోవును బ్రాహ్మణులలో గలిపినారు. ఈసంగతినే ఆంధ్రమహాభారతము ఆదిపర్వము 8 వ సర్గ 64 వ వచనములో గోవులును బ్రాహ్మణులు నొకతల్లికి బుట్టినా రని వ్రాసినారు. అనగా ప్రణవము * (ఓంకారము) అ, ఉ, మ- అను మూడువర్ణములు గలిసి అగుచున్న దని వేదము చెప్పుచున్నది. అట్టిప్రణవము ఉచ్చరించుటచే శూద్రత్వము పోయి బ్రాహ్మణత్వము చేకూరు నని భావము. అగ్నిని ఆర్యులు సమారాధించిరి. అల్లాను అరబ్బు లుపాసించిరి. అకారము విశ్వమానవప్రపంచ మంతయు పూతముగ నెఱుంగుచున్నది. ఇట్టి అనంతోదాహరణములచే మానవకుటుంబ మొకచోటి దని తెలియును.

ఇందు దాక్షిణాత్యులు తమవ్యక్తి ప్రత్యేక మని వాదింతురు గాని అది విమర్శకులు అంగీకరింపలేకున్నారు.

పంచద్రవిడులలో ఆంధ్రు లొక రని చెప్పుదురు గాని †ఆంధ్రులను మనువు చండాలాదులలో జేర్చి విడిచినాడు. (?) మాగధపాటలీపుత్రమును, పాంచాలాద్యుత్తరభారతభూమియు అవిచ్ఛిన్నముగా బాలించిన దీయాంధ్రు లని చెప్పుటకు వీలు లేదు. ఆంధ్రు లనుకొను మనవారిలో రెండుతెగలు గలవు. ఈమనదేశము తెలుగని వాడిరే కాని పూర్వ మాంధ్ర మని వాడ లేదు. ఆంధ్రదేశము చప్పన్నదేశములలో లేదు. కళింగము గలదు. ఇది కళింగ మని ఏలనో విడిచి త్రిలింగ మని నన్నయ్య వ్యాకరణమున వాడినాడు. కొందఱు త్రిలింగమును త్రికళింగ మని సమర్థించుచున్నారు. ఉత్తరకళింగమునకు ఉత్కళ మని మారిన దనుచున్నారు. అదే కొంతయు క్తియుక్తముగ నున్నది. త్రిలింగ మన్యదేశ మని విద్యానాథుని సిద్ధాంతము; అలంకారప్రాయము. పూర్వము నన్నిచోడుడు క॥ "మునుమార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత బుట్టించి."

---

* త్రయోవర్ణ అజాయత్త అకార ఉకార మకార యితి.

† కారావరో నిషాదస్తు చర్మకారం ప్రసూయతే వైదేహకా దంధ్రమేదౌ, బహిర్గ్రామప్రతిశ్రయౌ అ 10 శ్లో. 36. మేదాంధ్రజాజమదానా మారణ్యపశుహింసనం అ- 10 శ్లో. 48, కారావరులు, నిషాదులు వైదేహులు ఆంధ్రులు, మేదులు—వీరలు చండాలజాతియనియు, చర్మమును బాగుచేయుచు గ్రామబాహ్యప్రదేశమున నివసించి పశువులను కోసికొనుచుండు కటికవాండ్రనియు మనువు వ్రాసినాడు. ఇది బహుశః చచ్చరవాండ్రను చూచి ఓఢ్రులందఱును షాకీవాండ్రనునట్టి భ్రమప్రమాదమై యుండును.

అని రాజమహేంద్రవరము పదునొకండవశతాబ్దమునఁ బాలించిన చాళుక్యరాజులు అనఁగా రాజనరేంద్రాదులు సంస్కృతకవిత సామాన్యముగా దేశప్రజలకు దురవగాహ మని ఆంధ్రులకుఁ దెలుఁగుబాసను గ్రంథములు వ్రాయించి రని భావము. ఆంధ్రులని నన్నిచోడునినాఁటికిఁ గలపదము. తిక్కననాఁటికి "ఆదరణీయసర్వవిబుధార్థకవిస్ఫురణంబు గల్గి యష్టాదశపర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుం దాదివోడఁగి మాఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుఁడు విబ్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని వ్రాసినాఁడు. మాతృకమైన సంస్కృతభారతమున "అంధ్రా బహవో రాజా" అని అంధు లని చెప్పఁబడినది. ఇదే అర్థములో మార్కండేయపురాణమున పెద్ద గాథ రచించిరి వేదమునందు వినఁబడు అంధ్రమును వాల్మీకాదు లభ్యసించిన ఆంధ్రము నిదేనా? అని సంశయము అది విమర్శించిన గ్రంథబాహుళ్య మగునని మాన వలసి వచ్చినది.

ఎటులైన నేమి? "ఆంధ్రులన ప్రాచీనులైన తెలుఁగువారును, విజయోత్సుకులై యీదేశమునకు వలసవచ్చిన ఔత్తరాయణులు. అనఁగా బ్రాహ్మణక్షత్రియులు కలిసి ఆంధ్రులని వ్యవహరింపఁబడినారు లేనిచోఁ దెలుఁగువారికి సంస్కృతశబ్దనిర్వచన మసంగతము. ఇది కాక ఇచ్చటిప్రాచీనులైన రెడ్డి, కమ్మ, కాపు, కోమటులగోత్రములకు ఋషులతో సంబంధము లేదు. బ్రాహ్మణక్షత్రియుల గోత్రము లన్నియు ఋషిగోత్రములు. ఇదే దృష్టాంతము. అది గాక ప్రాచీను లైన తెలఁగ మన్నగుకులజులకు వేదాధ్యయనము లేదు. వేదోక్తవివాహము జరుపరు. ఈయార్థ్యకుఁ గారణము వార లుత్తరదేశవాసులు కాకపోవుటయే.

ఇంక తెలుఁగు నాగరికత అచ్చతెలుఁగుపదములు సమకూర్చి చూచిఁ దెలియఁగలదు. సంస్కృతపదములు చేరినపుడే కవిత్వము పుస్తకరూపము దాల్చినది. శాసనములలోనిపద్దెము లెటు లున్నను, నన్నయభారతమే ఆది యని చెప్పుచున్న వాద మర్థహీన మైనను గత్యంతరము లేదు. కావున నన్నయ్య తెలుఁగు సంస్కృతపదమిశ్రిత కావ్యము వ్రాసి "నన్నయభట్టు తెలుంగునన్ మహాభారతసంహితారచనబంధురుఁ డయ్యె" నని యిది తెలుఁ గనియే వ్యవహరించినాఁడు. తరువాతివారును "ఆదిని శబ్దశాసనమహాకవి వ్రాసిన భారతంబులో నేది వచింపఁగాఁబడియె, యెందును దానినె గాని సూత్రసంపాదనలేమిచేఁ దెలుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా రా దని దక్షవాటికవిరాక్షసుఁ డీనుడుమఁబుఁ జేసెన్" అని యిది తెలుఁ గనియే వాడినారు తెలుఁగువ్యాకరణముల కిదే ఆధారమని నేఁటికిని అనుసరించుచున్నారు.

ఇంకఁ దెలుఁగు ప్రాచీనరూపము మాఱి నెక్కు మార్పులు పొందినది. నన్నయాదులనాఁటి కిందు సంస్కృతపదములే పెక్కులు చేరినవి. కాని తరువాత కొన్ని మార్పులు వచ్చినవి "ఏను" అని భారతము చెప్పుచుండ, అది "నేను" అయినది. ఇట్టే "వెనలు" "వెళ్ళు" "నాఁడను" "నాను" అని అనేకరూపములు మారినవి. కాని "పశు" అనునది ఏభాషాపదమో తెలియవలసి యున్నది. దీనికి చిన్నయసూరి ప్రత్యేకసూత్రము గల్పించి సంస్కృతపదములతో చేరునని వ్రాసినాఁడు. మోహపశు, భయపశు ఇత్యాదులు:- ఈపశు అనునది మ్లేచ్ఛాదిభాషలలోఁగూడ నీయర్థమునవనే ప్రయోగింపఁబడుచున్నది. "ఆనాపశ, దర్‌పశ" ఇత్యాదులు ఈనుడుయున్నగు భాషలలో సంస్కృతపదములు చేరునుగాని తెలుఁగుపదములు చేరవు. ఈపశు పదము సంస్కృతము గాదు. తెలుఁగన్నచో దీనిచరిత్రపై నుదహరించినట్లు, తక్కినవానికంటె విలక్షణముగనున్నది.

మఱియుఁ దెలుఁగొక ప్రత్యేకభాష కాదు సరే కదా, సంస్కృతమిశ్రితమైమాత్ర ముండక అరవము, కన్నడము, మళయాళము మొదలగుభాషల సాంకర్యమును బొందినది. తుదకు ఉరుదు, అరబ్బీ, పారసీకపదజాలముగూడ తెలుఁగుపదములతో క్షీరనీరములవలె కలిసిపోయినది. ప్రస్తుత వ్యవహారపుఁదెలుఁగులో నేకాక గ్రాంథికపుఁ దెలుఁగులోఁగూడ నెడతెగనిపదములు ప్రవేశించినవి. రాను రాను ఇంగిలీషుపదములును జేరినవి. వానిని సవిమర్శగా లాక్షణికులు మాపట్టాలన్ "కం.

క్షితిన్మ్లేచ్ఛభాష కురితిగ। క్లిష్ట మగునట్లైన నీధరిత్రిని దానిక్‌। మతిరోసి విడువఁగూడదు। సతతము వ్యవహార హాని సంధిలుకతనక్‌” అని అంగీకరించిరి. “తామరస నేత్రిలింటి బందాలు గారె” అనుదానిలోని, “బందా” పారసిపదము “ముస్తేదు,” హుర్రాహురి, “వహవా,” “పసందు,” “.మఖములు” “కాలువ” “జంబుఖానా” “బరాబరులు” తరువాయి “పరషు” “అత్తరషు” “తతిమ్మా,” “అత్తరు” “మిఠాయి” “తబుకు” “లోటా” “బజారు” “కలము” “కాగితము” “సిరా” “అంగరఖా” “రోజు” “రకము” ఒకటి యేమి? నూటికి 15 శబ్దము లిట్టి వగపడుచున్నవి. ఇవన్నియు భావము రసస్వరూపమునకుఁ దేవలె నను సంకల్పము గలవ్యక్తికి అనుకరణీయములు పర మేభాషలోనిదైనను భావము నూతనమై వికాస మొసంగుపదములచేఁ గూర్పఁబడవల యును. అందుచేఁ దెలుఁగు నానాభాషలలోనిపదము లరణము దెచ్చికొని యొకగొప్పరత్నాకరమువలె చె న్నారుచున్నది.

---

# మాతృభాషాపరికీర్తనము.

[సాహిత్యసరస్వతి. పిల్లారిసెట్టి పంపాపతిరావుగారు.]

భావవిద్యోతితంబు పరిభాతగీతి
హాయిగాఁ బాడఁ గలను శ్రీవాయుగమున
నమృతబిందులు గుమికూడ, నరయ రాని
లేమిడియె నన్ను సతతము ప్రామికొనెడు.
పొట్టకొఱకయి దాస్యపుంబుద్ధి దవిలి
పొందఁ జాల నధోగతిఁ జిందువాఱు
రసనముజ్జ్వలగీతవిరావములను
వెల్లి గొలిపి ముదంబును జల్లుచుందు.
పోతనార్యునియమృతపునీత మైన
లేఖినీగమనంబు వ్యాలీఢభావ
వీచికల కిక్కయాదుఁ బ్రేరేచు నన్నుఁ
గావ్యతోయధిమృదుతరంగముల మునుఁగ.
లేదు పార్థివ సంపద లేశ మైన
ఇంచుకయుఁ బ్రయోజనము సాధింపలేను
గాని కల్పనారాజ్యసుఖంబు నందఁ
జేయుపీయూష కలితస్వర్గీయశక్తి
కలుగుకతమున నతులభాగ్యంబు నాది!

విశ్వహృదయంబు నలరింప నెడల లేదు;
సార్వభౌమపదమున కాశ పడ లేదు;
ఏయమేయునిదో యాయమేయమహిమ
పూవునకుఁ దావి వోలె నపూర్వగీత
మాత్మకు సహజ మయ్యె. సుధాప్లుత మగు
గీతమున మాతృభాషాపరికీర్తనంబుఁ
జేసి, జన్మవాసన భావసీమలందు
నిలువరించెద! లోక మనిత్య మైన
నగును గాక! భావగరిమ యమరభావ
భరిత మగునాగీతపరిభావ మమర
భావకలిత మై కళ్యాణపదవి గాంచు!

---

# నా హృదయేశ్వరి.

[కాళూరి వేంకటరామారావుగారు.]

వంధురమధుమాససాంధ్యసంపదలలోన
మానినీమణితోడి సంభాషణములు
దుర్భరవియోగవార్ధిని దొర్లిపోయె—
శర్వరీపూర్ణిమాచంద్రచంద్రికలను
సకియమృదుగాత్రదృఢపరిష్వంగసుఖము
లావిషాదాంధకారమం దంతరించె—
మన్మనోహారిణీస్వచ్ఛమార్దవంపు
ఆననేందూద్భవానందహాసరుచులు
కాలజలధరాచ్ఛాదనగతి నడంగె—
ప్రేయసీసాత్వికామృతప్రేమభావ
ములును, మోహనోద్దీపితమూర్తి నాదు
హృదయకాంచనపత్రముద్రితము లగుచు
మఱచిపోవుద మన్నను మఱపు రావు—

* * * *

భయదగర్జారవోపేత, ప్రళయకాల
వాయుసంహతజీమూతపటలియందు
మించుపోలిక తరుణి కాన్పించి, నాకు
తనమహోజ్జ్వలమూర్తిదర్శనము నిడుచు—
అధమనరజాతి కేమాత్ర మందరాని
పర్వతోన్నతశిఖరాగ్రభాగములను
దివ్యసింహాసనంబున తేజరిలుచు
కొలువు చేయుచు నుండు నాకోమలాంగి—
సాంధ్యరక్తిమ నల్గడ జల్లుకొనగ
వికసితానంతపుష్పవాటికలలోన
నిర్మలానందసౌరభాంచితపథమున
వేడ్క విహరింపుచుండు నాప్రియసుభాంగి—
నేను శోకాంధకారబంధితుడ నగుచు
కన్నుగానక తొట్రిలుగడియలందు
అతివ జ్యోతిర్మయీమూర్తి యవతరించి
నాకు సన్మార్గదర్శనానంద మొసగు—
అను నిం దన నేల? బ్రహ్మాండభాండ
మంతటను విశ్వరూపమై యలరుచుండి
ప్రకృతిలో నైక్యమగుచు నాప్రణయరాజ్య
లక్ష్మి యెల్లెడ దోచు సర్వాత్మపోలె—

* * * *

మావిచిత్రచరిత్రముల్; మావిలాస
భరితకేళీవినోదముల్; పౌర్ణమాసు
సారచంద్రికాకలితవిహారములును;
మామహాకష్టసుఖములు; మాప్రణయపు
కథలు చెప్పిన భారతగాథ లగును.—

# మధుపానరక్షణసంఘము.

[తెన్నేటి విశ్వనాథముగారు, ఎమ్. ఏ. బి. యల్.]

మన పూరియందు మొన్న నొకముఖ్యమైన ముచ్చట జరిగినది. పూరిలో నున్న పెద్ద పెద్దవా రందరు చేరి ఒకసభ సాగించి మధుపానముయొక్క మంచిచెడ్డలను శాస్త్రికభావముతో చర్చించి, మధుపానాసక్తులకు ప్రస్తుతమందు ఉన్న కష్టసుఖముల గావించి, మధుసేవ మాతృసేవకన్నను ఇహపరములకు తోర్క యని సిద్ధాంతీకరించి "శ్రీమధుపానరక్షణసంఘము" అని ఒకసంఘము స్థాపించేరు. లోకప్రబోధముకొరకున్నూ, మానవలోకవిజ్ఞానముకొరకున్నూ, ఆసభయొక్క చర్య అంతయు ప్రచురించుట తప్పనిసరి అని తలచి, నన్ను జరిగిన దంతయు హ్రస్వహస్తలిపిలో వ్రాయ నియమించిరి. ఆవ్రాసిన దానినే ఇప్పుడు మీచదువరులకు దీర్ఘహస్తలిపిరూపమున సమర్పించుచున్నాను.

## సభాధ్యక్షుని ఎన్నిక.

సభికు లనేకమంది ఉత్సాహముఖు లయి సమావేశ మవగనే మ. రా. శ్రీ శిరాల పేరిశాస్త్రిగారు లేచి సన్నగ క్షురకర్మ గావించినముఖముతో, సిల్కుసూటుతో, గుహాంతర్గతజలధారానినాదమువంటిగొంతుధ్వనితో ఇట్లు చెప్పేరు. "మహాజనులారా! మన మందరము నేటిదినమున ఇక్కడ సమావేశమగుటకు కారణము మీకు వాకరపత్రములద్వారా తెలిసియే యున్నదని నమ్మెదను. ఇటువంటిముఖ్యసభకు, ఇటువంటిఅవసరసభకు అధ్యక్షులుగా ఎవరిని పెట్టుదమా అని ఆలోచనచేయుచుండగ, ఆడబోయినతీర్థ మెదురైనట్లు, శ్రీ చెరుపూరి వెంకటనాథ శ్రేష్ఠిగారు ఈరోజుననే కౌన్సిల్ టూరునుండి ఊరికి తిరిగిదయచేశారు. వీరియొక్క కులమర్యాదాసాంప్రదాయములకు, వంశపారంపర్యవ్యాపారమధుసాంగత్యసంజనితసద్గుణగణంబును, నీరంటకుండ నీటిలో నీదుహంసవలెను, తాము త్రాగక నలుగురిచే త్రాగించు వీరిశక్తిసామర్థ్యములును, మధుపానప్రియులకు వలయు రహస్యసమయస్థలంబుల నొదగూర్చు చాకచక్యమును, సాధారణవణిజులవలె కేవలము సంపల్లాభముమాత్రము చూడక, మధుపానప్రచారమునకై పాటుపడు వీరిమధుభక్తియు, సాధుజనవిరక్తియు, మీ కందరకును ఎరుకయే. అనుభవపూర్వకముగ చెప్పుటయందు ఉత్ప్రేక్ష యుండదు. వీరిగౌరవవాసన ఈపట్టణమం దిమడక మదరాసుమంత్రివర్గమువరకు వ్యాపించుటచే, మొన్న నూతనసంవత్సరపుబిరుదుల సంతర్పణమందు "రావుబహద్దర్" రనుబిరుదు వీరికి లభించినది. మనసభకు అధ్యక్షులుగ ఉండవలసినవారు వీరుగాక మరియొకరు లేరనుట నిర్వివాదాంశము; కాబట్టి శ్రీశ్రేష్ఠిగారిని అధ్యక్షకపీఠ మలంకరింపవలె నని కోరుచున్నాను.

అంతట మ॥ రా॥ శ్రీ శ్రీమాన్ సీ. వారిజవాహనస్వామి అయ్యంగార్ అవర్గళ్ ఎం. ఏ, ఎల్. టి. గారు ఆశీర్వాదము నామోదించుచు ఇట్లు చెప్పేరు. "స్నేహితులార! మాది తమిళ్ దేశమై యుండే దైనను ఈదేశతలే చాలకాలంనుండి ఉండిఉండడముచేత ఆంధ్రులందు నాకు చాలా అభిప్రాయంగా ఉంది. మీరు ఆలోచనలయందు కాలయాపనం చేసి ఉండావి లేదు. ఈశూరివక ఛాయాపరంముఖంవారిభావములో, వాక్శూరులు కారు; కార్యశూరులు మీరు. శ్రేష్ఠిగారియొక్క ముఖ్యగుణములను నాప్రియశిష్యులైన శ్రీమాన్ శాస్త్రులుగారు చెప్పే ఉంది. ఆయన చెప్పిందంతా నిజము. శ్రేష్ఠిగారు మొన్న ఆల్కహాల్ కమిటీముందు నాతాలూకు ఏక్సైజ్ ఇండిమన్ రిస్పైరికాడ్ను ఎత్తుకపోయి, ఎవిడెన్సు ఇచ్చివుండారు. అంచేత ఆయనే మనకు ప్రెసిడెంటుగా ఉండకగ్గది."

దీనిపైని శ్రీవేంకటశ్రేష్ఠిగారు టెన్నిసుకోర్టులైనువలె తెల్లనైనపంగనామములతో వజ్రపుపొళ్ళతమ్మెట్లమెరుగులతో, బంగారుమురుగుపట్టెలమురిపెములతో, గంజిపెట్టినగ్లాసుగోమల్లుపంచలోనుంచి కనబడే

కాళ్ళవరయ్యారముతో, మాంచెస్టరు లాంగ్లాతు వస్త్రతో, సేలంజరీవాణీతో, నగుమొగముతో, సంపత్సూచకమైన కడమాత్రపు బొజ్జతో, అధ్యక్షకపీఠము నధివసించి, వెండిచేతికర్రను బల్లమీద మెల్లగానుంచి సభికులకు మెడవంచి బోచేసి ఇట్లు సభ ప్రారంభం చేసెను.

"ఆర్యులారా! ఈసభయందు అన్నిచదువులు చదివిన అనేకమంది ఉన్నప్పటికిన్ని, వారల కాదని నన్నెన్నుకున్నందుకున్ను, నాయందు మీరు చూపించిన గౌరవమునకున్ను ఎంతో కృతజ్ఞతాపూర్వకంగా వందనములు నన్నెన్నుకొనుటయందు తమకు మధుపానమునందు గలగౌరవము వెల్లడియగుచున్నది. ఎంతయు సంతోష కారణము. ఎజెండాపత్రిక చూడగా కార్యక్రమము చాల ఉన్నటు లున్నది అందుచేత నే చెప్పవలసిన దంతయు, నా అంత్యోపన్యాసమున చెప్పెదను. కార్యక్రమము ఆరంభింతాము. హరిదాసుల నల్లయ్య శాస్త్రిల్లుగార్ని ప్రార్థనచేయ మని పిలుస్తున్నాను."

శాస్త్రిల్లుగారు లేచి, బాలారుణవిస్ఫురితనయనముల నాల్గువైపుల త్రిప్పుచు, అస్తమయసమయారుణసూర్యబింబప్రమాణ మగు కుంకుమబొట్టు నెన్నుదుట నాగులాడుచుండగ ఇట్లు రాగము తీసి ప్రారంభించేరు.

" జయజయ మధుదేవీ, జయ మధురావనా
జయాజయ : బుధపూజితా, జయనవశీవవిభ్రాజితా
జయ సాధుజనసంసేవితా, జయసప్తమస్వర్గప్రదాయినీ.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

అధ్యక్షులు :— మొదటి తీర్మానమును మ.రా. శ్రీ..............................ఎమ్మే ఎల్టీగారిని ప్రతిపాదించమని పిలుస్తున్నాను.

శ్రీయుత..................... గారు చురుగ్గా లేచి కమీజుకప్పులోనుంచి "విత్ది బెస్టు విషెసు ఆఫ్ దివాన్" అని చిత్రింపబడినపట్టుచేతిరుమాలు తీసి బల్లమీద పరచి బ్రీఫ్‌బాగులోనుండి రెండునిండు సీసాలను దీసి దానిపై నిలువబెట్టి, నేత్రద్వయము నరమోడ్పు చేసి, సీసాలకు నమస్కరించి, చిరునవ్వుల నల్దిక్కులకు ప్రవహింపజేయుచు, చక్కనిగొంతుకతో ఇట్లుపన్యసించేరు.

"ఆర్యులారా, గుణగ్రహణపారీణులార, సుకవిబుధవిరాజితమై, నానాసద్వ్రతతిలకభూషితమై, నిరంతరమధులక్ష్మీపదకమలసంసేవామృతభరితమనోవిలాసమై యలరారు యీసభాసరససదనమందు నిలచి, సకలలోకపుణ్యపూర్ణమునకై సంఘస్థాపనము జేయుటకు ప్రతిపాదింపగ నాపేరుపైనిలుచున్న తీర్మాన మిట్లు పర్వుచున్నది.

" జగదేకవిజ్ఞానప్రబోధమునకును, లోకైకమతసంస్థాపనకున్ను, దేశైకమత్యసుకుసుమవికాసమునకును, మధువును రక్షించి ప్రోక్షించి మధుపానాసక్తుల హెచ్చరించి, మధుపానసామ్రాజ్యసంస్థాపన జేయుట మనదేశీయులకు ముఖ్య మని ఈపౌరమహాసభయొక్క ఏకగ్రీవాభిప్రాయము. ఏతదాశయములను కార్యసంధానముగ జేయుటకు "శ్రీమధుపానరక్షణసంఘము" ను స్థాపించవడ మైనది."

మహాజనులారా, కార్యధురంధరులార, అస్మత్పురీలలామకంఠమునబరగు కాలహారమునందు ప్రధానముత్యముగ పరిగణింపవలసినయీదినము కడుశుభదినము. మనము నేడు చేయుచున్న కార్యము స్వరాజ్యగిరాజ్య మను మతిభ్రమణకన్న, హిందూముస్లిముగిస్లిము సమస్యకన్న, బ్రాహ్మణాబ్రాహ్మణోద్యమగిద్యమవంధ్యప్రయత్నములకన్న, సెర్వీసుసూపర్విన్లు- లేమనల్ ఏరోగన్సు ప్రాబ్లెమ్సుకన్న, సత్యాగ్రహదురాగ్రహప్రవేదాంతములకన్న మనఅభ్యుదయమునకును, మనదేశాభ్యుదయమునకున్ను మనఆర్థికనిశ్చలత్వమునకున్ను అవశ్యకమై యున్నది. ఇదివరకే, మనమెంతయు అనవసరమైన ఆలోచన యాలస్యదోషముల గావించియున్నాము. నేటికైనను మనము ఈవిషాదస్థితిపాతాళమునుండి తప్పుకొనుటకు యత్నించుచున్నా మనుట నిశ్చయముగ మనోగర్వమునకు కారణంబు. అప్పుడే ఏంటిడ్రింకుకేంపైన్లట, అబ్కారీరిఫార్ములట, ప్రొహిబిషన్లట, పుస్సీఫుటుజాన్సన్లట డ్రైదేశములట, ఏవియో ఇలాంటిస్మశానములంటు అనేకములు బయలుదేరినవి. ప్రప్రథమమున వీటి ఆయువు మెంతని మనవారలు హ్రస్వదృష్టిభావముతో ఊరకొని నేటికి వీకలపైకి ఈసమస్యాశస్త్రమును దెచ్చుకొనియున్నారు. ఈశస్త్రాధమును నేను వెయ్యా

రుతునకలగ భేదించుభారము మనభుజములపై నున్నది. అయితే ఐతరేయోపనిషత్కాలమునుండి నేటివరకయిన అష్టాదశసహస్రాబ్దములనుండియు సర్వజ్ఞానసంపత్తిలకసంసేవితమై ఆసేతుశీతాచలపర్యంతము సర్వస్థలపూజితమై, దేశంబునకును కాలంబునకున్న వన్నెలవెన్నెల నొడగూర్చినమధువట నేడట నిషేధయోగ్యమట వేదపరిహారవజేసినవిబుధు లెవ్వరును అమాయకమైన మధుపానాసక్తులపై దండెత్తజరు. ఇందులకే లోకమాన్యులైన దేశభక్తుల "వెనుకకు వేదములకు" అనుఘోషింప మొదలుపెట్టినారు. పరమవైదికులై సోమయాజిపదారోహణమునకు ప్రయత్నించు బ్రాహ్మణోత్తములు ఎవ్వరును మధుసాధువుపై జగడమూనరు మధువే లేకున్న యజ్ఞంబు లేరీతి సాగగలవు యజ్ఞంబులు సాగకున్న యజ్ఞభూమియైన మనభరతభూమిస్థితి యేమగనోంద? యజ్ఞంబులెపావనులవకున్న అస్మద్బ్రాహ్మణులు లేనిధంబున ఇంద్రలోకభోగంబులకు అర్హులగుదురు? ఇంద్రలోక మనిన రంభామేనకతిలోత్తమాదిఅప్సరసల సరసవిహారములకు ఆటపట్టు ఇంద్రుండును తద్దేవతాకాంతానీకంబును సురాపానమత్తచిత్తులగుటచేతనే సురలైరి; వారుండునది సురలోకము. అట్లు సురాదేవిసేవకులుగాని వారే వృత్రాసుర, రావణాసురాదులెల్లను. అసురులు అనగా రాక్షసు లని వేదశాస్త్రపురాణేతిహాసప్రమాణముగ పిలువబడుచున్నారు. అట్టిసురలోకమునకు ప్రతిఫలంబుగ సృజింపబడిన యీభూలోకవాసులు సురావిముఖులయి అసురభావమూనడల్చితిరేని నాకీభూలోకము వద్దు. కాని మదీయదేశీయులు ఇట్టిశాస్త్రనిషిద్ధమయి అమానుషమయిన మధుపానబహిష్కారమున కీయకొనరని నమ్మక మున్నది.

ఇంతియగాక, పరదేశీయు లయ్యు, మనమేలు కోరెంచి మందొరతనమువారే నాగరికప్రపంచభావముల ననుసరించి, ధర్మసంయుతమైన రాజకీయార్థికవిధానమందు మధువున కగ్రస్థాన మిచ్చి, మధుపానవిముఖులను శారాగృహముఖులుగనైనజేసి, నానాశాసననిర్మాణములో మధుసేవసేయువీలు కలిగించుచున్నారన్నచో, దేశీయులు, దేశాభ్యుదయము హృదయమందుండువారలు, దేశీయఆర్థికపరిస్థితి బాగుండవలె నని కోరువారలేతీరున మధువునకు విముఖులయి అదాక్షిణ్యముగాని శత్రుభావనలను రగిలించుచున్నారో నాకర్థము గాకున్నది.

ప్రాచీనలిఖితజాతీయచరిత్రాత్మకమగు నానావిధకార్యములందును, అలంకారరసపోషణార్థము మగువే అగ్రగణ్యముగ నెన్నబడినవిషయము పండితులకు పరిపూర్ణవిదితమైనదియే; దానిగూర్చి, పండితనికేతనమునకు అధ్యక్షు లయిన బ్రహ్మశ్రీ సురవాయకరావువిగారు లిఖియించినగ్రంథగ్రజము మీకరంబుల ఈసభలోనికివచ్చునపు డుంచియేయుంచిరి. అష్టాంగయోగధారణముజేసి సమాధిజెంది నిశ్చలమైనపరమగతియందు మనంబు జొనిపి, చైతన్యునివలె, కబీరుదాసునివలె, సూరిదాసువలె, త్యాగరాజవలె, నిర్గుణబ్రహ్మపదంబున కైవల్యంబుగాంచుటకు మధువే యనుపమమార్గమని గ్రహించి తత్త్వజ్ఞులును మతాధిపతులును, హిందుదేవాలయోద్ధరణసంఘసభ్యమాన్యులును మధువు ననేకవిధముల బోధించుచున్నారు. ఆధునిక నాగరికత గలపాశ్చాత్యసామ్రాజ్యములందును పై నుదహరించిన యీనిజమును గ్రహించియే, దేశకాలపాత్రవిచక్షణల నతిక్రమించి భ్రాతృభావముతో టెంపిల్సు గట్టి మధుపానమును మర్త్యలోకమునందు అమర్త్యముగ జేయుచు భావికాలప్రపౌత్రులకృతజ్ఞతకు సత్పాత్రు లగుచున్నారు.

కావున మీవంటిసుజ్ఞానులకు, మీవంటి అనుభవశాలులకు, నే నెచ్చుగ చెప్ప నక్కర లేదు. కాన ఏకగ్రీవముగ, ఉత్సాహపూరితముగ కరతాళధ్వానసహితముగ భక్తిప్రధానమనస్సంభవానుకూలరాగరుణానేత్రసహస్ర సంయుతముగ ఆమోదించి, మధుసేవయు మాతృసేవయు, చేయుదు రని నిండునమ్మకముతో పునరాసీనుడ నగుచున్నాను. (కరతాళధ్వానము - బాగు బాగు, హాయిహాయి- బ్యూటిఫుల్- అని కేకలు)

అధ్యక్షులు:—సుగుణాలవాలములారా!

ఈతీర్మానము నామోదించుటకు మనపురమునకు భూషణమైన శ్రీయుత డాక్టరు ఇందీవర్, ఎం. ఏ. ఎం. బి. ఎస్. ఎల్. ఆర్. సి పి. ఎఫ్. ఆర్. సి. ఎస్. గారిని ఇప్పుడు పిలుస్తున్నాను.

అంతలో డాక్టరు ఇందీవర్ గారు, ఆకర్ణాంతకమైన రెండుమీసంబులను రెండుకరంబులతో చటుక్కున

సద్ది, ఉట్టిపడుచున్న కనుదోయితో, మధురమధుర సంభాషణావాసన లూరించుచున్న ఓష్ఠద్వయముతో, పాటకరించిన బొజ్జపై పిటపిటలాడుచున్న వెస్టుకోటు జేబులోనుండి బంగారువాచీ తీసి బల్లమీద నెదురుగ నుంచికొని, కుడిజేబులోనుండి షాంపేన్‌సాంపిల్సు గల గాజుపెట్టెదీసి, ఎడమజేబులోనుండి వైనుసాంపిల్సుగల మైకాపెట్టె దీసి చూపరుల కెదురుగా నుంచి స్ఫుటమై సర్వశ్రోత్రైకగ్రాహ్యతమై, వారిజ్యాస్రాంతగంగా వాహినివలె వీనులవిందైనగొంతెత్తి యుత్తేంగున మాటలాడిరి.

స్నేహితులారా! సత్యాన్వేషణులార,

ప్రస్తుతసమయమున, లోకమున అసత్యదేవీపూజ రోజురోజునకు పెరుగుచు మోజుగనుచున్నది సత్యదేవత బ్రహ్మవలెనే పూజ లేక బూజుగనుచున్నది. ఇట్టిసమయమందు లోకాభిప్రాయప్రవాహమునకు ఎదురీది సత్యాన్వేషణులై సత్యదేవతయొక్క సద్ధ్వజమును కరంబుల బట్టి బహిరంగముగ మనసుకొలంది మాటలాడి మానవోద్ధరణము జేయ సమకట్టిన మీకందరకును కృతజ్ఞతాపూర్వకముగ వందనము లర్పించుచున్నాను. మీసాహసము మెచ్చుకొనుచున్నాను. ప్రాపంచికనీతిప్రకారము మధుసేవ యెంతముఖ్యమో శాస్త్రులుగారు చెప్పియున్నారు. వారు చెప్పిన దంతయు నెంతయు నిజము. మధుపానఖండనలు మునిగితేలువాచాలతాప్రవాహప్రోథరసంబులు నాసొమ్ములు గావు. తత్త్వధర్మమున పూర్వమున క్రీస్తు బుద్ధుడు మొదలగు సన్యాసులు సత్యాన్వేషణ మెట్లు జేసితిరో అట్లులే నేనును నావృత్తిధర్మమున, దూషణములకు జడియక, స్తుతిభూషణముల కాసించక సత్యశోధనమే జన్మసాఫల్య మని యెంచినవాడను. కావున మీ రందరును పక్షపాతబుద్ధి విడనాడి నీతివేత్తల మని సంఘప్రాణముల దినివేయువారలయొక్క ప్రాణశూన్యవచోగుంభనల నొక్కమారు మరచి, నే జెప్పుమాటలను వినవలయును.

నాచిన్నతనమందును ఇంచుమించుగ ఇప్పటితీరుననే అసత్యదేవీపూజ జరుగుచుండెను. అప్పుడును నీతివేత్తల మని చెప్పి ధనాపహారణమునకై బహిష్కారసంఘముల స్థాపించవలయు ననువా రుండేవారు; అప్పుడును శాస్త్రజ్ఞుల మని జెప్పుచు మూఢత్వము ప్రచురించుచునైనిట్టు లుండేవారు. వీరివచనములకు వంచింపబడిన ముసలమ్మలవంటివారు ప్రతియింట నుండేవారు. చిన్నవారియొక్క శాస్త్రభావము జంపుచు, అశాస్త్రీయమైట్రినము అపరిశోధనము లైనట్టివియు మూఢభావవ్యాసవచనంబులు, చెన్నపట్నముచుట్టుముట్టిన కూవమునదివలె యువకులమనోభావములచుట్టును ఆవరించియుండెను. ఇటువంటిసమయమునందు ఒకనాడు నా కాలేజీకి నేను పోవునప్పుడు గేటుదగ్గర, బ్రహ్మాండమును దిగమ్రింగు నంతటి అక్షరములతో శుభ్రప్రాయభిన్నలశిరముల పగులగొట్టిన ప్రవహించు రక్తప్రరంగువంటి ఎఱుపువన్నెతో "త్రాగుడు తప్పు" అని మున్మారు ముద్రించిన ప్రకటన జూచితిని. తప్పైనచో ఇంత పెద్దక్షరములతో చెప్పవలసినంతఅగత్యమేమి యని సందేహము గూడ జనించెను. నేను లోపునకు పోవుసరికి దీని నిజము పరిశోధింపవలె నని కుతూహలము పుట్టెను. తక్షణము హోస్పటలుస్టోర్సుకు బోయి ఒకసీసాపుచ్చుకొని కార్కు విప్పి త్రాగితిని. త్రాగినపిమ్మట కులాసాగ నుండెను గాని ఏవిధ మయినవింతయును జరుగ లేదు. అందున్న తప్పేమియో తెలియులేదు. తిరిగివచ్చుసరికి కాలేజీ లైబ్రరీయందు "నెర్వసు డిసీజు" అని యేదో ఛార్టు కనిపించెను. ఇదేమని తిన్నగ హైజీను ప్రొఫెసరుదగ్గరకు బోయి, నిజము గ్రహింపవలె నని కుతూహలముగ నున్నది. కొంతఆల్కహాలు ఇమ్మని అడిగితిని. ఆయన, గురుబ్రహ్మణ్యుడు, చెవిదగ్గరకువంగి "వెర్రివాడా ఆచార్యులను ఆ అసందర్భనీతివేత్తలను ఎన్నడూ నమ్మకు" అని చెప్పెను. అయినచో ఆ అసత్యములనేల సత్యపరిశోధనే ముఖ్యము జేసికొనిన కళాశాలయందే ప్రచురించుచుంటిరి? అని ప్రశ్నించితిని. 'అదియే నానిమిస్తరు' అని ఆయన జవాబుచెప్పెను. ఆపైని నేను మూడున్నరఅవున్సుల ఆల్కహాలు తక్షణమే రిసెర్చిలేబరేటరీలోనికి తీసుకపోయి ఎనలైజు చేసితిని. అట్లు చేయగ పంచదార, మొలాసిసు, బ్రీటూరిటు, హైడ్రోజను ఆక్సిజను కార్బను-అనునవి కెమికలుగా కలిసిన ట్లయితే ఆల్కహాలు ఫార్మగు నని నిర్ధారణ జేసికొంటిని.

ఆహా! మాదకద్రవ్యములబలిమివలన ఇట్టి ఆరోగ్యప్రదాయిని యైనవస్తువును నరలోకవాసులు నాశనము చేయ నుంకించినారుగదా యని విస్మయావహము లోకమూరు సాహ్యపయము ఖేదింపజొచ్చెను. అల్కహాలునందు గలపదార్థముల పేర్కొని యుంటినిగదా! వాటిగుణాగుణములను పరిశోధింతము ౧ పంచదార: దీని యందు గలదోష మేమి? పంచదార ప్రకృతిధర్మమునగ తమలో లేనిఫలజాతులు లేవు అయినను ఆఫలముల నన్నింటిని నందనవనపు జాతములవలె భుజించుచున్నాము. పవిత్రదినములందు పానదారపవిత్రత హెచ్చుచున్నది ప్రపంచయాత్రను తొలగించుటకు పౌరాణికులు ఇక్షుసాగరమును కల్పించియేయున్నారు మరి పంచదార పాపమని చెప్పినప్రమాణ్యాత్ములు వాకొంట బడలేరు

(౨) మెలాసెసు&టార్ట్రాటు — అనుపదార్థములం దేదోషము కలదు? మహనీయులారా! ఈకర్మక్షేత్రమై భరతభూమియొక్కఘనతకు కారకులైనఋషి పుంగవు లెల్లరును ఇట్టికందమూలాదుల భుజించెడువారు కారా? తిరిగి ఏనాడు మరల మనఆహారము ఇట్టిదివ్యమైనవస్తువులతో గూడియుండునో ఆనాడు మనదేశమునకు మరల స్వార్థత్యాగము—ఔన్నత్యము—స్వారాజ్యము చేకూరును.

(3) ఇవిగాక ఆల్కహాలునందేమి కలవు? ఆక్సిజన్. హైడ్రోజన్, కార్బను మానవదేహము యొక్క కెమికల్కాంపొజిషన్ చూచినట్లయిన ఆక్సిజన్ 65% కార్బను 18% హైడ్రోజన్ 10% ఉన్నట్లు శాస్త్రజ్ఞులు నిర్ధారణచేసియున్నారు. ఈమూడున్ను నైజమైన అపాళ్ళకు తక్కువ అయిన యెడల దేహము చెడు నని వేరే చెప్పడ మేల? ఇది యిట్లుండగా వీటిగుణములు పరిశీలింతము. ఆక్సిజన్ అనగా ప్రాణవాయువు. ప్రాణవాయువు లేనిచో ప్రాణి నశించు నని మీ రెరిగినదే. నరకలోకమునం దనేకమైనజబ్బులు కలుగుటకు, హిందూదేశమందు స్లేవు మెంటాలిటీ అను మనోజాడ్యమునకు కారణము ఈప్రాణవాయువు వలయునంతగ మనరక్తనాళమునందును హృదయమునందును వాయుకోశములద్వార ప్రవహించకపోవుటయే అని ఎక్స్పరిమెంటల్ రీసెర్చివలన సిద్ధాంతీకరింపబడినది. (వైదీ-హిందూ మెడికల్ జర్నల్ 42 వ భాగము) అందుచేతనే యిప్పుడు పాశ్చాత్యులు ఆక్సిజనేట్రీటుమెంటు అను ఒకచికిత్సావిధానము గనిపెట్టియున్నారు. ఆక్సిజన్ తరువాత ఆలోచించవలసినది హైడ్రోజను. హైడ్రోజను ఉండి ఆక్సిజన్తో స్నేహముచేసి కలియకున్నయెడల లోకమునందు నీరు లేకుండుటయే నీరు ప్రాణానికి ఎంతఅవసరమో, గంగను నిరాకరించి పార్వతి యెన్నిపాట్లుపడెనో మీకు తెలిసినసంగతియే స్నేహితులారా, మీవంటి వస్తుశాస్త్రజ్ఞులకు హెచ్చుగా చెప్ప నక్కరలేదు. ఇవిగాక ఆల్కహాలునం దున్నది కార్బను. కార్బను మీదేహమందు నిద్రాజాగ్రదావస్థానిమిత్తము లేకుండగ సకాలములందు జరుగుచున్న కేటాబలిజం, ఏనాబలిజం, అను జీవనిర్మాణకార్యక్రియకున కాధారము గాని వేరు కాదు. ప్రాణప్రియులారా! వింటిరా! ఇటువంటి సద్గుణసంభూత ప్రపూతవిస్ఫురితదోషరాహిత్యవస్తువుపై ప్రొటెస్టెంట్లుపై మధ్యకాలమున కత్తిగట్టిన కాథలిక్కులవలె బౌద్ధులపై బ్రాహ్మణులవలె శ్రద్ధానందుని జంపిన వరీదువలె ఇక్కాలమందు సత్యాసత్యవిజ్ఞానరహితులైన కొందరు, ఏవియల్ ఏకానమీ ఇంచుకైన యెరుగని కించిజ్ఞులగు మరికొందరితో కలిసి సర్వభోజ్యపదార్థములందును ఉన్న ప్రకృతిపదార్థములపై కత్తిగట్టినారు. ఇట్టి వెడంగుమానిసిపిండులవలన లోకము వెలవెలపోవుచున్నది. తెలివితక్కువ అగుచున్నది. ఆకలి హెచ్చగుచున్నది. సబబు తక్కువ అగుచున్నది. మూఢత్వ మెచ్చగుచున్నది.

ఓహో కార్మికస్నేహితులారా! మనదేశమందు కష్టపడినగాని జీవనాధారములేదు. సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువరకు ఆలుబిడ్డల నింటికడ విడిచి దూరక్షేత్రములందు కూలినాలి జేయుటకు బోయి చెమటూడ్చి నిరాహారులయి భూస్వాముల భూషణదూషణముల కొకేరీతిగ దేహమానములను బలిజేసి అలసిసొలసి దీపముల బెట్టువేళకు మూర్ఛచెంద నున్నప్రాణమును తెప్పరిల్లగ జేయుశక్తిగల దెద్ది, మతోద్దీపక

లైన మనజాలరి పంచమ కార్మికాది వివిధభక్తులను తీవ్ర మతాగ్ని దందహ్యమానమానసులైన మహామద్దీయుల కలాపములను ఉత్సవసమయంబుల ఎంతశ్రీమన్నైన నడచి ఉత్సాహాపూరితులగ దేవోన్ముఖులుగ జేసి పురవాసుల డెందంబుల దైవముయొక్క నిజరూపము నిరూపణము జేయగ వారలకు శక్తి నిచ్చునెద్ది, అనారోగ్యకాలము లందు ఆహార మిసుమంతయూ దేహములోనికి బోవక ప్రాణభంగ మగు ఆపత్కాలమందు సంజీవినివలె గ్గుణ మిచ్చు సత్పదార్థ మెద్ది, ఉష్ణకాలమందు శీతలత గలుగజేసి శీతకాలమందు ఉష్ణము గలుగజేయు శక్తిగల దెద్ది, అట్టి పూజనీయపదార్థము అల్కహాలు; అట్టిదివ్యవంశపరిదాయని-ఆల్కహాలు; అట్టి ఇహపరభావసమైకత్వమునకు పుట్టినిల్లు ఆల్కహాలు.

ఇది ఇట్లు ఉండగ మధుపానము వద్దనువారివాదముల జూతము. క్షేమమునకై పట్టుదలకై స్తుతిభూషణములకై మధువు మంచిది గాదనువారలగూర్చి నేనుమాటలాడను, అట్టివారు దగాకోర్లు వారిజిహ్వచేతనే వారు ఖండితులై యున్నారు. వీరుగాక మరికొందరి న్యాయముగ వాదించువారి వాదము లేవియనగా మధువువలన మనుష్యులు జగడము లాడుదురట. మధువువాసన నైన ఎరుగనివారియందు జగడమాడువారలు లేరా? మధువువలన ఆరోగ్యము చెడునట; మధువుపేరైన నెరుగనివారలందు అనారోగ్యులు లేరా! మధువువలన నలుగురిలో నగుబాటగునట; మధువు త్రాగనివారలందు నగుబాట్లుపాలయినవారలు లేరా? ఇంతమాత్రమునకు ఇది అభిప్రాయభేదము; మధువువలన మెదడు చెడునట; మధువుమాటలేనివారి మెదడు లన్నియును సరిగనున్నవా? మధువువలన వ్యయము ఎచ్చగునట? మధువు వద్దనువారు వ్యయముల మానికొనిరా? ఇంతమనూ ఈవాదములందున్నది సగమునిజము; సగమునిజము. నిండుఅబద్ధముకన్న హానికర మన్నసామెత ఇప్పుడు ముఖ్యముగ వర్తించును.

ఇంతేకాక ఈమధ్య పైవేళ్లు వేసుకొనువారందరును ఈకమీజులిందు నవ్వువారలందరును ఈగోచిపాతలు కట్టుకొను గన్నగుసలాడువారలందరును ఈబహిరంగ బహిష్కారవాదులందరును రహస్యప్రచారకులు గారా! జబ్బుపేరు చెప్పియో సొసయిటీపేరు చెప్పియో "ఫర్ ది మిస్యూర్ ఫస్యాసిటీ" అనియో 'ఎట్టికట్టు' అనియో వీరందరూ మధుసేవ జేయుచున్నవారే కదా!

మీయందు పలువురు అనుభవశాలురుగాన ఈ అనాదిమధ్యాలయస్వరూపిణి యగు మధువుగూర్చి విపులముగ చెప్ప నక్కరలేదు. కావున, సత్యాన్వేషకులారా! మూఢవాదుల వాదనలకు నమ్మక, తర్కశాస్త్ర విమర్శశాస్త్ర, వస్తుశాస్త్రప్రమాణయుగము, విమర్శ పరిశోధనలజేసి నేను మీయెదుట నుంచినవిషయముల మన్నించి, ఈతీర్మానము నేకగ్రీవముగ నంగీకరించి నిరంతరగౌరవమును సంపాదింతురని నమ్ముచున్నాను" (కరతాళధ్వానము...ఎక్సలెంటు...గ్రీడ్)

అధ్యక్షులు:- ఇప్పుడు శ్రీయుత సీతాపతిగారిని ఈతీర్మానము నామోదించుటకు పిలుస్తున్నాను.

అంతట శ్రీసీతాపతిగారు నీలమేఘచ్ఛాయనిగనిగలతో, ఏడడుగులపొడవుగల గంభీరవిగ్రహముతో, సీసాలతో పాటకరించిన కోటుజేబులతో, వెనుకబాం గుప్రమాణమైనచుట్టను ఎడమచేతితో నోటినుండి తీసి నవ్వే తనరాజ్య మన్నట్టుగా ముఖము బెట్టి ఇట్లు మాటలాడెను.

"సోదరులారా! నేను పొడవైనవాడనని నాస్పీచి పొడుగుగా నుండునని భయపడవద్దు "రకరకాల భవప్రభు" వని పిలవబడు శాస్త్రులుగారును, వస్తుశాస్త్రజ్ఞాన భయంకర్ బిరుదు గన్న ఇందీవర్ గారును విపులముగ కర్ణపేయముగ హృదయరంజకముగ పండితులకు పామరులవలె, పామరులకు పండితులవలె ఉపన్యసించిన తరువాత కేవలము సేవకబృందములోనివాడ నగు నేను చెప్పేదే మున్నది? మధుపానమునందు మీకు పరమేశ్వరుడు దృఢత్వమును ధైర్యమును ప్రసాదించవలెనని కోరుతూ ఈతీర్మానము మీరందరూ ఆమోదించవలెనని కోరుచున్నాను." (పొట్టు అండ్ స్వీటు అని కరతాళములు.)

అధ్యక్షుడు:- సురసేవకులారా! సభ్యులారా! ఈ తీర్మానమును ఓటునకు పెట్టుచున్నాను. ఫర్- అందరు. ఎగెనెస్టు- నిల్. అంగీకృత మైనది. మరి రెండవతీర్మానమును ప్రతిపాదించుటకు బ్రహ్మశ్రీ ప్రథమపాటి శ్రీధరదాసుకవితిలకాలంకారులవారిని ఇప్పుడు పిలుస్తున్నాను.

అంతలో చక్కగాదువ్వినయుంగురులనిగనిగలతో వేసినవ్రేలుముడివేడ్కతో, ముచ్చటగా తియ్యగుమ్మడిపండువంటిబొజ్జక్రింద దోపినకుచ్చెలమడపుబెడంగుతో, మత్తగజేంద్రమధ్యసమానమగు నెన్నడుమున జుట్టిన జల్తారు పట్టుదుమాలు రుమాలతో ప్రేక్షకవీక్షణంబులకునొగ్గిన విస్తీర్ణ భుజవక్షోజస్థలంబులకదలికలతో, వానిపై నూగాడెడుబంగరుహారసరిభలతో రెండుకరంబులముంజేతుల గణగణలాడుచున్న నానానేకకవితాసంగరరంగవిజయప్రభావహేమకంకణంబులతో గంగాబ్రహ్మపుత్రాసంగమసమయసంజనితధ్వనిప్రమాణమగు కంఠస్వరంబుతో, వామహస్తంబున క్రొత్తగ అనకాపల్లియందు కవిత్వపటుత్వమునకు కానుకగా గొన్నచక్కని కాంతులవెండితో చేయబడిన చేతికర్రతో, కుడికాలనున్న గండపెండేరము అప్పుడప్పుడువిదల్చుకొనుచు మాటిమాటికి పదములు ముందునకు వెనుకకు వేయుచు, లేనవ్వు సభామందిరమున నలువంకల వెదజల్లుచు శ్రీధరదాసుగారిత్తెరంగున గొంతెత్తి చెప్పిరి.

“అస్మత్ప్రతిపాదితం బగుతీర్మాన మిట్టిదంబున- మధుమాపణం బొసర్చువ్రాతలు వాఙ్మయకళంకములు గావున అత్తెరంగుననున్న వ్రాతల నన్నింటిని ఆంధ్రవాఙ్మయమునందు సవరించవలెను. అవ్విధమున సవరింపని పుస్తకంబుల నచ్చువేయం జనదు. విక్రయింపం జనదు. చదువం జనదు. తీర్మానమునకు వ్యతిరేకులు శిక్షార్హులు. ఆధునికరసపుంజములారా! నవోదయభానులారా! అహోరాత్రవిచక్షణాతీతసురసేవైకసంజనితమత్తచిత్తపుణ్యులై గణ్యతగాంచినశాస్త్రుల్లవారున్ను, చతురాననసృజితజంబూద్వీపపరహాస్య సత్యాన్వేషణయశోవిభూషణులై, శాస్త్రప్రజ్ఞస్తుతిపోషణులై వెలయు ఇందీవర్ వైద్యశిరోమణి గారును, యీవసంతకాలకుసుమితకుసుమసువాసనలతో, ఈసాయంకాలపృథ్వారుణసూర్యవిభాభాసురంబైన మోముదమ్ములతో వెలయు నీసభాసరస్సున నిలిచి ఉపన్యాసపుష్పాంజలి నర్పింపంగ నందుకొనుభాగ్యము ఏమని వర్ణింతును!

పుష్పంబులయందు సన్నపూజాజింబలె, ఫలంబులయందు పదిమూరురేకుల సువర్ణలేఖంబలె, నీరంబులయందు గంగాజలంబుంబలె, రాజులందు రామచంద్రుంబలె సున్నితంబై, నిర్మలంబై, నిష్కళంకంబై, వేదాంతునిహృదయమువలె సర్వమిథ్యాప్రమాణంబై, న్యాయవాదిమనంబుపగిది న్యాయేతరపథావలంబమై, వైద్యునిడెందంబుతెరంగున అనారోగ్యప్రచారప్రధానమై, అయ్యవారులఆలాపనంబుపగిది కూపస్థమండూకభావముఖ్యమై, మానధనునిచరిత్రంబుపగిది నిష్కల్మషచిత్రకళారూపితంబై, ఇట్లు వివిధసమయంబుల వివిధరుచుల బరగుమధువుయొక్క మాన్యచరితంబు పొగడుపుణ్యంబు కలిగిన మీరలున్ను, నేనున్ను సర్వాంతరంగుండైన ఆశ్రీరంగనాథునికదా ఎన్నకొనవలెను.

గిరగిర జోరుగ త్రిప్పినబొంగరంబుపగిది శిరోంతర్భాగంబు తిరుగుచుండ, తిరుగుచున్నశిరంబును నరకలోకసంబంధంబులనుండి విడిపించుచుహృదయంబు వెచ్చనగుచుండ, వెచ్చనైనహృదయంబు వేమారు కరపల్లవములనూరార్చుమనంబుతన్మయత్వమొందుచుండ, తన్మయత్వమొందినమనంబుతో జగమెల్ల జయించినట్లు కన్పట్టుచుండ, జగంబునందలిజను లెల్లరు నమకసనిశినాట్రినక్షత్రంబులపగిది మిలమిలలాడుచుగన్పట్ట, ఎక్కువైనమక్కువనొక్కమారు ప్రక్కనున్న నిక్కువంబగు క్రొక్కారుమెరుంగులగ్రక్కుటుక్కాడి కాంతయిడ గుక్కచేయక త్రాగుషాంపేనుగూర్చియు, నెలకొకసారి లాడ్జియందు విందులారగించుసమయంబున మనప్రియమిత్రబృందములోనివారగు కొందరు, త్రాగినసీసాను త్రాగిత్రాగకయు, తిన్నఫలాహారములను తినీ తినకయు, ఆడినమాటను ఆడీ ఆడకయు, పాడినపాటల పాడీపాడకయు, పలుకరించిన పలుకరింపుల పలుకరించీ పలుకరించకయు, బిడ్డలుగొట్టిన సోడాబుడ్లను చూచీచూడకయు, మరొక్కగ్లాసు మరొక్కగ్లాసు అని రకరకములబొమ్మల ప్రతిఫలించు విదేశస్ఫటికప్రవాహముకంటిమధురాజంబుల త్రాగిత్రాగకయు ప్రక్కవార లదిలాగీలాగుకొనకయు, తనవో రని భ్రి

ఫలింప నీసభాసరస్సునందు రమలూరించి విహరించు మీవంటి రాజహంసల సత్సాంగత్యము గలిగినది. కావున నన్ను మీసంఘమునందు చేర్చుకోవలయునని ప్రార్థించుచున్నాను."

ఇందీవర్ దాసు.- "సోదరులారా! యీ యువకుడు యీపురమునకు, యీ కాలమునకును భూషణంబు. ఆణిముత్యము.

అధ్యక్షులు:- స్నేహితమాతలారా! నేటిసభ జయప్రదంగా జరిగినది. మరి నేచెప్పవలసిన దేదియులేదు.

వణిజుల పోషించి, దేశీయార్థికస్థితి బాగుచేసి, సకల కళాపోషణంబు గావించు మీవంటి మహ్యాసక్తులకు కష్టమేమి?- మరి మా సంఘము స్థాపించవలెను.

అధ్యక్షులు:—శాస్త్రులుగారు ఏమ్మేబిఎల్. ఉపాధ్యక్షులు:—పేరిశాస్త్రిగారు కోశాధిపతి:—వేంకటనాథ శ్రేష్ఠిగారు; రాజపోషకులు-జిల్లాయందుగల జమీందారులందరును; పోషకులు=వణిజులు, జాలర్లు, మేదర్లు, మెసానికుసోదర్లు; చందాదారులు- మధుపుగోరు వారందరు కావచ్చును. మరి నేటిసభ సరి."

# చెల్లెలా!

[కొండవంటి బ్రహ్మాజీరావుగారు.]

నీసమీపస్థలి నెపుడు నెగడ మాకు
దుఃఖ మది మది కత్యంతదూర మగును;
మఱపురానినీనగుమోము నరసినంత
చింతలు దొలంగి మది కెంతొ శాంతి యొదవు
సంతతానంతసామ్రాజ్యసార్వభౌమ
పదవి నొడఁగూర్చుభవదీయభవ్యలలిత
మధురవచనాళి—
అక్కటా మందభాగ్య
లము గదమ్మ నిన్బాసి దుఃఖమున మున్గి
పాడుతనువు భరింపఁగా వలసె మాకు.

* * * *

నేఁడు నీ వెంతొ దవ్వుల నిలిచినావు
చూచి సంతసింపఁగ నైన సులువు లేదు
మాహృదయపరితాపంబు మానుభంగి
మఱి కనఁగరాదు నిన్ను నేమాడ్కిఁ గాని.
వంతఁ గుందెడుమాయాత్మ లింతసంత
సింపఁగా నిఁకేనాఁటికిఁ జేసె దీవు?
చెల్లెలా! నీవియోగంపుఁజింతచేత
ధరణిసర్వమ్ము తిమిరసంభరిత మయ్యె.

* * * *

రమణఁ దనరెడుశ్రీమండలమున కెల్లఁ
బ్రబలలక్ష్మి మా జీవితపథము నడపి
నట్టి నీనిర్మలాత్మకు నచ్యుతుండు
కూర్మి నిత్యశాంతిని సమకూర్చుఁ గాత!

# ఆంధ్రకవితాపితామహుఁడు.

[శ్రీరంగము శ్రీనివాసరావుగారు.]

నీ ముఖారవిందవ్రశిథ విరిసి భు
నీతవించి తుళుంగలించెను
మధువు లొలికినమంజుకవితల
మనుచరిత్రమున.

ఆదినమ్మున కృష్ణరాయధ
రాధిపునిపేరోలగమ్మున
త్వత్కవిత్వరసస్రవంతిని
ధారకట్టినది.

మృదుమధురగానధ్వనుల విని
కృష్ణసర్పము లవశమొందిన
విధము లవుడటచున్నపండిత
హృదయములఁ దోఁచె.

పారవశ్యముచేత కడుసం
భ్రమము గదురగ కృష్ణరాయలు
తనకుఁ దానై నీమృదులపా
దము సమీపించె.

అవుడు వెలిఁగెను నీదుపాదము
సందునుండి జనించి సభలో
గండపెండేరపునముజ్జ్వల
కాంతిపూరములు!

గౌరవము గని గరువముం గని
పారవశ్యముఁ జెంది యాశీ
ర్ధ్వనులతో శ్రీకృష్ణరాయని
ధన్యుఁ జేసితివి!

* * *

పేండ్లు పూండ్లును నాఁడు మొదలు గ
తించెఁగాని భవద్యశస్సులు
నేఁటివఱకు శరత్సుధాకర
నిర్మలతఁ దాల్చు!

నీవు నాటినతోఁటలోపల
చేవతఱగనిపూవుగుత్తులు
నేఁటివఱకును తేటవలపులు
నింపెడిని దెసల!

జీవచిత్రకళారహస్యము
చిందువార్చిననీకవిత్వము
చిత్రకారులచేతఁ గలకుం
చియల లేపినది.

తెలుఁగుకవనపుతీరుతీయము
నిలిచి వెలుఁగుట కొకమెఱుంగును
చిలికి చుక్కలనడుమమింటను
కులుకుచున్నావు.

# దృఢానురాగము.

[కేతవరపు వేంకటశాస్త్రి గారు.]

గీ. వయసునను రూపమునఁ బ్రాభవమున మఱియు
ధనమునను గల్గునను రాగము నశించు,
సహజమై నిర్నిమిత్తమై సంభవించు
రాగ మతిదృఢ మగు నశ్వరంబు గాదు.

నరసాంబ బ్రాహ్మణబాలిక. సుగుణవతి. బుద్ధిమతి సంసారిణి కుఁడకలసినచక్కఁదనము గలది పల్లెటూరుబాలిక యగుటచేతను, నిరుపేద దగుటచేతను జదువుకొన నవకాశము లేని దయ్యెను. ఆ కారణమున నామెకు విద్యాగంధము లేకపోయినను జాలినంతవివేక సంపద గలదు. ఆమెకుఁ జిన్నతనము నుండియు నాటపాటలకంటెఁ బురాణశ్రవణాసక్తి యధికప్రియము. పది వత్సరములవయసు నాఁటికి నామె భారతభాగవతరామాయణాదులందలికథలన్నియు ససంగ్రహముగాఁ దా గ్రహించి యుండుటయే కాక తనయీడుజోడు బాలికలకు వాని నన్నింటిని జెప్ప సమర్థురాలయి యుండెను. బాలికల కలంకారములం దధిక ప్రేమ యుండుట సహజము కదా! ఆయూరి ధనికబాలికలు పలువిధముల నలంకరించుకొని తనతో నాడుకొనవచ్చుచుండిరి. వారిని జూచి తనకు నట్టియలంకారములు గావలె నని కోరి తల్లిదండ్రుల బాధించుట బాలికల నైజము. కాని నరసాంబమాత్ర మట్లు చేయలేదు. తనకున్న ప్రాఁత వస్త్రమునే సంతోషముతోఁ దాల్చి యాడుకొనుచుండెడిది. అట్లయ్యును "సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యా" యనునట్లామె కదియే శోభాదాయక మగుచుండెను. సహజసౌందర్యమున కలంకారములు గావలయునా!

ఆబాలిక యాటలకయి పొరుగిండ్లకుఁ బోవునది కాదు. పోవ నవకాశము కలది కాదు. ఆమె కయిదుగురు సోదరులు. అందు మువ్వురు పెద్దవారు. ఇరువురు చిన్నవారు. తలిదండ్రుల కామె యొక్కతెయే యాఁడుపిల్ల. తక్కినవా రందఱును మగవారు. ఆ కారణమున నరసాంబ తల్లికి గృహకృత్యములందు సతతము తోడ్పడవలసి యుండుటయే కాక తనతమ్ముల నెత్తుకొని యాడింపవలసినభారముగూడ నామెయే భరింపవలసివచ్చెను. ఇట్టి యామె కాటలాడ నవకాశ మెక్కడ. ఊరిలోనిబాలికలందఱును నరసాంబ నధికముగాఁ బ్రేమించియుండుటచే నామె వచ్చువఱకు నాటలాడ మాని యామెకై ప్రతీక్షించుచుందురు. ఎప్పుడైనను నరసాంబ జబ్బుపడి కాని, గృహకృత్యములనిర్బంధమువలనఁ గాని యాటలకు రానిచో నాబాలిక లందఱును గాలుగాలిన పిల్లులవలె నామెచుట్టును దిరుగుచుందురే కాని యాడుకొనఁబోవువారు కారు. దైవికముగా నొకప్పుడు రోగ మంకురించి యామె మంచముపట్టెను. అప్పు డాబాలిక లామె మంచముచుట్టును జేరి యుపచారము లొనర్చుచు నామెవలనఁ గథలు పాటలు చెప్పించుకొని యింటి కరుగుచుండువా రంతియకాని నరసాంబ లేకుండ నాటలాడ నెంచినవారు కారు. మఱియు నామె గృహకృత్యనిమగ్నయై క్రీడింప నవకాశము లేనిచో నాబాలిక లామెకు గృహకృత్యములందుఁ దోడుపడి త్వరగాఁ బనులు ముగించి యామె నాటలకుఁ దీసికొనిపోవుచుండిరి. ఆబాలికల నింతగా నాకర్షించినవి, నరసాంబసద్గుణములును నానావిధకథాకథనసామర్థ్యము నని వేఱ చెప్పనక్కఱలేదు. ఇట్లు నరసాంబ బాల్య మతిక్రమించి వివాహవయస్క యయ్యెను.

నరసాంబవివాహము విషయమై తల్లిదండ్రులకు విశేషశ్రమ కలుగలేదు. ఆయూరనే నరసాంబకు మేనత్తకొడు కొకఁ డుండెను. మెడఁబట్టిన మేనఱికము. ఆ సంబంధ మెట్లుతప్పును! మఱియు నరసాంబతండ్రి పరమసాధువు. తల్లి పరమపతివ్రత. తనసోదరి వచ్చి తనకుమారునికి నరసాంబ నిమ్మని యడిగినప్పు డతఁడు దానిని నిరసింపఁగలఁడా! పతివ్రత యగు నతనిభార్య పతికి విరుద్ధాభిప్రాయము నీయఁగలదా! తల్లిదండ్రుల నిలువేల్పులుగా భావించునరసాంబ వారియభిప్రాయమును నిరసింపఁగలదా! ఇఁక వివాహము స్థిరపడుటలో నాటంకమే మిగలదు. కాని వరుఁ డగు రామశాస్త్రికి వరుని కుండవలసినగుణ మొక్కటియును లేదు. అతనికిఁ గన్నుక గోరు

రూపసంపద యించుకయును లేదు. అతనిశరీరచ్ఛాయ నీగ్రోజాతివారిని మఱపించును. అంగసౌష్ఠవ మతివికృతము. అంతకంటెం దక్కువయగు మఱియొకశబ్దము భాషలో లేనందునం గురూపి యని యనవలసివచ్చుచున్నది. కురూపమునకుందోడు వయస్సుకూడ ముదిరినది. అతని కిప్పుడు నలువదవవత్సరము. ఇంకం దల్లి గోరుంట్టి ధనసంపద నాలోచింతమా? అదియుం బూజ్యమె. అతనికిం బిత్రార్జితమగు కొంచెము భూవసతి కలదు. పెండ్లికిం గావలసినధన మాభూమి కుదువబెట్టి తేవలయును. ఇంకం దండ్రి గోరుంట్టివిద్యాసంపద నెంచెదమా! అదియు నున్నదే. అతండు చిరకాలము బడిలోం జదివి చదివి చేవ్రాలు చేయ నేర్చుకొనె నని చెప్పినం జాలును. అదియైనను స్పష్టముగా నుండలేదు. ఏదేనిపత్రముపైం జేవ్రాలుచేయవలసివచ్చినచోం దనపేరును గుండ్రించ్చకాను లంతలేసియక్షరములతో మూండుపంక్తులలో నిముడ్చువాండు. ఏమయిననేమి నరసాంబా రామశాస్త్రులకు వివాహ మయినది. గ్రామస్థు లీదాంపత్య మననురూపమైన దనియుం గాకిముక్కునకు దొండపండు వ్రేలాడంగట్టినట్లున్న దనియు వాదోపవాదము లు చేయ మొదలిడిరి. కాని నరసాంబతల్లిదండ్రులుగాని నరసాంబగాని యట్లెన్నండును భావింపలేదు. నరసాంబ దైవదత్తుండగు నా పతి తనవేల్పని భావించుకొనెను. వివాహదినములలో నాయూరివారు ముఖము ముడిచికొని గునియంజొచ్చిరి. కాని నరసాంబ పెండ్లిలో గునియలేదు. ముఖము ముడువలేదు. ఆమెవదన మెప్పుడును వివాహకళలచే శోభావంతమై పొలుపారుచుండెను. అది చూచి నరసాంబవర్తనమునకుం బలువు రానందించిరి. ఇట్లు సహజమగు నరసాంబపత్యనురాగము నిష్కపటమై వర్ధిల్లం జొచ్చెను.

## రెండవ ప్రకరణము.

గీ. వెన్నెల శశాంకునిం బాసి వెడలలేదు
తావి పుష్పంబును బాసి తరలలేదు
సహజగాఢానురాగసంసక్తయైన
యువతి పతి బాసి నిమసమే నుండలేదు.

మఱికొన్ని దినములకు నరసాంబ యత్తింటం గాపురము చేయనేగెను. అత్తింటం గాలుపెట్టినది మొదలామె వివేకముతో గృహకృత్యము లొనర్చుచు నత్తగారికిని నాండుబిడ్డలకును, బతికిని దగువిధముల నుపచారము లొనర్చి వారియందఱ దయకును, మన్ననకును బాత్రురా లయ్యెను. చిన్నప్పటినుండియు గృహకృత్యము లందాఱితేఱిన దగుటచే నత్తింటి బండెడుపనిచేసినను నరసాంబకుం గష్టమనిపింపలేదు. ఇట్లత్తింటం బను లన్నియు నవలీల నెఱవేర్చుకొని యేదోయొకసమయమున తనపుట్టినింటి కరిగి పిల్లలతో గృహకృత్యము లొనర్ప ఖిన్నురాలగు తల్లికిం దోడ్పడి మాతృఋణము నునుగూడం దీర్చుకొనుచుండెను. అవివేకవంతుండగు పతి యొకప్పుడు తనచేయుపనులందు లోపము లెంచి పిడుగులవంటి కేకలిడుచున్నను నరసాంబ ముఖమునందుం గాని హృదయమునందుంగాని వికృతి నొందక మఱింతనిశ్చలభక్తితోం బతిని సేవించుచుండెను అత్తింట భర్తగాక యదితరు లెవ్వరైనను దన్నుం దూలనాడినచో నందుల కామె ప్రత్యుత్తరముగా మందహాస మొనర్చుచుండెడిది. అదియైనను కన్నగొనలందును, స్నిగ్ధకపోలములందును మాత్రమే యనుమేయమై యుండును. ఇట్లామె గృహిణీపదమునకుం దగియుండెను.

నరసాంబబ్రదు కెప్పుడును గష్టములపాలే. ఇంతవఱకు గృహకృత్యభారమగ్నయై యుండుటచే నొకప్పుడును విశ్రాంతి లేక పుట్టింటను, నత్తింటను గొడ్డువలెం బాటుపడుచుండెను. ఇట్టియుత్తమురాలికి సంతానము కలుగలేదనువిచార మొకటి క్రొత్తగా నలముకొని బాధించుచుండెను. ఇట్లామె యహర్నిశలు బాటుపడుచు సంతానార్థ ముపవాసవ్రతము లాచరింప నారంభించెను. అత్తగారు కాని భర్త గాని తలిదండ్రులు గాని యెంతవారించినను నరసాంబ తనవ్రతమును విడువలేదు. చిన్నప్పటినుండియు నామెకుం గార్యదీక్ష యధికము. ఒకరు వారించుచున్నను దనకు ధర్మమనియు, విహితమనియుం దోంచినపని విడుచునది కాదు. ఉపవాసవ్రతములు, దేవతారాధనలు, విశేషించి యొక్కొకవారములం దొంటిపూట భోజనములు, మొదలగునియమములతో రెండుసంవత్సరములు గడచెను. అంత దైవానుగ్రహమువలన నరసాంబ పుత్త్రవతి యయ్యెను. సంతానవతియైనప్పటినుండియు నామెకు మఱికొన్నికష్టము లెక్కు

మయ్యెను. ఇదివఱలో నున్న గృహకృత్యభారమునకుఁ దోడు శిశుపోషణభార మధికమయ్యెను. ఇట్లు నరసాంబ రాత్రిందివములు పనులవలన నలఁగిపోవుచున్నను లక్ష్యపెట్టక పరమసంతోషమున వర్తించుచుండెను. అత్తింటి పనులలో నొక్కటియుఁ గొఱంతపడరాదు. పుట్టింటఁ దనతల్లికిఁ బనులందు దోడ్పడ మానరాదు. ఉపవాసాది నియమములు వదలరాదు. ఆఱవప్రాణ మగుతనపుత్త్రిని సంరక్షణమం దెట్టిలోపమును గల్గరాదు. అట్లని యితరులెవ్వరును బుత్త్రిరక్షణము చేయరాదు. తాను స్వయముగా నొనరించినఁగాని యామెకు సంతుష్టి లేదు. ఇట్లనవరతము పాటుపడుచున్నను, నామెకు విసుగు లేదు. విచారము లేదు. శ్రమలేదు. ఎప్పుడును నిండుసంతోషమే. ఇట్లుండ నామెకు మఱియొక పుత్త్రుఁడు కలిగెను. దాని వలన నామెసంతోష మినుమడించెను. కాని దైవమామె సంతసము నట్లుండనీయలేదు. రెండవపుత్త్రుఁడు పుట్టిన యాఱునెలలకుఁ బెద్దకొడుకు రోగపీడితుఁడై మరణించెను. పుత్త్రశోకమున దుఃఖ మెవ్వరికుండదు? కాని నరసాంబదుఃఖము వర్ణనాతీతము. కాని యేమికారణమో చెప్పలేము కాని, మఱికొన్నినిముసములకు దుఃఖించినట్లు గనఁబడలేదు. అమ్మలక్కలయోదార్పువలననే యామెదుఃఖము విడిచినదని యందఱును దలంచిరి. పెద్దవాఁడు గతించినను, భగవంతుఁడు రెండవపిల్లవానిని బ్రసాదించెనుగాని వానిని జూచుకొని దుఃఖము వదిలిపెట్టియుండునని యందఱును దలంచిరి. ఇంతలో నప్పుడే నిద్రనుండి లేచినపసిబాలుని గొనివచ్చి యామె యొడిలోఁ గూర్చుండఁబెట్టిరి. ఇది యామెదుఃఖమున కూఱట గల్గింపవచ్చునుగదా! కొంతసేపటికిఁ బెద్దకుమారుని శవమును గొనిపోయిరి. రెండవబాలునికి నీళ్ళు వోసి పాలిచ్చి నరసాంబ పండుకొనఁ జేసెను. ఆమెయుఁ గూడ స్నాన మొనరించి వాకిటఁ గూర్చుండెను. అంతవఱకును, నత్తగారు, నాఁడుబిడ్డలు, తల్లిదండ్రులును, నామె చుట్టును గూర్చుండి నానాపురాణవాక్యములను వినిపించి యామె యిఁక స్వస్థచిత్తురాలయినదని భావించి తమతమపను లొనర్చుకొనుచుండిరి. అప్పటికి సూర్యభగవానుఁడు పశ్చిమదిగ్భాగమున కభిముఖుఁడై యుండెను. నరసాంబభర్త భుజించుచుండెను. నరసాంబను గూడ భుజింప రమ్మని యత్తగారు పిలుచుచుండెను. అత్తగారిపిలుపునకు నరసాంబ సమాధాన మొసఁగలేదు. వారియింటిప్రక్కన యగాధమగు నొకనూయి గలదు. వర్షకాల మగుటచే నది జలపూర్ణమై భయంకరమై యుండెను. అది నేలనూయియగుటచే నొడ్లు విఱిగి యందు గూలుటచే మిక్కిలి విశాలమయి సముద్రమువలెఁ గానవచ్చుచుండెను. నరసాంబ స్నానమునకు దిగినదేమో యన్నట్లానూతి గుభాలున నుఱికెను. ఆనరసాంబ యట్టి ఘోరకృత్య మాచరించునని యెవ్వరు నెఱుంగరు? పుత్త్రశోకాసహిష్ణురాలై యామె ప్రాణత్యాగము చేయ సంకల్పించుకొనియే బాహ్యదుఃఖమును విడిచెను. అది ప్రమాదమని యెవ్వరును దెలిసికొనలేకపోయిరి. ఆచప్పుడు విని భుజించుచున్నభర్త యదిరిపడి చటాలున లేచి వచ్చి తనప్రియురాలు చేసినదారుణమును గ్రహించి నూత నుఱికి మునిఁగిపోవుచున్నభార్యకేశపాశమును బట్టుకొని నూతియొడ్డున మొలచిన జువ్విమొక్కవేఱు నొకదాని నాధారముగాఁ జేసికొని నీళ్ళలోఁ దేలియుండెను. అంతలో నలువురు ప్రోవయి వారిని నూతినుండి యుద్ధరించిరి. నరసాంబ యిఁకఁ జేయునదిలేక లజ్జావనతవదనయై యొరులను జూడలేక యట్లె కూర్చుండెను. అప్పుడు పలువురు పలువిధములఁ బలుకఁజొచ్చిరి. అవి యన్నియు నామెచెవిని బడెనో లేదో చెప్పలేము కాని యామెతల్లిదండ్రులు వచ్చి జరిగినఘోరమునకై యేడ్చినయేడ్పుమాత్ర మన్నిధ్వనులను నతిక్రమించి యామెచెవిని బడెను. తోడనే యామె ముఖమెత్తి తల్లిని జూచి యాపురనియేడ్చి కౌఁగిలించుకొనెను. అదివఱకామె యెన్నఁడును దల్లియేడ్పు వినలేదు. అట్టితరి రోదనధ్వని యామెహృదయమునకు మార్పుగల్గించెను. తానొనర్చినపనియధర్మమని యామె కప్పుడు బోధపడియుండనోపు. ఆమె స్వస్థతవహించినట్లు కానవచ్చెను. కాని దానిని నమ్మలేక తల్లిదండ్రులు రాత్రిందివము లామెను కంటిని ఱెప్పవలెఁ గాచుకొనియుండిరి. కొన్నిదినములకు నరసాంబ దుఃఖము ప్రాతవడెను. ఇంతలోఁ బసిబాలుఁడు క్రమముగా వర్ధిల్లి వచ్చియురానిమాటలాడి తల్లి పుత్త్రశోకమును బూర్తిగా నశింపఁజేసెను. నరసాంబ స్వస్థచిత్తురాలయ్యెను. మఱికొంతకాలమున కొకకూతు

రుద్భవించినతోడనే వెనుకటియానందము నొంది వర్తించుచుండెను.

అయినను నరసాంబయానందము చిరకాల ముండలేదు. పుత్రికాపుత్రులతోఁగూడి సుఖింపనున్న సమయమున నామెతండ్రి మృతిచెందెను. డెబ్బదియేండ్ల వయస్సుగల తండ్రిమరణమునకు నరసాంబ యంతగా విచారింపవలసిన పనిలేదు. కాని యామెమనస్సట్టిది కాదు. అది యతికోమలము ఆత్మీయులయందలి స్నేహప్రేమగౌరవాదుల కాస్పదము. అతికరుణామయము. ఇతరులకష్టములఁ గాంచినంతనే యామెహృదయము కరఁగి నీరగును. ఇట్లుండఁ దనబాంధవులు- కాదు, ఆప్తబాంధవులు—కాదు—కన్నతండ్రిమరణమున కామెమనస్సెట్టిదగునో చెప్పవలయునా? తద్విచారముచే నామె కొంతకాలము దిక్కు తోఁచకుండెను. ఆమె స్వస్థచిత్తురాలగునప్పటికిఁ గొన్నినెలలు గతించెను.

అంతట నరసాంబకు మఱియొకయాఁడుపిల్ల గలిగెను. ముద్దులు మూటఁగట్టు నాపిల్లను గాంచి యామె హృదయమున రంజిల్లుచుండుసమయమునఁ బెద్దపిల్ల పొంగురోగముచే మరణించి మిక్కిలి దుఃఖాకులచిత్తను గావించెను. ఇఁక నామెదురవస్థ యెట్లుండునో చెప్పవలయునా? కాని యాత్మీయులచావులు రెండు మూఁడు చూచుటవలనఁగాఁబోలు నామెహృదయము వెనుకటివలె దుస్సహావేదనాపరవశమయి సాహసమునకుఁ బూనలేదు. కాని యాగర్భశోకాగ్ని హృదయమునందు నిలిచి సంతతము రవిలి దుస్సహసంతాపమును గల్గింపక పోలేదు. ఇట్లుండ "గోటిచుట్టుపై రోకటిపోటు"న్నట్లు తదీయజనయిత్రి కాలధర్మము నొంది యాదుఃఖమును మఱింత వర్ధింపఁజేసెను. సంతతదుఃఖాగ్నిజ్వాలలమూలమున నామెశరీరము క్రమముగా శుష్కింపసాగెను. ఆమె గృహకృత్యభారమునకుఁ దోడుగా నీదుఃఖభారమును గూడ సహించుచుఁ బుత్రికాపుత్రుల బాల్యచేష్టలను నగుమనముఁ గొంత యానందించుచు రాత్రిందివములు పతికి సకలోపచారము లొనర్చుచుఁ గాలముపుచ్చుచుండెను. దెబ్బతగిలినకాలికే దెబ్బతగులుట సహజము. ఆపన్నులకే యాపదలొదవుట వింత కాదు. ఈసమయమునందే నరసాంబ కనిష్ఠసోదరుఁడు మృతిచెంది యామె కధికదుఃఖ మొదవించెను. గ్రంథపఠనసామర్థ్యము లేకపోయినను దనకుమారునిచే భాగవతాదిగ్రంథములు చదివించి యలవఱచికొన్న జ్ఞానబలముచే నామె దుఃఖసహనపాటవ మభ్యసించి యుండుటచే నాదుఃఖముల నడఁచియుంపఁగల్గి యుండెను. కాని యాదుఃఖము లామెహృదయమును మాత్రము విడిచిపోలేదు. ఇట్లుండఁ గనిష్ఠసోదరుఁడు మృతినొందిన నాఁటినుండి నామెభర్త కాకస్మికముగ నొకరోగ ముద్భవించి మంచమునఁ గూలవేసెను. దానితో నరసాంబ ధైర్యము యథాయథలు కాఁజొచ్చెను తనపతిదేవత కెట్టికష్టము వచ్చునోయని భయపడసాగెను. నిద్రాహారములు మాని పతికిఁ బలువిధములగు మందు లిప్పించి సకలోపచారములు చేయనారంభించెను. ఏమయినను రోగము మరలుముఖమునకు రాలేదు. క్రమముగా వృద్ధిఁజొచ్చెను. రోగము హెచ్చినకొలఁదిని నరసాంబదుఃఖముగూడ హెచ్చఁదొడఁగెను. పతికి బాహ్యజ్ఞాన మంతరించినతోడనే నరసాంబబాహ్యజ్ఞానముగూడ నశించెను. అంతకుముందుఁ బ్రాణపదంబుగాఁ బెంచినపిల్లలు గోలుగోలున నేడ్చుచున్నను గాంచి యోదార్పకపోవుటయే యిందులకు నిదర్శనము. తనపతి మరణసానదశయందు నున్నాఁడని గ్రహించి యామె సమస్తబంధములను ద్రెంచుకొనెను. భర్త నధశ్శయనముచేయించిరి తోడనే నరసాంబ పతిప్రక్కఁజేరి నేలఁ బరుండి తనబాహులతను పతిమెడమీఁద బెనవేసి స్తబ్ధయై యుండెను. అంతట బతిప్రాణము లెగిరిపోయెను. పతితోఁ దన ప్రాణములనుగూడ విడువ యత్నించెను. ఆదుఃఖాతిరేకమునఁ దనప్రాణములను వదలఁగలనేమో యని యామె ప్రయత్నించెను. కాని మొండిప్రాణము లట్లుగలేదు. భర్తతోఁ బ్రాణత్యాగముచేసి తనశరీరమును బతిచితియందుఁ బతిశరీరముతో భస్మముచేయ యత్నించుచుండెను.

కాని యది యెట్లు సాధ్యమగును. యోగబలమున్నచో నట్లు చేయుటకుండియే నరసాంబ ప్రాణత్యాగము చేసియుండును. కాని యామె కట్టియదృష్టము లేనందులకు దుఃఖించెను. వెంటనే నూతఁబడి చావవలెనని పెక్కులు విధములు కల్పించుకొని పెరటిలోని కరుగ యత్నించెను. కాని యామెనిశ్చయము నెఱింగినసోము డీ

దరులు బంధువులు నామెను విడువలేదు. ఇంక నేమి చేయఁగలరు. పతితోఁగూడఁ బరలోకమున కేగలేక పోతి నన్నవిచారము తప్ప నామెకు రెండవవిచారము లేదు. అంతటఁ బతికి దహనసంస్కారాదు లొనర్పఁబడియె. నరసాంబకుఁ దిండియందుమనసు లేదు. నిద్రియందు లేదు. సంతానము నందులేదు. పరలోకగతుఁ డగుపతియందుఁదప్ప నామెమనస్సు వేఱెచ్చటను లేదు. ఆమె దుఃఖము పూర్తిగ విడిచిన ట్లగపడెను. అందువలన బందుగులు కొంత స్వస్థచిత్తులైరి. కానియామె యెప్పుడెట్టిసాహసమొనర్చునో యని కాచుకొనియేయుండిరి. అంత రాత్రి యేతెంచెను. నరసాంబ నొకగదిలోఁ బరుండఁజేసిరి. పిల్లలనిరువురను నామెకుఁ జెఱియొకపార్శ్వమునను బరుండఁజేసిరి. మఱినల్వురస్త్రీ లామెచుట్టును బండుకొనిరి. ఆమెసోదరులు ద్వారమున కడ్డముగా శయనించి యుండిరి. కాని యేమిలాభము? అర్ధరాత్రమునం దామె యందఱను దప్పించుకొనిపోయి నూతఁబడి ప్రాణములను ద్యజించి స్వర్గమార్గమధ్యమునందె పతిని గలిసికొని తన దృఢానురాగమును లోకమునకు వెల్లడించెను. ఆహా! అట్టిది కదా దంపతీప్రేమ.

---

# ఆత్మకు నిర్బంధము లేదు.

[అష్టావధాని - వడ్డాది సీతారామాంజనేయులుగారు.]

౧

రాతిగోడలు క్రమ్మమాత్రమునఁ జెఱయె?
బలిసి యినుపత ల్పున్న నే పంజరంబె?
శాంతు లగుమహాత్ములకు బుష్యాశ్రమంబు
గాదె! నిర్బంధ మాత్మకు లేదు లేదు.

౨

నాదుప్రేమకు స్వేచ్ఛ యున్నదియె యేని
ఆత్మసీమ స్వతంత్రుఁడ నైతి నేను
మహిని దైవాంశ కలవారె మహిమమీఱ
నిందుస్వాతంత్ర్య మంది మించెదరు సతము.

3

ఎంతవఱకుచూపులువాఱు నంతవఱకుఁ
గలప్రదేశంబు బంధనాగారమె సుమ
కనుల కందనియాచోటె గద యనంత
ఘదవియును, స్వేచ్ఛ నిండారుసదన మహహా!

---

# గదబలు

[గొడవర్తి రామదాసుగారు, బి. ఎ. ఎల్. టి.]

విశాఖపట్నంజిల్లాకొండలలో నుండు జాతులలో గదబలొకరు. వీరు సవరలవలె ముండారీ లేక (శబర) జాతులలో జేరినవారు. వీ రచ్చటచ్చట జెదరియుండుటచే వీరివిషయమై యేమి తెలిసికొనుటయు దుర్లభమే. అయిననూ నవకాశమైనప్పుడెల్లను వీరి విషయమైన భోగట్టా సంపాదించియు, లోగడ వీరివిషయమైన భోగట్టాను బ్రచురము చేసినవారివ్రాతల ననుసరించియు, నిచ్చట సమకూర్చి యీజాతివారినిగుఱించి వ్రాయబూనుకొంటిని.

ప్రస్తుతకాలమందు గదబ లనేకవృత్తుల నవలంబించి బ్రతుకుచున్నారు. కొంతమంది వ్యవసాయము జేయుచున్నారు. కొంతమంది యడవిలో బిట్టలు మొదలైనవానిని బట్టి బ్రతుకుచున్నారు. మఱికొంతమంది సవారీలు మోయువృత్తి నవలంబించియున్నారు. వీరి జాతికి నిర్ణీతమైనవృత్తి చేపలు పట్టి జీవించుటవలె నగపడుచున్నది. ఏజాతియొక్కటైనను సహజవృత్తిని గ్రహించవలెనన్న, నాజాతివారు వివాహకర్మలయందు, నపరక్రియలయందును, శ్రద్ధగా నాచరించు సాంప్రదాయకములను బాగుగ గమనింపవలెను. భాష, దుస్తులు, నలంకారములు మాఱినను మాఱునుగాని పెండ్లిపెడాకులనాడు మాత్రము పూర్వాచారములను విడువనేరరు. గదబజనుడు మృతుడైన వానివారు వానిని కాల్చియో పూడ్చియో వచ్చి గెడ్డలో స్నానమాచరించి, చేపలను బట్టి, యింటికి తీసుకువెళ్ళి చిన్నపిడకతో నింతయన్నమును, మఱియొకపిడకతో నీచేపలను వండి స్మశానమునకు వెళ్ళుత్రోవలో వీనిని వదలివత్తురు. దానితో ప్రేతకు తృప్తికలుగునట. వివాహకాలమందు గెడ్డలోబట్టి తెచ్చిన చేపలనే ముఖ్యముగా వండవలెనట. వీరు సాధారణముగా గెడ్డలయొద్దనే నివసించెదరు గెడ్డలతో సంబంధిన వారే గనుక వీరికి 'గదబ' లని (గెడ్డ లేకగాడ + బ = గదబ) పేరువచ్చెనని నేదలచెదను.

గోదావరియొద్దనుండి వచ్చినవారు గాన వీరికీపేరు వచ్చెనని కొందఱనుకొనెదరు కాని ప్రస్తుతము గదబలు నివసించియున్న స్థలములను గుర్తించి చూచిన గోదావరీనదితో సంబంధమేమున్నట్లు తోపదు గంజాం విశాఖపట్నంజిల్లాల మాలయాలలోను, బస్తరు కలాహండీరాజ్యములలోను వీరు విస్తారముగా నున్నారు. ఇంతేగాక యాచారవ్యవహారములలోను వీరు సవర, పర్జా, సంతాలీ, ముండారీ మొదలైన మధ్యహిందూస్థానజాతులవారలతో సంబంధము గలిగియున్నట్లు గనపడెదరు. ఈయంశములనుబట్టి యాలోచింప గోదావరి నదికిని వీరికిని యేవిధమైనసంబంధ మున్నట్లు తోచదు.

## గదబలలో నైదు తెగ లున్నవి:—

1 పెద్ద లేక గుటాబ్ గదబలు:—వీరియాడవారు చెవులకు పెద్ద యిత్తడితీగచుట్లు పెట్టుకొందురు. కట్టుకొనెడు బట్టలకు నెఱ్ఱనీలిబద్దెలు పెద్దవి యుండును.

2 పారెంగ్ గదబలు:— చెవులకు బెట్టుకొనె యిత్తడిచుట్లు చిన్నవి. ముక్కుకు కమ్ములుండును. కట్టుబట్టలకు సన్నని దోరిచారలుండును.

3 ఒలార్ గదబలు:— పారెంగ్ గదబలవలెనే యలంకారములు, బట్టలుండునేగాని మొలచుట్టును నొక చిక్కుప్రతాళ్ళను ధరింతురు.

4 కాపుగదబలు:— తెలుగుదేశములో నేజాతివారైనను, వారివారి స్వజాతి మర్యాదలనుమాని తెలుగు దేశాచారముల నవలంబించినవారికి "కాపు"లనే యొక యుపపదమును జేర్చి చెప్పుట యాచారము. అట్టివారే యీకాపుగదబలు; గంజాంజిల్లాలో కాపుసవరలున్నారు.

అలంకారములు:— ఈజాతిలో పురుషు లంతయలంకరించుకొనరు. అలంకారములెల్ల నాడువారికే. ప్రతినిత్యము ప్రతిస్త్రీ పాగ్డునవే తల దువ్వుకొని తలకు నిత్తడిదిగాని, సత్తుదిగాని లేక గవ్వలతో జేసినది

గాని, యొక చక్రమును ధరించును. తలజుత్తు శృంగారము చాలా పట్టింపు. అందులకే ప్రతిగదబస్త్రీయు మెడలో నొకయద్దమును, నొకదువ్వెనను వ్రేలగట్టికొనును. చెవులకు నిత్తడితీగెలచుట్లు పెద్దవియో చిన్నవియో పెట్టుకొందురు. మీదజెప్పినట్లుకొన్నితెగలవారు ముక్కులకు గమ్ములనుగూడ ధరియింతురు. చేతులకు నిత్తడివియో కంచువియో కడియము లుండును. ఇవి చీలమండ మొదలు మోచేయిపర్యంత ముండును. గాజులుగూడ నీజాతులవారు ధరించెదరు గాని యొక్క యెడమచేతికే. మెడయందు గంటెలు, పూసలతో గూర్చిన హారములు, వేసికొనియెదరు. కాళ్లకు నందెలు, కాలి వ్రేళ్ళకు పిల్లాళ్లు, మువ్వలు పెట్టికొనియెదరు.

స్త్రీలు ధరించెడి బట్టలు రెండు. ఒకటి కట్టుకొనుటకు, రెండవది పైటగా వేసికొనుటకు. ఒక్కొక్కటి మూడుమూళ్ళు పొడవుండును. ఈబట్టలు స్త్రీలే స్వంతముగా నేయుదురు గదబలలో తాను గట్టుకొను బట్ట తానే నేసికొనే పర్యంతము స్త్రీలు వివాహయోగ్యలు గారు. 'కెరంగ్' అను నొకవిధమైన యడవి మొక్కనారతో నీబట్టలు నేయుదురు. మధ్యమధ్యను నిలువుబద్దె లెఱ్ఱనివి, నీలివి పెట్టి నేయుదురు. ఈబద్దెలుండు స్థలములలోని దారములకు రంగు సహజములైన దినుసులతోనే వేయుదురు. సీమనూలు వచ్చిననాటనుండి బట్టకు సీమనూలును, పడుగుకు 'కెరంగ్' నారయు వేయుచున్నారు.

ఈకాలములో పట్నములచెంత జేరిన గదబస్త్రీలు వారి నైసర్గికాలంకారములను విడచి పట్నవాసపువస్తువులను, నలంకారములను, ధరియించుచున్నారు. గదబలు పయ్యెద నెడమభుజముపైనుండిగా వేయుదురు.

గ్రామకూటము:—గదబ లందఱు నొక్కస్థలమందే యిండ్లుకట్టుకొని నివసించెదరు గ్రామమున నొకనాయకు డుండును. గ్రామములో దగవులన్నియు నతడు నాగ్రామములోని పెద్దలతోకూడ గలసి తీర్మానించును. అట్టి న్యాయనిర్ణయములో నాడువారుగూడ గలియవచ్చును. ప్రతిగ్రామమందును పెండ్లిపేరంటకములు జేయించుట కొకపురోహితుడు (దిసారి) ను, మంత్రతంత్రవైద్యములు జేయుట కొకబెజును యుందురు.

ప్రతిగ్రామమందును యువకులు, యువతులు రాత్రులయందు వేర్వేరుగా బవళించుటకు ప్రత్యేకగృహము లుండును. యువకు లందఱు నొక గృహమందును, యువతీజన మందఱు మఱియొక గృహమందును శయనింతురు. ఒకరి శయనగృహమున కొకరు రాగూడదు. పడమవయసనగా కన్యలకు 12 సంవత్సరములును బాలురకు 16 సంవత్సరములు ప్రాయము వచ్చినతోడనే వారు వారివారి శయనగృహములయందు బవళించవలెను. వివాహమైన తరువాతనే వీరియిండ్లలో పండుకొనుట మానవలెను.

యువకుల కొక యజమానుని యువతుల కొక యజమానిని వారలలోని వారినే నియమింతురు. ఆ యజమానుల యాజ్ఞానుసారము మిగతావా రందఱు నడచుకొనవలెను. ఉదయమున లేచినతోడనే యెవరిగృహమును వారు శుభ్రపఱచుకొనవలెను.

వివాహములు:— స్త్రీలకు వ్యక్తురాండ్రైన తరువాతనే వివాహము జేయుదురు. మగపిల్లవాడు వివాహయోగ్యుడైన తోడనే వాని తల్లిదండ్రులు కన్యను విచారింప బ్రయత్నించెదరు. గదబలలో గోత్రము లున్నవి. సగోత్రికుల పిల్లలను వివాహము చేసికొనరు. కాన నితర గోత్రికురాలును, యుక్తవయస్సు వచ్చిన యువతిని విచారించెదరు. ఇందులో మగపిల్లవాని యిష్టాయిష్టములను జూచెదరు. ఏయువతిని దమపిల్లవాడు కోరియున్నాడో యట్టి పిల్లయింటికి కొంచెము భత్యమును, మద్యమును పిల్లవాని తలిదండ్రులు పట్టించుకొని వెళ్లి పిల్లదాని తలిదండ్రులకు నిచ్చెదరు. 'ఏమికార్యమునైన మీరు వచ్చితిర'ని పిల్లదాని తలిదండ్రు లడుగగా, 'ఏమీలేదు- మీతో నొక చిన్న యవసర మున్నద'ని జబాబు జెప్పి తిరిగి యింటికి వచ్చెదరు. మఱికొన్నాళ్ల వరకు నాప్రశంసయే చేయరు. ఒకటి రెండు మాసములు గతించినవెనుక మఱిన్ని బియ్యమును, సారాయియు పెట్టి మధ్యవర్తిని యొకరిని నంపెదరు. అతను వాటిని పిల్లదానితలిదండ్రుల కిచ్చి పిల్లను తమపిల్లవాని కిచ్చి వివాహము జేయుమని యడుగును. వారి కిష్టము లేనిచో నట్లు చెప్పి తెచ్చిన కానుకలను త్రిప్పి వేయుదురు. ఇష్టమున్న యెడల, 'సరే ఇంకను మాలో చిన్న పెద లున్నా

రుగదా! వారలతో నాలోచించి చెప్పెదము' ని చెప్పి తాంబూల మందుకొని పంపివేతురు. మఱికొన్నాళ్ళు పోయినతర్వాత మూడుకాళ్ళసారాయి పట్టించుకొని మధ్యవర్తిని దోడ్కొని బంధుమిత్రులతోగూడ పిల్లవాని తండ్రి వెళ్ళును. సారాయిని పిల్లదాని యింటివాకిట బెట్టి వివాహప్రశంస చేయగా, పిల్లదాని బంధుమిత్రులు యావన్మంది సమావేశమై యిచ్చి పుచ్చుకొనుటవిషయమై చర్చించెదరు. పిల్లదానివిషయమై దానితండ్రి కీయవలసిన శుల్కము, మొదలైనవాటి విషయమై యంతయు నచ్చటనే నిశ్చయింపబడును. కన్యాశుల్కము సుమారు రు 20 మొదలు రు 60 వఱ కుండును. అటుపైన దిసారి వచ్చి వివాహము జరుగవలసిన దినము మొదలైనవి నిశ్చయించును. ఇట్లు అంతయు నిశ్చయమైనపైని దెచ్చినసారాయి వీరు వారు నందరు గలసి త్రాగుదురు.

వివాహదినమున బెండ్లికొడుకును దీసికొని, వాని తలిదండ్రులు బంధుమిత్రులు వాయిద్యములతో బెండ్లికుమార్తె యింటికి వెళ్ళుదురు. అచ్చట వియ్యంకుని కొకరూపాయి వివాహఖర్చునిమిత్తమును, వియ్యపురాలి కొక క్రొత్త బట్టయు, నొక యర్ధరూపాయియు, గ్రామ వధూజనమునకు, వారి చెలికత్తెను దీసికొనిపోవుచున్నందు కొక యర్ధరూపాయియు నిచ్చి, బెండ్లికుమార్తె కుడిచేతికి నిత్తడికడియములు పెండ్లికుమారుడే తొడగును. వెంటనే పెండ్లికుమార్తెను చేయి పట్టుకొని దీసికొని పోవ యత్నించును. ఆడపెండ్లివారంతా యాటంకపెట్టి, మగపెండ్లివారు నాడపెండ్లివారు దెబ్బలాడుకొని కొట్టుకొనునట్లు నటించెదరు. ఈవినోదము కొంత జరిగినపిమ్మట పెండ్లికూతును దీసికొని యుభయపక్షముల వారు వాయిద్యములతోగూడ పెండ్లికుమారుని యింటికి దిరిగి వత్తురు. వివాహ మంతయు నిచ్చటనే జరుగును.

పెండ్లికొడుకు నింటియొద్ద నొక పందిరివేసియుందురు. దానిమధ్య నొకగుగ్గిలపుకఱ్ఱ, నొకయడ్డగిల్లకఱ్ఱ, నొకవెదురుకఱ్ఱ, మూడునుగలిపి యొకటిగాగట్టి యొక్కరాటవలె పాతుదురు. ఈరాటప్రక్క నొక తిరగటి దిమ్మ వేయుదురు. దానిపైన పెండ్లికూతును గూర్చుండబెట్టుదురు. అచ్చటనున్న స్త్రీలందరు నావధూవరుల పైని పసుపుగుండయు, బసపుగలపిన నీరును జల్లుదురు. తరువాత వధూవరులను స్నానముచేయించి క్రొత్తబట్టలు గట్టింతురు. అప్పుడు దిసారివచ్చి పాణిగ్రహణము చేయించును. అందరూగలసి బాగా తిని త్రాగి గీతవాయిద్యములతో నాట్యమాడుదురు. ఇది మొదటిరోజు పెండ్లి.

రెండవదినము వధూవరులను దిరుగ బందిరిలోనికి దీసుకొనివత్తురు. ఈలోపున నందిరికి వెలుపల దానికి సమీపముగా కొంతమన్నును గుప్పవేసి యుంచెదరు. ఆమట్టిలోని మూడుచేరలు దీసి దిసారి పందిరిమధ్యను వేయును. తరువాత పెండ్లికొమారుడు, పెండ్లికుమార్తెయు నామిగిలిన మట్టిలో నీళ్లుబోసి బురదజేసి యందరిపైనను జేతురు. ఉభయపక్షములవారు జేరి యొకరిపై నొకరు బురదను జల్లుకొనియెదరు. ఇట్లు కొంతసేపు వినోదించి, గడ్డకుబోయి యందరూ స్నానము లాచరించెదరు. ఇంటికివచ్చి విందు లారగించి యున్మత్తులై వాయిద్యములు మ్రోగగా గంతులువేతురు. ఇందులో వధూవరులు గలయక వేరే గూర్చుని వినోదమును జూతురు.

భర్తృమరణానంతరము విధవ తిరుగా బెండ్లిజేసికొనవచ్చును. చచ్చినవాని తమ్ముడామెను వివాహమాడుట యుచితము. అతనిని వివాహమాడు టామె కిష్టము లేనియెడల నామెను వివాహమాడు పురుషుడు పెద్దలు నిర్ణయించిన శుల్కమును నామె మరదికి జెల్లించి యామెను గైకొనిపోవలెను. పురుషునకు దనభార్యయందు యిష్టములేక వదలివేసిన నాభార్యకు రెండురూకలిచ్చి విడియాకు లివ్వవచ్చును. స్త్రీకి పురుషునిపై నిష్టములేక విడిచి మఱియొకపురుషుని బెండ్లియాడిన నాపురుషుడు దాని ప్రథమభర్తకు బెద్దలు నిర్ణయించిన శుల్క మిచ్చుకోవలెను.

ఉత్సవములు:—సంవత్సరములో మూడుపండుగల నీజాతివారు విశేషవైభవముతో జేతురు. వసంతకాలమందు చైత్రపర్వము, వర్షాకాలమందు బలిజాత్ర, శీతకాలమందు పుష్యపర్వము.

1 చైత్రపర్వము:- చైత్రపౌర్ణమి మొదలు వైశాఖపౌర్ణమివఱకు నీయుత్సవము ప్రతిగ్రామమందును

జరుగును. ఈకాలములో గ్రామములో నున్న దృఢశరీరము గల యావన్మంది పురుషులు వనములోనికి వేటకు బోయెదరు. ఇంటియొద్దనున్న స్త్రీలలంకరించుకొని మంచివస్త్రములను, నలంకారములను, ధరించుకొని యాట, పాట, మొదలైనవినోదములను సలుపుదురు. వీరు మనోహరమైన స్వరముతో రమ్యమైన పాటల బాడెదరు. ఈ పాటలు స్త్రీపురుషులుగలసి వాక్యోపవాక్యములుగా బాడినప్పుడు వినతీరవలెను. ఈపాట పూర్వము దేవరిచేతను గల్పించినది గావు. అప్పటికప్పుడు సందర్భానుసారము స్త్రీలు స్త్రీవాక్యములు పురుషులు పురుషవాక్యములు గల్పించి పాడుదురు. పదప్రయోగము, కల్పనాచమత్కృతి, భావప్రదర్శనము మిక్కిలి యానంద దాయకములుగా నుండును. ఈకిరాతజాతివారి కీకవిత్వధార యెట్లు లభించెనా యని యనిపించును! యుక్తియుక్తములును గల స్త్రీపురుషులు పాడనారంభించిన చో నాపాట కంతమే యుండదు. పరపురుషుని సమర్థముగా బాడగలిగినవాడు లభించిన స్త్రీయొక్క చాతుర్యము యానందము జూచితీరవలెను. తన వాగ్ధోరణి, యుక్తులచే పురుషుని వీగగొట్టినచో నాపురుషుడామెకు నంజలిచేసి సెలవుపుచ్చుకొనును. స్త్రీయే వీగిపోయిన నా పురుషునకు విందుజేసి వానిని సంతోషపెట్టును. సాధారణముగా నవివాహితులైన యువతులే నట్టి పాటపాడుటకు బూనుకొనియెదరు. ఈపాటకు గూడ చైత్రపర్వ మనెదరు.

ఇక వేటకు వెళ్ళినపురుషులేదైన నొకజంతువును గొట్టి తెచ్చినను సరియే; లేకున్న వారిపై గ్రామస్త్రీలందఱును పేడనీళ్లు గొట్టి యవమానపఱచెదరు. ఏదైన జంతువు ననగా బులి, చిరుతపులి, కణుసు, మొదలైనవానిని జంపియుండినచో వారిలో నొక దూతకి పరుగెత్తి వచ్చి వర్తమానము నూరిలో జెప్పును. వెంటనే స్త్రీలందఱు బాగా నలంకరించుకొని వాద్యములను దీసికొని యడవిముఖమునకు వెళ్లుదురు. అప్పటికి వేటాడినవారందరు జంపిన జంతువును మోసికొని యచ్చటకు వచ్చియుందురు. వెనుకను నా మృగమును వారుమోసికొనిరాగా ముందర నీస్త్రీలందరును నాట్యమాడుచూ వాయిద్యములు వాయించుచు వెంటూ నూరిలోనికి వత్తురు. భోజనార్హమైన జంతువేదైన యెడల దానిని గోసి యందరును పంచికొనియెదరు. తినదగనిదియైనచో దానిచర్మమును మాత్రము జాగ్రత్తపెట్టియుంచెదరు. ఇట్లు నాలుగైదుదినములవరకు వేటలాడుదురు.

2 బల్లిజాత్ర:- ఈయుత్సవము భాద్రపదమాసములో జరుగును. చిన్నచిన్న మట్టిపాలికలలో నవధాన్యములు జల్లి వాటిని తొమ్మిదిరోజులకు బూజించుచు నాటపాటలలో వినోదముగా నుందురు. డప్పులు, తప్పెటలు వాయించుకొనుచు నాట్యమాడుదురు.

ఈయుత్సవములో ప్రధానపూజారికి కీరసాని (జెజ్జు) యని పేరు. ఇతను సాధారణముగా నపుంసకుడుగా జేయబడిన పురుషుడే. స్త్రీవేషధారి యట్టివాడు లభించనప్పుడు స్త్రీయే యాపనిని జేయును. పురుషులందరును తప్పెటలు మొదలైన వాద్యముల నేకధ్వనిపట్టునట్లు వాయించగా నీబృహన్నల ఖడ్గధారియై నాట్యమొనరించును. పురుషులు వివిధవినోదవేషములను ధరించి వినోదముగా దిరుగులాడుచుందురు. ఇట్లు తొమ్మిది రోజులు రాత్రింబవళ్ళు గడపి పదియవనాడు గ్రామస్థులందరు నేమములతోడను, వాద్యములతోడను బాలికలుంచినస్థలమునకు వచ్చి యచ్చట కొంత వినోదము గావించి బాలికలను దీసికొని యూరిమధ్యకు వెళ్ళుదురు. అచట కంటకాసనము గల యొకయుయ్యాల వేసియుండును. పాలికల నచ్చట యుంచి, కీరసాని కొంతసేపు నాట్య మాడును. తరువాత నాయుయ్యాలపై నధిష్ఠించి యూగును. ఆసమయమందు వానికి దేవత యావేశించు ననియు, నతడు కోరినకోరికల నెల్ల జెప్పుననియు నొక నమ్మకము.

3 పుష్యపర్వము:- ఇది పుష్యమాసములో జరుగును. ఇందు బంధుమిత్రులు గలసి భుజించి యాడుదురు. పిల్ల లింటింటికి ముష్టికి బాడుకుంటూ వెళ్ళుదురు.

పైన జెప్పిన యుత్సవములే గాక గ్రామములో విషూచి మొదలైన వ్యాధులు ఉత్పన్నమైనపుడుకూడ నుత్సవములు చేసి గ్రామమునకు దూరముగా వెళ్లి యచట నాదేవతలకు బలియిత్తురు. ఈయుత్సవములయందు దిసారియే ప్రధానుడు.

తినుబడిపదార్థములు:— గదబలు ముఖ్యముగా గెడ్డలలోనికిబోయి చేపలనుబట్టి తెచ్చి తిందురు. కడ్లు, చోళ్ళు, చామలు, ధాన్యజాతులలో వీరికి తెలిసినవి. వీటికే వీరిభాషలో ప్రత్యేకపదము లున్నవి. వెదురువేళ్లు, అడవిదుంపలు, పుట్టకొక్కు మొదలైన వనజములనుగూడ దిందురుగాని వీరు చేపలనిచ్చి వాటికి బదులుగా నీవస్తువులను బుచ్చుకొనియెదరు. పాములను (నాగుపాము వినా) కప్పలు, ఎద్రికాయలు, ఎలుకలు, కాకులు, గ్రద్దలు, కోళ్లు, పావురాలు, చిలుకలు, గోరింకలు మొదలైనవాటినెల్ల భుజించెదరు. నెమలిమాంసము బహుప్రీతికరము. ఆవుల నెనుములను బర్వకాలములయందు వధించి భుజింతురు. మధుపానమందు జాల ప్రీతి. ఇప్పపువ్వుల నేరి యెండబెట్టి సారాయి జేతురు. చోడిపిండి పులియబెట్టి 'లాంద' యను నొకమత్తుపదార్థమును బర్వదినములలో జేతురు. సారాయిని గాని యీ లాందనుగాని వీ రాకుదొప్పలలో బోసికొని త్రాగుటకుముందు కుడిచేయి వ్రేలితో మూడుసార్లు పైని జిలకించెదరు. ఇది వారి పెద్దలకొరకట. తరువాత త్రాగెదరు. తేనె దొరకినప్పుడు త్రాగెదరు. వెదురుబొంగులు దొలచి యొకవిధమైన కల్లుతుమ్మెద గుడ్లు పెట్టును. ఆగుడ్లనుదీసి తిందురు.

అపరక్రియలు:-గదబలలో బురుషులు మృతినొందిన గాల్తురు. స్త్రీలను బిల్లలను బూడ్తురు. మృతకళేబరమును స్మశానమునకు గొనిపోవునప్పుడా గ్రామములోని స్త్రీపురుషాదు లందరూగూడ వెంటవెళ్ళుదురు. ఆకళేబరమును గాల్చుటయో పూడ్చుటయో చేసినపైన యందఱు తిరిగివచ్చి గెడ్డలో స్నానమాచరింతురు. చచ్చినవానికొడుకో, యన్నదమ్ముడో యాగెడ్డలోనే కొన్ని చేపలనుబట్టి యింటికి దెచ్చును. ఈమత్స్యములనొకమట్టిపిడతలోను, మరియొకపిడతలో నన్నమును వండి, యీరెండుపిడతలు స్మశానమునకు వెళ్ళుత్రోవలో ప్రేతతృప్త్యర్థమై విడతురు. ఏడవనాడు బంధుమిత్రులుగూడి మృతుడైన వానిపేరను అన్నము చేపలు వండి బలిప్రదానమిచ్చి తాము భుజింతురు. ఇంతటితో సజీవులైనవారికిని పరలోకగతులకును సంబంధ మింతటితో దీరలేదు. మృతుడైనవానిపేర నొకరాయి స్మశానమునుండి తీసికొనివచ్చి యింటివద్ద పూజ నొనర్చుచు మూడుసంవత్సరము లుంతురు. తరువాత జ్ఞాతిబంధువులందరికి 'గోత్రిము' చేయుదమని వర్తమానము నంపెదరు.

గోత్రిము:-ఎక్కడెక్కడున్న బంధుమిత్రులను బిలువనంపగా యజమానునికి సోదరులైన వారందరూ నొక్కొక యింటికి నొక్కొక యెనుముచొప్పున దీసుకొనితెత్తురు. అందరూ సమావేశమైన వెనుక రెండుమూడు దివసములవరకు విందులారగించి, యింటికెదుట బైలులో గుంజలుపాతి యొక్కొకదానికి నొక్కొక పశువుచొప్పున గట్టుదురు. వారివారి కుటుంబములో జచ్చినవారిపేరున నొక్కొక పశు వాకుటుంబము గట్టుదురు. ఇట్లు సోదరులైనవారే గట్టుదురు. అన్నిపశువులను గట్టిపైన యన్నిటిని కప్పివేసి బావలైనవారికి తీసుకుపొమ్మందురు. వారు వాటిని వెంటదరుముకొని చిన్నగొడ్డళ్ళు, పరశుగోళ్ళతోను నరకుదురు. అవి క్రిందబడినతోడనే వాటి గుదస్థానముగుండా జేయి లోపలికి దూర్చి ప్రేవులను పైకి బెరకి లాగుదురు. ఇట్లు యెవరికి దొరకిన మాంసమును వారు నోడిలో బెట్టుకొని పోదురు. ఒకడు మాంసమును బెరకుసమయమున మరియొకడువచ్చి గొడ్డలితో వానిని గొట్టగా వాడాదెబ్బ కోర్చియుండిన సరియే; లేనిచో వానిని త్రోసివేసి యాకొట్టినవాడు మాంసమును బెఱుకనారంభించును. ఇట్లు నొకరి నొకరు కొట్టుకొని మరియామిషాకర్షణ మొనరింతురు. గోత్రిమును గదబలు జేయుచుండగా జూచిన జాల ఘోరముగానుండును.

శానాకాలమునుండి విడిపోయి దూరస్థలములకు బోయిన నొక్క కుటుంబీకు లనేకము జేయు సంస్కారమిది యైనట్టుల దోచుచున్నది. గోత్రిము గలుపుకొనుట కీకర్మ నిర్ణయించబడ్డది గాన దీనికి గోత్రిమని పేరు.

భాష:— ఈజాతివారిభాష శబరభాషలలోనిది. ఈశబరభాషలకే పాశ్చాత్యులు మూండారీభాషలని యనిరి. గదబలు దేశమందు జెదరిపోయి తెలుగుదేశమందు గొందలు, నోఢ్రదేశమందు గొందలు, కొందుగొందులతో కలసిపోయి కొందఱు నిట్లుండుటచే వారి స్వభాష చాలామట్టుకు మిశ్రమైపోయినది. స్వచ్ఛమైన గదబభాషను సంపాదింపవలెనన్న నీకాలమందు దుర్ల

భము. అందులోనను నొకేస్థలమందున్న నావంటి వారికి మతీను స్థానము. గదబలు కొండలలోను నడవులలోను మారుమూలలలో నుందురు. అట్టివారే యితరభాషసంపర్కము లేనివాక్కులను మాట్లాడెదరు అట్టివారితో గలసిమెలసి యుండనేదప్ప వారిభాషాసాంప్రదాయమును నభ్యసించనేరము. అయినను గొంతపరిశ్రమచేసి సంపాదించిన గదబభాషాపదములను బొందుపఱచి యిచ్చట వ్రాసెదను.

నామవాచకములు- ఏకవచనము, బహువచనము మాత్రమే గలవు నేక్, నాన్, ని యను ప్రత్యయముల వలన బహువచనము తెలియజేయబడును. ఈ దిగువను కొన్ని నామవాచకములను నుదాహరించెదను.

(శరీరావయవములు)

| తెలుగుపదము. | గదబపదము. |
|---|---|
| 1 చెయ్యి | తిత్తి, తీతి (సెయ్యి) |
| 2 పాదము | సుసంగ్, ఘుసంగ్ (పావల) |
| 3 ముక్కు | మి (మువ్వ) |
| 4 కన్ను | మో (మా) |
| 5 నోరు | సార్కో (తోవో) |
| 6 పల్లు | గిసే (జీ) |
| 7 చెవి | లిత్తిర్, లిత్తిర్ (లావ్వో) |
| 8 జుత్తు | ఇగ్సో, ఇంగ్సో (తికోకుయి) |
| 9 తల | బోక్ (భో) |
| 10 నాలుక | లఆంగ్ (లాకు) |
| 11 కడుపు (పొట్టు) | సులోయి (పుటాని) |
| 12 వీపు | గిఇడాంగ్ (హాడుమిన్న) |

(బంధువులు.)

| తెలుగుపదము. | గదబపదము. |
|---|---|
| 13 తండ్రి | ఆపాంగ్ (అబ్బానీ) |
| 14 తల్లి | ఈయోంగ్ (అయ్యానీ) |
| 15 అన్న | బ్యాడిగ్ (అన్నానీ) |
| 16 తోబుట్టువు | మిమింగ్, తోనాక్ (తోన్నానీ) |
| 17 మనిషి (మొగవాడు) | రేమల్, గండాని, తేరమ్ |
| 18 ఆడమనిషి | కుంబై (గున్ని) అపుక్ |
| 19 పెండ్లాము | కుంబై (కాడమాని) |
| 20 కొడుకు | ఒడుఅక్ (బొబ్బాగి) |
| 21 కూతురు | ఒనోఅక్ (కొడస్మే) |
| 22 మొగపిల్లవాడు | ఒఓక్ |
| 23 ఆడపిల్ల | గుగాయి |
| 24 కోడలు | ఇంబింగ్ |
| 25 పినతల్లి | బుట్యం |
| 26 పెద్దతల్లి | మొడియం |
| 27 పొడుగుమనిషి | తియ్యార్ రేమల్ |

(జంతువులు.)

| తెలుగుపదము. | గదబపదము. |
|---|---|
| 28 గుఱ్ఱము | కిర్తా, కిర్కాక్, కిర్తాన, కిర్కాక్ |
| 29 ఆవు | కిట్టియక్, బండి, కిఇటాంగ్ (కుఇటాంగ్) |
| 30 కుక్క | ఘుసో (కుస్సో) |
| 31 ఎనుము | బొంగ్ తెలి, బొంగ్ టేల్ |
| 32 ఏనుగు | కో |
| 33 పిల్లి | గిరేమ్, (రుమాంగ్) |
| 34 కోడి | ఘిసింగ్, ఘుసాంగ్ డాంగ్ (కాడారు) |
| 35 కాకి | గుగ్యా |
| 36 బాతు | గాగు |
| 37 గ్రద్ద | యుంతో |
| 38 గాడిద | గద్దె (గడోడి) |
| 39 లేడి | ఆలు (హార్న) c. f. హరిణం |
| 40 మేకలు | గిమే (కిన్కె) |
| 41 పందికొక్కు | గిబ్బి |
| 42 కోతి | గుస్వా |
| 43 పెలుగుబంటి | గుబో |
| 44 పులి | గిక్కుల్ |
| 45 పాము | బుడుబు |
| 46 చేప | ఆఆడ్సోమ్, అడ్డోమ్ |
| 47 దోమ | కిరిగిక్ |

## (చెట్లు, చేమలు.)

| తెనుగుపదము. | గదబపదము. |
|---|---|
| 48 పువ్వు | సరి c. f. సరము, సరిగ |
| 49 ఆకు | ఒల్లా, వొల్వ |
| 50 చెట్టు | ముంగణ్ |
| 51 అరటిపండ్లు | వుసుబుల్లు |
| 52 చామలు | ఇరి |
| 53 జొన్నలు | సాఅమెల్ |
| 54 ధాన్యము | కెరంగ్ |
| 55 బియ్యము | రుకు |
| 56 అంబలి | ఇడ్డా |
| 57 కూర | మా |

## (ఇతరములు)

| | |
|---|---|
| 58 కొండ | బిరంగ్, బిరణ్ |
| 59 ఏరు | కిండియా |
| 60 నీరు | డాc, డా |
| 61 ఊరు | ముంగల్ |
| 62 ఇల్లు | డియేణ్, అసూణ్ (ఇల్లు) |
| 63 పేరు | ఇమ్మి |
| 64 రాయి | బిరేల్ |
| 65 ఉప్పు | బిత్తి, బిట్టి |
| 66 వంటచెఱకు | సోఅల్ c. f. సమిధలు |
| 67 నిప్పు | సుఓల్ (కుదం)c. f. కుంపం |
| 68 దేముడు | కీటుఅణ్ |
| 69 దయ్యము | సెఆరాఇ |
| 70 సూర్యుడు | సీఇ, సింజీ |
| 71 చంద్రుడు | అర్కి |
| 72 నక్షత్రము | పోటీ.గ్ |
| 73 గొల్లవాడు | ధొర |
| 74 వ్యవసాయదారుడు | సునీంగ్, వొరుల్లేకు |

## సర్వనామములు.

| | |
|---|---|
| 75 నేను | నీ, నింగ్ |
| 76 మేము | నేఇంగ్ |
| 77 నీవు, మీరు | నోమ్ |
| 78 వాడు | మాయ్ |
| 79 వారు | మాయ్ కేణ్ |

## విశేషణములు.

| తెనుగుపదము. | గదబపదము. |
|---|---|
| 80 ఆకుపచ్చ | పసరు |
| 81 పచ్చ | యాట్రో, యెఱో |
| 82 చేదు | వుసమ్ c. f. విషము (చేదు విషం) |
| 83 పులుపు |ససో |
| 84 తియ్యని | సుబ్బల్ |
| 85 నలుని | యిస్నాయ్ |
| 86 తెల్లని | తత్తార్ |
| 8 నల్లని | రుంగో |
| 88 వంకైన | సెగ్డో |
| 89 దూరమైన | సులోమ్ |
| 90 సదునైన | లెక్కో |
| 91 మంచి | లిమ్మొకా, లెక్కో |
| 92 గొప్ప | ముడో |
| 93 వేడి | గప్ గవ్ |
| 94 తేలిక | లియా |
| 95 చిన్న | ఖండికి, వెంజెస్ |
| 96 పొడవైన | తియ్యాక్ |
| 97 విశేషమైన | లాంగ |
| 98 దగ్గర | ఒక్ బణ్ |
| 99 పచ్చి (పండని) | బాలు కా |
| 100 యెఱ్ఱని | బెరేణ్ |
| 101 పండిన | బుల్లు |
| 102 కుంకుమని | కుంకుమణ్ |
| 103 పొట్టి | టిల్లె |
| 104 పలచన | పలసన |
| 105 ఒకటి | మూయ్ |
| 106 రెండు | ఉమ్బార్ |
| 107 మూడు | ఇగ్గేణ్ |
| 108 నాలుగు | ఫూణ్, ఫూంజ c. f. ఫుంజకుప్పే |
| 109 ఐదు | మొల్లాయి |
| 110 ఆరు | తీయార్ |
| 111 ఏడు | తీయార్ మూయ్ |

| తెనుగుపదము | గదబపదము. | తెనుగుపదము. | గదబపదము. |
|---|---|---|---|
| 112 ఎనిమిది | ఉంబర్ పుంజ | 124 వినుట | వణ్ |
| 113 తొమ్మిది | ఉంబర్ పుంజమూయ్ | 125 పరుగెత్తుట | డుఆ |
| 114 పది | ఉంబర్ ఉంబ | 126 నవ్వుట | ఒడ్డో |
| 115 ఎత్తైన | తీర్ | 127 ఎత్తుట | వేణ్ |

| క్రియలు. | | అవ్యయములు. | |
|---|---|---|---|
| 116 వెళ్ళుట | ఇయా (యో) c. f. యా (సంస్కృతము) | 128 క్రింద | అలోమే c. f. అనులోమము |
| 117 తినుట | సోమ్ (గా) | 129 లేదు, కాదు | పురె, ఉరా |
| 118 కూర్చొనుట | లేఇసా (కూరుచున) | 130 మీద | తీర్ |
| 119 వచ్చుట | అలో (వాయి) | 131 అవును | ఉంగ్ టేణ్, ఉఁ |
| 120 చంపుట | ఒగోయ్ | 132 వెనుక | గిఇడింగ్ |
| 121 చచ్చుట | గోఇగు (కిత్తుడమ్) | 133 ఇవాళ | ఉసంగ్ |
| 122 కొట్టుట | బుగ్టో (లా) | 134 రేపు | బిర్ |
| 123 నిలుచుట | తునాణ్ (తినాంగ్) | 135 ఎల్లుండి | మార్తన్ |

---

# పలుకరింపు.

[భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారు.]

మాటిమాటికి అవ్యక్తమధురనిస్వ
నముల - ప్రేమస్వరూపి - ఆనందగీతి
ఎవరిఁగూరిచి - ఏమని - ఎప్పుడు నీవు
పాడుచుందువో చెప్పుము పరస్రవంతి !

---

# వరాన్వేషణము.

[కాళ్ళకూరి రామమూర్తిగారు]

సీ. అస్తమించెను పశ్చిమాంభోధిఁ బ్రవ్వన రక్తరంజితాస్యరాగరేఖ;
విన్నవోయెను కాంతి వీడి దిక్చక్రంబు యామినీకాంతు నెయ్యమునుగూడి;
వఱతెంచుచుండె దిగ్భాగంబులందుండి పశుబృందములను సంభారవంబు;
తడఁబాటుపడియె సంధ్యాచుపతంగశ్రేణి చనఁ గాంతుఁ గనలేక చక్రవాకి;

గీ. మించి వీతెంచె బాలసమీరములును; ఆలమందల వెంట గోపాలబాలు
రరుగుదెంచిరి; నీరాక తెరవు లేదు; సుకృతి యెందుంటివోయి కిశోరమూర్తి!

సీ. బాలసమీరసంచాలితకల్లోలవారిపూరితసరోవరములదరి,
వివిధవర్ణవిలాసవిభవంబులను బొల్చురమణీయలతలతాంతములగముల,
బహుపుష్పగంధసంపత్పరంపరలభారమున మందమగువాతములననుమ
సంపూర్ణపూర్ణిమాసాంద్రచంద్రద్యుతుల్ పర్వె నుపచ్చికబయలులందు

గీ. వన్నెగుల్కెడు లేమావిగున్నచెంత, వేణువును బూని విన్పింప మొదవ
గోపికలు గోగణంబులు గోరి వినఁగఁ, బాడరమ్మిక బాలగోపాలమూర్తి!

సీ. తేఁటిదాఁటుల మించి దీప్తివమ్ముంగురుల్ చెదరి ఫాలంబునఁ జిందులాడ
పొందుగా నొసటను సిందూరతిలకంబు కమ్మకస్తూరితావి గుమ్మరింప
పండువెన్నెలఁ గేరుచుండెడు లేనవ్వు లధరరాగద్యుతి నతిశయింప
కమనీయరుచిఁ బొల్చుకౌస్తుభాభరణంబు కంఠసీమను వింతకాంతి గులుక

గీ. గజ్జెలందెలు కాళ్ళను గల్లుమనఁగ, మురళి చేఁబూని గోపికల్ మురులుగొనఁగ
భువనమోహన మగునీదు పుణ్యమూర్తి, జూపి పాలింపు బాలకిశోరమూర్తి!!

---

# మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు రంగాచార్యులు అయ్యవారలుగారి జీవితచారిత్రము.

[పబ్బిపీసు సత్యకేశవరావుగారు]

శ్రీమత్పరవస్తువంశంబునకుఁ గావేరీతీరస్థంబైన యరణిపురము జన్మస్థానము. అందా వంశంబున కాదిపురుషుండగు పెరుమాళ్వాను నివసించుచుండె. ఆతండు వైష్ణవుఁడు; భారద్వాజగోత్రుఁడు; ద్రాహ్యాయణ సూత్రుఁడు. ఆతనివంశస్థులు యజ్ఞయాగంబులం దౌద్గాత్ర మొనర్చుచుండిరి. వారికి సామశాఖవారను పేరుగూడఁ గలదు. సామగానమునందు వారికి నసమానప్రజ్ఞ గలిగి యుండుటయే యిందులకుం గలకారణము. పెరుమాళ్వాను కెనిమిదవతరపువారు శ్రీ తిరుపతిక్షేత్రంబున కేతెంచిరి. వారిలోఁ బ్రధానుండు గోవిందదాసరప్పన్. ఆతండు పండితుండు, భాషాయోషావరణాపాత్రుఁడై గీర్వాణభాషానర్గళపాండిత్యము వడసిన యావంశస్థులం దాతండు ప్రధానుండు. ఆతండు మనవాళమహాముని కడ ద్రావిడవేదంబును సరహస్యంబుగ నభ్యసించి, యామ్నాయశ్రేష్ఠునిచే సత్పరిగ్రహంబులుగ నెన్నుకొనంబడిన పండితశిరోమణులలో నొకశిరోమణియై విలసిల్లె. "*పట్టర్పిరాన్" అనుబిరుదుగూడ నాతనికిఁ గలదు.

కొంతకాలము గడచిన యనంతరము గోవిందదాసరప్పన్ యొక్క యెనిమిదవతరంపువారు వేంకటగిరి సంస్థానంబునకు వచ్చిరి. వారిలో రఘునాథాచార్యులు, రామానుజాచార్యులు ననువారు ముఖ్యులు. వారు సోదరులు; పండితులు. వేంకటగిరిరాజు, వారిపాండిత్యప్రతిభకు మెచ్చుకొంది, వారికి బోయనపుంటు, గొల్లపాలెము ననగ్రహారంబులఁ గానుకగ నొసంగెనఁట. కాని యాసోదరు లిద్దరును నా యగ్రహారంబులఁ జిరకాల మనుభవించినట్లు కానరాదు. ఏలయన వారిజ్ఞాతులీర్ష్యచే రఘునాథాచార్యునకుఁ గుక్కపాలతో నన్నముఁ బెట్టిరఁట. అంత నాతండు మతిభ్రష్టుండై మృతినొందెనఁట. రామానుజాచార్యులు రాచపుండువలన మృతినొందెనఁట. కాని యాతనికి శ్రీనివాసాచార్యులను పుత్రుండు గలఁడు. జనకుండు స్వర్గస్థుండగునప్పటి కబ్బాలుండు కడులేఁబ్రాయపువాఁడు. దాయాదు లాతని నెంచి యుపనయనంబు గావించిరి. ఆ బాలుని జ్ఞాతిపితృవ్యుండగు పెద్దవేంకటాచార్యు లాతనికి వైష్ణవమతసంప్రదాయంబులం గఱపె. ఇట్లుండ హైదరాలీ వేంకటగిరి ననేకపర్యాయములు ముట్టడించె. వానిబాధల కోర్వంజాలక యబ్బాలుని జననియుఁ బితామహియుఁ బితృష్వసయుఁ దోడ్కొని యాంధ్రదేశస్థం బగు విజయనగరంబున కేగి వారిచిరపరిచితులగు శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారిఁ గలిసికొనిరి.

విజయనగరంబున నబ్బాలుండు డెంచుమించు పదునాలుగువత్సరంబులప్రాయము వచ్చుగఱకు నుండి విద్యనభ్యసించి పండితుండయ్యె. పిమ్మట వివాహితుండు గాఁ దలంచి యప్పండితుండు జన్మభూమి యగు వేంకటగిరికిం బోఁ బయనమై, మార్గమధ్యంబున నీవిశాఖపట్టణంబున నాఁగి, ధన, విద్యాధనసంపన్నుండగు శ్రీ గోడే జగ్గారాయునిం జూడం బోయె. అంత నాధనికుం డప్పాండితయువకునిం గని గౌరవించె. అనంతరము గోడేవారివంశీయులచే నాయన శ్రీకోదండరామస్వామ్యాలయంబునకు †స్థానాచార్యుఁడుగ నియమింపఁబడె. ఈ యుద్యోగంబును బడయుటయే కాక, వారు స్వయముగ శ్రీవేంకటేశ్వర, రామానుజస్వామ్యాలయంబులను గట్టించిరి. శ్రీనివాసాచార్యులవారు, సంస్కృతభాషాభిమానులకుఁ గల్పతరువై విలసిల్లుచున్న "సర్వశబ్దసంబో

* "పట్టర్పిరాన్" అనుబిరుదు గలవానిని సంస్కృతంబున భట్టనాథుండని యందురు.

† స్థానాచార్యుఁడు: దేవోత్సవాదులు సక్రమంబుగ జరుగునట్లు చూచు నుద్యోగి.

ధిని" యను నిఘంటువును రచించిరి; భక్తిరత్నావళి, విశ్వగుణాదర్శ మను సంస్కృతగ్రంథంబులం దెనిఁగించిరి; హాయనక్షణసారంబును వ్రాసిరి

ఈపండితున కిద్దఱు పుత్రికలు నిద్దఱు పుత్రులుం గలరు. పుత్రికలలోఁ గడసాఁబిడ్డ రంగనాయకమ్మ. ఆమె కవయిత్రియనియు, శ్రీకృష్ణాభ్యుదయంబనుమూఁడశ్వాసంబులు గలతెనుంగుకావ్యంబును, స్త్రీవిద్యాసమర్థం బనువ్యాసంబును, రచించెననియుఁ దెలియవచ్చుచున్నది. కాని యాగ్రంథంబులలో మొదటిది కానరాదు. కాలగర్భంబునఁ గలిసియుండనోపు. శ్రీనివాసాచార్యపుత్రులందు రామానుజాచార్యులు జ్యేష్ఠుఁడు; వేంకటరంగాచార్యులు కనిష్ఠుఁడు. ఈసోదరులిర్వురు నించుమించుగ ద్వాదశవర్షప్రాయు లగువఱకు నిజజనకసాన్నిధ్యంబునఁ గావ్య, సాహిత్య, కవిత్వంబులనభ్యసించిరి. పిమ్మట జనకుండు స్వర్గస్థుండయ్యె. తండ్రి దివంబున కేగినయనంతరము జ్యేష్ఠుండు త్రింశద్వర్షప్రాయంబునఁ గాలధర్మంబు నొందె.

శ్రీనివాసాచార్యులవారి ద్వితీయపుత్రు లగు వేంకటరంగాచార్యులవారు మన కథానాయకులు. ఆయన ౧౭౪౪ చిత్రభానుసంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి మంగళవారంబున (క్రీ. శ. 1822 సం॥రం మే నెల 28 వ తేదీని) జన్మించిరి. ఆయనం గని ధన్యతం గాంచిన యమ్మ మంగమ్మ. ఆయన యెనిమిదవయేటఁ గుంభకర్ణవిజయం బను పేరం బరఁగు మూఁడశ్వాసంబులకావ్యంబును రచించిరి. "*యేనైశవేష్టమే వర్షే కావ్యం సంస్కృతభాషయా, కుంభకర్ణస్యవిజయం త్రిభిస్సర్గైర్వ్యరీరచన్" అను శ్లోకం బిందులకుం గఁప్రమాణము, దీనినిబట్టి శ్రీరంగాచార్యులవారు శైశవదశనుండియు నెంతమేధావంతులో యూహింప నగు. తండ్రిగారు గతించినయనంతరం బాచార్యులవారు పితృకృతగ్రంథంబులను, శ్రీమద్వేదాంతాచార్యకృతగ్రంథంబులను తదితరోద్గ్రంథంబులను స్వయముగఁ జదివి పాండిత్యంబు నలవడఁజేసికొనిరి; వ్యాకరణశాస్త్రంబునఁ గొంత శ్రీమాన్ రామానుజాచార్యులవారియొద్ద నభ్యసించిరి. తర్కశాస్త్రములో ననుమానఖండంబును బ్రహ్మశ్రీ కొండపల్లి వేంకటశాస్త్రులవారికడఁ బఠించిరి. శబ్దఖండంబును నవద్వీపపండితు లగు సదరమీన్సుబోధన మిశ్రిగారితోడఁ గృషిసల్పిరి. ఇవియే వీరు గురుశిష్యన్యాయంబున నలవడఁ జేసికొనినవిద్యలు. శేషించిన విద్యలను స్వయంకృషిచేతన నాయన యభ్యసించి విద్యాశిరోమణులై శాశ్వతయశోవంతులైరి. వీరు తొలుదొల్త నాంధ్రశాకుంతలము; ఆంధ్రకమలినీకలహంసిక యను గ్రంథంబులను వ్రాసిరి. శాకుంతలమును దెనిఁగించిన వారిలో వీరు మొదటివారు. వీ రిక్కార్యం బొనరించిన యనంతర మనేకసంవత్సరంబులు గతించువఱకు శాకుంతలాంధ్రీకరణంబులు వెలువడలేదు. తరువాతఁ బ్రచురింపఁబడిన యాంధ్రీకృతశాకుంతలంబులను నాచార్యులవారి యాంధ్రశాకుంతలమును గాకినాడనివాసు లగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు విమర్శించిరి. పై నుదహరింపఁబడిన గ్రంథరచనానంతర మాచార్యులవారు మంజులనైషధ మనుసంస్కృతనాటకమును రచించిరి. ఇది నలదమయంతులకథ. ఇం దేడంకములు గలవు. ఈనాటకము నాచార్యులవారు శిష్యప్రేరణంబున దినమున కొకయంకముచొప్పున నేడంకములను నేడు రోజులలో వ్రాసిరి; పిమ్మట వెలువడినది యాంగ్లాదిరాజ్యస్వాగతము. ఇది యొక చిన్నసంస్కృతకావ్యము. శ్రీవిక్టోరియామహారాజ్ఞిగారు "Empress of India" (ఎంప్రెస్ ఆఫ్ ఇండియా) యను బిరుదును వహించినసందర్భంబున ఢిల్లీనగరంబున జరిగినదర్బారున కిది పంపఁబడెను. సంస్కృతవ్యాకరణము బాలురకుఁగూడ సుబోధకర మగునట్లు చేయుటకు నాచార్యులవారు లఘువ్యాకరణ మను పేరుతో నొకగ్రంథమును వ్రాసిరి. ఇందు వీరియద్భుతవ్యాకరణపాండిత్యము తద్ధిత, కృదంతప్రకరణములవలనఁ దెలియఁగలదు. ఇంతియకాక వీరు బాలోపయుక్తంబులగు చిన్నపాత్రంబులను వ్రాయుటకూడఁ గలదు. వర్ణనిర్ణయము; కథాసంగ్రహము; బాలప్రాజ్ఞ సంవాదము మొదలగునవియిట్టివి. ఆంధ్రగీర్వాణభాషలయందసమానప్రజ్ఞఁగలయాచార్యులవారికి ద్రావిడభాషయందుఁ బాండిత్యమున్నదని వేఱుగ వ్రాయనవసరములేదు; అదివారిమాతృభాష; అందువారికిఁ

* చూ. లఘుశబ్దానుశాసనపీఠిక.

పాండిత్యము సహజము. తిరుప్పావై యను గ్రంథవ్యాఖ్యానమగు ప్రబోధికత్రింశద్వ్యాఖ్యయు, తిరుప్పల్లాండువ్యాఖ్యయు, రహస్యత్రయసంగ్రహము వారి ద్రవిడభాషాప్రావీణ్యమును జాటును.

భాషావిషయములందే కాక మతవిషయములందుం గూడ నాచార్యులవారు కృషి సల్పిరి. హిందూమతమును బ్రబోధించుటకు వీరు కొన్ని యుపన్యాసంబుల నిచ్చి వానిని సంగ్రహములను పేర నచ్చొత్తించి ప్రకటించిరి. ఈసంగ్రహము లన్నియు మొత్తము మీఁద ౨౩ ఇందుఁ గొన్ని యాధ్యాత్మికవిషయములును, కొన్ని సాంఘికవిషయములును గలవు. వీనియందు వీరిస్వతంత్రాభిప్రాయంబులు గలవు. వీరియంత్యదశయందు దశోపనిషత్తులను బద్యరూపంబున నాంధ్రీకరింప నిశ్చయించి యేకోపనిషత్తులను దెనిఁగించిరి. ఇవి కాక యాచార్యులవారు రచించిన మఱియొక మహోద్గ్రంథంబు గలదు; అది శబ్దార్థసర్వస్వము; దానిని వ్రాయుటకు నాయురు ౩౭ వయేటఁ (అనఁగా సిద్ధార్థిసంవత్సరంబున) బ్రారంభించి జీవితమునంతటిని ధారవోసిరి. కాని యాగ్రంథంబున "అ ఆ" యను నక్షరంబులమాత్రమే యచ్చొత్తింపంబడె. శేషించిన గ్రంథమంతయును బూర్తియైయున్నను నయ్యది జగద్వ్యాప్తిం జెందఁజాలకయున్నది. ఆగ్రంథమును బరవస్తువారు ప్రాణప్రదంబుగ భద్రపఱచి యున్నారు. ఎంతభద్రంబుగ నుంచినను నది క్రిమికీటకంబుల కెఱ యగుటకు నవకాశం బున్నది కదా! కావున యోభాషాభిమానులారా! ఆమహోద్గ్రంథంబు నచ్చువేయింపఁ ద్వరపడుఁడు. అట్టి గ్రంథం బలవడుట దుర్లభము. అదిఖిలమైనచో నట్టి గ్రంథమును వ్రాయుటకాని, వ్రాయించుటకాని దుస్సాధ్యము.

గ్రంథరచనయే కాక విద్యాదానము గూడ నీపండితుని ప్రధానాశయము. బాలురకు సంస్కృతవిద్య గఱపఁ గాయన క్రోధనసంవత్సరంబున నాల్గు విద్యాపాఠశాలను స్థాపించిరి. ఆపాఠశాలకు విజయనగర, బొబ్బిలి, సిరిపుర, జగ్గంపేట జమీందారులును, కార్మికల్ కలెక్టరును ధనసహాయ్యం బొనర్చుచుండిరి.

మార్తాండచండమయూఖతతి లోకంబున నానాముఖంబుల వ్యాప్తిం జెందుపగిది శ్రీవేంకటరంగాచార్యస్వర్గలాంధ్రగీర్వాణభాషాపాండిత్యప్రతిభ దేశంబున వ్యాపించె. క్ష్మానాథులెల్లరు నీపండితశిరోమణియెడ గౌరవాదరములఁ బ్రదర్శించుచుండిరి. వారిలోఁ బీఠికాపుర, బొబ్బిలి, సంగమవలస, వేంకటగిరి, మందసా జమీందారులు గొందఱు ప్రతిజమీందారుఁడును బ్రతిసంవత్సరము నాచార్యులవారికి ౧౧౬ రూపాయల బహుమానము నిచ్చుచుండిరి; తునిజమీందారు నెలకు రూ ౮౩-౫-౪ చొప్పున నేఁడాదికి వెయ్యిరూపాయల నిచ్చుచుండె. వైభవహీనంపఁబడిన రాజులందఱికంటె చీకటికోట, మైసూరు రాజు లాచార్యులవారి నధికముగ గౌరవించిరి. చీఁకటికోటరాజు ఆచార్యులవారికి నొక యగ్రహారంబు నొసంగె. మైసూరుదేశంబునకు నాచార్యులవారేగియుండ, వారినిఁ గోటకు రప్పించుటకై రాజు పల్లకీని, బోయీలను, నిషాన్‌బల్లెములబరకాళ్లను, తాషామర్పాలను, బిళ్ళబంట్రౌతులను బంపెను. వారికి సభాస్థలియందుఁ బృథగాసనము వేయించెను స్వయముగ రాజాచార్యులవారికిఁ బుష్పహారము వేసె; బంగారుతోడాలం దొడిగె. వేదోక్తాశీర్వచనమంత్రాక్షతఫలాదులం గైకొని, వాక్యార్థప్రసంగము విని, రాజు వారికి దుశ్శాలువలం గానుకగ నొసంగె; పండితపూర్ణసత్కారంబు గావించె.

రాజసన్మానము వడసినను నాచార్యులవారు రాజులకు లొంగియుండలేదు. ఆయన యేసంస్థానంబునకేఁగుదురో యాసంస్థానాధీశుఁడు దొలుదొల్త సింహాసనమునుండి లేచి యాయనకు నమస్కరింపవలెను. అచ్చటనుండి యాచార్యులవారు మఱలువప్పుడా సంస్థానాధీశుఁడు లేచి యాయనకు నమస్కరించి, యాశీర్వచనము వడసి సెలవు నొందవలయును. ఇట్లు గౌరవించు రాజసంస్థానంబునకే యాయన వెళ్ళుదురు. లేనిచో వారచ్చోటికిం బోరు. గౌరవవిషయంబునఁ బట్టుదలచేతనే యాచార్యులవారు విజయనగరసంస్థానంబునకుఁ బోనిచ్చగింపలేదు. చీఁకటికోటయాస్థానంబునకుం బోయి యచ్చటనుండి యాచార్యులవారు మఱలునప్పుడాసంస్థానాధీశుఁడు లేచి నమస్కరించి, యాయనకడ సెలవొందలేదను కారణంబున నారాజొసంగియుండిన యగ్రహారంబును దిరిగి యారాజునకు నాచార్యులవారిచ్చివేసిరి.

జమీందారులతోఁ బాటు ప్రభుత్వమువారు కూడ నాచార్యులవారిని గౌరవించుచుండిరి. వా రాచార్యులవారికి ౧౮౮౭ సం॥రం జూను ౩ వ తేదీని "మహామహోపాధ్యాయ" బిరుదము నొసంగిరి. ౧౮౭౮ వ సంవత్సరంబునఁ జేయఁబడిన యాయుధశాసనమునకుఁ గట్టుపడకుండ నాయుధసహాయన్యాయుధముల నుంచుకొనుటకు ననుజ్ఞ నిచ్చిరి. ఇంతియకాక మతవిషయములఁ గూర్చి న్యాయమూర్తులు తీర్పు నియ్యవలసివచ్చినపుడు వీరితో నావిషయముగూర్చి ప్రసంగించుచుండిరి.

ప్రభుత్వోద్యోగులకడఁగూడ నాయన యొదిగియుండలేదు. ౧౮౭౨ వ సంవత్సరంబున నాచార్యులవారికిని *"క్లర్క్" అను కలెక్టరునకును జరిగిన వివాదములో నాయన విజయమొందిరి. ఆకలెక్టరు ౧౮౭౩ వ సంవత్సరమునఁ బరవస్తువారికి సముద్రతీరమున నుండిన స్థలంబు నాక్రమింపఁ బ్రయత్నింపఁగా దానిగూర్చి యాచార్యులవారు స్వంతముగఁ దగవుచ్చి జరిగించి జయంబును వడసిరి.

శ్రీరంగాచార్యులవారికిఁ దండ్రి గతించిన యనంతరము, చతుర్దశవర్షప్రాయంబున వివాహం బయ్యె. ఆయనభార్య శ్రీమతి తిరువేంగళమ్మ. ఆమె సింహాచల నివాసులగు శ్రీకందాళ వరహాచార్యులవారిపుత్రికారత్నము. ఈదంపతులకు వేంకటరంగమ్మ, రామానుజస్వామి, శ్రీనివాసజగన్నాథస్వామి, మంగతాయారమ్మ, ఆండాళమ్మ యనువారు జన్మించిరి. వారిలో మొదటి నలుగురును జనకుఁడు సజీవుండై యుండఁగనే కాలధర్మము నొందిరి. శ్రీమతి ఆండాళమ్మగారు సజీవులై యున్నారు.

ఆచార్యులవారు విశిష్టాద్వైతమతప్రచార మొనర్చుచుండిరి. వారు హయగ్రీవమంత్రోపాసకులు. వారికి ౧౮౮౨ వ సంవత్సరంబున సంగమవలసలో షష్టిపూర్తి యయ్యెను. సంతాననష్టము వాటిల్లకుండి యుండెనేని యాయన యామహోత్సవము జరిగినందులకు మిక్కిలి సంతసించియుండెడివారు. ఆయన మైసూరుప్రాంతంబునకుం బోయి వచ్చుచు మార్గమధ్యంబునఁ దునిగ్రామంబున దిగి తునిజమీందారుగారి సత్రంబున బసచేసిరి. వీరిరాకగూర్చి యాజమీందారు లాలకించి, యిదివఱకు వీరిపాండిత్యప్రభావముగురించి వినియుండుటచే, వీరినిఁ దమసంస్థానంబునకు నాహ్వానము చేసి గౌరవించెను. అంతియకాక, యారాజు వీరినిఁ దనయాస్థానంబున నుండుమని కోరి, వీరికి నేడాదికి వెయ్యిరూపాయలగౌరవవేతనము నియ్య నేర్పాటు చేసెను. నివసించుటకు నొకభవనంబును నిర్మించెను. ఆచార్యులవారు తునిజమీందారుగారి యభిలాష ప్రకారము తునిగ్రామమునందే నివసించిరి. అప్పటినుండి యాఁగురించి యాచార్యులవారికి, గౌరవవేతనమునుండి నెలకు రూ ౮౩-౫-౪ చొప్పునఁ బ్రతిసంవత్సరంబున వెయ్యిరూపాయల నిచ్చుచుండెను. ఆచార్యులవారు తమ చరమదశ నంతటిని (అనఁగా ౧౮౭౭-౧౯౦౦ వఱకు) తునిగ్రామంబునఁ గడపిరి. వారు నివసించుచుండిన భవన మిప్పటికిని గలదు. అది యిప్పుడు తునిహైస్కూలులో నొక యంతర్భాగమై యున్నది. ఆచార్యులవారు తునిగ్రామంబున వికారిసంవత్సర పుష్య బహుళ పంచమి శనివారంబున (అనఁగా ౧౯౦౦ సం॥రం జనవరి ౨౦ వ తేదీని) రాత్రి ౮ గంటలకు స్వర్గస్థులైరి. ఆయన జ్ఞానవంతులై, స్మృతియుక్తులై ప్రాణంబుల విడిచిరి. ఆయన యవసానకాలం బాసన్నం బగుచు నుండ నాయన రెండవమనుమఁడగు శ్రీవేంకటభట్టనాథస్వామిగారు భగవద్గీతను బారాయణము సేయుచు నుండిరి. అర్జునవిషాదయోగము మొదలు, మోక్షసన్యాసయోగము పూర్తి యగునంతవఱకు విని, యది పూర్తియైనదాయని భట్టనాథస్వామిగారి నడిగి యాచార్యులవారు పంచత్వం బొందిరి. శ్రీతునిరాజుగా రాచార్యులవారి యంత్యక్రియలను వేదోక్తంబుగ విశిష్టాద్వైతమతాచారానుసరంబుగ, కడుంగడు గౌరవంబుగ జరిపిరి.

మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు రంగాచార్యులవారు స్వర్గస్థులైనను యశఃకాయులై సజీవులై యున్నారు.

* vide Calender Case No. 2 of 1872.

ఈచారిత్రికవిషయంబులకు శ్రీపరవస్తు వారియింట నుండు గ్రంథములును, లిఖితపత్రంబులును బ్రమాణములు. శ్రీరంగాచార్యులవారి మనుమ లగు శ్రీలక్ష్మీనృసింహస్వామిగారుకూడ వారికిఁ దెలిసినవిషయములను జెప్పి నాకు సహాయ్య మొనర్చిరి.

# భ్రమరగీతము.

[భోగరాజు నారాయణమూర్తిగారు.]

౧

మిన్నుమన్నుగనకుండమిట్టిపడుచుఁ
చెవులు చిల్లులు వడ రొద చేసికొనుచు
తెక్కలన్ జాఁపి చుట్టును గ్రిక్కిరిసిన
కులమువారితో జెలరేగి కెలనఁ గలుగు
మల్లికాపద్మకుందారవిందకుసుమ
సారనిష్యందమకరందధారలందు
విముఖత వహించి ముందును వెనక గనక
యెగిరిపోయెదనంతకీ డేమి వచ్చె ?
నిలు నిలు మిళిందమా!—అహో నిలువ వేమి?
అలరులలరులు నీ కరు లయ్యె నేమి ?
అం దొలుకు తేనెయును విస మయ్యె నేమి ?
అర్థసందర్భములు మొద లైన వేమి
లేనినీపాడురొద యింక మాన వేమి ?
న్యూనతన్ గన్ననీనోరు నొవ్వ దేమి ?

౨

పొగరుఁబోతుతనంబున నెగిరిపోయె
దంతియేకాని కీ డేమి యబ్బె నీకు ?
అవనిఁ బాపీచిరాయు వన్నటు భవాదృ
శాధముం డాపదలు లేక యలరుచుండు;
సుకవికవితాప్రవాహంబు సొంపు నింపు
మధురమధురస మానినమత్తుచేత
నొడలు తెలియవు మఱి వినఁబడవు నీకు
నార్యులహితోక్తు లిసుమంత యైనఁ గాని;
ఎక్కడకో చని యిటు కడుపెక్కఁ ద్రాగి
యుందు వీ వందుచేత నిందిందిరంబ !
తినఁ దినన్ గారె చేదెక్క నన్విధాన
నల్లపుడు నీవె మెచ్చు నిమ్మల్లెపూవు
నింతనిర్లక్ష్యముగఁ జూచి యేగుచుంటి.

3

చెవులుగిపెట్ట రొద మాని చెలిమిఁ బూని
షట్పదము కడ కొక్కప్రశ్నమున కైన
నుత్తరం బొసఁగుచూ నీవు చిత్తమందు
నెయ్యది తలంచి రొద సేతు విట్లు నీదు
దీర్ఘఝంకారమున మాకు తెలియునట్టి
యర్థ ముండెనె ? యున్నచో నదియు సుజన
భాషణమొ లేక దుర్జనభాషణంబొ?
పరమసాధుల నార్యసంభావనీయ
వర్తనులఁ బట్టి దూషించుభావ మందు
లేదు కద చంచరీకమా లేశ మైన ?
ఎన్నఁడును లేనిదుర్వార్త లెన్నొ పన్ని
అనఘు లైనట్టివిద్వాంసులను గడంగి
తూలనాడెడుదుర్వాక్యజాల మందు
లేదు కద చంచరీకమా లేశ మైన ?
తలకుదగనట్టివేసంబు దాల్చి మిన్ను
మన్ను పట్టనిపెద్దడంబముల, గాలి
యందు మేడలఁ గట్టుదురాశ లందు
లేవు కద చంచరీకమా లేశమైన ?
త్వత్కులమ్మున సహజ మై తనరునట్టి
నలుపు గలభృంగిపై నీకు వలపు లేక
యనయమును నన్యకాంతావిహారచింత
లంతకంతకు స్వాంతమం దతిశయింపఁ

గంటఁ బదుకల్వకంటిఁ గ్రొగ్గంటితోడ
నరసి యలవాటుపట్టి నీ వాడునట్టి
కడునసహ్యంబు లైనవాక్యంబు లందు
లేవు కద చంచరీకమా లేశ మైన?

౪

భ్రమరమా! నిన్నుఁగాంచి సంభ్రమ వహించి
యెన్నియో ప్రశ్న లడిగితి నింతవఱకు;
పొంత గలయట్టి సంపంగిపూలవనము
కంటఁ బడినంత నీవు పోకడగుఱించి
కలరహస్యమ్ము లన్నింటిఁ దెలిసికొంటి
చంపకమునకు నీకును సహజ మైన
ప్రబలశత్రుత్వ మంటఁ దద్భవ్యకుసుమ
జాతసంజాతసౌరభవ్రాతకలిత
మందమారుత మరిసేనమాడ్కి నిన్ను
వెంటఁదఱుముచునుంటచే వెనుక గనక
సపరివారమ్ముగా నీవు సాగినావు!
ఇదియె వాస్తవ మేల దాచెదు మిళింద!
త్రాగుఁబోతుతనమ్ము నర్థమ్ము లేని
దుష్ప్రలాపమ్ము తగినహేతువులు లేని
వైరములు జన్మతోడనే వచ్చె నీకు;
గానియెడఁ గారణము లేనికలహ మేల
గంధఫలితోడ నీకు? తత్కనకకుసుమ
మేమియపరాధ మొనరించె మోహమైనఁ
జూడ నొల్లని హేమంపుఁజూడ్కిఁ దత్స
మీపమున నుండ నాపరమేష్ఠిసృష్టి
యందు సాధు వసాధున కయ్యె వైరి
పులికి గోవును, పిల్లికిఁ జిలుక, సింగ
మునకు నేనుఁగు, పావురమునకు డేగ,
గ్రంథవిక్రియార్జితధనాకర్షణునకు
సుకవి, నత్తావు లీనుచంపకసుమమ్ము
నీకుఁ బగ ఘటియించె నిందిందిరంబ!

౫

కడువికారంబు నీరూపు కాఱునలుపు
కనకసుమము తెరగు బంగారురంగు;
నిరతమును ఝంకృతిక్రియ నీమతమ్ము
మహితమౌనవ్రతమ్ము చంపకముమతము;
కలవు నిర్గంధము లగురెక్క లవి నీకు
గంధఫలిరెక్కలు సుగంధబంధురములు;
చంపకమునకు నీకు ముజ్జగములందు
హంసకాకముల కున్నంతయంతరంబు;
మీయుభయులందు నిజము నీచేయి క్రింద;
అందుకే తక్కనసుమమ్ములెల్ల నీకు
గ్రిందుగాకుండ నజుఁడు సుందరసుమ
చంపకమ్మున నుంపక శత్రుభావ
మిట్టులోనఁ గూర్చె; భ్రమరమా! యంతె కాదు
కవులునై తము నినుఁ గ్రిందుగా నొనర్ప
నిర్ణయించిరె నాయకీవర్ణనములఁ
దుమ్మెదలఁబోలుకొప్పంచుఁ దొలుత బోల్చి
కొప్పుపైఁ జంపకమ్మును గొప్ప సేతు;
రిదియు నిట్లుండఁ జంపక మీసుతోడ
సబలనాసయై యిర్వంకలందుఁ గూడఁ
బూనెఁ బ్రేక్షణమధుకరీపుంజము లని
యింక నేమేమియో రసజ్ఞులెల్ల మెచ్చు
కల్పనముఁ బన్ని యిందఱికవులకన్న
మిక్కుటమ్మన్న నీకొంప ముంచినాఁడు;
బలిమిఁ జెఱపట్టఁదలఁచినపట్టునందు
కాముకులు మానవతులకు గఱపునట్టి
దుష్టనీతులలో నిన్నుఁ దోడుగొనుచు
'వలయుపూదేనె గ్రోలదే యళి' యటంచుఁ
బలుకునటు ప్రబంధములఁ గన్పడుచునుండు,
నెంతనీచోపమానమే యిది మిళింద!
కడగి జగమెల్ల నిను గ్రిందుగా నొనర్చ
తెఱఁగవో లేక మొఱఁగె సిగ్గెల్ల విడిచి
భూషణములును దూషణములును దలఁపఁ
దనువునకె గాని కలుగ వాత్మకు నటన్న
మెట్టవేదాంతమున నిట్లు మిట్టిపడెదొ?

# కవిత.

[దేవులపల్లి సీతారామశాస్త్రిగారు.]

విద్యలలో నెల్ల కవిత నుత్తమవిద్యగను పరిగణించుచున్న సుకవులధీవైశాల్య మింత యని వర్ణించ నలవి గాదు.

సామాన్యముగా విద్య లన్నియును జన్మాంతరవాసన ననుసరించి లభింపవలసినయవి యైనను, "నాఋషిః కురుతే కావ్య" మ్మని, ఆర్షాంశోత్పన్నులకుఁగాని, కవిత లభించునది గాదు. కవితాస్వరూప మిట్టిది యని వివరింపఁబూనుకొనుట మహాసముద్రము నీఁదుటకు ప్రయత్నించుట వంటిది. కొందఱు కవితాలత యని కవితను లతతో సరిపోల్చిరి. లతలయందుఁ గలవిశేషము లన్నియు నిందు మనబుద్ధికొలంది బయల్పడఁ గలవు. కొన్నిలతలయందుఁ గల, ఆకులు చూచువారి కన్నుల నాకర్షించును. మఱికొన్నిలతలు పుష్పములయందలి సౌందర్యవిశేషమును గనఁబర్చుచు సంతసింపఁజేయును. మఱికొన్ని పుష్పలు లేకున్నను పత్రములయందు మనోహరములైన సువాసనలను గలిగి యుండును. మఱికొన్ని ఫలములయం దనేకరుచులను గలిగించి భక్షించువారి జిహ్వల నాకర్షించును. ఇవియేకాక సమస్తరోగములను హరించుటకు సమర్థములైనవి కొన్ని సేవించువారలకు కాంతివిశేషముల నిచ్చునవికొన్నియును, గాయములను మాన్ప సమర్థములైనవి కొన్నియును, విఱిగిన యెముకలను గూడ కలుపునవి కొన్నియును, మరణాసన్నులను బ్రతికింపఁజేయునవి కొన్నియును గలవు. ఇట్లే కవితకూడ శబ్దసౌందర్యవిశేషములవల్లను, యమకచిత్రాదిశబ్దాలంకారరూపములను, ఉపమాద్యలంకారవిశిష్టము లగుచును, మఱియు బహువిధరూపములను కొందఱి ముఖాలవాలమునఁ బొడమి నవరసములను బోషించుచు, సంతసింపఁజేయుచున్నది. ఏవిధమైన అలంకారములు లేనిదైనను, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను గలిగించుచు, సత్ఫలదాయకమై వెలుఁగుచున్నది. సహృదయు లెటువంటిబాధలలో నున్నవార లైనను, రసవంత మగుకవిత వినినతోడనే, దానియందు మగ్నహృదయులై, తా మదివఱకు పొందుచున్న పీడలను మఱచి సంతసించుచున్నారు. వైరీతిని ధర్మార్థకామమోక్షములను గలుగఁజేయు సామర్థ్యముకూడ కవితకుఁ గలదని యెల్లవార లెఱింగిన విషయమగుటచే విస్తరించి వ్రాయనవసరము లేదు. మఱియు నియ్యది మన్త్రరూపమున దేవతలనుగూడ ప్రత్యక్షముగ కనఁబర్చఁగలిగియున్నట్టు లనుభవసిద్ధమైనయది. ఓషధీలతలయందుఁ గల సమస్తవిధము లగుసత్త్వాదులను గలిగియున్న కవితను లతలతో సరిపోల్చుట యెంతయుక్తమైనదో చదువరు లూహింతురుగాత:—

మఱియు కాళిదాసాదిమహాకవులు తమ కవితాశక్తి ప్రార్థించి పంచభూతములను వశపఱచుకొనిరనియును, పండితరాయలు కాశీయందు గంగానదిని తనవద్దకు రప్పించుకొనె ననియును, భవభూత్యాదులు సరస్వతీ దేవిని ప్రత్యక్షము చేసికొనిరనియును, శంకరులు "లక్ష్మీనృసింహమమ దేహి కరావలంబమ్" అని చెప్పి లక్ష్మీనృసింహదేవుని యవలంబన వడసెననియు ప్రబలిన వార్తలు సత్యములుగాని అర్థవాదములు కావు. ఇపు డిట్టి మహాకవులు మిక్కిలి యరుదగుటచేతను, మన కట్టి మనోదార్ఢ్యము లేకపోవుటచేతను, మన కావార్తలు ఆశ్చర్యకరములై తోఁచుచున్నవి. దూరముగ నీవిషయము నాలోచించిన నవి సత్యము లని తోఁచకమానదు. మనము పారాయణల నాచరించియును, పట్టాభిషేకాదులం జేసియు, నాదరించుచున్న వాల్మీకిప్రోక్తమగు శ్రీమద్రామాయణము, పైవిషయముల సత్యతను గుఱించి నిర్ణయింప సహాయము చేయఁ గలదు. వ్యాసమహామునిచే వచింపఁబడిన గీతలుకూడ నీవిషయమును సిద్ధపఱుపఁ గలవు. ఇంతయేల? శబ్దార్థములకూర్పగదా కవిత. అపౌరుషేయము లగు వేదములుకూడ కవితాలతకు మొదటిరూప మన కవితాతత్త్వ మెంతదో యోచింపుఁడు. ఇట్టి కవితాలతను పరిశుద్ధముగురీతిని నిలుపనెంచియే లాక్షణికులు లక్షణగ్రంథములు, అలంకారికులు

అలంకారశాస్త్రములు, శాబ్దికులు శబ్దశాస్త్రము, ఆర్థికులు అర్థశాస్త్రము మొదలగు ననేకవిషయములను ప్రపంచమునందు గ్రంథరూపమునఁ బ్రాసి రక్షించుచున్నవారలు. కాని వారలైనను, కవితాలతాస్వరూపమును నిర్ణయించి యుండలేదు. లత సృష్టికాలమం దుదయించి గంగాదిమహానదులవలె భూమ్యంతర్గతమై నడచుచు, అవసరమైనకాలమున నాయా స్థలములయందు ప్రత్యక్షమగుచున్నట్లు కవితాలతయును, జనమానసభూములయందు లీనమై సంచరించుచు కాలానుసరణమైన విధముగ తనంతటతాను ప్రత్యక్ష మగుచున్నయదియె కాని యొకరు నియమించినవిధుల ననుసరించి మఱియొకరిచే నిర్మింపఁబడునది కాదు. ఈవిషయము నిశ్చయమైన దనిసు కవుల హృదయమునకు ముఖ్యముగ గోచరింపక తప్పదు. ఏసుకవిగాని తనచిత్తవృత్తి ననుసరించి చెప్పియుండలేదు; చెప్పలేఁడు? మఱియు "సుకవితాయద్యస్తి రాజ్యేనకి"మ్మని రాజ్యాధికారముకన్న సుకవితను గొప్పదానినిగ గొనియాడిన విషయమునుగూడ సత్యమైనదానినిగ భావింపవచ్చును. రాజునకు శాసనాధికారము గలిగియున్నట్లు కవులకుఁగూడ శాసనాధికారము గలదు. ఇందుకు వాల్మీకిమహాముని నిషాదుని "మానిషాదప్రతిష్ఠాంత్వ" మ్మని శపింప వాఁడు తత్క్షణముననే మరణించిన విషయము నిదర్శనము. ఇంతియేకాక భీమకవి మొదలగువారలయందుఁ గలవని వివరింపఁబడిన అద్భుతశక్తులుకూడ దాంబికము లని యనుకొనరాదు. కవితాలత, కల్పలతవలె కోరినకోరికల నియ్యఁగలదనుటకు పోతనాదిసుకవుల చరితములు నిదర్శనములు. మఱియు కృతి అష్టవిధసంతానములలో ముఖ్యమైనదానినిగ వివరించి యుండుటయుఁ గలదు. సృష్టిస్థితిలయాదులకు మూలకారణ మని చెప్పఁబడిన మనస్సునందు తనంతటతా నుదయించినకవిత కసాధ్యము లెవ్వియును గలుగనేరవు. దాని నుపాసించు సరణినిగుఱించి కొంత విచారింతము. సత్యధర్మములను విడనాడక తమతమ వంశాశ్రమాచారములను తప్పక దురాశలకు లోనుగాక శాంతాదిసద్గుణముల కాలవాలము సుకవుల హృదయములయం దుదయించిన కవితాలత ప్రపంచమునకు వలసినంతయుపకారమొనర్పఁగల దని వేయిముఖముల చాటవచ్చును. కవితనుగుఱించి విమర్శించి వ్రాయఁదలఁచిన నొకమహాగ్రంథబాహుళ్యము కాఁగలదు. ఇప్పుడు సత్కవులకుఁగాని, సత్కావ్యములకుఁగాని యేవిధమైన నవలంబనలను చేయక దేశీయు లుపేక్షించుట కడు శోచనీయము. కాన, కవితాభిమానులు సత్కవులకు ప్రోత్సాహ మొసఁగి, సత్కావ్యము లభివృద్ధి నొందింపఁ బ్రయత్నింతురు గాక!

---

# ఈమకొనిపోదుమా! ప్రాణనాథ! మనము.

[కాళూరి వేంకటనరసింగరావుగారు]

ఈపవిత్రప్రశాంతనిశీథవేళ
నీవినీలగగనసీమపై వెలుంగు
తారకలతెలికాంతిసంతతుల మెరసి,
ఈమహోన్నతవృద్ధమహీజవిటపి
విసరవలయితనిబిడతమసగభీర
రాసులను పరివాహంపురవడి నొరసి,
ఈవిశాలవిశ్వోదర మెల్ల నిండి,
క్రిక్కిరిసిపోయినట్టి విశీర్ణసాంద్ర
శాంతనిశ్శబ్దహృదయకోశాల విరిసి,
పొంగి పొరలెడుదు స్తరాభంగభయద
భావవాహినిలో దేలిపడెడునట్టి
తలపుకెరటాలతరిపిదొంతరలలోన
ఏమకొనిపోదుమా! ప్రాణనాథ! మనము.

*  *  *  *

యుగయుగాల, మానవపవిత్రోద్యమముల
నిస్తులాదర్శముల, వ్రతనియమములను,
నియతి ఘటించుపూన్కల నిర్వహించి,
నిశ్చలులయి వెల్గిన మహనీయవరుల
మహితజీవితమాన్యసమస్య లెల్ల
చెరపరానియక్షరముల జెక్కియున్న
మేలిపాత్రల, తమగహ్వరాల దాచి,
నీలిమను గిడె నీతిమిరాలపొరలు;
ప్రాజ్యహైందవపూజ్యసామ్రాజ్యవిభవ
దుర్నిరీక్ష్యనీరేజబంధుం డడగిన,
తన్మహోజ్వలకిరణపరితానరుచుల
హృదయభేదనకరపూర్వకథల పాత్ర
పొత్తముల నెల్ల తమగర్భములను దాల్చి,
క్రిందుకొనుచున్న నీతిమిరాలపొరలు;
శ్రీమయానేకజగదైకశిల్పి యైన
ఈశ్వరునికల్పనానైపుణీవిచిత్ర
నిత్యనూతనమహిమ లెన్నియొ స్ఫురించు
ప్రకృతిసౌందర్యలక్షణభద్రచిహ్న
ముద్రితము లైనలేఖనముల నవెన్నొ
వేలు తమకుంజచికురజాలాల యుంగ
రాల నిరికించె నీతిమిరాలపొరలు;
పొరలతెరల విదల్చి, యపూర్వదృశ్య
దర్శనానందమందు చైతన్య మెడలి,
ఒరగి, యొండొరుకౌగిండ్ల నిరియుసుఖము
మరగి, బాహ్యప్రపంచంపుమాట మఱచి,
మునిగిపోవుద మందు విముగ్ధుల మయి,
భావవాహినిలో దేలిపడెడునట్టి
తలపుకెరటాలతరిపిదొంతరులలోన
నీమకొనిపోదమా! ప్రాణనాథ! మనము.

*  *  *  *

ఎన్నినాళ్లైన నామె ప్రాణేశ! నాకు
కలదు ఈతీపికోర్కె హృత్తలమునందు
మనవి సేయంగ లేక వేమారు లెంతో!
ఎంతో! యలజడిబడి శమియించితేను,
నేడుగా! నోము ఫలియించె, నిండె సుఖము.
ఎంతభాగ్యము! తమి చన విచ్చి యిచ్చి,
ముద్దు సెల్లించి, మోహాలమూట విప్పి,
ఊరుతీయందనము లెల్ల నూఱ లిచ్చి,

కరగి, కమ్మగా కరగించుకొంతు దుంట.
చల్లచల్లగా మగవారు సైతురె గద!
ఆకువాండ్రిగోలల సమయమ్ము తెరిగి
ఉండదా, బోటులకును ప్రియులనుగూడి
ఇష్టులగువారి, కసి ప్రాణ మిచ్చువారి,
ఆత్మబంధుల, ననుగు లైనట్టివారి,
గాంచి సుఖియింప గాటంపుకాంక్ష మదిని?
భారతకుటుంబమున మనవార లంత;
తల్లిగర్భమ్ము తామరతంప మగుచు
విరిసినది వెన్నెలను పాలవెల్లి పోలె;
దశదిశల మాతృకీర్తి గీతారవముల
మారుమ్రోగించినట్టిసన్మాన్య లయిన
అన్నదమ్ముల జూచి, అనన్యసులభ
ధర్మదీక్షాచరణకార్యతత్పర లయి,
పరమపతిభక్తినిరత లై, భరతకాలము
పావనమ్ముగ నుదయించి, ప్రజ్వరిలిన,
అక్కసెల్లెండ్రి జూచి, ప్రేమాస్పదంపు
కౌగిలింతల కష్టసుఖాల నడిగి,
దుఃఖసంతసమిశ్రితతోయకణము
లొక్కపరి రాల్ప నేలేమ కుండకుండు?
ఆకటికిగుండెమగవా ర్మఱతురుగాక.

*　　*　　*　　*

అదిగొ! చిత్తూరుగడము, మహాయగడ్త
అదివొ! కోటపెన్బురుజు లల్లవివొ! క్రూర
ముష్కరతురుష్కరాజచమూసమూహ
భీషణారావముల దిశల్ బొదువడివొ.
సంధ్యవేళ భాస్కరుముదుసలికరాలు,
జాలిచేత గాబోలు, రానేల, రక్త
మడుగులఁ బ్రుంగుమణిమయమకుటలసిత
వీరరసపుత్రరాజన్యవైరిభయద
మూర్ధముల మెలమెల్ల నిమురుచునుండె.
అవివొ! అంతఃపురోద్యానమందు రాజి,
రవిలి రేగినపెనుమంట లవిరళముగ
నుప్పరా లెగయగ, వెక్క సున్నయట్టి
దుర్గమారణ్యవీధులందునను వన్య
జంతువులు దావపావకభ్రాంతి వారు,
చిటిలి పడునగ్నికీలికాపటలమందు
నుప్పతిల్లినదారుణాత్యుగ్రసినద
తతులు గిరికొను గిరులకన్దరములందు
ధరణి బీటలుగా ప్రతిధ్వనుల నీని.
అట్టిసంకులసంక్షోభమందు వెడలి,
అమలశుద్ధాంతకాంతాసమావృత యయి,
వీరరసపూరసురుచిరోదారమూర్తి
నార్యరక్త ముప్పొంగగ, నంతరంగ
పావనద్యుతి వదనబింబంబునందు
తాండవింపుచు దివ్యసౌందర్య మీయ,
పలుకులను శౌర్యరసము చిప్పిలి స్రవింప,
చెలులకును భారతీయవిశిష్టమాన
రక్షణోత్తమధర్మకర్తవ్య మెల్ల
మరల మరల గఱపి, మనోహారు దలంచి,
ఆహుతాశనజ్వాలల నదిగొ! యుఱికె
పద్మినీమానవతి సర్వప్రకృతి యదర.

*　　*　　*　　*

ఆపవిత్రశరీరభస్మావలేప
మిర్వురము ఫాలముల హృదయేశ! పూసి,
తల్లిరూపమ్ము నుడుకుచిత్తాల నిలిపి,
భక్తిదీక్ష బూనుదము; తత్ఫలసమాప్తి
కనుపమశుభప్రదాశీర్వచనము గోరి
కమ్రగతి పాడుదా మైక్యకంఠరవళి
చటులభీషణానలమహాజ్వాలికలను
సుఖమయామృతకరసుధాజ్యోత్స్న జేయు
చల్ల నగుసోదరికి నమస్కారశతము."

# జాన్సను లేఖ.

[మొసలికంటి సంజీవరావుగారు]

(మిథ్యాపోషక నిరసనము)

'జాన్సను' నామధేయుఁడు అనంతమేధాసంపన్నుఁడు. ఈ యాంగ్లేయుఁడు కవియు, విమర్శకుఁడు, వ్యాసకర్తయు, కవిజీవితకారుఁడును, మించి ప్రసంగచూడామణియునై వన్నెగాంచెను.

గ్రంథరచనకారణమున ధనసంపాదన మొనరించువారము కామని కొందఱు భ్రమసి భరితగర్వమున బీరము లాడుదురు. *

పదికొందఱు ధనసంపాదనార్థము ఎట్టిహైన్యమునకైనఁ బాల్పడుదురు. జాన్సను అట్టి నిట్టి గాక, గ్రంథకర్తృత్వమున లోకయనూనగౌరవము గడించి తన కాలమున నిరంకుశసాహిత్యచక్రవర్తియై యశోవంతుఁ డాయెను.

ఈతఁ డొకనిఘంటువు రచించెను. నేఁడు నామమాత్రావశిష్టమై యున్నను, అది యొకమహాగ్రంథము. ధనరహితుఁ డగు జాన్సను ఏడుసంవత్సరము లష్టకష్టము లనుభవించి, గ్రంథనిర్మాణ మొనరించెను. తద్గ్రంథప్రారంభావసరమున, 'చెస్టరుఫీల్డు' ప్రభువుని ఘంటువుకర్తవలయు, సహాయ మొసంగువానివలె నటించి, కృతిపతి కాఁగోరెను. కాని, ఆతనిపోషణము మాటలందే గాని, క్రియయందుఁ గాన్పింపకుండెను. అమాయికుఁ డగుజాన్సను పోషకుఁడు ప్రసన్నుఁ డగునని భ్రమించి, ప్రభుసందర్శనార్థము వేచి వేచి, విసిగి వేసారి, పరిభవాంతఃకరణుఁడై వెనుదిరిగెను

గ్రంథము పూర్తియైనంతనే, ఆప్రభుప్రాపును మొక్కసారి విశాలమాయెను. అంత నిఘంటువు కనవసర మనియు, విద్యానిధి యగుజాన్సను నిక్కముగ భాషాశాసన మొనరింప సమర్థుఁ డనియు నుగ్గడించుచు నాప్రభువు రెండువ్యాసములు వ్రాసెను. మహామాని యగు జాన్సనున కట్టిప్రవర్తనము కశంగడు మన్నహ మాయెను. తా నొకయుపకారవంతునివలె, విద్యాపోషకునివలె నటించి, అవసర మగుకష్టసమయమునఁ గుమతియై యుపేక్షించిన ప్రభువు కృతిపతి కాఁగోరియే గ్రంథరచనానంతర మట్లు ప్రశంసించెనని యెంచి జాన్సను కుపితుఁడై, ఆప్రభువే గాక ఇతరమిథ్యాపోషకు లందఱుఁగూడ విశీర్ణహృదయు లగునట్లొక కమ్మ †లిఖించి యాతని కంపెను. ఆంగ్లసారస్వతమున సాధారణజ్ఞానము గలవారలకును, ఆంగ్లాలంకారశాస్త్రమునం దొకింతపరిచయము గలవారలకునుగూడ నీప్రసిద్ధలేఖ సుపరిచితము

---

* c. f. "No man but a blockhead" said Johnson, "Ever wrote except for money." She doctrine is, of course, perfectly outrageous, and specially calculated to shock people who like to keep it for their private use, instead of proclaiming it in public.........In this case it implies also contempt of the professional for the amateur........So long as the author supplied a good article and got a fair pride, he was a fool to grumble, and a humbug to affect loftier motives.—

Leslie Stephen.

† Carlyle calls this letter "the farfamed blast of doom proclaiming into the ear of Lord chesterfield and through him, of the listening world, that patronage should be no move."

ప్రభూ !

నేను విరచించిన నిఘంటువును నీవు "ప్రపంచ పత్రిక" యందు రెండుసారు లుగ్గడించితివని వినియుంటిని. ఇట్లు ప్రశంసాపాత్రుఁడ నగుట కడు గౌరవప్రదమే కాని, ఇట్టి మహనీయుల ఆదరణ మెన్నఁడును చవిచూచి యెఱుంగనివాఁడ నగుటచే నీయభినందనము నెటులు పరిగ్రహింపవలయునో తెలియకున్నది.

కించిత్ప్రోత్సాహమున నిన్నుఁ దొలిసారి సందర్శించి, నీదు వచనరచనాసారస్యము గాంచి, ఇతరజనానీకమువలె చెప్పవడి, అన్యజనసాధ్యపదార్థము నాకు సాధ్యమా యని యుప్పొంగితిని. కాని, నీప్రోత్సాహ మంతరించెను మానవంతుఁడ నగు నేను అంత నీసముఖమునకు రాఁజాలకపోతిని. ఒకానొకసమావేశమున నిన్నుఁ గాంచినపుడు, నాకుఁ గలకళాప్రావీణ్యము వెల్లడియగునట్టిపలుకుల నిన్ను రంజింపఁ గడఁగితిని. చేయఁగలంత చేసియుంటిని. కాని, తాఁ జేయునది స్వల్పమే యగుఁగాక:- ఐనను అదియుఁ దయు రిత్త యగుట ఎట్టిమనుజునకైనను దుస్సహము గదా ?

నీదు మొగసాలల వ్రేలాడి, వెడలింపఁబడి నేఁటికి ఏడుసంవత్సరము లాయెను. ఈలోనఁ గష్టములఁ బొరలాడుచు నేనాపని సాగించుచుంటిని. నాకష్టములు పేర్కొనుట నిరర్థకము. ఒక్కపలుకైనను ప్రోత్సాహము లేకఁ ఆదరణమందవాసమైన నెఱుంగక నా గ్రంథమును బూరించి ప్రచురణయోగ్యమొనరించితిని. ప్రభూ! మున్నెన్నఁడును పోషకుని ఎఱుంగనికారణమున ఇట్టిప్రవర్తనమునకుఁ బాల్పడుదు నని కలలోనైనఁ దలంపనైతి.

ప్రభూ! "వర్జిలు" గాథయందలి గోపాలుఁడు ప్రేమ శిలాంతరవాసి యని ఎట్టకేలకుఁ దెలిసికొనెను!*

నీటఁబడిన మనుజుఁడు నిజప్రాణసంరక్షణార్థము అటునిటుఁ గొట్టుకొనుచుండు సమయమునఁ గరినాత్ముఁడై యుపేక్షించి, ఆహతభాగ్యుఁ డెట్టులో తీరముఁ జేరినంతనే యుపకారచిత్తమున సాహాయ్య మొనరింపఁబోవువాఁడేగదా పోషకుఁడు? ప్రభూ! నాపరిశ్రమము తొలుదొల్తనే యరసియుంటివేని, అది సకరుణముగ నుండెడిది. అటుగాక నేను ఉత్సాహరహితుఁడనై, ఉదాసీనుఁడనై యనుభవింపఁజాలకుండు సంకటములను నన్నుపేక్షించితివి. నేను పరిచితుఁడనైతి. నీప్రశంస అపేక్షింపను. ఉపకారమే లేనపుడు కృతజ్ఞత వెలిపుచ్చుట అసంబద్ధము, దైవికముగ నేనే సాధింపఁజాలునది పోషకుని ప్రోత్సాహమని జనులు భ్రమించుట కవకాశ మీయకుండుట సమంజసమే యగుఁగాని క్రూరదూషణము కానేరదు.

---

*c. f. "The shepherd in *Virgil* grew at last acquainted with love, and found him a native of the rocks."*

# జానకీపశ్చాత్తాపము.

[గర్భాపి అప్పారావుగారు, బి. ఏ.]

అజునకైన వర్ణింపఁగా నలవికాని
ఆత్మకష్టాలి దెలుపఁగా నరిగి మొఱలు
పెట్ట నింద్రాదిసురలకు వీలుకాని
అసదృశాకృతుల నెలుంగునరుఁబోండ్లు
వ్రతశతంబులఁ జేపట్ట వశముకాని
ఘోరతపముల తాపసుల్ చేరరాని
నిరుపమాకారు నచ్యుతు నిర్గుణాత్ము
కారణశరీరు దివ్యమంగళశరీరు
సద్గుణస్తోము నీరదశ్యాము రాము
వరునిగాఁ గంటి నాపుణ్యఫల మదేమొ
కరము పట్టితి వామభాగమున నంటి
సన్నిధిని మెలంగుచు నుంటి; జ్ఞానహీన
నగుచు నఱచేతిమోక్షంబు నవలఁ ద్రోచి
చేతియద్దంబు నిరసించుచీఁకువలెను
పూర్వకవ్యుక్తకమనీయపూతలలిత
మృదుమధురపదాలంకారమిళితసరణి
వదలి శ్రుతికటువులు జుగుప్సములు నైన
గ్రామ్యపదజాలముల కయి ప్రాకులాడు
చుండెడు కవితాకన్యయుద్యోగ మట్లు
వెఱ్ఱి నై భ్రాంతి కలిగించువిధముఁ జూచి
యొప్పుచిన్నారినడకలహొయలు చూచి
అచటి బంగారుపైపూతరుచులఁ జూచి
కరము వెలుఁగునంగమ్ములమురువుఁ జూచి
ధర నశాశ్వత మియ్యది తలఁపు లేక
మాయలేడిమాయలఁ బడి మఱచిపోతి
రామసాన్నిధ్యము; నను దూరాన వీడి
పోయె పరమాత్మ “నీ కట్టిభోగఫలము
లిత్తు” నని చెప్పకైవడి నెంతవెఱ్ఱి
నైతి ‘కామరావణబాధ యాక్రమించెఁ
బ్రోవు మో రామ! సంహారింపు మరిసమితి
క్రోతులను జేర్చినావంట, కోప ముడిగి
క్రోతివంటి నాచిత్తంబును కుదురుపఱచి
చేర్చుకో నన్ను వారితో స్నేహరీతి
నీవు దక్క నేవస్తువేనియును నాకు
వలదు; కోరుచో వెంటనే వనములందుఁ
దిరుగఁ బంపుము, రక్షించు దేవదేవ!”

---

# తెనుఁగు - ప్రాకృతము.

[శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు, ఎమ్. ఏ.]

ఆంధ్రవైయాకరణులు తెలుఁగుభాష లోని పదములను తత్సమములు, తద్భవములు, దేశ్యములు- అను మూఁడు కక్ష్యలలోనికి విభాగము చేసియున్నారు "సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు" (1) ఉ॥ రాముఁడు, విద్య, హరి, అగ్ని, కారము, జడ మొ॥ "సంస్కృతప్రాకృతభవం బగుభాషతద్భవంబు" (2) ఉ॥ ఆకసము, గోడ, చందురుఁడు, ఇంగలము, అచ్చెర, పనస మొ॥ "త్రిలింగదేశ వ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు" (3) ఉ॥ ఊరు, ఇల్లు, మేడ మొ॥ ఇట్లే యరవ కన్నడ వైయాకరణు లాయాభాషలలోని పదములను తత్సమతద్భవదేశ్యములను మూఁడు తెఱఁగుల విభాగము చేసియున్నారు. "కన్నడదల్లి అచ్చకన్నడ శబ్దగళిగె దేశ్యశబ్దగళెంతలూ; స్వల్పవూ వికారవన్ను హొందదె ప్రయోగిసల్పడువ సంస్కృతశబ్దగళిగె తత్సమశబ్దగళెంతలూ; సంస్కృతశబ్దగళు సంపూర్ణవాగి అథవా ఒందుభాగదల్లి వికారవన్ను హొంది ప్రయోగిసల్పట్టరె అవక్కె తద్భవశబ్దగళెంతలూ సజ్ఞె" (4) ఉ॥ (దేశ్యక్కె) నెల, హొల, మనె; (తత్సమక్కె) వన, ధన, వస్త్ర; (తద్భవక్కె) పయణ, బీది, వీణె.

"ఆరియచ్చొల్లుమ్ వడశొల్లుమ్ ఉచ్చారణత్తినాల్ శమమాయిరుప్పిన్ అదు తచ్చమమామ్" (5) ఉ॥ కమలమ్, కారణమ్. "ఆరియచ్చొల్ వడశొల్లాగుంపోదు వేదేనుమొరు వికారంగళ్ ఉయ్దిన్ అదు తత్పవమామ్" (6) ఉ॥ విశయమ్, చట్టి, పిచ్చై, మాదమ్.

'ద్రావిడ' భాషలలోని పదముల వ్యుత్పత్తినిగుఱించి ఆయాభాషల వ్యాకరణములలో చెప్పఁబడిన విషయ మింతియే యగపడుచున్నది. దేశ్యపదములు దేశవ్యవహారసిద్ధములని చెప్పఁబడియున్నది. వాని వ్యుత్పత్తినిగుఱించి వ్యాకరణములలో నేమియును చెప్పఁబడియుండలేదు.

'ద్రావిడ'భాషావ్యాకరణకర్తలు ప్రాకృతవ్యాకరణముల ననుసరించి యిట్లు పదములను మూఁడుతెఱఁగులుగా విభాగము చేసి రని మనము నిశ్చయముగా చెప్పవచ్చును. ప్రాకృతవ్యాకరణకర్తలు ప్రాకృతపదములను తత్సమ తద్భవ దేశ్యములను మూఁడుభాగములుగా విభజించియున్నారు. "......ప్రాకృతస్యానుశాసనం సిద్ధసాధ్యమానభేద సంస్కృతయోనేరేవ తస్య లక్షణం నదేశ్యస్య ఇతిజ్ఞాపనార్థమ్" (7)

---

(1) బాలవ్యాకరణము-సంజ్ఞాపరిచ్ఛేదము- సూ॥ ౧౫. (2) బా॥ వ్యా॥ సం॥ ప॥ సూ॥ ౨౦. (3) బా॥ వ్యా॥ సం॥ ప॥ సూ॥ ౨౧. (4) శబ్దాదర్శ - (నామప్రకరణ) 85. (5) ఇలక్కణచ్చురుక్కమ్ - (వడశొల్) 56. (6) ఇలక్కణ॥ (వడశొల్) 57. (7) హేమచంద్రవ్యాకరణము అ॥ ౮. పా ౧ సూ॥ ౧.

"ప్రాకృతంతత్సమం దేశ్యంతద్భవం చేత్యద స్త్రిధా। తత్సమం సంస్కృతసమం నేయం సంస్కృతలక్షణాత్। దేశ్యమార్షంచరూఢత్వాత్స్వతంత్రత్వాచ్చభూయసా। లక్ష్మ నాపేక్షతే తస్యసంప్రదాయోహిబోధకః। ప్రకృతేః సంస్కృతాత్సాధ్యమానాత్సిద్ధాచ్చయద్భవేత్। ప్రాకృతస్యాస్యలక్ష్యానురోధిలక్ష్మప్రచక్ష్మహే॥" (8)

ఈమూఁడువిధము లగుపదములలోను తద్భవపదస్వరూపమును మాత్రమే ప్రాకృతవ్యాకరణము లన్నియు నిరూపించుచున్నవి. అనఁగా తద్భవపదముల వ్యుత్పత్తియే వర్ణింపఁబడియున్నది. దేశ్యపదములనుగుఱించి ఈ వ్యాకరణములందుఁగూడ ఏమియును చెప్పఁబడియుండలేదు. అవి సంప్రదాయసిద్ధము లని చెప్పఁబడియున్నది. మఱియు "దేశ్యం........లక్షణైరసిద్ధం తత్తద్దేశప్రసిద్ధం మహాకవిప్రయుక్తం లడహాపొట్టత్తోక్కాది" యని యొకప్రాకృతవ్యాకరణకర్త (9) చెప్పియున్నాఁడు.

భోజదేవుఁడుకూడ దేశ్యపదములను గుఱించి యీక్రిందివిధముగా వ్రాసియున్నాఁడు.

"దేశే దేశే నరేంద్రాణాం జనానాంచ స్వకేస్వకే। భంగ్యాప్రవర్తతే యస్మాత్తస్మాద్దేశ్యం నిగద్యతే॥" (10)

కాని దేశ్యపదములకు వ్యుత్పత్తియే ప్రాకృతవ్యాకరణములలో వ్రాయఁబడియుండలేదు. ప్రాకృతవ్యాకరణములయందును తెలుఁగువ్యాకరణమునందును కూడ దేశ్యపదంబులు దేశవ్యవహారసిద్ధంబు లనిమాత్రము వ్రాయఁబడియున్నది. ఈ రెండువ్యాకరణములలో సూచింపఁబడిన దేశ్యము ఒకటేయగుటచే రెండుదేశ్యములకును పరస్పరసంబంధముండుట న్యాయ్యము. వానిసంబంధము కొంతవఱకు క్రింద సూచింపఁబడును.

'ద్రావిడ'ప్రాకృతవ్యాకరణములరీతిని బట్టి దేశ్యపదముల సంఖ్య యింత యని స్పష్టముగా చెప్పుటకు వీలులేదు. సంస్కృతపదసంబంధము లేనిపదము దేశ్యము కనుక, అట్టిసంబంధమును నిరూపించుటకు పూనుకొనువారిజ్ఞానము ననుసరించి దేశ్యములసంఖ్య మారుచుండును. సంస్కృతవాఙ్మయమునందు విశేషజ్ఞానమును సంపాదించినవారు, అట్టిజ్ఞానము స్వల్పముగా నున్నవారికంటె యధికసంఖ్యాకము లగుపదములకు సంస్కృతసంబంధమును జూపఁగలుగుదురు. అందుచే వారికి దేశ్యములసంఖ్య తక్కువగా నుండును. అట్లే ప్రాకృతదేశ్యములసంఖ్య కూడ సంస్కృతప్రాకృతవాఙ్మయజ్ఞానతారతమ్యమునుబట్టి భేదించుచుండును. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు సుమారు ౧౦౦౦ పదములకు సంస్కృతసంబంధమును వారి వైకృతదీపికయందు సూచించియున్నారు. ఇటీవల నాదెళ్ళ పురుషోత్తమకవిగారు సుమారు ౨౦౦౦ పదముల కట్టిసంబం

(8) త్రివిక్రమ శబ్దానుశాసనము అ॥ ౧ పా ౧ శ్లో॥ ౬-౭. (9) మార్కండేయుఁడు. చూ॥ ప్రాకృతసర్వస్వము పా ౧ సూ. ౩. (10) చూ॥ మార్కండేయ ప్రా॥ స॥ పా ౧.సూ॥ ౩.

థము కల దని వారినామాంకిత మగునిఘంటువునందు చూపియున్నారు. ఇవియన్నియు మన మంగీకరింపకపోయినను సీతారామాచార్యులుగారికంటె రెండవవారి దృష్టియందు దేశ్యములసంఖ్య తగ్గినదని మనము నిశ్చయముగా చెప్పవచ్చును. అందుచే మన ప్రాచీను లట్టిపని చేయుటకు పూనుకొనక ప్రాకృతసమతద్భవదేశ్యపదములను అచ్చతెనుఁ గని వ్యవహరించి కోశములయందు వానిని నట్లు సూచించి యున్నారు. దేశ్యపదములనుమాత్రము ప్రత్యేకించుటకు వారు ప్రయత్నించియుండలేదు. 'ఆంధ్రభాషాసంగ్రహము' తచ్ఛేషము 'ఆంధ్రభాషార్ణవము' మొదలగుగ్రంథము లిట్టివే. 'దేశ్యనామార్థకోశము' నమాత్రము కృష్ణయామాత్యుఁడు దేశ్యపదములను నిర్ణయించి వానినిమాత్రము పరిగణించియున్నాడు. ఇందు కొన్నిపదములకు మనము సంస్కృతసంబంధమును చూపవచ్చును. ప్రాకృతదేశ్యకోశములుకూడ నిట్టి లోపములతోనే యున్నవి. దేశ్యపదములను నిర్ణయించుటకష్టసాధ్యము. భాషాంతరపరిశీలనచే వాని స్వరూపమును నిర్ణయింపవలసి యున్నది. అట్టిపనిని మనవా రెన్నఁడును తలపెట్టియుండలేదు. అందుచే మనవారి దేశ్యపదనిర్ణయప్రయత్నము సఫలము కాలేదు. భాషాంతరములను విమర్శించి తెలుఁగుభాషలోని దేశ్యపదముల నెవ్వరేని నిర్ణయించినయెడల వారు తెలుఁగుభాషకు విశేషోపకారము చేసినవారగుదురు.

ప్రాకృతమున కోశములసంఖ్య అతిస్వల్పముగా నున్నది. సుమారేఁబదిసంవత్సరములక్రిందివఱకును మన కొక్కటైనను ప్రాకృతకోశ ముపలభ్యమానము కాకుండెను. 1873 వ సంవత్సరమున రెండుప్రాకృతకోశములు దొరకినవి. ధనపాలుని 'పాలిఅలచ్ఛీనామమాల' వానిలో ప్రాచీనము. ఇది దేశీకోశ మని చెప్పఁబడియున్నను, ఇందనేక తత్సమతద్భవపదములు కలవు. హేమచంద్రుని 'దేశీనామమాల' రెండవది. హేమచంద్రుఁడు తన యపార మగుసంస్కృతసారస్వతజ్ఞానముచే తనగ్రంథమునందు విశేషముగాతత్సమతద్భవపదములను తొలఁగించి యున్నాఁడు. వానికంటె సుమా రయిదుశతాబ్దములు నవీనం డగుత్రివిక్రముఁడు తన 'శబ్దానుశాసనము'న హేమచంద్రునిగ్రంథములోని యనేకపదములకు సంస్కృతసబంధమును చూపియున్నాఁడు. హేమచంద్రుఁడు తన 'దేశీనామమాల'యందు ౩౭౮౪ పదములను పరిగణించియున్నాఁడు. వీనిలో ౬౩౪ పదములకు త్రివిక్రముఁడు తన శబ్దానుశాసనమున సంస్కృతసంబంధమును చూపి యున్నాఁడు. ౮౩౬ పదములనే నిజమగు దేశ్యములుగా త్రివిక్రముఁ డంగీకరించి తనగ్రంథముచివరను చేర్చి యున్నాఁడు. హేమచంద్రునిగ్రంథములో పేర్కొనఁబడిన మిగిలినపదములను త్రివిక్రముఁ డంగీకరించినట్లు కానరాదు. దేశీనామమాలలోని యనేకపదములకు వాఙ్మయమున ప్రయోగము కనఁబడుటలేదు. అవి హేమచంద్రునిదేశమునమాత్ర

ము వ్యవహరింపఁబడునవి కావచ్చును అట్టి దేశవిశేషమాత్రప్రయుక్తపదములు హేమచంద్రుని గ్రంథమునఁ గలవని మనము రూఢిగా చెప్పవచ్చును. పతంజలి 'మహాభాష్యము'న హమ్మధాతువు గత్యర్థమున సురాష్ట్రదేశమున వ్యవహరింపఁబడుచున్నదని చెప్పియున్నాఁడు. (11)

ప్రాచ్యదేశములలో వ్యవహరింపఁబడక పోవుట చేతనే మార్కండేయాదులగు (12) మఱికొందఱు ప్రాకృత వ్యాకరణకర్తలు హమ్మధాతువును దేశ్యముగా భావించి ధాత్వాదేశములలో పరిగణించియున్నారు. సురాష్ట్రదేశస్థుఁడగు హేమచంద్రుఁడు హమ్మధాతువు సంస్కృతమునందే కలదనియు, అందుచే ప్రాకృతమున నది దేశ్యము కాదనియు చెప్పియున్నాఁడు (13) ఈరీతిగానే దేశిపదములలోకూడ సురాష్ట్రాదిపశ్చిమదేశమాత్రవ్యవహృతపదములను హేమచంద్రుఁడు చేర్చియుండవలయును. వీనిని త్రివిక్రముఁడు దేశ్యములుగా నంగీకరించియుండకపోవచ్చును. అందుచే నవి సామాన్యవాఙ్మయమున కనఁబడకపోవచ్చును. సురాష్ట్రాదివాఙ్మయమున కనఁబడినను కనఁబడవచ్చును.

'దేశీనామమాల' యందు హేమచంద్రుఁడనేకప్రాచీనకోశకర్తల పేర్కొనియున్నాఁడు. వారిగ్రంథములు మన కిప్పుడు దొరకియుండలేదు. కాని హేమచంద్రునిగ్రంథమునుబట్టి వారి గ్రంథస్వరూపములను మనము కొంత యూహింపఁ గలిగియున్నాము. అభిమానచిహ్నుఁ డనువాఁడు సూత్రరూపమున ఒక దేశీకోశమును వ్రాసి దానికి వృత్తినికూడ వ్రాసెను. ఈరెంటికిని ఉదూఖలుఁ డనువాఁడు వ్యాఖ్యానమును వ్రాసెను. కాని యనేకస్థలములలో ఈవ్యాఖ్యాత అభిమానచిహ్నునియభిప్రాయమును సరిగా తెలిసికొనియుండలేనట్లు హేమచంద్రుఁడు వ్రాసియున్నాఁడు. "సరాహయ ) జాణపయలాయం । ఇత్యభిమానచిహ్నసూత్రపాఠే స్థితే అన్యోన్యపర్యాయతయా ద్వావపి సర్వవాచకా విత్యజానతా పయలాఓశరాహత ఇతి వ్యాఖ్యాయ పాఠోదూఖలేనయదుదాహృతమ్ .....తదేతదసమంజసమ్."(14) గోపాలుఁడు శ్లోకరూపమున ఒక దేశీకోశమును వ్రాసి యందు దేశిపదములకు సంస్కృతమున అర్థమును వ్రాసెను. "వేహునూ పెండలశబ్దా పిచ్ఛే చరసేచబోర్థక్యా." (15) దేవరా జనునతఁడు మఱియొక శ్లోకరూప మగు కోశమును వ్రాసెను. ఇతఁడు హేమచంద్రాభిమానచిహ్నులవలె దేశీశబ్దములకు ప్రాకృతమునసే యర్థములను తెలియఁజేసెను. ఇతనిగ్రంథమువలె అమరసింహుని 'నామలిం

(11) చూ॥ కీల్‌హార్న్ ప్రకటించిన మహాభాష్యము. పు- 9. పంక్తి-26. (12) "అగమ అహమ్మజతా స్యాతామ్" ఉ॥ అహమ్మ ఇ అజర్థ ఇ. (ప్రాకృతసర్వస్వము పాదము 7. సూ 140) (13) హమ్మఇ, ణిహమ్మ ఇ, ణీహమ్మ ఇ, అహమ్మ ఇ, పహమ్మ ఇ, ఇత్యేతేతుహమ్మగతా విత్యస్యై భవిష్యంతి "హేమ॥ వ్యా॥౪-౧౬౨- (14) దేశీనామమాల- వర్గ ౧-శ్లో-౧౨. (15) దేశీనామమాల. వర్గ-౬-శ్లో-౧౮.

గానుశాసనము' వలె పదముల యర్థములను బట్టి ప్రకరణములలోనికి విభజింపఁబడి యుండవలయును. "గోకులప్రకరణే దేవరాజస్త్వాహ। పరిహారిణీ పయస్విని పనిచ్ఛి ఆపారిహట్టి ఏ."(16)

ఇట్లే ద్రోణుఁడు, ధనపాలుఁడు, పాదలిప్తాచార్యుఁడు, రాహులకుఁడు, శీలాంకుఁడు మొదలగువారుకూడ దేశీకోశములను వ్రాసినట్లు హేమచంద్రుఁడు చెప్పియున్నాఁడు. వారియందలిగ్రంథములును దోషభూయిష్ఠములుగానున్నట్లును హేమచంద్రుఁడు బహుతరపుస్తకప్రామాణ్యముచే నాదోషములను పరిహరించి యథార్థజ్ఞానమును కలుగఁజేయుటకు తనగ్రంథమును వ్రాసినట్లును చెప్పుకొనియున్నాఁడు. "అధునాతన దేశీకారాణాం తద్వ్యాఖ్యాతౄణాంచ కియంతః సుమోహాః పరిగణ్యంతే। కింవా పరదోషోద్ఘటనేనం మోహాపసరణార్థం త్విదముక్తమిత్యలం బహునా."(17) అందుచే హేమచంద్రుని దేశీనామమాలచే తత్పూర్వగ్రంథము లన్నియు గతార్థములయ్యెననియు, అందుచేతనే అవి ప్రచారలోపవనియు మన మూహింపవచ్చును రము

'దేశీనామమాల' లోని పదములను విమర్శించి చూచినయెడల దానిలోకూడ కొన్ని తద్భవపదములు చేరియున్నట్లు తెలియవచ్చుచున్నది. ప్రాకృతవ్యాకరణములలో వర్ణింపఁబడినవానికంటె భిన్నములగు ఆయాక్షరవిపర్యయము లిందుకనఁబడుటచే వానిని దేశ్యము లనిరి. ఈపదములలోని వర్ణవిపరిణామస్వరూపము ననుసరించి త్రివిక్రముఁడు వానిని తన వ్యాకరణములో ఆయావిపరిణామములను విమర్శించుభాగములచివరను గణములక్రింద చేర్చియున్నాఁడు. (౧) అచ్చులలో విశేషపుమార్పులను పొందినట్లగపడు దేశీపదములను "పుఆయ్యాదిగణము" పేర అట్టి పరిణామములను వర్ణించు ప్రకరణము చివరను చేర్చియున్నాఁడు. "పుఆఈ ఇత్యాదయః శబ్దాః స్వరాదేశవిశేషితావానిపాత్యంతే"(18) ఉ॥ పుఆఈ. (సం. పిశాచః) మాహివాఓ. (సం. మాఘవాతః) కిరో. (సం. కీరః) (౨) మరికొన్నిపదము లిట్లేవ్యంజనములలో వికారవిశేషములను పొందినట్లు కనఁబడుచున్నవి. వీనిని త్రివిక్రముఁడు వ్యంజనపాదముచివరను గోణాదిగణముపేర చేర్చియున్నాఁడు. ఉ॥ గోలా. (సం. గోదా) మువ్వాఇ. (సం, ఉద్వాతి) ణిసాసో. (సం, నృశంసః.) (3) మఱికొన్ని ప్రాకృతపదములు తదర్థమున రూఢమగు సంస్కృతపదములతోకాక గౌణపదములతో సంబంధించియున్నవి. ఇట్టివానిని త్రివిక్రముఁడు తనవ్యాకరణమున ప్రకీర్ణకప్రకరణముచివరను గహిఆదు లనుపేర సంగ్రహించియున్నాఁడు. ఉ॥ గహిఆ-కామ్యమానా. (సం॥ గ్రహ్యా) పడిసొత్తో-ప్రతికూలః. (సం॥ ప్రతిస్రోతః.) అగుజ్ఝహరో-రహస్యభేదీ. (అస్యాగుహ్యధరశబ్దభవత్వేయుక్తిరుక్తా.) అని హేమచంద్రుఁడు

(16) దేశీనామమాల. వర్గ. ౬-శ్లో. ౭౨. (17) దేశీనామమాల. వర్గ-౮-శ్లో-౧౨. (18) త్రివిక్రమవ్యాకరణము. అధ్యా-౧ పా ౪ సూ ౧౮౯.

కూడ చెప్పియున్నాఁడు.(19) భట్టిటీ-విష్ణుః (జగత్ప్రేషకత్వాద్భర్తృకః.) పండరంగో-మహేశ్వరః. (పాండరాంగః) (౮) మఱికొన్ని పదములలో వర్ణవిపర్యయములతోపాటు ప్రాకృతకృత్తద్ధితాదిప్రత్యయములుకూడ కనఁబడుచున్నవి. ఇట్టిపదములను త్రివిక్రముఁడు ప్రత్యయప్రకరణముచివరను "వరఇత్తాదిగణము" పేర చేర్చియున్నాఁడు. ఉ॥ వరఇత్తో-నూతనవరః. (సం॥ వరయితృ) మఘోణో-మఘవా. (స్వార్థేణః) చండిక్కో-కోపః (చండోత్కేపేడిక్కః) అవడుక్కిఅం-నిపతితంకూపాద్యవటేషు. (అవటాదుక్తేర్థేడుక్కిఅం) (౯) మఱికొన్నిపదములు ప్రాకృతధాతువుల క్త ప్రత్యయాంతములవలె కనఁబడుచుండును. వీనిని ధాత్వాదేశముల బోధించు ప్రకరణముచివరను త్రివిక్రముఁడు చేర్చియున్నాఁడు. ఉ॥ అవఘుణ్ణం-ఆక్రాంతం; వప్పిఅం-భుక్తమ్.

ఇట్లనేకదేశ్యపదములకు సంస్కృతసంబంధ మగపడుచున్నను కొన్నిటి కట్టిసంబంధము లేదని మనము స్పష్టముగా చెప్పవచ్చును. వానిలో కొన్ని 'ద్రావిడ'భాషాపదములతో సంబంధించియున్నట్లు కనఁబడుచున్నది. ఉ॥ పుల్లీ=వ్యాఘ్రః (దేశీనామమాల.వర్గ-౬. శ్లో-౨౫) (పులియనుపద మీయర్థమున యన్ని 'ద్రావిడ' భాషలలోను కనఁబడుచున్నది) ఓప్పా- శాణాదినామణ్యాదేర్మార్జనమ్ (దేశీనామమాల వర్గ-౧ శ్లో-౧౬౮ (కన్నడమున ఒప్పు యనుపద మీయర్థమున వ్యవహరింపఁబడుచున్నది.) మామీ- మాతులానీ. (అరవమున అమ్మామీ యనుపదము కలదు.) ఇట్లే యనేకప్రాకృతదేశ్యపదములు తెలుఁగుభాషలోని పదములకు సరిపడుచున్నవి. వాని నీక్రింద పొందుపఱుచుచున్నాను.

| ప్రాకృతము. | తెనుఁగు. |
|---|---|
| అక్కసాలా - బలాత్కారః | అక్కసు (?) |
| అక్కా - భగినీ | అక్క |
| అణ్ణఓ - దేవరః | అన్న |
| అత్తా - పితృష్వసా, శ్వశురభార్యా చ. | అత్త |
| అద్దాఓ - దర్పణః | అద్దము |
| అప్పో- పితా | అప్ప |
| అమ్మా- జననీ | అమ్మ |
| అవ్వా- జననీ | అవ్వ |
| ఉబ్బారో- అధికః | ఉబ్బు, ఊరు (?) |
| ఫూరో- గ్రామః | ఊరు |
| కల్లా- మద్యమ్ | కల్లు |
| కసో- పంకః | కసవు |
| కారం- కటు | కారము |
| కావీ- నీలవర్ణా | కావి |
| కురులో- కుటిలకేశః | కురులు |
| కొట్టం- నగరం | కోట |
| కొండఓ- భేదన | కొండెము |
| ఖట్టిక్కో- గ్రామభోక్తా, సౌనికః | కటిక |
| ఖడక్కీ-లఘుద్వారం | కిటికీ |
| ఖడ్డం- శ్మశ్రు | గడ్డము |
| ఖణ్ణం- ఖాతం | కన్నము |
| గత్తం- పంకః | గత్తము |
| ఘోరో- ప్రాకారః | గోడ |
| చిచ్చీ- హుతాశనః | చిచ్చు |
| ఛిప్పం- భిక్షా | చిప్ప (?) |
| ఝడీ- నిరంతరవృష్టిః | జడి |
| డో ఓ- దారుహస్తః | డోకి(గ్రామ్యము)! |

(19) దేశీనామమాల. వర్గ-౧. శ్లో ౪౩.

| ప్రాకృతము. | తెనుఁగు. |
|---|---|
| అణ్ణో- జ్యేష్ఠో భ్రాతా | అన్న (?) |
| తట్టీ- వృతిః | తట్టి |
| తలారో- నగరరక్షకః | తలారి |
| దారో- కటిసూత్రమ్ | దారము |
| పడ్డీ- ప్రథమప్రసూతా | పడ్డ |
| పసండి- కనకమ్ | పసిఁడి |
| పావో- సర్పః | పాము (కన్నడము- పావు) |
| పుల్లీ- వ్యాఘ్రః | పులి |
| పెండం- వలయః | పెండెరము (పెండారము) |
| పొట్టం- ఉదరం | పొట్ట |
| పిడ్డో- / హిడ్డో } వామనః / మామనః } | పొట్టి |
| బులంబులా- బుద్బుదః | బులబుల (గ్రామ్యం) ? |
| భండీ- గంత్రీ | బండి |
| భాఓ- జ్యేష్ఠభగినీపతిః | బావ |
| మఇలో- గతతేజాః | మయిల |
| మగ్గుసూ / మగ్గసో / మంగుసో } నకులః | ముంగిస |
| మట్టిఅం- పీతం | మజ్జిగ |
| మట్ఠో- అలసః | మడ్డి |
| మడో- కంఠః | మెడ |
| మలఓ- గిర్యేకదేశః | మల |
| మాడిఅం- గృహం | మేడ |
| మామా- మాతులానీ | మామ |
| ముద్దీ- చుంబితం / బుందీ- చుంబనం } | ముద్దు |
| మెరా- మర్యాదా | మేర |
| మొగ్గరో- ముకులం | మొగ్గ, మొగడ |
| రొట్టం- తండులపిష్టం | రొట్టి |
| వంగం- వృంతాకం | వంగ |
| వడ్డో- మహాన్ | ఒడ్డు |
| విల్లం- అచ్ఛం / విల్హాం- ధవలం } | వెల్ల |

ద్రావిడభాషాపదములేకాక అన్యదేశ్యములుకూడ ప్రాకృతదేశ్యములలో నున్నట్లు కొందఱు అభిప్రాయపడి యున్నారు. అంగుత్థల (అంగులీయం) మను ప్రాకృతపదము పారసీకభాషలలోని అంగుస్త యనుపదమునుండియు, దత్థరో (-హస్తశాటకః) యను ప్రాకృతపదము దస్తార నుపారసీకపదమునుండియు, బధో (-భృత్యః) యను దేశ్యపదము పారసీకదేశపు బంధక్ అనుపదమునుండియు, పరక్కం (-అల్పస్రోతః) అనుపదము పరక్ అనుపారసీకనదీనామమునుండియు, జయణం (-హయసన్నాహః) అనుపదము పారసీకపుజీను అనుపదమునుండియు, వచ్చినవని కొందఱు చెప్పుచున్నారు. (23)

ఇక్లే కరాళీ (-దంతపవనకాష్టం) యనుపదము అరబ్బీభాషలోని ఖిలాల్ శబ్దభవమని మఱియొకరు చెప్పుచున్నారు. (24)

కాని, ఇట్టి యన్యదేశ్యములు చాలా స్వల్పముగా నున్నట్లు తెలియుచున్నది. 'ద్రావిడ' భాషాపదములుమాత్రము విశేషముగా నున్నవి. అందుచే ప్రాకృతమున దేశ్యము లని వ్యవహరించుపదములలో కొన్ని సంస్కృతపదములవలెను, కొన్ని 'ద్రావిడ' పదములవలెను కనఁబడుచున్నవి. ఆ ద్రావిడపదములలో సంబంధవాచకములును, పక్షిమృగవాచకములును, మొదలగు సామాన్యపదములే కనఁబడుచున్నవి గాని శాస్త్రీయపదములు గాని అపరిచితపక్షిమృగాదివాచకములు గాని లేవు.

(23) చూ. "ఇండియన్ ఆంటిక్వేరి" సం. 46. పుట 33-36.

(24) చూ. 'రాయల్ ఏషియాటిక్ సొసైటీ' వా. పత్రిక. 1919 సం॥రం పుట 285.

సంస్కృతప్రాకృతభాషలు 'ఇండో యూరపియను' భాషాకుటుంబములో చేరిన వనియు, తెలుఁగు, కన్నడము, అరవము 'ద్రావిడ'భాషాకుటుంబములో చేరిన వనియు, ఈ రెండుకుటుంబములకును ఏవిధమైన సంబంధమును లేదనియు, భాషాశాస్త్రజ్ఞులు తగునిదర్శనములతో స్థిరపఱచి యున్నారు. 'ద్రావిడ'భాషలలో సంస్కృతప్రాకృతపదములు విశేషముగా నున్నను, అవి 'కృత్రిమ' పదములు గాని 'ద్రావిడ' భాషలకు 'స్వాభావిక'పదములు కా వనియు, తత్సమ తద్భవదేశ్యములలో మూఁడవజాతిపదములే 'ద్రావిడ'భాషలకు స్వతఃసిద్ధము లగుపదము లనియుఁ గూడ వారి యభిప్రాయము. వీనిలో కొన్నిపదములు ప్రాకృతభాషలలో కనఁబడుచున్నవి. అట్టిపదములను 'ద్రావిడ' భాషలనుండి ప్రాకృతభాషలు గ్రహించిన వని చెప్పవలసి యున్నది. సామాన్యముగా సంబంధవాచకములు, అవయవవాచకములు జీవనయాత్రయందు తఱచుగా నుపయోగించు పదార్థనామములు, గ్రామ్యపక్షిమృగవాచకములు మొదలగుపదము లొకభాషనుండి మఱియొకభాషలోనికి ప్రవేశింప వని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాని, పైపట్టికను చూడఁగా తెలుఁగు మొదలగు 'ద్రావిడ'భాషలనుండి ప్రాకృతమును ప్రవేశించినపదములు చాలవఱకు నిట్టివిగానే యున్నవి. దీనికి కారణమును పండితులు విచారింతురు గాక.

---

# ప్రణయమల్లిక.

[శ్రీరంగం నారాయణబాబుగారు.]

కందళితసర్వసౌందర్యకందమైన
విశ్వ మనువిరిదోఁట, నవిరళగాన
లోహాలము లగుసుఖపుకాలువలకోన,
కెరలుపాలకడలి క్రొత్తనురుగ మెఱుఁగు
జిడ్డుకెరటాలఁ బోలుసుస్నిగ్ధనవ్య
భావదళధాళధళ్యసంపదలు పొలయు,
సరళయౌవనకౌముదీచ్ఛాయలందు,
జీవవిచికిలవల్లరిచివరకొమ్మ
జేబుకొను హృదయపుఁగావిచివురుగుబురు
లోన కమ్మగా వికసించినాను; విమల
ప్రణయమల్లికాబాలికామణిని నేను.
నాయతులమాధురీవర్ణనల నిరతము
పాడుచుండెడు బంభరబాలకవుల
మంజుమానసనీరేజమందిరాలె
యిచ్చమెయి హాయి నే విహరించువిడిదె;
లలితరోత్సాహచకితాంతరాత్మ లగుచు
నాయఖండనిర్మలవాసనాకథాంక
గేయమాలికలను నలుకెలకులందు
వల్లివేసికొనెడుమందవాయుపోత
గాయకశిఖామణిశ్రావ్యకంఠగళిత
గానలహరీతరంగసంఘాలు నాకు
ఖేలనముల నెయ్యంపుటుయ్యాలబార్లు;
కళలఁ దొలకునీయుద్యానతల మదెల్ల
నాదు తేనెలతీపిగానములవలన
నాదువలపుల కమ్మగానముల వలన
ఎల్లపుడు నెలుగిచ్చి ధ్వనించుచుండు
శ్రవణసుఖమున పారవశ్యంబు నొందు,
అకలుషామ్లాననిత్యమల్లికను నేను.

---

# పత్నీదానము.

[చెలికాని సత్యనారాయణగారు]

"ఎంతచక్కగా చెప్పేవోయి! ఈబాల్యవివాహాలతో దేశ మధోగతిలో పడిపోతూ వుందన్నమాట. నిశ్చయమే. వాళ్ళ మూర్ఖతే గాని మరోటి వినరుకదా మన ముసలివాళ్లు! ఆచారవిరుద్ధమైన పని చెయ్యాలంటే కొంపలు మునిగిపోయినట్టు ఆలోచించడమే కాని- దేశకాలపరిస్థితులనుబట్టి- సంఘాభివృద్ధికోసం- యెలాంటూచారాలైనా మార్చడ మవసర మని యెంతచెప్పినా తలకెక్కదు. ఈవేళ పాపం! బ్రాహ్మడు చాలా శ్రమపడ్డాడు- ఏమంటావు?" అనుచు లలితశర్మ- తనప్రాణమిత్రుండగు మురహరిరావుతో పల్కెను.

మిత్రునిపల్కులను పరధ్యానముగా ఏమియో ఆలోచించుచున్న మురహరిరా విట్లు నుడివెను.

"ఏమిటో శర్మా! ఈలాంటిలెక్చర్లు యిదివరకెన్నిసార్లు వినడంలేదు- మహాజనసభల్లో, నోరార్చుకొని పోయేలాగ లెక్చర్లిచ్చినంతమాత్రాన్ని, వార్తాపత్రికల్లో పేజీలకు, పేజీలు వ్యాసాలు వ్రాసినంతమాత్రాన్ని- యేమీ లాభంలేదనే నానమ్మకం- ఈకబుర్లుచెప్పేవాళ్ళంతా కార్యరూపంగా తాము ముందంజవేసి- యితర్లకి బోధించాలి కాని- మీరంతా విధవల్ని పెళ్ళాడడంఅంటే యేమైన సబవుందా?

"అదికాదునేచెప్తూవున్నది. ఈపూర్వాచారపరాయణతచే మంచీ చెడ్డా తెలియకుండా- వాళ్ళకర్థం చాలకపోతే మనమేంచేస్తామని చెప్తూ- క్రమంగా మాటలురానిపిల్లలకే పెళ్ళిళ్లు చేస్తూవున్న ఛాందసులకు- నచ్చచెప్పాలంటున్నాను గాని- నోటితడాఖాలవల్లనే లాభం వుంటుందని నేనుమాత్ర మనుకొంటున్నానా?"

"అవును! ఏమీ లాభంలేదు. 'ముసలివాళ్ళిబ్బంది పడతారనీ' 'చిన్నప్పటినుంచీ పెంచి పెద్దచేసిన తల్లిదండ్రుల కడ్డుచెప్పి సాహసించడానికి మనస్కరించడంలేదనీ' 'మాకుటుంబం చాలపెద్దది. నామూలాన్నివాళ్ళందరూ సంబంధాలు దొరకక-కులానికి దూరమై- అల్లరిపడిపోతారనీ' ఎవడికివాడు తప్పించుకొనే మాటలు చెప్తూ, స్టేజిమీదకెక్కి తన వాక్చాతుర్యమంతా చూపి కబుర్లుచెప్పేవాళ్ళని చూస్తే ఒళ్లు మండుకుపోతూవుంటుంది- వాళ్లే నిజంగా యిలాంటి ఉద్యమాలన్నింటికి ద్రోహులవుతున్నారని చెప్పక తప్పదు. వాళ్ళకలాంటి ధైర్యం చాలనప్పుడు- నల్గురితోబాటు నోరు మూసుకొని ఏమూలనో పడివుండక- కీర్తికోసం- మీటింగులు పెట్టితే ఏమైన అర్థం వుందా!" అనుచు మురహరిరా వించుక కోపముగాపల్కెను.

మిత్రుని యకారణకోపమునకు లలితశర్మ చిఱునగవుతో నాతనిభుజముపై జేయివైచి మెల్లగా దట్టుచు- "నిజమేనోయి! నీవు చెప్పినట్లుగా యీకబుర్లు చెప్పేవాళ్ళంతా "సంఘసంస్కర్తల"యని నల్గురిలో మెప్పు పొందడానికే కాని తమదాకావస్తే వెనుకంజవేసేవాళ్లే. అయినా అందరూ ఆలాంటివాళ్ళే అని మన మనేయ కూడదు."

అనుచు ఇరువురువిద్యార్థు లొకరితోనొకరు వాదప్రతివాదములు చేసికొనుచు రాజమహేంద్రవరపురమందిరమునుండి గోదావరీనదీప్రాంతమునకు పోయి ఒకచో ఆసీనులైరి. వారిరువురును ప్రాణస్నేహితులు. వారిస్నేహ మందఱిస్నేహమువంటిది కాదు. ఏవిషయమునందైనను వారిరువు రొకేమాటపైనుందురు. శరీరమందొక అవయవమున కిబ్బంది గల్గిన మిగిలిన యవయవము లెట్లు బాధనొందునో అట్లే వారిద్దరిలో నొకరికొక్కింతకష్టము సంభవించిన రెండవవా రది పంచుకొనవలసినదే. ఇరువురును పట్టపరీక్షకే చదువుచుండిరి. బసభోజనము లొక్కచోటనే.

లలితశర్మ కిపు డిరువదిమూడవ సంవత్సరము నడుచుచుండెను. తల్లిదండ్రుల కొక్కఁడే కుమారుఁడు. కాపురస్థలము అచ్చటి కించుకదూరములో నున్న అంపాపురమను పల్లెటూరు. వివాహామై అయిదుసంవత్సరము

లు దాఁటెను. భార్య పుష్పవతియై సంవత్సర మైనది. తల్లి దండ్రులు కార్యముచేయ తొందరపడుచున్నను- చదువుముగించినఁగాని- వీలుపడదని శర్మ ఖచితముగా చెప్పుటచే ఇరువురును చేయునది లేక "సరే" అనిరి.

మురళీధరరావున కిరువదిసంవత్సరములవయస్సు కంటె హెచ్చు ఉండదు. అయినను మిక్కిలి చురుకుఁదనముతో ఏతరగతిలోను వెనుకఁబడక పిన్నవయస్సుననే పట్టపరీక్షకు సిద్ధమయ్యెను.

మురళీధరరావున కొకచెల్లెలును, తమ్ముఁడును గలరు. చిన్నవా రగుటచే వా రిర్వురును తల్లిదండ్రుల వద్దనే యుండిరి. మురళీధరునితండ్రి గవర్నమెంటులో గొప్పయుద్యోగము చేసి, విశ్రాంతి తీసికొని కొద్దికాలమే యైనది. సంవత్సరాదాయము మూఁడువే లుండును. అప్పుడే మురళీధరరావునకు వేలకువేలు కట్నములతో పిల్ల నిచ్చెద మని, జమీందార్లు, జడ్జీలు పలుమార్లు కబు ర్లంపుచుండిరి. తల్లిదండ్రులు బలవంత పెట్టుచున్నను, మురళీధరుఁడు వివాహవిషయమై యేమియు బదులు చెప్పలేదు. సామాన్య మగు ఎత్తు కలిగి బలముగ నుండి చూపఱుల కుల్లాసముకలుగఁజేయు సుస్వరూపవంతుఁడు. ఈతఁడు కృష్ణాజిల్లానుండి చదువునిమిత్తము రాజమహేంద్రవరమునకు వచ్చి మూఁడేం డ్లయినది. ఈమూఁడేండ్ల నుండియు శర్మ మురళీధరులొక్కచోటనే యుండి విడుటకు వీలులేనిస్నేహలతచే బంధింపఁబడి యుండిరి.

అట్లే ప్రతిదినము కాలేజి విడిచినపిమ్మట సాయంకాలమున వచ్చి గోదావరినదియొడ్డున చీకటిపడువఱకును కూర్చుండి యేదియో లోకాభిరామాయణమును గుఱించి ముచ్చటించుకొని గృహోన్ముఖు లగుటవాడుక.

II.

పరీక్షాదివసములు సమీపించినవి. విద్యార్థులు రాత్రులందు నిద్రాదేవికి భయపడి- తేనీరు గ్రోలుచు తెల్లవాఱువఱకును ఏకదీక్షగా చదువుచు శల్యమాత్రావశిష్టు లగుచుండిరి.

ఒకనాఁడు మురళీధరరావు మిత్రునికొఱకు కాలేజి అంతా తిరిగి తిరిగి యింటికి వచ్చి ఒకగదిలో మంచముపై నాహారము పక్కను ముసుఁగిడి- మూల్గుచు పండుకొనియున్న లలితశర్మను జూచి "ఏమోయి! శర్మా! ఎప్పుడు వెళ్ళిపోవచ్చావు కాలేజినుంచి! జ్వరం తగిలిందా ఏమి" టనుచు మంచముపైఁ గూర్చుండెను.

మిత్రుని పల్కులు విని శర్మ తేటపాఱఁ జూచుచు,

"మురళీధరా! వచ్చావా! కాలేజీలో కూర్చుని వుండగా రెండుచెక్కలైపోతుందా-అన్నంతగా తల నొప్పి వచ్చింది. నీతో చెప్దామనుకొన్నాను గాని-మీ కేదో పాఠం చెపుతూవుంటే - అమట్టానే యింటికి వచ్చేసాను. ఇంటికివచ్చేసరికల్లా ఉపద్రవమైన చలితో జ్వరం వచ్చింది-తల పగిలిపోతూవుంది! నీపెట్లో అమృతాంజనం ఉందికాబోలు, తీసి కొంచెం వ్రాయి" అని చలితో వణకుచు దుప్పటిని సర్దుకొనెను.

వెంటనే మురళీధరరావు అమృతాంజనము తెచ్చి శర్మ నుదుటిపైని- కణఁతలకును- నురుగువచ్చేలాగున రుద్ది వణఁకుచున్న మిత్రుని గట్టిగా పట్టుకొనెను. ఒక గంటవఱకును చలి తగ్గలేదు. పిమ్మట శర్మ లేచి "మురళీధరరావు! దాహం జాస్తిగా వుందోయి! కొంచెం మంచినీళ్ళ" నెను.

"నీ ళ్లెందుకు! సోడా తెస్తా నుండు" అని మురళీధరరావు బయటికి పోయి, సోడాబుడ్డి తెచ్చి, ఒకగ్లాసులో పోసి మిత్రుని కందించెను. శర్మ సోడా పుచ్చుకొని- అట్లే శయ్యపై మూల్గుచు పండుకొని "ఏమిటో గాని వెన్ను విరిచేస్తుందోయి! అవయవాలన్నీ నలిచివేస్తున్నాయి!" అనెను.

మురళీధరరావు శర్మచేతిని బట్టుకొని నాడిని పరీక్షించి, "బీట్- జాస్తిగానే వుంది! డాక్టరును పిలువనా?" అనెను. "అబ్బే! ఎందుకూ! అక్కర్లేదు" అని శర్మ యట్లే పరుండెను. రాత్రి మురళీధరరావు కొంచెము పాలనుమాత్రము మిత్రున కిచ్చి పరుండఁజేసెను. కాని రాత్రి ఒక్కనిముసమైనను శర్మకు నిద్దుర లేదు. తెల్లవాఱువఱకును మూల్గుచునే యుండెను. శర్మతోపాటు మురళీధరరావునకుఁగూడ రాత్రి జాగరమే యని వేఱుగ చెప్పవలెనా? ఏమన- వా రిరువురిస్నేహ మట్టిది.

మఱునాఁడుకూడ లలితశర్మ కుష్ణము తగ్గలేదు. కాని- తలనొప్పి గాని- మఱేయితరబాధలు గాని- లేవు. డాక్టరు వచ్చి పరీక్షించి- మందిచ్చి- మురళీధరునితో, మందెట్లు యెంతెంతవేళ కియ్యవలెనో వివరముగా చెప్పి వెడలెను.

మూఁడవనాఁడు పాపము! లలితశర్మ కుష్ణ మపరిమితముగా వచ్చినది. శరీర మంతయు అగ్నివలె కాలిపోవుచున్నది. మురళీధరరావున కేమియు తోఁచుట లేదు. పరుగెత్తుకొని పోయి డాక్టరును తోడ్కొని వచ్చెను. డాక్టరు జ్వరమానీయంత్రముతో పరీక్షించెను. 105 డిగ్రీ లుష్ణ మున్నది. శరీరముపై స్మృతిలేకుండ- అట్లే యేమేమియో పలవరించుచు శర్మ పడియుండెను. మురళీధరరా వట్లే కనిపెట్టుకొని యుండి- 'శర్మతండ్రికు త్తరమువ్రాయుదునా' యని పలుసార్లనుకొని, వారేమైన గాబరాపడెదరేమో ? యని మిన్నకుండెను. డాక్టరేదియో మం దిచ్చుచునే యుండెను. సాయంత్రమైదు గంట లగుసరికి శర్మ కండ్లు విప్పి- మిత్రుని పిల్చి రెండు చేతుల కాతనికంఠమును కౌఁగిలించుకొని కన్నులవెంబడి జలజల బాష్పకణములను రాల్చుచు ఏమేమియో అనఁబోవుచుండఁగా డాక్టరు వచ్చుటచే అట్లే మరల శయ్యపై పరుండెను.

III.

అది కార్తికమాసము. ప్రతిగ్రామమందును, సౌభాగ్యవతు లత్యుత్సాహమున శుక్రవారపునోములు నోఁచుకొనుట కారంభించిరి. ఉదయమునే లేచి స్నానముచేసికొని తమ కున్నవానిలో విలువగల వస్త్రములు నగలు ధరించి, పూజాద్రవ్యములు సేకరించుకొని, అందఱొకచోఁ గూడి, ఒకరియంద మొకరు చూచుకొనుచు, ఒకరినగ లొకరు సర్దుకొనుచు విచిత్రముగా సంభాషించుచు, ఒకచో నాసీనులై యుండిరి.

అందఱితోపాటు రుక్మిణీదేవికూడ ప్రాతఃకాలమందే లేచి కాలకృత్యములు నిర్వర్తించుకొని, స్నానముచేసి గులాబిరంగు సరిగంచుచీర కట్టుకొని, తెల్లనిపట్టు రవిక తొడిగి, నొక్కునొక్కులు కలిగి జలదమాలికల నతిరస్కరించు వినీలకుటిలకుంతలములు కాళ్ళగలకు జీరాడ- సర్వదా సంతుష్టిని తెలుపుచు ముద్దులు గుల్కుడినెమ్మోముతో దక్షిణహస్తమున పూసెజ్జ పూని తోడిచెలులతో పూజకై సిద్ధమగుచుండెను.

రుక్మిణీదేవికి పదునేడేండ్లు దాఁటి కొలఁదిదినములుమాత్రమే యైనది. ప్రాయమునకు మించిన యవయవపుష్టియు, పొడవును కలిగి చూడ ముచ్చటగ నుండెను. ఆమె ఎంతసౌందర్యవతియో అంత సుగుణవతి. తల్లిదండ్రుల కొక్కర్తుకయే బిడ్డ యగుటచేత పుట్టినప్పటినుండియు వా రామెను కడుగారాబముతో పెంచి, వివాహము గావించిన రెండేండ్లలోనే పరలోకగతు లగుటచే, పాపము! రుక్మిణీదేవి యత్తవారియింటనే కడువినయముతో మెలఁగుచుండెను. తల్లిదండ్రులు పోవునప్పటి కామె కెనిమిదేండ్లుమాత్రమే ప్రాయము. అందుచే రుక్మిణీదేవి యత్తగారు, కోడలివలెఁగాక రుక్మిణీదేవిని పుత్రికకంటెను హెచ్చుగా చూచుకొనుచుండెను.

ఇంచుమించుగా సమవయస్కలగు చెలులతో కిలకిలారావములు సేయుచు రుక్మిణి పూజ సేయుచుండఁగా వీథిలోనుండి, "బాబూ! శాస్త్రులుగారూ!" అను కేక వినఁబడెను.

ఇంటిముందర నున్న పందిటిక్రింద ఒకకుర్చీమీఁద కూర్చుండి ఏదియో తాళపత్రగ్రంథమును మాటిమాటికి జాఱిపోవుచున్న సులోచనములను సర్దుకొనుచు పరిశీలించుచున్న వేంకటశాస్త్రులుగా రా కేకను విని చప్పున లేచి, "ఎవరువారు! వస్తున్నాను." అనుచు పుస్తకమొకచో నిడి పందిటికుంజకు తగిలించియున్న యంగవస్త్రమును భుజముపై వైచికొని వీథిలోనికిఁ బోయెను.

అచ్చట వేచియున్న తపాలభటుఁడు చేతనున్న కవ రందించి వెడలిపోయెను.

"ఏమిటీ! టెలిగ్రామే!" అని ఆశ్చర్యచకితులై "ఎక్కడనుంచి ఏదీ!" అనుచు వడఁకుచున్న చేతులతో వేంకటశాస్త్రిగా రా కవరును చించి చదివెను.

పాప మాయన చదువుచుండఁగనే మొగము క్రమముగా కళావిహీనమైపోయెను.

ఇంతటిలో అతనిభార్య యగుజానకమ్మ త్వరితముగా వచ్చి "ఏమిటండీ! ఎక్కడనుంచి!! అలాచూస్తారేం!!!" అని ప్రశ్నపై ప్రశ్న వేయుచున్నను- శిలాప్రతిమవలె చైతన్యరహితుఁడై శాస్త్రి యట్లే నిలువఁబడిపోయెను.

భర్తస్థితిఁ జూచి జానకమ్మ సహజస్త్రీచాపల్యముచే గొంతెత్తి బావురని యేడ్వఁదొడఁగెను.

పాపము! ఎంతో ఉత్సాహమున పూజసేయుచు చెల్లెలితో హాస్యము లాడుచు, ఆనందమున నోలలాడుచున్న రుక్మిణీదేవి అకస్మాత్తుగా అత్తగారి రోదనధ్వని విని, అదలిపోయి, ఒక్కపరుగున వీథిలోనికి పోయి, "ఏమండీ! అత్తా!" ఎందుకండీ! అని అఱచుచు తానుగూడ ఏడ్వనారంభించెను. వీరిని జూచి యింటిలో నున్న స్త్రీజన మంతయు రోదనధ్వనులతో అప్రదేశము నింపివైచిరి. కారణ మేమియో ఒక్క శాస్త్రికిఁ దప్ప ఇతరుల కెవ్వరికిని తెలియదు.

ఇంతటిలో ఇరుగుపొరుగువా రందఱును పరుగెత్తుకొని వచ్చిరి. ఈహడావిడిలో శాస్త్రి చేతులలో నున్న కాగిత మట్లే జాఱవిడిచి, నేలపై కూలఁబడెను.

వచ్చినవారిలో నొక రాకాగిత మందుకొని చదివెను. అం దిట్లున్నది.

"మీకుమారుఁడు చాల జబ్బుస్థితిలో నున్నాఁడు. వెంటనే తల్లిని భార్యను తీసికొని మిమ్ములను రాఁగోరుచున్నాఁడు."

మురళీధరరావు.

విచారకారణ మందఱకును తెలిసి కడుంగడు దుఃఖింప నారంభించిరి. "అయ్యో! పాపము! రుక్మిణీదేవి ఎంత దురదృష్టవంతురాలమ్మా! తల్లీ దండ్రీ పోయినా, అన్నింటికీ ఆధారమైన పెనిమిటున్నాడుగదా! అంటే వానికిగూడ ప్రాణసంకటము రావలెనా!" అని స్త్రీలును, "అహా! ఎన్నికష్టాలుపడినా కొడుకుకోసం సర్వం ఖర్చుపెట్టి చదువుచెప్పించి సుఖపడదా మనుకొన్న శాస్త్రిగా రెంతపాపం చేసుకొన్నారో- ఎంతటిలో జబ్బు ముంచేసింది! ఎలాగుంటుందోకదా!" అని పురుషులును తమతమ విచారములను వెలిబుచ్చుచుండిరి. విన్నవా రందఱును కడుంగడు విచారించుచుండ- ఇంక శాస్త్రి- జానకమ్మ- రుక్మిణీదేవుల దుఃఖపరిమితి చెప్పనలవి యగునా! ఏడ్చి-ఏడ్చి శక్తి లేక యట్లే మూర్ఛనొందినది పాపము! రుక్మిణీ దేవి! విధిచెయిదములకు సమయాసమయము లుండవు కాఁబోలును!

IV.

"మీ రలాగే యేడుస్తూ కూర్చుంటే ఆతనికి జబ్బెక్కువౌతుంది! అది రోగి కెంత పాపమో మీకు తెలియదు. ఇప్పుడే మందిచ్చాం. ఒక్కక్షణంలోనే నిద్రపట్టుతుంది. అందుచేత మీ రివతలకు రండి." అనుచు లలితశర్మ పరుండియున్న గదిగుమ్మమువద్ద నిలుచుండి, డాక్టరు జనార్దనరావు ఇంటిలో రోగి మంచముచుట్టును గూర్చుండి రోదనము సేయుచున్న అతని తలిదండ్రులను భార్యను ఊఱడించుచు, పొంగిపొరలివచ్చు దుఃఖమును దిగమ్రింగుచు కనులనుండి బాష్పములను రాల్చుచున్న మురళీధరుని పిలిచెను.

ఎన్నియూఱడింపుఁబల్కులు విన్నను దుఃఖానల మాఁగక చిన్నపిల్లలవలె నేడ్చుచున్న- జానకమ్మ రుక్మిణులు- "రోగి కిబ్బందికలుగుతుం"దను డాక్టరు మాటను విని, గదినుండి బయటికి వచ్చిరి. శాస్త్రి యట్లే గోడపై కొరఁగి కనులు తుడుచుకొనుచుండెను. ఇంక మురళీధరరావు సంగతినిగుఱించి వేఱుగ చెప్పనేల! శర్మ కష్టము వచ్చినవాఁడిగ రోగముచే అతఁ డెట్లుబాధపడుచుండెనో- అంతకంటెను పదిరెట్లధికముగా మిత్రుని స్థితిఁ జూడలేక మురళీధరుఁడు కుందుచుండెను.

క్షణమున కొకసారి డాక్టరు గుండెచలనమును పరీక్షించుచునే యుండెను. సాయంకాల మైదుగంటలైనపిదప డాక్టరు రోగికి మరల 'ఇంజక్షను' నిచ్చి "రాత్రి 10 గంటలకు మరల వచ్చెద గంట కొకసారి మందిమ్మ"ని ఒకసీసా మురళీధరున కిచ్చి, ఆతనితో నేమియో మాట్లాడి పోయెను.

లలితశర్మ అట్లే మూల్గుచు శయ్యపైఁబడి పొర్లాడుచుండెను. క్రమముగా మూలుగు ఎక్కువయ్యెను. రాత్రి యొనిమిదిగంటలు దాఁటెను. మంచమున కొకతట్టు వేంకటశాస్త్రి మురళీధరులును- రెండవవైపు జానకమ్మ రుక్మిణీదేవులును కూర్చుండి కన్నీరు విడుచుచుండిరి. ఉన్నట్లుండి శర్మ దడాలునలేచి- గట్టిగా "మురళీ! నాన్నా!" అనివగర్చుచు "నాన్నా! మఱి-నాకు జీవి-తాశ-లేదు." అనుచు ఆయాసముచే మాట్లాడఁజాలక అట్లే పడిపోయెను.

శర్మపలుక్కుల కందఱును ఒక్కసారిగ గొల్లుమనిరి. కొంచెమునే పట్లుండి శర్మ తిరిగి లేచి—"దాహం! దాహం!" అని మెల్లగా ననెను. వెంటనే మురళీధరుఁడు చప్పున లేచి ఒకగ్లాసుతో కొంచెము పాలను దెచ్చి మిత్రునోట నుంచెను. ఉదయమునుండియు ఔషధమే పుచ్చుకొనుట కసాధ్యమగుస్థితిలోనుండియు యేకారణముననో కాని— శర్మ పాలన్నియు త్రాగివైచి, "మఱి కొంచెం" మనెను. మఱియొకగ్లాసుపాలను దెచ్చి మురళీధరుఁ డిచ్చెను. అవికూడ త్రాగి తేన్చుచు శర్మలేచి కూర్చుండెను.

శర్మయొక్క యీయద్భుతచర్య కచ్చటుకూర్చున్నవా రంతా మిగుల నద్భుత మందసాగిరి.

ఆశ్చర్యముతో వేంకటశాస్త్రి ప్రేమపూర్వకముగా తనయుని వీపుపై నిమురుచు "నాయనా! ఎలావుంది?" అనెను. తండ్రిప్రశ్నకు శర్మ బొటబొట కన్నీరు విడుచుచు— ఆయాసముతో "ఎలావుందా! నాకోసం మీరు దుఃఖించకండి! అన్నింటికీ— యీ నా మిత్రుఁడే— యీ నాసోదరుఁడే— ఉన్నాఁడు. ఇంక మీరితనినే మీతనయుఁ డనుకోండి" అని మురళీధరునిచేయి పట్టుకొని మాపుచు— తల్లివైపుతిరిగి "అమ్మా! ఏడవకు! ఇదుగో నీకొడుకు! నన్నెంత ప్రేమించేదానవో— అంతకంటె ఎక్కువగా జూచుకో యీతనిని. నాన్నా! అమ్మా! మీరు పుట్టినప్పటినుంచీ ఏలోపం లేకుండా— నేటిదాకా— సకలశ్రమాల కోర్చి— పెంచి— పెద్దచేసి— విద్యావంతునిగా జేసినందుకు— మీవృద్ధాప్యంలో మీ కెందుకూ పనికిరాక— మీఋణం తీర్చలేకుండా— వెళ్ళిపోతున్నానుకదా! అన్నవిచారమే నాకెక్కువగా వుంది!" అని ఆయాసముచే ఇంచుకసేపాఁగి తిరుగలేచి మురళీధరుని కంఠమును శుష్కించిపోయిన తనబాహువులతో కౌఁగిలించుకొని— "మురళీ! తమ్ముడూ! నీఋణం యెన్నిజన్మాలకైనా తీర్చలేను. నీసహవాసం విడిచిపెట్టి పోతూవున్న యీదేహం— ఎంతబాధపడుతూవుందో— ఆపరమేశ్వరునికే యెఱుక— నేజచ్చిపోయినా— యింకా నీవల్ల గాదగిన కార్యం ఒక టుండిపోయింది. అది నీవు తప్పక నెరవేరుస్తానని మాటిస్తే నేగాని— తెలుపదలచుకోలేదు." అనినవెంటనే మురళీధరరావుకన్నులొత్తుకొనుచు— "శర్మా! ఎంతమాటన్నావు! నీవుకోరినకార్యం నావల్ల కాదనుమాట యీనోటితో— అనగలనా! నీకోరికెలాంటిదైనాసరే— ఎన్నికష్టాలువచ్చినాసరే— దైవంతోడుగా— తప్పక చేసితీరతాను." అనెను.

మిత్రుని వాగ్దానమును విని శర్మ వికసితవదనుఁడై "మురళీ! నాకోర్కె— నీకెన్నో— శ్రమలు కలుగజేస్తుంది! అయినా— నాకొరకై నీ వాశ్రమలను లెక్కసేయవనునమ్మకం— నాకుంది" అనుచు— తలగడక్రిందనుండి మూఁడుజాబులు తీసి, వానిలో ఒకటి కైకొని "ఇదిగో! నీవు చేయువలసినపని దీనిలో వ్రాసి యుంచినాను" అని యిచ్చెను. తక్కిన రెండుజాబులలో ఒకటి రుక్మిణికిని ఒకటి తండ్రికిని యిచ్చి, ఇవి మీరు పదునాల్గుదినములయినతరువాత విప్పి, చదువుకొని, నా ఆత్మశాంతి కోరుదురేని నాకోరిక తీర్పుఁడి. నాకు నమ్మకము కలిగి సుఖముగా ప్రాణము వదలుటకు నాచేతిలో చేయి వేయుండి. అని తల్లివైపు తిరిగి, "నీవుకూడా నాకోరిక చెల్లించాలె. చేతిలో చేయివేయి." అని కోర అందఱును అట్లుచేసిరి.

పిమ్మట శర్మ తండ్రివైపునకుఁ దిరిగి— "నాన్నా మీ రీకార్యంలో— యేమీ అడ్డుచెప్పకూడదు— నా మిత్రుఁడు— నాకోసం— సర్వము త్యజించి— సిద్ధపడ్డాడు— మీ రడ్డుపెట్టితే నాప్రాణికొట్టుకొట్టుంది! లోకాన్ని విడిచిపెట్టేస్తున్నాను. ఆఖరుకోరిక— మీరు— మురళీ—నన్ను అని యేమిరో చెప్పఁబోవుచు— "అమ్మా!!!" అనిరెండు చేతులతో గుండెనుపట్టుకొని ఒకపెద్ద అఱుపుతో వెనుకకు పడిపోయెను. క్రిందఁబడునేమో యని చప్పున మురళీధరుఁడు రెండుచేతులను చాఁచెను. పాపము! శర్మ ఆనొప్పితో మిత్రునిచేతులలోనే విగతజీవుఁ డాయెను. క్షణములో ఇల్లంతయు రోదనధ్వనులతో నిండిపోయెను.

## V

"మఱి మీరెంత విచారిస్తేమాత్రం— యేమైన లాభం వుందా! జరిగిపోయిందానికి మనమేంజేస్తాం— కర్మ రేపటినుంచే కాబోలు ఆరంభించాలి. ఇక్కడ చేయడానికి వీలులేనట్టుగావుంది! ఏమంటావు!" అని ఒకచో కూర్చుండి గుండెలు పగులున క్లేశ్చుచున్న వేంకటశాస్త్రులుగారిని నూఱడించుచు మురళీధరుఁ డనెను.

"నాయనా! ఇంక మా కీలోకంతో పనేముంది! మాకు కడుపుచిచ్చుపెట్టి నాకన్నతండ్రి వెళ్ళిపోయాడు! నాముద్దులబాబు! నామాట కెన్నడూ యెదురాడి యెఱుఁగఁడు. నానుగుణములరాసి! ఇరవైయేండ్లకే భౌతికదేహాన్ని విడిచిపెట్టేశు! నాయనా! వఠినాకీదేహంయెందుకు! నీవంటిమిత్రుని విడిచిపెట్టిపోయిననాకొడు కెంతదురదృష్టవంతుడో బాబూ! కర్మ యింటికి జోయే చెయ్యాలి! నీ పీపరికు తైపోయఁవెటనేరా! మా పిల్లవాని తుదికోరికఏమో ఉత్తరముఁజప్పి చూచుకొని తెలిసికొని చేయవలసిన యేర్పాట్లుచేసి మేమిద్దరము- పుణ్యక్షేత్రాలకి పోతా"మనుచు మురళీధరునిబట్టుకొని వేంకటశాస్త్రి చిన్నపిల్లలవలె బావురని యేడ్వఁదొడఁగెను. మురళీధరుఁ డాతని నెట్లో యూఱడింపఁజేసెను గాని ఒకేరీతిగ రోదనము సేయుచున్న ఆస్త్రీలను వారింప నాతనితర మగునా! పాపము! మురళీధరుని దుఃఖానలము గుండెలు బ్రద్దలు సేయుచున్నది. అహా! మిత్రప్రేమ యెంతట్టిది!

ఆసాయంకాలమే స్వగ్రామమేగ శాస్త్రి-రుక్మిణీ జానకమ్మలతో బయలుదేఱెను. వారితో మురళీధరుఁడు కూడ ఇంటివఱకుఁ బోయి "విచారించవద్దు" అని చెప్పి చెప్పి వెనుకకుఁ దిరిగెను.

పరీక్షలయినపిదప అంపాపురము వెళ్ళవచ్చెను. బసకు వచ్చెనే కాని మురళీధరుని మనస్సునకు స్వస్థత లేదు. అచ్చటనుండియిచ్చటికిని ఇచ్చటనుండి అచ్చటికిని పిచ్చివానివలె దిరుగుచు-నోటిలో ఏమేమియో గొణుగుకొనుచు- తటాలున ఏడ్చుచు- అట్లే పచారు చేయుచు- ఉన్మాద మెత్తినట్లేయుండెను.

అట్లాతఁడు మూఁడుదినము లుండెను. బడికి పోలేదు. భోజనము లేదు. నిద్ర లేదు. నాల్గవనాఁడు చరచర గదిలోనికిఁ బోయి- ఒక కాగితమును కలమును పట్టుకొని బయటికివచ్చి తండ్రి కీక్రిందివిధమున ఉత్తరము వ్రాయఁదొడఁగెను.

శ్రీవేదమూర్తులైన బ్రహ్మశ్రీ శా. కుటుంబరావు నాన్నగారి పాదపద్మములకు-

మీకుమారుఁడు మురళీధరరావు తు మూపణపూర్వకవందనములతో వ్రాయు విజ్ఞాపనము.

నాకు జ్ఞానము వచ్చినదాదిగ మీమాట కెదురాడి యెఱుఁగను. మీ కనిష్టమైనకార్యము కలలోనైనను చేసియుండలేదు. నాశ్రేయోభివృద్ధికై మీ రత్యంతప్రేమపూర్వకముగ బెద్దవానిని జేసి, విద్యావంతుని గావించిరి. ఈఋణ జన్మాంతరములందుఁగూడ తీర్పఁజాలను. ఇప్పటివఱకు నాయం దున్న వాత్సల్యమే- ఈ ఉత్తరము చూచినపిదపఁగూడ నుంచిన ధన్యుఁడ నగుదును. మీరెన్నఁడను కోనని రీతిగా మీయనుమతి గైకొనకయే- ఒక వింతపనికి కడఁగితిని. అనుమతి వేఁడుకొనుటకుఁగూడఁ అవకాశము లేకపోయినది. మిమ్ములను ప్రార్థించినను మన్నింప రని యెఱుఁగుదును. నామిత్రుఁడు మరణకాలమున నన్నొకకోరిక కోరెను అది నేను మనస్ఫూర్తిగాఁ జేయ నంగీకరించితిని. అదేమనిన: నామిత్రుఁ డగు లలితశర్మ మూఁడురోజులు విషమజ్వరపీడితుఁడై పరలోకమున కేగుచు- తనకోరిక తీర్చునట్లు వాగ్దానము గొని బాల్యవితంతూద్వాహము లవసరము లని వాదించుచుండు నన్ను ఆమెను పెండ్లాడు మనికోరుచు జాబు వ్రాసి చేతికిచ్చి, పరమపదించెను. నేను హృదయపూర్వకముగ నందులకు సమ్మతించితిని. ఏకారణమువలనైన ఇందులకు వ్యతిరేకముగా నడచిన నామిత్రునియాత్మకు అశాంతి కలుగఁజేసి మిత్రద్రోహి నగుదును. కావున మీరు నాతప్పులు క్షమించి- నాముద్దులతమ్ముఁ డగు గోపీనాథునే మీ కన్నివిధములను జేదోడుగా నుంచుకొన ప్రార్థించుచున్నాఁడను. మీరు న న్నీకార్యమునుండి మరలింప ఇంచుకైనను ప్రయత్నింపవలదు. ప్రయత్నించినను లాభముండదని ముందుగానే మనవి చేయుచున్నాఁడను.

చిత్తగింపవలెను.

మురళీధరరావు.

అనివ్రాసి అని పోస్టు చేసెను.

శర్మ గతించిన రెండుమాసములకు మురళీధరరావు పరీక్షలో ఉత్తీర్ణుఁడై, నెలకు నూఱురూప్యముల జీతము సంపాదించు ఉద్యోగములో ప్రవేశించి సర్వజనామోదముగ విద్వజ్జనులు- సంఘసంస్కర్తలు-మిత్రులు-పత్రికాధిపతులు వేనోళ్ళ నుతింప- రుక్మిణీదేవిని వివాహమాడి మిత్రునకుఁ జేసినవాగ్దానము నెఱవేర్చి కృతకృత్యుఁడాయెను. సమాప్తము.

# తిమ్మరుసు-కృష్ణదేవరాయల కృతఘ్నత.

[వేంకట వీరరాజ కవులు.]

గీ. మండితోద్దండదోర్దండ మండలాగ్ర
ఖండితాఖండశాత్రవమండలుండు
కృష్ణరాయండు, గనె భవత్కృపను గాదె
మహితసామ్రాజ్యపదవి? తిమ్మనసుధీంద్ర!.

*   *   *   *   *

ఉ. తుంటరు లాడుపల్కులను తోరపుసత్యము లన్ననమ్మిరన్
గట్టున నీకుమారకుని గండడఁగించి రఁటంచు సర్వదా
కంటికిఱెప్పవోలె నినుఁ గాచుచుఁ బెంచినమంత్రి నంతటిన్
గంటివి నిర్దయన్ బళిరె! కాలమహత్త్వము కృష్ణభూవరా!.

సీ. పినతల్లితిప్పాంబ విస మిచ్చి నినుఁ జంప నెంచి దాదిని నియమించునాఁడు
మరణించుతఱి వీరనరసింహనృపుఁడు నీగ్రుడ్లను పెఱికింపఁ గోరునాఁడు
పాత్రసామంతులు ప్రభుసన్నిధికి నిన్నుఁ బట్టితేఁ బట్టునుబట్టునాఁడు
రామయమంత్రి నిన్ రాజ్యపదభ్రష్టుఁ జేయుట కెత్తులు వేయునాఁడు
తే. గీ. బుద్ధివికసనమున నిన్నుఁ బ్రోచినట్టి, తిమ్మరుసుఁ బట్టి చెఱఁబెట్ట నెమ్మనంబు
కటకటా! ఎట్టు లొప్పె? సత్కవివిధేయ!, ధీరజనగేయ! శ్రీకృష్ణదేవరాయ!.

మ. నరసింహుండు త్వదీయనేత్రముల నన్యాయంబుగాఁ దీయఁ ది
మ్మరుసున్ బ్రేరణ సేయ నిన్ను ననుకంపం బ్రోచునావృద్ధునిన్
గరుణన్ మాని కృతఘ్నమానసుఁడవై కన్దోయి నూడ్పించుటా
అరయన్ ప్రత్యుపకార మయ్యె? తగవేనా? యిద్ది కృష్ణాధిపా!.

సీ. 'దేశభాషలలోనఁ దెనుఁగు లెస్స'ని మాతృభాషను బోషించి ప్రబలలేదె?
అష్టదిగ్గజసమాఖ్యాత మీఱుకవులకుఁ గల్పవృక్షంబవై క్రాలలేదె?
శరణాగతత్రాణబిరుదాంకమున భువి నేకచక్రంబుగా నేలలేదె ?
ఆసేతుశీతాచలాంతర్గతాత్యంతవిమలవిఖ్యాతిని వెలయలేదె!
తే. గీ. అసమభవదీయనిష్కల్మషాతి వేల, సాంద్రసత్కీర్తి సంపూర్ణచంద్రబింబ
మున కిదికళంకమాయెఁగా బుధవిధేయ! ధీరజనగేయ!!, శ్రీకృష్ణదేవరాయ!!!.

---

# సర్వసిద్ధి - రాయవరము.

[గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు, బి. ఏ., బి. ఎల్.]

మహాభారతము తెనుఁగున వ్రాయించి యాంధ్రదేశమునకు వాఙ్మయమునకు మహోపకారము గావించిన రాజనరేంద్రుని మన మందరము నిత్యము స్మరించు కొనుచున్నాము. రాజనరేంద్రుఁడు ఇప్పటికి తొమ్మిదివందలసంవత్సరముల క్రిందట 1022 (క్రీ॥ శ॥) సంవత్సరములో పట్టాభిషిక్తు డయ్యెను. అతడు చాళుక్యవంశపురాజు.

చాళుక్యరాజులు మొదట మహారాష్ట్రదేశమున వాతాపినగరము రాజధానిగా చేసికొని క్రీ॥ శ॥ 4-5 శతాబ్దములలో నా ప్రాంతదేశము నేలినట్లు తెలియవచ్చుచున్నది. ఆరవశతాబ్దాంతమునందు హర్షవర్ధనుఁడు దిగ్విజయము చేయనెంచి దక్షిణాపథమునకు వచ్చినప్పుడు చాళుక్యరాజగు సత్యాశ్రయశ్రీపులకేశివల్లభుఁడు హర్షవర్ధను నెదుర్కొని పరాజితుని గావించి స్వగృహోన్ముఖుని గావించెను.

పిమ్మట నీసత్యాశ్రయుఁడు కళింగ, వేంగీదేశముల జయించి తనసోదరుఁడగు కుబ్జవిష్ణువర్ధనుని యాదేశములకు రాజప్రతినిధిగా నేర్పఱచి తాను వాతాపినగరమున కరిగెను. అనంతరము కుబ్జవిష్ణువర్ధనుఁడు స్వతంత్రుఁడై తూర్పుసముద్రతీరమున నున్నదేశములలో చాళుక్యరాజ్యము స్థిరముగ స్థాపించి యీశాఖకు మూలపురుషుఁ డయినాఁడు. ఈరాజ్యస్థాపనము క్రీ॥ శ॥ 618 సంవత్సరములో జరిగినది. పిమ్మట నాల్గువందలసంవత్సరములకు ఈవంశములో నిరువదియైదవవాఁడగు రాజనరేంద్రుని ప్రోత్సాహమువలన భారతము తెనిఁగింపఁబడినది. ఈచాళుక్యరాజవంశవృక్షము మొదట 1859 సంవత్సరప్రాంతములో సర్ వాల్టర్ ఇలియాట్ దొరగారిచే ప్రకటింపఁబడినది. వీరేశలింగము గారి కవులచరిత్రలోన, వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్రలోను వివరముగా వర్ణింపఁబడినది ఈచాళుక్యవంశమునకుమూలపురుషులయిన కుబ్జవిష్ణువర్ధనునియొక్కయు, అతని పుత్రుఁడగు జయసింహునియొక్కయు చరిత్రములు తెలిసికొనినపక్షమున సర్వసిద్ధియొక్క చరిత్రమును, ప్రాచీనకాలమునం దానగరీమతల్లియొక్క ప్రాముఖ్యమును మనకు కొంత తెలియగలదు.

ఈవిష్ణువర్ధనుఁడు మిక్కిలి పొట్టివాఁడగుటచేత ఈతనికి కుబ్జవిష్ణువర్ధనుఁ డని పేరువచ్చెను. ఇతని శాసనమొకటి యీనడుమ తిమ్మాపురమున నొకరయితు పొలము దున్నుచుండఁగా దొరకినది. ఆశాసనమునం దీతని పరాక్రమము చక్కగా వర్ణింపఁబడినది. "స్థలజలాదపి దుర్గవిష మేవ్యాపి" అనఁగా భూమి పైనిగాని, సముద్రము పైనిగాని యున్నదుర్గము- ఎంత బలిష్ఠమైనది, సాధింప

రానిది, అయినను అనగా నెంత విషమమయి న దైనను యీశూరుఁ డవలీలగ ముట్టడించి, సాధించి స్వాధీనము చేసుకొనుచుండెడివాఁ డఁట. కనుక విషమసిద్ధియని బిరుదువచ్చెను. ఇతనినాణెములు కొన్ని కలకత్తా మ్యూజియములో భద్రపఱుపఁబడి యున్నవి. ఇతఁడు 618 మొదలు 633 వఱకు రాజ్య మేలెను.

ఇతని కుమారుఁడు జయసింహుఁడు 633 లో పట్టాభిషిక్తుఁడై 663 వఱకు రాజ్య మేలినాఁడు. ఇతని కోరిక లన్నియు సిద్ధించినవి గనుక నితనికి సర్వసిద్ధి యని బిరుదునామము గలదు. సర్వసిద్ధిపట్టణము నీతఁడే కట్టించినాఁడు ఇతని శాసనము లనేకములు దొరకినవి. కొన్ని కృష్ణజిల్లా పెదమద్దాలి, గుడివాడ గ్రామములలో కూడ దొరకుటవలన నీతనిరాజ్యము కృష్ణజిల్లా పైవరకు వ్యాపించెనని యూహింపఁబడుచున్నది.

ఈతఁడు చేసినభూదానములనిరూపించు తామ్రశాసనము లనేకము లీనడుమ 'భారతి' సంపుటములలో ప్రకటింపఁబడినవి. అన్నింటిలో 'సర్వసిద్ధి'యను బిరుదునామము గాన్పించుచున్నది. ఈజయసింహుని కాలమునందే చీనాయాత్రికుఁ డగు హయూన్‌చాఁగ్ ఈ దేశమును చూడవచ్చెను.

మఱియు నీజయసింహసర్వసిద్ధి దండిమహాకవి రచించిన దశకుమారచరిత్రయందు ప్రశంసింపఁబడి యున్నాఁడు. ఆంధ్రనాథుఁడైన జయసింహుఁడు "అనేక సలిలతీరణ సాధనములు"అనఁగా, ఓడలతోను, "అనేకానీకములు" అనఁగా విశేష సైన్యములతోను కళింగదేశముపైఁ బడి, వసంతోత్సవసమయమున సముద్రతీరమున నున్న యుద్యానవనములో భార్యాపుత్రికాసహితుఁడై విహరించుచున్న కళింగాధిపుఁ డగు కర్దనుని బట్టి చెఱగొనిపోయినట్లు మంత్రిగుప్తచరిత్రమునందు వర్ణింపఁబడి యున్నది. దండిమహాకవి కాంచీపురపల్లవప్రభువులయొద్ద నాస్థానపండితుఁడుగా నుండినట్లు నిదర్శనములు గలవని "కావ్యాదర్శము"ను ప్రకటించిన శ్రీ॥ శే॥ ప్రొఫెసర్ రంగాచార్యులవారు చెప్పుచున్నారు. రమేశచంద్రదత్తు మొదలగుపండితు లనేకులు దండి యాఱవశతాబ్దమువాఁడని వక్కాణించిరి. అది సరికాఁజాలదు. ఏడవ శతాబ్దివాఁ డగు నంధ్రజయసింహుని ప్రశంసించిన దండిమహాకవి జయసింహుని సమకాలికుఁడో, తరువాతివాఁడో, కావలయునే కాని ముందుకాలపువాఁడు కాఁజాలఁడు.

మఱియు నొకవిశేషము. ఈసర్వసిద్ధిపురము బహుమనీషావంతు లైనసరసులకు నివాసస్థానముగా నుండెడిది. జాణతనంబున మిన్న లని వన్నెకెక్కిన నెల్లూరినెఱజాణల యాటలు మఱచ్చుటనైన సాగెడివి కాని యీసర్వసిద్ధిసరసులకడ సాగెడివి కావు. అన్నివిధములచేతను వారల త్రోసిరాజను సామర్థ్యము వీరికే కలదని శ్రుతిపరంపరగా వినవచ్చుచున్నది. ఈచమత్కారప్రసంగములు కొన్ని వడ్డిపర్తి కోనకవిగారు రచించిన మహాలక్ష్మీపరిణయపీఠికయందు తద్వంశజు లగు వీరరాఘవస్వామిగారు ఇటీవల ప్రకటించి యున్నారు.

ఇట్టి సందర్భములు కొన్ని పట్టిచూడగా, నంధ్రినాథుఁడగు జయసింహుని రాజధానియైన యాంధ్రినగరి యీసర్వసిద్ధియే యని తోఁచుచున్నది. దండిమహాకవి యాంధ్రినగరి వర్ణించుచు నాసమీపమున ననేక జలపక్షుల కాకరమైన గొప్పసరస్సొకటి గలదని వర్ణించినాఁడు—ఆసరస్సు కొల్లేరేనియు, ఆంధ్రినగరి యాసమీపమున నెచ్చటనో యుండియున్నదనియు కొందఱు తలఁచుచున్నారు. కాని సర్వసిద్ధి 'పల్లపునాఁటి' నడుమనుండుటయు, ఎలమంచిలి కాగ్నేయదిశనున్న పెంజెఱువు మొదలు సర్వసిద్ధియవలివఱకు స్వాభావికమైన సరస్సు ఏర్పడియుండుటకును, వరాహ శారదానదు లీ సరస్సును జలపరిపూర్ణము గావించుచుండుటకును నైసర్గికకారణము లగపడుచున్నవి. దిమిలెసమీపమున రత్నాకరస్వామి యాలయమున్నది. సర్వసిద్ధినిగుఱించి విశాఖపట్టణ జిల్లా గజెటీరులో నిట్లు చెప్పఁబడినది. (Page 314) "Sarvasidhi lies 5½ Miles S. W. of Yellamanchili and vew contains only 1015 people. It was, however the Head-Quarters of the Taluq upto 1861, and in days gone by was apparently of considerable inportance tradition declaring that it was one of the seats of the kings who ruled in these parts. Bricks the large kind used in ancient buildings are constantly dug up in its fields."

కాఁబట్టి జయసింహునికాలమున నీపట్టణము ఆంధ్రిదేశమునకు రాజధానియై యుండెననియు, దండిమహాకవి వర్ణించిన యాంధ్రినగరి యిదియే యైయుండునని యు చెప్పవలసియున్నది. జయసింహుఁ డీపురమునకు శంకుస్థాపనచేసిన మహూర్త మెట్టిదో కాని పెక్కుసామ్రాజ్యము లస్తమించినను, 'చాపచిఱిగినను చక్కరంత' యన్నట్లు, ఆ తాలూకా యిప్పటికిని సర్వసిద్ధితాలూకా యనుపేరనే వ్యవహరింపఁబడుచున్నది. ఈ పట్టణమును గట్టించినజయసింహమహారాజు పట్టాభిషిక్తుఁడై యిప్పటికి సుమారు పదమూఁడువందలసంవత్సరములు కావచ్చుచున్నది. చరిత్రాభిమానమును, దేశాభిమానము గల యీప్రాంతమువారెల్లరు నాసమయమున చక్కగా వర్ధంతియుత్సవము జరిపి యారాజచంద్రుని స్మరించుట విధి యని విన్నవించుచున్నాను.

## రాయవరము.

సర్వసిద్ధికి రెండుమూఁడుమైళ్ళదూములో రాయవర మను నొకగ్రామమున్నది. ప్రజలిప్పు డీగ్రామమును 'రాయారి' మనుచున్నారు ఇప్పు డిది వంకాయలకు ప్రసిద్ధిచెందినది. సర్వసిద్ధితాలూకాలో మునసబుకోర్టు రాయవరమునందె ముందు స్థాపింపఁబడెను. కాని ట్రింకురోడ్డు ఎలమంచిలిమీఁదుగా పోవుటచేతను, ఈగ్రామము మొకమూల నుండుటచేతను కోర్టుఎలమంచిలికి మార్చబడినది.

చరిత్రదృష్టితో చూచినపక్షమున నీ రాయవరముగూడ చాల ముఖ్యమైన దనుటకు సందేహము లేదు. ఇయ్యది శ్రీకృష్ణదేవరాయరాజచూడామణి పేరుతో ఖ్యాతి చెందినది. రాయలవారు 'ఆముక్తమాల్యద

దొలో వర్ణించినట్లు, కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోవుచు, మార్గమున నిచట సైన్యములో విడిసిరి. ఈస్థలము దేమివిశేష మామహారాజునకు గోచరించెనో కాని యిచ్చట తక్షణమే తనపేర కృష్ణదేవరాయవర మని యీపట్టణమును కట్టించెను. గొప్ప శిలాశాసనము వ్రాయించి ప్రతిష్ఠించెను. రాయవరముసంతబీటిలో రాచబండ యను పేరఁ బరఁగుచు నీశాసనము గల రాయి యిప్పటికిని పడియున్నది. ఈనడుమ మన సర్కారువారియుద్యోగస్థు లీశాసనమును వ్రాసికొని వెళ్లినట్లు తెలియవచ్చుచున్నది. కనుక త్వరలో ప్రకటింపఁబడునని తలంపవచ్చును.

రాయలవారు రాయవరమునుండి పంచధారాక్షేత్రమును, అచటనుండి సింహాచలక్షేత్రమును సందర్శించుకొనిరి సేనానాయకులు మాడుగుల, పద్మాది మొదలగుప్రదేశముల భస్మము చేసిరి. సింహాచలము దాఁటి పొట్నూరుకడ జయస్తంభము ప్రతిష్ఠించి రాయలవారు మంత్రితిమ్మరుసుబుద్ధిబలముచే కళింగమును జయించి, కటకరాజకుమారికను గైకొని తిరిగివచ్చిరి. ఈయంశములన్నియు మనుచరిత్రమునందు ఆంధ్రకవితాపితామహుఁడగు నల్లసాని పెద్దన వర్ణించియున్నాఁడు.

అట్టి కృష్ణదేవరాయవర మనుపదమునందు కాలమహాత్మ్యముచేత 'కృష్ణదేవ' యను మొదటిపదము జారిపోయినది. రాయవరముమాత్రము కుగ్రామమై మిగిలియున్నది. అయినను చరిత్రప్రసిద్ధమైన రాయలవారి కళింగదిగ్విజయయాత్రకు చిరస్థాయి యైనసాక్ష్య మిచ్చుచున్నది. దేశాభిమానము, చరిత్రాభిమానము, భాషాభిమానముగలవారందఱు కృష్ణదేరాయలశాసనము గలనల్లరాతిని— అనగా నచ్చటి రాచబండను పైకి తీయించి, సాలలో భద్రపఱచి, రాయలవారిశాసనము నుచితరీతిని పూజించి గౌరవింతురుగాక యని కోరుచున్నాను.

# సత్యసూక్ష్మములు.

[సెట్టి లక్ష్మీనరసింహముగారు.]

రంగము—అయోధ్య వెలుపటి దారి.

[హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, విదూషకుఁడైన గణపతి, నక్షత్రకుఁడును బ్రవేశింతురు.]

గణ—మిత్రమా హరిశ్చంద్రా! నీసత్యనియమపు వెఱ్ఱి నాకు వింత గొలుపుచున్నది. ఇప్పుడు నేను నీవెంటఁ గాశికి రాక మాననంటిని. ఏదో ప్రమాదమున నాకాలు విఱుగు ననుకొందము. అప్పుడు, ఈనక్షత్రకుని వీఁపుమీఁదఁ గూర్చుండి యైన రాక తప్పదా? రానిచో, సత్యభంగ మగునా?

హరి—గణపతీ! మన కేవిధముననైన వీలుగల పనులనే మనము చేయఁ గలము గాని, వీలు లేని పనుల నెట్లును జేయఁ జాలము గదా? రాఁ గలవన్న యుద్దేశముతో నీవు వచ్చెద నంటివి. రాఁ గలిగియు నీవు రాకున్నయెడల, అది సత్యభంగమే. ప్రమాదమువలనఁ గాలు విఱిగియో, నీకంటె బలవంతుఁడు నిన్ను బలవంతముగా నాఁపుటచేతనో, మఱి యేయసాధ్యమైన హేతువుననో నీవు రాలేనియెడల, అది నీదోష మెట్లగును?

గీ. అనృతమని యెఱిఁగిన దాని హాస్యమునకు
ననఁగరాదు; చేయ నశక్యమంచు తెలిసి-
నట్టిది యొనర్తు ననఁగ రా; దనినయెడలఁ,
జచ్చియేని చేయవలె: ఇదే సత్యదీక్ష.

గణ—చచ్చి చేయఁగలవి విన్నపములే. మిత్రమా, ఇంకొక్క శంక: హాస్యమునకుఁ గూడ నసత్యము కూడదన్నావు గదా? ఈ నక్షత్రకుని పిల్లసిగ వంకాయమోటికవలె నున్నదని హాస్యమున కన్నచో, అదియు నసత్యమగునా? వంకాయమోటికవలె నితని సిగ పచ్చగా లేదు; దానియం దున్నట్లు దీనియందు ముండ్లు లేవు; దానికి వలె దీనికి రుచి లేదు గదా?

హరి—ఓయీ, అది యసత్యమనిపించుకొనదు. ఏల యనఁగా, నీవు పోల్చిన రెండు వస్తువులకు నేదో సామాన్యధర్మము మనస్సునందుఁ బెట్టుకొనియే యట్లని యుందువు. పోలికలేవియు నసత్యములు కావు. కవులు ముఖము చంద్రబింబమని వర్ణింతురు. ముఖము చంద్రబింబము గాదు; అన్నివిధములను జంద్రబింబము వంటిదియుఁ గాదు. అట్టి వర్ణన కుద్దేశ మేమనఁగా, ముఖము చంద్రబింబముతో నేదో గుణమున సరిపోలు ననియే. అట్లు వర్ణించిన కవులు మన కేమియు నసత్యము చెప్పఁ బ్రయత్నింప లేదు.

గణ—నీయమ్మ కడుపు చల్లగా! అంత మాత్రమైన నొప్పుకొంటివి. లేనియెడలఁ,

గవులందఱు నసత్యములకుఁ బుట్టినిండ్లయి నరకకూపమునఁ బడి కొట్టుకొనవలసినదే. కవుల ప్రశంస వచ్చినది గనుక మఱి యొక సంశయము: ఉపమారూపకముల కేమి? అతిశయోక్తులను వారు వాడుదురే! మేడలు మింటికంటుకొన్నవందురు; ఆఁడువారికి నడుములు లేవందురు; వారి కన్నులు చెవులలోఁ దూఱుచున్న వందురు: ఇవి యైన నసత్యములగునా?

హరి—ఇవియు నసత్యములుగా లెక్కింపరాదు మాటలకుఁ బైకిఁ దోఁచు నర్థములుగాక యితరార్థములు నుండును. మేడలు మింటికంటుకొన్నవన్న దాని కర్థము మిక్కిలి యెత్తుగా నున్నవనుటయే; అంతే గాని, నిజముగా నంటుకొన్నవనుట కాదు. అట్లే, నడుములు లేవనుటకర్థము మిక్కిలి సన్నముగా నున్నవనుటయే; కేవలమును లేవనుట కాదు. అట్లు వర్ణించిన కవుల యుద్దేశమంతే; చదువరులకు స్ఫురించు నర్థము నంతే.

మ. చెవికిం బొంపుగ, ఆత్మ కింపుగ ధరా-
చిత్రంబులం గూర్చి యా-
త్మవచోమాధురి వన్నె పెట్టుచును స-
ద్గ్రంథంబులన్ వ్రాసి, యీ
భువిలో జ్ఞానము వృద్ధి చేసెడి మహా
పుణ్యాత్ములౌ వారు సత్
కవులే; వారు వచించువాక్కుల నస-
త్యం బుండఁగా నేర్చునే?

గణ—ఇక్కడకుఁ గవులు గట్టెక్కినారు ఇఁక సామాన్యుల సంగతి; హాస్యమునకైన నసత్యమాడ రాదంటివి; సరియే. మర్యాదకైన నాడవచ్చునా? ఈనక్షత్రకుని జూచి, "ఓయీ, నీవు కోఁతివలె నున్నావు," అని యున్న దున్నట్లుగానే చెప్పక తప్పదా? చెప్పుట మానినచో, అసత్యదోషము కలుగునా?

హరి—నక్షత్రకుని గూర్చి నీవామాట చెప్పవలసిన యవసరము లేదు. అది చెప్పుమని నిన్నెవ్వరును గోరలేదు. చెప్పవలసిన బాధ్యతనీకు లేదు. అనవసరముగా మాటలాడుటయే కూడదు.

తే గీ. పలుకు సరిగ దైవస్వరూపంబె గాన,
మాటకును దేవునికి బలెఁ జాటు వలయు;
మూఢమానవులకె కాక, భువిని సర్వ
పురుషులకు మానమే సుమ్ము భూషణమ్ము.

'పలుకు బంగారమా?' అని లోకములో సామెత కలదు. నిజముగాఁ బలుకు బంగారమంత విలువైనదనియే యెంచి మితముగా వెచ్చింపవలయును. అయినను, ఒక్కటి: మానమువలన సత్యము కప్పిపుచ్చఁ దలఁచుట మాత్రము దోషము; అది యసత్యముతోడనే సమానము.

క. లేని దనుట, సందిగ్ధము-
లౌనుడులనన్నృతమునమ్మనటు చేయుటయున్,
మానమున నిజము దాఁచం
బూనుటయు నసత్యములని భువి నెన్నఁబడున్.

గణ—మిత్రమా, ఏదైన ననవసరముగాఁ బలుకుట కూడదు గనుక, నక్షత్రకుని రూపముఁ గూర్చి యడుగనిదియుఁ జెప్పరా

దంటివి. సరియే: ఒప్పుకొన్నాను. నక్షత్ర కుఁడే తన రూపమును గూర్చి నన్నడిగిన నో? అప్పుడేమి చెప్పవలెను? అతనిది కిష్కింధలోఁ బుట్టిన వారియాకారము వంటిది యని నా యభిప్రాయము. అట్లే చెప్పవలయునా? అతనిమనస్సు నొప్పించుట యెందులకని కొంచెము మార్చి చెప్పినయెడల నసత్యమగునా?

హరి—నిజముగా నీ యభిప్రాయమదియే యైనయెడల, అట్లే చెప్పవలయును.

గణ—మార్చి చెప్పినచో, ఎవ్వరికేమి నష్టము?

హరి—ఉన్నదున్నట్లుగానే చెప్పినచో, ఎవ్వరికేమి నష్టము?

గణ—ఇంతకు ముందే చెప్పితిని గదా? నక్షత్రికుని మనస్సు నొప్పి చెందును.

హరి—అట్లయిన యెడలఁ, గొంత యుద్దేశము తోడనే బుద్ధిపూర్వకముగా నీవు సత్యము మార్పఁ దలఁచితివన్న మాట. అట్లు చేయుటే యసత్యమనిపించుకొనును. సత్య మాడుటవలనఁ గలుగు నష్టములకు జనులు భయపడియే యసత్యములాడుదురు. బొంకుట యనఁగా జంకుట యన్నమాట.

గణ—నక్షత్రికుని యొద్ద నాకుఁ గల జంకేమి? నా కర్మము!

హరి—ఉన్నదున్నట్లు చెప్పిన యెడల, నక్షత్రికుని మనస్సు నొచ్చునేమో యని జంకియే నీవసత్యము పలుకుటకుఁ బ్రియత్నించుట. ఇదియే కాదు. ఏయసత్యమున కైనను భయమే నిజమైన కారణము. ధీరుఁడైనవాఁడు సత్యభీరుఁడు కానేరఁడు.

గణ—మఱి యొక్క-సంగతి: ఎవరైనను మన కుశలముఁ గూర్చి యడిగినప్పుడు, "తమ దయవల్లఁగుశలమే," యందుము మన బద్ధశత్రువులడిగినప్పుడును మర్యాద కట్లే యందుము. అది యసత్యము కాదా?

హరి—కాదని నా యభిప్రాయము. "తమ దయ వల్ల," నను పదములకుఁ బైకిఁ దోఁచుచున్న యర్థమక్కడ సరి కాదు. అట్లనుట వట్టి మర్యాదాసూచకము. కుశలమడుగుట దయ సూచించుచున్నదని సూక్ష్మముగాఁ దెలియఁ జేయుదుము.

గణ—ఓహో! సత్యసూక్ష్మము లెంత వింతగా నున్నవి!

# వివిధపద్యావళి.

[శ్రీవిక్రమదేవవర్మగారు.]

ద్విప్రాసకందము.

నీరదనీలనిభాంగా
శారదరాకాశశాంక♦సముముఖ జగదా
ధార దరచక్రహస్తా
ఘోరదనుజహంతకావ♦సూరిమిమమ్మున్.

త్రిప్రాసకదము.

రామ కమలేశ జలద
శ్యామ కమలమందిర విన♦తాద్రికుమారీ
భీమ కమనీయతాజిత [త్రోక.
కామ కమలనేత్ర నన్నుఁ♦గావుముకృప

గీ. జగము బ్రహ్మమయంబుగా ♦జ్ఞాని యెంచు
భక్తుఁడుదలంచు జగమెల్ల ♦ బ్రహ్మముదిగ
జ్ఞాని కర్మసంచయమును ♦ బూనివిడుచుఁ
గర్మిగోరఁడు దాఁజేయు ♦ కర్మఫలము.

గీ. తనదు జీవితమున రెండు♦దినము లేని
సరిగఁ గడిపెడు పూరుష♦వరుఁడు లేఁడు
కానఁ గర్తను శాస్త్రను ♦ నేన యనుచు
విఱ్ఱవీఁగుట చెల్లునే ♦ వెఱ్ఱి యగుచు.

గీ. చెదపురుగునిజాస్యమునుండి♦చెమ్మ, సాలె
పురుగుతంతువుఁ గలిగించు♦పోలుపుఁ జూచి
చేతనంబగు బ్రహ్మంబ ♦ స్వీయశక్తి
వలనజడసృష్టిఁ జేయుట♦ దెలియఁదగును

గీ. గదిఁ బ్రదీపంబులవెలుంగ♦ఖండమగుచు
వ్యాప్తమగురీతిబ్రహ్మంబు♦నందుఁ గలిసి
పోనరు జ్ఞానక్రియేచ్ఛల ♦ న్మాయశక్తు
లెపుడుఁబూర్ణంబులయి జగ♦ద్ధేతువులయి.

గీ. అమరురూపభేద మచేత♦నములయందు
జ్ఞానతారతమ్యము చేత♦నముల నొప్పు
నొక్కదానిని బోలి వే♦ఱొకటి లేక
వస్తుజాలంబు జగమున ♦ వఱలుచుండు.

ఆ. హరికిఁ దులసిగలదు ♦ హరునకుబిల్వంబు
గలదు ధాత కెట్టి ♦ దళము లేదు
ఇట్టు లుండఁ బూజ ♦ నిఁక నెట్టులయ్యెడు
సృష్టికర్తకు దళ ♦ యిట్లు కలిగె!

క. పతి మెచ్చనిసతి, వసుధా
పతి మెచ్చనికింకరుండు,♦వత్తయుఁజనియున్
మతి మెచ్చనితనయుఁడుఁ బం
డితనాథులు మెచ్చనికవి♦ నీచులు గారే?

గీ. జ్ఞానమునకునొప్పుడుసాధ♦నంబు మెదడు
భక్తికిని సాధనంబు హృ♦త్పంకజంబు
కర్మసాధన మింద్రియ♦గ్రామ మగును
జలన మఱుబుద్ధి వైరాగ్య♦సాధనంబు.

గీ కర్మయుక్తంబుగనొ జ్ఞాన♦కలితముగనొ
భక్తి వెలయును మనుజహృ♦త్పంకజమునఁ
గఫయుతముగానొ♦ పైత్యసం♦కలితముగనొ
వాత మంగంబునం గనం♦బడుభంగి.

గీ ఏకవచనరూపం బుండి ♦ యొసఁగ నిత్య
బహువచనశబ్ద పాటద్ధి ♦ పరమచిత్రి
మయ్యు దుర్గినశబ్దంబ♦యట్టులుండు
సకలభాషల మఱి సర్వ♦సమయములను.

గీ. ధనముగలవాఁడె ఘనతను ♦ గనెడుచోట్లు
రెండె కల వందు మొదటిది ♦ రెయిలుబండి
రెండవది కన్యాసుందరీ ♦ గృహము దలఁప
మూఁడవది వేఱొకటి లేదు ♦ ముజ్జగములఁ.

గీ. భోజ్యరసములలో రెండె ♦ ముఖ్యములయి
తవును మొదటిది యుప్పు రెం ♦ డవది తీపి
కావ్యరసములయందు శృం ♦ గార వీర
హాస్యకరుణారసములు ము ♦ ఖ్యంబులగును.

గీ. శిశుత మొగ్గ, కౌమారంబు ♦ చెలఁగుపూవు
బ్రహ్మచర్యంబు పిందె, గా ♦ ర్హస్థ్య మెన్నఁ
గాయ, వనవాసిధర్మంబు ♦ కమ్మఁబండు
తలఁపసన్యాస మయ్యెడు ♦ ఫలరసంబు.

గీ. విగ్రహారాధనంబును ♦ విడువవలయు
దేవు నైదుకాలములఁ బ్రా ♦ ర్థింపవలయు
జనులమితదానములచేతఁ ♦ దనుపవలయుఁ
గోలతఁ దూనికన్నమముగ ♦ సలుపవలయు
పడ్డిగొనుకోర్కి బొత్తిగ ♦ వదలవలయు
ననుచు మాత్రమే తెలియఁజే ♦ యును గురాను.

సమస్యాపూరణము.

క. క్షితికష్టము వారింపఁగ
నతిపాతకుఁడైన తారకాసురుఁ జంపన్
రతిపతియుసురులఁ గొన్నన
సతిసతిఁగవయంగఁబుత్రసంతతిగలిగెన్.

గీ. ఇలను సోదరభావంబు ♦ వెలయఁజేయు
మామతంబంచుఁ గొందఱు ♦ మనుజులందు
దానివిశుద్ధచిత్తంబు ♦ దక్క నొకమ
తంబు నెలకొల్పునే నిశ్చ ♦ లంబుగాను?

గీ. చావులేనివాణులఁ బోలె ♦ జనులు చచ్చి
నట్టివారికై శోకింతు ♦ రజ్ఞులగుచు
దగ్గఱనయున్న తమచావుఁ ♦ దలఁచియేడ్చి
తిరుగ నద్ది రానట్టుల ♦ తిరుగు టొప్పు.

గీ. సాలెపురు గాత్మనిర్మిత ♦ జాలమందుఁ
జిక్కుకొనియుండు వడువున ♦ జీవుఁ డాత్మ
రచితకర్మజాలంబున ♦ బ్రబలముగను
జిక్కుకొని పరమపదంబుఁ ♦ జేరలేఁడు.

గీ. కర్మవితతికి నధికారి ♦ కంజభవుఁడు
భక్తి కధికారి యిందిరా ♦ వల్లభుండు
జ్ఞానమున కధికారి యీ ♦ శానుఁడగుట
వారి కృపలేక పడయరు ♦ వాని జనులు.

గీ. ఎట్టి నాతినైనను వరి ♦ యింపవచ్చు
నెట్టి వస్తువైనను భుజి ♦ యింపవచ్చు
నెట్టి మతము నైనను గ్రహి ♦ యింపవచ్చు
నించుకైన దోషంబు లే ♦ దిప్పు డకట!

గీ. జనన మొందుట బాధలం ♦ గనుట దుదను
నీల్గుట సమస్తదేహుల ♦ నియతి గాన
వానికై ధీరుఁ డడలఁడు ♦ భయపడండు
సేయఁదగు చేఁతలను బూని ♦ చేయుచుండు.

ఆ. నాలుకలు పదేను ♦ నయనంబులు పదాఱు
కాళ్ళు రెండు రెండు ♦ కరము లమరు
వింతలందు మిగుల ♦ వింత భావింపఁగా
దీని భావ మేమి ♦ ధీరులార ?

క. పయఉదధియందు నహిపై
శయనించెడువిభుఁడు నీర ♦ జాతాక్షుఁడు దా
దయఁ జూపి యభీష్టార్థవి [మమ్మున్.
చయ మొసఁగుచుఁ గాచుఁగాక ♦ సతతము

చ. ఎనుబదినాల్గులక్షలకు ♦ హీనముగాని
విచిత్రవేషముల్, గనుఁగొననీవు నీయొకు
టఁ ♦ గాదె ధరించితీనయ్య నీవు తృప్తిని

గడు నొందితేని మద♦భీష్టవరంబు నొసం
గు; కానిచో, ననుచుము వేసము ల్విడు
వు♦మా యిఁక నీవని కృష్ణ కేశవా.

ఆ. పరఁగఁదాల్చితి నెను♦బదినాల్గులక్షల
భూమికలను నీకు♦మోాలఁ దుష్టిఁ
గంటివేని నాకు♦కామితవర మిమ్ము
కనకయున్నఁ జాలు ♦ ననుము కృష్ణ.

చ. అలరసుభద్రిబ్రహ్మగ మ♦హాహాలిహాల
హాలాశనుంఘుగా, నలపురుషోత్తముండు
కమ♦లాక్షుఁడుగాను త్రిమూర్తు లావఁన్,
జెలువుగ వాణియు న్విమల ♦ శ్రీయుఁ
ద్రిశక్తులుగాఁగఁ దోఁచుటన్, సులలిత
భక్తిచేఁ బురిని♦సొంపుగఁ గొల్తుము నిత్య
మూర్తులన్.

గీ. భర్గలింగఁ బుఁ జూడఁగ♦వైష్ణవులకు
లింగమే బ్రహ్మ మను శైవ♦పుంగవులకుఁ
దెలివి గలిగింప సింహాద్రి ♦ వెలసి లింగ
తను దదంతర్గతాకృతి ♦ దనరు నృహరి.

సీ. ఒకచేత బంగారు ♦ నొకచేత వెండిని
బూనుచు వచ్చిన♦మానవునకు
సరిసంఖ్య పైఁడికిఁ ♦ జన చేసి వెండికి
గుఱుతులుగానుంచు♦ కొమ్మనియును
గుడిచేతిదానిని ♦ గుదురుగా సరిసంఖ్యఁ
బెఱచేతిదానిని ♦ జేసిసంఖ్య
చే గుణకము చేసి ♦ బాగుగా నారెండు
మొత్తంబులను నొక్క♦మొత్తముగను
జేసి యాయంకె నీతోడ♦ జెప్పుమనియు
నడుగు మాతండు సెప్పిన♦యంకె చేసి
రైనచో దక్షిణ కరంబు♦తోను పైఁడి
సరిగనుండిన వెండియం ♦ చరసిపలుకు.

క. పను లౌను బ్రియత్నముచే
తన; కావవిబహుమనోర♦థములున్నంతన్
దనగుహానిద్రించినఁ హరి
ఘనముఖమునఁ జొచ్చునేమృ♦గప్రకరమెటన్

గీ. ఎచటినుండివచ్చితి నట ♦ కేగెద నని
తలఁపఁదలఁపంగఁబరమాత్మ♦దెలియఁబడుచు
ఎవఁడ నేనని తర్కింప ♦ హృదయమందుఁ
దెలియఁబడిమెడు జీవాత్మ ♦ దెల్లముగను.

ఆ. సుధయన నమృతంబు♦సున్నంబునౌ సుధా
కరుఁ డనఁగ ధవళ ♦ కిరణుఁ డసుమి
సుధకిరవనుపద్ది ♦ సూరికల్పిత మగు
నమృతమునకుపసతి ♦ యగునె గ్రహము?

క. కనకముఁ గాంతయుఁ గీర్తియుఁ
దనరఁగ కారత్రియంబు♦దానసొకటఁ జి
క్కినమనుజునిమానసమున [గలుగున్.
కనిశము భ్రమణాబు మఱియు ♦ నటమట

గీ. గౌరవముగలవానిని ♦ గడఁగి దించి
గౌరవము లేనివానినే ♦ పారనెత్తి
సుప్రమాణపదంబును ♦ జూఱకొన్న
దాననంచుం దులాగర్వ ♦ మూనఁబోకు.

ఆ. చేఁతలు సరిగాను ♦ జేసెద నని పెంపు
జెప్పువారు వానిఁ ♦ జేయలేరు
చేయువారెపుడున♦జెప్పికొనరు గాంచ
నఱచుచుండుకుక్క ♦ గఱవ దెచట.

గీ. నిత్యతో పదస్థానఁబు ♦ నీఁగి దుఃఖ
దయగు నిలఁ గల్గి నీవు రో♦దనముసేయ
నగినబంధుల నితరుల ♦ నగచునట్లు
చేసి నగుచు స్వస్థానంబుఁ♦జేరఁగడఁగు.

గీ. పరుఁడుఁ జనేత్రిములతోఁ దః♦బరుని లోటుఁ
జూచెడినిగాని తనలోటుఁ ♦ జూడలేఁడు

తనదుల్లోటును దానెప్పు ♦ గనఁగలండొ
యపుడె సుజ్ఞానియను నాఖ్య ♦ నందుఁ గాదె?

క. చెవులుండియు గానరసముఁ
జవిగొనలేనట్టి యధము ♦ జన్మం బేలా
చెవిలేకయె తద్రసమును
జవిగొనియెడు దమ్మొంకు పాము ♦ ననునుత్తమమై

గీ. చెఱకు విలుకాని డాకకు ♦ న్వెఱపు నొందఁ
దుండునే మర్త్యతతి దాని ♦ కోర్వలేక
పరఁగఁ ద్రిపురాసురాంతకు ♦ పౌరుషంబు
గనఁగ నగమయ్యె నవ్ఖ్యాతి ♦ వనరు చుండ.

గీ. అజ్ఞులనునట్లు కాలంబు ♦ నందు బాగు
నోగు నుండవు పనులంద ♦ యుండు నవ్వి
యొక్కసమయంబున నెపెండ్లి ♦ యొక్కచోటఁ
జావు వేఱొకచోటునం ♦ జరుగుఁగాదె?

క. గీతాశాస్త్రంబును విడి
క్ష్మాతలమున మఱొకదాని ♦ జదువుట [సుఘృతో
పేత మగు పాయసము విడి
యాతతరాగంబుతోడ ♦ నంబలిఁదినుటే.

గీ. ప్రణవజపమున జ్ఞానసం ♦ ప్రాప్తి యనుట
గల్ల; చిత్తశుద్ధియె దాని ♦ కారణంబు
జీవమున్న గాడిదయు ని ♦ ర్జీవమైన
సంకునఁ బ్రణవోచ్చరణము ♦ సలుపుఁగాదె?

క. ఆసకు దాసుం డెవ్వఁడొ
దాసుఁడగునతండు సర్వ ♦ ధరణీ చరులకున్
ఆస యెవనికిం దాసియొ
దాసులగుదు రెల్లజనులు ♦ తథ్యము తనికిన్.

గీ. విడువఁబడు నూపిరి మరలఁ ♦ బీల్పఁబడని
స్థితియె మరణంబు తత్ప్రాప్తి ♦ దెలియఁబడదు
కాన విడుచు నూపిరితోడ ♦ మానవుండు
రాము స్మరియించుచుండుటే ♦ క్షేమ మగును.

గీ. ప్రాణులకు దుఃఖము నొసంగి ♦ పరమసుఖము
నొందఁజూచును వేటకాఁ ♦ డుర్వియందుఁ
బ్రాణులకు దుఃఖమును బాపి ♦ పరమసుఖము
నొందఁజూచును గద తాను ♦ యోగివరుఁడు.

గీ. ప్రతిమ నర్చింప నత్యంత ♦ పాప మబ్బు
ననుచు నుడివెడువాఁ డాటుఁ ♦ డధికభక్తిఁ
గనకమును గాంతఁ బూజించు ♦ చనవరతము
విహితకర్ముఁడ నని విఱ్ఱ ♦ వీఁగుచుండు.

గీ. గొప్పవైయున్న యాతన ♦ గొప్పయగునె?
గొప్పనైయుండు తాడును ♦ నొప్పునీత
చెట్టు నిచ్చునే నీడను? ♦ జెలఁగు వాని
ఫలముఁ లొందంగఁ దరమౌనె ♦ సులభముగను?

# తెనుఁగు-పరిపూర్ణపాండిత్యము.

[మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు]

ఎవరికిఁగాని తమది ఏదేని గొప్ప దని పైవారు మెచ్చుకొనునపుడును, తాము గొప్ప దని నిబ్బరముగా చెప్పుకొనఁగలుగునపుడును ఎంతో సంతోషము కలుగుచుండును. అట్టివానిలో భాష ఒకటి. భాషకు గొప్పఁదనము కలిగించులక్షణములు మూఁడు మొదటిది మాటలాడుజనులసంఖ్య హెచ్చుగా ఉండుట; రెండవది పరిపూర్ణపాండిత్యము కలిగించుటకు సాధనము లగుగ్రంథము లన్నియు ఉండుట; మూఁడవది పైభాషలవారు కోరి తమభాషలలోనికి మార్చుకొనఁ దగినమంచి గ్రంథము లుండుట. ఇందు, మొదటిది సాధారణలక్షణము; తక్కినవి విశేషలక్షణములు. తుదిది ఒక్కటియే లక్షణముగా కొందఱు కైకొందురు. తొలిదానికంటె రెండవదియు, రెండవదానికంటె మూఁడవదియు మిన్నలనఁ దగు. కాన, వరుసగా అవి అధమమధ్యమోత్తమలక్షణము లన వచ్చును. ఈలక్షణములనుబట్టియే మహాభాషలతారతమ్యమును నిర్ణయ మగునుగదా! దీనినిబట్టి మనమాతృభాష— తెనుఁగు— ఎట్టిదో కనుఁగొన నగును.

మన తెనుఁగు రెండు కోట్లకంటె హెచ్చుమందిమాటలాడుమహాభాష; జనసంఖ్యనుబట్టి భరతఖండములోనిదేశభాషలలో మూఁడవది. హిందీబంగాళీభాషలే దీనికంటె గొప్పవి. తక్కినవన్నియు దీనితరువాతివే. అందుచేతనేకదా భరతఖండమున కెల్ల ఏదో ఒకదేశభాషను ముఖ్యభాషగా చేయవలయు ననునుద్యమము బయలుదేఱినపుడు తెలుఁగు తానును తల యెత్తి హిందీతో పోటీచేయ సాహసింపఁగలుగుట! ఇంతియ కాక, తెనుఁగు తనమాటతియ్యఁదనంపు బెంపుంబట్టి పాశ్చాత్యపండితులచే 'తూర్పిటాలియనుభాష' అనుబిరుదు పొందఁగలిగినది. ఇఁక, భాషాచరిత్రము చూచినచో- ఇది పెక్కువేలేండ్లనుండి వాడుకలో నున్నట్లు తెలియవచ్చును. ఇందు, మహాభారతము కొంత నన్నయభట్టు ౯౦౦ సంవత్సరములక్రిందట వ్రాసె; తక్కినది తరువాత తిక్కనసోమయాజియు, ఎఱ్ఱాప్రెగడయును ముగించిరి. పిదప, రామాయణము- భాగవతము మొదలగుగ్రంథములు పెక్కులు పుట్టినవి. వ్యాకరణములు, ఛందోగ్రంథములు, అలంకారగ్రంథములు మొదలగునవి వెలువడినవి; వెలువడుచున్నవి. ఎందఱో కవులును, మహాకవులును, కవిరాజులును, పండితకవులును, పండితులును, మహాపండితులును వెలసిరి; వెలయుచున్నారు. మహోపాధ్యాయ మహామహోపాధ్యాయాదిబిరుదములును మనపండితులకు లభించుభాగ్య మబ్బినది. ఆంధ్రసాహిత్యపరిషత్తేర్పడినది. దానిపెద్దఱికముక్రింద సూర్యరా

యాంధ్రనిఘంటువు సిద్ధమగుచున్నది. ఇంకను, ఎన్నో సంఘములు పొడమినవి; పనిచేయుచున్నవి. దినవారపక్షమాసఋతుపత్రికలు, గ్రంథమాలికలు, వార్షికసంచికలు మొదలగునవి వెలసి, దేశమం దెల్లెడల వ్యాపించుచున్నవి. ఇంతే కాదు. తుదకు, ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తుకూడ స్థాపిత మైనది.

ఇంతపని మనభాషావిషయమున పూర్వము జరగి ఇప్పుడు జరుగుచుండఁగా సంతసింపనిస్వభాషాభిమాని అగు తెనుఁగువాఁడెవఁ డుండును?

కాని, పరికించి చూచినచో మనభాషనుగూర్చి మనకు కలుగుసంతసము నిలుకడ గలనిండుసంతస మగుటకు వీ లుండునో! ఉండదో! అక్కడనే చిక్కు. నిజము చెప్పవలసి వచ్చినపుడు, మనవాఙ్మయమునకు-పైభాషలవారు కోరి తమభాషలలోనికి తీసికొనఁదగుఉత్తమగ్రంథములు లేనికొఱంతయే కాక, ఆవశ్యకము లగులక్షణగ్రంథములు లేనికొఱంతయు కలిగి, స్వభాషాభిమానులకు పరిపూర్ణపాండిత్యము సమకూర్చుపసలే కున్నదని చెప్పక తప్పదు. దీనినిబట్టియే కొందఱు తెనుఁగు మహాభాషలలో లెక్కింపఁ దగినది కా దని నిరసింపఁ గలుగుచున్నారు. ఇందుచేతనే మనము 'తెనుఁగు మహాభాష.' అని నిబ్బరముగా చెప్పఁ జాల కున్నారము.

ఇఁక, పరిపూర్ణపాండిత్య మబ్బునట్లు చేసి, భాషకు గౌరవము కలిగించులక్షణగ్రంథములు మనభాషలో ఎంతవఱకున్నవో చూతము. "౧ తెలుఁగుభాషలోనిపదములకు వ్యుత్పత్తి మొదలగు వానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమునువివరించుసర్వాంకషమగునిఘంటువునొకదానిని రచించి ప్రచురించుట, ౨ తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతో సాదృశ్యములను సాకల్యముగ నిరూపించునొకవ్యాకరణమునురచించి ప్రచురించుట, ౩ పారిభాషికశబ్దకోశమునిద్ధము చేయుట" మొదలగుప్రయోజనములకొఱకు ఆంధ్రసాహిత్యపరిషత్తేర్పడుటయే అప్పటికి మనభాషకు లక్షణగ్రంథపరిపూర్ణత లేదనుటకు పెద్దనిదర్శనము. పరిషత్తువారు నిఘంటునిర్మాణమునకు పూనుకొనిరి; వ్యాకరణముగాని పారిభాషికశబ్దకోశముగాని రచింప ఇప్పటికి ప్రారంభించినటుల కాన రాదు. మొదలిడిననిఘంటువును ప్రచురించిన దానిలోనిమచ్చుపదములనుబట్టి సర్వంకషము కాదు. సాధనసామగ్రి చాలమిచే వారు శబ్దోత్పత్తి నిర్ణయించుప్రయత్నము మానివేసినారు. కాన, తెనుఁగువ్యాకరణమున విభజించినవిధము ననుసరించి కూడ సూర్యరాయాంధ్రనిఘంటువున పదములు కానరావు. విపరీతజ్ఞానముకలిగించుటకంటె ఊరకుండుటయే ఉత్తమ మని నిఘంటునిర్మాతలు శబ్దరత్నాకరములోనిపదవిభజనపద్ధతి గ్రహింప రైరని అనుకొనవలయును. కాని, ఈవిషయము స్వభాషాభిమానులకు ఎంతో ఆశాభంగము కలిగించినది. వానకై వేచియుండువానకోయిలలకు వానకు బదులు వఱపు వచ్చినపుడు వగపుకలుగుట వింత కాదుగదా! పైసాధనసామగ్రిలోపము లోకమున కంతకును తెలిసినదే. అందుచేతనేకదా పరి

పత్తువారు నిఘంటునిర్మాణమునకు కొ్రొత్తగా తాము పూనుకొనవలసి వచ్చుట! అట్టిచో వా రాలోపము తీర్చుటకు వలయు ప్రియము చేయ కుందురా? తప్పక చేసియుండు రనుకొనఁ జను కాని, ఆప్రయత్నఫలము వారికి తృప్తి కలిగింపఁజాలినది కాకపోయి యుండ వచ్చును. తగినపండితులు దొరక లే దందురా? లేనివా రెక్కడనుండి వచ్చెదరు? ఉన్నవారిచేత నే వలయుకృషి చేయించి, లేనిసాధనసామగ్రి సమకూర్చుకొనవలసి యుండును. అది ఏకతమున నైననేమి జరుగ లేదు. కాన, సూర్యరాయాంధ్రనిఘంటువు వలన అచ్చతెనుఁగునుడులకు ఉత్పత్తిగాని, వ్యుత్పత్తిగాని తెలిసికొనఁగలుగుభాగ్యము తెలుఁగువారికి లభింపకపోవుట నిశ్చయ మైనది.

ఇంతదాఁక ఎందులకు? ఇప్పటికిని మనభాషకు పేర్లగు తెనుఁగు-తెలుఁగును డులకు ఉత్పత్తిగాని, వ్యుత్పత్తిగాని ఏమో! సరిగా తెలియదు.

ఈదుస్థితి సర్వంకష మగునిఘంటువు లేనిలోపము వేనోళ్ళ వెల్లడించుట లేదా?

ఇట్లే లక్షణగ్రంథములన్నియు మనకు లోపములే. ధాతుపాఠాదులతో సమగ్ర మగువ్యాకరణముగాని, ప్రకృతిశాస్త్రములు రచించుటకు సాయపడుపారిభాషికశబ్దకోశముగాని సమర్థము లగుఛందఃకావ్యనాటకాలంకారలక్షణగ్రంథములుగాని తెనుఁగున కానరావు. ఇట్టిచో ఉత్తమవాఙ్మయము మన కెక్కడనుండి వచ్చును?

ఇఁక నైన మాతృభాషాభిమాను లగు తెలుఁగువారు పట్టుదలతో పని చేసి—వలయుసాధనసామగ్రి సమకూర్చుకొని—పై లోపములు తీర్చుకొననిచో, లోకములో తమభాషమహాభాష అని చెప్పుకొని, తల యెత్తుకొని తిరుగఁ జాలరు.

ఇపుడు తెనుఁగున పరిపూర్ణపాండిత్యము గగనారవిందముగా నుండుటనుగూర్చి వివరించుటకు ముందు, దానికి వలయుసాధనసామగ్రిలోప మెట్లు కలిగినదో కనుఁగొన నగు.

భాషాపాండిత్యమునకు లక్షణగ్రంథములు ముఖ్యసాధనములు. అందు, నిఘంటువ్యాకరణములు అత్యావశ్యకములు. కాన, వాఙ్మయాభివృద్ధియు-దానిచే జ్ఞానాభివృద్ధియు చేసికొని మే లొందఁగోరువారునిఘంటువ్యాకరణములు--సంపూర్ణములు దుర్లభములుగాన--సమర్థము లయినవి సిద్ధముచేసికొన వలయును. ఈపని కొన్నిగ్రంథములు బయలుదేఱిన పిదపనే జరుగును గాని మొట్టమొదటనే జరుగుట సహజము కాదు. సంస్కృతమున నిఘంటువ్యాకరణము లట్టివే పుట్టినవి. అందుచేత నే అది సర్వసమర్థ మగుభాష కాఁ జాలినది. ఆంగ్లేయాదిభాషలందును అటులే జరిగి, అవియు సర్వసమర్థములు కాఁ జాలుచున్నవి. కాని, మన తెనుఁగుభాషకు ఆభాగ్యము కలుగ లేదు. రాజమహేంద్రుఁ డగు రాజరాజన రేంద్రుఁడు 'భారతకథాశ్రవణాభిరతి' చే కోర, 'విపులశబ్దానుశాసనుఁడు' నన్నయభట్టు వేఁగినాటితెనుఁగున భారతము కొంత

రచించె. దానిననుసరించియే తిక్కనసోమయాజి మొదలగువారు గ్రంథములు రచించిరి. అయినను, అప్పటికి నిఘంటువు రచించు ప్రయత్నము మాత్రమేకారణముననో ఎవరును చేసినట్లుగాని, చేయించినట్లుగాని కానరాదు. అంతే కాదు. పిదప, ఆంధ్రభాషాపోషకుఁడని పేరొందిన కృష్ణదేవరాయల నాఁడును ఆప్రయత్నము జరుగదయ్యె. అది తెనుఁగువారికి దురదృష్టమే. తుదకు పదునెనిమిదవ శతాబ్దిని దక్షిణదేశమున నుదురుపాటి వేంకనార్యుఁడు 'ఆంధ్రభాషార్ణవము' అమరకోశపద్ధతిని కష్టమున కోర్చి, అచ్చతెనుఁగునుడులేర్చి, పద్యములుగా కూర్చి, తెనుఁగువారికి మహోపకారమొనర్చె. ఆంధ్రనామసంగ్రహము మొదలగు మఱికొన్ని పద్యనిఘంటువులును వెలువడె కాని, అవి అన్నియుకూడ శబ్దోత్పత్తివిభజనము ననుసరించి వ్రాసినవి కావు. కావున, వానివలన ఉత్పత్తి తెలియరాదు. పోనిండు. తరువాత బయలుదేఱిన అకారాదినిఘంటువులవలన ఆ లోపము తీఱినదేమో! అని చూచిన అదియును జరుగలేదు. శబ్దరత్నాకరమందులకు ప్రయత్నించినది. సూర్యరాయాంధ్రనిఘంటువు సాధనసామగ్రి చాలదని ఆప్రయత్నమే వదలుకొనినది. ఇటుల నిఘంటునిర్మాణమున లోపము కలిగినది.

నిఘంటునిర్మాణమున లోపము కలిగినదనుటకు అర్థమేమి? తెనుఁగువారికి ఎవరికిఁగాని అర్థజ్ఞానము సంపూర్ణముగా లభించుటకు అవకాశము లేదనుటయే.

అయిన, తెనుఁగున పరిపూర్ణపాండిత్యమెవరికిని లేదా? ఉండుటకు వీలున్నదో లేదో చూతము.

అర్థజ్ఞానము పాండిత్యమునకు తల్లి. ఇది నిఘంటువులవలన ముఖ్యముగా కలుగవలయును. నిఘంటువులకు పదములు లోకవ్యవహారమువలన సిద్ధమగు భాషనుండి రావలయును. పూర్వము తెనుఁగున పాండిత్యము సంపాదింపఁగోరువారు అచ్చతెనుఁగునుడులయర్థజ్ఞానముకొఱకు ఆంధ్రనామసంగ్రహమందఱును, సాంబనిఘంటువు- వేంకటేశాంధ్రము మొదలగునవి కొందఱును చదువుచుండెడివారు; సంస్కృతశబ్దార్థజ్ఞానముకొఱకు అమరకోశమందఱును- నానార్థరత్నమాల మొదలగునవి కొందఱును చదువుచుండెడివారు. తెనుఁగుబడులలో కొన్నినిఘంటువులు చదివించెడివారు కాని, మనదేశమున ఇంగ్లీషుబడులు బలిసి, వానిననుసరించియే తెనుఁగుబడులును మాఱుటచే ఇపుడావాడుక మొత్తముమీఁద పోయినదనియే చెప్పవచ్చును. తెనుఁగుపాండిత్యమునకై నిఘంటువులువల్లించినయిప్పటిపండితులకు ఈనడుమనే అచ్చుపడిన 'ఆంధ్రభాషార్ణవము' ఎంతమందికి వ్రాఁతప్రతిగా లభ్యమైనదో తెలియదు. పైని చెప్పిననిఘంటువులును, తదితరములును వల్లించి కంఠస్థములుగా చేసికొన్నవారికిని అర్థజ్ఞానము పరిపూర్ణముగా కలుగుననుట కల్ల. వీనితోడ్పాటు కొంతవఱకే. వీనికి తోడు అకారాదినిఘంటువులు కావలయు

ను. అందు, అచ్చతెనుఁగునుడులకు ఆంధ్ర పదపారిజాతలక్ష్మీనారాయణీయనిఘంటువుల యు- సంస్కృతశబ్దములకు సర్వశబ్దసంబోధిని, ఆప్టినిఘంటువు మొద లగువానియు- తెనుఁగునుడుల కన్నిటికిని బ్రౌనునిఘంటువు, శబ్దరత్నాకరము మొద లగువానియు సాయ మిప్పటికిని తప్ప కున్నదికదా? సూర్యరాయ నిఘంటువు వెలువడుచో ఇవి అన్నియు చేయుసాయమును- చేయఁజాలనిసాయము నుకూడ అది ఒకటియే చేయఁ జాలునేమో యని పలువు రాసించు చుండిరి కాని, దా నిమచ్చునుడులనుబట్టి చూడ, అందు తెనుఁగునుడు లన్నియు ఉండ వనుకొన వీలు కలుగుచున్నది. కాన, అది ఆఆశ ఫలింపఁ జేయఁ జాలదేమో! ఇప్పటికి పైనినుడివిన రెండు తెలుఁగులనిఘంటువులును కలసికూడ అర్థజ్ఞానము పూర్తిగా కలిగింప తోడ్పడఁ జాల కుండుటచేత, సందర్భమును బట్టి ఏదో అర్థము చెప్పుకొని సరిపెట్టుకొనుటయో, అదియుకుదుర కున్న వదలివేయుటయో తట స్థించుచున్నది.

అటు వదలివేసిననుడుల యర్థమునకు గతి ఏమి? పలుగ్రంథములు పరిశోధించుచో ఒకదానిలో సందర్భమును బట్టి స్పష్టముగా తేలినఅర్థము మఱొకదానిలో అంత కుమునుపు విడకుండ నుండిన సందేహమును తీర్ప వచ్చును. కాని, అర్థవిషయమున సందేహాస్పదము లగుఅన్నిపదములయర్థమును అట్లే విడుటకు వీలగునా? కాదనియే చెప్ప క తప్పదు.

కావున, అర్థజ్ఞానము సంపూర్ణముగా లభించుటకు ఇప్పటికి తగిననిఘంటువులు లే వనుట స్పష్టము.

ఇదిసాధారణార్థజ్ఞానమునుగూర్చియే.

ఇఁక వ్యుత్పత్త్యర్థజ్ఞానమును గూర్చి చూతము. సంస్కృత సమ పదముల వ్యుత్పత్త్యర్థము సంస్కృతగ్రంథములసాహాయ్యమున తెలిసికొన వచ్చును. కాన, అంతవఱకు సంపూర్ణజ్ఞానము లభించుటకు వీలు కలదు. కాని, అచ్చతెనుఁగునుడులవ్యుత్పత్త్యర్థము ఏవిద్యార్థియో సంస్కృతసమాచ్ఛికపదభేద మెఱుంగక ఆచ్ఛికపదమునకు దేని కేని వ్యుత్పత్త్యర్థ మేమని యడుగునపుడు కొందఱుఉపాధ్యాయులు నిరసనపునగవు నగుచు 'అది అచ్చతెనుఁగు; దానికి వ్యుత్పత్త్యర్థ మేమి?' అనుచుండుటయే ఈవిషయమున సంపూర్ణపాండిత్య మెవరికిఁగాని లే దనుటకు దృష్టాంతము. ఇందులకు కారణము, అథర్వణాచార్యుని 'దేశ్య మవ్యుత్పన్న' మనువాక్యమే కా నోపును.

అయిన, అచ్చతెనుఁగు నుడులకు వ్యుత్పత్త్యర్థము లేనిమాట నిజమా? ఇది నిజమెట్లగును? అచ్చతెనుఁగు భాష కాదా? భాష అనునపుడు దానియందలి నుడులకు వ్యుత్పత్త్యర్థము లే దనుట ఎట్లు? సంస్కృతపదములకువలెనే అచ్చతెనుఁగు నుడులకును ఉండ వలయును. కొన్నిపదము లవ్యుత్పత్తి తెలియరాక పోవచ్చును? అంత మాత్రమున వేనికిని వ్యుత్పత్తి లేనలే దన రాదుకదా? కాని, వ్యుత్పత్తి తెలుపునిఘం

టువు తెరఁగున లేమింజేసియు, తెనుఁగు నుడులకు వ్యుత్పత్తి ఉండ దనువెఱ్ఱినమ్మకమునుబట్టియు కొందఱు పైవిధమున ననుట తటస్థించుచున్నది. కాని, అది సరిగా ఆలోచించి చెప్పుమాట కాదు. ఆలోచించినను వ్యుత్పత్తి తెలియకున్నను తెలియ దని చెప్పఁ దగునే కాని లే దని చెప్ప రాదు.

ఎటు లయిన నేమి? ఇప్పటికి అచ్చ తెనుఁగునుడుల వ్యుత్పత్త్యర్థజ్ఞానము తెనుఁగుపండితులకు చాలవఱకు శూన్యమే. సాధారణార్థజ్ఞానమందును కొంతలోప మున్నట్లింతకుముందే అనుకొన్నారము. ఇట్టిచో ఎట్టివారికిఁగాని తెనుఁగున అర్థజ్ఞానము పరిపూర్ణముగా లభించుట ఎట్లు? పరిపూర్ణమగునర్థజ్ఞానమే లేనిచో పరిపూర్ణ పాండిత్యము లభించు టెట్లు?

ఇఁక వ్యాకరణపుముచ్చట చూతము. భాషాచరిత్రము లరసినచో, ఏదేశమునఁగాని గ్రాంథికభాషకు ఆదేశపువ్యావహారికభాషయే తల్లి. వ్యాకరణపాండితియే దాది. కబ్బపుబాసబిడ్డకు తనతల్లిపాలే తొలిప్రాపు; దానికి తోడు దాదిపాలు. వెఱబాసచెలువలును ఎడనెడ తమపాలు క్రోల నిచ్చెదరుగాక! తల్లిపాలతో పెరిఁగినపిల్ల తల్లిగుణములతో విలసిల్లి, తనవారియుల్లములు రంజిల్లఁజేయఁ జాలుచుండును. ఇఁక తల్లిపాలపెంపునకు దాదిపాలపెంపును సాయపడినచో చెప్ప వలసిన దేమి? కాని, మఱొక తెఱఁగున పెరుఁగవలసివచ్చినయెడల అనురువు తొరఁగ కుండునా?

పైపరిపాటినిబట్టి మనప్రొత్తపుబాస బిడ్డరూపు పరికింతము. ఇది తల్లిపాలప్రాపు మీఁదనే పెరుఁగుభాగ్యమునకు నోచుకొనదయ్యె. దాదిపాలతోడను దీనికి సరిగా దొరకదయ్యె. బిచ్చపుఁబోఁతపాలబలిమియే పెనుసాయ మయ్యె. ఇట్టికడకండ్లలో ఎట్టులో పెరిఁగినది; పెద్ద దయినది. కాని, తల్లిపాలుగాని- దాదిపాలుగాని- సరిగా లేనికొఱత పెంపులో కనిపింప కుండు టెట్లు? సాజమగుపాలతో రావలసినసొగసును- బలిమియును రాక, రూపు చెడకుండు టెట్లు? పోఁతపాలరూపుతోడను- ఎరువునగలవేసముతోడను ఇది తనవారిని కొందఱను కొంతవఱకు సంతసింపఁజేయఁ గలిగె. అంత, దైవానుగ్రహమున దీనికి తల్లిపాలును బాగుగ త్రాగు భాగ్య మబ్బె. అందువలన హెచ్చుగా క్రోలినపోఁతపాలచే వచ్చినవెఱరూపు చాలవఱకు తగ్గి, తల్లిపోలిక పొడగట్టి, వపుగా పెరిఁగి, తనవారికి తొల్లిటికంటె ముద్దుమురిపెములు చూపఁ గలిగె. ఇటుల, తొలుత ఒకరూపును- పిదప మఱొకరూపును దీని కొదవె. అప్పటినుండి ఇప్పటిదనుక పోషణభేదమునుబట్టి సహజరూపము మాఱుదురవస్థ దీనికి తప్ప లేదనియే చెప్పవలసి యున్నది. భాషాయోషల కొండొరులసరకు తెరవుగొని వాడుకొనునలవాటు వింత కాకున్నను మితిమీఱిన పేరు చెడునుగదా? దురదృష్టవశమున ఆదురవస్థయే మనగ్రాంథికభాషకు కలిగినది. చూడుఁడు. నన్నయాదులకవిత్వమున తెనుఁగునుడులకంటె సంస్కృతపదము

తే ఎంతో హెచ్చు. అంతటితో అయినదా? తొలితెలుఁగువ్యాకరణ మగు 'ఆంధ్రశబ్దచింతామణి' సంస్కృతభాషలో నున్నది. దాని వ్యాఖ్యానము 'కవిశిరోభూషణము' సంస్కృతభాషలో నున్నది. 'వికృతివివేకము' సంస్కృతము. 'హరికారికలు' సంస్కృతము. చిన్నయసూరి రచించిన తొలితెలుఁగువ్యాకృతి సంస్కృతము. 'ఆంధ్రకౌముది' సంస్కృతము; దీనికి కొసరు నాగరలిపి: ఉదాహరణములుమాత్రము తెనుఁగు. ఈతెనుఁగువ్యాకరణము లెవరికొఱకు వ్రాసిరో! తెనుఁగువారికొఱకా? సంస్కృతపండితులకొఱకా? దీనినిబట్టి తెనుఁగువారు తెనుఁగువ్యాకరణము చదువుకొనుటకుముందు సంస్కృతము చదువుకొన వలయును; పాండిత్యము సంపాదించుకొన వలయును. నాగరలిపి నేర్చుకొన వలయును. అప్పుడు తమభాషావ్యాకరణము చదువుకొన వలయును. ఇట్టిదుర్గతి తెలుఁగువారికేకాని, లోకములో మఱియెవరికిని కలిగినటుల కాన రాదు. దీనికి కారణము, పైతెనుఁగువ్యాకరణములు వ్రాసినవారు తెనుఁగునందే గాఢాభిమానము కలవారు కాక- సంస్కృతమునందే గాఢాభిమానము కలవా రగుటయే- అని అనుకొనక తప్పదు. ఇట్లనుటకు సాక్ష్య మేమందురా? కనుఁడు. ఆంధ్రశబ్దచింతామణి 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః' (సంస్కృతప్రాకృతములు ప్రకృతులు; ఈ ఆంధ్రభాష వానివికృతి.)—అని శాసించె. ఈ పాటయే తక్కినవ్యాకరణములు పెక్కులు పాడినవి; ఇంకను పాడుచున్నవి! 'అభినవదండి' అనుబిరుదు పొందినమూలఘటికకేతన, స్వతంత్రముగా తాను వ్రాసినతొలిపద్యవ్యాకరణ మగు 'ఆంధ్రభాషాభూషణము' నందును—

"తే.గీ. తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును
దానివలనఁ గొంత గానఁబడియెఁ
గొంత దాన కలిగె నంతయు నేకమై
తెనుఁగుబాస నాఁగ వినుతి కెక్కె."

అనియే చెప్పె. కాని, తెనుఁగును కేవలవికృతిగా మాత్రము చేయఁ డయ్యె. అయినను, సంస్కృతమువలన కలిగినకొంత ముందుదా? తనకుఁదాన కలిగినకొంత ముందుదా? సహజముగా తనకుఁదానకలిగినదే కదా ముందుది కావలె అప్పుడు సంస్కృతము తెనుఁగునకు తల్లి అగునా? కాదే!

ఇటుల స్వతంత్రదేశభాష అగు తెనుఁగు తనయందభిమానము లేనిసంస్కృతపండితులకును, వారి ననుసరించువారలకును వికృతియే అయినది; అగుచున్నది. మహారాష్ట్రదేశభాష అగుప్రాకృతము ప్రకృతి కాఁగా, తెనుఁగుదేశభాష అగుతెనుఁగు ప్రకృతి కాదు; వికృతి. —అనుటకంటె సాహసము మఱొకటి ఉండునా? ఆసాహసము తెనుఁగువారి కెల్లరకు చిరకాలము సమ్మోహనాస్త్ర మగుటకంటె మిన్న యగువింత మఱొకటి ఉండునా? అప్పకవి తెనుఁగు ప్రాకృతభేద మనియు-అష్టభాషలలో ఒకటి అనియు చెప్పియు, అది సంస్కృతప్రాకృతములవికృతి అని తెనిఁగించి, అంతటితో, ఊర

కుండె. దీనికి మాతృభాషయందు గాఢాభిమానము లేమి కాక కారణము మ రేమి ? తుదకు విదేశస్థులు మనదేశమునకు వచ్చి, మనభాష పరీక్షించి, తెనుఁగును స్వతంత్రభాష యే—ప్రకృతి యే—ఒక దేశ భాష యే; సంస్కృత ప్రాకృతాది భాషలసాయము పొందినంతమాత్రమున కేవలవికృతి అగు టెట్లు ? అని స్పష్టముగా బోధింపఁగా మనలో కొందఱ కా సమ్మోహము పోయినది; కొందఱ కింకను పోనే లేదు. అహహా ! అస్వతంత్రత దేనిలోఁగాని ఎంతకు చాలదు ? అది మనుష్యులను మనుష్యులు కాకుండఁ జేయఁ గలుగుచో స్వతంత్రభాషను వికృతిగా చేయఁగలుగుటలో వింత ఏ మున్నది ?

నిజమునకు ఆంధ్రరాజులనాఁటి ఆంధ్రము ప్రాకృతములలో ఒకటి కా నగు; మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగా రొక ఉపన్యాసమున తెలిపినటుల పైశాచీభేదము కా వచ్చును. కాన, ప్రాకృతభేద మగు ఆ ఆంధ్రము వికృతి అయిన అగుఁగాక! కాని, ఆంధ్రశబ్దచింతామణి తెలిపినఆంధ్రము-- తెనుఁగు—మాత్రము వికృతి కాదు. ఆవ్యాకరణమే 'దేశ్యము ప్రవాహిని' అని తెలుపక తప్పినది కాదు. దేశ్యము వికృతి కాదుకదా? అదే తెనుఁగున ముఖ్యభాగముకదా? అట్టిచో తెనుఁగునకు--ఆంధ్ర మను పేర—వికృతిత్వము కల్పించుట న్యాయమా? కా కున్న నేమి? సంస్కృతమునందుఁ గలగాఢాభిమాన మట్లు చేయించినది. ఆవికృతిత్వము బాగుగా వ్యాపించినది. కనుంగొనుఁడు.—తెనుఁగు నాలుగువిధము లని చెప్పుటలో- వికృతిసిద్ధాంతము బలపడు నని కాఁబోలు—'తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి' తద్భవము, తత్సమము, దేశ్యము, గ్రామ్యము—అని ఇది నాలుగువిధములు- అని, తద్భవతత్సమభాగములకు ప్రాముఖ్య మిచ్చి, ఇంటిలోనివస్తువులజాబితా వ్రాయ మొదలుపెట్టి తరువాతవచ్చినవి మొదటను- మొదటినుండియు ఉన్నవి తుదను వ్రాసినట్లు, పిదప వచ్చినతద్భవతత్సమములను మొదటికి తెచ్చి, మొదటినుండి ఉన్నదియు- ప్రవాహినియు నగుదేశ్యమును వానివెనుకకు ఈడ్చివేసినారు. ఇట్టిఅన్యాయము తెనుఁగునందే అభిమానము గలతెనుఁగువారు తెనుఁగువ్యాకరణము వ్రాయుచో ఎన్నఁ డైన కలుగునా?

ఈపట్టున ఒక్క విషయము చెప్ప నగును. ఆంధ్రరాజులభాష అగుఆంధ్రము ప్రాకృతభేద మనియు- దేశ్య మగుతెనుఁగు ద్రావిడభాషాభేద మనియు పిదప అవి రెండును కలసి ఒకేభాష అయి, అది ఆరెండు పేర్లతోడనే కాక 'తెలుఁగు' అనుపేరుతోడను పరఁగుచున్న దనియు విమర్శింపమియు దేశ్యప్రాముఖ్యమును గణింపమియు, సంస్కృతమునకును—దానితోపాటు ప్రాకృతమునకును--అత్యధికప్రాముఖ్య మిచ్చుటయు, మనవారు వికృతిసిద్ధాంతవిమోహమునకులో నగుటకు కారణములుగా కాన వచ్చును. పండితులు యథార్థ మారసి, నిర్ణయింతురుగాక!

ప్రాకృతము భారతీబాల్యభాషితమని అంగీకరించియు, అది సంస్కారము పొంది సంస్కృత మయిన దని చెప్పుటకు బదులుగా, ప్రాకృతదేశ్యపదములను లెక్కింపక ప్రాకృతము సంస్కృతభవ మని చెప్పినపద్ధతినే సంస్కృతపండితులు తెనుఁగు విషయమునను అవలంబించిరి! ఇది వారికి సంస్కృతముపైఁ గలగాఢాభిమానమును వెల్లడించుటచే అందులకు సంతసింప వచ్చునుగాని, విమర్శన సామర్థ్యమునుగాని- సత్యమునుగాని ప్రకటింపమికి వగవక తప్పదు.

ఇంతటితో పోయినదా ఈపారతంత్ర్యదోషము? లేదు; లేదు. ఇపుడు దేశస్వాతంత్ర్యమును పోఁగొట్టుకొని విదేశప్రభుత్వమునకు బానిస లగుమనవారు మనదేశమున నే అమర్చుకొనఁ దగినబట్టలు మొదలగు వస్తువులుకూడ అమర్చుకొని వాడుకొనక పరదేశములనుండి దిగుమతిచేసి వాడుకొనునట్లు, తెనుఁగువ్యాకరణములు వ్రాయువారు సంస్కృతవ్యాకరణములోని పారిభాషిక పదములు విచ్చలవిడిగా తమకృతులలోనికి దిగుమతిచేసి వాడ మొదలిడినారు; వాడుచున్నారు. చూడుఁడు:—వ్యాకరణము, వర్ణము, అచ్చు, హల్లు, సంధి, అత్తు, ఉత్తు, లట్టు, లిట్టు, లృట్టు, తుమర్థము, తద్ధితము, కృదంతము మొదలగునవి పెక్కులు దిగుమతిసరకులే. అచ్చు, హల్లు మొదలగునవి సంస్కృతవ్యాకరణమున సార్థకములు గాని, ఇచట నిరర్థకములే. పోనిండు. క్రొత్తపారిభాషికపదములు కల్పింప బద్ధకించి సిద్ధరూపములు కొన్ని వాడుకొన్నా రనుకొన్నను, విషయము సంస్కృతవ్యాకరణము ననుసరించి తెనుఁగువ్యాకరణమున సంపూర్ణముగా తెలిపిరేమో యని చూచిన అదియును సున్నయే. దానియం దున్నట్లు దీనియందు ధాతుపాఠము లేదు; గణపాఠము లేదు. అంతేకాదు. ఉన్నవిషయము లైన సంపూర్ణములా? అదియును కానరాదు. కనుఁగొనుఁడు:- సంస్కృతప్రాకృతభాషాసమము తత్సమము; సంస్కృతప్రాకృతభాషాభవము తద్భవము; లోకవ్యవహారసిద్ధము దేశ్యము; లోకవ్యవహారసిద్ధమై శాస్త్రవిరుద్ధ మైనది గ్రామ్యము.—అనికొన్ని యుదాహరణము లిచ్చుటతో భాషావిషయము సంజ్ఞాప్రకరణములోని భాగముగా పెక్కువ్యాకరణములలో ముగిసినది. అప్పకవి విస్తరించి చెప్పెద నని భాషాపరిచ్ఛేద మనుపే రొకయాశ్వాసమున కుంచెఁగాని, అందును అతఁడు భాషావిషయమునుగూర్చి పూర్తిగా చెప్పఁ జాలకపోయె. సంస్కృతసమములు నిఘంటుసాహాయ్యమునను- తదితరసాహాయ్యమునను తెలిసికొనవచ్చు ననుకారణమున వానినిగూర్చి విస్తరించి చెప్ప లే దనుకొన వచ్చును. శాస్త్రవిరుద్ధ మైనదానితో పని లేమింజేసి గ్రామ్యమునుగూర్చి చెప్ప నక్కఱ లే దనుకొన వచ్చును. కాని మిగిలిన ప్రాకృతసమతద్భవదేశ్యములనుగూర్చి యైనను విస్తరించి చెప్ప నక్కఱ లేదా? ఏవిప్రాకృతసమములో, ఏవి సంస్కృతభవములో, ఏవి ప్రాకృతభవములో ఉదాహరణములుగా నిచ్చినకొలఁదిపద

ములు గాక తక్కినఅచ్చతెనుఁగునుడులలో తెలిసికొనుట కాధార మేమియు లేదు. ఇఁక దేశ్యముగూర్చి, అది ఆంధ్రదేశ్యము, అన్య దేశ్యము—అని ద్వివిధ మని చెప్పి, వానికి కొన్ని యుదాహరణము లిచ్చుటతో ముగిసె. ఆంధ్రదేశ్యములలోనే ఒకమండలము లోనిపదములు కొన్ని మఱొకమండలము వారికి తెలియవు. అట్టిచో వానినిగూర్చియు, అన్యదేశ్యములనుగూర్చియు నయిన చెప్ప నక్కఱ లేదా? చెప్ప వలయును. కాని, చెప్పుటమాత్ర మంతసులు వగుపని కాదు. ఆంధ్రదేశముతో సంబంధము గలదేశభాష లెన్ని కలవో అన్నియు తెలిసినఁగాని ఏపద మేఅన్యదేశ్యమో చెప్పు టెట్లు? కాన, ఈ విషయము ఏవో కొన్నిఉదాహరణము లిచ్చుటతో జాఱ విడువవలసి వచ్చినది. అందుచే తెనుఁగువ్యాకరణపుగతి పులిని చూచి నక్క వాఁతలు పెట్టుకొన్నట్లు మాత్ర మైనది. వాఁతలు పులిబగ్గి లగునా? నక్కకు పులిసత్తువ వచ్చునా? కాని, వాఁత లు బగ్గి లని భ్రమపడు తెనుఁగువిద్యార్థులకు తెలుఁగువ్యాకరణము బెబ్బులి అగుట నిశ్చయము; ఇది ఎల్లరకును అనుభవైకవేద్యమే.

కావున, పారిభాషికపదములదిగుమతివలన తెనుఁగువ్యాకరణమునకు వికృతరూప మొక్కటియే వచ్చినది కాని, సంస్కృత వ్యాకరణమునకుఁ గలసంపూర్ణత్వము రా లేదు. ఇంతకు, సంపూర్ణత్వము తేరగా ర మ్మన్న ఎట్లు వచ్చును? పాణిని మొదలగు వైయాకరణు లెంతో శ్రమపడి, ఎంతో అభిమానముతో భాష అంతయు గాలించి, ఎంతో బుద్ధిబల ముపయోగించి సంస్కృత వ్యాకరణము రచించిరి. తెలుఁగునం దట్టి అభిమానముతో అంతశ్రమపడి వ్యాకరణము వ్రాసినవా రేరీ? విద్యావిశేషసురాచార్యుఁ డని చెప్పుకొన్న కాకునూర్యప్పకవి ఎలకూచిబాలసరస్వతిసకలభాషాకవిమహోపాధ్యాయప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా విరచించిన 'ఆంధ్రశబ్దచింతామణి'యందు (అప్పకవీయమందు) ప్రబంధమహిమ యనుశీర్షికక్రింద మొట్టమొదట.

"క. ఇది చదివినపిమ్మట మఱి
యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా వొడము
న్బదపడి గ్రంథము లన్నియు
వెదకివెదకి సార మెల్ల వివరింపంగన్.

గీ పర్వతము లెల్ల నొక్కదర్పణమునందుఁ
జూపెడు తెఱంగునను గవిత్వోపయోగ
లక్షణము లన్నియును సరళంబుగాఁగ
నెఱుఁగఁబడు నిందుఁ దెలియనూహించి రేని.

గీ. సారభాషకు శబ్దశాస్త్రంబుపగిదిఁ
దెనుఁగున కవశ్యకం బిది............"

అని చెప్పుకొనె. కాని, అదియు నతఁ డనుకొనినట్లు ౮ ఆశ్వాసములతోఁగాక ౫ ఆశ్వాసములతోడనే ఇపు డసంపూర్ణముగా కాన వచ్చుచున్నది. అతఁడు కొంతవఱకు శ్రమపడినను ఉన్నభాగములలోనివిషయము లును సంపూర్ణములు కావు. పిమ్మట వ్రాసి నవచనాంధ్రవ్యాకరణములతో చిన్నయసూరివిరచిత మగు 'బాలవ్యాకరణము'ను, బహుజనపల్లిసీతారామాచార్యరచిత మగు 'ప్రౌ

థవ్యాకరణము'నుఇపుడు పాఠశాలలలోను-కళాశాలలలోను పైతరగతులవిద్యార్థులును, పైఁగా తదితరులును ప్రమాణగ్రంథములుగా పఠించుచున్నారు. అవి రెండును కలసినను తెనుఁగువ్యాకరణము సంపూర్ణ మగు నని సంతసించుట కవకాశము కలుగ కున్నది. అందుచేతనే, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు క్రొత్తగా సంపూర్ణ వ్యాకరణము రచింపవల సియున్న దని తీర్మానించుకొనవలసి వచ్చినది. కాని, ఆతీర్మానము క్రియారూపమున ఏకా రణముననో ఇప్పటికి పరిణమింప లేదు. నిరు డు బ్రహ్మశ్రీ మల్లాదిసూర్యనారాయణ శాస్త్రిగారు 'ఆంధ్రభాషానుశాసనము' పరిశ్రమ మొనర్చి వ్రాసి ప్రచురించి నారు. దానిని కొందఱు పొగడిరి. కొం దఱు తెగడిరి ఏ మయినను, అదియు నమగ్రము కా దని శాస్త్రిగారే తెలిపిరి. కొంతకాలముక్రిందట కీ। శే। పాడి వేంక టస్వామి యను వేంకటనారాయణపాఠీగారు విరచించిన ధాతుపాఠసూత్రపాఠగణపాఠ యుతాంధ్రశబ్దానుశాసన మనునాంధ్రవ్యా కరణ మొకటి యున్నట్లు తత్పండితరచిత మగు 'ఆంధ్రకవితత్త్వము' వలన తెలియ వచ్చుచున్నది. పేరునుబట్టి అది సంపూర్ణవ్యా కరణ మగునేమో యని తోఁచును. కాని, పైకి రామిచే దానినిగూర్చి నిశ్చయముగా ఏమియు చెప్ప వీలు కా కున్నది. తక్కిన వ్యాకరణము లేవియును సంపూర్ణములు కా వని పైనివ్రాసినదానివలన తేటతెల్లమే. కావున ఇప్పటికి తెనుఁగున సంపూర్ణవ్యాక రణము లే దనియేకదా తేలినది. సంపూర్ణ వ్యాకరణమే తెనుఁగున లేనియెడ సంపూర్ణ వ్యాకరణజ్ఞాన మెవరికిఁ గాని లభించు టెట్లు? అది లభింప వీలు లేనిచో తెనుఁగున సం పూర్ణపాండిత్య మబ్బు టెట్లు? కావున, భాష్యాంతపండితులు సంస్కృతవ్యాకరణ మున పరిపూర్ణపండితు లని చెప్ప వీ లున్న ట్లు, తెనుఁగున పరిపూర్ణవ్యాకరణ మే లేమి చే ఏపండితులును పరిపూర్ణవ్యాకరణపాండి త్యము గలవా రని నిస్సందేహముగా నొక్కి చెప్పుటకు వీలు చిక్క కున్నది. అయినను, పరిపూర్ణవ్యాకరణసాహాయ్యము లే కున్న ను స్వయంకృషిచే పరిపూర్ణవ్యాకరణజ్ఞాన ము సంపాదించినమహాపండితు లుందు రే మో! కాన, సంపూర్ణవ్యాకరణము లేకు న్నను సంపూర్ణపాండిత్యము తెనుఁగువ్యాక రణమున కొందఱకు సాధ్యమే యనుకొంద మని తలంచినను దానికిని చిక్కే కానవచ్చు చున్నది. ఏ మందురా? అర్థజ్ఞానమునుగూర్చి చర్చించునపుడు వ్యుత్పత్త్యర్థజ్ఞానము మొత్త ముమీఁద ఎవరికిని సంపూర్ణముగా లే దని యే తేలుటచే భాషలోనిపదముల కెల్ల వ్యుత్పత్తి తెలుప సాయపడని వ్యాకరణజ్ఞాన ము సంపూర్ణ మని చెప్ప వీలు కాదు. కావు నను, తెనుఁగుతో సంబంధము గలభాష లన్నిటిలోను ఎట్టిగొప్పపండితుల కైనను పాండిత్య మబ్బుట దుర్లభము. కావునను, అర్థజ్ఞానవిషయమున పరిపూర్ణపాండిత్యము లభించుట ఎవరికిఁగాని సాధ్యము కానికరణి నే వ్యాకరణజ్ఞానవిషయమునను ఎవరికిఁ గాని

పరిపూర్ణపాండిత్యము లభించుటయు సాధ్యము కా దనియే తేలును.

పాండిత్యపరిపూర్ణత్వమునకు అర్థజ్ఞానవ్యాకరణజ్ఞానములకు తోడుగా ఛందోజ్ఞానమును కావ్యనాటకాలంకారజ్ఞానమును కావలయును. ఇవి లభించుటకు తెనుఁగున ఎంత వఱకు వీలు కలదో చూతము.

ఛందోజ్ఞానము కోరువారు సాధారణముగా సులక్షణసారమును- అప్పకవీయమును చదువుదురు. అనంతునిఛందము మొదలగు మఱికొన్నిగ్రంథములును కలవు. వీనిలో 'అప్పకవీయము' ముఖ్యగ్రంథముగా నున్నది. కాని, అదియును స్పష్టముగాను- సులువుగాను ఛందోవిషయము లన్నియు బోధింపఁ జాల కున్నది. కాన, ఛందోవిషయమునందును కాలక్షేప మగుచున్నను పరిపూర్ణపాండిత్యము లభించుటకు ఆధారము లే దనియే చెప్ప వచ్చును.

కావ్యనాటకాలంకారజ్ఞానము కలిగించు గ్రంథములు మనభాషలో చాల తక్కువ. ఉన్నవియు సంపూర్ణములు కావు. ఇఁక సంస్కృతగ్రంథములును, ఇంగ్లీషుగ్రంథములును చదివి, ఈజ్ఞానము పరిపూర్ణము చేసికొనవలయును. ఇందులకు సంస్కృతాంగ్లేయభాషాపాండిత్య మావశ్యకము. కాన, తద్భాషాపాండిత్యము లేనివారల కీజ్ఞానము సరిగా కలుగ నేరదు. కాన, తెనుఁగున కావ్యనాటకాలంకారవిషయమునను పరిపూర్ణపాండిత్యము మృగ్యమే.

ఇప్పటికి తేలినసారాంశ మేమి? అర్థజ్ఞానముకాని, వ్యాకరణజ్ఞానముకాని, ఛందోజ్ఞానముకాని, కావ్యనాటకాలంకారజ్ఞానముకాని పరిపూర్ణముగా సమకూర్పఁ గలుగుగ్రంథములు మనభాషలో లే వనియు, కావ్యనాటకాలంకారములనుగూర్చి సంస్కృతాంగ్లేయభాషలు తెలిసిన తెలుఁగుపండితులు కృషిచేసి వలయుజ్ఞానము గడించుకొనుటకు వీలున్నను-అర్థజ్ఞానముకాని, వ్యాకరణజ్ఞానముకాని, ఛందోజ్ఞానముకాని ఆవిధమున నైన సంపాదించుటకు వీలు కా దనియు, అందుచే తెనుఁగున పరిపూర్ణపాండిత్యము లభించు ననుకొనుటకు వీలు లే దనుటయే.

అయిన మన మిపుడు చేయవలసిన దేమి? ఈకొఱఁత తీర్చుకొన వలయునా? అక్కఱ లేదా? తెనుఁగునం దభిమానము కలవా రెవరేని ఈకొఱఁత—మనభాషకు కళంకము తెచ్చు ఈపెద్దకొఱఁత—తీర్చుకొన నక్కఱ లే దనఁ గలరా? తెనుఁగువాఙ్మయము సంపూర్ణగౌరవము పొందుటకును- 'తెనుఁగు మహాభాష.' అని డంకామీఁద దెబ్బ కొట్టి చెప్పుకొనుటకును ఉత్తమగ్రంథములు పెక్కులు బయలుదేఱ వలయును. కాని, పరిపూర్ణపాండిత్యము లేనిచో ఈపని జరుగు టెట్లు? కాన మొదట పరిపూర్ణపాండిత్యము లభించుటకు వలయుసాధనసంపత్తి సమకూర్చుకొన వలయును.

సరేకాని, ఇది సమకూడు టెట్లు? ఈమహాకార్య మొకరిచే కావలసినది కాదు. ఎందఱో భాషాసేవకులు అభిమానముతో

డను- ఓపికతోడను పాటుపడ వలయును. భాషాసేవ చేయుతలంపున మనదేశమున ఎన్నోసంఘములు బయలుదేఱినవి; ఇంకను బయలుదేఱి వచ్చును. ఇవన్నియునుకూడ మొదట భాషాపాండిత్యమునకు వలయుసాధనసంపత్తి సమకూర్చుటయే తమకర్తవ్యముగా నిర్ణయించుకొని పని చేయ వలయును. వీనిలో చేరనిభాషాభిమానులును దీనిని గూర్చి పని చేయ వలయును. ఇప్పటికే కొందఱుభాషాభిమానులు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు, మ. రా. రా. గిడుగు వేంకట రామమూర్తిపంతులుగారు, చిలుకూరి నారాయణరావుగారు, బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, కోరాడ రామకృష్ణయ్యగారు మొదలగువారు మన తెనుఁగునకు పెంపు కలిగింప పూనుకొని పని చేయుచున్నారు. అందులకు సంతసింప నగును. కాని, చేయవలసినపని ఎంతో కలదు. తగిన కృషి చేయక ఏదో వ్రాసి ప్రచురించుటచేతను, అక్కఱ మాలిన వాదోపవాదముల చేతను తత్కర్తలకుఁగాని- భాషకుఁగాని మేలు రవంతయు కలుగదు. కాన, భాషాభిమానులు—పండితులు కానిండు; తదితరులు కానిండు—ఎవరికి తగినట్లు వారు నియమపూర్వకముగా భాషాసేవ చేయ వలయును. ఎట్లందురా? దయచేసి కనుంగొనుఁడు.

తెనుఁగున మంచిసాహిత్యముకలవారు, తమసాహిత్యఫలము తెనుఁగువారికి సమకూడుటకై ఆయాగ్రంథములందు అర్థకాఠిన్యమును- అన్వయకాఠిన్యమును కలపద్యములయందు తాము తమబుద్ధి వినియోగించి విడఁగొట్టినఅర్థాన్వయములు తెనుఁగు పత్రికలలో ప్రచురించుచుండ వలయును. సమర్థులు వ్యాఖ్యానములు లేనికఠినకావ్యములకు వ్యాఖ్యానములును, తక్కినవానికి లఘుటీకలును వ్రాసి ప్రచురపఱుప వలయును. ఇంతే కాదు. ఇపుడు జరుగుచున్న పనినిబట్టి సూర్యరాయాంధ్రనిఘంటువున కొన్నిగ్రంథములలోనిపదములే కాని తక్కిన వానిలోనివి చేరు ననుకొనుటకు వీలు కనఁబడదు. అట్టిచో గ్రంథస్థములు కాని నుడులు కాని, వ్యావహారికభాషలో వ్రాసినవ్రాతలలోని నుడులుకాని దానిలో చేరకుండుట వింత కానేరదు. అందువలన, అది సంపూర్ణ నిఘంటువు కానేరదు. మనకు సంపూర్ణమగు తెనుఁగునిఘంటువు కావలయును గాన దానినిగూర్చి పని చేయవలసి యున్నది. అందు సూర్యరాయనిఘంటునిర్మాతలు గ్రహింపనిగ్రంథములలోనిపదములు సేకరించుట మొదటిపని; ఇది సులువగుపని. ఈపనిలో ఎవరికిష్టమగుగ్రంథమువారుకైకొనుట మేలు. భాషాభిమానులు వివిధము లగువృత్తులను గూర్చివివరముగా వ్యాసములు వ్రాయవలయును. కృతికర్తలెల్లరును తాము క్రొత్తగా వాడిన నుడులజాబితాలు వెల్లడింప వలయును. ఇఁక గ్రంథస్థములు గాక లోకవ్యవహారసిద్ధము లగుదేశ్యపదము లెన్నియో కలవు. అవి అన్నియు శ్రమపడి భాషాభిమానులు గనులలోని మణులనువలె వెదకి కూర్ప వలయును. అవి అమూల్యము

లు గాన, వానిని గడింప మనము పడుకష్ట మునకు ప్రతిఫలము వేయిమడుంగు లని తలంచి సంతసింప వచ్చును. ఆసంతస మెట్టిదో అనుభవమే తెలుపఁ గలదు. కాన, భాషాభిమాను లగు పెద్దలును-పిల్లలును తమ తమ ప్రదేశములలో వాడుకలో మాత్రముండి పొత్తములలోని కెక్కనినుడులను కడుంగడు మెలంకువతో గడించి తెనుఁగుసిరి పెంచి, దానిచే తామును వన్నె కాంతురుగాక! ఇదే రెండవపని; బలు వగుపని. దీనినిగూర్చియే మఱొకమాట చెప్పవలసి యున్నది. మన వారు కొందఱు నాటువారిని పాటింపక గేలిచేయుచుందురు. కాని భాషాభిమానులకు వారిసాయమును కావలయును. తెనుఁగునాటను ఆయాపట్లలోని సేద్యగాండ్రవలనను, పనివాండ్రవలనను, కూలివాండ్రవలనను, అందు ముఖ్యముగా ముసలివాండ్రవలనను మనము నేర్చుకొనవలసినవిషయము లెన్నో కలవు. అందు మన కిపుడు కావలసి పొత్తములలోనికి రానినుడులు వారివలననే మెచ్చుగా రావలయును. కాన, మనపని నెఱవేర్చుకొనుటకు మనము వారి నాదరించి ముచ్చటలాడుచు—వా రెటుల చెప్పినను సరే—వారిచే కథలు చెప్పించియు, బొగట్టా లడిగియు శ్రద్ధగా వినుచు క్రొత్తనుడి అని మనస్సునకు తట్టిన వెల్ల వ్రాసికొనుచుండవలయును. తక్కినవారితో మాటలాడునపుడును పైవారు మాటలాడు కొనునపుడును అటులే చేయవలయును. ఇటులొనరించుచో తెనుఁగునుడులు చాలవఱకు ఒక్కచో చేరి తెనుఁగునిఘంటువునకు ఒకవిధ మగుపరిపూర్ణత కొంతకాలమునకైన కలుగును. ఈపరిపూర్ణత పదసంఖ్యనుగూర్చి నంతవఱకే. ఇందువలన సందేహముగా నున్నపదములయర్థము చాలవఱకు విడిపోవుటకు వీలు కలుగును. ఈసందర్భమున ఇంకొకమాట చెప్ప వలయును. తెనుఁగునాటి సరిహద్దులలో నుండువారికి తెనుఁగునకు తోడు దగ్గఱిదేశభాషయును తెలియుట సహజము. ఇటుల స్వభాష అగు తెనుఁగును-- దగ్గఱిదేశభాష అగు ఓఢ్రమో, మహారాష్ట్రమో, కన్నడమో, తుళువమో, అరవమో, మఱొకభాషయో తెలిసినవారును, తెనుఁగు నం దభిమానము కల తద్భాషాపండితులును తెనుఁగునుడులను పోలు ఆయాభాషలనుడులు కనిపెట్టి-వ్రాసి-అకారాదిగా కూర్చి వెల్లడింప వలయును. అందు వీ లున్నంతవఱకు అన్యదేశ్యములకు సంబంధించినధాతువులును, వానియర్థములును చేర్ప వలయును. ప్రాకృతసమతద్భవములను గుర్తించుటకు సంస్కృతనాటకములలోని ప్రాకృతభాగములును, ప్రాకృతగ్రంథములును పరికించి, మూలపదములతో వాని జాబితాలు వెల్లడింప వలయును. ఇందువలన వ్యుత్పత్తి తెలియరాని దేశ్యములలో కొన్నిటి కైన వ్యుత్పత్త్యర్థము తెలియ వచ్చును. శబ్దరత్నాకరకర్త కొన్నినుడులకు వ్యుత్పత్తి సూచియుండుటచే పరికించి వానిలో సరియగునవి కైకొన వచ్చును. తద్భవములకు మూలపదములను బట్టియు, ఆంధ్రదేశ్యములకు కొన్నిటికి ధాతుసాహా

య్యమునుబట్టియు, మిగిలినఅన్యదేశ్యములకు అన్యదేశభాషాకృషినిబట్టియు, అన్యభాషాపండితులసాహాయ్యమునుబట్టియు వ్యుత్పత్త్యర్థము తెలిసికొన వచ్చును. ఇటుల పాటుపడినచో అచ్చతెనుఁగునుడులకు పెక్కింటికి వ్యుత్పత్త్యర్థము లభింపఁ గల దని ఆశింప నగును. పైని తెలిపినటుల పనిచేయునెడల దానివలని ఫలము అర్థజ్ఞానపరిపూర్ణతకు ఎంతో సాయపడును.

తెనుఁగువ్యాకరణమునం దభిమానము కలిగి కృషి చేయువారు తమకృషిఫలము వ్యర్థము కాకుండుటకై సంబంధమున్నయితరభాషలతో సరిపోల్చుచు-వ్యాకరణ మంతయుఁగాని, అందలిభాగములుగాని ప్రచురించి సంపూర్ణ వ్యాకరణము మఱికొంతకాలమున కైనను సిద్ధ మగుటకు తోడ్పడ వలయును. ఇది వ్యాకరణజ్ఞానపరిపూర్ణతకు సాయపడును.

తెనుఁగుఛందస్సునం దభిమానము కలవారు తాము చేయుకృషిఫలము వెల్లడించుచుండ వలయును. ఇది ఛందోజ్ఞానపరిపూర్ణతకు సాయపడును.

కావ్యనాటకాలంకారములయం దభిమానము గలవారిలో సంస్కృతాంగ్లేయాదిభాషలయందు మంచిసాహిత్యము కలవారు ఆయాభాషలయందు ఆవిషయములకు ప్రమాణము లగుగ్రంథములు చదివి, ఆవశ్యకమగుచో విషయ మంతయుఁగాని, కానిచో కొంతకాని వ్రాసి ప్రచురింప వలయును. ఇది కావ్యనాటకాలంకారజ్ఞానపరిపూర్ణతకు సాయపడును.

పైని సూచించినచందమునను- బుద్ధిమంతు లగుభాషాభిమానులకు తట్టుతక్కినఛందములను తెనుఁగుకొఱంత తీర్పుటకై పాటుపడునెడల మనవారికి మనభాషయందు పరిపూర్ణపాండిత్య మబ్బుటకు సాధనసంపత్తి లభించును. అపుడు భాష సర్వసమర్థమై కొఱవడినవాఙ్మయము పూర్తి చేసికొనుటకు వీలు కలిగి, తెనుఁగు మహాభాష కాదను వెలితి కొంతకాలమున కైనను తీఱుభాగ్యము కలుగును. కాన, మనసాహితీకవితాసంఘములు పైని తెలిపినకరణిని తమతమశక్తికొలఁదిని మాతృభాషాసేవచేసి ధన్యము లగుటకు ప్రయత్నించుఁగాక! భాషాభిమాను లగు ధనికులు తమధనమును- బుద్ధియు భాషాసేవకై వినియోగించి కృతార్థు లగుదురుగాక! ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తును మాతృభాషాసేవ చేయుతెనుఁగువారికి తోడ్పడి సార్థమగుఁగాక!

గీ. కారు సర్వజ్ఞు లెందు ఎవ్వార లేని;
కాని, అది యెఱింగినవారు కాన రారు;
భర్తృహరిసోక్రటీసులు ప్రౌఢు లగుటఁ
అది ఎఱిఁగి మార్గదర్శకు లయిరి మనకు.

---

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రితము, కాకినాడ—1929.

# అకారాది విషయసూచిక.







# రజతోత్సవ సంచిక

## 1963





శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము
చిలకలూరిపేట

# 1963-64 సం॥ కార్యనిర్వాహక వర్గము

అధ్యక్షులు : శ్రీ గ్రంధి వెంకటరత్నంగారు
ఉపాధ్యక్షులు : శ్రీ గాదంశెట్టి సత్యనారాయణగారు
కార్యదర్శి : శ్రీ కొప్పురావూరి కోటేశ్వరరావుగారు
సహాయకార్యదర్శి: శ్రీ బచ్చు రామలింగంగారు

## సభ్యులు

శ్రీ కొప్పురావూరి సత్యనారాయణగారు
, కొల్లా సత్యనారాయణగారు
, మద్ది రామమూర్తిగారు
, కొత్తమాసు క్రిష్టారావుగారు
, గ్రంధి పూర్ణచంద్రయ్యగారు
, పసుమర్తి వెంకట కోటయ్యగారు
, అరవపల్లి పేరయ్యగారు
, మున్నలూరి వెంకట కోటయ్యగారు
, రాచుమల్లు వెంకటేశ్వర్లుగారు
, చండ్రపట్ల కాశీవిశ్వనాధంగారు
, చంట్రపట్ల లక్ష్మయ్యగారు
, అరవపల్లి తాతయ్యగారు
, బచ్చు సత్యనారాయణగారు
, రాచుమల్లు రామక్రిష్ణారావుగారు
, మున్నలూరి ముత్యాలుగారు
, మేళ్ళచెర్వు రాములుగారు
, రాచుమల్లు వెంకన్నారావుగారు

## ఆయా శాఖల ఆర్గనైజర్లు

గోశాఖ : శ్రీ గ్రంధి పూర్ణచంద్రయ్యగారు
, బచ్చు రామలింగంగారు
గ్రంధాలయశాఖ: , కొప్పురావూరి సత్యనారాయణగారు
, రాచుమల్లు వెంకటేశ్వర్లుగారు
చలివేంద్ర శాఖ : , గాదంశెట్టి సత్యనారాయణగారు
, మద్ది రామమూర్తిగారు
దేవాలయశాఖ : , పసుమర్తి వెంకటకోటయ్యగారు
, బచ్చు రామలింగంగారు
, [redacted]
, బచ్చు సత్యనారాయణగారు

# రజతోత్సవ సంచిక



సంపాదకవర్గము




వంకాయలపాటి లక్ష్మీనారాయణ
కొప్పురావూరి కోటేశ్వరరావు
కొప్పురావూరి సత్యనారాయణ
పొత్తూరి నరసింహారావు
బచ్చు సత్యనారాయణ
బచ్చు రామలింగం
మున్నలూరి వెంకట కోటయ్య





ప్రకాశకులు :
శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము
చిలకలూరిపేట




చతుశ్శాఖలచేనొప్పారు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మసంఘ మహావృక్షము

చిలకలూరిపేట.

# విషయసూచిక



చిలకలూరిపేట శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘు
కార్యనిర్వాహక వర్గము **1963 - 64**



## చిలకలూరిపేట శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘ
## రజత జయంతి సంచికా సంపాదక వర్గము



1. (శ్రీ) వంకాయలపాటి లక్ష్మీనారాయణ. 2. (శ్రీ) పొత్తూరి నరసింహారావు. 3. (శ్రీ) కొప్పురావూరి కోటేశ్వరరావు,
4. (శ్రీ) బచ్చు రామలింగం, 5. (శ్రీ) కొప్పురావూరి సత్యనారాయణ 6. (శ్రీ) బచ్చు సత్యనారాయణ,
7. (శ్రీ) మున్నలూరి వెంకటకోటయ్య.

# స్వాగతవచనములు

కొప్పురావూరి సత్యనారాయణ, ఆర్గనైజర్.

సర్వజ్ఞులూ, విజ్ఞులూ, సాహిత్యప్రియులూ, ఆరాధకులూ, సంఘసేవకులూ, పెద్దలూ అయిన మిమ్మందరినీ యీ సభా ప్రాంగణానికి ఆహ్వానించే అవకాశం లభించినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను.

ప్రపంచం యీనాడు వైజ్ఞానికంగా ఎంతో ముందుకు నడచింది. మానవుడు చేపలాగా సముద్రంలోనూ, పతంగములాగా నీలాకాశం లోనూ విహరించగలగటమే కాకుండా చంద్ర, శుక్ర, అంగారక గ్రహ ప్రయాణాలకు కూడా సోపానాలు నిర్మిస్తున్నాడు. అయితే మానవుడు యింతతో ఆగలేదు. ఒక్క త్రుటి కాలంలో యీ సువిశాల సుందర వసుంధరను నాశనం చేసి స్మశానంగా మార్చగలిగిన విపరీత విప త్కర విషతుల్య పరిణామాలను సృష్టించగల మారణాయుధాలను కూడా ఉత్పత్తిచేశాడు. మానవ వికాసానికి బదులు మానవతా వినాశనానికి దారులు పడుతున్నయ్. ప్రమోదాన్ని కలిగించాల్సిన మానవుడి తెలివితేటలు ప్రమాదాన్ని కొనితెస్తున్నయ్. మానవ ఉపాధికి ఉపకరించాల్సిన ప్రజ్ఞ మానవతా సమాధికి పునాదులు వేస్తుంది. ప్రసాద సంతుష్టం కావలసిన మానవజీవితం విషాదసంక్లిష్టం అవుతుంది. పురోగమించాల్సిన క్రాంతి పధం వక్రించి తిరోగమిస్తుంది. క్రాంతినీ, శాంతినీ అందించటానికి బదులుగా మానవ జీవితాన్ని విషాదాంతంచేసి ప్రపంచాన్నే అంతంచేసేదిగా మారుతుంది. ఇందుకు కారణం ఏమిటి? ఐహికమైన వైజ్ఞానిక అభివృద్ధితోపాటు పారమార్థికమైన జ్ఞానాభివృద్ధి లోపించటమే. యీనాడు మానవుడికి కావలసింది వింతవింత వస్తువులను ఉత్పత్తిచేసే విజ్ఞానం మాత్రమేకాదు, ఆ విజ్ఞానాన్ని సరసమైన రీతిలో నడిపించగల విజ్ఞత మానసిక వికాసంతో పాటు బుద్ధివికాసం కూడాకలగాలి. అందుకు అవసరమైంది సత్సాంగత్యం, సద్గ్రంధ పఠనం. అందుకే గ్రంధాలుఅమూల్యాలు. మరి అటువంటప్పుడు గ్రంధాలయాల ప్రాముఖ్యాన్ని గురించి మీకు తెలియందిఏముంది? సృష్ట్యాదిలో మానవుడు పశుతుల్యుడుగా వున్నాడు. కాల పరిణామ క్రమంగా బుద్ధి వికాసం పొంది ఆలోచనచెంది. ఉచితానుచిత, జ్ఞానాజ్ఞాన వివేకాన్ని అలవరచుకున్నాడు. యింకా యీ స్తితినుండి ముందుకు పోయి మానవుడు దేవుడుగా మారాలిగాని దానవుడిగా మారకూడదు. అటువంటి జ్ఞానాన్ని ప్రసాదించే గ్రంధాలయాలు సర్వకాల పూజితాలు,

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మ సంఘ నిర్వాహణలో నడపబడుతున్న గ్రంథాలయం తగినంత వసతిలేదని యిదివరకు మేము బాధ పడుతూ వచ్చాము. ఒక సుందర సువిశాల భవనం ఉంటే ఎంత బాగుండునా అని కలలు కన్నాం. అయితే కలలు ఫలించినయ్. సహృద యులూ, సుహృదయులూ అయిన శ్రీ రాచు మల్లు రంగనాయకులుగారి దాతృత్వంతో చదు వుల సరస్వతికి సకల సౌకర్యాలుగల [illegible]ంగ సుందరమైన సువిశాల భవనం సిద్ధించింది.

యీనాడు గ్రంథాలయ నూతన భవన ప్రారంభోత్సవం మాత్రమేకాదు, శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మ సంఘ రజతోత్సవం కూడా. ఉత్సాహంగా యీ మహోత్సవాలకు వచ్చిన మీ అందరికీ మా హృదయ పూర్వక మైన స్వాగతం చెబుతున్నాను. అవ్యాజమైన మీ ప్రేమానురాగాలతో, సహాయ సంపత్తు లతో మా సంఘం అహరహమూ అభివృద్ధి పొందుతుందనటంలో సందేహంలేదు.

నిరంతర సేవా పరాయణ త్వం లో నూ సద్గ్రంథ పారాయణత్వంలోనూ అమూల్యమైన మానవసేవ చేసే ఎందరో మహానుభావులతో అలంకరించబడిన యీ సభకు మరొక్క మారు స్వాగతం చెబుతున్నాను. శెలవు-



## ★ ఆకాంక్ష ★

ధర్మ సంఘ ధ్యేయానికి జయం జయం జయం
సంఘపు సంకల్పాలకు శుభం శుభం శుభం.

పరమేశ్వరి కరుణతోడ వీక్షించాలి,
ప్రతి ఒక్కరి జీవితాన్ని రక్షించాలి,
సిరులూ సంపదలతో ధరణి పులకరించాలి,
శాంత సుఖ క్షీరాలను చిలకరించాలి
॥ధర్మసంఘ॥

నీరు, గాలి, వెలుతురు అందివ్వాలి,
పంచభూత సంపదలను పంచివ్వాలి,
మంచినీటి వంద్లె పెంపొందాలి,
పంచభక్ష్య పరమాన్నం ప్రసాదించాలి.
॥ధర్మసంఘ॥

గోశాలలు వూరూరా పరిఢవిల్లాలి,
కరుణామయి గోదేవిని కాపాడాలి,
పశుసంతతి సంపదలై పెరిగి పోవాలి,
పాడిపంటలతో దేశం పరుగులెత్తాలి.
॥ధర్మసంఘ॥

అజ్ఞానపు తిమిరావళి తొలగిపోవాలి,
విజ్ఞానపు దీపావళి వెల్లివిరియాలి,
సరస్వతికి సాహిత్యపు పూజచేయాలి,
చదువు సంధ్యలతో దేశం నిండిపోవాలి.
॥ధర్మసంఘ॥

: వీ య న్ ఆ ర్ —

# విన్నపము

బచ్చు సత్యనారాయణ.

ఒక సంఘం రజత జయంతి జరుపుకుంటుంది అంటే అది ఆ సంఘము యొక్క ప్రాశస్త్యాన్నీ కార్యకౌశలత్వాన్నీ వ్యక్తీకరించేదిగా వుంటుంది. అట్లానే శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘం కూడా అనేక అడ్డంకులను అధిగమించి కష్టనష్టాలకు ఓర్చి అస్తవ్యస్త పరిస్థితులను సరి దిద్దుకొని ముందుకుసాగి నిండిన ప్రాశస్త్యంతో రజతోత్సవం జరుపు కుంటుంది. యీ సమయంలో గ్రంధాలయ నూతన భవన ప్రారంభోత్సవం కూడా జరగడం సంఘం సంతరించుకున్న సంస్మరణీయ ప్రత్యేకత.

యీ సందర్భంలో ఒక ప్రత్యేక రజతోత్సవ సంచికను వెలువరించాలని భావించాము. యిందులో మీరు ధర్మసంఘంయొక్క చతుశ్శాఖల చరిత్రలూ, వాటి పుట్టు పూర్వోత్తరాలు, సంఘాభివృద్ధికి కృషి చేసిన పెద్దల అనుభవాలు తెలుసుకుంటారు. అంతేకాకుండా వివిధ విషయాలమీద పెద్దలు రచించిన వ్యాసాలు కూడా చూస్తారు. కవితా కోకిల కమనీయ కూజితాలుకూడా వింటారు

మా విన్నపాన్ని ఆలించి యెంతో మంది కవులూ, పెద్దలూ అనేకమైన వ్యాసాలనూ పద్యాలనూ పంపించారు. అవి అన్నిటినీ స్థలాభావం చేత ప్రకటించలేక పోయాము. మరో ప్రత్యేకసంచికలో వీటన్నిటినీ ప్రచురించే సదవకాశం త్వరలో లభిస్తుందని ఆశిస్తున్నాము.

సంఘచరిత్ర వ్రాయడంలో రికార్డు రూపేణా చిక్కిన వరకూ సేకరించి విశదపరచాము, కాని అంతకు పూర్వచరిత్ర సేకరించటంలో రూఢి అయిన ఆధారాలు మాకు లభించలేదు. అందువల్ల గ్రామ పెదలను కొందరను అడిగి తెలిసిన వరకు తెలియజేశాము. ఇందులో ఏవైనా లోపాలుంటే విజ్ఞులు మన్నించి సూచించాలని ప్రార్థిస్తున్నాము

యీ రజతోత్సవ సంచికకు అమూల్యమైన రచనలను వ్యాసాలను పంపిన పెద్దలందరకు కృతజ్ఞతా పూర్వక సమస్కృతులు సమర్పిస్తున్నాము. యీ సంచికలోని బ్లాకులను చక్కగా తయారు చేసిన స్వతంత్ర ఎంటర్ ప్రైసెస్ విజయవాడ వారికీ, కొద్దికాలంలో అహర్నిశలూ పనిచేసి మాటి మాటికి వచ్చే మార్పులను చేర్పులను ఒప్పుగా నేర్పుగా కూర్చి తీర్చిన ధనలక్ష్మి ప్రెస్. విజయా ప్రెస్‌ల వారికి కృతజ్ఞత తెలుపుకుంటున్నాము. సంచికను సుందరతరంగా తయారించటంలో ఎనలేని కృషి చేసిన శ్రీ వంకాయలపాటి లక్ష్మీనారాయణగారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను.

యీ సంచికను సర్వాంగ సుందరంగా తయారు చేయాలనే సంకల్పంతో శాయశక్తుల కృషిచేశాము. మాకృషి ఎంతవరకుఫలించిందో నిర్ణయించగల మీబోటి పెద్దల పవిత్ర హస్తాలకు వినమ్రతతో యీ చిన్న సంచికను అందిస్తున్నాము.

# కార్యదర్శి నివేదనము

అధ్యక్షా, ఆహ్వానిత పెద్దలారా!

సోదర సోదరీ మణులారా !!

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి ధర్మ సంఘ చరిత్రలో ఈనాటి దినం సువర్ణాక్షరాలతో లిఖింపదగినది. అందున పూజనీయులైన, గౌరవనీయులైన భారత దేశాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి మహనీయుని ఆశీసులు లభించుట మన భాగ్యం.

ఇరువదియైదుసంవత్సరాల కఠోర కార్యదీక్షా ఫలమే ఈనాటి "సంఘ రజతోత్సవ పుణ్యదిన" మని వేఱుగా జెప్పబనిలేదు ఇట్టిశుభసమయంలో, ఇందరి మహాజనుల సమక్షంలో, "చంద్రునికి నూలుపోగువలె" నాకీ కొద్ది కార్యదర్శినివేదిక నందిచు సదవకాశంలభించుట నా అదృష్టం. ఇందుకు సంఘ సభ్యులకు, నా కృతజ్ఞతలు.

దాదాపు డెబ్భై ఎనభై సంవత్సరాల క్రిందట చల్లని వేళలో కొద్దిపాటి "చలివేంద్రి"తో ప్రారంభమై, కటిక కసాయివాని బలిపీఠ మెక్క బోవు గోమాత ద్వయంతో "గోసంఘ" మెలసి, శారదగళమున కలంకారమన్నట్లు కొద్ది గ్రంథాలతో గ్రంథాలయ మేర్పడి, కరుణతో జూచు కన్యకాంబ తల్లి దేవళమ్మున వెలయ వేరు వేరు శాఖలతో దిన దిన ప్రవర్ధమానమై తుదకు చతుశ్శాఖలు ఏకరూపమై శ్రీ వా. క. పరమేశ్వరీ ధర్మ సంఘ మన పవిత్ర నామంతో నుచ్చరింపబడుతూ కల్ప వృక్షంగా మన కన్నులెదుట ధర్మసంఘ మీనాడు సాక్షాత్కరిస్తూవుంది. సంఘమీనాడిట్టి వున్నతోన్నత స్థితికి రావటానికి పండిన పంటగా మన చేతులకందటానికి కారణం నాటి సంఘ కార్యకర్తల నిరంతర నిస్వార్థ సేవాదీక్ష. దాతల అపార దాతృత్వమే. చిరస్మరణీయులైన అట్టి సేవాపరాయణులకు విశాలమైన దానశీలురకు నా హృదయ పూర్వక వందనాలర్పించుతున్నాను.

ప్రజలు ఈర్ష్యా ద్వేషాలతో, ఒకరి యభివృద్ధి నింకొకరు కంటగించుకొన ఐక్యత నశించి సంఘర్షణలతో ప్రపంచమంతా కొట్టుమిట్టాడుతున్న తరుణంలో బాధ్యతాయుతమైన పదవీ నిర్వహణ మెంత కష్టసాధ్యమో విజ్ఞులెఱిగినదే. ఇట్టి పరిస్థితులలో సంఘ సభ్యులు, ప్రేమాభిమానాలతో, నిష్కల్మష హృదయాలతో పవిత్రమైన 'సంఘ కార్యదర్శి' పదవీ భారాన్ని నాపై నిడినారు. వయస్సులో అనుభవంలో చిన్నవాడనైన నేను గొప్పవారైన అనుభవజ్ఞులచే స్థాపించబడి నడుపబడుతున్న ధర్మ సంఘ పవిత్ర కార్యభారాన్ని మోయగలనాయని భయపడ్డాను. కాని భగవంతుని కృపవలన, పెద్దల ఆశీస్సులతో, సంఘ అధ్యక్ష సభ్యుల అండదండలతో, దాతల అపార, అనుపమ, అనిర్వచనీయమైన దాతృత్వబలంతో కొంత వరకు ధైర్యం చిక్కింది. శక్తివంచన లేకుండా నాకు లభించిన ఈ సదవకాశంతో కార్యదర్శి పదవీ కాలమందు కొన్ని పనులు చేయగలిగాను. అట్టివి కొన్ని పనులందు పొందుపరచుట కార్యదర్శిగా నా ధర్మమున్నూ సమంజసమున్నూ అనుకుంటాను.

నా పదవీ ప్రారంభ కాలమందు కొన్ని శాఖలకు తగిన వసతి, స్వంతభవనాలు లేకుండుట

బాధకలిగించింది. సభ్యుల హృదయాలలో ఆ వేదన వుప్పొంగింది దాతల దాతృత్వం వెల్లివిరిసింది. వెను వెంటనే చక్కని నూతన స్వంత గోశాల, దేవాలయ నిర్మాణం జరిగింది. కొంతవరకు ఆ వేదనలుడిగి హృదయాలు చల్లబడినాయి.

"ధనమూలమిదం జగత్" అన్నట్లు సంఘాభివృద్ధికి ఆధారం, అండ, ధనమేగదా! సంఘ ఆర్థిక బలానికి 'రుసుములు' ఏర్పాటు చేయబడి వున్నాయి. కాని "రుసుములు" సంఘానికి అస్థిరమైన ఆర్థిక బలమేగాని స్థిరమైన, శాశ్వతమైన బలమివ్వజాలవను సంకోచం, భయంజనించింది స్థిరమైన ఆర్థిక బలానికొక వుపాయం తళుక్కున కనిపించింది. చిలకలూరిపేట వాణిజ్యనిలయమగుటచే వాణిజ్యానికనువగు భవనాలు అద్దెకొట్లు పాత గోశాలయందు నిర్మింపబడినాయి యిట్టి భవనములింకను నిర్మింపదలచాము.

పాత గోశాలయందలి క్రింది భాగంలో సంఘ ఆధ్వర్యాన భవన నిర్మాణం జరిగినచో దాని పైభాగమున 'ది టెక్స్‌టైల్ డీలర్స్ అసోసియేషను' వారు భవన నిర్మాణ మొనర్ప వాగ్దానమిచ్చినారు. కాన అనతి కాలంలోనే పాత గోశాల క్రిందభాగంలో భవన నిర్మాణం జరుగు శుభసమయం రానున్నది.

గ్రంథాలయ ఆర్గనైజరుగా పనిజేసిన నేను, నాకు ప్రాణసమానమైన గ్రంథాలయానికి స్వంతభవనంలేకుండుట ఎంతోబాధకలిగించింది. స్వంతభవన నిర్మాణానికి చాలాకాలం పరితపించాను. సంఘసభ్యులంతా ఎన్నోకలలుకన్నారు. కొంతకాలంతరువాత ఇప్పటికి ఇరువదియైదు సంవత్సరాలక్రితం శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు నూతన గ్రంథాలయ భవన నిర్మాణ మొనర్చుటకు వాగ్దానంచేశారు. ఆ నాటి వాగ్దాన ఫలితమే, మేము కన్నకలల పంటయే ఈనాడు శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు తమ భార్యామణియైన కీ॥ శే॥ శ్రీమతి కనకమ్మగారి జ్ఞాపకార్థం 15/ వేల రూపాయలతో నిర్మించి ఇచ్చిన నూతన సుగ్రంథాలయ భవనం. వారి కుటుంబమును భగవంతుడు ఆయురారోగ్య సంపదలిచ్చి బ్రోవుగాక. సంఘపక్షమున వారికి నా ధన్యవాదాలు.

రజత జయంత్యుత్సవ శుభ సమయమందు ధర్మసంఘాని కర్పించు పవిత్ర కానుక 'రజత జయంతి సంచిక'. సంఘ కంఠహారమగు రజత సంచికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుటకు అహర్నిశలు శ్రమపడిన శ్రీ వంకాయలపాటి లక్ష్మీనారాయణగారి సేవ మరువరానిది. సంఘానికి వారూ, వారిసేవ క్రొత్తగాదు. ఎంతో కాలంనుండి ఎన్ని పనులున్ననూ తీరిక వేళల్లో వచ్చి సంఘకార్యకలాపాలుచూస్తూ అమూల్య సలహాలిస్తూ, గ్రంథాలయంపట్ల అతి శ్రద్ధ వహించి అన్ని విధాల మన సంఘాభివృద్ధికి తోడ్పడుచున్న శ్రీ లక్ష్మీనారాయణగారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు. యికముందు గూడ సంఘంపట్ల ఇట్టి ప్రేమతో మెలగుతూ సహకరించగలరని వారిని మా సంఘ పక్షమున కోరుతున్నాను.

సంఘ రజత జయంత్యుత్సవం, నూతన గ్రంథాలయ భవన ప్రారంభోత్సవాలను పురస్కరించుకొని విరివిగా ధన, వస్తు, గ్రంథ, చిత్రములాది వేరు వేరు పరికరములు దాన మొసంగిన దాతలకు నమోవాకములు.

సంఘ సర్వతోముఖాభివృద్ధికి కారకులైన కార్యకర్తలకు, సభ్యులకు, దాతలకు నా వందనములు:

సంఘ సేవకై తమ అమూల్య సేవాసహకారాలు. అండదండలిచ్చిన ఇచ్చుచున్న కార్యకర్తలకు సంఘ సభ్యులకు, దాతలకు రజత జయంత్యుత్సవ కార్యక్రమ సందర్భంలో పని చేసి సహాయపడిన తదితర మహానుభావులకు నా అభివందనములు.

ఇకముందు ఇట్టి బలోత్సాహంతో అందరు అన్ని విధాల సంఘాభివృద్ధికి తోడ్పడగలరని ఆశిస్తూవున్నాను. జైహింద్.

ఇట్లు భవదీయుడు,

చిలకలూరిపేట ) కొప్పురావూరి కోటేశ్వరరావు



క॥ శ్రీనర, గిరిజానాయక
గోవింద, లలాటనేత్ర, గోకుల తిలకా
భావజసంహార, హరిహర
భావాత్మక, శివముకుంద, పరమానందా!



# అధ్యక్షోపన్యాసము

గ్రంధి లక్ష్మణస్వామి,

విజయవాడ.

★

శ్రీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘం రజతోత్సవమునకు అధ్యక్షస్థాన మలంకరించ తగిన వ్యక్తులు ఆంధ్రావని ననేకులుండగా నన్ను ఈ పదవిని నియుక్తినిగా చేయుటలో నాపై యీ సంఘ కార్యకర్తలకున్న వాత్సల్యం విదితమైనది. రజతోత్సవ మంటేనే, పాతిక సంవత్సరాల కార్యనిర్వాహకత్వం దీక్ష, ప్రజామోదము పొందినట్లు బహు ధన వ్యయ ప్రయాసలతో అనేకమంది దాతల అనుగ్రహముతో ఆయాశాఖల పాలూ పాటవమును స్ఫురింపజేయుచున్నది. కనపడని లాభములకై కఠిన దీక్షతో కష్టపడటం చాలమందికి కానిపని. అట్టిది నిర్వహించుటలోనున్న కష్టము అనేక సంస్థలతో సంబంధమున్న నాకు అనుభవమే. కాని మానవోపయుక్తమగు పనులను నిస్వార్థముగా, నిశ్చలతతో నిర్వహించుటలో నొక అనిర్వచనీయమైన ఆనందము కూడా కలదని అనుభవము వలననే తెలుసుకున్నాను. ఈ ఆనందము వల్లనే, కష్టములనైన లెక్కసేయక పలువురు యిటువంటి ధర్మ కార్యభారములను శిరోధార్యముగా వహించుచున్నారు. సమస్త ధర్మములకును దేహమాధారము కదా! దేహమునకు అన్నమాధారము కదా! అట్టి దేహాధారణకుప యుక్తములగు ద్రవ్యములలో ముఖ్యమైన జలమునిడి. మానవుల కెంతో సేవజేయుచూ, ఆనందమిచ్చుచున్న యీ సంఘము చలివేంద్రపు చక్కని కార్యక్రమము చేపట్టినది.

దానములనబడు వాటిలో విద్యాదాన మొకటైయున్నది. అన్నదానము వస్త్రదానము, ధనదానము, గృహదానము, యిట్లెన్నో వున్నవి. అందు ప్రముఖస్థానము విద్యది. విద్యయనగా జ్ఞానము. మానవునకు సర్వోత్కృష్టమైనది. సమాజములో విద్యను పొంద కొందరు పాత్రులు కొందరు కారని భగవంతుని నిర్ణయము కాదు. ఇందు జాతి, మత, లింగ భేదములు లేవు. దాతలకును. ప్రతి గ్రహీతలకును లాభము, ఆనందము కల్గించునది, ఉభయులకును వెచ్చించిన కొలదినీ పెచ్చు పెరుగునది. వదలనీ, వదలించుకొన వీలులేని అమోఘ సుందరత, విశిష్టకీర్తి, సౌఖ్యవాలకము, సమన్వయ

సంపద, సజ్జన భూషితము. అట్టి విద్యను కొన్ని వేల గ్రంథముల ద్వారా ప్రజల మస్తిష్కముల నెక్కించు కార్యక్రమము యీ సంఘము చేపట్టి సాగించుచున్నది. బాహ్య వేషములకు వటాటోపములకు, పదవులకు, పనితనమునకు, పరిశ్రమలకు, వ్యవసాయమునకు, పార్టీలకు, భాగ్యమునకు, బహుధా ఆధారము విద్య. విద్య లేనివాడు వింతపశువు అని ప్రబంధకర్తల పలుకులు వినియే యుందుము. అట్టి విద్యను పాఠశాలలో బోధింతురు. గ్రంథాలయములు ఆ విద్యను వృద్ధిచేసి శాశ్వత మొనర్చును. ఇట్టి గ్రంథాలయ నిర్వహణ చేయు యీ సంఘం సేవ ప్రశంశనీయము.

ఐహికాముష్మిక విషయముల యందు అమోఘ ప్రమాణముంచి, యీశ్వర సద్భావము మనమున నిల్పుకొని, మోక్షసాధనములను పూర్ణముగా తెలుసుకొనుటకు చక్కని రాజబాట దేవాలయము. మానవ ప్రకృతి అతి ప్రశాంతముగా, ప్రబోధదాయకముగా, కాంతి ఛటచ్ఛటలతో సర్వభూతదయార్ద్ర సమన్వయ కార్యక్రమములతో, సామూహిక సర్వమంగళ సద్గుణావలంబనతో విరాజిల్లకోరు మానవులకు అది మహదాశ్రయము. ముక్తిమార్గపు కవాటము. బాహ్యానందముల నన్నిటిని మానవు డనుభవించినను చరమదశయందైనను భగవత్సాన్నిధ్యము కోరక తప్పదు. అదే శాంతి నిలయము. అట్టి వివేకమును దేవాలయ నిర్మాణము ద్వారా మానవులకందించి ఈ సంఘము పరిధులు దాటినది.

> ఆలయంబులు బోలె గ్రంథాలయములు
> విమలభక్తిని జనుల సేవింపవలయు;
> ఎందువెదకిన నందని యీశ్వరుండు
> కాపురముసేయు నిరతంబు కావ్యవాటి

హైందవులకు ముఖ్యపూజా విధానములలో గోపూజ యొకటి. గోవు యింటనున్న సర్వమంగళ ప్రదమని శాస్త్రములుద్ఘోషించుచున్నవి. గొప్ప గోసమూహమున్న దేశము అతిశుభముల కాలవాలమని ప్రతీతి. అట్టి గోవులను వధ్యశాలలకేగకుండా సంరక్షించి, గోరక్షణ విధిని, కులవృత్తిని నిలబెట్టుకొనిన యీ సంఘమువారి పటుతర బాధ్యతా నిర్వహణ పవిత్రమైనది.

ఈ సంఘము సేవ ఆదర్శప్రాయమైనది అనిర్వచనీయమైన యీ సేవా కార్యమును అందరు ఐకమత్యముతో కలకాలము యిటులనే కావించుచుందురనట్లు కన్యకాపరమేశ్వరీదేవి అనుగ్రహించుగాక.





SECRETARY TO THE PRESIDENT OF INDIA.
RASHTRAPATI BHAVAN.
NEW DELHI-4.

No. F. 9 (3) - G/63.

Novmber 16, 1963.

*Dear Shri Koteswara Rao,*

The President has asked me to convey his best wishes on the occasion of the **SILVER JUBILEE** of the Sri Vasavi Kanyaka Parameswari Dharma Sangham and the opening of its library building donated by Shri Rachumallu Ranganayakulu Sreshti.

*Yours Sincerely,*

(Sd) **S. DUTT.**



RAJ BHAVAN,
HYDERABAD.

14th November 1963.

## MESSAGE

*I am glad to know that Sri Vasavi Kanyaka Parameswary Dharma Sangham, Chilakalurpet, is doing such good work. I send my good wishes.*

(Sd) **General S. M. Shrinagesh.**

---




**MINISTER FOR EDUCATION**

HYDERABAD

Dated. 14—11—1963

I am glad to know that under the auspices of SRI VASAVI KANYAKA PARAMESWARI DHARMA SANGHAM a new library bulding is being constructed to celebrate the Silver Jublee of your Sangham. I send my best wishes to Sangham on this occasion.

Yours truly,

(Sd) **P. V. G. RAJU**

**DR. M. CHANNA REDDY**

Minister for Planning and

Panchayati Raj.

VIJAYA VILLA

Lallaguda.

Hyderabad - 17

*Date : 14-11-63*




I am happy to associate myself with the RAJATHA JAYANTHI which you are celebrating in the third week of this month. The handsome donation given by **Sri Rachumallu Ranganayakulu Chetty** is for a worthy cause and his gesture is worthy of emulation.

The importance of education in the present day, needs no reiteration. In fact the progress and prosperity of our country hinges on this. The knowledge of science and higher technology now constitutes the very life breath of our nation without which we cannot survive.

Education is like a torch which illumines every soul it comes into contact with. It is very necessary that more and more facilities for spreading literacy and knowledge are made available. The existence of Libraries helps in the fulfilment of this goal

I wish your celbrations and the Rajatha Publication all success.

Yours Sincerely,

(Sd) **M.CHANNA REDDY**

---

A. BALARAMI REDDY,

Minister for Agricliture,




HYDERABAD

Dated : 11-11-1963

Dear Friend,

Thank you very much for your letter dated 5th November 1963. I am happy to learn that you are publishing a Souvenir on the occasion of the Silver Jubilee of your Association. I wish you all success in your enterprise.

Yours Sincerely,

(Sd) **A. BALARAMI REDDY**

# శుభాశీః

మీ శుభ సంకల్పము విజయోపేతమై మీ ధర్మకార్య ప్రవణతకు ఇతోధిక బలోత్సాహ సంపత్తులు సమకూర్చుగాక !

ముప్పది ఏండ్లుగా నెడద
　　ముప్పిరిగొన్న సమాజ సేవకున్
చెప్పని సాక్షులౌచు విలసిల్లెను
　　'గ్రంథనికేతనమ్ము' మే
లొప్పిన 'ధేనురక్షణము'
　　'ఔ' ననిపించెడి 'కన్యకాలయం'
బిప్పటి యట్లె వేయినొక
　　యేడు వెలింగెడు మీదు దీక్షయున్

మీ
(Sd) బొడ్డు బాపిరాజు,
ఏలూరు.

---

# ఆశీర్వాదము

చలివేంద్రిక మరి
గోవు రక్షణము, సత్సాహిత్యపుంశాలయున్
ఇలవేల్పున్ గొలువంగ దేవళము
నాయెన్నని సత్కార్యముల్
సలువన్నేర్చిన మిమ్ముగూర్చి
పలుకన్ సంతోషముల్ కల్గెడిన్
చిలుకాపట్టణ వైశ్య సంఘమునకున్
చేకూరు దీర్ఘాయువుల్

(Sd.) జమిలి నమ్మాళ్వార్
సంపాదకుడు గుంటూరు పత్రిక
గుంటూరు.

# ప్రశంస

దేవునకుఁ, భారతికిఁ,
గోవునకున్, దప్పి దప్పిగొన్న నరునకున్
సేవ యొనరించు సంఘము
శ్రీ వాసవి భవ్యనామ చిహ్నమొసఁగుతన్

రాచుమల్లువారి రంగనాయకులు ధ
ర్మాదరంబు దాతృతానురక్తి
నేర్చి నేర్చి గ్రంథ నిలయమ్మునకు దివ్య
భవనమిచ్చెనట్టి ప్రజలు మెచ్చ

చిలకలూరిపేట శ్రీమంతులకుఁ దోఁట
యగుట మధుర ఫలముల నిశ మొసఁగు
నెసఁగుఁగాక యిందు విద్యకళాశాల
శారదాగళ ప్రశస్తమాల

తెనుగులెంక,

(*Sd.*) తుమ్మల సీతారామమూర్తి

---

My dear Secretary *Koteswara Rao Garu*,

Many thanks for your kind communication dated 5th November.

I am heartened to note about the Munificient gift of **Sri Rachumallu Ranganayakulu** for a very legitimate cause. Libraries afford good lot of education and knowledge to the needy.

I am delighted that you are Publishing a souveneir on this auspicious occation of GRUHAPRAVASAM of your library BUILDINGS. I wish you endeavours all success.

*Sincerely yours,*

(Sd) *Maddi Sudarsanam*

GUNTUR

# శుభాశీస్సులు

తమ గ్రంథాలయ భవన ప్రవేశ మహోత్సవముతో సంఘ రజత జయంతిని జరుపుకొనుట చాల సంతసనీయమైన విషయము

దాహార్తులకు జలదాన, జ్ఞానార్తులకు జ్ఞానదాన, గోమాతలకు ప్రాణదాన, మోక్షార్తులకు పరమేశ్వరీ దర్శన దానములకు దోహద కారియైన తమ సంఘ సభ్యులు తదితర ధార్మికులు ఎంతయు స్తవనీయులు. దినపరభాగ జనితమైన ఛాయ పోలిక సంఘము పరివర్ధిల్లి సువర్ణ జయంతిని జరుపుకొన గలదని, సంఘ సభ్యులు, గ్రంథాలయ భవనదాత శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు, ఐహిక పారలౌకికానందమును పొందగలరని ఆశించుచున్నాను.

తమ సంఘాభిమాని,

(*Sd.*) తెల్లాకుల జాలయ్య.

మాజీ. యం. యల్. ఎ.

గుంటూరు.

---

## శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘ రజత జయంతి సంచికకు

చిలకలూరిపేట ఆర్యవైశ్య సోదరులకు !

అమ్మా, తామందఱును మన కులదేవతయగు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి యందు అత్యంత భక్తిభావముంచి ఆమె పేరున ధర్మసంఘము నేర్పాటుచేసి తద్వారా అనేకములైన దేశహిత కార్యములను సాధించుచుండుట మిక్కిలి సంతోషము. పాతికేండ్ల నుండి ఈ విధముగా దేశహితమునకు, స్వసంఘాభివృద్ధికిని పాటుపడుచుండుట మిక్కిలి ప్రశంసాపాత్రమైన విషయము.

మన తల్లి కన్యకామాత త్యాగస్వరూపిణి కలిలో త్యాగమును జనులకు నేర్పుటకై అవతరించిన భవానీమాత; శ్రీ వాసవీమాత! ఆమె వంశమున జన్మించి నేటికిని సద్ధర్మపరాయణులుగా ఉన్న మన జాతి ధర్మము మెచ్చదగినదే; కాక, సర్వులకు ఆదర్శప్రాయము.

మీరు ఈ సంఘము పేరున కావించుచున్న సమస్త కళ్యాణ కార్యములను భగవానుడాశీర్వదించి ఇతోధిక ప్రోత్సాహమిచ్చి మీచే పవిత్ర కార్యములను ఇతోధికముగా నిర్వహింపజేయునుగాక.

బాపట్ల<br>
20-11-63

సోదరి,

(*Sd*) ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

# శుభాకాంక్షలు

మీ పుర వైశ్యుల కార్యదీక్ష దక్షత, నన్ను ముగ్ధుడను గావించి నది. దిన దిన ప్రవర్ధమానమై వెలుగొందుచున్న మీ సంఘము పలుశాఖోప శాఖలై విరాజిల్లుటకు పరమేశ్వరి శక్తి, సామర్థ్యములను, సదానొసగుగాక.

ఇట్లు
(Sd.) తవ్వా శ్రీరాములు,
ఛైర్మన్
తెనాలి.

లోక శ్రేయస్సు, ప్రజాసేవలను లక్ష్యముగా నిడుకొని మీరు చేయుచున్న సేవాకార్యములు అతిపుణ్యప్రదములు, ఇతరులకు అనుసరణీయ ములై వున్నవి. ఈ విధమగు ఉత్తమోత్తమ సేవాకార్యదీక్షగల "శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మ సంఘము" రజత జయింతిని జరుపుకొనుట అభిముదా వహము. ఇట్టి ఉత్కృష్ట సేవాకార్యములకై దీక్ష వహించిన కార్యకర్తలగు మీరు కడుంగడు ప్రశంశనీయులు భగవానుడు మీ వుద్యమమునకును, భవన దాతయగు శ్రీ రాచమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారికిని శుభములొనర్చు గాక.

భవదీయుడు,
(Sd. దిగవల్లి శేషగిరిరావు
సంపాదకులు.
టింబర్ సమాచార్

# శుభ సందేశము

ఆర్యా!

మీ సంఘము రజత జయంతిని, గ్రంథాలయ నూతన భవన మహోత్సవమును జరుపుకొనుట ముదావహము.

మీరుస్థాపించిన "శ్రీ కన్యకా పరమేశ్వరి గ్రంథాలయము"ను నేను గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘ అధ్యక్షునిగను జిల్లా గ్రంథాలయ అధారిటీ(ప్రభుత్వసంఘం) అధ్యక్షునిగను పలుమారులు చూచుభాగ్యము కలిగినది. శ్రీ రాచుమల్లు రంగనాయకులుగారు గ్రంథాలయమును తమ స్వంత సంస్థగ చూచుకొనుచు, యెంతో ఉత్సాహముగ, శ్రద్ధగ, పోషించుచు ఆనందపడుచుండుట స్వయముగ యెరుగుదును.

గ్రంథాలయమును చక్కగను; శ్రద్ధగను నిర్వహించు కార్యకర్తలను నేనెఱుగుదును. మీ సంఘము యేర్పరచి కడుశ్రద్ధతో విజ్ఞాన ప్రచారము గావించుట సంతోషము. నరసరావుపేట తాలూకాలో మీ గ్రంథాలయము ఆదర్శవంతముగ నడపబడుచు ప్రజల నాకర్షించును. గ్రంథాలయమును పలువుర మహాపురుషుల, రాజకీయ నాయకుల చిత్రపటములతో నలంకరించి పాఠకులకు చక్కని ఆదర్శముల నుద్బోధించెదరు. పలురకముల దిన పత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు తెప్పించుచు పాఠకుల నాకర్షించెదరు. గ్రంథాలయము ఒకచిలకలూరిపేట పట్టణమునకే గాక పరిసర 20 గ్రామములకు కూడ చక్కని గ్రంథములందించుచు విజ్ఞానవ్యాప్తిని గావించుచున్నందులకు జిల్లా వాసులందరు మిమ్ముల నభినందించెదరు.

మీ గ్రంథాలయము గుంటూరు జిల్లాలో అగ్రగ్రంథాలయములకోవకు జెందినది. గ్రంథభాండాగారి పాఠకుల నాకర్షించు ఆదర్శగ్రంథాలయ సేవకులు, ఆదర్శవంతములైన పలుగ్రంథరాజములు ప్రజల నాకర్షించుచుండును ఇన్ని సుగుణములు గలిగిన మీ సరస్వతి మందిరమునకు చక్కని భవనమును నిర్మించి శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు తమ ప్రియసతియగు కీ॥శే॥ కనకమ్మగారి స్మృతి చిహ్నముగ ధర్మముచేసినందుకు శ్రీ శ్రేష్ఠిగారిని హృదయపూర్వకముగ నభినందించుచున్నాను.

మీరు నెలకొల్పి కడు శ్రద్ధతో నిర్వహించు గోరక్షణ శాలను కూడ చూచి చాల ఆనందపడితిమి మీ సంస్థలన్నియు దినదినాభివృద్ధిగాంచి చిరస్థాయిగ ప్రజలకు ఉపయోగపడునని యాశించుచున్నాను.

ఇట్లు,

శరణు రామస్వామిచౌదరి.

చిలకలూరిపేట యందలి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మసంఘము వారొనర్పుచున్న బహు ముఖసేవ ముఖ్యముగ గ్రంథాలయ నిర్వహణము ప్రశంసింపదగి యున్నది. గ్రంథాలయమునకు స్వంతభవనము లేనికొరతను వదాన్యులు శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు తీర్చిరని తెలిసికొనుటకు మిక్కిలి సంతసమైనది.

అన్ని దానములలో జ్ఞానదాన మత్యుత్తమగుటచే గ్రంథాలయములు విజ్ఞాన నిలయములని గుర్తెరింగి యిన్ని సంవత్సరములుగా గ్రంథాలయమును నిర్వహించుచున్న మీకు నూతన భవనమున గ్రంథాలయమున కన్ని వసతులను సమకూర్చి సర్వజనోపయుక్తముగ గ్రంథాలయము నభివృద్ధి పరచెడి శక్తిని పరమేశ్వరుడు ప్రసాదించుగాక.

(Sd) అ. శ్రీనివాసరావు,
Hon. సెక్రటరి
సారస్వతనికేతనము, వేటపాలెము.

---

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘం, చిలకలూరిపేటవారు (యీ నవంబరు మాసములో) సంఘ రజత జయంతి మహోత్సవములును, గ్రంథాలయ నూతన భవన ప్రవేశ మహోత్సవమును జరుపుకొనుట చాల సంతోషప్రదమైన విషయము.

ఎనుబది సంవత్సరముల క్రిందట బాటసారుల దాహమును తీర్చుటకు కొందరు వైశ్య ప్రముఖులు చిన్న చలివేంద్రను స్థాపించిరి. అంతటితో వారు తృప్తిపడక శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘమును స్థాపించి తద్వారా చదువరుల జ్ఞాన పిపాసను తీర్చుటకు గ్రంథాలయమును, దేశసంపదను వృద్ధిచేయు గోరక్షణ శాఖయును, భక్తుల ముక్తిసాధనకు కన్యకా పరమేశ్వరీ దేవాలయమును స్థాపించి జయప్రదముగ నడుపుచున్నారు. వార్షికోత్సవ సమయమున అనేకమంది భక్తులను, విద్వాంసులను కవులను పండితులను, కళాకారులను పిలిపించి వారిని సన్మానించుటయు వారి ద్వారా సాంస్కృతిక సాహిత్య కార్యక్రమములను నడుపుచుండుట నేనెరుగుదును. కార్యక్రమములు నడుపుచున్న పై సంఘమువారికి ఉదారతతో గ్రంథాలయమునకు భవనమును నిర్మించిన శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారికి అభివందనములు. భగవంతునికృపవలన ఈ కార్యక్రమములన్నియు దినదిన ప్రవర్ధమగుగాక.

(Sd) ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యా,
మాచవరం, విజయవాడ-2
మకాం : హైదరాబాదు-4

## దక్షిణభారత హిందీప్రచారసభ - ఆంధ్ర, హైదరాబాదు-4.

ఆర్యా !

......తమ సంస్థ ఇపుడు తన రజత జయంతి జరుపుకొనుచున్నందుకు చాల సంతోషము.

తమ సంస్థ ఇతోధికాభివృద్ధి జెంది "స్వర్ణ జయంతి" జరుపుకొను నాటికి గొప్ప దేశ సేవా సంస్థగా రూపొందు భాగ్యమును భగవదను గ్రహము వలన పొందగలదని ఆశించుచున్నాను.

భవదీయుడు,
(*Sd*) పిట్టూరి లక్ష్మీనారాయణశర్మ,
కార్యదర్శి.

---

ఆర్యా,

రజతోత్సవ సందర్భమున శ్రీ వా. క. వ. ధర్మ సంఘమునకు నా శుభాకాంక్షలు.

చలివేంద్ర, గ్రంథాలయము, గోసంరక్షణము, దేవళముఇవన్నియు పరమ పావన కార్యక్రమములు, మీ సంఘము వారి కృషికి అభినందనము లను, జోహార్లను తెలుపుచున్నాను. నాహృదయ సన్నిహితములైన కార్యము లను మీరు దక్షతతో నిర్వహించుచున్నారు.

'ఆర్యవిద్యాభూషణ'
జటావల్లభుల పురుషోత్తము, *M. A.*
ప్రిన్సిపాల్ సంస్కృత కళాశాల,
ఏలూరు, ప, గో జిల్లా.

మహాశయా !

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మ సంస్థను నెల కొల్పి పరోపకారార్ధము సేవలను గావించుచు గత 80 యేండ్లుగా మీరు సాగించు చున్న కృషి ప్రశంసనీయము. అల్పముగ ప్రారంభమైన మీ సేవా సంస్థ మహావృక్షముగ వర్ధిల్లి వికసించు చుండుట మాననీయము. ఇందే మీ సాహసము, ప్రతిష్టలు. పాదుకొన్నవని నుడువుటఅతిశయోక్తి కాదు. గీత బోధించు రీతి మీరొనొర్చుచున్న నిష్కామసేవ ఇహపర సాధనము అందునను హిందువులమైన మనమార్థించు గోమాత సేవ ప్రతివారికి ధర్మము. తన్నిర్వహణము సముచి తము. యోగ్యము.

ఇట్లే మీకృషి ఇంకనూ వర్ధిల్లి, పుష్పించి మధుర ఫలముల నందించు చుండునుగాక.

భగవంతుడు మీ సంస్థలోపాటు పడుచున్న వారికి, దానిని పోషించుచున్నవారికి చిరాయువును ప్రసాదించి మీ జీవితములను ధన్య మొనర్చునుగాక. ఇవియే నాశుభాకాంక్షలు.

ఓం. శాంతి. శ్శాంతి. శ్శాంతిః

ఇట్లు,

(*Sd.*) శ్రీ కల్లూరి చంద్రమౌళి

చంద్రమౌళినగర్

గుంటూరు.

# నా పరిచయం

మీ ధర్మ సంఘం నిర్వహించు శాఖలతో పరిచయము నాకీ నాటిదికాదు.

1928 వ సంవత్సరము నేను ప్రాథమిక పాఠశాలకు వెళ్ళే రోజులు. మఱపునకురాని మంచినీటి యెద్దడి. "డబ్బైనా యిస్తాముగాని మంచినీటి మాటెత్తకు" అనేవారు గృహస్థులు అంటే అబ్బురంలేదు. సోడాలు, కూలుడ్రింకుల ప్రచారము లేని దినాలు. మండు టెండల్లో మెల్లగా బడికి వెళ్ళుతూ రోజుకొకసారైనా చిన్నరథం దగ్గరి చలివేంద్రలో చల్లని నీరుత్రాగి వెళ్ళేపిల్లలలో నేనొకణ్ణి. స్వపర గ్రామస్థులు తండోపతండాలుగా చల్లని మంచినీరు త్రాగి "అబ్బా! ప్రాణము చల్లబడ్డది" అంటూ పోతూంటేచూచేవాణ్ణి. అప్పటినుండి ఇప్పటివరకు ప్రజాసేవచేస్తూ వర్ధిల్లుతున్న మీ చలివేంద్ర ఇంకాదినదిన ప్రవర్ధమానంకావాలని నాఆకాంక్ష.

అది 1938 వ సంవత్సరము. అప్పటికేనేను ఐ. యల్. టి. డి. ఉద్యోగిగావున్నా. సినిమాలు, పార్కులు, క్లబ్బులు ఇంకా అవతరించలా. సాయంత్రంకాగానే కాలక్షేపం చేయడానికి సాంకేతిక ప్రదేశం లేని రోజులు. నేను నా అనుచరులు గ్రంధాలంటే చెవికోసుకొనే వాళ్ళం. ఆ సమయంలోనే శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ గ్రంధాలయము శ్రీ రాచుమల్లు రంగనాయకులుగారి భవనమున ప్రవేశ పెట్టబడింది. దీనితో మాకు సాంకేతిక ప్రదేశంకుదిరింది. మిత్రులంఅంతా గ్రంధ కాలక్షేపం, పత్రికా పఠనం, రోజూ చేసేవాళ్ళం. గ్రంధాలయ నిర్వాహకులు మీకేపుస్తకాలు కావాలంటే అవి తెప్పించుకోమని ప్రోత్సాహమిచ్చారు. మా ఆనందానికి మేరలేదు. సభలు, సమావేశాలు, తర్కాలు జరుపుకొనేవాళ్ళం. నేనీపరిచయ వాక్యాలు వ్రాయు సమయంలో మన ఉపరాష్ట్రపతి పుస్తకాలను గురించి అన్నమాటలు పత్రికల్లోయిలా చూచా. "The book is the life Companion of modern man", a morvellous Companion the most mannerly of companions, accessible at all times, in all moods, frank without being offencive. It never spoke unless it was spoken too and it could wait eternally for our approach. It is ever ready to oblige and to offer the best it has to whosoever seeks it. It instructs advises, inspires, rebukes, but stops immediately you have had enough of these"

మీ గ్రంధాలయంలో యున్న ఆరువేల పుస్తకాలు ప్రతిఒక్కరికి ఆరువేల స్నేహితులు. ఆరువేల గురువులు. మీ గ్రంధాలయంలో కూర్చొనే ప్రపంచాన్నంతా ఒకసారి చూడవచ్చు. ప్రియతమమైన ఇట్టి గ్రంధాలయ సుందర సువిశాల భవనంలో నెలకొల్పబోతూందంటే నాకు ఆనందంగా ఉంది. ఈ గ్రంధాలయం చిరస్థాయిగా నిలచి ప్రజాసేవ చేయాలని ప్రార్థిస్తా. ముందు ముందు సంచారక గ్రంధాలయం ఏర్పాటుచేసి ఇంటింటికి గ్రంధాలందిస్తారని తలుస్తా.

మనదేశ సౌభాగ్యం గోసంరక్షణ మీద ఆధారపడి వుంది. ఎందుకంటే మనది వ్యవసాయ దేశం. మీ గోరక్షణశాఖ నిర్వహించుచున్న పాత్ర ప్రశంసనీయం. 1933 సంవత్సరం నుండి దినదినాభివృద్ధి చెందుచున్న గోరక్షణ విషయములో నా చిన్న మనవి. మంచి జాతి ఆబోతులను, ఆవులను మీరు తెప్పించి గోజాతిని వృద్ధిజేస్తూ పసిపిల్లలకు పాలను దానంచేస్తూ పాలకేంద్రంగా కూడా ఏర్పాటు చేస్తారని నా ఆకాంక్ష.

1940 వ సంవత్సరము కీ॥ శే॥ మైలవరపు గుండయ్యగారు నాకు పరమ మిత్రులు. ఆయన చాలాకాలం పంచాయితీ బోర్డు అధ్యక్షులు, నేను సభ్యుడను. ఆయన అప్పుడే మొలకెత్తిన రిక్రియేషన్ క్లబ్ ప్రెసిడెంటు, నేను కార్యదర్శిని. వారితో కలసి అప్పుడప్పుడు శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయానికి వెళ్ళేవాడిని.

బ్రహ్మాండమైన భజనలు, అలంకారాలు, ఆరాధనలు. రోజూ తిన్నంతతియ్యని ప్రసాదం. ఇట్టి దేవాలయాన్ని పునర్నిర్మాణం చేసి సంఘం నిర్వహిస్తుందంటే పరమానందంగా వుంది.

మొదటనుంచీ మీ సంఘీయుల ఉదారత్వము, ఉత్సాహం, పట్టుదల, దీక్ష నాకు తెలియనివి కావు. ఇక యువకుల ఉత్సాహం, శ్రద్ధ యింతింతకాదు.

త్రాగడానికి మంచినీరూ, విజ్ఞానాభివృద్ధికి గ్రంథాలూ, దేశసౌభాగ్యానికి గోసంరక్షణా దైవభక్తి ప్రేరేపణకు దేవాలయము ఏర్పాటు చేసి అమోఘమైన ప్రజాసేవ చేస్తూ విలసిస్తున్న మీ సంఘం రజత జయంతి జరుపుకోవటం శ్లాఘనీయం. ఇంకా అనేకవిధాల ప్రజాసేవ చేస్తూ, అనేక ఉదార స్వభావుల ఆదరణను పొందుతూ దినదిన ప్రవర్ధమానమై అనేక సువర్ణ జయంతులు జరుపుకొనేటట్లుగా దేవుడు మిమ్ములను ఆశీర్వదించి ప్రోత్సహించాలని ప్రార్థిస్తా.

ఇట్లు,

తేలప్రోలు సాంబయ్య,
ఐ. యల్. టి. డి. కంపెనీ, ఎకౌంట్సు ఆఫీసరు,
చీరాల.

---

## శుభాశీస్సులు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము సేవ ఆదర్శప్రాయమైనది. అనిర్వచనీయమైన యీ సేవాకార్యమును అందరు ఐకమత్యముతో కలకాలము యిటులనే కావించు చుండునట్లు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీదేవి అనుగ్రహించుగాక.

గ్రంధి లక్ష్మణస్వామి,
అధ్యక్షులు : ది క్లాత్ మర్చంట్సు అసోసియేషన్,
విజయవాడ.

# అభినందనలు

ప్రజా సామాన్యము కొరకు చతుర్విధ సేవల నొనర్చుచున్న చిలకలూరిపేట శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మసంఘము రజత జయంతి మహోత్సవము జరుపుకొనుట మిక్కిలి ప్రశంసింప దగిన విషయము.

విద్యా విహీనతతో బాధపడుచున్న మన మాతృదేశమున గ్రంథాలయములకున్న స్థానమద్వితీయము.

కాలమును గుర్తించి శ్రీ రాచమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు గ్రంథాలయ భవనమును ధర్మముగా నిర్మింపజేసి యిచ్చి నందులకు మా హృదయ పూర్వక అభినందనలు.

ఇట్టి దాతల సహాయమునను నిర్వాహకుల కృషిఫలితమునను ధర్మసంఘము యితోధిక వృద్ధి నొందుటకు ఆశించుచున్నాము.

ఇట్లు,

(*Sd*) కోదాటినారాయణరావు హైదరాబాదు
,, పాతూరి నాగభూషణం
,, బి. రంగారెడ్డి, రేణుగుంట చిత్తూరుజిల్లా,
,, మహీధర జగన్మోహనరావు, రాజమండ్రి
,, వెలగా వెంకటప్పయ్య, తెనాలి.
,, జాస్తి వేంకటనరసయ్య
,, అయ్యంకి వెంకటరమణయ్య
,, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య
,, మాజేటి రామచంద్రరావు, మాజేరు
,, కొత్తమాసు కూర్మారావు, విజయవాడ
,, నాగినేని వెంకయ్య ధేనువుకొండ
,, కె. నాగేశ్వరరావు, ఖమ్మం
,, బి. వెంకటరామారావు, కరీంనగర్
,, పాలడుగు శేషాచలాచార్య, కుంచేరు.
,, పి. బయప్పరెడ్డి
,, కొమర్రాజు సత్యనారాయణరావు, ఖమ్మం
,, ఇటికాల నీలకంఠరావు, ఖమ్మం
,, ఉన్నవరాజగోపాలకృష్ణయ్య, విజయవాడ

(*Sd*) అడుసుమల్లి శ్రీనివాసరావు, వేటపాలెం
,, కొలిశెట్టి సుబ్రహ్మణ్యాం ,,
,, చిత్రాపూరు నాగభూషణాచార్యులు
,, వల్లభనేని కాశీవిశ్వనాధం. ఏలూరు
,, పి. సోమేశ్వరశర్మ తణుకు
,, జి. రామారావు
,, జె. సుబ్బారావు
,, టి. వి. యస్. ఆర్. కృష్ణప్రసాద్
,, జి. వి. గోపాలకృష్ణమూర్తి
,, వనమా పూర్ణచంద్రరావు
,, కె. ఆదెయ్య, కారెమరిపాలెం
,, వల్లూరు చలపతిరావు
,, జాస్తి భాస్కరరావు
,, ఆచంట లక్ష్మీనరసింహం
,, కొమర్ల సీతారామయ్య
,, శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ కార్యదర్శి, విజయవాడ
,, త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త, గుంటూరు.

# సందేశము

ధర్మంకోసం పరితపించే కొంతమంది దాతల కృషి ఫలితంగా ఏర్పడిన ధర్మ సంఘం రజత జయంతి జరుపుకోనుండుట ఆనందదాయకము.

గ్రంథాలయమునకు భవనమును ధర్మమొసంగిన శ్రీ రాచమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారి దాతృత్వము ప్రశంసనీయము.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము ముందు తరాలలో గూడ యింకా అధిక సేవచేయుటకై పునాదులను బలిష్టం చేసుకోగలదని నమ్ముచున్నాను.

భవదీయుడు

పెమ్మరాజు బాపిరాజు

మీనవల్లూరు,

ప. గో. జిల్లా.

---

# శుభాకాంక్షలు

పవిత్ర భారతీయ సంస్కృతికి ఆదర్శమైన శ్రీ వా.క. పరమేశ్వరీ ధర్మ సంఘము తన రజత జయంతిని జరుపుకొనుట మిక్కిలి శ్లాఘనీయము. సంతోష దాయకము; సముచితము.

చల్లని చూపులతోడ శ్రీ విష్ణువు "చలివేంద్రము"ను జూడ, "గ్రంథాలయమ్ము"ను వాణి దీవించ, 'గోసంఘమున'కండగా గోపాలుడుండ, కరుణతో గాచు కన్యాకాపరమేశ్వరి 'దేవళమ్మున' వెలుగ చతుర్ముఖుని పగిది చతుశ్శాఖలతో శ్రీ వా. క. ప. ధర్మసంఘ మహావృక్షము కల్పవృక్షమై కలకాలము వర్ధిల్లుచు లోకోపకార మొనరించుగాక.

శారదకై రమ్యహర్మ్య మిచ్చిన రమణీయమూర్తి రాచమల్లు వంశాబ్ధి చంద్రుడు శ్రీ రంగనాయకులు శ్రేష్ఠి 'దాతృత్వము'నకు ప్రతిబింబమై లోకమునకాదర్శ ప్రాయుడగుచు వర్ధిల్లుగాక —

నాదెండ్ల
26-11-63

వల్లభనేని హనుమంతరావు,
హిందీ పండిట్.

# ఆకాంక్ష

ఆర్యా !

తమ సంఘ "రజత జయంతి" జరుపుకొనుట ముదావహము. సంఘము ద్వారా చేయుచున్న సాంఘికసేవ ప్రశంసార్హమైనది. "మానవ సేవయే మాధవసేవ" యను నార్యోక్తి సార్థకపరచుకొని మీ సంఘము రజత జయంతి జరుపుకొను చున్నందులకు మీరు అభినందనీయులు.

అందు గ్రంథాలయోద్యమ విభాగము గూడ యుండుట సంతోష దాయకము. గ్రంథాలయము ద్వారా మానవులను విజ్ఞానవంతులనుగా రూపొందించుటకు మరింత కృషి సల్పగలరని ఆశించుచున్నాను.

రైలుపేట
గుంటూరు
28-11-63

ఇట్లు,
(Sd) త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త.
కార్యదర్శి,
గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘం.

---

ఆర్యా !

మంచిపట్టుదల ఓర్పుతో సమిష్టిగా, నడుపు మీ గ్రంథాలయము దిన దినాభివృద్ధి నందగలదని భావించుచూ భవన దాతయగు శ్రీ రామసుల్లు రంగనాయకులుగారికి నా హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను.

గుంటూరు
27-11-63

ఇట్లు,
గుడివాడ గోపాలకృష్ణమూర్తి.

## శుభాకాంక్షలు

శ్రీగల వారల పాల్పున
వాగీశ్వరి నాట్యమాడె బాలాంబదయన్
గో గణములు విలసిల్లను
గంగాఝరి పొంగిపారలె గడుకొని యిచటన్—

ధనమునకును జరితార్థత
గననగు తగుదానమునని కనుగొన నిచటన్
ధనదు సమానులు వీరల్
వెనుదీయరు గాక యిట్టి వితరణములలోన్—

వాసవి కన్యక దయ శ్రీ
వాసవి గ్రంథాలయంబు వరభవనమునన్
వాసిం గాంచెడు గావుత
భాసిత సత్కీర్తులగుచు బ్రిబలగమీరల్—

గుంటూరు.

ఇట్లు,
(Sd) అన్నపర్తి సీతారామాంజనేయులు.

## ఆశీర్వాదము

చతుశ్శాఖలచే నొప్పారుచున్న మీ ధర్మసంఘము దిన దిన ప్రవర్ధమానమగుచు, నిరంతరాయముగ సకల జనోపయోగ, కార్యముల నొనర్చుచుండగలదని ఆశించుచున్నాను.

గ్రంథాలయ భవనదాత శ్రీ రాచుపల్లు రంగనాయకులుగారి దాతృత్వము ప్రశంసా పాత్రము.

ఇట్లు,

చిలకలూరిపేట. (Sd) డాక్టర్ : చట్టి వెంకటనరసింహాచారి.



# నుతి

కరుణా పూరణి, దివ్యకల్ప హృదయా, కాత్యాయనీ, పావనీ,
వరదాయీ, శుభదాయి, ప్రేమ జననీ, భావైక్య సంధాయినీ,
దరహాసాంచిత హాస, హాస వదనీ, దాక్షిణ్య దాక్షాయిణీ,
స్థిరచిత్తా, పరమేశ్వరీ గిరిజ, శ్రీ శ్రీ వాసవీ కన్యకా !

ఒక్కరు నింద జేసిన మరొక్కరు స్తోత్ర మొనర్ప సాగినన్
వెక్కస మంది యింకొకరు వెక్కిరిపించిన ప్రీతితోడ యిం
కొక్కరు చేరదీసి సదనోక్తులు దేల్చిన వారి నందరిన్
నిక్కపు ప్రేమ గొల్వగను నేర్పవె మా కిల దీనరక్షణీ !

మంచికార్యాలు జేయంగ మనసునిమ్మ,
ప్రజల సేవయె యొనరించ ప్రగతి నిమ్మ,
దేశకళ్యాణ చేష్టకై దీప్తి నిమ్మ
శుద్ధ చైతన్య బుద్ధి వాక్శుద్ధి నిమ్మ !

—కవి పాదుషా.

# ★ గ్రంథాలయ వేదము ★

౧ వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో జ్ఞానముకూడా అట్లు స్వాధీనము కావలయును.

౨ ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో జ్ఞానము కూడ అట్లు సేవ్యము కావలయును.

3 సూర్య చంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

— చిలకమర్తి లక్ష్మీనరసింహము

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము,
హైదరాబాదు – విజయవాడ–6

## చదువుకోండోయ్; చదువుకోండోయ్

చదువురాని పెద్దలంతా
    చదువుకొందురుగాని రండోయ్
    చదువుకొందురుగాని రండోయ్
చదువుసులభము వ్రాతసులభము
చాలసులభం తెలుగుచదువూ ॥చదు॥
సులువుపద్ధతి సులభమార్గము
    తల్లిబాసను నేర్వరండోయ్
    తప్పకుండా నేర్వరండోయ్ ॥చదు॥
అక్షరంబె సూర్యుడండోయ్
    మీదెరాజ్యం అయినదండోయ్
    చదువుకుంటే బాగుపడునోయ్
    చదువుకోండోయ్ చదువుకోండోయ్ ॥చదు॥

— శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ గ్రంథాలయ భవన దాతలు

# శ్రీ రాచుమల్లు రంగనాయకులు దంపతులు



రాచుమల్లువారి రంగనాయకులు ధ
ర్మాదరంబు దాతృతానురక్తి
నేర్చి నేర్చి గ్రంధనిలయమ్మునకు దివ్య
భవన మిచ్చె నహ్హ! ప్రజలు మెచ్చ



భవనదాత

శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారి కొ॥

చి॥ ఉమామహేశ్వరరావు, నాగేశ్వరరావు



## చిలకలూరిపేట
శ్రీ వా. క. ప. గ్రంథాలయ భవనదాత
# శ్రీ రాచుమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు

శ్రీ తూబాటి నాగభూషణరావు,
చిలకలూరిపేట.

శోభకృతునామసంవత్సర వైశాఖ బ॥౦లు (1903 సం॥) రాచుమల్లు నాగయ్యా వర లక్ష్మమ్మ దంపతులకు వారి గర్భ శుక్తి ముక్తాఫలముగా రెండవ కుమారుడై జనించెను

అల్లారు ముద్దుగా పెరుగుచు 5వ యేట అక్షరాభ్యాసమును ఆరంభించి జీవితమున కవసరమగు చదువునంతయు నేర్చు, నాటి నాల్గవ తరగతి వరకు చదివెను.

13వ యేట చిలకలూరిపేట కాపుర స్థులు గ్రంధి రాఘవయ్యగారి పుత్రిక కనకమ్మగారిని వివాహమాడెను.

15వ యేట వ్యాపార రంగమున ప్రవే శించి వ్యాపారదక్షుడను పేరుపొంది తన సోదరులగు శ్రీ కన్నయ్యా, సీతారామయ్యా గార్లతో కలసి అనేక దానధర్మములను చేసెను.

33వ సంవత్సరమున (1936లో) భార్య కనకమ్మగారు నిస్సంతుగా కీర్తిశేషులైనం దున ఆ సంవత్సరమే వినుకొండ వాస్త వ్యులు చీతిరాల పుల్లయ్యగారి కొమార్తె నాగరత్నమ్మ గారిని ద్వితీయ వివాహము చేసికొనిరి.

ఈ పుణ్య దంపతులు యిద్దరు కుమారులు అయిదుగురు కుమార్తెలతోను సిరిసంప దలతోను కులదేవతయగు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ కృపవలన హాయిగా జీవితములు గడుపుచున్నారు. వీరి జ్యేష్ఠ పుత్రుడు చి॥ శమామహేశ్వరరావు ప్రస్తుతము మెకానికల్ యింజనీరింగ్ విద్యార్థి.

అజ్ఞానాంధకారమును పారద్రోలుటలో గ్రంథాలయములకున్న స్థానము అద్వితీయ మైనది. నేడు భారతదేశమున ప్రజలలో నూటికి యిరువదిమంది మాత్రమే విద్యా వంతులుగలరు. రష్యా అమెరికా మున్నగు దేశములలో నూటికి యెనుబది తొంబది మంది వరకు విద్యావంతులున్నారు. అందు వలననే ఆదేశములు అంత సిరి సంపద లతో తులతూగుచున్నవి. మనదేశము నందు గూడ విద్యావంతుల సంఖ్యను పెంచుటకు గ్రంథాలయములు వయోజన

పాఠశాలలు మిక్కిలి అవసరములలో సందేహ మావంతయు లేదు.

మానవునకు పీల్చుటకు గాలి, తినుటకు తిండి, త్రాగుటకు నీరు, చూచుటకు వెలుగు ఎట్లు అవసరమో మంచిమార్గమున జీవించుటకు విద్యయు అట్లే అవసరము.

“విద్యా విహీనః పశుభిస్సమానః” అన్నట్లు విద్యలేని మానవుడు పశువుతో సమానుడు. విద్య మానవుని విజ్ఞానినిగా చేసి దేశ సమస్యలను తెలియబరచి వాని పరిష్కార మార్గమును తెలిపి కర్తవ్య పరాయణునిగా జేయును.

మన దేశమందు నూటికి యెనుబదిమంది ప్రజలు పల్లెలలో నివసించువారు ఎక్కువగా చదువుటకు అవకాశములు లేక పరిమితముగా చదువుకొనిన వారు తమ విద్యను మరచిపోవక అభివృద్ధిపరచుకొని లాభము నొందుటకు గ్రంథాలయము లే ముఖ్యశరణ్యములు.

అట్టి గ్రంథాలయమునకు సొంత భవనములేని కొరతను గుర్తించి శ్రీ రంగనాయకులుగారు 27 సంవత్సరముల క్రిందట చనిపోయిన భార్య కనకమ్మగారి యొక్క పేరును శాశ్వత మొనర్చుటకు రు. 15000/- లు ఖర్చు చేసి గ్రంథాలయమునకు సుందర సౌధమును నిర్మాణము చేయించి ధర్మమొసంగ సంకల్పించుట వీరి దాంపత్యానురాగమును విద్యాభిమానమును ఔదార్యమును తెలియజేయుచున్నది.

మంచిపనికి అనేక విఘ్నములు. అవి బయటివి అయినచో ఎటులనో సర్దుకొనవచ్చు. యింటిలోనివే అయినచో “ఇంటిలోని పోరు యింతింత కాదయా” అన్నాడు వేమనయోగి.

ఈ కాలములో సాధారణముగా భర్తల ఆర్జనలను తమ చేతులలో నుంచుకొనుచు తమకు యిష్టము లేని ఖర్చులను చేయనీయక భర్తల ఖర్చులను కూడ వారే నిర్ణయించుచు భర్తవైపు వారలను సరిగా చూడక, చూడనీయక తమ చిత్తానుసారము నడువనిచో నానా తర్జన భర్జనలను చేసి భర్తలను హింసించు స్త్రీలు యెందరో గలరు.

రంగనాయకులుగారికిగూడ యీ కాలమునను సరించి యింటిలో పోరుండు నను కొనుటలో ఆశ్చర్యమేమియు లేదు. ఏమన రెండవభార్య. పిల్లలుగల తల్లి. పిల్లల అవసరములు తీరుట కెంతయో ధనము కావలె. తన యవసరము లిట్లుండ ఎంత సంపదయున్నను యెప్పుడో చనిపోయిన తన సవతియందు భర్త యింత అనురాగమును చూపి వేలకొలది రూప్యములను ఖర్చు చేయుటకు ఏ సాధారణ స్త్రీ సహించగలదు?

కాని రంగనాయకులుగారి పూర్వపుణ్య విశేషంబున వారి సంకల్ప బీజము మహాఫల వృక్షముగా వృద్ధినందుటకు దోహదము గావించిన వ్యక్తి వారి రెండవభార్య ల॥ సౌ॥ నాగరత్నమ్మయే. నాగరత్నమ్మ నిజముగా మహిళారత్నమ్మయే. కానిచో రంగనాయకులుగారి సంకల్పము సంకల్పముగనే యుండి పోయెడిది.

## ఒక చాటువు

ఒక గ్రామములో కోట సింగరాజు అను గృహస్థుడుండెను. ఆయన భార్య గంగమాంబ. సింగరాజు దానధర్మ పరాయణుడై నిరతాన్నదాతయని ప్రసిద్ధి నొందెను.

ఒకనాటి రాత్రి సింగరాజు యింటిలో భోజనములై నిద్రించుచున్న సమయమున ఒక కవి ఆకలితో వచ్చి తలుపు తట్టి పిలువగా గంగమాంబ ఏమియు విసుక్కొనక ఆతనికి సాదరముగా కమ్మని భోజనము పెట్టెను.

ఆయనయు కడుపార భుజించి ఆరాత్రికి వారియింటనే విశ్రమించెను. విశ్రమించిన యాతనికి ఏమితోచినదియో

కోట సింగరాజు మాటవాసియె గాని
గంగమాంబ వలన ఘనత కెక్కె
గంగమాంబ తాను గయ్యాళి యైనచో
సింగరాజు యేమి చేయగలడు?

అన్నాడు.

నాగరత్నమ్మ ఏమాత్రము వ్యతిరేకించినను శ్రీ రంగనాయకులు నిజముగా శ్రీరంగ నాయకులు అయ్యేడివాడే!

అల్లుగారి సతీమతల్లి యగు నాగరత్నమ్మ సవతియగు కనకమ్మ గారి పేరును శాశ్వత మొనర్ప భర్త చేసినపని చాలదో యన్నట్లు యీ భవనమునకు గాని గ్రంథాలయమునకుగాని యింకను కొంత వరాలమిచ్చియైనను సోదరి కనకమ్మగారి కీర్తిని యింతకంటె శాశ్వత మొనర్ప సంకల్పించి అట్టి మార్గముల నారయుచున్న సుశీల. ఈమె సౌజన్యమెంతయు కొనియాడదగినది. ఇట్టి మహిళా మతల్లుల సత్సంకల్ప బలమువలననే సంఘములు అభ్యుదయములను పొందుచున్నవి.

"మణినా వలయంభాతి వలయేన మణిర్యథా".

మణివలన వలయమును వలయము వలన మణియు ప్రకాశించునట్లు అన్యోన్యానురాగవంతులయిన యీ పుణ్య దంపతులు ధన్యతములు, సుకృతులు. వీరి సంతానము గూడ వీరి సుకృతముల కెంతయు తోడ్పడుచుండుట యీ పుణ్య దంపతుల పూర్వ పుణ్యమే.

మహిళా లోకము మానినీ రత్నమగు నాగరత్నమ్మను ఆదర్శముగా గొని లోకము నుద్ధరింతురు గాత.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీదేవి వీరి కుటుంబమునకు సర్వదా సకల శుభము లొసంగ ప్రార్థన.



# దాతృత్వము

మతి నెఱదాత లెప్పుడును మంచివి డాచుక చెడ్డ వాండ్లకున్
వితరణ మీ దలంపక వివేకమునం దగినట్లొనర్తు రౌ;
ప్రతి ధరణీజరాజమును బక్వఫలంబులు గాయలుండ, భూ
సతికిని బండు లిచ్చుట నిసర్గగుణంబగుగాదె; మిత్రుడా.

మహాదాతలు ఎప్పుడును మంచి వస్తువులు దాచుకొని చెడ్డవి దాన మీయ తలంపక వివేకముతో మంచివే యిత్తురు. ఎట్లనగా! ప్రతి వృక్షమునకు పండిన ఫలములు, పచ్చికాయలు ఉన్నను భూదేవికి పండ్లను యిచ్చుటయే సహజగుణము.

తానిడు టీయకుండుటయు దత్క్షణమే సుజనుండు దెల్పెడిన్
హీనుడు త్రిప్పి త్రిప్పి విసిగించి తృణమ్ము నొసంగ కంపెడున్;
గానమెకాల వేసగిని గ్రుక్కెడ నిచ్చియొ యీకొ పంపు రా
గానె మడుంగెడారి యటుగా దడియాసల బెట్టు; మిత్రుడా.

తాను యిచ్చుటయో యివ్వకుండుటయో మంచివాడు వెంటనే తెలుపును. హీనుడు త్రిప్పి త్రిప్పి విసుగును బుట్టించి ఏమియు యీయకనేపంపును. ఎట్లనగా! వేసవికాలమందు అడవిలోని జంతువులు మడుగువద్దకు రాగానే అది నీరు యిచ్చిగాని, యివ్వకగాని వెంటనే పంపును. ఎడారి ఆ విధమున గాక వ్యర్థపు ఆశలను కల్పించి బాధపెట్టును.

ఇయ్యకు మంచు జెప్పినను హీనుడొసంగమాను; గాని తా
నియ్యక పోడు దాత యెవరెన్ని విధంబుల నడ్డగించినన్
గయ్యి కళింగ యడ్డపడ గట్టువడుం బొలమెండ బాఱినం
బయ్యెర గెంటు చుండినను బందగునే జలదంబు? మిత్రుడా.

ఒకరు యివ్వవద్దని చెప్పినచో హీనుడు యివ్వక మానును. కాని ఎవరు యెన్నివిధముల అడ్డుపడినను దాత యివ్వకమానడు. ఎట్లనగా! పొలము యెండిపోవుచున్నను చిన్న కాలువ తీగలు సహితము అడ్డము వచ్చినను పారక ఆగిపోవును. కాని గాలి బలముగా నెట్టుచుండినను మేఘము వర్షింపక మానదు.

—వ. సు. రాయడు



శ్రీ రాచుమల్లు కన్నయ్యగారి భార్య
హనుమాయమ్మ గారు

రాజపోషకులు

వీరి తల్లిగారైన కీ॥ శే॥ గ్రంధి వెంకటరత్నంగారి భార్య
రామలక్ష్మమ్మగారి జ్ఞాపకార్థం చలివేంద్ర ప్రక్కన
వాణిజ్యమునకనువగు భవనమును
రు. 2000 లతో కట్టించి యిచ్చిరి



శ్రీ మున్నలూరి రంగయ్య గారు

రాజపోషకులు

అధ్యక్షులు : గో. సం 1934.

శ్రీ వా. క. ప. 1941–58.



శ్రీ రాచుమల్లు కన్నయ్య గారు

రాజపోషకులు (కార్యదర్శి)

1932–40. గ్రం. అధ్యక్షులు

1941–58 గో. సం. ఆ.

గ్రంథాలయ పునః ప్రతిష్ఠాపకులు. సంఘ పటిష్టతకు జీవగర్ర.

## కార్య నిర్వాహక వర్గము - సంఘోద్యోగులు 1945-46.



శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము
చిలకలూరిపేట

# శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘ భవనములు






"వాణిజ్య మహల్" చలివేంద్ర భవనములు





ప్రథమ చలివేంద్ర భవనములు



శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మసంఘము - 1958-59 సం॥ కార్యనిర్వాహక వర్గము

# కార్యకర్తలు



శ్రీ కొప్పురావూరి వెంకట సుబ్బారాయు:
రాజపోషకులు
గో. సం. సభ్యులు 32-40





శ్రీ చంద్రపట్ల కాశీ విశ్వనాధం
కా. ని. సభ్యులు 1953-63.



# కార్యకర్తలు



శ్రీ చంద్రపట్ల లక్ష్మయ్య
కా. ని. సభ్యులు. 59-63.
రు. 500-00 లు విలువగల అమ్మవారి ఊరేగింపు
మందిర దాతలు



శ్రీ కొల్లా సుబ్బరావు
కా. ని. సభ్యులు 1941-42.





# కార్యకర్తలు



కీ॥ శే॥ మైలవరపు గుండయ్యగారు

రాజపోషకులు

కా. ని. సభ్యులు 1941-45, 50, 51.

ఉపాధ్యక్షులు 46-49

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయమును సంఘపర మొనర్చినవారు.

కీ॥ శే॥ కూనల పున్నయ్యగారు

రాజపోషకులు

కా. ని. సభ్యులు 1941-43.



# కార్యకర్తలు



కీ॥ శే॥ ఆకుల విశ్వనాధం

కా. ని. సభ్యులు 1950-57, 59-62.

చ. ఆ. 50-52, 56-59. దే. ఆ. 53-55, 61-62.

శే॥ శిఖాకొల్లి రామకోటయ్య

కా. ని. సభ్యులు 1959-61.



# కార్యకర్తలు



శ్రీ కొప్పురావూరి హనుమంతరావు
కా. ని. సభ్యులు. 49_51. చ. ఆ. 49. గ్రం. ఆ. 51.





శ్రీ కొప్పురావూరి గురవయ్య
కా. ని. సభ్యులు. 49. గ్రం ఆ. 49.



## కార్యకర్తలు



శ్రీ బచ్చు సత్యనారాయణ
కా. ని. సభ్యులు 1953-63
గ్రం. అ, 53-57; దే. అ. 62-63





శ్రీ కొప్పరావూరి సత్యనారాయణ
కా. ని. సభ్యులు. 1952-53; 56, 58-63
గ్రం. అ 52-53; 59-63.



# కార్యకర్తలు



కీ॥ శే॥ తవ్వా బాపనయ్య (పెద్దశెట్టి)
కన్యకా పరమేశ్వరీ చలివేంద్ర సంఘ అధ్యక్షులు
పోషక కర్తలు





శ్రీ తవ్వా వెంకటసూర్యనారాయణ
(పెద్దశెట్టి)
కా. ని. సభ్యులు. 49-52. గో. ఆ. 49
గ్రం. ఆ. 50 దే. ఆ. 52.



# కార్యకర్తలు



కీ॥ శే॥ మద్ది బ్రహ్మయ్య
కా. ని. సభ్యులు 1942-48, 50.
చ. ఆ. 46. గో. ఆ. 47-48.





కీ॥ శే॥ కొత్తూరి బాపయ్య
కా. ని. స్వఘులు 1945-49, 52.



# కార్యకర్తలు



శ్రీ మున్నలూరి వెంకట కోటయ్య
కా. ని. సభ్యులు 1946; 48; 52-54; 59-63.



శ్రీ కొలిశెట్టి నాగభూషణం
పోషకులు
కా. ని. సభ్యులు 1944-45, 47-48
గ్రం. అ. 44-45

## కార్యకర్తలు



శ్రీ కొల్లా సత్యనారాయణ
కా. ని. సభ్యులు 1961-63 సం॥





శ్రీ కొత్తమాసు క్రిష్టారావు
కా. ని. సభ్యులు 1957-63 సం॥ దే. ఆ. 57



# కార్యకర్తలు



శ్రీ రాచుమల్లు రామకృష్ణారావు
రాజపోషకులు
కా. ని. సభ్యులు 1944-46, 49-52, 59-60, 62-63
చ. ఆ. 49



శ్రీ గ్రంధి పూర్ణచంద్రయ్య
రాజపోషకులు
కా. ని. సభ్యులు 1941-44, 46, 48, 51, 59-63.
చ. ఆ. 43. దే. ఆ. 44-46. గో. ఆ. 61-63.

# కార్యకర్తలు



కీ॥ శే॥ దేవిశెట్టి చినసుబ్బయ్య, గారు
వీరి ధర్మపత్ని అచ్చమ్మ గారు

రాజపోషకులు

కా. ని. సభ్యులు 1941-44,
నూతన వాణిజ్య భవనముల నిర్మాణమునకు
వీరి కుమారుడు శ్రీ వేంకటసుబ్బారావు
రు 1116-00 లు ధర్మమొసంగిరి.

కీ॥ శే॥ గ్రంధి వెంకటేశ్వర్లుగారు
వీరి ధర్మపత్ని శ్రీ వీరరత్తమ్మగారు

రాజపోషకులు

నూతన వాణిజ్యభవనముల నిర్మాణమునకు
రు. 2500-00 ధర్మ మొసంగిరి.



# కార్యకర్తలు



కీ॥ శే॥ కొత్తూరి చినలక్ష్మయ్యగారి కొ॥ బాపయ్య
కా. ని. సభ్యులు 1941-42.



కీ॥ శే॥ రాచుమల్లు బాపయ్య
కా. ని. సభ్యులు 1945-46, 51-52.
సహాయ కార్యదర్శి 53-57.
గో. ఆ. 46, 51, 57.

# కార్యకర్తలు



శ్రీ॥ శే॥ గుంటూరు రోశయ్యగారు
పోషకులు





శ్రీ॥ శే॥ కుంభారి వెంకన్నాచార్యులుగారు
1945 సం॥న యీ సంఘమునందు లీనమొనర్చబడిన
శ్రీ లక్ష్మీ నృసింహ గ్రంథాలయ
స్థాపకులు, పోషకులు



# కార్యకర్తలు



శ్రీ మద్ది రామమూర్తి
కా. ని. సభ్యులు 1954-55; 57-63.
చ. ఆ. 51-55, 58-61, 63. దే. ఆ. 57.





శ్రీ అరవపల్లి పేరయ్య
కా. ని. సభ్యులు. 45-49, 51-52, 55-63.
చ. ఆ. 47-48, 51, 57, 58. దే. ఆ. 58.



## కార్యకర్తలు



**శ్రీ గాదంశెట్టి సత్యనారాయణ**

స. కార్యదర్శి. 1958; ఉపాధ్యక్షులు. 59-60.62-63,
గో. అ. 58-60; చ. అ. 61-63





**శ్రీ బచ్చు రామలింగం**

కా. ని. సభ్యులు. 46-57; స. కార్యదర్శి. 59-63,
గ్రం. అ. 46; 52, దే. అ. 47-48; 53-57.
గో. అ. 61-63.



# కార్యకర్తలు



శ్రీ కొత్తూరి రాములు
పోషకులు
కా. ని. సభ్యులు. 54-58 గ్రం ఆ. 54-56.



శ్రీ రాచుమల్లు వెంకటేశ్వర్లు
కా. ని. సభ్యులు 1964-63.
గ్రం. ఆ. 61-63.

# కార్యకర్తలు



శ్రీ వసుమర్తి వేంకటకోటయ్య

రాజపోషకులు

కా. స. సభ్యులు 1911-12, 59-63.

పే. ౨. 59-63.



శ్రీ గ్రంధి రాఘవయ్యగారు

రాజపోషకులు

గ్రంథాలయ చలివేంద్రాల ఐక్యసంఘ పాలకవర్గ సభ్యులు

1910

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మసంఘము (రిజిష్టర్డ్)

చిలకలూరిపేట.

## సంఘచరిత్ర

పరిచయము లేని క్రొత్తవారి కెవరికైనను సంఘముపేరు విన్నంతనే యిది కేవలము "శ్రీ కన్యకా పరమేశ్వరీ అమ్మవారి పరమైన ధర్మాదాయముల పర్యవేక్షక సంఘ" మనిపించ వచ్చును. కాని పూర్తి వివరము లరసిన వెనుక తన పరిపూర్ణ కరుణా కటాక్ష వీక్షణముల ప్రసరింపజేయుచు తన యనుంగు బిడ్డలే యైన సమస్త ప్రజానీకపు పురోభివృద్ధి నాకాంక్షించి యందుల కావశ్యకములైన సమస్త సదుపాయ ముల నేర్పరచి యనుగ్రహింప "చతుర్బాహువులతో సాక్షాత్కరించిన ధర్మదేవతయే" "శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ అమ్మవారి ప్రతిమూర్తియే" యీ 'ధర్మసంఘము' యీ 'ధర్మసంస్థ' అని తెలియ వచ్చినపుడు కలిగే యానందము వర్ణనాతీతము కాగలదు.

"ఇంతింతై వటుడింతయై" యని మహాకవి పోతన్నగారు భాగవతములో వామనావతార ఘట్టమున పలికినట్లు ఈనాడు ముచ్చటైన తన నూతన ప్రవేశ మహోత్సవముతోబాటు రజితోత్సవము నతివైభవముగ జరిపించుకొనుచున్న యీ మహాసంస్థ ఆరంభమున వేరువేరు దశలలో, వేరువేరు చిన్న - చిన్న రూపములతో వెలసియున్నది. అట్లే కొంతకాలము వరకా వేరువేరు రూపములతోనే యల్లారు ముద్దుగా పెరిగి పెద్దయై తుద కన్ని రూపములలోని యన్ని కళల నొక్కచో కేంద్రీకరించుకొని దాని యొక్క దాని యొక్క బృహద్రూపమున చతుశ్శాఖలతో సాక్షాత్కరించినది. ఆ చతుశ్శాఖలే "చలివేంద్ర"; గ్రంథాలయము; గోసంరక్షణ; శ్రీ వా. క. ప. దేవాలయము, ఆ బృహద్రూపమే "ధర్మసంఘము"

### చలివేంద్రశాఖ - దాని పుట్టుక

ప్రాచీన కాలమునుండియు మన దేశము అతిథి యభ్యాగతుల దనియించుట యందగ్రశ్రేణి చెందియున్నది. ముఖ్యముగా మంచినీటి సౌకర్యము కలుగజేయు వాపీ, కూప తటాకాది ముల నిర్మాణ వైశిష్ట్య మెన్నెన్ని రూపముల గానో పౌరాణికులు వర్ణించియున్నారు. ఇ చలువ పందిళ్లు.

చలివేంద్రముల ప్రాముఖ్య మంతంతయని వేరుగ చెప్పనవసరము లేదు.

వర్తక వ్యాపారములకు కూడలియై దశదిశ నుండి నిరంతరము వచ్చిపోవుచుండు ప్రజానీ మసంఖ్యాకమై యుండు చిలకలూరిపేట మంచి నీటి యెద్దడిగల గ్రామమగుట "అన్నపూర్ణ యింట అన్నమే కరువాయె" అన్నట్లు చిల లూరిపేట వాస్తవ్యుల దురదృష్టమనక తప్పదు. పరిసర గ్రామముల నుండి కార్యార్థులై వచ్చి పోవుచుండు ప్రజానీకము త్రాగుట కిన్ని మంచి

ష్టి లభించక అల్లాడి పోవలసిన దుస్థితి నివారించు నుద్దేశముతో కొంతమంది వైశ్య శిఖామణులు చలివేంద్రను స్థాపించిరి. కొంతకాలమునకు కీ॥ శే॥ తవ్వా మామయ్యగారు [గ్రామ పెద్ద శెట్టి] గ్రంధి సుబ్బరాయుడు మొదలగువారు నడుపుచూ వచ్చిరి. తరువాత కీ॥ శే॥ తవ్వా బాపనయ్య, ఆకుల వెంకయ్య, పసుపర్తి గోపయ్య, గ్రంధి కోటిలింగంగార్లు వైశ్య బృందమువారి తోడ్పాటుతో నడుపుచుండిరి.

మరికొంత కాలమునను శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ ధర్మ చలివేంద్రి సంఘము అను పేరుతో 16-2-1932 సం॥న రిజిష్టరు చేయబడి నిర్విఘ్నముగ దన కార్యకలాపమును నిర్వహించు చున్నది.

× × ×

## గ్రంధాలయము - దానిపూర్వచరిత్ర.

శ్రీ కన్యకా పరమేశ్వరీ అమ్మవారు కేవలము దాహార్తులకు మంచినీటి సౌకర్యము కలిగించుటతో తృప్తిపడి యూరకుండలేదు. దాహార్తులకు మంచినీరు వలెనే జ్ఞానార్థులకు విజ్ఞానామృతము కూడ నందింప సంకల్పించినది. అదే విసంకల్ప మమోఘముగదా! ఆదివ్యమూర్తి సంకల్పము కార్యరూపము దాల్చుట కెంత కాలము కావలయును. సంకల్పసిద్ధి కనువగు వాతావరణ మంతకుముందే యేర్పరచుకొనజాలిన మహామహిమామయులుగదా ఆతల్లి అందుకు ప్రత్యక్ష నిదర్శనమీ గ్రంధాలయమే.

విజ్ఞాన విలసితజ్ఞాన భారతదేశమున విజ్ఞానోపాసకులకు, వదాన్యులకు కొదువ లేదు. వదాన్యు లెప్పుడును ఇతరుల శ్రేయస్సునే తమ శ్రేయస్సుగా భావించి ప్రజాహిత కార్యములకు ముందడుగు వేయుచుందురు.

కీ॥ శే॥ గ్రంధి వరదయ్య శ్రేష్ఠిగారు ఇట్టి కోవకు చెందిన వారనుటలో సందియము లేదు. వారి సేవాసక్తియద్వితీయము అట్లగుటచేతనే వరదయ్య శ్రేష్ఠిగారు మరికొందరు వైశ్య శిఖామణుల సహాయ సంపత్తుల సేకరించుకొని శ్రీలక్ష్మీనృసింహ సోమయాజి గ్రంథాలయము అను పేర నొక చిన్న గ్రంధాలయమును తమ యింటనే స్థాపించి చదువుల తల్లి నారాధించుటకు పూనుకున్నారు.

ప్రతివ్యక్తి ప్రతి సంస్థ, ప్రతిదేశము, ఉన్నతస్థితి నందుటకు కావలసినది పుష్కలమైనధనము, ధనాభావము సర్వసంకటములకు హేతువు. కావుననే "ధనమూల మిదంజగత్" అను నార్యోక్తి వెలసినది. అది ప్రస్తుతము వరదయ్య శ్రేష్ఠిగారిచే నడుపబడుచు వచ్చిన గ్రంధాలయము పట్ల సార్థకమైనది. ఆర్థిక స్తోమతు లేని కారణమున వరదయ్య శ్రేష్ఠిగారిచే నడుపబడుచున్న శ్రీ లక్ష్మీనృసింహ సోమయాజి గ్రంధాలయము కొలది కాలముననే మూతపడవలసి వచ్చినది. ఈ దుస్థితికి వరదయ్య శ్రేష్ఠిగారి హృదయము పరితపించినది, ఇక నీ సరస్వతీమాతల్లిని శ్రద్ధాసక్తులతో సేవించుకొనగల్గు వారికి అప్పగించుటమేలని వారికి తోచినది. చిలకలూరిపేటకు సమీపమందలి అనంతవరం గ్రామ గ్రంధాలయమందు తమ గ్రంధాలయమును లీనమొనరించుట శ్రేయమని వారు భావించిరి. ఈవార్త శ్రీ రాచుమల్లు కన్నయ్య సోదరులకు కర్ణకఠోరమైనది. చదువుల తల్లిని పరాయి పంచలకు పంపి వేయుటాయని వారి హృదయము లాందోళనపడినవి. వెంటనే కార్య

క్షేత్రమునకు కదలి రమ్మని ఆ కన్యకాపరమేశ్వరి వారిని ప్రేరేపించినది. ఇది యంతయు నాతల్లి చిద్విలాసమే. కావున శ్రీ రాచమల్లు కన్నయ్య సోదరులు వరదయ్య శ్రేష్ఠిగారితో కలసి సంగతి సందర్భములను చర్చించి చిలకలూరి పేటయందే యీ గ్రంథాలయమును నిలిపి యుంచవలెననియు దాని యభివృద్ధికి తాము తమ శక్తినంచన లేకుండ పాటుపడగలమనియు వాగ్దానము గావించిరి. వరదయ్య శ్రేష్ఠిగారు యిందుల కపరిమితానందము నంది వెంటనే సరస్వతీమతల్లి సేవాభాగ్యము శ్రీరాచమల్లు కన్నయ్య సోదరులకు కల్పించి కృతకృత్యులైనారు.

శ్రీ రాచమల్లు వారి వదాన్యత నిందు ప్రత్యేకము పేర్కొనబనిలేదు. అది జగమెరిగిన విషయమే. శ్రీ కన్నయ్య సోదరులు వరదయ్య శ్రేష్ఠిగారినుండి పరిగ్రహించిన "శ్రీ లక్ష్మీ నృసింహ సోమయాజి గ్రంథాలయము" నకు ద్విజత్వమును గలిగించి వారా గ్రంథాలయమునకు" శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ వైశ్య గ్రంథాలయము" అను నామకరణముచేసి శ్రీ రామాలయ దేవాలయమునకు చెందిన ఒక చిన్న గదియందు దానిని స్థాపించిరి.

శ్రీ రాచమల్లువారి యీ పూనికకు హర్షించి వర్తక బృందము గ్రంథాలయాభివృద్ధికె చేయూత నిచ్చుటకు ముందంజవేసి కొట్టు కొట్టున ధర్మపు డబ్బాలుంచి ధర్మము వసూలు చేయుటకు ఏర్పాటు గావించిరి. లాటరీలవంటి యితర సాధనములను గూడ నుపయోగించి అచిర కాలముననే దాదాపు 5, 6 వందల రూపాయల వరకు సేకరించి ప్రస్తుతము కంది మళ్ల వారి కంపెనీ కెదురుగాయున్న మారెళ్ల వీరయ్యగారి తాలూకు య. 4-15 సెంట్ల భూమిని విక్రయించుకొనిరి. యింతవరకు స్వయం కృషితో సంస్థ నిర్వాహణమునకు పాటు బడుచు వచ్చిన శ్రీ రాచమల్లువారు మరియొక అడుగు ముందుకు వేసి యీసంస్థను నిర్వహించు బాధ్యత ప్రత్యేకముగ మనయందే యుండుట సంస్థ పురోభివృద్ధికి ఆటంకము కలుగుననియు పదుగురితో కూడిన సంఘముచే నిర్వహింపబడుట మేలనియు భావించి వెంటనే డబ్బాల రూపముగను, చందాల రూపముగను ధర్మమును యిచ్చు వారిని సభ్యులుగా భావించి ది 27-11-1932న విస్తృత సమావేశము గావించిరి ఆ సమావేశములోని వైశ్య ప్రముఖులు "శ్రీ కన్యకా పరమేశ్వరీ అమ్మవారి వైశ్య గ్రంథాలయ సంఘము"గా ఏర్పడి గ్రంథాలయ నిర్వాహణమునకు శ్రీ రాచమల్లు కన్నయ్య గారు అధ్యక్షులుగను వారి సోదరులు ప్రస్తుత గ్రంథాలయ భవన దాతలు శ్రీ రంగనాయకులు గారు కార్యదర్శిగను ఏర్పరచి మరికొంతమంది సభ్యులతో ఒక కార్యనిర్వాహకవర్గము నెన్నుకొనిరి.

(కార్యనిర్వాహక వర్గము అనుబంధమున చూపబడెను)

ఇది రాచమల్లువారి దూరదృష్టినేగాక ఆడంబరములేని వారి నిస్స్వార్థ సేవాపరాయణతను గూడ చాటుచున్నది.

కొలది కాలములోనే చదువులతల్లి చల్లని చూపులు దశదిశల పర్వులెత్తినవి. వైశ్య బృందము వారి ఆధ్వర్యమున అల్లారుముద్దుగా పెరిగి పెద్దయగుచు వచ్చిన ఆ తల్లి పౌరజన బాహుళ్యము నాకర్షించినది. అందుచే గ్రంథాలయమును అచటనుండి విశాలమగు శ్రీ రాచమల్లు రంగనాయకులుగారి మేడమీదికి మార్చబడినది.

తనకంటె ముందుగా ఏర్పడియున్న చిట్టి సంస్థ "చలివేంద్ర సంఘము"ను తనతో కూడ

గట్టుకొని ప్రజాదరణ పొందుచు ఆ గ్రంథాలయ సంఘము దినదినాభివృద్ధి నందుచు వచ్చినది. రెండు సంస్థలును తోబుట్టువులే యగుట పరస్పరానురాగమున విలసిల్లుచుండినవి. యే పొరపొచ్చెములు లేక కార్యకలాపములు సాగించుచుండినవి ఇది చూచి ఆ కన్యకా పరమేశ్వరి అమోఘమైన తన సంకల్ప బలమునకు తానే మురిసిపోయినది. ఆ మురుపు దేదీప్యమానమై వెలుగొందినది. తత్ప్రభావమే "గోసంరక్షణ సంఘ ఆవిర్భావము.

× × ×

## గోసంరక్షణము - దానిపుట్టుక

మన దేశము కృషి. ప్రధానమైనది. తత్కృషి సాఫల్య సాధనము గోధనము, ప్రాచీనార్య సంస్కృతి వికాసమునకు మూలకందము గోసంరక్షణ. కారడవులలో కందమూల ఫలాదులే జీవనాధారముగ కాలము గడుపుచు వచ్చిన తపోధనులు సహితము గోసంరక్షణ తమ తపశ్చర్యలో నొక భాగముగ స్వీకరించియుండిరి. గోసంరక్షణావశ్యకత నుద్బోధించుచు వేద శాస్త్రపురాణేతి హాసము లెన్నెన్ని తీరులనో గోమహాత్మ్యమును వర్ణించి యున్నవి. ఇంతియేల శ్రీ కృష్ణభగవానుడే స్వయముగ గోపాలకుడై గోపాలకృష్ణ సార్థక నాముడై యుండ గోసంరక్షణ ప్రాధాన్యమును వేరుగ చెప్పనక్కరలేదు

చలివేంద్రమును గ్రంథాలయమును నెలకొల్పించి నిర్విఘ్నముగ నడిపించుచున్న ఆ తల్లికిది కొరతగనే కనిపించినది ఆ కొరతి వెంటనేతీర్చి సర్వాంగ శోభితమైన 'గోసంరక్షణ శాల" నిందు నెలకొల్పి నడిపింప సంకల్పించినది. ఆమె సంకల్పము తిరుగులేనిది కదా.

ఒకనాడు శ్రీ రాచమల్లు కన్నయ్యబ్రదర్సు వారి కొట్టుముందు గ్రంథాలయ సంఘ సమావేశము జరుగుచుండెను. గ్రంథి సుబ్బయ్య మద్ది బ్రహ్మయ్య అను వణిక్ప్రముఖు లిర్వురు వధ్యశిలకు కొనిపోబడుచున్న రెండు గోవులను తోలుకొని వచ్చి సభామధ్యమున నిల్పిరి. గ్రంథాలయము పోషణ మొక్కటేగాక వధ్యశిలకు కొనిపోబడుచున్న యిట్టి గోవులను రక్షించుట గూడ యీ సంఘము వారొక ముఖ్యకర్తవ్యముగా భావించగూడదా? నేమీ గోమాతల గొంతుక కోత తప్పించి తెచ్చి మీ ముందుంచుచున్నాము మీరు వీనిని రక్షించెదరో లేక చేతకాదని మరల కసాయివాలు చేయుదురో యిక మీ యిష్టము అని ఆవేశ పూరితమును ఆవేదనా యుతమును అగు పలుకులు పలికిరి. సంఘసభ్యుల హృదయములు ద్రవించినవి.

సంస్థలు స్థాపింపబడుట వేరు. అవి నిర్విఘ్నముగను చిరస్థాయిగను నిర్వహింపబడ గలుగుట వేరు. మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయిన సంస్థలెన్నియో గలవు కనుకనే యొక సంస్థను నెలకొలుపుటకు ముందు దాని నిర్వహణ విషయమందేర్పడగల బరువు బాధ్యతలను కూలంకషముగ చర్చించుకొనుట ప్రధమ కర్తవ్యమని అనుభవజ్ఞులు వక్కాణించుచుందురు. అందు ముఖ్యముగ గోసంరక్షణ వంటి మహాకార్యమునకు పూనుకొనవలెనన్న సాధ్యాసాధ్యములను గురించి సమగ్రముగ నాలోచించుటెంతయు అవసరముగదా. ఆనాటి సమావేశమందు ప్రధాన చర్చనీయాంశమై నిల్చినదీ సమస్యయే. యీరూపముగ గోసంరక్షణసంఘ ప్రాదుర్భావమునకు ప్రాతిపదిక గావించిన శ్రీ కన్యకా పరమేశ్వరి తన యభీష్ట సిద్ధికి

తగిన మార్గము మాత్రము చూపక మిన్నకుండ గలదా.

పత్తి వ్యాపారములకు విశేష ప్రాముఖ్యత వహించి పరిసర గ్రామాదు లెన్నింటికో కేంద్రమై నిలచిన చిలకలూరిపేటలో జరుగు సమస్త వ్యాపారములకు 'దిగుమతి రుసుములు' చెల్లించు విధానము నేర్పరచి ఆ విధముగ నేర్పడగల ఆర్థికబలముతో యింతకుముందేర్పడియున్న చలివేంద్ర, గ్రంధాలయములతో బాటు గోసంరక్షణమును గూడ నిర్విఘ్నముగ నిర్వహించవచ్చునను నిర్ణయము ఏకగ్రీవముగ గావింపబడుటేమి గ్రామములోని పత్తి వ్యాపారములతో సంబంధముగల చిన్న పెద్ద వణిక్ప్రముఖులందరితోగూడిన మహాజనసభాసమావేశము జరిగి దిగుమతి రుసుముల విధానము ఏకగ్రీవముగా రూపొందించబడుటేమి శీఘ్రగతిని జరిగిపోయినది.

ఇది "శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ గోసంరక్షణ సంఘము" ఏర్పడిన విధము. ఇందుకు ప్రధాన కారకులైన గ్రంధి సుబ్బయ్య, మద్ది బ్రహ్మయ్యగార్లు ఎంతయు పూజనీయులు.

1934 సం॥న రూపొందిన "గోసంరక్షణ సంఘము" 7-9-1935 న రిజిష్టరు కావింపబడినది సంఘ నిర్వహణమున కేర్పరచిన దిగుమతి రుసుములలో సగభాగము గ్రంధాలయ, చలివేంద్రములకును వినియోగింపబడినట్లు నిర్ణయమయ్యెను యిట్లు వేరువేరు రూపములతో నలకొనియున్న మూడు సంఘములను సమిష్టి ప్రయోజనమును సాధించునవియై సమిష్టి ఆదాయముతో ఏకగర్భ జనితులన్న నుడి సార్థక పరచుకొనుచు దినదినాభివృద్ధి నందుచు వచ్చినవి.

# ధర్మసంఘ ప్రాదుర్భావము

శ్రీ పరమేశ్వరి లీలలత్యద్భుతములు. అమోఘములైన యా దేవి సంకల్ప వికల్పముల పరమార్థ మెరుగ నెవరితరము. సృష్టిస్థితిలయములాతల్లి చిద్విలాసములు. చేయునదియు, చేయించునదియు, చేయవలసినదియు సమస్తము తానైయై కర్తృత్వ మితరుల పరమొనర్చి యానందించు కృపాతరంగితాంతరంగ యా చల్లని తల్లి. కార్యకారణ సంబంధ సమన్వయ సమోపేతములైన యామె చేతలాశ్చర్య కరములేగాని యర్థ రహితములు కావు. ఏ చిన్ని యణువుతో యొక్క పెద్ద మేరు మహోధరముగన ఏ మహా మేరువునో యొక్క పరమాణువుగన రెప్పపాటులో మార్చివేయగల యా మహ శక్తిచే ప్రచ్ఛన్నముగ ప్రేరేపించబడి సంఘ స్వరూప మీనాడున్న రూపములో తీర్చి ది[ద్దబడి]నైనది.

ప్రప్రథమమున దాహార్తుల దాహోపశాం[తి] గావించు సంకల్పము చలివేంద్ర సంఘమైనిల పెద్ద వ్యాపార కేంద్రమై వాసిగన్న యి యూర నెందరెందరో వణిక్ప్రముఖులుండియ

పరమార్థ చింతనమున వరదయ్య శ్రేష్ఠిగారు నెలకొల్పియున్న ఒక చిన్న గ్రంథాలయము ఆర్థిక బలము సున్నయై వరాయిపంచలకు తరలించబడుటయా యన్న యావేదనము, అభిమానము గ్రంథాలయమై నిలచినది. కసాయి కోతల కెరగా బోవుచున్న బక్కచిక్కిన రెండు గోకంకాళముల వ్యధా పూర్ణములై చెమర్చుచున్న కడకంటి చూపులు చూపరుల కడుపులు చెరువుల జేసివైచిన ఒకానొక సన్నివేశమునుండి యావిర్భవించినది గోసంరక్షణ సంఘము. ఇట్లు వేరువేరు సందర్భములలో వేరువేరు రూపములలో నెలకొన్న చలివేంద్రి, గ్రంథాలయ, గోసంరక్షణ సంఘముల సమగ్ర సమన్వయ స్వరూపమే శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘమను నామము దాల్చియున్నది

కేవలము సంఘ నిర్వాహణ సౌలభ్య సాధనమే యీ మార్పులోని పరమార్థమైనను అందుకు దారితీసిన పూర్వాపర సందర్భముల నిందు పొందుపరచుటయు అవసరము కాకపోదు

ప్రభుత్వమువారి పరమైయున్న కొద్దిపాటి స్థలము చలివేంద్రమునకు సేకరించు ప్రానిక సంఘము రిజిష్టరగుటకు దారి తీసినది. అట్టే గోశాల నిర్మాణము, దాని గుర్తింపు సమస్యలు గోసంరక్షణ సంఘము రిజిష్టరగుటతప్పనిసరి కావించినది. కాని యీ రెండు సంఘముల ప్రాదుర్భావమునకు మధ్య కాలమున వెలసిన గ్రంథాలయ సంఘము మాత్రమట్లే నిలచిపోయినది. ఆ సంఘమును రిజిష్టరు చేయించవలెనన్న ప్రసక్తియే చాలకాలము వరకు రాలేదు.

గోసంరక్షణ సంఘ స్థాపనముతో బాటే దిగుమతి రుసుముల యేర్పాటు వర్తక బృందము వారి యామోదముద్ర పొందియున్నది. ఆ రుసుములలో సగభాగము గోసంరక్షణసంఘమునకు, తక్కినసగములో సగముచలివేంద్ర సంఘమునకు సగము గ్రంథాలయ సంఘమునకువినియోగపడవలెననికూడ వర్తకబృందము కట్టడిచేసియున్నది. ఆ కట్టడి ననుసరించి వసూలైన రుసుము మొప్పటికప్పుడాయా సంఘములకు పంచిపెట్టబడుచుండెను. కాని ఆపంచిపెట్టబడుట పేరుకు మాత్రముగానే పరిణమించుచు వచ్చినది. ఏలనన చలివేంద్రనిర్వాహణము యించుమించుగా ఆ సంఘమునకు చెందినకొట్టు అద్దె రూపమైన ఆదాయములోనే సాగిపోవుచుండెడిది. తరుగు పెచ్చుల సర్దుబాటు లతి స్వల్పములు కనుక దిగుమతి రుసుముల తాలూకు ఆ సంఘము వంతు ధనము అట్లే నిల్వయుండి పోవుటయు ఆ నిల్వ సొమ్ము ఆసంఘము ద్వారా గ్రాంటు రూపమున మరల గోసంరక్షణ సంఘమునకే యివ్వబడుటయు జరుగుచుండెను గోసంరక్షణ సంఘమునకు క్రమానుగతముగ కొంతభూమి సేకరించబడినను దానిఆదాయము, దానికిసరిపోవుచుండెడిది కాదు అందుచేత గ్రంథాలయ సంఘపు వ్యయముకూడ పరిమితము చేయబడి ఆ ఆదాయములలో సాధ్యమైనంత హెచ్చు మొత్తమును మిగిల్చి దానిని గ్రాంటురూపమున గోసంరక్షణ సంఘమునకే సమర్పించుట విధిగా జరుగుచు వచ్చినది. ఈ కారణముగా గ్రంథాలయము చాలాకాలమువరకు ఎదుగు బొదుగులు లేక నిలచియుండవలసి వచ్చినది. ఈ స్థితి యువకలోకమున అసంతృప్తిని కలిగించక పోలేదు.

ఇది యిట్లుండ మిగిల్చబడిన మొత్తములను గోసంరక్షణమునకు మంజూరు చేయించుటకు ప్రతిసారి వేరు వేరుగా ఆయా సంఘసభ్యులను సమావేశ పరిపించుట శ్రమతో కూడినపనియై అసలన్ని సంఘములు లేకుండ రద్దుచేసి ఒకేఒక సంఘమునేర్పాటు చేసిన యేబెడదయు నుండదు కదాయను ఆలోచన గోసంరక్షణ నిర్వాహకులలో బలముగా నేర్పడినది.

ఇందుకు మొదటిచర్యగా చలివేంద్రి సంఘము రద్దుపరచబడి అది గ్రంథాలయ సంఘములో లీనమొనర్చబడినది. గ్రంథాలయ సంఘము రిజిష్టరుకాని కారణమైన యీలీనీకరణమును ప్రభుత్వమువారు ధృవపరుపరైరి. మరల దానిని గోసంరక్షణ సంఘములో లీనము చేయగా నదియు రిజిష్ట్రేషను నిబంధనముల ననుసరించి జరిగినదికాదని త్రోసివేయబడినది నామకార్థమున సంఘములు మూడుగా పేర్కొనబడుచున్నను, గోసంరక్షణ సంఘమునకు ఆరంభమునుండియు కార్యదర్శిగానుండి మూడు సంఘముల నిర్వాహణ భారము తానే వహించియున్న శ్రీ రాచుమల్లు కన్నయ్య శ్రేష్ఠి గారికిది యొక పెద్ద సమస్యయై నిల్చినది. వసూలైన రుసుములు పంచివేసి ముందా యీ సంఘముల పేర వేరు వేరు చిఠాలలో జమకట్టవలసియుండుట, మరల గ్రాంటుకూప మున ఖర్చువ్రాసి పుచ్చుకొనవలసి వచ్చుట, యిందుకు మాటిమాటికీయీ సంఘ సభ్యుల సమావేశములనేర్పరచి ఆమోద ముద్ర పొందవలసి వచ్చుచుండుట వారికి చీకాకు కలిగింప సాగినది.

చివరకు పూర్వాపరముల నాలోచించి ప్రభుత్వ నిబంధనలమేరకు అవసరమగు పద్ధతులవలంభించి గోసంరక్షణ సంఘములోనే చలివేంద్రి, గ్రంథాలయ సంఘముల లీనమొనర్చుటయు, తదనుగుణముగా సంఘ నామము, నుద్దేశ్యములను మార్చుకొని విస్తృతమైన నియమావళిని రూపొందించుకొని ప్రభుత్వమువారి ఆమోదము బడయుటయు జరిగినది

బహుప్రయాసకోర్చి నిర్విరామ కృషి యొనర్చి దాదాపు ఆరునెలల పైకాలమిందు కొరకు వినియోగించి సంఘమునకు ప్రస్తుతమున్న రూపమును, నియమ నిబంధనలను, మరి కొన్ని సాంప్రదాయకమైన కట్టుబాట్లను ఏర్పరచిన ఘనత ఆ కాలమున గ్రంథ భాండాగారిగారుగా నుండినసుప్రసిద్ధ హిందీపండితులు శ్రీ వంకాయలపాటి శేషావతారముగారికి చెందవలసియున్నది. గ్రంథాలయ వార్షికోత్సవము, సరస్వతీ కట్నముల చదివింపులు, సంవత్సరారంభమున విధిగా బడ్జెట్టు ఆమోదము, సంవత్సరాంతమున ఆదాయ వ్యయముల వివరణముతో కూడిన కార్యదర్శి నివేదికా ప్రకటనము ఇవి వారు ఏర్పరచిన కట్టుబాట్లలో ముఖ్యముగా పేర్కొన తగినవి.

ఇంతవరకు ప్రఛన్నముగ నుండిన కన్యకామ తల్లి సంఘాభివృద్ధిని పరికించి ఉప్పొంగి పోయినది. ఇప్పటివరకు తాను వేరు, యీ సంఘము వేరుగా చూపరులకు గోచరించుచు వచ్చిన యీ దేవి తానే సంఘము, సంఘమే తానుగా నిలువ సంకల్పించినది. తత్ఫలితమే దేవాలయ శాఖగా సాక్షాత్కరించినది.



# శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవళము

పూర్వము మైలవరపు వంశీయులచే నొక చిన్న దేవళమున ప్రతిష్ఠింపబడి చిలకలూరిపేట వైశ్య ప్రముఖుల సహకార సానుభూతులతో నిర్వహింపబడుచుండెను.

సర్వ చరాచరములను సమదృష్టితో చూచుచూ మానవు లెల్లరచే పూజలనందుకొను ఆతల్లి ఒకే ఒక కుటుంబ పరమై యుండుట కిచ్చగింపలేదు. తన యభిమాన సంస్థయగు ధర్మ సంఘమునందు ప్రవేశింప యువ్విళ్లూరెను ఆ జగన్మాత సంకల్ప మమోఘముగదా!

కీ॥ శే॥ మైలవరపు గుండయ్యగారు తన ఆధ్వర్యమున నిర్వహింపబడు శ్రీ. వా. క. ప. దేవళమును సంఘమున చేర్చుకొనుడనియు, తామూ సంఘమునకు నాలుగు యకరముల భూమి నిచ్చెదమనియు కోరిరి. సంఘ సభ్యులు యెంతయో వుల్లాసపడిరి. ఆ తల్లితమ యింటికే అరుదెంచినట్లు భావించిరి. వెంటనే యేకోన్ముఖముగా అంగీకరించిరి. ఇట్లు 1943 సం॥లో ఆ తల్లి ధర్మ సంఘమునందు ప్రవేశించెను.

జగన్మాత సంకల్పముతో ధర్మసంఘము చతుశ్శాఖలుగా రూపొంది నిత్య నైవేద్య దీపారాధనలతోను, వివిధ ఉత్సవములతోను దేదీప్యమానముగా, నిత్య నూతనముగా దినదినాభివృద్ధి నొందుచు వెలుగొందుచుండెను.



# భూ ము లు

గోసంరక్షణ సంఘము స్థాపించటం చాలా సులభమే అయింది. గాని, దాన్ని నిర్వహించటం చాల జటిల సమస్యగా రూపొందినది. చుసుములు, అమావాశ్య పాటలు మొదలగునవి స్థిరమైన ఆదాయములుగావు. అవియు కొంత మంది సభ్యుల జాప్యతవల్ల వసూలగుట దుర్లభమగు చుండెను. ఈ సాధక బాధలననుభవించిన ఆనాటి సంఘ కార్యకర్తలు సంఘమునకు స్థిరమైన ఆదాయము వచ్చునట్టి భూసేకరణ విధానము రూపొందింప నిశ్చయించిరి. గోమాత కొకయకరము చొప్పున సేకరించిన గాని దీని నిర్వహింప జాలమని తలంచిరి, శ్రీ కన్యకాపరమేశ్వరి ఆశీర్వదించెను. ఆనాటి అధ్యక్షులగు శ్రీ మున్నలూరి రంగయ్యగారు, కార్యదర్శియగు శ్రీ రాచుమల్లు కన్నయ్యగారు ముందడుగు వేసిరి. చేరి ఒక యకరము దాన మొన

ర్చిరి. వారి దాతృత్వమునకు, దీక్షాపరత్వమునకు సంఘసభ్యులు సంఘాభిమానులు యెంతయో సంతసించిరి. సంఘకార్యకర్తలు భూదానోద్యమమునకు నడుములు బిగించిరి. పరిసర గ్రామాదుల యందును పర్యటించిరి. దాదాపు 20 యకరముల భూమిని దాతలవల్ల పరిగ్రహించిరి గోమాతల చల్లని చూపులతో శ్రీ కన్యకాపరమేశ్వరి ఆశీస్సుల ప్రభావమున. గోశాల నడుపుటకు కొంత సుగమ మేర్పడెను.



# భవనములు

చతుశ్శాఖలతో ఈనాడు "రజత జయంతి మహోత్సవము" జరుపుకొనుచున్న 'ధర్మసంఘము'నకు నాంది "చలివేంద్ర". అట్టి చలివేంద్రకు ప్రప్రథమమున వైశ్య బృందమువారిచే నిర్మాణ మొనరింపబడిన భవనమే సంఘ భవనములలో మొట్టమొదటిది. అయ్యది ఈనాడు సంఘమున కెంతయో ఆర్థిక సహాయ మిచ్చుచున్నది. (అద్దె రూపమున) 1934 సం॥ మున శ్రీ ప్రభుత్వము వారిచే స్థలమును పొంది దాతల సహాకారమున సువిశాలమైన భవనము యేర్పరచి అందు చలివేంద్ర చేర్చబడెను. ఇది ద్వితీయ భవనము. ఆనాటి మొదటి భవనము అద్దెల కివ్వబడుచుండెను.

గోమాతల గృహములు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల ప్రాణిజీవికి వాసయోగ్యమైన గృహ మత్యంతావశ్యకము. ఆహారము సంపాదించుకొనుటకంటె ముందు నివసించుటకు గృహము కావలయును గదా.

గోమాతల చేర్చడం గోసంఘము స్థాపించటం జరిగింది గాని ఈ గోమాతల కాశ్రయ మెచ్చట? కీ॥ శే॥ తవ్వా బావనయ్యగారు వారి దొడ్లో ఆశ్రయ మొసంగిరి, కాని వర్షాకాలంలో చాల బాధ జనించినది. కార్యకర్తల హృదయము ద్రవించినది. జగన్మాత భక్తుల పరితాపము చూచి మిన్నకుండగలదా! పోతుగుంట వారి భావి ప్రక్కన రేకుల షెడ్డు వేయ సంకల్పముదయించెను దాతలు ముందుకు వచ్చిరి. షెడ్డు నమర్చి గోమాతల నందు ప్రవేశ పెట్టబడెను. క్రమానుగతముగా అచట గల 13 సెంట్లు ప్రదేశమునకు ప్రభుత్వమువారి అనుమతి లభించెను. విశాలమగు రేకులషెడ్డు దాతల సహాకారమున నేర్పడి 1959 వరకు గోమాత లచటనే నివసింపసాగెను.

ఇయ్యది గోమాతల ప్రథమ భవనము.



## నూతన గోశాల భవనము

వేసవియందు కేకుల పెడ్డునందు గోమాతల నుంచుట కార్యకర్తలకు కొంతబాధగా ఉండెను. గోమాతలకు ప్రత్యేకముగా సుందర సుఖశాల భవనము నిర్మింప సంకల్పించిరి. 1955 సం॥ లో 15 సెం. 300 లింకుల స్థలము సేకరింపబడెను.

1959 సం॥ దాతల సహకారమునను సంఘ ద్రవ్యముతోను గోమాతల కెంతో ఆనంద మొసగు విశాలమగు గోశాల నిర్మాణ మొనరింపబడి గోమాతలందు ప్రవేశ పెట్టబడెను

## సంఘ కార్యాలయము

అనాడినుండి 1959 సం॥ వరకు సంఘమునకు ప్రత్యేక కార్యాలయ భవనము లేకుండెను. కార్యదర్శిగారి గృహమే (రికార్డునకు) కార్యాలయము. వ్యాపారకూడలియగు శ్రీ రాచుమల్లు వీరరాఘవయ్యగారి కొట్టు ముంగిలిభాగమే సమావేశములకు ప్రదేశము గాను జరుగుచుండెను అట్టిలోటును శ్రీ చిలకలూరుపేట జనరల్ మర్చంట్సు అసోసియేషన్ వారు తీర్చిరి.

శ్రీ జనరల్ మర్చంట్సు అసోసియేషన్ వారు దాతల సహకారముతో షుమారు ౫ వేల రూప్యములతో భవన నిర్మాణ మొనరించిరి. ది 11-1-1958 న శ్రీ డి. సంజీవయ్యగారిచే ప్రారంభోత్సవము అతివైభవోపేతము చేయించి యిచ్చిరి అందుచిత్రపటములు; 2.బీరువాలుగా 1. మొదలగు పరికరములు గూడా అమర్చి ఇచ్చిరి. సంఘసేకరణలో ఇయ్యది 6 వది

## దేవాలయ నిర్మాణము

1944 సం॥ లో సంఘమునందు తానొక భాగస్వామిగా చేరిన ఆతల్లి సంఘ సభ్యుల, కార్యకర్తల, మనోభావములను సంఘశక్తిని పరికించుచు పూర్వీకులచే నిర్మాణ మొనరింపబడిన ఆ చిన్ని గృహమునందే కాలము గడుప సాగినది. ఎంతకాలమని ఓర్పు వహించగలదు. తన యనుంగు బిడ్డల మేల్కొల్పినది. సంఘ సభ్యులకు కలవరము హెచ్చెను. విశాలమగు ప్రత్యేక స్థలమును సేకరించి అందు దేవాలయ నిర్మాణ మొనరింప నిశ్చయించిరి. గాని తగు స్థలములభించలేదు.

ఎట్టకేలకు దేవస్థానమునందే నిర్మాణ మొనరింప కృతనిశ్చయులైరి 196 న. సుందర దేవళమును నిర్మించి పునః ప్రతిష్ఠావనాది కార్యక్రమము అతి వైభవముగా జరుపబడెను.

## వాణిజ్యమునకు వగు భవనములు

[కొట్లు]

జగన్మాత చైదములు వర్ణనాతీతములు, తన యభీష్టసిద్ధికి తగినట్లుగా మానవుల హృదయములను సైతము మార్చగల శక్తి సంపన్నురాలా మహాతల్లి.

గోశాఖ ప్రారంభము కాగానే ఆనాటి సంఘ కార్యకర్తలు గోవుకొక యకరము చొప్పున సంపాదింప భూదానోద్యమమునకు గడంగి కొంతవరకు కృతకృత్యులైరి.

ఈ నాటి సంఘ అధ్యక్షులు శ్రీ గ్రంధి వెంకట రత్నముగారు కార్యదర్శి శ్రీ కొప్పురావూరి కోటేశ్వరరావుగారు సంఘకార్యకర్తలను, సంఘసభ్యులను ప్రేరేపించిసంఘమునకు నికరాదాయము వచ్చునట్టి మార్గమగు "కొట్లనిర్మాణమునకు మానుకొని" గృహదానోద్యమమునకు గడంగికొంతవగకుకృతకృత్యులైరి.

వర్తక వ్యాపారములకు కూడలియైన పాత గోశాలదక్షిణభాగమున దాతలసహకారమునను సంఘద్రవ్యముతోనుకొట్లు నిర్మాణ మొనరించిరి.

# అలంకారము

భవనములు నిర్మాణ మొనర్చుట కంటె ఆయా భవనములు సుశోభితముగా నుండుటకు తగు పరికరములు సమకూర్చుట కష్టతమము. కాని దాతల సహకారమున చతుశ్శాఖలలో ఆయా శాఖలకు కావలసిన పరికరములు సమకూర్చబడెను.

## జయంతులు

విజ్ఞాన వ్యాప్తిగావించుటకు గ్రంధసేకరణ, గ్రంధ పఠనా సౌకర్యము కలిగించుటయేగాక ఆయా మహనీయుల జయంతులను వర్ధంతులను జరుపుట ఎంతయో అవసరము. ఇట్టి జయంతులను 1939 సంవత్సరమునుండి ప్రారంభింపబడి ఆయా సందర్భముల యందు వివిధ విజ్ఞాన విషయముల గూర్చి వుపన్యాస సభను ఏర్పాటు గావింపబడియుండెను. ముఖ్యముగా వార్షికోత్సవ సందర్భమున ఇట్టి సభలు ఏర్పాటుగావింపబడుచుండెను.

భక్తి ప్రభోధమునకు అనువుగా శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ జన్మోత్సవము నవరాత్రోత్సవము శ్రీరామనవమి సందర్భమున హరికథలు వుపన్యాసములు మొదలగునవి కూడా జరుపబడుచుండెను.

గోమాతల ప్రాధాన్యతను ప్రజలలో ప్రచారమొనర్చుటకు గోసంవర్ధన, ఆది వుత్సవములు గూడ గావింపబడెను. ఇట్టి ఉత్సవ సమయములందు పెద్దలనేకులను ఆహ్వానించి ప్రజలలో ఆయా శాఖల విశిష్టత గురించి ప్రచారమొనరింపబడెను. 25-2-59న గోశాల ప్రారంభోత్సవము శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారిచే జరుపబడెను.

## ఇతర సంస్థలు

ఆర్థిక స్తోమతు ఎక్కువగా లేకున్నను "ఉడుతాభక్తి" అన్నట్లు ఇతర సంస్థలకుగూడా విరాళరూపముగా యివ్వబడెను. ముఖ్యముగా యీ సంస్థయందు లీనమైన లక్ష్మీనృసింహ గ్రంధాలయమునకు ప్రారంభమున మాధ్యమిక పాఠశాలకును కొంత సహాయ మొనర్చబడెను,

## ఆగంతుకులు

ఆయా ఉత్సవముల సందర్భములయందును, ఇతర సమయములయందును ఆహ్వానింపబడిన పెద్దలు ఈ గ్రంధాలయము తిలకించి వారి అభిప్రాయములను ఒసంగి యుండిరి. అట్టి పెద్దల నామములు అనుబంధమున చూపబడెను.

## కృతజ్ఞత

ఎవ్వారి శుభ సంకల్పముచేతను, యెవరెవరి అనుపమాన కృషిచేతను యీ సంఘమింత అభివృద్ధికి వచ్చెనో సందర్భాను సారమునకొద్ది మంది నామములు మాత్రమే పైన సూచించి యుంటిమి. ఇంక నెందరో అకుంఠిత దీక్షతో సంఘాభివృద్ధికి చేయూత నొసంగినవారు గలరు. వారందరి నామములను ఇచ్చట ఉదహరించుట

కష్టసాధ్యము. అందుకు విజ్ఞులు మన్నింపెదరని ఆశించుచున్నాము.

## శుభచిహ్నములు

యీ సంఘముయొక్క ఆదర్శము గైకొని వివిధ వాణిజ్య వర్గీయులు వేరువేరు సంఘములుగా ఏర్పడి ఐకమత్యమును పెంపొందించుకొని యెంతయో అభివృద్ధికివచ్చుచూ ఆయా సంఘములద్వారా దీనికి దోహదకారులగుచున్నారు అందుకు నిదర్శనముగా "ది టెక్స్ టైల్ డీలర్సు అసోషియేషన్‌వారు ఈ సంఘమునకు పాత గోశాల స్థలమునందు డాబా నిర్మాణమొనరించినచో దానిపై సువిశాల సుందర భవనమును నిర్మాణము గావింప సుస్థిరమనస్కులై యుండిరి.

## ఆనందం

ఎన్నో ఏండ్లుగా కలలుగన్నాం. గ్రంథాలయం దర్శించిన పెద్దలంతా "విశాల భవనం ఏర్పడాలి" అని దీవించారు. సభ్యులంతా స్థలాన్వేషణకై పరుగులెత్తిరి గాని సమయం రాలేదన్నది సరస్వతీమతల్లి. అదనుకై వేచియున్నాము. శ్రీపరమేశ్వరి అనుగ్రహించింది. కోర్కె ఫలించింది.

శ్రీ రాచుమల్లు రంగనాయకులుగారు ఉప్పొంగిపోయినారు. నిర్మాణం ప్రారంభించారు తలంచిన బడ్జటు దాటింది. అయినా వెనుకంజ వేయలేదు. సర్వాంగ సుందరంగా ప్రజల ముందు సాక్షాత్కరించినది భవనం. కనకమ్మగారి పేరే మరిచారు ప్రజలు, కాని భవన నిర్మాణంతో తిరిగి జన్మమెత్తినదా అనిపించినది. ప్రజాసమూహం ఆమె భవనాన్ని నలంకరించ సిద్ధమైనారు. తమతమ శక్తికొలది పరికరములర్పించసాగిరి. కనకమ్మగారి తండ్రి గ్రంధి రాఘవయ్యగారు, ఆమె సోదరులు ఆనంద పరవశులయిరి. జ్యోతి (కరెంటు) మేమే వెలిగించాలి అని ముందుకు వచ్చారు.

సంఘ సేకరణలో ఇయ్యది మహత్తరమైన భవనం.

## ఆశయము - భవననిర్మాణము

యీ సంఘమునకు నికరాదాయము వచ్చునట్లుగా కొన్ని కొట్లను నిర్మాణమొనరింప నిశ్చయింప బడెను. ఇప్పటికి పూర్తియైన భవనములు గాక ఇంకను పూర్తికానున్న భవనములకు దాతలు దోహదమొసగ ముందుకు వచ్చుచుండిరి త్వరలో జగన్మాతయొక్క కృపవల్లను దాతల దాతృత్వమునను ఇట్టి ఆశయముసిద్ధించగలదని నివేదించుటకు సంతసించుచున్నాము.

## ముగింపు

యీ రజతోత్సవ సందర్భమున సంఘచరిత్రను నివేదించు భాగ్యము కలిగినందులకు మేము సంతసించుచున్నాము. ఇందలి లోపాలోపములను విజ్ఞులు మన్నింతురని ఆశించుచున్నాము.

ఇట్లు

వంకాయలపాటి లక్ష్మీనారాయణ.



## శ్రీ వంకాయలపాటి శేషావతారంగారు

హిందీ పండితులు, ఉన్నవ. గుంటూరు తాలూకా.

1938-1910 గ్రంథ భాండాగారిగానుండి సంఘ నిర్వహణ సౌలభ్యమునకు, ప్రతి సంవత్సరము బడ్జెట్ ఆమోదము, ఆదాయ వ్యయ వివరములతోగూడిన కార్యదర్శి నివేదిక, మొదలగునియమ నిబంధనలను, గ్రంథాలయ వార్షికోత్సవము, సరస్వతీ కట్నములు చదివింపులు, మొదలగు సాంప్రదాయక ఆచారములను ఏర్పరచి సంఘాభివృద్ధికి నిర్విరామ కృషి సలిపినవారు.

## శ్రీ వంకాయలపాటి లక్ష్మీనారాయణగారు

ఉన్నవ, గుంటూరు తాలూకా.

తలిదండ్రులు: శ్రీ రామకోటయ్య, మహాలక్ష్మమ్మ గార్లు

1941-45 శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ గ్రంథాలయమునందు భాండాగారిగా నుండిరి. గ్రంథాలయమును విడచి స్వగ్రామము వెళ్ళినను ధర్మసంఘ కార్యక్రమములన్నిటియందును శ్రద్ధగలిగి తత్కార్య నిర్వహణమునకు యిప్పటికిని యెంతయో తోడ్పడుచున్నవారు.



శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘము, చిలకలూరిపేట.



సంఘోద్యోగులు 1963 సం॥

# శ్రీ కన్యకా పరమేశ్వరీ వైశ్య గ్రంథాలయము

## పాలకవర్గము

## (1932 సం॥ నుండి 1940 సం॥ వరకు)

1. శ్రీ రాచమల్లు కన్నయ్య, అధ్యక్షులు,
2. ,, రాచమల్లు రంగనాయకులు, కార్యదర్శి
3. ,, గ్రంధిరామకృష్ణమ్మ కు॥ రామయ్య సభ్యులు,
4. ,, దేవిశెట్టి చిన సుబ్బయ్య ,,
5. ,, మున్నలూరి రంగయ్య ,,
6. ,, రాచమల్లు బాపయ్య ,,
7. శ్రీ రాచమల్లు వీరరాఘవులు సభ్యులు
8. ,, పొట్టి వెంకటేశ్వర్లు ,,
9. ,, తవ్వా బాపనయ్య ,,
10. ,, మద్ది వెంకటస్వామి కు॥ సుబ్బయ్య ,,
11. ,, మున్నలూరి రాములు ,,
12. ,, కొత్తూరి చిన బాపయ్య ,,

# గోసంరక్షణ సంఘము

## పాలకవర్గము

## (1932-1940)

1. శ్రీ మున్నలూరి రంగయ్య, అధ్యక్షులు
2. ,, గ్రంధి వెంకటేశ్వర్లు
3. ,, కొప్పురావూరి వెంకట సుబ్బారాయుడు
4. ,, వసుమర్తి రామమూర్తి
5. శ్రీ మేళ్లచెరువు అచ్చయ్య
6. ,, రాచమల్లు వెంకటసుబ్బయ్య
7. ,, రాచమల్లు కన్నయ్య
8. ,, కూనల పున్నయ్య
9. ,, తవ్వా బాపనయ్య

# గ్రంథాలయ, చలివేంద్రాల ఐక్య సంఘము

## పాలకవర్గము

## 1940

1. శ్రీ రాచమల్లు కన్నయ్య అధ్యక్షులు
2. ,, మున్నలూరి రంగయ్య
3. ,, గ్రంధి రామయ్య
4. ,, మున్నలూరి రామయ్య
5. ,, కొత్తూరి చినబాపయ్య
6. ,, దేవిశెట్టి చినసుబ్బయ్య
7. ,, పొట్టి వెంకటేశ్వర్లు
8. ,, రాచమల్లు బాపయ్య
9. శ్రీ రాచమల్లు వెంకటసుబ్బయ్య
10. గ్రంధి వెంకటేశ్వర్లు
11. ,, గ్రంధి రాఘవులు
12. ,, వసుమర్తి వెంకటకోటయ్య
13. ,, మద్ది సుబ్బయ్య
14. రాచమల్లు వీరరాఘవయ్య
15. ,, గ్రంధి రామనాథం కు॥ వెంకటరత్నం

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మసంఘము (రిజిష్టర్డ్)

## చిలకలూరిపేట.

## కార్యనిర్వాహక సభ్యులు

### 1941 సం॥ నుండి

గమనిక :— చ. ఆ. = చలివేంద్రి ఆర్గనైజరు.
గో. ఆ. = గో శాఖ ఆర్గనైజరు.
గ్రం. ఆ. = గ్రంథాలయ ఆర్గనైజరు.
దే. ఆ. = దేవాలయశాఖ ఆర్గనైజరు.

1. శ్రీ మున్నలూరి రంగయ్య
అధ్యక్షులు 1941-58

2. „ రాచుమల్లు కన్నయ్య
కార్యదర్శి 41-58; గో. ఆ 42-58

3. „ గ్రంధి వెంకటరత్నం
స. కార్యదర్శి 44-49; ఉపాధ్యక్షులు 52-57
అధ్యక్షులు 59-63; చ. ఆ 51-57;
గో. ఆ. 59

4. „ కొప్పరావూరి కోటేశ్వరరావు
సభ్యులు 43-51; 57-58; కార్యదర్శి 59-63
గ్రం ఆ. 43-51, 57-58

5. „ గ్రంధి వెంకటేశ్వర్లు
స. కార్యదర్శి 41-43; ఉపాధ్యక్షులు 45;
చ ఆ 42

6. „ గ్రంధి వరదయ్య
ఉపాధ్యక్షులు 41; సభ్యులు 42-43;47-48;
53

7. „ మేళ్లచెఱువు అచ్చయ్య
సభ్యులు 41-43

8 „ మున్నలూరి రాములు
సభ్యులు 41, 42, 50; 51, గ్రం. ఆ. 42
దే. ఆ. 51

9. „ మున్నలూరి ముత్యాలు
సభ్యులు 41, 62, 63

10. కీ॥ శే॥ కూనల పున్నయ్య
సభ్యులు 41, 42, 43

11. కీ॥ శే॥ మైలవరపు గుండయ్య
సభ్యులు 41-45, 50, 51 ఉపాధ్యక్షులు
46-49

12. శ్రీ మద్ది సుబ్బయ్య
సభ్యులు 41-51, 58; చ. ఆ. 44-48
దే. ఆ. 49-51, 56

13. „ కొల్లా సుబ్బారావు
సభ్యులు 41-42

14. „ పసుమర్తి వెంకటకోటయ్య
సభ్యులు 41-43, 59-63 దే. ఆ. 59-63

15. „ గ్రంధి పూర్ణచంద్రయ్య
సభ్యులు 41-14, 46, 48, 51, 59-63
చ ఆ 43, గో.ఆ. 61-63, దే.ఆ.44-46

16. „ దేవిశెట్టి చినసుబ్బయ్య
సభ్యులు 41-44

17. „ కొత్తూరి చినబావయ్య
సభ్యులు 41-42

18. కీ॥ శే॥ మద్ది బ్రహ్మయ్య
సభ్యులు 42-48. 50 చ. ఆ. 46
గో. ఆ. 47-48

19. „ ఆలపాటి లక్ష్మయ్య
సభ్యులు 43-44, 46, 50-60
గో ఆ 50-59 దే. ఆ. 57

20. శ్రీ ఆకుల వెంకటసుబ్బయ్య
సభ్యులు 44; దే. ఆ 44

21. శ్రీ గ్రంధి సుబ్బారావు
సభ్యులు 44, 55

22. „ పొట్టి అంజయ్య
సభ్యులు 44

23. „ రాచుమల్లు రామకృష్ణారావు
సభ్యులు 44-46, 49-52,59-60
62-63, చ. ఆ. 49

24. „ కొలిశెట్టి నాగభూషణం
సభ్యులు 44-45, 47-48

25 కీ॥ శే॥ రాచుమల్లు బావయ్య
సభ్యులు 45-46, 51-52,
సహాయకార్యదర్శి 53-57గో.అ.46,51,57

26 శ్రీ అరవపల్లి పేరయ్య
సభ్యులు, 45-49, 51-52, 55-63
చ. ఆ 47-48, 51, 57, 58దే.అ. 58

27. „ కొత్తూరి బావయ్య
సభ్యులు 45-49, 52

28. కీ॥ శే॥ బూరగడ్డ సుబ్రహ్మణ్యం
సభ్యులు 45. దే. అ. 45.

29. శ్రీ కొలిశెట్టి కోటిస్వామి
సభ్యులు 45 దే. అ. 45.

30. „ రాచుమల్లు సుబ్బారావు
సభ్యులు 46-48 దే అ 46-48.

31. „ రాచుమల్లు రామమూర్తి
సభ్యులు 46 దే.అ. 46.

32. „ బచ్చు రామలింగం
సభ్యులు 46-57 స కార్యదర్శి 59-63.గో అ
61-63; గ్రం.అ 46,52 దే.అ 47-48 53-57

33. „ మున్నలూరి వెంకటకోటయ్య
సభ్యులు 46,48,52.-54, 59-63
గో. అ. 46-48 52-54, 59-60

34 శ్రీ గ్రంధి పుల్లయ్య
సభ్యులు 47-48; గ్రం.అ. 47-48

35. „ మద్ది కృష్ణస్వామి
సభ్యులు 48-50 చ అ 50

36. „ కొప్పురావూరి హనుమంతరావు
సభ్యులు 49-51 చ.అ. 49. గ్రం అ 51

37. „ తవ్వా వెంకటసూర్యనారాయణ
సభ్యులు 49-52 గో.అ.49 గ్రం. అ 50
దే. అ. 52

38. „ గ్రంధి రామకృష్ణయ్య
సభ్యులు 49-50. 53-54 దే అ 49-50

39. „ కొప్పురావూరి గురవయ్య
సభ్యులు 49. గ్రం. అ. 49

40. కీ॥ శే॥ ఆకుల విశ్వనాథం
సభ్యులు 50-57. 59-62. చ. అ. 50.52.
56-59 దే. అ 53-55. 61-62.

41. శ్రీ దేవిశెట్టి వెంకటేశ్వర్లు
సభ్యులు 50-51

42. „ పొత్తూరి నరసింహారావు
సభ్యులు 51-60 గ్రం.అ.51, 54-58, 59-60.

43. „ కొప్పురావూరి సత్యనారాయణ
సభ్యులు 52-53, 56, 58-63 గ్రం అ.
52-53, 59-63

44. „ మేళ్ళచెరువు రాములు
సభ్యులు 52, 60, ఉ. అధ్యక్షులు 61
సభ్యులు 62 63 చ. అ. 60

45. „ మేళ్ళచెరువు పెద్దన్న
సభ్యులు 52, 53, దే. అ. 52

46. „ పొత్తూరి వీరరాఘవయ్య సభ్యులు 53.

47. „ చండ్రపట్ల కాశీవిశ్వనాథం
సభ్యులు 53-63

48. శ్రీ దివ్వెల వెంకట కోటయ్య
సభ్యులు 53, 54 చ. అ. 53, 54.

49. „ బచ్చు సత్యనారాయణ
సభ్యులు 53-63, గ్రం. అ. 53-57,
దే. అ. 62-63

50. „ గ్రంధి శివయ్య సభ్యులు 54-57

51. „ కొత్తూరి రాములు
సభ్యులు 54-58 గ్రం అ 54-56

52. „ మద్ది రామమూర్తి
సభ్యులు 54-55, 57-63
చ. అ. 54-55, 58, 61, 63 దే అ. 57

53. „ చండ్రపట్ల లక్ష్మయ్య సభ్యులు 55-63

54. „ కొత్తమాసు కృష్ణారావు
సభ్యులు 57-63 దే. అ. 57

55. శ్రీ గాదంశెట్టి సత్యనారాయణ
స. కార్యదర్శి 58. ఉ అధ్యక్షులు 59-60
62-63 సభ్యులు 61, చ. అ. 61-63,
గో. అ. 58, 60

56. „ కొప్పురావూరి బ్రహ్మయ్య
సభ్యులు 58

57. „ అర్వపల్లి తాతయ్య
సభ్యులు 58-63, చ. అ. 59-60, దే. అ. 58

58. „ తవ్వా అంకమ్మ సభ్యులు 58

59. కీ॥ శే॥ గార్లపాటి వెంకటరత్నం
సభ్యులు 59-60 దే అ. 59-60

60. „ శిఖాకొల్లి రామకోటయ్య
సభ్యులు 59-61

61. శ్రీ కొల్లా సత్యనారాయణ సభ్యులు 61-63

62. „ రాచుమల్లు వెంకటేశ్వర్లు
సభ్యులు 61-63, గ్రం. అ. 61-63



పాలకులను జెఱచు – పదవిపై మోహంబు
పొలము పైరు జెరచు – కలుపు మొక్క
పల్లె ప్రజల జెఱచు – పార్టీల కక్షలు
కలియుగావతార – గాంధిదేవ.

—శ్రీ వల్లభనేని

"ప్రపంచమందు నీకు వేరే శత్రువుగాని, మిత్రుడుగాని లేడు. నీ నడవడికయే నీకు మిత్రులనుగాని" శత్రువులనుగాని లభింప చేయుటకు కారణము కాగలదు.

—చాణక్యుడు



# ధర్మదాతలు



రాజపోషకులు

శ్రీ పొత్తూరి సుబ్రహ్మణ్యం

వలపర్ల.

# ధర్మదాతలు



శ్రీ రాచుమల్లు సీతారామయ్య శ్రేష్ఠి
రాజపోషకులు
భూ, గృహ, దాతలు.





శ్రీ పసుమర్తి సుబ్బారావు
పోషకులు



# ధర్మదాతలు



రాజపోషకులు

## శ్రీ రావికింది అప్పయ్య, ఆంజనేయులుగార్లు

నూతన వాణిజ్య భవనముల (కొట్లు) నిర్మాణమునకు

రు. 1116-00 లు ధర్మమొసంగిరి.

## ధర్మదాతలు



రాజపోషకులు

1. (శ్రీ) కొత్తూరి వెంకట సుబ్బారావు, 2. రాములు, 3. లక్ష్మయ్య, 4. సాంబశివరావు,
5. వెంకటేశ్వర్లు వరఫ్ (శ్రీనివాసరావు) గార్లు

# ధర్మదాతలు



[illegible]

## కీ॥ శే॥ సంగిశెట్టి పాపయ్యలింగం

వీరి జ్ఞాపకార్థం తండ్రి వీరభద్రయ్యగారు
నూతన గోడాల నిర్మాణమునకు ధర్మమొసంగిరి

## కీ॥ శే॥ తూనిగుంట్ల అప్పారావు,
## కామేశ్వరమ్మ దంపతులు

వీరి జ్ఞాపకార్థము పుత్రులు
వెంకట మహాసేనరావు, (ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు)
వెంకట లోకనాధరావు, (వెటర్నరీ అసిస్టెంటు సర్జను
చిలకలూరిపేట) గార్లు ధర్మమొసంగిరి



# ధర్మదాతలు



కీ॥ శే॥ గ్రంధి చినలక్ష్మయ్యగారి కొమారు
వెంకటరత్నంగారు



కీ॥ శే॥ గ్రంధి వరదయ్య గారు
వీరి ధర్మపత్ని శ్రీ స్వరాజ్యలక్ష్మమ్మ గారు
శ్రీ లక్ష్మీ నృసింహ సోమయాజి గ్రంధాలయ స్థాపకులు
ఉ. అ. 41; కా. ని. సభ్యులు 42-43, 47-48, 53.



దానశేఖరులు

శ్రీ కూనిశెట్టి వెంకట ఓబయ్య

సంపెన్నాడి



శ్రీ వంకాయల శివకోటేశ్వరరావు

•రి మేనత్త శ్రీ॥ శే॥ సంతా శేషమ్మగారి జ్ఞాపకార్థం

నూతన వాణిజ్య భవనముల నిర్మాణమునకు

రు. 1116-00 ధర్మ మొసంగిరి

# చిలకలూరిపేట ఫ్యాన్సీగూడ్సు మర్చంట్సు అసోసియేషన్ సభ్యులు 1963-64 సం॥



క్రింది వరుస :– 1. దాసరి గురవయ్య, 2. గుంటూరు నాగేశ్వరరావు, 3. కబళా మంగయ్య, 4. మాజేటి వెంకటేశ్వర్లు(కార్యదర్శి), 5. కొప్పురావూరి గురవయ్య,(అధ్యక్షులు) 6. కొప్పురావూరి సత్యనారాయణ, 7. తాటికొండ రంగారావు (మాజీకార్యదర్శి) 8. కొప్పురావూరి రామారావు.

పై వరుస :– 9. షేక్ అబ్దుల్ నబీ, 10. మద్ది వెంకట ఆంజనేయులు, 11. కొప్పురావూరి సుబ్బారావు, (కోశాధికారి) 12. అర్వపల్లి మల్లిఖార్జునరావు, 13 కబళా లక్ష్మయ్య 14 బొందిలి రామసింగ్.

ఫొటోలో లేనిసభ్యులు:– చేబ్రోలు సుబ్బారావు, కొత్తూరి రాములు & బ్రదర్సు, కప్పం వీరయ్య, పసుమర్తి వెంకటేశ్వర్లు, రాచుమల్లు సత్యనారాయణ & రాధాకృష్ణమూర్తి .

కీ॥ శే॥ రాచమల్లు వీరరాఘవయ్యగారు

భూ దా త లు

గ్రం. పా. సభ్యులు 1932–40

గ్రం. చ. ఐక్య పా. సభ్యులు 40





యింటూరి కోటయ్యగారి కుమారుడు

యల్లమందగారు

రా జ పో ష కు లు

సూరవరపుపల్లె



# దాతలు

## చలివేంద్ర

భవన నిర్మాణమునకు

**1934**

శ్రీ గుబ్బా సర్వేశంగారి భార్య మహాలక్ష్మమ్మ గారు

,, గ్రంధి చినలక్ష్మయ్యగారి కుమారుడు వెంకటరత్నంగారు

,, కొత్తూరి భోజయ్యగారి కు॥ బాపయ్య అండ్ బ్రదర్సువారు

,, పసుమర్తి వెంకటేశంగారి కు॥ రామమూర్తి, సుబ్బారావుగార్లు

## గోశాల

షెడ్లు వేయించుటకు

**1935**

శ్రీ కొప్పరాపూరి పున్నయ్యగారి భార్య బాపమ్మగారు

,, రాచమల్లు నాగయ్యగారికుమార్లుకనకయ్య బ్రదర్సువారు

,, రాచమల్లు నాగయ్యగారి భార్య వరలక్ష్మమ్మగారు

,, రాచమల్లు వెంకటరత్నంగారి భార్య హనుమాయమ్మగారు అండ్ సుబ్బారావు గారి భార్య చినలక్ష్మమ్మగారు

,, రాచమల్లు రంగయ్యగారు

,, రాచమల్లు రామమూర్తిగారు

,, రాచమల్లు పున్నయ్యగారు

,, గ్రంధి అనంతయ్యగారు

,, గ్రంధి పూర్ణచంద్రయ్యగారు

,, గ్రంధి రామయ్య, వెంకటేశ్వర్లుగార్లు

,, గ్రంధి వెంకటరత్నం, లక్ష్మయ్యగార్లు

,, గ్రంధి రాఘవులుగారు

,, పోలిశెట్టి కోటయ్య అండ్ బ్రదర్సువారు

,, మిఠాయికొట్లవారు

,, మున్నలూరి రంగయ్యగారు

,, రాచపూడి శేషగిరిరావుగారు

,, తాడేపల్లి వెంకటనారాయణ అండ్ కంపెనీవారు

,, మేళ్లచెరువు నరసింహులు భార్య గురవమ్మగారు, కబళా వెంకటసుబ్బారాయుడుగార్లు

,, మైలవరపు వెంకటప్పయ్యగారు

,, దేవిశెట్టి సుబ్బయ్య, పొత్తూరి బాపయ్యగార్లు

,, ఎక్కల చిన్నమ్మాయి, గుంటూరు రోశయ్యగార్లు

,, పాదర్తి పుల్లమ్మ, పొట్టి వెంకటేశ్వర్లుగార్లు

,, తవ్వా మామయ్యగారి భార్య మహాలక్ష్మమ్మ, కూనల పున్నయ్యగార్లు

,, కొత్త చెంచయ్యగారు

# నూతన గోశాల నిర్మాణ దాతలు

## 1959

శ్రీ గ్రంధి వెంకటేశ్వర్లుభార్య వీరరత్నమ్మగారు గదులు 2

,, పసుమర్తి వెంకటకోటయ్యగారు 1

,, రాచమల్లు కన్నయ్య, రంగనాయకులు సీతారామయ్య గార్లు 1

,, రాచమల్లు వీరరాఘవులుగారి కు॥ రామసుబ్బయ్యగారు 1

రాచమల్లు వెంకటరంగం, శేషమ్మగార్ల పుత్రుడు వెంకన్నారావుగారు 1

కొప్పురావూరు కోటేశ్వరరావు, కొత్తూరు మాణిక్యారావు, గుండబోలు హనుమంతరావుగార్లు 1

మద్ది రామయ్యగారి కుమాళ్లు : వెంకట సుబ్బయ్య వెంకటరత్నం, నారాయణ, లక్ష్మయ్యగార్లు 1

సంగిశెట్టి పాపయ్యగారి జ్ఞాపకార్థం తండ్రి వీరభద్రయ్యగారు 1

మేకపోతుల లక్ష్మయ్యగారి కుమారుడు నాగూరుగారు $\frac{1}{2}$

గ్రంధి వెంకటరత్నం, లక్ష్మయ్యగార్లు $\frac{1}{2}$

శ్రీ ఆలపాటి సుబ్బారావుగారు $\frac{1}{2}$

,, పసుమర్తి వెంకటేశం కుమారుడు రామమూర్తిగారు $\frac{1}{2}$

,, పసుమర్తి వెంకటేశంగారి కుమారుడు సుబ్బారావుగారు $\frac{1}{2}$

,, గ్రంధి రాములుగారిభార్య రత్నమ్మగారు $\frac{1}{2}$

,, గట్టా సూర్యనారాయణ * బ్రదర్సువారు $\frac{1}{2}$

,, కొత్త సుబ్బారాయుడుగారి కు॥ కోటిస్వామిగారు $\frac{1}{2}$

,, తవ్వా పున్నయ్యగారి కుమారుడు శ్రీరాములుగారు $\frac{1}{2}$

కీ॥ శే॥ వంకాయల లక్ష్మమ్మగారి జ్ఞాపకార్థం కుమార్తె సంకా శేషమ్మగారు $\frac{1}{2}$

## -: నాపరాళ్ళు :-

శ్రీ బచ్చు కోటయ్యగారి భార్య గురవమ్మగారు

,, రాచమల్లు ముత్యంగారి దత్తు కు॥ వెంకటేశ్వర్లుగారు

,, చండ్రపట్ల లక్ష్మయ్యగారు.

  

నూతన వాణిజ్య భవనముల [కొట్ల]
నిర్మాణమునకు ధర్మమొసంగిన

# దాతలు

1. కీ॥శే॥ గర్రింధి వెంకటేశ్వర్లుగారి భార్య శ్రీ వీరరత్నమ్మగారు తమ కు॥ మల్లికార్జునరావు జ్ఞాపకార్థముఇచ్చినది రు. 2500

2. శ్రీ తవ్వా పోలమ్మగారు తమభర్త నాగభూషణంగారి జ్ఞాపకార్థము యిచ్చినది రు. 1116

3. శ్రీ కబళా సీతారామయ్యగారు తమ తండ్రి సుబ్బారాయుడుగారి జ్ఞాపకార్థము యిచ్చినది. రు. 1116

4. శ్రీ దేవిశెట్టి వెంకట సుబ్బారావు గారు తమతల్లిదండ్రులు చినసుబ్బయ్య అచ్చమ్మగార్ల జ్ఞాపకార్థముయిచ్చినది. రు. 1116

5. శ్రీ రాచుమల్లు వెంకన్నారావుగారు తమ తండ్రి వెంకటరంగాగారి జ్ఞాపకార్థమును తల్లి శేషమ్మగారి గౌరవార్థమును యిచ్చినది. రు. 1116

6. శ్రీ రావికింది అప్పయ్య ఆంజనేయులు గార్లు తమ తండ్రి వెంకటచలంగారి జ్ఞాపకార్థమును తల్లి బాపమ్మగారి గౌరవార్థమును యిచ్చినది. రు. 1116

## వాగ్దానదాతలు

1. శ్రీ కొత్తూరి కాశీ విశ్వనాధంగారు తమ తల్లి దండ్రులు బాపయ్య వెంకట సుబ్బమ్మగార్ల జ్ఞాపకార్థము వాగ్దానము చేసినది. రు. 1116

2. శ్రీ కొత్త సుబ్బారాయుడుగారి కు॥ పున్నయ్యగారు తమ భార్య వెంకట కోటమ్మగారిజ్ఞాపకార్థము వాగ్దానము చేసినది. రు. 1116

3. శ్రీ వంకాయల శివకోటేశ్వరరావు గారు తమ మేనత్త సంకా శేషమ్మ గారి జ్ఞాపకార్థము వాగ్దానముచేసినది రు. 1116

4. శ్రీ రాచుమల్లు రాఘునమ్మగారు తమ భర్త నాగయ్య గారి జ్ఞాపకార్థము వాగ్దానము చేసినది, రు. 116

5. శ్రీ కనమర్లపూడిహనుమయ్యగారు తమ భార్య ఆదిలక్ష్మి జ్ఞాపకార్థము వాగ్దానము చేసినది. రు. 250

---

# పరికరములో సంగిన దాతలు

## బీరువాలు

(శ్రీ) రాచమల్లు కన్నయ్య అండ్ బ్రదర్సు వారు 1

,, రాచమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు 2

,, తాడేపల్లి వెంకటనారాయణ, రాచపూడి శేషగిరిరావుగార్లు, నర్సరావుపేట 1

,, గ్రంధి పూర్ణచంద్రయ్యగారు 1

,, కొప్పరావూరి వెంకటసుబ్బారాయుడు, లక్ష్మయ్య గార్లు 1

,, కొప్పరావూరి కోటేశ్వరరావు కొలిశెట్టి నాగభూషణంగార్లు 1

,, యక్కల రామయ్య, చీరాల 1

,, గుంటూరు బావయ్య అండ్ సన్స చీరాల 1

,, అరవపల్లి చెంచయ్య దాII కుII లక్ష్మయ్యగారు 1

,, పచ్చిపులుసు అప్పయ్య, రాఘవయ్యగార్లు చీరాల 1

,, గ్రంధి లక్ష్మయ్య సన్స, మద్దు బాలకోటి గుప్తగార్లు చీరాల 1

,, గ్రంధి వెంకటరత్నంగారి కుమారుడు వెంకటేశ్వర్లుగారు 1

,, కొప్పరావూరి హనుమంతరావుగారు టేబిలు

,, రాచమల్లు సీతారామయ్య (సంస్కృత వేదములతో] షెల్పు.

,, తవ్వా బావయ్య, పొట్టి వెంకటేశ్వర్లుగార్లు తక్తాబల్ల.

,, అరవపల్లి రాఘవయ్య పొడుగుబల్ల

,, రాచమల్లు రంగనాయకులు శ్రేష్ఠిగారు వేదవృక్షము.

ఇంకను వివిధ చిన్నచిన్న పరికరములు, చిత్రపటములు, గ్రంధములు, దాతలు సమర్పించిరి.

# భూదాతలు

| | రూ. పై. |
|---|---|
| కీ॥ శే॥ అయితా కృష్ణస్వామిగారి కొ॥ సత్యనారాయణగారు | 1 00 |
| ,, గుత్తి వీరయ్యగారి కొ॥ చిన కోటి వీరయ్య | 0 58 |
| (శ్రీ) రాచమల్లు నాగయ్యగారి కొ॥ కన్నయ్య రంగనాయకులు, సీతారామయ్యగార్లు | 1 06 |
| కీ॥ శే॥ మద్ది గురవయ్యగారి కొ॥ కామయ్యగారు, పసుమర్రు | 0 50 |
| (శ్రీ) మున్నలూరి హనుమయ్యగారి కొ॥ రంగయ్యగారు | 1 00 |
| ,, కూని శెట్టి వేంకటరత్నంగారి కొ॥ వేంకటఓబయ్యగారు, సందెపూడి | 1 00 |
| కీ॥ శే॥ రాచమల్లు రంగయ్యగారి కొ॥ వేంకటసుబ్బయ్య | |
| (శ్రీ) రాచమల్లు కన్నయ్యగారి కొ॥ రామకృష్ణారావుగార్లు | 0 40 |
| ,, కొప్పురావూరి పున్నయ్యగారి కొ॥ వెంకటసుబ్బారాయుడు లక్ష్మయ్యగార్లు | 0 40 |
| కీ॥ శే॥ రాచమల్లు రామకృష్ణమ్మగారి కొ॥ వీరరాఘవులుగారు | 0 40 |
| ,, వసుమర్తి వేంకటసుబ్బయ్యగారి భార్య మాణిక్యమ్మగారు | 0 40 |
| కీ॥ శే॥ గ్రంధి వెంకటరత్నంగారి కొ॥ వెంకటేశ్వర్లుగారు | 1 03 |
| ,, గుంటూరు అమరయ్యగారి కొ॥ రోశయ్యగారు | 0 75 |
| ,, రాచమల్లు వెంకయ్యగారి కొ॥ పున్నయ్యగారు | 1 00 |
| (శ్రీ) కొలిశెట్టి వీరరాఘవయ్యగారి కొ॥ కోటిస్వామిగారు | 0 26 |
| ,, గ్రంధి వెంకటరత్నం లక్ష్మయ్యగార్లు | 0 50 |
| ,, గ్రంధి పూర్ణచంద్రయ్యగారు | 0 70 |
| ,, బొడ్డువల్లి వీరరాఘవయ్యగారి ద॥ కొ॥ దత్తాత్రేయమూర్తిగారు | 0 14 |
| ,, కొలిశెట్టి నాగభూషణంగారు | 0 36 |
| కీ॥ శే॥ అరవవల్లి చెంచయ్యగారు | 0 50 |
| (శ్రీ) పొత్తూరి సుబ్బారాయుడుగారి కొ॥ మల్లికార్జునుడు, వేంకటసుబ్బారావు, బాలనాగేంద్రుడుగార్లు, వలపర్ల | 0 42 |
| ,, దేవిశెట్టి నరసింహారావుగారు, రాజాపేట | 0 22 |
| ,, కొత్తూరు వెంకట బావయ్యగారి భార్య మంగమ్మ, వీరి కొ॥ శ్రీ లక్ష్మయ్య, రామయ్య, సుబ్బారావు, సాంబశివరావు, వెంకటేశ్వర్లుగార్లు | 0 22 |
| ,, పొత్తూరి సుబ్రహ్మణ్యంగారు, వలపర్ల | 0 23 |
| దివ్వెల బావయ్యగారి కొమారులు, వెంకటసుబ్బయ్య, విశ్వనాథం, కోటయ్య, వెంకటరత్తయ్య, వెంకటేశ్వర్లు గార్లు | 0 33 |
| కీ॥ శే॥ కూనల పున్నయ్యగారి కుమారుడు పున్నయ్యగారు | 1 00 |

# గ్రంథాలయమును దర్శించి అభిప్రాయముల నిచ్చిన ప్రముఖులు

## 1938 నుండి.

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారు M. A.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు.

" కస్తూరి కుటుంబరావుగారు గుంటూరుజిల్లా గ్రంథాలయ సంఘ కార్యదర్శి.

" డి. రామయ్యగారు, గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారి.

" రాయసం వీరేశ్వరశర్మగారు

" యం. గుండయ్యగారు, పంచాయితీ సంఘాధ్యక్షులు.

" శంకర సీతారామయ్యగారు, పోలీస్ సబ్ ఇనస్పెక్టరు

" పండిత దేవదూత విద్యార్థి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రాంతీయ సంచాలకులు.

" గ్రంథాలయోద్ధారక శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

" బొడ్డుపాటి సీతాబాయమ్మగారు, ఆనరరీ బెంచి మేజిస్ట్రేటు, విజయవాడ

" కవికిశోర, శ్రీ జవ్వాజి సుబ్బరాయగుప్తగారు, "దక్కన్‌వైశ్య" పత్రికాధిపతులు.

" విద్వచ్ఛిరోమణి కాశీకృష్ణాచార్యులుగారు

" "ఉభయభాషాప్రవీణ" శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

" ఇలిందప్రి రంగనాయకులు M. A. L. L. B. గారు, హిందూకాలేజి ప్రొఫెసరు. గుంటూరు

" కనుపర్తి రామకృష్ణశర్మగారు

" కవికిశోర శ్రీ గరేప్రి సత్యనారాయణ గుప్త గారు

" వావిలాల సోమయాజులుగారు, గుంటూరు

" ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు

డాక్టరు. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు M A. P. H. D. (London)
ప్రిన్సిపాల్, S. R. R. కళాశాల, విజయవాడ.

శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు, సహాయకార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకసభ,
విజయవాడ

" గోరంట్ల సూర్యనారాయణరాజుగారు, సబ్ రిజిస్ట్రారు, చిలకలూరిపేట.

" శరణురామస్వామి చౌదరిగారు. అధ్యక్షులు గుంటూరుజిల్లా గ్రంథాలయసంఘం.

" కొణిదెన బాలకృష్ణయ్యగారు, చీరాల

కవిభూషణ బండారామయ్యపంతులుగారు, ఎక్సైజు ఇన్‌స్పెక్టరు, చిలకలూరిపేట

శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారు, గుంటూరు

శ్రీ కొల్లిమర్ల వెంకటేశ్వర్లుగారు
, జాస్తి వేంకటనరసయ్యగారు, చిలకలూరిపేట, అధ్యక్షులు భారతీసమితి.
, కనువర్తి వేంకటేశ్వరశర్మ, సహాయకార్యదర్శి - నరసరావుపేట తా॥ గ్రంధాలయసంఘం
, తేలప్రోలు సాంబయ్య, ఐ. యల్. టి. డి. కంపెనీ, చిలకలూరిపేట
, వారణాసి వెంకటేశ్వరులు, గొట్టిపాడు
, వున్నవ రామలింగం, కార్యదర్శి శ్రీ హనుమన్నిలయ గ్రంధాలయం వున్నవ,
గుంటూరు తాలూకా
, పెళ్లూరి నాగభూషణం కార్యదర్శి గుంటూరు తాలూకా గ్రంధాలయసంఘం గుంటూరు.
, పాతూరి నాగభూషణం కార్యదర్శి. ఆంధ్రదేశ గ్రంధాలయ సంఘం
, యీడుపుగంటి వేంకట రత్నమాంబ కృష్ణాజిల్లాబోర్డు సభ్యురాలు పెనమకూరు
, కంచెర్ల వేంకట కృష్ణయ్య ప్రిన్సిపాల్, ఆంధ్ర హిందీ విద్యాపీఠము విజయవాడ
, మండలపర్తి ఉపేంద్రశర్మ. గుంటూరు
, దేవకీ సత్యనారాయణ ప్రెశిడెంటు శ్రీ కన్యకాపరమేశ్వరీ గ్రంధాలయము, పెనుకొండ.
, ఆ॥ సత్యనారాయణ హెడ్‌మాష్టర్ గవర్నమెంట్ ట్రైనింగ్‌స్కూల్, నెల్లూరు
, తాపీ మోహనరావు. మద్రాసు
, బత్తుల కామాక్షమ్మ ప్రిన్సిపాల్ ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల, రాజమహేంద్రవరం.
, జంధ్యాల పాపయ్యశాస్త్రి కరుణశ్రీ. గుంటూరు
, సూ॥ శ్రీహరిరావు
, గూటాల సత్యనారాయణ, యినస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, నరసరావుపేట
, యం. యల్. నరసింహం , , , ,
, జి. సూర్యనారాయణ , , , ,
, యం. ఆర్. రావు , , , ,
, కె. నారాయణరావు, అడ్వొకేట్, గుంటూరు
, యస్. రామారావు స్పెషల్ డెవలప్‌మెంట్ ఆఫీసర్, గుంటూరు
, కె. బావనయ్య లైబ్రేరియన్ డిస్ట్రిక్టు సెంట్రల్ లైబ్రరీ, గుంటూరు
, ఎక్స్టెన్షన్ ఆఫీసర్ ఎడ్యుకేషన్, పంచాయతీ సమితి, నాదెండ్ల
, వున్నవ రాజగోపాల కృష్ణయ్యగారు, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ కార్యదర్శి,
విజయవాడ.
, పాలకోడేటి లక్ష్మీపతి B. A. B. L. L.T. నర్సరావుపేట రేంజీ స్కూళ్ల డిప్యూటీ
యినస్పెక్టరు
, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు
, జి. వి. పున్నయ్యశాస్త్రి, సంయుక్తకార్యదర్శి, ఆంధ్రమహాసభ, గుంటూరు
, మారేమండ రామారావు M. A. P. H. D. హిందూ కళాశాల, గుంటూరు

# చలివేంద్ర

కవిపాదుషా : శ్రీ కొప్పురావూరి సత్యానారాయణ
కార్యదర్శి.
శ్రీ దుర్గా మల్లేశ్వర ఓరియంటల్ మిడిల్‌స్కూలు
విజయవాడ.

చలివేంద్రమును గురించి నన్నొకవ్యాసము వ్రాయుమంటిరి. ఈ చలివేంద్రమను శబ్దమే నాకగమ్యగోచరముగా నున్నది. ఈ శబ్దమున కర్థమేమాయని మధనపడితిని. సాహితీ బంధువుల నొకరిద్దరిని సంప్రతించియు విఫలుడనైతిని. ఎట్టకేలకొకమాట స్ఫురించెను. చలివిందల కిది రూపాంతర మని గ్రహించితిని.

ఎనుబదెనిమిది వత్సరములనుండి యీ చలివిందలను దీక్షతో త్యాగనిరతితో ప్రజలకత్యంతోపయుక్తముగా నడుపుచున్న శ్రీ కన్యకా పరమేశ్వరీ ధర్మసంఘము వారి కృషి అభినందనీయము, ఆనందదాయకము.

చలివిందల, చలివిందగయయి, చలివింద్రగా మారి చలివేంద్రమనియుచ్చరింపబడుచున్నది. ఈ చలివేంద్రములు అతి ప్రాచీన కాలమునుండి యున్నట్లుగా శాస్త్రముల వల్ల తెలియుచున్నది. భారత గ్రంథమున చలివేంద్రముల ప్రసంగమున్నది. ఇదిగాక అశోకుడు తన రాజ్యముననేక చోట్ల నీ చలివేంద్రములను పెట్టించినట్లున్నది. ప్రయాణ సౌకర్యము లెక్కువగా లేని ఆ కాలమున మార్గమధ్యములలో, పల్లెలలో, పట్టణములలో కూడ జలాభావమున్న చోట్ల, పాంథకుల పిపాస శాంతికి, పాలకులే యీ చలివేంద్రముల నేర్పరచు నాచారమున్నది. తమ రాజ్యములలో ననేక చోట్ల వాపీ, కూప, తటాకముల నేర్పరచు బాధ్యతగల పాలకులే, తమ బాధ్యతనితరులపై రుద్దుటకు, యీ కార్యములతి పుణ్యప్రదములని, సప్తసంతానాంగములని, ఆస్థాన పండితుల చేత శాస్త్రముల జొప్పించి ప్రచారమొనరింప జేసిరి. వారి కుటిలతనైనను, ప్రజాసేవ, అన్యోన్య సహకారము చేసుకొను అవకాశము, అలవాటు మనకబ్బినది.

ఆహారము, ఆహార్యము మానవుల కతి ముఖ్యమని యందురేగాని వానిని మించినది జలపానము. తిండిలేకున్నను మానవుడు కొన్నినాళ్లు పానీయములతో జీవించగలడు, కాని పానీయములేని తిండితో జీవింపజాలడు. అందుచేతనే పంచభూతములలో వాయువునకునూ, జలమునకునూ అంతప్రాముఖ్యమివ్వబడినది. అట్టి ప్రాణాధార, ధానాదానము అవసరమయిన జీవులకందించు వుత్తమ కార్యక్రమ నిర్వహణమొనర్చుచూ, ప్రజాసీకములో ప్రశంసమైన పాత్రను చేపట్టిన యీ సంస్థ గణనీయమైనది." దైవమును దైవలోకమును, జ్ఞానమును, భారతీయ ప్రథమ ఆతిథ్య కళాకలాపమును, శాఖలుగా గల మానవ శరీరమే యీ సంస్థ రూపమగుచున్నది. కలకాల మీ కార్యకర్తల త్యాగనిరతి ప్రజల మన్ననల బడయుగాత."

# చిలకలూరిపేట



★ శ్రీ కొప్పురావూరి సత్యనారాయణగారు
చిలకలూరిపేట

## పేరు

చేజర్లనుండి బయలుదేరిన ఓంకారనది (ఓగేరు) యీ గ్రామమును ఆనుకొని దక్షిణ దిక్కున ప్రవహించుచున్నది. దీని నీటి వసతి వలన పరిసర భూములన్నియు ముఖ్యముగా జామ, నారింజ, మామిడి తోటలతో విలసిల్లు చుండెడివి. తోటలు ఫలభరితములై యుండెడివి. పండ్లకొరకు వచ్చు చిలుకలు తోటల యందు గుంపులు, గుంపులుగా నుండెడివి. అందుచే యీ గ్రామము చిలుకలూరుగా పేరు పొంది వాడుకలో చిలకలూరు అయి రాను రాను చిలకలూరిపేటగా మారినది.

## పూర్వము

ఒకప్పుడు యీ గ్రామము రాజా మానూరి వారు అనబడు జమీందారుల పాలనలో నుండెడిది. ఆంగ్ల ప్రభుత్వము కారణాంతరములచే జమీని స్వాధీనపరచుకొని జమీన్ దారులను అలవెన్సు దారులనుగాచేసిన పిమ్మట యిదియును ఆంగ్లప్రభుత్వము క్రిందికిపోయెను.

## ఇప్పుడు

పూర్వము పేటగానున్న యీ గ్రామము పరిసరములషుమారు నూరుగ్రామముల అవసరములను తీర్చు సకలవిధ వ్యాపారములకు కేంద్రమై పట్టణముగామారి షుమారు 1 లక్ష 50 వేల రూపాయల సంవత్సరాదాయమును 11 వార్డులును, 14 మంది సభ్యులును గల మేజరు పంచాయతీ అయినది. మునిసిపాలిటీ అగు అవకాశములును గలవు

1961 లో పట్టణ జనసంఖ్య 18049. పురుషులు 9809, స్త్రీలు 9040 గృహములు 5075 కుటుంబములు 4136. పరిసర గ్రామములనుండి పొగాకు సీజనులో దినమునకు షుమారు 30000 మంది జనులును, అక్ సీజనులో 15000 మంది జనులును యిక్కడకు తమతమ పనులకై వచ్చి పోవుచుందురు.

## వసతులు

### ప్రయాణ, రవాణాలు.

ఒంగోలునుండి గుంటూరుకు పోవు ట్రంక్ రోడ్డును చీరాలనుండి నరసరావుపేటకు పోవు రోడ్డును యిక్కడ కలియుచున్నవి యిక్కడి నుండి ఒంగోలు, గుంటూరు, చీరాల; నరసరావుపేటలకు ప్రయాణము చేయుటకు ప్రభుత్వబస్ సర్వీసులు గలవు, సరుకుల రవాణాకు దాదాపు 60 లారీలును 4 లారీట్రాన్సుపోర్టు కంపెనీలును గలవు.

## ధర్మసంస్థలు

శ్రేష్ఠులచే స్థాపింపబడి సర్వజనోపయోగము లగు చలివేంద్ర, గ్రంధాలయము, గోసంరక్ష

ణము శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయములను నడుపుచున్న శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మ సంఘమును, ప్రతిఆదివారము .50 మంది బీదలకు, వికలాంగులను భోజనముపెట్టు అన్నదాన సమాజమును గలవు.

## దేవాలయములు సత్రములు

మూడు విష్ణ్వాలయములును మూడుశివాలయములును శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయమును, వీరభద్రాలయమును, అయిదు ఆంజనేయాలయములును, దత్తాత్రేయాలయమును పెద్ద చిన్న రధములును రధశాలలును గలవు. ప్రతిసంవత్సర చైత్రశుద్ధ పూర్ణిమనాడు శ్రీరాములవారి కల్యాణ రధోత్సవములును, వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి కల్యాణ రధోత్సవములును జరుగుచుండును. నాలుగు సత్రములు ట్రావెల ర్సుబంగళాయును గలవు.

## విద్య

రాచుమల్లు వరలక్ష్మమ్మ శ్రీ చిలకలూరిపేట విద్యా సంఘం హయ్యర్ సెకండరీ పాఠశాలయును, జిల్లా పరిషత్ ప్రాథమిక ఉన్నత పాఠశాలలును శారదా సెకండరీ ట్రైనింగు స్కూలును ట్యుటోరియల్ కాలేజీలును, శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ గ్రంధాలయమును జి. యల్. యల్. ఎ. శాఖా గ్రంధాలయమును గలవు

## ప్రభుత్వ కార్యాలయములు

పోలీస్ ప్రొహిబిషన్ సెంట్రల్ ఎక్సైజ్ సబ్‌రిజిస్ట్రార్ పోస్టల్ టెలిగ్రాం టెలిఫోన్ హైవేస్ నాగార్జున సాగర్ విద్యుచ్ఛక్తి, స్టేట్ బ్యాంక్ మార్కెటింగ్ సొసైటీ, కో-ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీ, అర్బన్ బ్యాంక్, వీవర్సు సొసైటీ ఆంధ్రప్రదేశ్ ఖాదీ బోర్డువారి విక్రయశాల మొదలగు ప్రభుత్వ కార్యాలయములు గలవు.

## వైద్యము

ప్రభుత్వము వారి ఆస్పత్రియు, పశువుల ఆస్పత్రియు సమర్థులగు ఆయుర్వేద ఆంగ్లేయ హోమియో వైద్యము చేయు డాక్టర్లచే నడుపబడుచున్న సొంత వైద్యశాలలు షుమారు 15 గలవు.

## పరిశ్రమలు

జిల్లాలో రెండవ పొగాకు పారిశ్రామిక కేంద్రము, విదేశీయుల ఐ. యల్. టి. డి., బి. ఐ. టి., యన్. టి. సి. పొగాకు కంపెనీలును, స్థానిక కందిమళ్లవారి, మద్దివారి పొగాకు కంపెనీలును, గుంటూరు వారి బ్రాంచీలు గోల్డెక్, ఈస్టిండియా, పొగాకు కంపెనీలును పెద్దవి ఉన్నవి.

మరియు గుంటూరు వారివియు స్థానికులవియు పొగాకు కంపెనీలు 20 వరకు ఉన్నవి. మూడు రీడ్రైంగ్ మిషనులును 100 కి పైగా వర్కుషాపులు, ఫ్యాక్టరీలును గలవు.

చేనేత నూలుకు రంగులు అద్దుట, తడికలల్లుట, యిటుకలు చేయుట మొదలగు పరిశ్రమలును మూడు సినిమా హాలులును గలవు.

## మరియు

నాదస్వర వాద్యమునందు యావద్భారత ఖ్యాతినందిన శ్రీ షేక్ చిన పీరు సాహెబు ఆదం సాహెబుగార్ల జన్మస్థలము. శ్రీ ఆదం సాహెబు కులపతిగా ప్రభుత్వమువారిచే నడుపబడు నాదస్వర గురుకులము గలదు.

సర్వేజనా స్సుఖినో భవంతు.

---

# చిలకలూరిపేట చరిత్ర

ఉ. భా. ప్ర
శ్రీ జాస్తి వేంకటనరసయ్య.

గతమునందున్న బాగును గాంచి హృదిని
వర్తమానదినమ్ముల పాత్రతం గని
సర్వమానవ పరిచర్య సలుపుకొనుచు
ఆంధ్ర సంతతి ప్రజ్ఞత నలరుగాత.

కలవు సహస్రభాషలు జగమ్మున; నం
దొకండేని, తేనియల్
చిలికెడి తెల్గుబోడ. సరిసేయగంజాలదు;
విశ్వమెల్ల నీ
పలుకున కద్దుసెప్పదు; సెబాసని విజ్ఞులు
మెచ్చ సుందరో
జ్జ్వల కవితన్ సృజించి మనజాతికి
నభ్యుదయమ్ము గూర్పుండీ.

మన భారత దేశములో ఆంధ్రప్రదేశము ఒక భాగము. మనము ఆంధ్రులమని తెలుగువారమని వ్యవహరింపబడుచున్నాము. నాలుగు వేల సంవత్సరములనుండి తెలుగువారున్నట్లు తెలియుచున్నది. శాలివాహన వంశమునకు చెందిన రాజులు చాలాకాలము తెలుగు దేశమును పాలించిరి తరువాత క్రమముగా ఇక్ష్వాకులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు విజయనగరపు రాజులు ఆంధ్రప్రదేశమును పాలించిరి. కృష్ణాతీరమున అమరావతి, ధరణికోట నాగార్జునకొండ, విజయపురి మున్నగు ప్రసిద్ధక్షేత్రములున్నవి. నన్నయ, తిక్కన, పోతన శ్రీనాథుడు, పెద్దన మున్నగు కవులు ఆంధ్ర సారస్వతమున ప్రసిద్ధికెక్కిరి. శ్రీకృష్ణదేవరాయలు కవియై కవితాపోషకుడై ప్రసిద్ధివహించెను. ఆంధ్రప్రదేశమందు గుంటూరుజిల్లా అతి ప్రసిద్ధము. అద్దంకి, కొండవీడు ఎత్తిపోతల, జలపాతము ఇచటివే. పల్నాటియుద్ధ మిచటనే జరిగెను. అన్ని జాతీయోద్యమములలో ఈ జిల్లా ముందడుగు వేసినది. కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, దేశభక్త కొండా వెంకటప్పయ్య ఇచటివారే. తుమ్మల, జాషువా, ఏటుకూరి, కరుణశ్రీ మున్నగు కవులు ఇచటివారే, ఆస్థానకవి శ్రీ కాశీకృష్ణాచార్య పండితులు గుంటూరువాసులు. భాషాదురభిమానము ప్రాంతీయకుల దురభిమానములు చెడుగుణములు, అభిమాన ముండవచ్చును. ఆంధ్రాభ్యుదయము భారతీయపురోగమనము విశ్వమానవ కళ్యాణము మనలక్ష్యములు కావలయును. మనము ఆంధ్రత్వములు విడువరాదు.

స్వర్గములు లేవు తల్లి దేశంబుకంటె
భాగ్యములు లేవు తనతల్లి భాషకంటె
దైవములు లేరు తనుగన్న తల్లికంటె
నరులకెల్లర కివి జీవనాడులరయ"

—రాయప్రోలు.

గుంటూరుజిల్లాయందు చిలకలూరిపేట మంచి కేంద్రస్థానము నందున్నది. అది చుట్టును పండ్ల తోటలతో నిండి ప్రకృతి రమణీయతా పూరితమగు పట్టణము.

ఇందు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘమువారు, చలివేంద్రి, గ్రంథాలయం, గోశాల, దేవాలయములను ప్రజాసేవ కొఱకు నడుపుచున్నారు.

1 హాయ్యరు సెకండరీస్కూలు, 1. హై స్కూలు, 1 సెకండరీ ట్రైనింగుస్కూలు, సమీపముననున్న పురుషోత్తమపట్నములో మరియొక బేసిక్ ట్రయినింగుస్కూలు ఉన్నవి. ఉన్నత విద్యాసంస్థలు చాల ఇచటనున్నవి. ఇది మెట్ట ప్రదేశమునకు మాగాణి ప్రదేశమునకు మధ్యగా నుండుటచే

రెండు సంస్కృతులు మేళవించి ఇచటనొక అపూర్వతను సృష్టించినవి. సంగీత నాటక నృత్య సినిమాకళలు గ్రంథాలయములు కవితా గోష్ఠులు సాహితీచర్చలు భక్త సమాజములు రాజకీయములు మున్నగువానికి చిలకలూరిపేట కేంద్ర స్థానము.



## చిలకలూరిపేట

ఇలవేల్పై యిటరావు సంతతికి స్థాయిగా గూర్చి భక్త ప్రజా
వలి కోర్కుల్ సమకూర్చుచున్ సతము సర్వవ్యాపకుండై మనం
బలరన్ నిల్చిన మూర్తి వేంకటనృసింహస్వామి సంస్థానమై
వెలసెన్ పేట శుకాంగనాగళ సమావిర్భూత గానమ్మునన్.

జలసంప్రీతికి, సాంద్రసారవన శ్రీ సంపత్తికిన్ రాకపో
కల మార్గ స్థిరసిద్ధికిన్; మధురభోగ ప్రాప్తికిన్; దైవ నా
మల సద్గీతికి; ధర్మ కార్యరతికిన్ పాండిత్య సమృద్ధికిన్
స్థల మాహాత్మ్య విభూతికిన్ నెలవుకాదా! చిల్కలూర్పేటిలన్

శిలలు ద్రవింప; సర్పములు శీర్షములెత్తి నటింప; బాలకుల్
కలతలు వీడి నిర్మల సుఖస్థితి నుప్పొవహింప; భక్త హృ
జ్జలజము లెల్ల రేప; ఖలస్వాంత దురూహలు మాపసాధమం
బులుగడ "పీకు ఆదముల" పుణ్య ఫలమ్ములు గాన మాధురుల్.

రచన: షేక్ అలీ. బి. ఎ.

తెలుగు పండిట్, కావూరు.

ఓమ్

# నాదస్వర గురుకులము
## చిలకలూరిపేట



శ్రీ
తూవాటి నాగభూషణరావు

షుమారు 300 సంవత్సరముల క్రిందటఇప్పటి గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా సాతులూరు గ్రామంలో శ్రీ షేక్ నబీసాహెబు అనువారు శ్రీవిద్యోపాసకులై అపర దేవియను గ్రహము వలన నాదస్వర వాద్యము నందు విశేష ప్రజ్ఞానుభవములను బడసి పండిత పామరుల మన్ననలను పొందుచుండిరి.

చిలకలూరిపేట జమీందారులగు శ్రీ రాజా మానూరివారు వారి జమీ గ్రామములలోని పలు దేవాలయములకు ధర్మకర్తలు. సాతులూరులోని దేవాలయమునకును వీరు ధర్మకర్తలగుటచే శ్రీ నబీసాహెబు కాలమందున్న కళాప్రియులగు జమీందారుగారు వీరి ప్రతిభా సామర్థ్యములను విని తను ఆస్థాన విద్వాంసులుగా నుండ శ్రీ నబీగారిని కోరిరి.

ఆ మహామహుని ఔదార్యాది గుణములను వినియున్న శ్రీ నబీగారు వారి కోరికను మన్నించి వెంటనే తమ నివాసమును చిలకలూరిపేటకు మార్చుకొని శ్రీ రాజా మానూరివారి ఆస్థాన విద్వాంసులుగా నుండి నాదస్వర కళోపాసన చేసి జీవితమును తరింప జేసికొనిరి

నాటి నుండి వారి వంశీయులు నేటి వరకు నాదస్వర కళోపాసనయే తమ పవిత్రధర్మముగను బాధ్యతగను యెంచి యావద్భారత ఖ్యాతి నందు చుండిరి.

వరుసగా శ్రీ నబీ సాహెబు, పెద నసర్ద్దీ సాహెబు, చిన నసర్ద్దీసాహెబు, దాదా సాహెబు హుస్సేన్ సాహెబు నసర్ద్దీ సాహెబు పెదమౌలా సాహెబు చినమౌలా సాహెబు పెద పీరు సాహెబు చిన పీరు సాహెబు నసర్ద్దీ సాహెబు ఆదం సాహెబు అను వీరెల్లరు రానురాను నాదస్వర కళలో విశేషానుభవములనుపొంది యెనలేని ఖ్యాతి నందుచు ఆంధ్రదేశములో "సన్నాయి సాహెబులు"గా ముద్ర బడియు గలిగిరి.

ప్రయాణ సౌకర్యము లంతగా లేని కాలములోనే పెద మౌలా, చినమౌలా సాహెబులు మద్రాసునుండి విజయనగరము వరకుగల పలు పట్టణముల నుండి ఎడతెరపిలేకుండా ఆహ్వానముల నంది తమ విద్యా కౌశలము వలన వారిని ఆనందమయులనుగా నొనర్చిరి. అంతేగాక వీరి కాలములో వీరు విద్య నార్జించుటయేగాక వేల కొలది శిష్యులకు విద్యాదానమునుచేసి వారి జీవితములకు వెలుగును చూపెట్టిరి.

ఆ సంప్రదాయమును వారి తరువాత శ్రీచిన పీరు సాహెబు ఆదం సాహెబులు యెంతయో ముందునకు తీసికొని వెళ్లిరి. అనగా ఆంధ్ర ప్రదేశ్ లో వేళ్లమీద లెక్కింప తగిన యే కొద్ది మందియో తక్క నాదస్వర ప్రముఖ విద్వాంసులు వర్తమాన విద్వాంసులు యెల్లరును వీరి శిష్య ప్రశిష్యులే.

శ్రీ చినపీరుసాహెబు ఆదంసాహెబులు భారత దేశములోని ప్రధాన పట్టణము లన్నిటిలో ప్రముఖుల ఆహ్వానములనందుకొని పలుసభలు చేసి అందుస్వర్ణ నాదస్వరములు గండపెండేర ములు సింహతలాటములు ఘంటాకంకణములు పతకములు రజత షీల్డులు పాత్రలు కాశ్మీరు శాలువలు పట్టుదుకూలములు సన్మాన పత్రి

కులు మొదలగు సత్కారములెన్నియో బడసిరి.

దీనిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు ది 1-9-1961 న చిలకలూరి పేటలో శ్రీ షేక్ ఆదం సాహెబు కులపతిగా 'నాదస్వర గురుకులము'' ను ఏర్పాటు చేసిరి.

ప్రజలు ప్రభుత్వము అకాడమీలు యింకను వీరికి తగు ప్రోత్సాహము నిచ్చిన ''నాదస్వర గురుకులము''ను నాదస్వర విశ్వ విద్యాలయము''గా రూపొందించ తగిన అవకాశములు ఉత్సాహము యీ వంశీయులకు గలవు.

అందుకు భగవంతుడనుగ్రహించ ప్రార్థన.

---




రచన :-
శ్రీ నాగరాజు వెంకటేశ్వర్లు
హెడ్మాష్టరు, దంటమూడి.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ గ్రంథాలయం
చిలకలూరిపేట వణిగ్వరుల ధర్మ సంస్థాపనం
ఈనాడు కాదు-కొన్ని దశాబ్దాలనాటి సుస్థాపితం
సాటిలేని నిర్మాణం-అత్యంత రమణీయ హర్మ్యం
వాడవాడల కడు వేడుకతో
జరుపుకొంటుం దీనాడు రజతోత్సవం
సర్వగ్రంథ సమీకరణం-బీ పుస్తక భాండాగారం

అక్కర సౌంజ్ఞా పరిజ్ఞానంతో
చక్కని ప్రజ్ఞా విజ్ఞానం పొంది
నిక్కమైన అజ్ఞానాంధకార రహితం
చేస్తుంది పుస్తక భాండాగారం.

వార్తాపత్రికలకై పెద్దలు చూపే తాపత్రయం
సచిత్ర వారపత్రికలకై విద్యార్థులు చూపే ఉత్సాహం
బొమ్మల పత్రికలకై పోటీపడు బాలల పోరాటం
నవలా సాహిత్యంకోసం నవయువకులు పొందే ఆరాటం
విమర్శనా గ్రంథాలకై కవిపండితులు కాంక్షించే ప్రమోదం
జానపద గాథలకై ఉవ్విళ్ళూరు యువిదల ఉబలాటం.

గ్రంథానికి తగిన చదువరి-చదువరికి తగిన గ్రంథం
పాత్రతగల సర్వసభ్యులకు సముచిత గ్రంథం
ఇచ్చి కలిగిస్తుంది అంతులేని మధురానందం
జన్మసంస్కారం, కర్మపరిపాకం, పుస్తక భాండాగారం.

విజ్ఞానులకు - యుక్తాయుక్తం
సృష్టికర్తలకు - శక్తిత్వం
తత్త్వవేత్తలకు - ముక్తిత్వం
శాస్త్రకాములకు - కర్తృత్వం
చిత్రకారులకు - మూర్తిత్వం
నాట్యాచార్యులకు - రక్తిగల నర్తనం
మహామంత్రులకు అంతరంగం
కవి శ్రేష్ఠులకు కమ్మని కల్పనం
గురుపుంగవులు తెలియరాని గుప్తం
వాస్తవంగా యిస్తుంది పుస్తక భాండాగారం.

అక్షర లక్షలను నిజచక్షువులతో
లక్ష్యముంచి అనుక్షణం వీక్షిస్తుంటే
సలక్షణ సుశిక్షితునిగ-మోక్షమిచ్చు రక్షకునిగ
ప్రత్యక్షసాక్షీభూతునిగ-దక్షతగల పక్షినిగ
కటాక్షిస్తుంది పుస్తక భాండాగారం.

# గ్రంథాలయం

ఆలయములందు ఘనమౌ
ఆలయము గ్రంథాలయం
జాలసింపక గ్రామ గ్రా
మాలలో స్థాపింపుడీ॥

జ్ఞానమింతయు లేక న
జ్ఞాన తిమిరము లోవలన్
దీనజనులకు వి
జ్ఞాన భాస్కరమౌనుడీ॥

నూటి కే పదిమందియో
కూటికి గలవారలే
మేటివిద్యల నేర్చిరీ
నాటి భారతమందునన్॥

విద్యయే జ్ఞాననేత్రం
హృద్యమగు ధర్మక్షేత్రం
అద్యతన భావిసూత్రం
సద్యశః పటహాపాత్రం॥

పైరు పండించు రైతా
తీరికా సమయమందూ
చేరు గ్రంథాలయము భూ
సార విజ్ఞానమొందా॥

వర్తక మొనర్చు బేహారీ
వర్తక రహస్యమందున్
పూర్తి విజ్ఞాన మొందా
కర్తవ్యమగు గ్రంథపఠనం॥

సకల విధవిజ్ఞానములకున్
ముకుర మీ గ్రంథాలయం
కకవికలు చెందనేలా?
సకల జనులును జేరుడీ॥

చీట్ల పేకల నాడనేలా?
పోట్లాటలకు పూననేలా?
అట్లు కాలము గడుపనేలా?
ఇట్లు గ్రంథాలయము జేరవా

అన్ని వృత్తుల వారలున్
అన్ని జాతుల వారలున్
చిన్న పెద్దలు స్త్రీలుపురుషులు
చెన్నుమీరగ జేరుడీ॥

బాలబాలిక లందరున్
మేలుగా చిన్నకథలన్
లీల చదువుచు హర్షమం
దోలలాడుదు రిచ్చటన్॥

రసికులౌ యావను లిటన్
హాసియింపగా నభిరుచుల్
రసమొల్కు కావ్యాదులన్
రసము గ్రోలుచు నుందురోయ్

వయసు మళ్ళిన వారికిన్
ప్రియములౌ వేదాంతముల్
నయముగా నేర్పంగ నా
లయము సుమ్మిది నమ్ముడీ॥

—నవగీతాల నుండి



# పుస్తకము

సరసమంజుల కథా సల్లాపములతోడ
నొకమాఱు చిత్తమ్ము నూఁపు దీవు
జీవిత చరితముల్ చేదోడుగా నిచ్చి
మహనీయ నీతులన్ మనుతు వీవు
విజ్ఞానదాయక విమలబోధలచేతఁ
బ్రజ్ఞా విశేషముల్ పలుకు దీవు
నవరస మాధురీ నానార్థ కల్పన
నొప్పుచు నానంద మొసఁగు దీవు

విశ్వ భూగోళమండలి విషయజాల
మంతయునుగూడ నీ యందు నమరియుండు
సర్వజనముల హితము నీ సద్వ్రతమ్ము
పూత చారిత్రి నికురుంబ! పుస్తకంబ!

సారాసార వివేకమున్ దెలుపు సచ్చారిత్ర సంయుక్తుఁడున్
బారావార గభీరచిత్తుఁ డగుచున్ భాసిల్లు సన్మిత్రమున్
మీఱున్ ధర్మము నొక్కొకప్పుడిఁక; నీ మిత్రత్వ మెల్లప్పుడున్
కారుణ్యంబు నుదారవృత్తిఁ గఱపున్ గల్యాణ మార్గమ్ములన్.

చిత్తము శాంతతన్ విడిచి జీర్ణతనూభవ రోగ రాజి నా
యత్తముగాక మానవుఁడు హా! యని దుఃఖము నొందునప్పుడున్
పొత్తమ! నీవ యాతనికిఁ బోవని మిత్రమవై హితమ్ము లా
సత్తిని దెల్పుచుండెదవు సాత్త్వికవృత్తిని తృప్తి నిచ్చుచున్.

భూత వర్తమానమ్ముల ఖ్యాత పురుష
బోధలన్నియు నీ యందుఁ బొందఁగలము
మూఁడు కాలమ్ములందును ముదము నిచ్చు
సత్య శివ సుందరమ్మగు సత్తువీవ.

పొత్తమ మిత్రము బంధువు
పొత్తమ నానార్థదాత బోధకుఁడున్ సం
పత్తియు బత్తియు జననియు
బొత్తము మన వెలుఁగు, సంతు, పూజ్యహితుండున్.

—ఖండ కృతి నుండి.





# జలదానము.

## చలివేంద్రలు

రచన:-
వల్లభనేని హనుమంతరావు,
హిందీపండిట్, నాదెండ్ల.

మానవులు ఈ లోకమునందొనర్చు పాప పుణ్యములు స్వర్గ నరకలోకములకు సోపానములు. ధర్మబద్ధమైన యిహలోక జీవితము పరలోక ప్రాప్తికొక వుత్తమ సాధనము. ఇహపరముల రెంటినీ సాధించిననాడే మహోత్కృష్టమైన మానవజన్మ సార్థకము కాగలదు. ఇట్టి జీవిత పరమార్థమెఱిగియే త్రికాలజ్ఞులైన ఆర్యఋషులు అనాదియందే భారతీయులకు పరిబద్ధమైన ధర్మబద్ధ జీవితవిధానమును ప్రసాదించినారు. నిత్యానుష్ఠానపవిత్రధర్మములు, కార్యములు, యెన్నో బోధించారు. అట్టి బోధలే వేదములుగా నెలసి వివిధ శాస్త్ర పురాణేతిహాసములలో ప్రతిధ్వనిస్తూ భారతీయులచే ననేక పుణ్యకార్యములాచరింప జేయుచున్నవి. అందు దాన ధర్మము లత్యంత గణనీయమైనవి.

పూజ్య వినోబాజీ నుడివినట్లు "పవిత్రమైన భారతభూమియందు అనాదినుండియునిరంతరము జ్ఞానధార, దానధారప్రవహించుచునేవున్నది."

పుణ్యకార్యాసక్తులైన భారతీయులకు దానధర్మములు వెన్నతోబెట్టినవిద్య. వారెఱుగనిధర్మము వారుచేయని దానమూ లేదు. ప్రాచీనకాలము నుండి ఈనాటివరకునూ లెక్కకు మించిన దానములు, దాతల వుదారచరిత్రలు వింటూ ప్రత్యక్షముగా కంటూవున్నాము.

భారతీయులు నిత్యమాచరించు వేలాది దానములందుఅన్నభూ గృహ,గోదానాదిదానములు ముఖ్యమైనవి. అందు జలదానమొకటి. దానములందు జలదానమత్యంత ప్రధానముగా యెంచబడుచున్నది. వాపీ, కూప తటాకాదికముల విశిష్టతను పౌరాణికులు బహు విధముల వర్ణించియున్నారు. అట్టి జలదానావశ్యకతను, దాని మహిమను తెలుసుకొనుట పుణ్యప్రదము.

సృష్టికిమూలాధారములైన పంచ భూతములందు జలము ఒకటి. మానవుని ప్రాథమికావసరములలో నీరు ముఖ్యమైనది. సకల జీవరాసు

ను, 'నీరే ప్రాణాధారము' నీటియొక్క వివిధ ప్రయోగము లనంతములు. దేహ పుష్టికి, ఆరోగ్యవృద్ధికి నీ రవసరము. పంటలు పండుటకు నీరే మూలము. నీరులేనిదే పంటలు పండవు. పంటలు పండనిదే పొట్టలు నిండవు. కటిక చీకటి రాత్రిలను సహితము పట్ట పగలుగా, పండు వెన్నెలగా చేయగల విద్యుత్తు నీటి నుండియేగదా లభించుచున్నది. వ్యాధు లనేకము జల చికిత్సతో మటుమాయమగుచున్నవి నేటి ఆధునిక విజ్ఞానయుగమందిట్టి వైజ్ఞాని కోపయోగము లెన్నో నీటివలన జూచుచున్నాము.

వివిధ వుపయోగము లెట్లున్నను ముఖ్యముగా నీరు దాహోపశాంతికి. ప్రాణ రక్షణకు అత్యావశ్యకమైనదని వేరుగా జెప్ప పనిలేదు. ఆకలిబాధనైనా సహించవచ్చుగాని, దాహ బాధను ప్రాణులోర్వ జాలవుగదా! వేసవికాల మందు మార్గ మధ్య మందెందరో నీరుదొరకక గొంతుయెండి మృత్యువాత బడుట చూచుచున్నాము. అట్టి తరి అల్ప జీవుల సంగతి చెప్పనవసరములేదు. మృత్యుశయ్యపై పరుండి అంతిమ క్షణములలో అన్నియు వదలి 'ఒక చుక్క నీటిని' నోరు తెరచి ప్రతివాడు అడుగుతాడు. యుద్ధభూమిలో సైనికులుదాహబాధతో తపించి మరణించుతారు. భోజన సమయమందు 'పానీ' పుచ్చు కొనుటలో ఆలస్యమైన పై ప్రాణము పైననే పోవును. గొప్ప గొప్ప వుత్సవములందు మార్గమధ్యమునందు, నీటి కొరత గల పల్లెల పట్టణములందు ప్రజలు పడుఇబ్బందులు వర్ణనాతీతములు. దాహమైన వెనువెంటనే నీరు త్రాగక క్షణ మాగిన ఫలితము మృత్యువాత పడుటయే. కనుకనే అట్టి ప్రాణాధారమైన జలమును దాన మొసర్చుదాతను 'ప్రాణదాతగా' పేర్కొనినారు.

జలదాన మహిమను గురించి నారద పురాణమునందు, "నాన్నోదక సమందానం న్నద్వాదశీ పరమవ్రతం" అని జెప్పబడినది. అనగా అన్ని దానములందు అన్నోదక దానములునూ అన్ని వ్రతము లందునూ ద్వాదశీ వ్రతము వుత్తమమైనవీ, మహాఫలదాయక మైనవని యర్థము.

శేషధర్మమందిట్లు జల దాన మహిమను గురించి జెప్పబడినది.

గీ॥ మాఘమాసంబు మొదలుగా మంచినీళ్లు
చల్లమైనను పానీయ శాలగట్టి
పోయువారల పుణ్యంబు పోల్పనరిది
యుభయ లోకంబులందున శుభముగండ్రు.

శ్రీకృష్ణ భగవానుడు ధర్మరాజుకు ధర్మోపదేశములు వినిపించుచూ "అన్నోదక దానములకు యే దానమునూ సాటిరాద"ని వచించినట్లు శేషధర్మమందు తెలుపబడినది. పూర్వము సుశీలుడను బ్రాహ్మణుడు అనావృష్టి కాలమందు నూతులు త్రవ్వించి చలువ పందిళ్ళు పెట్టి జలదానము చేసి పశుపక్షి మృగాది సకల జీవరాసులను కాపాడగా స్వర్గలోక మేగినాడట.

శ్వేతకేతుడను మహారాజు గొప్ప తపస్సు చేసి స్వర్గలోకమున కేగినను తానెన్నడూ అన్నోదక దానము లాచరించ నందున ఆకలి, దాహములతో బాధపడినట్లును, శివశర్మ యను పండితుడు మిక్కిలి ధనమార్జించి కడులోభియై మరణించి కృష్ణసర్పముగా జన్మించి తను సంపాదించిన ధనమును విడువక దానిచుట్టూ తిరుగుచు కాపలా కాయుచుండెనట, అంత వసిష్ఠ మహాముని వలన తనస్థితికి కారణము తెలుసుకొని తుద కాధనమంతయు చలివేంద్రలకు, అన్నసత్రములకు ఖర్చుపెట్టి విముక్తిని బొంది బ్రహ్మలోక మేగినట్లునూ నారదపురాణమునందు వర్ణించబడి

నవి. అనావృష్టిచే తన రాజ్యము నందలి ప్రజల బాధలచూడలేక కఠోరమైన తపస్సుచేసి, శివుని మెప్పించి, సముద్రుని ఒప్పించి గంగను భూలోకమునకు రప్పించినట్టి త్యాగధనుడైన భగీరథుని పుణ్యగాథయెఱుగనివారెవరు? బాటలు వేయించి, బాటల కిరువైపుల చెట్లు నాటించి అన్నసత్రాలు చలివేంద్రాలు కట్టించి ప్రజా మన్నన బొందిన అశోకుని చరిత్ర తెలియనివారెవరు? ఇట్టి పౌరాణిక చారిత్రిక గాథలు వేనకు వేలు నిత్యము పఠించుచునే యున్నాము.

పవిత్రమైన జలదానము అనేక రీతుల ఆచరింపబడుచున్నది. వాపీ, కూప తటాకాదికముల నిర్మాణమొనర్చి చలి పందిళ్ల ద్వారా దాహార్తుల దాహోపశాంతి కలిగించు యాచారము భారత దేశమునందు ప్రాచీనకాలము నుండియు నచ్చుచున్నది. ఇందు చలిపందిళ్లు లేక చలివేంద్రము లత్యంత విస్తృతమైనవి బహువ్యాపకమైనవి. నీటికొరతగల పల్లెలందు, పట్టణములందు, పుష్పవనములందు, మార్గమధ్యములందు పందిళ్లు, వేసి చల్లని పానీయము, మజ్జిగ పానకము పోయు దాతలను మనము ప్రత్యక్షముగా ననేక చోట్ల జూచుచున్నాము. చల్లని నీరుండు పందిళ్లు గనుకనే వీనికి చలిపందిళ్లు లేక చలివేంద్రలను నామము సార్థకమైనది. ధర్మసంఘములు స్థాపించి, వానిద్వారా చలివేంద్ర శాఖలను నడుపుప్రజల దాతృత్వ మినాడునూ పొంగిపొరలుచునే యున్నది. ఇట్టి ధర్మసంఘములు చలివేంద్ర సంఘములనేకములు ఆంధ్ర ప్రాంతమందు ముందంజ వేయుచునేయున్నవి.

"అతిథి స్వయం విష్ణుః" అన్నారు పెద్దలు ఇంటికి వచ్చిన అతిథియభ్యాగతులను దైవ స్వరూపులుగా ఎంచి ఆదరించు భారతీయుల యాచారము మహోత్కృష్టమైనది. ఇట్టి పవిత్ర యాచారము సదా పాటించుట మనముఖ్య ధర్మము.

ఆశ్రమములందు గృహస్థాశ్రమము పరమ పవిత్రమైనదిగా భావించబడుచున్నది. అనుదిన మెందరో అతిథి యభ్యాగతులు కన్నులలో ప్రాణముంచుకొని నకనకలాడుతూ, దాహార్తులై గృహస్థు గృహములకు వచ్చుచుందురు. అట్టి వారెవరైననూ అడిగినదే తడవుగా అప్యాయముగా మంచినీళ్ళిచ్చి దాహోపశాంతి కలుగజేయుట పుణ్యప్రదము. "దాహమడిగిన వారిని లేదుపొమ్మని నిర్లక్ష్యము చేసినవారు మహా నరకయాతన లనుభవించుదురని" పురాణములందు జెప్పబడినది.

ధన, కనక, వస్తు వాహనాది గొప్ప గొప్ప దానములు చేసి పుణ్యగతులు పొందలేని పేదలకు ఇట్టి దానము సులభ సాధ్యము. "సూక్ష్మములో మోక్షమన్నట్లు" శక్తిలేని నిరుపేదలకిట్టి జలదానము ముక్తి బొందుటకు చక్కని మార్గము. ఎన్ని దానములు పొందినను తృప్తి పడని మానవుడు జలదానమును పొంది సంతోష సుఖము లనుభవించును. దాహము తీరినంతనే కడుపు చల్లబడి ఆనంద బాష్పములు రాల్చుచూ చేయెత్తి దండమిడును. ఇట్టి మహోత్కృష్టమైన ఉచితమైన, అత్యంతావశ్యకమై ప్రాణాధారమైన 'జలదానము' సర్వజనులు ఆచరింపదగినది.

ప్రజోపయోగకరములైన పవిత్రకార్యము లాచరించుచు ప్రజలను సదా భగవంతుడు కాపాడుగాత. సమస్త జనులు, సదా సత్కార్యనిరతులై, సదాచార సంపన్నులై సంచరించుదురు గాక.

శుభమస్తు

  

అత్యవసర పరిస్థితిలో

# లైబ్రేరియనుల ప్రముఖపాత్ర

కె. రాఘవరెడ్డి

దేశాన్ని ఎదుర్కొంటున్న ప్రస్తుత విషమ పరిస్థితిలో ప్రతి పౌరుడూ తన శాయశక్తులా కృషి చేయడం అవసరం. భారతదేశానికి చైనా కల్గించిన పరాభవాన్ని వెంటనే తుడిచివేయాలి. దురాక్రమణను పూర్తిగా పారద్రోలి, భవిష్యత్తులో ఇలాంటి దురాక్రమణ మరోసారి జరగకుండా వుండేందుకై మనం కొన్ని సంవత్సరాల పాటు కృషిచేయాలి. లైబ్రేరియన్లకు అన్ని వర్గాల ప్రజలతోనూ పనికలుగుతూ వుంటుంది. ఇలాంటి సమయంలో యథాశక్తి సాయపడటానికి వారికి మంచి అవకాశాలున్నాయి. ప్రజల్లో చైతన్యం కల్గించడం తక్షణ కర్తవ్యం ఇందుకు లైబ్రేరియన్లు బాగా ఉపకరిస్తారు. రక్షణ కృషినిగూర్చి దైనందిన పరిణామాలను గూర్చి వారు ప్రజలకు తెలియజేయాలి.

విజ్ఞాన విషయాలను ప్రజలకు తెలియపరచడంలో గ్రంథాలయాలు కీలకపాత్ర వహిస్తాయి పుస్తకాలు, కరపత్రాలు, వ్రాతప్రతులు అచ్చుప్రతులను, సేకరించి, వాటిని పదిలపరచి లైబ్రేరియనులు మన నాగరికతా సౌధానికి పునాదులు వేశారు. భావి సౌధ నిర్మాణానికి నేడువారు అనేక విధాలుగా తోడ్పడగలరు. రక్షణ కృషిని గూర్చి ప్రజలకు వివరంగా తెలియజేయడం వారి తక్షణ కర్తవ్యం. అదనపు ఖర్చు లేకుండానే తన గ్రంథాలయంలో వున్న పుస్తకాలు, కరపత్రాలు, చిత్రపటాలు, స్లైడ్సు మున్నగువాటి సహాయంతో ప్రజలకు అన్ని విషయాలు తెలియచేయడానికి అతనికి సులభసాధ్యమవుతుంది.

లైబ్రేరియనులు రక్షణ కృషిని గూర్చి తెలిపే పుస్తకాలను, తత్సంబంధమైన ఇతర సాహిత్యాన్ని సేకరించి, సాధ్యమైనంత మందికి వాటిని లభింపజేయాలి. ఇలాంటి పుస్తకాలకూ, ప్రజలకూ మధ్య వారు సంధాన కర్తలుగా వ్యవహరించాలి. స్వయంగా గ్రంథాలయానికి వచ్చి పుస్తకాలు తీసుకునే వీలులేని వారికి ఇలాంటి పుస్తకాలను అందజేస్తే, వారి కార్యదీక్ష ప్రశంసాపాత్రమవుతుంది.

ఇంతవరకూ యుద్ధాన్ని గురించి, యుద్ధ కృషిని గురించిన పుస్తకాలు చాలా పరిమితంగా వున్నాయి. కనుక, యుద్ధ కృషికి తోడ్పడగలందులకై అనువైన సాహిత్య రచన కొనసాగించడానికి లైబ్రేరియనులు రచయితలను ప్రోత్సహించాలి. యుద్ధ కృషిని గూర్చి ఇంతవరకు వెలువడిన పుస్తకాల జాబితాను తయారుచేసి, దానిని గ్రంథాలయంలో ప్రదర్శించాలి.

అయితే కేవలం ఇలాంటి జాబితా పదిమంది దృష్టిలో పడకపోవచ్చు. కనుక తత్సంబంధమైన యితర విషయాలపై వున్న పుస్తకాలను అంటే వ్యవసాయ వుత్పత్తి, నేషనల్ సేవింగ్సు మున్నగు వివిధ సబ్జెక్టులపైన పుస్తకాల జాబితాలను కూడా తయారుచేసి ప్రజలకు అందుబాటులో వుంచినట్లయితే, వారికి ఈ విషయాల పైన ఆసక్తి కలుగుతుంది.

గ్రంథాలయ భవనాలలో ఇలాంటి పుస్తకాలను అందరికీ కనబడేటట్లు ప్రదర్శించినట్లయితే గ్రంథాలయానికి అరుదుగా వచ్చే చదువరులకు కూడా ఈ ప్రదర్శనలో గల ఉద్దేశం అవగతమవుతుంది. చదువరుల దృష్టిని ఆకర్షించడమే వీటి ఉద్దేశం. వీటిని గ్రంథాలయ ఆవరణ బైటకూడా తరచుగా ప్రదర్శిచడం అవసరం.

రాష్ట్రంలోని కొన్ని గ్రంథాలయాలలో 16 యం. యం. ఫిల్ము ప్రొజెక్టర్లు 35 యం. యం. ఫిల్ము స్ట్రిప్ ప్రొజెక్టర్లు రేడియోలు, టేప్ – రికార్డర్లు మున్నగు ఆధునిక దృక్–శ్రవణ పరికరాలు కూడా వున్నాయి. ఇవేగాక స్లైడ్లు, పోస్టర్లు చిత్రపటాలు కూడా వున్నాయి. అత్యయిక పరిస్థితిలో ఇవన్నీ అవసరమవుతాయి కనుక వీటి నన్నింటిని తరచుగా ఉపయోగిస్తూ వుండాలి,

భారత ప్రభుత్వం యుద్ధాన్ని గురించి,యుద్ధ కృషినిగురించి కొన్ని 16 యం. యం. ఫిల్ములు తయారుచేసింది. వాటిని అప్పుడప్పుడూ ప్రదర్శించినట్లయితే, ఇవి యుద్ధకృషికి తోడ్పడుతాయి. యుద్ధంవల్ల కలిగే కష్టనష్టాలు, సైనికుల వీరోచిత కృత్యాలు, యుద్ధానికి సంబంధించిన యితర విషయాల్ని గూర్చిన సందేశాన్ని ప్రజలకు తెలియజేసేందుకై ఉన్నత ప్రమాణంగల చలనచిత్రాలు కూడా నిర్మించబడుతున్నాయి. దేశంలో ప్రజల నైతికస్థాయికి ఉత్తేజం కల్గించి యుద్ధకాల ఆర్థిక పరిస్థితికి సంబంధించిన సమస్యల్ని వివరిస్తూ కొన్ని చిత్రాలు యిదివరకే తయారైనాయి. 16 యం. యం. ప్రొజెక్టర్లుగల గ్రంథాలయాలు తరచుగా ఇలాంటి చిత్రాలను అరువుకు తెచ్చుకొని ప్రజలకు చూపించాలి. హైదరాబాదు ఖైరతాబాదులోనిభారత ప్రభుత్వ సమాచార బ్రాడ్కాస్టింగు మంత్రిత్వ శాఖ తాలూకు ఫిల్మ్ డివిజనులో ఈ చలనచిత్రాలు లభిస్తాయి. ప్రదర్శనకై ఉచితంగా వీటిని అరువుకు తీసుకోవచ్చు. ఈ విషయంలో ఇతర వివరాలను సమాచార పౌర సంబంధాల శాఖ డైరెక్టరునుంచి పొందవచ్చు. వ్యాయామం, యన్.సి.సి., ఎ. సి. సి. వగైరా విషయాలనుగూర్చికూడా అనేక చలనచిత్రాలు వున్నాయి. విద్యార్థులకొరకై గ్రంథాలయాలలో వీటిని తరచుగా ప్రదర్శించ వచ్చు.

16 యం. యం. ఫిల్ములకంటే గాజు స్లైడ్సు ఫిల్ము స్లైడ్సులకు ఖర్చు తక్కువవుతుంది. చలనచిత్ర ప్రదర్శనల్లో వీటిని ఉపయోగించడం సులభం. "తక్కువ మాట్లాడండి, ఎక్కువ కృషి చేయండి". "పుకార్లు వినవద్దు, పుకార్లను వ్యాపింప చేయవద్దు" వస్తువులను అధికంగా ఉత్పత్తి చేసి అవసరాలను తగ్గించుకోండి' మున్నగు నినాదాలను గాజు స్లైడ్సుపైన రంగురంగుల సిరాతో వ్రాసి, వాటిని ప్రొజెక్టరు ద్వారా ప్రదర్శించేట్లయితే ప్రేక్షకులకు ఆకర్షణీయంగా వుంటుంది. వీటిసహాయంతో "సెప్టెంబరు 8వ తేదీనాటి రేఖ", "వాస్తవాధీన రేఖ" మున్నగు విషయాలనుగూర్చి గల సందేహాలను నివృత్తి చేయవచ్చు.

ప్రజల దృష్టిని ఆకర్షించేందుకు సాధ్యమయిన చోట్లలో సచిత్రప్రదర్శనాలను ఏర్పాటు

చేయడం మంచిది. సచిత్ర ప్రదర్శనాలకు ఒక ప్రత్యేకతవుంది. వీటివల్ల ప్రజలకు మోజు కలుగుతుంది. యుద్ధకృషిని గూర్చి ప్రజలకు నచ్చచెప్పడానికి జాగ్రత్తగా ఎన్నుకోబడిన వివిధ సచిత్ర పటాలు ఎంతగానో తోడ్పడుతాయి.

మానవ శక్తికి మించిన సాహస కృత్యాలను మన జవానులు ప్రదర్శించారనేది అందరికీ తెలిసినదే. ఇలాంటి సాహస కృత్యాలను చిత్రీకరించే పటాలను యుద్ధకృషికి సంబంధించిన వాటినీ తప్పకుండా వుపయోగించాలి. ఇవి మన అభిప్రాయాలకు ఒక స్వరూపం కలిగిస్తాయి. ఆలోచనా శక్తికి ప్రాతిపదిక కలిగిస్తాయి. గ్రామీణ ప్రాంతాలలో యుద్ధ చిత్రాలను తరుచుగా ప్రదర్శిస్తూ వుండాలి.

ప్రజలకు వాస్తవిక విషయాలు తెలియజేయడానికి మ్యాపులు చాల సహాయపడుతాయి 1959 సం॥లో భారత, చైనా దేశాల ఆధీనంలోగల రేఖల విషయమై చాలామంది ప్రజలకు సరిగా తెలియదు 1962 సెప్టెంబరు 8 వ తేదీనాటి రేఖ సుస్పష్టంగావుంది. చైనా వారి "ప్రత్యక్షఆధీనరేఖ" ముందుకూ వెనక్కూ జరిగేవిధంగా వుంది. చైనావారి "ప్రత్యక్ష అధీనరేఖ" వాస్తవికంగాచూస్తే చాలా గందరగోళంగావుంది. మ్యాపుల సహాయంతో ప్రజలకు 'ఈ విషయాన్నిగూర్చి సులభంగా అర్థమయ్యేట్లు తెలుపవచ్చు.

అత్యయిక పరిస్థితిలో పోస్టర్లు విరివిగా వాడవచ్చు ప్రజలదృష్టిని ఆకర్షించడానికి. తక్షణ కాలంలో ఏదైనా ఒక సందేశాన్ని తెలపడానికి పోస్టర్లు వుద్దేశింప బడ్డాయి. ఒకసారి చూస్తే దాని భావమేమిటో నిక్కచ్చిగా తెలపడమే పోస్టర్ల ప్రధానోద్దేశం, ప్రభుత్వంయుద్ధ కృషిని తెలిపేపోస్టర్లను భారీ సంఖ్యలో పంపిణీ చేస్తున్నది. గ్రంథాలయాల్లో వీటిని ప్రముఖంగా ప్రదర్శించాలి.

నల్లబల్లను సక్రమంగా ఉపయోగించేట్లయితే ఎన్నో విషయాలను సులభంగా తెలుపవచ్చు. తాజా వార్తలు వ్రాయడానికి నల్లబల్లను ఉపయోగించవచ్చు.

రాష్ట్రంలో అనేక గ్రంథాలయాలలో రేడియోలు వున్నాయి. ప్రజలు ఆలిండియా రేడియో ప్రసార కార్యక్రమాలు వినేందుకు వీలుగా, గ్రంథాలయాలు అవసరమైన ఏర్పాట్లు చేయాలి. వీటిలో ముఖ్యమైన కార్యక్రమాల్ని రికార్డుచేసి, అవసరమైనపుడు తిరిగి వీటిని వుపయోగించవచ్చు. ఈ కార్యక్రమాల్ని సక్రమంగాఉపయోగించేట్లయితే, ప్రజలకుసరిహద్దు పరిణామాలు, తదితర విషయాలను గూర్చి తాజా సమాచారం తెలుస్తుంది.

గ్రంథాలయంలో జాతీయ అత్యయిక పరిస్థితిని గూర్చి, తత్సంబంధమైన విషయాలను గూర్చి, ఉపన్యాసాలు ఏర్పాటు చేయాలి. ఈ ఉపన్యాసాలు వినడానికి స్కూలుపిల్లలు, ఇతరులను ఆహ్వానించ వచ్చు. గ్రంథాలయములోనే గాక వెలుపల కూడా ఇలాంటి ఉపన్యాసాల్ని ఏర్పాటు చేయాలి ఇట్టిసమావేశాల్లో కొన్ని సలహాలివ్వడం జరుగుతుంది. ఇట్టి సందర్భాలు లేకపోతే, ఇవి విని అవకాశం లేకపోవచ్చు. లైబ్రేరియనుకూ, ప్రజలకూ మధ్య వ్యక్తిగతమైన సంబంధానికి అధిక ప్రాధాన్యత వుండాలి. ప్రస్తుత క్లిష్టపరిస్థితిలో ఇది మరీ అవసరం యుద్ధకృషిని, వ్యవసాయోత్పత్తి, రక్షణనిధికి విరాళం నేషనల్ సేవింగ్సు మున్నగు విషయాలను గూర్చి ఉపన్యాసాలివ్వవలసిందిగా నిపుణులను ఆహ్వానించవచ్చు.

పబ్లిక్ లైబ్రరీ ఒక సమాచార కేంద్రం వంటిది ప్రస్తుత అత్యాయిక పరిస్థితిని గూర్చి ప్రజలు అడిగే విచారణలకు సమాధానాలు యివ్వాలి. ఇలా జరగటం మంచి ఫలితాలకు దారితీస్తుంది. ఈ విధంగావచ్చే విచారణలన్నింటనీ సేకరించి వాటిని పరిశీలించాలి. జాతీయ పరిస్థితి మూలకంగా ఉత్పన్నమయ్యే ప్రత్యేక విచారణలకు సరియైన సమాధానా లివ్వడానికి గ్రంథాలయాలు కృషిచేయాల్సి వుంటాయి. లైబ్రేరియన్ చాలా జాగ్రత్తగా వచ్చే ప్రశ్నలకు సమాధానాలివ్వాలి.

సరిహద్దు పరిణామాలు, చైనా యుద్ధ విరమణ ప్రతిపాదనలు మున్నగువాటిని గూర్చి ఇంతవరకు చేసిన ప్రచారం తగినంతగా లేదని చెప్పబడుతున్నది. నేడు లైబ్రేరియన్ నిర్వర్తించవలసిన వృత్తి ధర్మాలలో ప్రచారమనేది కూడావుంది. అతను యుద్ధకృషికి ప్రచారంతో పాటు అన్ని విధాలుగా తన విస్తృత విధులను సక్రమంగా నిర్వహించాలి. "ప్రచారం వల్ల లాభముంది" అనేది ఇంచుమించు ఒక సామెత అయింది. ప్రచారం సక్రమ మార్గంలో కొనసాగునంతవరకు దాన్ని యెవరూ కాదనలేరు. పోస్టర్లు, కరపత్రాలు, మ్యాగజైనులు మున్నగువాటి ద్వారా సరిహద్దు సమస్యలను గూర్చి ఇతరులకు నేరుగా నచ్చచెప్పే విధంగా ప్రసారాన్ని కొనసాగించాలి. చేసే ప్రచారం నిర్దుష్టంగా వుండాలి ఒక ప్రత్యేకమైన వర్గంకాక సంఘానికి ఉపకరించే విధంగా వుండాలి.

యుద్ధకృషిని గూర్చి ప్రజలకు తెలియచేయడం, ప్రచారం కొనసాగించడానికి తోడుగా, ప్రజల రక్షణకై ప్రతి పౌరుడు కృషిచేయడం. ఈ అత్యాయిక పరిస్థితిలో చాలా అవసరం. సైనికుల కుటుంబాలు, పిల్లల యోగక్షేమాలు విచారించేందుకు లైబ్రేరియన్లూ, గ్రంథాలయోద్యోగులూ కలసి గ్రంథాలయోద్యోగుల రక్షణ సంక్షేమ సంఘాలుగా ఏర్పడవచ్చు. వారు సైనికుల ఇండ్లను అప్పుడప్పుడూ జట్లుజట్లుగా సందర్శించి. సైనికుల కుటుంబాల సంక్షేమ కార్యకలాపాలను కొనసాగించవచ్చు. సాంస్కృతిక కార్యక్రమాలు యేర్పాటుచేయబడినపుడు సైనికుల పిల్లలనూ, వారి పైన ఆధారపడిన వారిని గ్రంథాలయాలకు రమ్మని ఆహ్వానించవచ్చు. వారికి అనువైన పుస్తకాలను సకాలంలో సరఫరా చేయాలి. యుద్ధరంగంలో పాల్గొంటున్న సైనికుల ఉపయోగార్థం ప్రజల నుంచి పుస్తకాలూ, వారపత్రికలూ వగైరా సేకరించాలి. జవానుల కొరకు రక్తదానం చేయవలసిందిగా ప్రజలను ప్రోత్సహించాలి.

ట్రాఫిక్, సాయుధపోలీసు దళాలవిధులను నిర్వర్తించేందుకు ప్రతి పట్టణంలో హోంగార్డులను ఏర్పాటు చేయాలని భారత ప్రభుత్వం సంకల్పిస్తున్నది. ప్రభుత్వంనుంచి పిలుపు వచ్చినట్లయితే, ఈ సంస్థల్లో చేరడానికి లైబ్రేరియనులు సిద్ధంగా వుండాలి. అవసరమైతే రైఫిల్ కాల్చడం, ప్రథమచికిత్స, అగ్నిమాపకం, విమానదాడినుంచి రక్షణ మున్నగు విషయాలలో వారు శిక్షణ పొందాలి.

లైబ్రేరియనులకు ప్రజలతో అనుదినం ప్రత్యక్ష సంబంధముంటుంది. కనుక జాతీయ రక్షణనిధికి ఉదారంగా విరాళాలివ్వవలసిందని వారిని ప్రోత్సహించవచ్చు. రక్షణ నిధి సేకరణకై బహుళ ప్రచారంలో వారు జిల్లాలో కలెక్టర్లకూ, ఇతర అధికారులకు సాయపడాలి. తమ జీతంలో కొంత శాతం ప్రతి నెలారక్షణ నిధికై ప్రత్యేకించి, తద్వారా కూడా వారు ప్రభుత్వానికి తోడ్పడవచ్చు. కొంతమంది లైబ్రేరియనులు ఇదివరకే రక్షణనిధికై విరాళా

లిచ్చారు. యుద్ధకాలంలో ప్రజల ధైర్యస్థైర్యాన్ని నిలబెట్టడం చాలా ముఖ్యమైన విషయమని వారు గ్రహించాలి. ఈ విధంగా వారు ప్రజలను ప్రోత్సహించేట్లయితే, గణనీయమైన కృషి చేసినవారు అవుతారు. తప్పుడు వార్తలనూ, పుకార్లనూ విశ్వసించకూడదని వారు ప్రజలను హెచ్చరిస్తూ వుండాలి.

లైబ్రేరియనులు ధరల స్థిరీకరణకు వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తులు అధికం చేయడం ఒకటే మార్గమని ప్రజలు గ్రహించేట్లు చేయాలి. ప్రజలు పొదుపరితనాన్ని అలవాటు చేసుకొని దుబారా ఖర్చును తగ్గించడానికి వారిని ప్రోత్సహించవచ్చు. దేహదారుఢ్యంగల వారందరూ సైన్యంలో చేరాలని ప్రోత్సహించవచ్చు. రైతులు అధికోత్పత్తి సాధించడానికిగాను వారికి అనువైన సాహిత్యాన్ని అందచేయాలి. ప్రతి యింటిలో కూరగాయలు పండించాలని వారు ప్రజలకు నచ్చచెప్పాలి.

అత్యయిక పరిస్థితిలో లైబ్రేరియనులు తమ విధులు నిర్వహించడానికి ఇవి కొన్ని సలహాలు మాత్రమే. లైబ్రేరియన్ తన గ్రంథాలయంలో వున్న సాధన సంపత్తిని సక్రమంగా వినియోగించుకొని యుద్ధాన్ని గూర్చి వివిధ పద్ధతులను వివిధ విషయాలను గూర్చి ప్రజలకు తెలియ చేయగలడు. గ్రంథాలయం చేసే సేవనూ, కలిగించే సౌకర్యాలనూ బట్టి దానిపట్ల ప్రజలకు అభిరుచి ఏర్పడుతుంది. కనుక లైబ్రేరియనులు ఈ క్లిష్టపరిస్థితిలో, తమ ఆధీనంలోవున్న వసతి సౌకర్యాలను ఆకళింపు చేసుకొని వాటిని ప్రజోపయోగార్థం వినియోగించడానికి యథాశక్తి కృషిచేయాలి. యుద్ధకాలంలో ప్రజలతో సహకరించి తమ విధ్యుక్త ధర్మాలను సమర్థవంతంగా నిర్వహించాలి. లైబ్రేరియనులు ఈ రోజులలో ప్రజల మిత్రునిగాను, వేదాంత్య మార్గదర్శకునిగాను వ్యవహరించాలని వారు గుర్తు వుంచుకోవాలి.

---

శ్రీకరంబును, విబుధ వశీకరంబు
పూజితంబును సత్కవిరాజితంబు
భాసితంబును, విజ్ఞానవాసితంబు
శారదా దేవి పీఠంబు సంస్తుతింతు.

అది సమస్త జనాదరణైక సంస్థ
ఉన్నతంబు, నుదారంబు, నుజ్జ్వలంబు,
ఉత్తమోత్తము, ముత్కృష్ట ముచితపఠన
మందిరం బెన్న సర్వాంగ సుందరంబు.

గ్రంథనిలయంబు జాతివజ్రంబువోలె,
స్వప్రకాశంబు సహజంబు స్వచ్ఛతరము;
ప్రబల గాంధాంధకారంబు పాఱదోలి
దివ్యకాంతుల వెదజల్లి తేజరిల్లు.

పుస్తకాలయ మా విరాట్పురుషు లీల
అప్రమేయ, మనంతంబు, నచ్యుతంబు;
అదిస్వయంభువు - తనుదానె ఉదయమంది
విశ్వరూపము ధరియించి వెలయుచుండు.

---

# గ్రంథాలయోపయోగాలు — ఉత్తమ పఠనా స్వభావం

శాస్త్రి వెంకటనరసింహయ్య



"యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్లు మనసులోని భావనలను బట్టియే మనజీవిత నిర్మాణము జరుగుచుండును. శ్రీకృష్ణుడు భగవద్గీతలో అర్జునుని సంబోధించి

"యంయం వాపిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరం తంతమే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః"

అని భావనాశక్తి మహత్తరమైనదనియు దానిని బట్టియే పునర్జన్మకూడ ఏర్పడుచుండుననియు చెప్పియున్నారు. ఎల్ల సమయములందు డిటెక్టివు నవలలను చదువుచున్న యువకుడొకడు అమెరికా దేశమందు డిటెక్టివ్ వలె అనుకరణ జేయుచు తనయొక్క తల్లిని పిస్తోలుతో కాల్చి చంపినట్లు పత్రికలలో మనము చదివియున్నాము కూచిపూడి నాటక సమాజములో నొకప్పుడు నృసింహావతారము ధరించిన వాడు హిరణ్యకశిపు వేషము ధరించినవానిని ఉద్రేకములో రొమ్ము బద్దలుగా చీల్చినట్లును, ఆయన చనిపోయినట్లును వినియున్నాము

బోయవాడొకడు ముని వేషము ధరించి తపస్సు జేయుచున్నట్లు నటించెను. పక్షులు విశ్వసించి అతనిపైవ్రాలెను. వానిని పట్టి తినగోరి ఆ వేషము ధరించిన ఆ బోయవాడు వానిని విడచి నిజముగా సన్యాసి యయ్యెను "వేషమును ధరించినంత మాత్రముననే ఈ పక్షులు నన్ను నమ్మినవి. నిజముగా 'మునిని' యగుదో నే నెంత ధన్యుడనగుదునో కదా" యనియాతడు తలంచెను. వేమనయోగి, "చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా, భాండశుద్ధిలేని పాకమేల" యని సంఘాన్ని ప్రశ్నించెను. కాన జీవితమునకు హృదయ పవిత్రత. అత్యావసరము యువకులు పవిత్ర భావసము పేతులై దేశభక్తులు కావలయును.

గ్రంథాలయాధికారి పాఠకులలో పెద్దవారిని గౌరవించుచు, చిన్న వారిని సోదరులనుగా భావించుచుండవలెను. భాండాగారి భిన్న మనస్తత్వముగలవారైనపాఠకులను పొందుచుండును కొందరు నిరుపయోగకరమైన గ్రంథ సమూహమును చదువుచు కాలమును వ్యర్థముగా గడుపుచుందురు. చెడ్డ విషయములు తొందరగా అలవడుట సహజము కాబట్టి, దానికి లోబడిపోవుదురు. త్రాగుడు జూదము మున్నగు చెడులు అలవడునట్లు చెడు పుస్తకాలను చదువుట కూడ అలవడును. అంటట జీవితము పతనమగును.

సంఘమునకు నష్టము కలిగించు గ్రంథములు గ్రంథాలయములందుంచకూడదు. ఎల్లప్పుడు కథా సాహిత్యమును చదువువారు క్రమ క్రమముగా అంతకన్నను మహత్తరములైన గ్రంథములను చదువుటకు ప్రయత్నింపవలయును. భాండాగారి, పాఠకుల చిత్తవృత్తులను గుర్తించుచువారిని మొదట గ్రంథపఠనాసక్తులనుగ తయారు చేయుచు, తరువాత ఉత్తమసాహిత్య పఠనాసక్తులనుగా వారిని తయారుచేయవలయును. గురువు విద్యార్థులను తయారుచేయునట్లు, పాఠకులను భాండాగారి తయారుచేయవలయును. భాండాగారి సద్గుణములను కలిగియుండి తన పరిచయముచే పాఠకులు, దేశభక్తులు, దైవభక్తులు అగునట్లు ప్రయత్నింపవలయును. పుస్తక పఠనము పూత జీవిత సంధాయకము.

సరసమంజుల కథాసల్లాపములతోడ
నొకమాఱు చిత్తమ్ము నూఁపు దీవు
జీవిత చరితముల్ చేదోడుగా నిల్చి
మహనీయ నీతులన్ మనుతనీవు
విజ్ఞానదాయక పనుల బోధలచేతఁ
బ్రజ్ఞా విశేషముల్ పలుకు దీవు
నవరస మాధురీ నానార్థ కల్పన
నొప్పుచు నానంద మొసఁగు దీవు

విశ్వ భూగోళ మండలి విషయజాల
మంతయునుగూడ నీయందు నమరియుండు
సర్వజనముల హితమ నీసద్వ్రతమ్ము
పూత చారిత్ర నికురంబ! పుస్తకంబ!

చిత్తము శాంతతన్ విడచి జీర్ణతనూభవరోగ
రాజి నా
యత్తముగాక మానవుఁడు హా! యని దుఃఖము
నొందునప్పుడున్
పొత్తమ! నీవయాతనికిఁ బోవని మిత్రమవై
హితమ్ము లా
సత్తిని దెల్పుచుండెదవు సాత్విక వృత్తిని
తృప్తినిచ్చుచున్

భూత వర్తమానమ్ముల ఖ్యాత పురుష
బోధలన్నియు నీయందుఁ బొందగలము
మూఁడుకాలమ్ములందును ముదమునిచ్చు
సత్య శివసుందరమ్మగు సత్తువీవ

గ్రామ గ్రామమ్మున గ్రంథాలయమ్ములు
విద్యాలయమ్ములు విస్తరిల్ల
భవనంబు లన్నింట వయసు వచ్చినవార
లక్షరాభ్యాసంపు శిక్షనంద
సంస్కృతి రక్షయు సద్గ్రంథ పఠనంబు
నిర్మాణ కృషియును నేర్పమీఱ
మహిళాది జాతుల మానిత స్వత్వంబు
విజ్ఞాన యాత్రలు వెల్లివిరియ

మూఁడుకోట్ల తెలుంగు సైదోడులార!
నవ్య సందేశ ధర్మంబు భవ్య ఫణితి
నాచరింపంగఁ జేయుఁడీ యమలులార।
సుజన మార్గంబు వీడనిసూరులార!

కాలముయొక్క విలువను గుర్తించి నడుచుకొనవలయును. పోయిన సంపదను మరల సంపాదింపవచ్చును. కాని పోయినకాలమును జీవితమునందు మరల సంపాదింపలేము "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అన్నట్లు ప్రతి క్షణమున విద్యనుసంపాదించుటకు ప్రయత్నింపవలయును. అట్లే ప్రతిక్షణమును పోనీయక ధన మార్జింపవలయును. "అన్నేన క్షణికా తృప్తిః యావజ్జీవంతు విద్యయా" అన్న దానముచే క్షణకాలము తృప్తి నీయగలము కాని విద్యా దానముచే జీవితపర్యంతము తృప్తినికలిగింపగలము. కాబట్టి నూటికి 80మంది నిరక్షరాస్యులు అనగా

విద్యా విహీనులున్న మనదేశమందు విద్యార్థులుముందుకువచ్చి విద్యలేనివారికి విద్యాదానమొనర్పవలయును. విద్య వినయమును కలిగించును. వినయముచే మంచిపౌరుడగును. పౌరులు కృషిచేసి ధనికులగుదురు. ధర్మాత్ములగుదురు. సుఖులగుదురు "ఉద్యోగినం పురుష సింహాముపైతి లక్ష్మీః" సోమరితనము మహా పాపము. దానిని విడచి కృషిచేయువారు విజయలక్ష్మీ సంపన్నులగుదురు. విద్యాసంపన్నులే హక్కులను, బాధ్యతలను గుర్తించుకొని నడచుకొనగలరు. వోటు విలువను గుర్తింపగలరు. నిరక్షరాస్యతను నిర్మూలించుటయే నేడు భారత దేశమునకు ప్రధాన సమస్య. విద్యాజ్ఞాన భాస్కరుడు విశ్వమందు వెలుగుచు అజ్ఞానాంధకారమును సంపూర్తిగా అంత మొదించుగాత.

---

# మారుతున్న నారీలోకం

అవుల జయప్రదాదేవి.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత జాతి పురోభివృద్ధి వైపు పరుగులిడుతున్నది. స్వేచ్ఛావాయువులను ఆస్వాదించి, జీవిత విధానాలను తీర్చి దిద్దుకోవడానికి తాపత్రియ పడుతున్నది. బానిసత్వంతో మ్రగ్గిన భారతజాతిలో ప్రత్యేకంగా నారీలోకం మరింత అధః పతనం చెందింది.

అయితే పంజరం నుండి బయటపడిన పక్షుల లాగా, సంకెళ్ళను తెగ్రించుకున్న సాధుజీవుల లాగా, భయవిహ్వలలైన స్త్రీలు, తమ జీవిత పథాలకు, సరియైన నియమాలను వెదుక నారంభించారు. స్త్రీ కేవలం ఇంటిలో నాల్గు గోడల మధ్యనే మ్రగ్గ వలసిన పనిలేదు. దౌర్జన్యపూరితమైన మూఢాచారాలను, గుడ్డిగా అనుసరించ వలసిన పనిలేదని, గుర్తించ గలిగింది మహిళాలోకం.

కానీ స్త్రీలు విద్యలోనేమి, విజ్ఞానంలోనేమి ప్రపంచ జ్ఞానంలోనేమి ఎంతో వెనుకబడి ఉన్న సమయంలో, దీనికి పరిష్కారమేమిటనేదే ప్రశ్న. విజ్ఞానవంతులైన స్త్రీలు, సహృదయులైన తమ సోదరుల సహకారంతో, ముందు స్త్రీ జాతిని విద్యావంతులుగ, వివేకవంతులుగ చేయటం అతి ముఖ్యమని గ్రహించారు.

దేశంలో నలుమూలలా ప్రణాళికలు తయారైనాయి. ఎంతో ఉత్సాహంతో దేశాభ్యుదయానికి కృషిచేస్తున్నారు. మాతృస్థానముల నలంకరించి, భావిభారత సౌభాగ్యానికి, పునాదులు వేయవలసిన స్త్రీల అభ్యుదయం అతి ముఖ్యమని గుర్తించింది ప్రజానీకం దానితోనే ఈ ప్రజాస్వామ్య సిద్ధాంతాలతో, ప్రజాభ్యుదయ పథకాలలో, స్త్రీ జనోద్ధరణ ప్రారంభమైనది. వెనుకబడి ఉన్న స్త్రీలకు, సకాలంలో

తగిన విద్యా సౌకర్యము లందని స్త్రీలకు, వంచితులైన స్త్రీలకు, వసతి గృహములను, మాతా శిశుసంరక్షణ కేంద్రాలను నెలకొల్పి, వాటిల్లో వసతి సౌకర్యములతోపాటు, విద్యా సౌకర్యములుకూడా ఏర్పాటు చేయబడినవి. ఇంతేగాక సంక్షిప్త విద్యా విధానముల ననుసరించి ఈ స్త్రీలకై ప్రత్యేకంగా శిక్షణ ఏర్పాటు చేయబడినది. ఎందరో స్త్రీలు వీటిల్లో విద్యా ప్రాప్తిని పొందుతున్నారు. చేతి పనులు మొదలైన వృత్తి విద్యలలో కూడా తర్ఫీదు పొందుతున్నారు. యోగ్యతలను పొందిన పిమ్మట, వారు వారికి తగిన ఉద్యోగము లను పొంది, జీవనభృతిని కూడ ఏర్పరచుకొనగలుగుతున్నారు.

వాస్తవానికి నేటి దేశాభ్యుదయానికి సగానికి పైగా ఉన్న స్త్రీలను నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. ఉపాధ్యాయ వృత్తిలో, వైద్యవృత్తిలో, నర్సింగు వృత్తిలో స్త్రీలు ఎంతైనా రాణించగలరు, సహజ సిద్ధమైన కరుణామూర్తి స్త్రీమూర్తి. సహనశీల. మన భారతీయ సాంప్రదాయంతో వారు భక్తి గౌరవాలతో తమ సోదరులనూ, బిడ్డలనూ ఆరాధించగలరు. వారు నిజమైన సేవామూర్తులు.

చారిత్రికంగా చూచిన స్త్రీలు తమ దేశ సౌభాగ్యానికి, తమ సర్వస్వాన్నీ అర్పించిన విషయం మన కందరకూ విదితమే. దేశభక్తిని ఉగ్గుపాలతోపోసి, తమ బిడ్డలను దేశ సేవా పరులనుగా చేసి వీరులను తయారు చేసినది స్త్రీ జాతియే. నాడు జిజియాబాయి మొదలైన వీరమాతలు తమ బిడ్డలను దేశ భక్తులుగా రూపొందించి మహా వీరులుగా తయారుచేశారు. రాణీ రుద్రమ, మల్లమ్మ, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలైన వీర నారీమణులు, తమ దేశములను కాపాడుకొనుటకే అసువులను బాశారు. స్వాతంత్ర్య సముపార్జనలో బాపూజీకి బాసటగా నిలచి స్వాతంత్ర్య సమరంలో భర్తతోపాటు అష్టకష్టాలకు గురియైన కస్తూర్బాను మనం చూచే ఉన్నాము. ఎండ కన్నెరుగని సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్ మొదలైనవారందరూ దేశమునకంకితమైనవిషయం మరవరానిది. ఇంకెందరో మహిళామణులు త్యాగం చేసి సంపాదించినస్వాతంత్ర్యమును, రక్షించుకోవలసిన అవసరం, బాధ్యత నేటి మహిళలపై ఎంతైనా ఉన్నది.

స్త్రీ గృహిణిగా, సోదరిగా, తల్లిగా తమ కర్తవ్యాలను నెరవేర్చుకొంటూనే, దేశ రక్షణకు, దేశ సౌభాగ్యానికి, పురుషునికి తోడు నీడగా కృషి సల్పటంలో ఏమరుపాటు ఉండకూడదు. ఎక్కడ చూచినా దేశరక్షణకు కావలసిన ఏర్పాట్లు చేయబడుతున్నవి. ఒక ఆర్థికంగానే కాదు వివిధ రూపాల్లో సేవచేయవలసిన అవసరం ఎంతోఉంది. అందుకనే స్త్రీలకు, ప్రథమ చికిత్స, హోమ్‌నర్సింగు మొదలైన వాటిల్లో తర్ఫీదు నివ్వడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రతి స్త్రీ ఏమాత్రమైనా తీరికను కల్పించుకొని ఈ శిక్షణలో చేరి తగువిధంగా తర్ఫీదు నందడం దేశానికెంతో అవసరం. తమ తమ తీరిక వేళల్లో అహోరాత్రులు మన సరిహద్దులు కాపాడుతున్న మన జవానులకు కావలసిన దుస్తులు మొదలైన వాటిని తయారు చేయడంలో స్త్రీలెంతో శ్రద్ధచూపుతున్నారు. స్త్రీలు పురుషులు ఒకరికొకరు సహకారభావాలతో, దేశాభ్యుదయానికి ముందంజవేస్తే నేడు మనకు ప్రత్యక్షమై ఉన్న ఒక్కటైనా సమస్య కాదు సమస్తమానవాళి సమస్యలే పరిష్కారము కాగలవు. శాంతియుత సహజీవనము సుస్థిరపడగలదు.



# సాధారణ సభ్యులు



శ్రీ పూజేటి వెంకటేశ్వర్లు
దేవి ఫ్యాన్సీ స్టోర్సు



శ్రీ తాటికొండ రంగారావు
ఫ్యాన్సీ షాప్



శ్రీ బచ్చు వెంకటరంగం
ఫొటో ఫ్రేమింగ్ వర్క్సు



శ్రీ పసుమర్తి వెంకటేశ్వర్లు
కుసుమహరనాథ్ ఫ్యాన్సీ షాప్

# సాధారణ సభ్యులు



శ్రీ చేబ్రోలు సుబ్బారావు
ప్రసాద్ ఫ్యాన్సీమార్టు





శ్రీ కబళా లక్ష్మయ్య
పద్మా ఫ్యాన్సీ స్టోర్సు



శ్రీ అరవపల్లి మల్లికార్జునరావు
రాజపోషకులు
హనుమాన్ ఫ్యాన్సీమార్టు





శ్రీ కొప్పరావూరి సుబ్బారావు.
రామారావు
ఆంధ్రా ఫ్యాన్సీమార్టు

# సాధారణ సభ్యులు



శ్రీ కొత్తమాసు ఆంజనేయులు
కిరాణా మర్చంట్సు



శ్రీ శిఖాకొల్లి రామారావు
కిరాణా మర్చంట్సు



శ్రీ తడికమళ్ళ చెన్నకేశవులు
టుబాకో మర్చంట్సు



శ్రీ దివ్వెల విశ్వనాధం
ధర్మదాత – పోషకులు

## సాధారణ సభ్యులు



శ్రీ కనమర్లపూడి వెంకటేశ్వర్లు
ధనలక్ష్మీ మెడికల్ స్టోర్సు



శ్రీ తాటికొండ ఆంజనేయులు
మెడికల్ షాప్



శ్రీ మద్దీ పున్నారావు
పాత్రసామానుల వ్యాపారం



శ్రీ సావా శ్రీరామమూర్తి
పాత్రసామానుల వ్యాపారం

## సాధారణ సభ్యులు



**శ్రీ అడ్డగాళ్ల పుల్లారావు**
నాగార్జున సిల్కు హౌస్



**శ్రీ దేవిశెట్టి వీరవసంతరావు**
క్లాత్ మర్చంట్సు



**శ్రీ ప్రగడ రాములు**
శ్రీనివాస సిల్కు హౌస్



**శ్రీ గుద్దంటి వెంకటేశ్వర్లు**
క్లాత్ మర్చంట్సు



దివ్వేల కృష్ణమూర్తి, కొత్తూరి కోటయ్య, కొత్తూరి వెంకటరావు
హార్డువేర్ మర్చంట్సు.



కార్యకర్తలు

**శ్రీ పొత్తూరి నరసింహారావు**

కా. ని. సభ్యులు 1951-60 గ్రం. అ. 51-60.



సాధారణ సభ్యులు

**శ్రీ బచ్చు రాంభొట్లు**





సాధారణ సభ్యులు

**శ్రీ మురారిశెట్టి వెంకట పుల్లారావు**

శ్రీ రామా వస్త్రాలయం



శ్రీ గ్రంధి రామయ్యగారి కొమారుడు
సుబ్బారావు
రైస్ మర్చంటు





కీ॥ శే॥ బచ్చు వెంకటసుబ్బయ్యగారు

శ్రీ శ్రీ శ్రీ

# వాసవీ కన్యకా ధర్మసంఘ రజత జయంతి ప్రశంసాపద్యములు

(శ్రీ) వాసవీ కటాక్షము
ప్రోవయి మీ ధర్మసంఘమును నిత్యము వి
ద్యావృద్ధికి గోరక్షకు
త్రోవలు కల్పించి సతముఁ బ్రోచును గాతన్

వాసవీ కన్య కార్యసేవా ప్రసక్త
ధర్మసంఘమ! నీ జన్మ ధన్యమయ్యె
జ్ఞానపథమున నడపు ప్రచార మొకటి
ప్రాత గోరక్ష యొనరించు పుణ్యమొకఁడు

సుజనులు నడవఁగ జాగితి
రజత జయంతికి మనోహరముగ నిలచి నీ
విజయధ్వజ మెత్తితివా
ప్రజల జయధ్వానమంది ప్రబలుము యింకన్

వాసవీ భక్తులగు నార్యవైశ్యులార
ధార్మికాగ్రణులార! యుదారులార
పుణ్యకార్యపరాయణ పూర్ణులార
సారములమూట మీ చిల్కలూరిపేట.

కాలముతీరు, మానవ వికాసము సౌరు, తలంచి నేడు శ్ర
ద్ధాలత ప్రాయ నూడిగము భారత జాతి కొనర్చుచున్న
క్కాలము శీలమున్ మనుజ గౌరవమున్ సఫలంబు నందె భా
షా లలితాంగి యుంగనుల, సర్వశుభంబులు దోయిలింపఁగన్

కూర్చిన సౌఖ్యముం, బసిఁడి కొండలు నాశము నందుగాని, చే
కూర్చిన ధర్మకర్మ నరకోటికిఁ గీర్తి విశిష్ట మోక్షముం
గూర్చును శాశ్వతంబుగ నకుంఠిత గౌరవమున్ ఘటించు దై
వార్చన సత్యమార్గము మహాత్ముఁడు తెల్పిన దిద్దియే గదా!

పుస్తకాలయాది ప్రముఖ కార్యంబును । సలుపుచున్న నీకు జయము జయము
శ్రావ్య భవ్య దివ్య నవ్య మార్గంబులఁ । జాటుచున్న నీకు జయము జయము.

రచయిత :- దావూదు.

# గ్రంథాలయోద్యమ చరిత్ర

గ్రంథాలయశాస్త్ర విశారద, గ్రంథాలయోద్ధారక,
గ్రంథాలయ పితామహ
శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు

ఉద్యమములలోకెల్ల మూలకందముగ నున్నది. ఉద్యమము లన్నింటికి జీవదాయకమైనది. గ్రంథాలయోద్యమము అభివృద్ధిదాయకములగు విషయములన్నియు పాశ్చాత్యసంసర్గము కలిగిన పిమ్మటనే మన దేశమునందు ఆవిర్భవించినవని, చాలమంది తలంపు. అయితే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు మాత్రము ఈ భావము బొత్తిగా అన్వయింపదు.

ఆంగ్లేయభాషా సంపర్కము, ఆంగ్లేయ సాంప్రదాయ సంసర్గము, ఏమాత్రమును అలవరచుకొనని వజ్రోత్సాహులగు యువకుల వలననే ఈయుద్యమము ఆంధ్రదేశమందు జనించి వ్యాపించినది. ఈ యుద్యమమును స్వయంభువు అని చెప్పిన అతిశయోక్తి కానేరదు.

ఆంధ్రభాషకు అచ్చు అక్షరములు 1806 వ సంవత్సరమున తయారై 1834 న ఆంధ్ర గ్రంథములు అచ్చుపడుటకు ప్రారంభమాయెను.

18 6 వ సంవత్సరమున విశాఖపట్నమున ఒక వీధి బడి ఉపాధ్యాయునిచే స్థాపితమైన "సరస్వతీ నిలయము" ఆంధ్రదేశమున మొట్టమొదటిసార్వజనీనిక గ్రంథాలయము, 1890లో కడపజిల్లా పులివెందులలో వెలసినది. ఈ రెండు ప్రథమ గ్రంథాలయముల పేర్లను సరస్వతీ సామ్రాజ్య అధిష్ఠాన దేవత యగు సరస్వతీదేవి పేరున నామకరణమగుట ఆంధ్రుల ప్రతిభావిశేషమే తర్వాత 1890 లోనే ఒంగోలులో ఏ. వి. ఎన్. లైబ్రరీ 1894 లో విజయనగరమున సింహాచలపతిరావు లైబ్రరీ 1895 లో భీమవరం తాలూకా వుండి గ్రామమున నౌరోజీ క్లబ్బు, 1897 లో అదే తాలూకా కుముదవల్లిలో శ్రీ వీరేశలింగ గ్రంథాలయము, 1900 లో తెనాలి తాలూకా కొల్లూరున రీడింగు క్లబ్బు, రాజమహేంద్రవరమున వీరేశలింగ పుస్తక భాండాగారము. 1904 లో తెలంగాణా యందలి హైదరాబాదు నగరమున శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయములు స్థాపింపబడినవి. పిమ్మట 1905 సం॥ న సంభవమైన వంగదేశ విభజనోద్యమ ఫలితముగ యావదాంధ్ర దేశమునను సార్వజనిక గ్రంథాలయములు పొడజూపినవి. 1911 సంవత్సరమున కృష్ణాజిల్లా బెజవాడ పట్టణమున శ్రీ రామమోహన గ్రంథాలయము స్థాపించబడినది.

1913 లో ప్రథమ ఆంధ్ర మహాసభ బాపట్ల యందు జరిగినది మొదలు ఆంధ్రులయందు

నూతన ఉత్సాహము, నూతన తేజము వికసిల్ల సాగినది. అప్పటినుండి ఆంధ్రదేశముయొక్క అన్ని ప్రాంతముల యందును గ్రంథాలయము లు, పఠనమందిరములు యువకులచే విరివిగా స్థాపింపబడినవి

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

ఆంధ్రదేశమునందు ఇట్లు బయలుదేరుచున్న వివిధ గ్రంథాలయములయందు సోదర భావ మును గలుగజేయుటకును, పరస్పర సహకార మును పెంపొందించుటకును, ధర్మ గ్రంథా లయ మహోద్యమము ఆంధ్రదేశము నందంత టను అవతరించుటకును ఈ విషయముల నన్నిం టిని ప్రచారము చేయుటకును 1914 వ సంవ త్సరమున బెజవాడ యందున్న శ్రీ రామమో హనధర్మ గ్రంథాలయ కార్యదర్శిగ నేనుప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను సమా వేశ పరచితిని. ఆ సభకు సుప్రసిద్ధ కవిశేఖరు లగు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్య క్షత వహించినారు.

కృష్ణా గోదావరి, గుంటూరు, విశాఖ పట్నము, గంజాం, నెల్లూరు, కడప, కర్నూలు బళ్ళారి జిల్లాల నుండియు తెలంగాణా నుండియు పలువురు ప్రతినిధులు వచ్చినారు. ధర్మగ్రంథాల యోద్యమముయొక్క వివిధ దశలనుగూర్చియు, గ్రంథాలయ పాలనా పద్ధతులను గూర్చియు సమర్థులగువారిచే అనుభవ పూర్వకములగు ఉపన్యాసము లియ్యబడినవి.

ఆంధ్రదేశము నందంతటను గ్రంథాలయము లను, పఠన మందిరములను నెలకొల్పుటకును, నెలకొల్పినవానిని పెంపొందింపజేయుటకును, అన్ని విధముల తగిన ఉత్సాహమును ఇచ్చుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ఏర్పాటుప బడినది.

## గ్రంథాలయ వేదము

ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభకు అధ్యక్షత వహించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు గ్రంథాలయోద్యమము ప్రాముఖ్యమును గూర్చి తమ ఉపన్యాసము నందు ఈ క్రింది విధముగ జెప్పిరి.

1. "వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును.

2 ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమైయున్నదో జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును.

3. సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్ల వారికి ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదము కావలయును

ప్రపంచమునందు ఇంతవరకు వివిధ దేశము లందు వివిధ భాషలలో బయలుదేరిన గ్రంథా లయ సారస్వతము నందు ఈ సూక్తి మహో న్నతమై విలసిల్లినది. అందుచేత ఇది గ్రంథా లయ వేదమై బరగినది.

## ఉద్యమ ప్రచారము

ఆంధ్రదేశము నందంతటను ఈ యుద్యమ మును వ్యాపింపజేయుటకై వివిధ జిల్లాలయందు జిల్లాసభలు, తాలూకా సభలేగాక రాష్ట్రసభ లనుగూడ వివిధ ప్రదేశములందు జరిపితిమి.

1920 సంllన గ్రంథాలయ ప్రచారకులను తయారు చేయుటకై ఒక మాసము దినములు ప్రథమ పాఠశాలను బెజవాడ రామమోహన గ్రంథాలయమందు నడపితిమి. పల్లెటూళ్ళకు సంబంధించిన వివిధ సమస్యలకును, గ్రంథాలయ పరిపాలనకు సంబంధించిన వివిధ విషయములను

గూర్చియు ఆయా విషయములనుగూర్చి పరిశ్రమ జేసిన సమర్థులచే అనుభవ పూర్వకములైన ఉపన్యాసము లియ్యబడినవి.

1930 వ సంవత్సరమున గ్రంథభాండాగారుల తర్ఫీదు పాఠశాలను ఒకదానిని విజయవాడ దివ్యజ్ఞాన సమాజ మందిరమందు నిర్వహించితిమి. ఆ పాఠశాల నిర్వహణమందు శ్రీ కొఠారి రామారావుగారు (హిందూ హైస్కూలు హెడ్మాష్టరు) పుణ్యమూర్తుల రాజశేఖరం బి. ఏ., బి. ఇడి. గార్లు నాకు తోడ్పడిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమందు గ్రంథభాండాగారిగానున్న శ్రీ యం ఓ థామసన్‌గారుకూడ ఈ తర్ఫీదు పాఠశాలకు విచ్చేసి, ఉపన్యాసములిచ్చి తర్ఫీదును పరిశీలించి మెచ్చుకొనిరి.

1914 సం॥ మొదలు 1939 సం॥ వరకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు నేను కార్యదర్శిగా నుంటిని. ఈ ఇరువది యైదు వత్సరములును నేను ఆంధ్రదేశమందంతటను నా స్వంత వ్యయముతో తిరిగి ఉద్యమ ప్రచారము చేసితిని.

## బరోడా యాత్ర

1917 సం॥న బరోడా కేంద్ర గ్రంథాలయమువారి ఆహ్వానముమీద అచటికేగి ఆరాష్ట్రమునందు సార్వజనిక గ్రంథాలయోద్యమ మెట్లు సాగుచున్నదో పరిశీలించి, మన యుద్యమమునకు ఉత్తేజమును చేకూర్చితిని.

రెండవసారి బరోడా రాష్ట్రమునకు 1934 సంవత్సరములో మహారాజు శాయాజీగాయక్వారు వజ్రోత్సవమునకై వారి ఆహ్వానముమీద పోతిని. అచటి కేంద్ర గ్రంథాలయంలో మహారాష్ట్ర గుజరాతీ భాషా గ్రంథములకై వర్గీకరణ పద్ధతిని, డ్యూయీ-కట్టరుల పద్ధతులను సమీకరణంచేసి, ఒక మధ్యమ పద్ధతిని రూపొందించియున్నారు. ఆ పద్ధతిని అనుసరించి ఆంధ్ర గ్రంథముల కొరకు రూపమును సరిదిద్ది దానిని బెజవాడ రామమోహన గ్రంథాలయమందు ప్రవేశ పెట్టితిని. ఆ పద్ధతినే ఇప్పటికిని వారు జయప్రదముగ అమలు చేయుచున్నారు.

## స్థానిక సంస్థల ప్రోత్సాహము

1914 కు పూర్వము గ్రంథాలయములను స్థాపించుటయు, పోషించుటయు స్థానిక స్వపరిపాలనా సంఘముల (మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు మొదలైనవి) విధులలోనికి రాదని ప్రభుత్వ వైఖరిగా నుండెను. కొన్ని గ్రంథాలయములకు స్థానిక స్వపరిపాలనా సంఘములు మంజూరుచేసిన విరాళములను ప్రభుత్వమువారు రద్దుపరచుటగూడ జరిగినది అట్టిస్థితిలో అప్పుడు మద్రాసు ప్రభుత్వమువారి కార్యనిర్వాహక సభాసభ్యులుగా నున్న సర్. వి. యస్. శివస్వామి అయ్యరుగారికి ఈ కష్టమునుగూర్చి విన్నవింపగా, గ్రంథాలయములను నిర్వహించుట, పోషించుటయునుకూడ స్థానిక స్వపరిపాలనా సంస్థలయొక్క విధులలోకే వచ్చునని విస్పష్టముగా చెప్పివైచిరి. పిమ్మట లోకలుబోర్డు చట్టములోగూడ మన సంఘముయొక్క కృషివలన ఈ మేరకు మార్పు జరిగినది గుంటూరు బెజవాడ పురపాలక సంఘములు గ్రంథాలయములనునిర్వహించుట ప్రథమమున ప్రారంభించినవి, తాడేపల్లిగూడెం తాలూకా బోర్డువారు గ్రామ పునర్నిర్మాణ తరగతులను నిర్వహించి గ్రంథాలయమును స్థాపించిరి. పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు స్వంతముగా గ్రంథాలయములను స్థాపించినది. ఈ రీతిగా ప్రారంభమైన కృషి ముఖ్యముగా ఆంధ్రదేశ మంతటను వ్యాపించినది.

## పత్రికలు-గ్రంథములు-ప్రకటన

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముచే ప్రకటింపబడిన మొదటి పుస్తకం "సార్వజనిక పుస్తకాలయములు" అనునది. రెండువేల కాపీలు వేసి దేశమునందంతటను విరివిగా పంచిపెట్టితిమి.

గ్రంథాలయ సర్వస్వమను పేరున మూడు మాసముల కొకసారి పత్రికను 1916 సం॥ న ప్రారంభించితిమి. కొన్నాళ్లు మాసపత్రికగ కూడ ప్రకటించితిమి. 1939 సం॥ నకు పిమ్మట ఆంధ్ర గ్రంథాలయమను పేరుతో త్రైమాస పత్రిక కొంతకాలము ప్రకటింపబడిన పిమ్మట తిరిగి గ్రంథాలయ సర్వస్వమును పునరుద్ధరించిరి. ఇప్పటికిని అది మాసపత్రికగనే ప్రకటింపబడుచున్నది.

అఖిలభారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి "ఇండియను లైబ్రరీ జర్నలు" అను పేర ద్వైమాస పత్రికను ప్రారంభించి, పిమ్మట మాసపత్రికగ మార్చి 5 సంపుటములు నడిపితిమి. కాకినాడ వాస్తవ్యులు యాతగిరి లక్ష్మీ వెంకటరమణగారు "ధర్మ గ్రంథాలయ" పత్రికను మూడు సంపుటములు నడిపిరి. శ్రీ వెంకటరమణయ్యగారు వ్రాసిన "ధర్మ గ్రంథాలయోద్యమ" మనుగ్రంథమునుగూడ ప్రకటించితిమి.

ఆంధ్రదేశమందలి గ్రంథాలయముల చరిత్రలను సేకరించి, 1915–1916 సం॥ లందు ప్రకటించితిమి. 1939 సం॥ లో గ్రంథాలయాల పట్టిక మాత్రము ప్రకటింపబడినది.

ఆంధ్ర గ్రంథములలో ప్రకటింపబడినవాని పేర్లన్నిటిని చేర్చి-విషయములనుబట్టి వర్గీకరణముచేసి, తయారుచేయుపనిని విశాఖపట్టణ వాస్తవ్యులైన శ్రీ వెలిదండ శ్రీనివాసరావు గారికి వప్పగించితిమి. వారు శ్రమజేసి ప్రభుత్వమువారిచే ప్రచురింపబడిన గెజిటీర్లన్నింటి శ్రద్ధతో పరిశీలించి, తెలుగులో ప్రచురింపబడిన పుస్తకాలన్నింటికి విషయమునుబట్టి, గ్రంథముల పేర్లనుబట్టి గ్రంథకర్తల పేర్లనుబట్టి, వర్గీకరణ పట్టికలను మూడింటిని తయారుజేసిరి. వానిని ప్రచురించుటకు మన సంఘమునకు ఆర్థిక సంపత్తి లేక పోవుటచేత, శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి వప్పగింపగా వారు, దానిని ప్రచురించిరి. శ్రీ బాలగంగాధర తిలకుగారిచే రచియింపబడిన "వేదకాల నిర్ణయము" అనుగ్రంథమును శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరింపగా, దానినిగూడ ప్రచురించితిమి. ఇది 1939 సం॥ వరకు జరిగినపని. పిమ్మట శ్రీ నాగభూషణంగారు గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించినవి అనేక గ్రంథములను ప్రకటించిరి.

## ప్రభుత్వము వారి సహాయము

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము పక్షమున వివిధ మండలములందు జరిగిన అనేక విధములైన సభలకు పోయి ఈ యుద్యమము నందు ఇమిడియున్న అనంతశక్తులను గూర్చి ప్రబోధము గావించితిని. శాసన నిర్మాణ సభాసదులచే కృషి చేయించితిని. తత్ఫలితముగా, మద్రాసు రాజధానియందలి గ్రంథాలయముల కొరకు కొంత ద్రవ్యమును ప్రత్యేకింపవలయునని శ్రీ కొండ వేంకటప్పయ్యగారిచే మద్రాసు శాసన నిర్మాణ సభయందు తేబడిన తీర్మానము తుదకు అంగీకరింపబడినది. అప్పటి నుండి ప్రతి సంవత్సరము ప్రభుత్వమువారిచే కొంత సొమ్ము విరాళములుగ ఇయ్యబడుచున్నది.

# అఖిలభారత గ్రంథాలయోద్యమము

1918 సం॥లో లాహోరు పట్టణమునందు ప్రభుత్వమువారి ఆదరణ క్రింద అఖిల భారత గ్రంథ భాండాగారుల సమావేశము జరిగినది. ఆ సభకు ప్రతినిధులను పంపుటకు మనసంఘమునకు అవకాశ మియ్యలేదు. అందుమీద 1919 లో మద్రాసులో జరుపబడిన ఆరవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభతో బాటుగా, ప్రథమ అఖిలభారత గ్రంథాలయ మహాసభను సమావేశపరచితిమి. ఆ సభకు బరోడారాజ్య గ్రంథాలయ శాఖాధ్యక్షులగు జె యస్. కుడల్ కారు గారు అధ్యక్షత వహించిరి అపుడు గవర్నరుగా నున్న వెల్లింగుటన్ ప్రభువు గ్రంథాలయ ప్రదర్శనమును తెరచిరి.

ఈ సభయందే అఖిలభారత గ్రంథాలయ సంఘమును కూడ నిర్మించితిమి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిత్వముతో బాటు అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా పనిచేసితిని. భారతవర్షముయొక్క వివిధ పట్టణములందు ఎనిమిది సభలను జరిపితిమి అఖిల భారత గ్రంథాలయ సంఘ ప్రచార ఫలితముగ మహారాష్ట్రము వంగదేశము, కర్నాటకదేశము మద్రాసురాష్ట్రము, పంజాబుదేశములందును- పుదుక్కోట సంస్థానమందును రాష్ట్రీయ గ్రంథాలయ సంఘములు ఏర్పాటువబడినవి.

# ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకసంఘము

16వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1934వ సంవత్సరమున కాకినాడ పట్టణమున జరిగినది. ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమము విరివిగా వ్యాప్తినొందుటకై ఆ సంఘ నిబంధనల యందు సేవకశాఖ యొకటి కలదు. కాకినాడ గ్రంథాలయ సభతో బాటుగ ప్రథమ ఆంధ్ర గ్రంథాలయోద్యమ సేవక మహాసభ సమావేశపరచబడి- "ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అనుబంధముగ సేవాశాఖను స్థాపించుటకు తీర్మానించడమైనది."

అప్పటినుండి సేవాశాఖ సభలు వివిధ ప్రదేశములందు జరిగినవి. గుంటూరునందు 1942 సం॥ జరిగిన అట్టి సభలలో ఒకదానియందు నాకు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి సరస్వతీ సామ్రాజ్య గ్రంథము బహూకరింపబడినది.

# గ్రంథాలయ యాత్రలు

గ్రంథాలయ సేవకులు చేసిన ఘనకార్యములలో గ్రంథాలయ యాత్రలు విశిష్టమైనవి

ప్రయోజనములయందు గ్రంథాలయముల వ్యాప్తి కలుగుటకును, గ్రంథాలయముల స్థితిని పరిశీలించి అభివృద్ధి పరచుటకును గ్రంథాలయ యాత్రలు-భీమవరం-తాడేపల్లిగూడెం-కొవ్వూరు-రేపల్లె తాలూకాలయందు నా ఆధ్వర్యము క్రింద సాగింపబడినవి.

ఒక యాత్రియొక్క జట్టు రమారమి పన్నెండుమంది యాత్రికులు పన్నెండుగురును ఈ క్రింద వివరించిన ప్రకారము ఆరు జట్లుగా ఏర్పడుదురు 1. పురోగాములు 2. భజన 3. ప్రదర్శనము 4. గ్రామఫోను 5. ఉపన్యాసకులు 6. మాజిక్ లాంతరు.

పురోగాములు వెనుకటిరోజుననే ముందు గ్రామమునకు పోయి గ్రంథాలయ - వేదము అచ్చువేసిన పెద్ద కాగితములను, యాత్ర రాకలను గురించిన ప్రకటనగల పెద్ద కాగితములను గోడలమీద గ్రామమంతయు అంటించెదరు. మరియు గ్రామములోని గ్రంథాలయము మొద

లగు సంస్థలకు సంబంధించినవారితోను, గ్రామ పెద్దలతోను మాట్లాడి గ్రంథాలయాత్రికులకు స్వాగత మిచ్చుటకు తగిన ఏర్పాటులను గావింతురు. మరునాటి ఉదయమునకు యాత్రికులు ఆ గ్రామమునకు కాలినడకన పోయెదరు. ముందుగా భజన జట్టువారు భజన చేయుచు గ్రామమంతా తిరిగి, గ్రామంలోని జనుల నందరను సభకు ఆహ్వానించెదరు. ప్రదర్శన జట్టువారు వారి సామగ్రినంతను బహిరంగసభ జరుగు చోటు దగ్గరగా ఒక భవనంలోగాని లేక వీధి అరుగులమీదగాని గోడలకు వ్రేలాడ గట్టి ప్రదర్శించెదరు. ఈ లోపున గ్రామఫోను జట్టువారు సభ జరుగు స్థలమున గ్రామఫోను రికార్డులను వినిపించు చుండెదరు. భజనజట్టువారు భజనతో ఊరంతా తిరిగి వారితో ఒక ఉత్సవమును చేరదీసికొని, ఉపన్యాస వేదిక యొద్దకు వచ్చెదరు. అప్పుడు ఉపన్యాసకుల జట్టువారు వివిధ విషయములమీద ఉపన్యాసముల నిచ్చెదరు. గ్రామంలోని గ్రంథాలయమును పరిశీలించెదరు. అవసరమైన చోటుల అటకల మీదనుండి పుస్తకములను దింపించి, బూజు దులిపించి, పుస్తకముల పట్టికలను తయారుచేసి తిరిగి ఆ గ్రంథాలయాన్ని పనిలోకి దింపి మరీ పోయెదరు. ఈరీతిగా ఆ గ్రామంలోని గ్రంథాలయం పని చేయుచున్న యెడ ఇంకను ఎక్కువ ప్రకాశవంతమగునటుల అసలు పనిచేయకున్న పనిచేయునటుల ఉద్బోధించెదరు. సభ అయిపోయిన పిమ్మట మాజిక్కులాంతరు ప్రదర్శనము ప్రారంభమగును. బొమ్మల సహాయంతో ఆరోగ్యము, సహకారము, గ్రంథాలయ ప్రచారము మున్నగు విషయములను గూర్చి చెప్పెదరు. ఈ ప్రకారము కార్యక్రమమును ముగించుకొని ముందు గ్రామమునకు బోయెదరు.

ఇట్టి యాత్రలు గ్రామస్థులందు ఉత్తేజమును చైతన్యమును కలుగజేసి గ్రంథాలయముల ఉపయోగమును, వయోజన విద్య ఉపయోగములను ఎక్కువగా వినియోగించుటకు అలవాటు పడునటుల చేసినది.

చిత్తూరుజిల్లా కుప్పం గ్రామంలో సైకిలు చక్రాలతో ఒక బండిని నిర్మించి ఆ గ్రామము నందేగాక, చుట్టుప్రక్కల గ్రామాలకుకూడా గ్రంథములను ప్రచారము చేసిరి. కృష్ణాజిల్లా పెదసనగల్లు గ్రామమువారు రెండెడ్ల బండిపై సంచార గ్రంథాలయమును కొంతకాలము ప్రచారము చేసిరి. మచిలీపట్నంలో ఫ్రెండ్సు యూనియనువారు సైకిలుబండిని వినియోగించి కొంతకాలము పట్టణములో గ్రంథములను ఎరువిచ్చిరి. విశాకపట్నంజిల్లా జగ్గాపురంవారు మనుష్యుల ద్వారానే చుట్టుప్రక్కల గ్రామాదులకు గ్రంథములను పంపుచున్నారు. పట్టణ గ్రంథాలయ సంఘముయొక్క ప్రోత్సాహము చేత, విజయవాడ మున్సిపాలిటీవారు శకటముల ద్వారా పట్టణమంతా సంచార గ్రంథాలయమును నిర్వహించు పథకమును వేసి కొన్ని సంవత్సరముల క్రిందట పంపగా మద్రాసు గవర్నమెంటువారు దానిని తిరస్కరించినారు.

పడవలలో ప్రయాణము చేయుచున్నప్పుడు ప్రయాణీకులు చదువుకొనుటకై గుంటూరుజిల్లా పెదపాలెం సేవాశ్రమంవారు కాలువమీద పడవలలో సంచార గ్రంథాలయాల నేర్పాటు జేసి కొంతకాలము సమర్థతతో ప్రయోజనకరముగ నిర్వహించిరి. తెనాలి తాలూకా సంగంజాగర్లమూడి గ్రంథాలయంవారును ఇట్టి సేవను జేసిరి.

వేటపాలెంనందున్న సారస్వత నికేతనము వారు తమ గ్రంథాలయమును గుంటూరు జిల్లా కేంద్ర గ్రంథాలయముగ నిర్మించిరి. శ్రీ వూటుకూరి సుబ్బరాయ శ్రేష్ఠిగారు ప్రారంభి

చిన ఈ కార్యక్రమమును శ్రీనివాసరావుగారు ఇతోధికముగా కొనసాగించు చున్నారు.

## స్వంత భవనము

భారత వర్షమున నవీన గ్రంథాలయోద్యమము 1911 సంవత్సరంలో బరోడా మహారాజుగారు ప్రారంభించిరి. మన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1914 సం॥లో స్థాపింపబడి భారత వర్షమునందంతటను ప్రథమ గ్రంథాలయ సంఘమై వెలయుచున్నది. బరోడా రాజ్యంలో గ్రంథాలయ సంఘం 1920 సం॥ వరకు ఏర్పడలేదు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు స్వంత భవనముగా బెజవాడలోని రామమోహన గ్రంథాలయ భవనమును ఇచ్చుటకును, ఆంధ్రదేశమునకు రామమోహన గ్రంథాలయమును కేంద్ర గ్రంథాలయముగ చేయుటకును, రామమోహన గ్రంథాలయ సంఘము యొక్కయు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము యొక్కయు సభ్యుల సమావేశములలో తీర్మానములు ఏకగ్రీవముగా అంగీకరింపబడినవి. అయితే ఆ యేర్పాటువల్ల రామమోహన గ్రంథాలయం యొక్క పేరు మార్పు చేయనైనది. అట్టిమార్పునకు కృష్ణా జిల్లా జాయంటు రిజిష్ట్రారు అంగీకరింపలేదు. అందుచేత ఈ ప్రయత్నమంతయు విరమింపవలసి వచ్చినది.

1914 సం॥ నుండి 1939 సంవత్సరమువరకు ఆంధ్ర గ్రంథాలయ సంఘమునకు నేనే కార్యదర్శిగా నుంటిని. శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారితో 1907 సంవత్సరమునుండి నాకు గల పరిచయమును పురస్కరించుకొని వారిని బెజవాడయందే నివాసముగా నిలిపి 1934 సం॥లో ఈ సంఘమునకు అధ్యక్షులుగా ఎన్నుకొంటిమి.

పిమ్మట శ్రీ పాతూరి నాగభూషణంగారు నూత్నోత్సాహముతో గ్రంథాలయ సేవను చేయుటకు ముందుకువచ్చుటచేతను, శ్రీకొమ్మా శీతారామయ్యగారు ఒక యకరము స్థలమును కొనియిచ్చెదమని వాగ్దానము చేయుటచేతను, శ్రీ పాతూరి నాగభూషణంగారిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు 1939 సం॥ లో కార్యదర్శిగా ఎన్నుకొని, సంఘ కార్యస్థానమును బెజవాడనుండి పటమట లంకకు మార్చితిమి.

శ్రీ కొమ్మా శీతారామయ్యగారు తమ వాగ్దాన ప్రకారము స్థలమును కొనియిచ్చుటయేగాక సంవత్సరమునకు రు. 600 లు ఆదాయం వచ్చే 3 ఎకరముల పొలమును గూడ సంఘమున కిచ్చిరి.

అందుమీద శ్రీ పాతూరు నాగభూషణంగారు విశేషముగా శ్రమజేసి విరాళములను వసూలుజేసి, రు. 25 000 విలువగల కింది అంతస్థు భవనమునేగాక, గాంధి తత్వ ప్రచారక సంఘము వారి తోడ్పాటుతో మీద అంతస్థునుగూడ నిర్మింపజేసిరి.

మరియు శ్రీ గోటేటి జోగిరాజుగారు తమ వ్యవసాయ గ్రంథము లన్నింటి ప్రచురణాధికారమును రు. 2,500 ల విరాళముతోగూడ ఈ సంఘమున కిచ్చిరి.

## జాతీయ వికాసమునకు దోహదము

ఆంధ్రదేశమున 1905 సం॥ రం నుండి వంగదేశ విభజనోద్యమ ఫలితముగను 1917 సం॥ రం నుండి హోంరూలు ఉద్యమ ఫలితముగను

1921 సం॥ నుండి గాంధిగారి అసహాయోద్యమ ఫలితముగను జాతీయ వికాసము దినదినాభివృద్ధి బొందినది. తాము బాగై తమతోడివారలను బాగు చేయవలయునను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛగల యువకులనేకులు ఈ యుద్యమములకు అంకితమైరి. ఆ ధ్యేయమును సాధించుటకై అట్టి యువకులు దేశమందంతటను సంచారముచేసి, నూతన గ్రంథాలయములను, పఠన మందిరములను స్థాపించుటకును, ఉన్నవానిని ఉత్తేజింపజేయుటకును పలువిధముల పాటుబడియున్నారు. వీరికి జీతములు లేవుగదా, భత్యములు అసలే లేవు. ఆంధ్రదేశమందున్న అట్టి సోదర సేవకుల పరిశ్రమ ఫలితంగా 914వ సంవత్సరమందున్న 163 ఆంధ్ర గ్రంథాలయములు ఒకప్పుడు పది వేలకు పైగా పెరిగినవి. ఈ రీతిగా అజ్ఞాతులగు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నిర్మాతలు వేలకొలది ఆంధ్రదేశముయొక్క నలుమూలల వ్యాపించియున్నారు. గ్రంథాలయోద్యమంలో ఆరితేరిన ఈ నిర్మాతలే ముఖ్యంగా గాంధీగారి అసహాయోద్యమంలోకూడ ముందంజ వేసిరి. ప్రతి గ్రంథాలయమును అసహాయోద్యమ ప్రచారమునకు రంగస్థల మాయెను.

## ఎందరో మహానుభావులు

ఆంధ్ర గ్రంథాలయోద్యమమును దేశభక్తితోగూడిన వైజ్ఞానికోద్యమముగా రూపొంద గలుగుటకు ఎందరో మహానుభావులు తోడ్పడినారు. అట్టివారిలో కవులు, గాయకులు, రాజకీయవేత్తలు, సంఘ సంస్కర్తలు, పూర్వాచార పరాయణులు బీదవారు. రాజ్యాధిపతులు, దేశనాయకులు, వీరు వారు అననేల అన్ని తరగతుల జనులును కలరు. ఇందరు మహామహుల ఆదరాభిమానముల వలనను మార్గదర్శకత్వము వలనను గ్రంథాలయోద్యమము ఒడుదుడుకులు లేకుండ తన యాత్రను నిర్విఘ్నముగ కొనసాగించుచున్నది.

## గ్రంథాలయ చట్టము

ప్రజలెంత గ్రంథాలయోద్యమమును ప్రచారముచేసి స్థాపించి వ్యాపింపజేసినను ప్రభుత్వము వారి సహాయము ఉండినగాని, సర్వతోముఖమైన కృషి జరుగుటకు అవకాశముండదు. 1934 సంవత్సరమునుండి మేము చేసిన ప్రచారమునకు ఫలితముగ 1949వ సంవత్సరమున మద్రాసు రాష్ట్రమునకు గ్రంథాలయ శాసనమొకటి అవిర్భవించినది. ఈ చట్టము ఏర్పడువరకు అమలులోనున్న గ్రంథాలయ ఉద్యమముయొక్క అనుభవములను ఈ శాసనకర్తలు ఎంతమాత్రము గమనింపక పోవుటవలన ఈ చట్టమునందు అనేక లోపములు చేరినవి.

పిమ్మట హైదరాబాదు రాజ్యమునకొక గ్రంథాలయ చట్టము చేయబడనది.

ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఏర్పడిన పిమ్మట ఈయేడు ఈ రెండు చట్టములను సమీకరించి ఒక చట్టమును రూపొందించిరి. ఈ క్రొత్త చట్టమునందు అభివృద్ధికరములైన అనేక మార్పులను చేసినారు.

అయితే గడచిన అరవై సంవత్సరములపై నుండి దేశ సౌభాగ్యమునకు గ్రామ జీవనోత్తేజమునకు పునాదులను వేసి, రాజకీయ చైతన్యమును కలుగజేసి, ఆంధ్ర గ్రంథాలయోద్యమముయొక్క ప్రాశస్త్యమును నిరూపించినట్టి వేలకొలది కమిటీల పరిపాలన "గ్రంథాలయములకు ఈ చట్టమునందు చోటులేదు. మరియు ఇట్టి గ్రంథాలయములు కో-ఆపరేటివు సొసైటీల

స్థాయిని అనధికారుల పరిపాలనతో గూడిన స్వయంపరిపాలనా వ్యవస్థలుగ రూపొందవలెను. అట్టి మార్పులు జరిగి ఆంధ్ర గ్రంథాలయోద్యమము మహోన్నత స్థాయిని అచిరకాలము లోనే పొందగలదు.

## సార్వజనిక విశ్వవిద్యాలయములు

ముఖ్యముగా అమెరికా, ఇంగ్లాండు దేశములలో గ్రంథాలయములను జనులందరు తమకు కావలసిన విషయములను విజ్ఞానమును సంపాదించుకొనుటకు – విశ్వ విద్యాలయముల స్థాయిని ఉపయోగించుకొనుచున్నారు. ఆ స్థాయిని పరిశీలిస్తే, మన దేశమున గ్రంథాలయ ఉద్యమం ఇంకా ఓ, న. మల స్థితిని దాటలేదని చెప్పిన – సాహసముకాదని నా తలంపు.

అందుచేత సార్వజనిక ధర్మ గ్రంథాలయోద్యమ ప్రచారం యొక్క అవసరం ఇప్పుడు ఇంకా ఎక్కువగా ఉన్నది. ఇదివరకు చేసినది అసలు ఉద్యమం యొక్క ప్రాశస్త్యం – ఉపయోగం – వినియోగాలనుగూర్చి – ఇప్పుడు జరుగవలసినది వాటిని ఎన్ని దృక్పథాల నుంచి పరిశీలించ వలసినదిన్నీ ఇందుకు అనుభవజ్ఞులగు శాస్త్రవేత్తలు ఏయే మార్గాలను సూచించిన దిన్నీ తెలిసికొనుట.

అందుచేత ఒక చట్టము ఏర్పడినది – ప్రతిదీ ప్రభుత్వము చూచుకొంటుంది – అని ఏమర రాదు – ప్రభుత్వమంటే ప్రజల కోర్కెల యొక్క అద్దమన్న మాట. అందుచేత మనము మంచి రుచులను – శాస్త్రదృష్టిని అలవరచుకొని గ్రంథాలయములు సార్వజనిక ధర్మ గ్రంథాలయస్థాయిని పొందునరకు కృషిని నిరంతరము చేయాలి.



చదురున వేగు రజ్జులు ప్రసంగము సేయుచు గూరుచున్న గో
విదు డొకడున్న యందమున వేయపహాలును రాదు చూడుమీ;
పదరుచు జాతవృక్షమున వాయసముల్ పదివేలు మూగినన్
గదురునె పంచమస్వర పికం బొకడుండిన శోభ? మిత్రుడా.

చదివినవార లెప్పుడును సఖ్యమొనర్చెద రెల్లవారితో;
గదన మొనర్తు రెల్లపు డకారణ మజ్ఞజనుల్ స్వజాతితో;
ముదమున గీరశారికలు ముచ్చటలాడు బరస్పరంబు; దు
ర్మదమున వానిలో నవియె మూర్కొని కుక్కలు పోరు; మిత్రుడా.

— ఎ. సు. రాయడు



# గ్రంథాలయాలు : స్త్రీలు

శ్రీమతి రాజ్యం సిన్హా, B.A. శాంతినికేతన్
న్యూస్ ఎడిటర్, ఆలిండియా రేడియో, న్యూఢిల్లీ.

కృష్ణాజిల్లా ప్రథమ గ్రంథాలయ సదస్సువారి సంచిక నుండి

"స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు చాల మంది పాల్గొన్నారు. నేడు స్త్రీలకు వోటింగు హక్కువుంది. మనదేశంలో ప్రఖ్యాతి చెందిన నారీమణులు అనేకమంది ఉన్నత పదవులలో వున్నారు." ఇవన్నీ ఉదాహరణలుగా చెప్పి మన దేశంలో స్త్రీలుచాలా ముందుకు వచ్చారనడం పరిపాటైపోయింది. కాని ఇది ఒక భ్రమ మాత్రమే. భారత స్త్రీలు మొత్తం మీద వెనుకబడే వున్నారు. వారిలో ఎక్కువ మంది ఇవాళ కూడా నిరక్షరాస్యులు. ఇంకా మూఢనమ్మకాలతోనే బ్రతుకుతున్నారు. జీవితాన్ని గురించిన వారి అభిప్రాయాలు ఇంకా సంకుచితంగానే వున్నాయి .తమ గృహజీవితాన్ని నడుపుకోడానికి కావలసిన శక్తి సామర్థ్యాలే వారిలో తక్కువగా ఉన్నప్పుడు ఇతర రంగాలలో పనిచేయడానికి కావలసిన సమర్థత ఎక్కడనుండి వస్తుంది?

ఈ పరిస్థితినుంచి వారిని తప్పించడానికి మొదటి మార్గం మానసిక వికాసం కలుగచేయడం అందుకు విజ్ఞానం. అవసరం విజ్ఞానానికి దోహదం చేసేవి పుస్తకాలు.

గ్రంథాలయాలలో పుస్తకాల ఎన్నిక అతి జాగ్రత్తగా చేయవలసి ఉంటుంది. ప్రతి గ్రామీణ గ్రంథాలయంలోను, టౌను గ్రంథాలయంలోను ఈ పుస్తకాలు తప్పనిసరిగా ఉండాలి.

## 1. స్త్రీల జీవిత చరిత్రలు

సృష్ట్యాదినుండి నేటివరకూ ప్రపంచంలో అన్ని నాగరికత దేశాలలో పేరుపొందిన నారీమణులు ఎంతోమంది వున్నారు. వీరి జీవిత గాథలు తప్పక ఉండాలి.

## 2. స్త్రీ ఉద్యమం

స్త్రీల ఉద్యమాలకూ ఈ ఉద్యమాలు సాధించిన విజయాలకు చెందిన పుస్తకాలు.

## 3. సంస్కృతి, మతము

అర్థంలేని దురాచారాలను ఖండించే పుస్తకాలు సాంఘిక చైతన్యాన్ని పురికొల్పే పుస్తకాలు, రాజా రామ్మోహన్‌రాయ్, వీరేశలింగం, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వివేకానంద మొదలగువారి పుస్తకాలు ఈ కోవకు చెందినవి.

## 4 గృహ శాస్త్రం

పొదుపు, పుష్టికరమైన ఆహారం, పిల్లల పెంపకం ఇంటి అలంకరణ, తీరిక సమయాలను

సద్వినియోగం చేసుకోవడం మొదలగు విష యాలకు సంబంధించిన పుస్తకాలు.

## 5 దాంపత్య జీవితం

అంటే కేవలం 'సెక్సు' మాత్రమే కాదు. స్త్రీ పురుషుల బాంధవ్యం ఆధ్యాత్మిక వికాసానికి తోడ్పడాలి. దాంపత్య జీవితాన్ని ఉదాత్తంగా ఉన్నతమార్గంలో చిత్రించే పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. దేశీయ భాషల్లో నైతేనేమి, ఇంగ్లీషులో నైతేనేమి. ఇంకో సంగతి ఈ రోజున మన దేశంలో 'జనభా పెరుగుదల సమస్య' ఎంత తీవ్రంగావుందో అందరకూ తెలుసు. అందుచేత 'కుటుంబ నియంత్రణ' గురించి సభ్యతగా సంస్కారంతో చెప్పే పుస్తకాలు గ్రంథాలయాల్లో ఉండాలి.

## 6 వినోదం

ఈ కోవకు చెందిన పుస్తకాలు మరీ జాగ్రత్తగా ఎన్నుకోవాలి. కనిపించిన ప్రతి చెత్తా మెదడులోకి వెళ్తే ఎంతో ప్రమాదం, దేశానికి మనిషికీ కూడా. శరద్, ప్రేమ్‌చంద్ వంటి ప్రఖ్యాత రచయితల పుస్తకాలు, యాత్రలను గూర్చి చెప్పే గ్రంథాలు ఎన్నికచేసి చేర్చాలి.

చిన్న చిన్న పట్నాలలో, గ్రామాలలోవున్న స్త్రీల తీరిక కాలం వ్యర్థమైన కాలక్షేపం కబుర్లతో పోతుంది. అందుచేత గ్రంథాలయాలు తమ సిబ్బందిలో ఒకరిద్దరిని స్త్రీలను నియమించి వారు ఇంటింటికీ వెళ్ళి పుస్తకాలు ఇచ్చి పుస్తక ప్రయోజనాలకు వివరించేటట్లుగా చూడాలి. పుస్తకాలను చదివే అభిలాష కలిగేటట్లు చూడాలి. ఈ పని తీరిక సమయాలలో హైస్కూలు కాలేజి విద్యార్థినులు చేయవచ్చు.



దాతలు భోక్తలుం బరము ధన్యులు; సర్వము నస్థిరంబె యీ
భూతలమందు; నేదియెటు పోవునొ కానగ నేగరెన్వరున్;
దాతురు మేలి కర్పూరపు దండలు పెట్టెల; గొన్ని నాళ్లకుం
జాతురు వాని దారములె; చోద్యమె యర్థము పోక? మిత్రుడా.

తమకని దాచుకొన్నది వృథా ధన మింటను బూజుగట్టు; లో
కమునకు మేలుగోరి యిడగా నది యోగ్యము శ్లాఘనీయమూ;
నమితము కంధి దాచుకొను నంబువు లనీము తూరమయ్యె; మే
ఘములకు నిచ్చినట్టిది యకల్మషముగా మధురంబు; మిత్రుడా.

—వ. సు. రాయుడు



# మణిహారం

ఆంధ్రమాత కంఠసీమ
కిదియె దివ్య మణిహారము
మా పురియె చిల్కలపురి
మహోన్నతంబౌ కీర్తినొందె.

వివిధ శాస్త్ర చయముతోడ
వెల్గుజూపు కావ్యములతో
నవ్యనాటక శతకములతో
నిండినదీ గ్రంథనిలయం.

పరమ పూజనీయమైన
గోమాతల సేవించెడు
కన్యక పరమేశ్వరి గోశాల
కనుల విందౌ చూడచూడ.

దప్పిగొనిన పాంథులకయి
మధురజలము లిచ్చిగాంచు
చలివేంద్రల దాతృత్వము
చాటుకీర్తి నీ పురిని.

దానధర్మ త్యాగములకు
దైవభక్తి దివ్య నీతికి
ఘనాదిగ కీర్తిగాంచె
కలిమి గల మాపేట.

— గుడిపూడి రాజేశ్వరిదేవి.



# గోవు

బొడ్డు వాపిరాజు

ఏలూరు.

ఉ॥ "భవ్యములైన ధేనువుల - పాదరజంబును దాల్చినంతనే
యవ్యయ లోకసౌఖ్యముల - నందఁగవచ్చు" నటంచు ధీ
నిధుల్ । దివ్యముగా వచించిరి విధి - వ్రిముఖాము లెల్ల
వేళ సం । సేవ్యములంచు గోవుల భ - జింతుము వాంఛి
తముల్ ఫలింపఁగన్.

★

చం. తపములొనర్చి దానములఁ - దద్దయుఁ బ్రొద్దులుపుచ్చి
భక్తిమై । నపరిమిత ప్రయాసముల - నందుచుఁ దీర్ఘము
లేగి నిష్ఠతో । జపములు సల్పి, కష్టపడి - జాగరణల్ బొన
రించుకంటె న । ల్లపుడును ధేను వర్గము నుపాసనసేఁత
శుభంబు; గూర్పదే?

★

గీ. గోవులు పవిత్రములుగాన - గోమయ యుత
నిర్మలజలంబు స్నానంబు - నెఱపునతఁడు
సంతతము సుస్థిరారోగ్య - సంపదలను
బేర్మి శుభములఁ గాంచుఁ బ - వితృఁడగుచు.

# గోపోషణ



వంకాయలపాటి శేషావతారం,
హిందీ పండితులు
గుంటూరు.

మన దేశమున కంతకు ప్రధానవృత్తి వ్యవసాయము. అట్టి వ్యవసాయమునకు మూలాధారము గోవు. కనుకనే మనకు ఆయువుపట్టు గోధనము. భగవానుడు కృష్ణావతారమున బోధించినది కూడనిదియే. కనుక గోసంరక్షణము, ఆత్మ సంరక్షణమే. గోసంరక్షణాభివృద్ధి ఆత్మసంరక్షణాభివృద్ధియే. తన శక్తినంతయు మానవులకు ధారపోయు మహోదాత గోమాత. అంతటి మహోపకార మొనర్చు గోవులు, మనచే తుది వరకు పీల్చి పిప్పిచేయబడు చున్న గోవులు, బలముడిగిన పిమ్మట "కసాయివాని" కరకు కత్తి కెర యగుచున్నవి. ఎంత ఘోరము! ఎంత దారుణము!! ఎంత పాపము!!!

నోరులేని సాధుజంతువు! పెట్టిన తినును—కొట్టిన తలవంచి బాధను సహించును—అంబా యని అంగలార్చును. తనకు అన్యాయము జరుగుచున్నదని ఫిర్యాదు చేయునా? పగ సాధించునా—?

ఎన్ని కష్టములు పెట్టినను మానవ సహాయమునకే అది జీవించును. తన అమృత ధారలచే జీవలోకమును పోషించును. "నాకీడు తప్పించు పుణ్యాత్ములులేరే" యని, బొటబొట కన్నీరు గార్చును. పాషాణముల నైన గరగింపజాలు, ఆ వేడి వేడి కన్నీటి ధారకు మానవ హృదయము చలింపనిది! ఒక్క గోవులే గాదు. మానవలోకమునకు అత్యంతోపయోగకరములగు జీవజంతువు లింకెన్ని లేవు? యింతయేల? మన కుపయోగపడు విషయ మటుండనిచ్చి ఉపకారాపకార విచక్షణమాని చీమ, దోమ, మొదలు యీ సృష్టిలోని ఏ జీవికైనను హింస గలిగించుట పాపముగాదా! కనుకనే "అహింసా పరమోధర్మః" "ఆత్మవత్సర్వభూతాని" అను సూక్తులు జనించినవి. సర్వమతముల యొక్కయు సర్వధర్మశాస్త్రముల యొక్కయు. సారము యీ రెండు సూక్తులందే యిమిడియున్నవి. అదియే మహాత్ముడు గూడ మనకు బోధించునది ఆ సూక్తులను గ్రహింపజాలనిదియే అజ్ఞానము. ఈ అజ్ఞానమునకు మూలము విద్యావిహీనత. విద్యావిహీనత తొలగినగాని మన గ్రామములు బాగుపడవు. కావుననే విద్యా ప్రచారమునకు ప్రాముఖ్యత హెచ్చినది.

ఇక విద్యా ప్రచారము విరివిగా సాగిన చో గ్రామములు వానికవియే బాగుపడగలవు. అంత వరకు మనముపేక్షింపక విద్యా ప్రచారముతో పాటు గ్రామ సంస్కరణమునకు పూనుకొన వలెను.

గ్రామములకు ప్రధానవృత్తి వ్యవసాయము. వ్యవసాయమునకు మూలాధారము గోవు. కనుక మన కార్యక్రమము యిచ్చటి నుండియే ఆరం

భము కావలెను. ఈపని గోసంరక్షణ సంఘ ముల ద్వారా జరుపవచ్చును. కేవలము కోతకు పోవు గోవులను పోషిగుచేసి మేపుటతో మన పని ముగియదు.

చక్కని పశుపోషణ విధానములను పరిశోధ వల జరిపి రైతులోకమున ప్రచారము చేయుట, మంచి పాడి, పంటల చవిచూపుట, గోసంర క్షణ సంఘములు చేయవలసిన బాధ్యతలే వాటి. యుద్దేశ్యముగూడ నదియే.

ఇప్పటికి చేయబడిన సహాయముతో సంఘ కార్యములు నెరవేరుట దుర్లభముగాన రుసు ములు చెల్లించు సభ్యులును, ఉదారహృదయు లును, ధర్మబుద్ధిగల పెద్దలును పూర్తిగాతోడ్పడి బీదగోవుల గోడు మాన్పుటకు ముందుకు రావ లెనని మరిమరి ప్రార్థన.

> గాలి నీరును లేకున్న గడపవచ్చు.
> గ్రాసమును లేక ఎట్లైనో గడుపవచ్చు;
> గడపవచ్చునె మనమెక్క గడియయైన
> గ్రంథభాండారములు లేని గ్రామమందు?



# మీ కోర్కెలు తీరాలంటే!

శ్రీయుత నిమ్మరాజు చినవెంకటేశ్వర్లు,

అనంతవరం.

నరసరావుపేట తాలూకా.



సోదర సోదరీమణులారా!

మీరు కోరే కోర్కెలను తీర్చుటలో గోదేవికి మించిన వేల్పులు, ఏలోకమందును లేరు. మీ ఇష్టదేవతలందరు గోదేవిలో నివసించుచున్నారు, ఎట్లన!

1. కైలాసపతియైన సాంబశివుడు, గోదేవి యొక్క ముఖమందును. 2 వైకుంఠ నాథుడైన మహావిష్ణువు కంఠమందును. 3 బ్రహ్మదేవుడు మూపురమందును. 4 సూర్యచంద్రులు నేత్రములందును, 5 ఇంద్రుడు, యమధర్మరాజు కొమ్ములందును. 6 భూదేవి రొమ్మున. 7 శ్రీ మహాలక్ష్మి, యమున గోమయము (పేడ) లోను. 8 గంగానది మొదలగు మహానదులు, గోమూత్రములోను. 9 సరస్వతీదేవి పాలలోను 10 నర్మద పెరుగులోను. 11 అగ్నిదేవుడు నెయ్యిలోను. 12 మహాఋషులు రోమకూపములందును, 13 సుబ్రహ్మణ్యస్వామి ముక్కుయందు, 14 అశ్వనీదేవతలు చెవుల యందు 15 సమస్త దేవతలు శరీరమందును. ఈ విధముగ మీయిష్ట దేవతలందరు గోదేవియొక్క ఆకారముతో వచ్చినారు. గోదేవిని పూజించిన వారికి సర్వకోర్కెలు తీరును.

(భారతం)

## మాస్వభావం మీకుతెలుసా!

1. ఉప్పునీళ్ళుపోసినను, ఎంగిలి నీళ్ళుపోసినను 'పోట్లాడక, గోలచేయక' పానకము వలె త్రాగి, బిందెలాది కమ్మని పాలనిచ్చుచు, వినయ విధేయతలతో, మెలగుదుము.
2. చెత్తచెదారము వేసినను 'సమ్మెచేయక, పంచదారపొడి లాగతిని, ధనధాన్యపురాసు లిచ్చును.
3. ప్రజలకు రకరకాల భవనములు నిర్మించుచు మేము ఆరుబైట ఆహ్లాదముతో నివసింతుము.
4. జనులకు హంస తూలికాది తల్పములనిచ్చుచు, మేము రొచ్చులయందే శయనింతుము.

మానవులకు మాసంగతి తెలియనంతవరకు, ఆకు లలములను తినుచు, నారగుడ్డలు కట్టుచు, పర్ణశాలలోనుంటూ, నానావస్థలు పడినారు. ఏలాగుననో మా సంగతి తెలుసుకొని, మా నివాసముల వద్దకు వచ్చి "మీరు లేనిదే మేము బ్రతుకలేము. మిమ్ములను ఇలవేల్పులవలె పూజిస్తాం మీరు తోడుంటేచాలునని" బ్రతిమలాడి మమ్ములను తెచ్చుకొన్నారు. అప్పటి నుండి నేటి వరకు మేము పరోపకారదీక్షతో అపకారులనక, కులహీనులనక, పక్షపాతము

చూపక, ప్రజలందరికి సమానమైన ఉపకారములు చేయుచు రాత్రింబగళ్ళు మానవసేవయందె నిమగ్నులమై, జనసత్వములను ధారపోయుచు, మా జీవితములను అర్పించుచున్న సంగతి, మానవులందరికి ప్రత్యక్షమే.

1. మా ఆధారమువల్లనే వసిష్టాది మహా మునులు "కరవుకాటకము లెన్నివచ్చినను" రణరంగాది ఉపద్రవము లెన్ని సంభవించినను కలరాది రోగములెన్ని విజృంభించినను" ఏలాటి బాధలు పొందకుండ, ఏదిగులు లేకుండ సమస్త భోగములను అనుభవించుచు, వారిఆశ్రమములకువచ్చే రాజాధి రాజులకు, రాజభోగములతో విందులు చేసినారు.

2. మా సేవ వల్లనే దిలీపాది మహారాజులు సంతానము పొందినారు.

3. మా అనుగ్రహము వల్లనే గౌతమ మహాముని, అహల్యను భార్యగా బడసినారు.

వారు వీరు అననేల ఖ్యాతిగాంచిన పెద్దలలో మా సేవను చేయనివారులేరు పూర్వము మా క్షేమములకు ఏలాంటి భంగము వాటిల్లకుండుటకై రాత్రింబవళ్ళు పెద్దలందరు, వారి తపోశక్తులను, అధికారములను బలపరాక్రమములను, ధనమును, దేశమును, దేహమును అర్పించినారు, మాసాహాయము ప్రతి నిత్యము లభించవలెనను వాంఛతోనే స్తోత్రములు, మంత్రములు, వ్రతములు, సృష్టించినారు. మా బాధలను పారద్రోలుటకై దైవ ప్రార్థనలు, పూజలు

దేవళంబులు సత్రముల్ సావడులును
చెరువులును వీటలేకున్న కొఱంతలేదు.
దివ్యమగునొక్క గ్రంథమందిరము లేని
వీడు వీడుగాదది పాడువీడు గాని.

మంత్రములు, వ్రతములు పూర్తిచేయునపుడు "చతుస్సాగర పర్యంతం "గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం." అను ఆశీర్వాద వాక్యమును నియమించినారు,

మా అభివృద్ధి మీాదనె పాడిపంటలు దేశక్షేమము ఆధారపడి యున్నది. మీారు జాగుసేయక, తక్షణమె మమ్ములను అభివృద్ధి చేయుట మీావంతు. వెనువెంటనే పాడిపంట లొసంగుట మావంతు. జంతు హింసలను మాన్పించుట మీావంతు. ప్రాణదాన ఫలము నిప్పించుట మావంతు. మాసంథింప మాను కొనుట మీావంతు. అభయదాన ఫలమునిప్పించుట మావంతు. మీాకు మాకు సిదియె గొప్ప వందెం. పాడిపంటలు కోరువారికి, పుణ్యలోకములు కోరువారికి, ఇది గొప్పఅవకాశము. త్వరపడాలి.

గో దేవికి జై. గోమాతకు జై.
బసవేశ్వరునకు జై. బసవయ్యకు జై.
గోరక్షకులకు జై. గోరక్ష సంఘాలకు జై.



# గోశాలలు

జోశ్యభట్ల సత్యనారాయణ.

కార్యాలయ కార్యదర్శి, గోశాల అసిస్టెంటు
ఆంధ్రప్రదేశ్ గోశాల - పింజ్రాపోల్ ఫెడరేషన్
విజయనగరం-1 విశాఖజిల్లా

ప్రపంచములో ఆదినుండీ గోభక్తికి, గోసంరక్షణకు మన భారతదేశం ఆదర్శదేశం. మన దేశ ఐశ్వర్యమంతా గోవులే. పాడిపంటలకు గోవు మూలాధారం. అట్టి గోవును కటికివారికి విక్రయిస్తుంటారు. గోభక్తిపరులు, భూతదయాపరులు, గోశాలలు స్థాపించి ఇట్టి నోరులేని అనాయక పశువులను సంరక్షణ చేయుచున్నారు. ఈ ప్రకారంగా మన ఆంధ్రప్రదేశ్ లో చాలాకాలము నుండి అనేక గోసంరక్షణ శాలలు నెలసి ఉన్నాయి.

మన కేంద్రప్రభుత్వమువారు ఆహారవ్యవసాయశాఖ క్రింద కేంద్ర గోసంరక్షణ కౌన్సిల్ స్థాపించి, దానికి అనుబంధముగా రాష్ట్రాల్లో రాష్ట్ర ప్రభుత్వోద్యోగులతోను, కొద్దిమంది ప్రజాప్రతినిధులతోను (ముఖ్యంగా యం. యల్. ఏ.), రాష్ట్ర గోశాల సమాఖ్య (Federation) ప్రతినిధులతోను, రాష్ట్ర గోసంరక్షణ కౌన్సిళ్ళను, రాష్ట్రాలలోగల గోశాలల ప్రతినిధులతోను ఆసక్తిపరులైన ప్రముఖ వ్యక్తులతోను రాష్ట్ర గోశాల సమాఖ్యలను ఏర్పాటుచేసి, ఫెడరేషన్ సభ్యత్వంగల వర్ధమాన గోశాలలకు గోశాలాభివృద్ధి పథకం వర్తింపజేసి, ఒక్కొక్క గోశాలకు ఒక్కొక్క మేలుజాతి ఆబోతును, పది ఆవులను ఉచితముగా యిచ్చుటయే గాక, కట్టడములు వగైరాలకు ఆడ్‌హాక్ గ్రాంటు (అనావృత)గా రూ 5000-00 లు, తాము ఉచితంగా ఇచ్చిన పశువుల పోషణ నిమిత్తం సంవత్సరిక గ్రాంటుగా రూ 2000-00 లు, దూడల పెంపకపు ప్రత్యేకవార్షిక గ్రాంటు, రూ 600 లును ఉచిత పశువైద్యసహాయమును, మొదలగు అనేక సౌకర్యాలు, సహాయాలు చేసెదరు. ప్రభుత్వంనుండి ఇట్టి పశుధనాది సహాయములు పొందే గోశాలలు అవసరమైనప్పుడు ప్రభుత్వానికి పశువులను ఖరీదుకు ఇవ్వాలి. పశువుల జననమరణములు, ఉత్పత్తి, పోషణ విధానము, మేత పశుగ్రాసము రోజువారీ అవి ఎన్ని పాలిచ్చేది, పాలవినియోగం మొదలగు వివరములు రికార్డు చేస్తూ, కోరినపుడు ప్రభుత్వంవారికి తెలియ జేయుచూ, తనిఖీకి వచ్చే, ప్రభుత్వోద్యోగులకు ఆ రికార్డులు, పశువులు, మొదలగునవి చూపిస్తుండాలి. గోశాలలలో ప్రభుత్వం వారిచ్చిన పశువులను గోశాలయొక్క స్వంత పశువులను వేరువేరుగా ఉంచాలి. త్రైమాసిక, వార్షిక నివేదికలు రాష్ట్రగోశాలా డెవలప్‌మెంట్ ఆఫీసరుకు (ఈయన ఫెడరేషన్ కార్యనిర్వాహక వర్గంలో ఎక్స్అఫీషియో మెంబ

రుగా ఉంటారు) పంపించాలి. గోశాల పశువులకు అంటు రోగములు వచ్చిన చో వాటిని వేరుగా ఉంచి, వెంటనే పశువైద్యం చేయించాలి. ప్రభుత్వంనుండి పశు ధనాది సహాయములు పొందేగోశాలలు ఇట్టిషరతులు, నియమాలు పాటించి ప్రభుత్వం వారి పాడిపంటల అభివృద్ధి, ప్రణాళికలకు ఇతోధికంగా తోడ్పడినట్లయితే దేశం సుభిక్షంగా, సస్యశ్యామలంగా వర్ధిల్లును.

గోశాలలోగల పనికి మాలిన పశువులను సంరక్షణ చేయలేనియెడల ప్రభుత్వంవారు నెలకొల్పిన గోసదనములకు పంపవచ్చును. అచ్చటవానిని సహజంగాచనిపోయేవరకు ప్రభుత్వం వారి ఖర్చుపై సంరక్షణ చేసెదరు. మనరాష్ట్రంలో గుంటూరుజిల్లా, కారెంపూడి (మాచర్ల సమీపం, వద్ద ప్రభుత్వ గోసదనం గలదు. అచ్చటికి కోరినచో పశువులను ప్రభుత్వం వారు పంపెదరు.

మనదేశంలో మొత్తం 1060 గోశాలలు ఉన్నాయి. అందులో మన ఆంధ్రప్రదేశ్ లో బాగా పనిచేసే గోశాలలు 37మాత్రమే. అంటే సగటునజిల్లాకు రెండు గోశాలలైన లేవు. కనుక ఆసక్తిపరులు, గోభక్తిపరులు క్రొత్త గోశాలలు స్థాపించాలి. అట్టి గోశాలలకు ప్రభుత్వమువారు యధోచితంగా సహాయం చేస్తారు. దేశంలో మొత్తం గోశాలల్లో 132000 పశువులు సంరక్షణ చేయబడుచున్నాయి. సాలీనా ఈ గోశాలలనుండి పనికివచ్చే ఆబోతులు 1380 దుక్కి వ్యవసాయదారులకు పనికినచ్చే ఎద్దు 8120 లభిస్తున్నాయి. ఈ గోశాలలన్నిటిలోను 61.6 శాతం పనికివచ్చే పశువులు. పనికి రానివి 38.4 శాతం మొత్తం గోశాలలలో సాలీనా 300000 మణుగుల పాలు సప్లయి అవుతున్నాయి.

---

# ప్రజాస్వామ్యం - గ్రంథాలయాలు

శ్రీ కోదాటి నారాయణరావు
బి.ఏ.యల్.యల్.బి.



అధ్యక్షులు :
ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘము,
హైదరాబాదు.

ప్రజాస్వామ్యం అంటే మెజారిటీ పరిపాలన మాత్రమే వనుకున్నంతకాలము ప్రజాస్వామ్యం వర్ధిల్లనేరదు, వర్ధిల్లగల వాతావరణం కూడా ఏర్పడదు. ప్రజాస్వామ్యం ఒక జీవన విధానం. సామాజిక జీవనానికి అది ప్రాతిపదిక. దానికై సమాజంలోని ప్రతివ్యక్తి జీవితంలోని ప్రజాస్వామ్య విధానానికి అనుగుణ్యమైన గుణాలుండేటట్లుచూడాలి. లేకపోతె ప్రజాస్వామ్యం సఫలం కానేరదు.

"సమాజానికి వ్యక్తి మూలము" అను సూత్రము 'ప్రజాస్వామ్యానికి' జీవగఱ్ఱ. ప్రతి వ్యక్తి తాను స్వయముగా ఆలోచించుకొని మంచి చెడ్డలను గమనించుస్థితిలో నుండవలెను.

ఇతరులు కలిగించు భ్రమప్రమాదాలకు ఏవిధంగాను లొంగిపోకుండా ఉండగల స్వాతంత్ర్య ప్రవృత్తిని కలిగివుండాలి. మంచిని తీసుకొని చెడ్డను వదలివేయగలవిచక్షణాజ్ఞానము వినయం వుండాలి. తనకుగల ఆలోచనా స్వాతంత్ర్యము, విచక్షణాజ్ఞానము ఇతరులకు కూడా వుండునను కోవాలి. తన యాలోచన మాత్రమే సరియయినదనీ, ఇతరులది తప్పనే "పిడివాదం" అవలంబించకూడదు. ఇతరులు చెప్పిన దానిని సానుభూతితో వినవలెను. ఈ విషయంలో సుమతిశతక కర్త చెప్పిన "వినదగు నెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపవలెన్, కనికల్ల నిజము తెలసిన మనుజుడె పో నీతిపరుడు" అను సూత్రము సర్వదా అనుసరణీయము.

సమాజంలో వ్యక్తులందరు ఈ విధంగా ఆదర్శ ప్రజా స్వామ్యవాదులు కావటానికి చాలాకాలం పట్టినా ప్రజా అభిప్రాయాన్ని ప్రతిబింబింపజేయుగల సంఖ్యలోనైనా వెంటనే ఇట్టివారు తయారు కావలెను. నిర్మొహమాటమైన ప్రజాభిప్రాయం దేశంలో ఉన్నదని తెలియడమే పాలకులకు కొరడాలాగా పనిచేస్తుంది. ప్రజా స్వామ్యాన్ని సక్రమంగా జరిపే లా అదుపులో పెడుతుంది.

యిట్టి ప్రజాభిప్రాయ నిర్మాణం అవసరం దానికి తగిన వాతావరణమును నిర్మించవలెను. ఇందుకు తగు కార్యక్రమాన్ని వెంటనే చేపట్ట

విమల దేశాభిమానంబు వెలయఁజేయ
నిఖిలసౌభ్రాత్ర భావంబు నెఱయఁజేయ,
సకలలోక కల్యాణంబు సాగఁజేయ,
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

వలసి వస్తుంది. రాగద్వేషాలు లేకుంటే నిర్మాణాత్మకమైన విమర్శనను వ్యాపింపజేసే ప్రచారము ప్రజా స్వామ్యానికి పునాది యనదగిన విజ్ఞానవ్యాప్తి.

ఈ కార్యక్రమాలకు గ్రంథాలయోద్యమము చాలా యుపయుక్తమైనది. 20 వ శతాబ్దారంభమునుండి నేటివరకు అన్ని వుద్యమములకు జీవంగా ఈఉద్యమం వర్తించటం ద్వారా ఈ ఉద్యమానికి గల శక్తి ఋజువయినది.

దీనికి ప్రజలచేత నిర్మించు కోబడిన గ్రంథాలయాలే ఎక్కువ ఉపయుక్తములు కాగలవు. ప్రభుత్వము స్థాపించినట్టిగాని ప్రభుత్వ ప్రోత్సాహంతో స్థాపించినట్టిగాని గ్రంథాలయాలు అంత ఉపయోగపడక పోవచ్చును. స్వతంత్ర ప్రవృత్తిగలిగి ప్రజలచేత పోషింపబడి వర్ధిల్లగలిగిన గ్రంథాలయాలే ఇందుకు బాగా తోడ్పడ గలవు. గుంటూరుజిల్లా, చిలకలూరిపేటలోని శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరీ గ్రంథాలయం ఈ మహాదుద్యమంలో తగు పాత్ర వహించవలెనని నా ఆకాంక్ష.



# చిలకలూరిపేట
# టెక్స్టైల్ డీలర్సు అసోసియేషన్ [రిజిష్టర్డు]
# సంగ్రహ చరిత్ర

వస్త్రముల వ్యాపార మొనర్చు షుమారు 30 మంది సభ్యులతో 1960 సంవత్సరమున 'ది క్లాత్ మర్చంట్సు అసోసియేషన్' అను పేరుతో ఒక సంఘముగా ఏర్పడితిమి. ఇందు నూలు వ్యాపారస్తులు కూడా చేరుటకు ఎంతో ఉత్సాహాముగా ముందుకు వచ్చిరి. అందుచే 'ది టెక్స్టైల్ డీలర్సు అసోసియేషన్' అను నామకరణ మొనర్చుకొని సంఘ పటిష్టతకు కొన్ని నియమములతో ది 21—7—62 న మా సంఘమును రిజిష్టరు గావించుకొంటిమి.



సంఘ సభ్యుల ఉత్సాహాతిశయములవల్లను, దాతల సహాకారముననుసంఘమునకు ఒక గృహాము సంపాదించుకొని ది 4-8-63 న ప్రథమ వార్షికోత్సవ మతివైభవముగా జరుపుకొంటిమి.

 

శ్రీ వా. క. ప. ధర్మ సంఘ పాత గోశాల స్థలమునందు డాబా కట్టించిన వెంటనే దాని పైభాగమున సుందర సువిశాల భవననిర్మాణ మొనరింప కృత నిశ్చయులమై శ్రీ వా.క.ప. ధర్మ సంఘము వారిని కోరి వారి అంగీకారమును పొందియుంటిమి.

× ×

శ్రీ భగవానుని అనుగ్రహామునను, సంఘ సభ్యుల అండదండలతోను, దాతల దాతృత్వమునను, మా సంఘము దినదినాభివృద్ధి నొందుచున్నదని తెలియజేయుట కెంతయో సంతసించుచు న్నాము.

చిలకలూరిపేట
29-4-63

ఇట్లు,
(Sd) రాచుమల్లు వెంకటేశ్వర్లు,
అధ్యక్షులు.

(Sd) కొత్తూరి రాములు,
కార్యదర్శి.



# కన్యకా జననము



రచన: విద్వాన్ వనమా వేంకటరమణగుప్త,
ప్రధానాంధ్రోపాధ్యాయులు
శరభయ్యగుప్త హైందవోన్నత పాఠశాల, సత్తెనపల్లి.

క్రమముగ వృద్ధినిఁ గొనిన గర్భముతో కుసుమాంబ నిండుమా
సములొకతొమ్మిదిం గడువ శయ్యఁబడున్న ప్రసూతి వేళలో
రమయును, విష్ణుదేవుడును, బ్రహ్మయు, శారదయున్, శచీంద్రులున్
ప్రమదము మీరవచ్చి జననంబును చెందగఁగోరు దేవినిన్.

కుసుమాంబా ప్రియ గర్భవాసిని, జగత్కర్త్రిన్, పరాశక్తినిన్
ప్రసభాయాత ముద శ్రువారిలహరీరాజత్కపోలస్థలీ
విసరుల్ వేల్పులు సన్నుతించిరిటు "దేవి! జంగమస్థావరా
భ్యసనంబౌ జగమెల్ల నొందుస్థితి నీ నాదృష్టి పాతంబునన్.

"నీ దృష్టి మరలిన నప్పుడే
ఈ దృశ్యంబైన జగము దృశ్యము నొందున్
మా దారిద్ర్యంబుడుపుము
ఓ దేవీ! దర్శనంబు నొసగుము కృపతోన్.

"నీ వాఖ్యాత్మవు; నిన్ను దెల్ప చదువుల్; నీచేత లోకంబులున్
కాపాడబడునమ్మ! నీకొరకు మావంకే మొక్కు; నీకంటెనున్
దైవంబొక్కటి లేదు. నీకు వశమౌ తత్త్వంబు, నీయందుమా
భావంబుల్ విరమించునమ్మ! కుసుమాంబా సుప్రజారూపిణీ!"

అని ప్రియ వాక్యరత్న కుసుమార్చన సేయ నిజాశ్రితామరా
ళిని గనుచున్, కృపారస విలీనమనోంబుజయై, ప్రసాదదృ
ష్టిని కుసుమాంబికా జఠరసీమను దోచి యరత్నిమాత్రయై
తనరుచు దర్శనం బొసగి తావచియించెను దేవియీగతిన్.

"దేవతలార! మీరిటకు తేపకు తేపకు నన్ను జూడగా
రావలదంచు వల్కినపరాధ భయంబును చెందబోకుడీ!
భూవలయంబునం బొడమి భూజగతీ నియమంబు లెల్లనున్
నే విడనాడ నర్హనుగునే! జగదీశ్వరి నయ్యు స్వతంత్రనయ్యుచున్.

"మానవదృష్టికి గానిపింపక మీరు
అవతార విధికి సాయపడుడయ్యా!
విష్ణువర్ధననృపున్ విగత శాపుం జేయ
మధ్యకుడైన సమాధికొసగు

వరములనెల్లను పరిపాలన మొనర్చ
అతని బాంధవజన వితతియైన
ఏకోత్తరశత గోత్రికులన్ శాశ్వత
కైలాసవాసులుగా నొనర్చి

అస్మదవతార కృతిని సమాప్తి సలుపు
దాన సందోశ నోపిక బూనుడిపుడు
మీరు నిత్యంబు చూడగ గోరునాడు
విశ్వరూపంబు దర్శించి వెడలు"డనియె.

పద్మవీణాశుక పాశముఖాయుధ
కృతనవద్యాయ కరము లలర,
స్వర్ణమయాంబరాభరణ రత్నకిరీట
కంఠికాకుండల కాంతు లెసగ,
స్మరకోటి సౌందర్య, శశికోటి ధావళ్య
రవికోటి తీక్ష్ణాంశురాజి చెలగ,
పాతాళవిన్యస్త పాదంబు లంబర
చుంచి కిరీట శృంగంబు మెరయ

దివ్యగంధమాల్య దేదీవ్యమానమై
సిద్ధసాధ్య భుజగ సేవితమయి
విస్మయంబు గూర్చు విశ్వరూపంబును
చూచి వెడలిరపుడు సురలు భక్తి.

మొరసెన్ వేలుపుదుందుభుల్, సురతతుల్ మ్రోగించె శంఖంబులన్
కురిసెన్ పూవులవాన, గాలివిసరెన్ గోర్కుల్ పిసాళింపగా
విరిసెన్ సజ్జనమానసంబులు, దిశల్ విప్పారె, గంధర్వుల
స్వరసల్ సల్పిరియాటపాటలు పరాశక్త్యుద్భవంబందునన్.

బాలచంద్రరేఖ ప్రభలంచుటను జేసి
యుపరదిక్కు మోదమంది నటుల
వాసవాంబ జన్మవశమున కుసుమాంబ
తనకు సాటిలేని ఘనత నొందె.
కన్యకాంబ జననకాల మందెల్లరు
నెల్లవారి కీయ నుల్లసిల్ల
కొనెడువాడు లేక కుసుమసెట్టియుగూడ
నోర్లులేని యాళువార్ల కొసగె.

సుతయున్ భావము తల్లిదండ్రులకు గూర్చున్, మానవీభావనా
స్థితిసల్పున్ సకల ప్రజావళులకున్, దేవీస్పృహన్ జేయుదై
వతపాళీమునిరాజి భాస్కరులకున్ బాల్యంబునన్ శుక్లప
క్షతిథుల్ వృద్ధిని చెంద చంద్రకళరేఖన్ దేవి వర్ధిల్లెడిన్.



# శ్రీ వాసవీ కన్యక

వారణాసి లక్ష్మీనారాయణ

వారణాశి B. A.

ప్రది గోదావరీ తీరమందలి పేరొందిన పెనుగొండ పట్టణము. వైశ్య ప్రముఖులకు నివాస యోగ్యము బ్రహ్మాజ్ఞానుసారముగ విశ్వకర్మచే నిర్మితము. అష్టైశ్వర్యముల కాటపట్టు. వైశ్య జాతి యందుగల 714 గోత్రికు లందు నివసించు చుండిరి. వారిలో సదాచార సంపన్నుడును, ధన సంపన్నుడు నగు కుసుమ శ్రేష్ఠి గలడు. కుసుమాంబ యాతని సతి. పతివ్రతా శిరోమణి సద్గుణరాశి. పతివ్రతానుసారిణి వారి కే సుఖములకు కొరతలేదు. కాని ఒక్కటే ఒక్క కొరత. ఏమిటది? సంతానము. నోయని నోములులేవు. చేయని దానములు లేవు. చేయని ధర్మములు లేవు. "అపుత్రస్య గతిర్నాస్తి." అని ఆర్యోక్తిగదా! ఒకమారు తమ కులపతి యగు భాస్కరాచార్యుల యొద్దకేగి సంతాన ప్రాప్తి సాధన మేమియని ప్రార్థించగా మున్ను దశరథమహారాజు వోలె పుత్రకామేష్టి యజ్ఞమును కావింపుమని సలహానిచ్చిరి.

ఆచార్యులవారి యాధిపత్యమున కుసుమ శ్రేష్ఠి పత్నీసమేతుడై యజ్ఞము సాగించెను. ఆ దంపతుల పట్టుదలకును శుచిత్వమునకును మెచ్చి పాయసకుంభముతో నగ్నిహోత్రుడు దర్శనమిచ్చి "పుణ్యదంపతులారా! ఈ కుంభమున గల పాయసముతో మీకొక కొమరుడును, కొమరితయును కలుగగలరు." అని పలికి దానిని యా దంపతులకిచ్చి అంతర్ధానమయ్యెను. ఆసమయముననే సంతోషముతో ఆ శ్రేష్ఠి దంపతులు అనేకముగా భూ, గో, వస్త్ర, వాహనాదులను దానముగా నొసంగిరి. అత్తరి కుసుమాంబ పాయసమును సేవించెను. తత్ఫలితముగా నా సతీమణి గర్భవతియై నవ మాసములు నిండిన వెనుక వైశాఖ దశమీ శుక్రవారమునాడు పునర్వసు నక్షత్రమునందు శుభగ్రహములచే సదృష్టింపబడి శుభగ్రహము లుచ్ఛస్థితి యందుగల శుభలగ్నమున శుభ ముహూర్తమున నొక పుత్రికారత్నమును తదనంతరము పుత్ర రత్నమును గనెను.

శ్లో॥

1 తతఃకాలే శుభేలగ్నే సుషువే పుత్రికాం పురా
అనంతరంతు తనయం సావంశకర ముత్తమం

2 వైశాఖేఽదితినక్షత్రే శుభే భార్గవ వాసరే
శుక్లపక్షే దశమ్యాంచ శుభలగ్నే శుభ గ్రహైః

3 అధిష్ఠితే శుభోచ్ఛస్థే శుభదృష్టే గ్రహాత్రయే
జాతంశిశు ద్వయమిదం వైశ్యవంశ వివర్ధనం.

ఆ శిశువు లిరువురునూ పున్నమనాటి చంద్రుని ప్రకాశముతో నీడగు తేజముతో

వెలుగు సౌందర్యోపేతులై ఉండిరి. పుత్రికామణియగు ఆ పసిబాల ఒక్కపెట్టున కోటి సూర్యులుదయించినంత ప్రకాశము గలదియై ఆజానుబాహువై చతుర్భుజాకారిణియై సర్వాభరణ భూషితురాలైన జగదాంబగ దర్శన మొసగెను. అంత నా దివ్య దంపతులు అనందానందకందళిత హృదయులై పరమేశ్వరికి సాష్టాంగ వందనము లాచరించి ఇట్లు స్తుతించిరి

శ్లో॥ కైలాసాచల కందరాలయకరీ
గౌరీ ఉమాశంకరీ
కౌమారీ నిగమాంతగోచరకరీ
ఓంకారబీజాక్షరీ
మోక్ష ద్వార కవాటపాటనకరీ
కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ
మాతాన్నపూర్ణేశ్వరీ॥

శ్లో॥ త్రిలోచనాం సూర్యసహస్రశోభాం
సింహాసనస్థాం ద్విభుజాంధృతాసిం
పీతాంబరాం విష్ణుమహేశసేవ్యాం
కామేశ్వరీంతాం హృదయే స్మరామి॥

ఇట్లు పెక్కు భంగుల ప్రార్థించిన యా వైశ్య దంపతుల భక్తి శ్రద్ధలకు పరమేశ్వరి మిక్కిలి సంతోషించి వారితో నిట్లనెను "ఓ పుణ్యదంపతులారా! మీరు జన్మాంతరమున నన్ను పుత్రికగా బడయుటకై తపం బాచరించితిరి. మీ కోరిక నెరవేర్చుటకై మీకు తనూజనైతిని." అని పలికి యథా ప్రకారముగా నా జగదాంబ మరల శిశువయ్యెను. కుసుమ శ్రేష్ఠి దంపతులు దేవి మాయ వలన దివ్యజ్ఞానము తొలగి ఆ బాలను తమ బాలగనే తలంచి ఎత్తుకొనిరి. వారి యాచార్యులగు భాస్కరాచార్యులవారు శుభ లగ్న ఘడియలలో జాతక కర్మాది క్రియల నాచరింపజేసి బాలునకు విరూపాక్ష శ్రేష్ఠి యనియు బాలికకు వాసవాంబ యనియు నామకరణము గావించెను. వారిరువురు శుద్ధ పక్షమందలి చంద్రునివలె దినదినాభివృద్ధి యగుచుండిరి. శ్రీ వాసవి యుక్త వయస్కురాలగుటచే యామె తల్లిదండ్రులు దగిన వరునకై యన్వేషించుచుండిరి.

మహాశూరులును, చంద్ర వంశజులును మహాభారత కథానాయకులగు పాండవులకు ఏడవ మనుమడుగా విష్ణువర్ధనుడను మహారాజు జన్మించి రాజమహేంద్రవరమును తన రాజధానిగా జేసికొని, నాటి రాజలోకమున కెల్ల మిన్నయై ప్రకాశించుచుండెను. ఆ రాజు దిగ్విజయ యాత్ర సేయదలచి చతురంగ బల సమేతముగా బయలుదేరి తన్నెదిరించిన రాజులను పరాజితుల సేయుచు కప్పములు గైకొనుచు క్రమ క్రమముగా కల్యాణి పట్టణము వరకు జయించెను. అంతటితో విజయయాత్రముగించి వెనుకకు మరలి రాజధానికి పయనము సాగించి పెనుగొండ పట్టణ సమీపోద్యానమునకు చేరుకొనెను. స్వర్గలోకముతో సమానముగ ప్రకాశించుచున్న పెనుగొండ పట్టణ సౌందర్యమును చూడదలచెను, ఈ సంగతి తెలిసిన యా పట్టణ భూపాలకులా రాజును సత్కరింప యమూల్యమగు కానుకలతో జనుదెంచి వాటిని సమర్పించి "మా పురమున కరుదెంచి పవిత్రము చేయుడ"ని వేడుకొనిరి. అందులకియ్యకొని మరునాడు పెనుగొండ పుర సౌందర్యమును తిలకించుచు కుసుమ శ్రేష్ఠి నివసించుచున్న వీథిలోనికివచ్చెను. అది సాయం సమయము. ఆ తరి షోడశ వర్షపు జవ్వనియు, అందాల రాశియు, బంగారు వన్నె గలదియు, రంభ ఊర్వశి మొదలుగాగల అప్సరసలను తలదన్ను సుందరాంగియునగు శ్రీ వాసవీ కన్యక హంస నడకలతో దన సఖురాండ్రతోడ నగరేశ్వర

స్వామి దర్శనార్థమై దేవాలయమునకు బయలు దేరెను. విష్ణు వర్ధనుడా కన్యను చూచుట తోడనే చకితుడై కొంత తడవు నిశ్చేష్టు డయ్యెను. రెండవ జగన్మోహిని వలెనున్న ఆ దివ్యమంగళ స్వరూపము మహారాజ హృదయ ఫలకమున ముద్రితమైపోయినది. తన వెనుక నడచు చున్న వైశ్యపుత్రుల వలన యామె వృత్తాంత మెరిగి ఆమె అవివాహిత యని తెలిసి కొని ఎట్లైననూ యామెను వివాహమాడ దలచి మదన వేదనతో పురమును పూర్తిగ చూడకనే తనకై యేర్పరుప బడిన విడిది గృహమునకు జేరుకొనెను

రేని మనో వేదన నెరిగిన యాతని మంత్రి పుంగవుడగు విజయ సింహుడు భటులనంపి కుసుమ శ్రేష్ఠిని దన విడిదికి రావించి యాతనితో నిట్లనెను. "ఓయీ! వైశ్యపుంగవా! మా ఱేడు మీ కన్యయ యందు వలపు గలిగి యుండెను. గాన మీ కొమరితను రాజునకిచ్చి వివాహము సేయుటవలన అన్ని విధముల సుఖముల బొందగలవు. మీ కన్య నీయనొల్లనిచో బలవంతముగనైన దెచ్చి మహారాజునకు వివాహము గావింతుననని" బెదిరించెను దానికి బదులుగా కుసుమశ్రేష్ఠి" మంత్రిపుంగవా! వివాహమనునది నా యొక్కనిచే సాగునది గాదు బంధువులు సమ్మతింపవలయును. కన్యక యొప్పుకొనవలెను. కాన వారల కెరిగించి తమకు బదులు పలికెదనని" నుడివెను. అంతట విజయ సింహుడు "వైశ్యశిరోమణీ! ఇందు ప్రధాన పాత్రనీది. నీవు సమ్మతించిన తక్కిన వారందరు సమ్మతించినట్లే. నీవు సమ్మతించిననూ సమ్మతించక పోయిననూ యీ వివాహమాగునదిగాదు. ఇది మాత్రము మరువ బోకుము" అనెను. ఇంతలో విష్ణువర్ధనుడు కుసుమ శ్రేష్ఠితో మీ వారితో నాలోచించుకొనియే మాకు వర్తమానము బంపుడు" అని బలికి కుసుమశ్రేష్ఠిని సగౌరవముగా బంపెను.

గృహము చేరినంతనే కుసుమశ్రేష్ఠి వైశ్య పుంగవుల నందరిని రావించి యొకసభ ఏర్పాటు గావించెను. వారిలో రెండు తెగలు ఏర్పడినవి. ఒక తెగవారు లేచి" మహారాజు జామాత యగుట ఎంత వారికి? గావున ఆనందముతో రాజునకు వాసవిని యీయవచ్చునని" యనిరి. రెండవ తెగవారు లేచి "అన్యకులజుడెంతగొప్ప వాడైనను కన్యనొసగుట శ్రేయస్కరముగాదు" అనిపలికిరి. అప్పటిముప్పును తప్పించుకొనుటకు, సమ్మతించితి మని రాజునకు కబురంపి తరువాత యాలోచింతమని తీర్మానించిరి ఆ తీర్మానము ప్రకారము వైశ్యకుల పెద్దలచే వాసవాంబను యిచ్చెదమని రాజునకు వర్తమానము బంపిరి. అందులకారాజు అమితానందముతో జ్యోతిష్కుల రావించి ముహూర్తము నిశ్చయింపుడని యాజ్ఞాపించెను. జ్యోతిష్కులు సుముహూర్తమును నిర్ణయించిరి కాని ముహూర్తము చాల అన్యవధిగా నుండెను. రాజు తదుపరి తన రాజధాని కరిగెను.

విష్ణువర్ధనుడు పురమును వీడిన వెనువెంటనే చుట్టుప్రక్కలనున్న పదునేడు పట్టణములందు నివసించుచున్న వైశ్యగోత్రీలకు కబురంపి రావించి శ్రీ నగరేశ్వరస్వామి దేవాలయమందు భారీ ఎత్తున కుసుమశ్రేష్ఠి కన్యక వివాహమును గూర్చి సభగావించెను. ఆసభయందు ఈక్రింది విధముగా నిర్ణయింపబడినది.

"విష్ణువర్ధనుడు రారాజనియు, వీరుడనియు' యోగ్యుడనియు తలచి వర్ణసంకరమునకు బూనుకొనుట చాల తెలివి తక్కువ. రాజువలన మన పిల్ల సుఖపడుననియు, మనవ్యాపారము వృద్ధి యగుననియు తలచుట కేవలము భ్రాంతి.

అదృష్టమును బట్టి ఎవరికేవి సంప్రాప్తమగునో అవి జరుగక మానవు కాపున వాసవాంబను విష్ణువర్ధునకిచ్చి వివాహముచేయుట తగదు.''

ఈ నిర్ణయమును రాజు కుసుమ శ్రేష్ఠి బంపిన రాయబారులచే దెలిసికొని క్రోకతో త్రొక్కిన పాము వలె లేచి "మీ సమ్మతితో మాకవసరము లేదు. మొదట మాటయిచ్చి తరువాతి నిలుపు కొనని వారితో సంభాషణ లేల వాసవాంబను వివాహమాడి తీరుదును. యుద్ధము చేసియైనను గెల్చి కన్యకను బొందగలను. అని నిర్ణయించి సుముహూర్తమునకు పెండ్లి పనులలో నుండుమని చెప్పుడు''అని రాయబారుల పంపివైచెను.

మృత్యువు బారినుండి రక్షింపబడిన వారి వలె యీ వైశ్య రాయబారులు పెనుగొండ కేగి పూసగుచ్చినట్లు కుసుమ శ్రేష్ఠితో జరిగిన దంతయు జెప్పిరి. కుసుమ శ్రేష్ఠి మరల దమ వారినందరిని రావించి దేవాలయమునందు సభ గావించి యిప్పుడు శేయవలసిన పని ఏమియని సభవారిని బ్రార్థించెను. అప్పుడు భాస్కరాచార్యుల వారు లేచి "ఇందు విచారింపబనిలేదు. పూర్వజన్మ కర్మానుసారముగ ప్రతి కార్యము జరుగుచుండును. ఈ విష్ణువర్ధనుడు పూర్వజన్మమున గూడ మన వైశ్యజాతికి శత్రువుగనే యుండెను. ఆ కథ మీకు క్లుప్తముగా వివరించెదను. సావధానముగ వినుడు'' అని యిట్లు చెప్ప దొడంగెను.

పూర్వము వైశ్యులు ఈశ్వరుని గూర్చి ఘోరముగా తపస్సాచరించగ బోళాశంకరుడు ప్రత్యక్షమై వారికోర్కె ననుసరించి వారిని కైలాసమునకు గొనిపోయెను. అందు వణిక్పుంగవులు సకలసంపదలు గలిగి సుఖముగా నుండి ఈశ్వరుని ధ్యానించుచు సేవలు జేయుచు ప్రకాశించు చుండిరి. వారిలో శంభు శ్రేష్ఠి యను శివభక్తునకు దేవకి యను పుత్రిక గలదు. ఆమెయు శివ భక్తురాలై గౌరీనాధుని సేవించి వచ్చుచుండగా మార్గ మధ్యమున చిత్ర కంపుడను గంధర్వుడొకడు దేవకిని గాంచి మోహావేశము నొందెను. అతడునూ శివభక్తుడే. కాని విధి విలాసమున కెవరు కర్తలు? దేవకిపైగల మోహముననుచిత్రకంపుడు శంభు శ్రేష్ఠిని దర్శించి "మీ తనయను నా కొసగుడని" యరించెను. అన్యకులజునకు మాకన్య నొసగు యాచారము మాలో లేదుగాన మాకన్య నొసగమని దేవకి తండ్రి నిష్కర్షగా నుడివెను. అంతట గంధర్వుడు క్రుద్ధుండై "మీరు నన్ను వెక్కిరించి యదుగగా నన్ను చులకనగా చూచుటవలన మీరు భూలోక వాసులగుదురు గాక! అక్కడనొక కన్య కారణమున మీరు దగ్ధమగుదురుగాక! యని వైశ్యులను శపించెను. వైశ్యులుగూడ అప్పుడు తపస్సంపన్నులుగదా! నాకు'' నిష్కారణముగా మమ్ము శపించుట పాడిగాదు. గాన నీవు భూలోకమున రాజువై జన్మించి మాకుల కన్యను ప్రేమించి ఆమెను బొందకనే సరహాగ్నిచే యాకన్యకచే శపింపబడి తలబద్ధలై మరణించి తిరిగి దేవత్వమును బొందుదువుగాక యని'' గంధర్వునకు ప్రతిశాపమిచ్చిరి. ఆగంధర్వుడే యీ విష్ణువర్ధనుడు. ఆనాటి శాపమువలన మనకన్యను రారాజు గోరుచున్నాడు. మనకుల ధర్మముకొరకు ప్రాణత్యాగము జేసితిమేని మనముగూడ శాపమునుండి విడువబడి తిరిగి దేవత్వము బొందగలము. మహారాజును మన వాసవీ కన్యకయొక్క శాపమువలన తలపగిలి మరణింపగలడు. అని గతాగతమగుచరిత్రమును భాస్కరాచార్యులు తెలియ జేసిరి.

కుల గురువాననతి ప్రకారము 102 గోత్రముల వారు తమకుల ధర్మమును నిలబెట్టకొనుటకు, దేవత్వమును బొందుటకు అగ్ని ప్రవేశ మొనర్ప సంసిద్ధులైరి. రాజు పుర ప్రవేశము

చేయక పూర్వమే అగ్ని ప్రవేశమొనర్చుటకు వాసవీ కన్యయుసిద్ధమయ్యెను. శ్రీ నగరేశ్వర స్వామి ఆలయమునందు మొత్తము 103 గుండములు నిర్మించబడినవి. అందు మంచి గంధపు చెక్కలు నింపిరి. వైశ్యకులజులందరునూ పెనుగొండ పట్టణమునందు ఊరేగింపులు గావించిరి దేవాలయము చెంతకు వచ్చుట తోడనే అగ్నికాహుతికి యిష్టపడని 612 గోత్రముల వారు వెనుకంజ వేసిరి. మిగిలిన 102 మంది గోత్రికులును వాసవీ కన్యకయు దేవాలయమునందు ప్రవేశించి అగ్నిగుండములకు ప్రదక్షిణములు చేయుచుండిరి కల్యాణమంటపమున నూతన వధూవరులు ప్రదక్షిణములు చేయునట్లు భార్యాభర్తలు జంటలు జంటలుగా ప్రదక్షిణములు చేయుచుండిరి. గోసినాడు సంతోషము నేడు దుఃఖము. అది మాఘశుద్ధ విదియ భానువారము మహారాజు పెండ్లికొరకై వచ్చుదినము.

పట్టణమంతయు పచ్చని తోరణములతో నిండి శోభాయమానముగ నుండెను. అగ్ని గుండములందు దూకబోవు పతిపత్నులనొక్కసారి చూచునప్పటికి వాసవాంబకు వారిపై జాలియు మహారాజుపై క్రోధమును గలిగెను. కోపమున కళ్ళెఱ్ఱబారెను. ముఖము కందగడ్డయైనది. రాక్షస సంహారమునకు బయలుదేరిన దుర్గవలె యామె యాకారము భయంకరముగా నుండెను.

“ఎవని మూలమున సద్వంశజులగు 102 గోత్రములు గల వైశ్యులు తమ తమ భార్యలతో మరణింప సిద్ధపడిరో ఎవని మూలమున నా జీవితము నిరర్థకమగుచున్నదో అట్టి ఆ మహారాజు యీ అగ్నిప్రవేశపు వార్త వినినతోడనే తలపగిలి మరణించుగాక” యని వాసవాంబ రాజును శపించెను. మరల అగ్ని ప్రవేశము చేయబోవువారిని చూచి “మీరు యీ భూమి

దాతవోలెను గ్రంథనికేతనంబు
అర్థిజనముల కెల్ల లేదనక యిచ్చు;
అదివిశిష్టము, స్వచ్ఛంద, మవ్యయంబు
మధుర మంజుల భావ సమన్వితంబు.

మాతవోలెను పుస్తక మందిరంబు
బా[illegible]దను జేరవచ్చిన వారినెల్ల
భేదమెంచక సమముగ నాదరించి
జాతిమత సంఘ సామరస్యంబు నెఱపు.

యందు సూర్యచంద్రు లున్నంతవరకు వృద్ధియగుదురు గాక” అని అనుగ్రహించి 102 గోత్రముల వారు తన్ను వెంబడించగా అగ్ని గుండములో బడి పవిత్రయై పరమేశ్వరియై నిలచి అగ్నికాహుతి కాబడిన వారి సంతానములకు వైశ్య కుల ధర్మములను బోధించెను. అంతట ఈశ్వరుడు ప్రత్యక్షమై వైశ్యుల నందరిని యనుగ్రహించి వాసవాంబతో కైలాసమునకు గొని పోయెను.

ఆ విధముగా 102 గోత్రికుల వైశ్యులు మరల కైలాసవాసులైరి. విష్ణువర్ధనుడు అధర్మ మార్గమును బట్టి పెండ్లికి తరలి వచ్చుచూ వాసవాంబ శాపమువలన ఈమె స్థితి చారుల వలన తెలిసికొని పెనుగొండ పట్టణము ప్రవేశించక పూర్వమే తల వేయి వ్రక్కలై మరణించెను. గంధర్వ రూపమున తన లోకమునకేగెను. నాటి నుండి వైశ్యకుల శిరోరత్నమగు వాసవీ కన్యక “శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి”గా ప్రతియింటను, ప్రతిగ్రామమునను వెలసి పూజింపబడు చుండెను

సర్వేజనాః సుఖినోభవన్తు.






★ ★ శ్రీ ఉన్నవ వేణుమాధవరావు B. A.
గుంటూరు.

★

న్యాయమూర్తి భగవానులుగారంటే, ఆంధ్రలో పేరొందిన న్యాయమూర్తులలో ఒకరు. ఆయన చెప్పిన తీర్పు తిరుగులేనటువంటిది. తీర్పు చెప్పటంలో గల ఆయన నేర్పు అమోఘమైనది. నీళ్ళకు నీళ్ళు, పాలకు పాలు వేరువరుచుటలో హంసకు ఎటువంటి నేర్పువున్నదో న్యాయాన్యాయ విచక్షణలో భగవాన్లుగారికి అటువంటి నేర్పు కలదని ప్రఖ్యాతి. అటువంటి భగవాన్లుగారికి ఈరోజు ఒక కేసులో తీర్పు చెప్పటంలో సందేహం కలిగింది. కోర్టు అంతా ప్రేక్షకులతో నిండివుంది. నేరస్థుడు బోనులో నున్నాడు. అతని భార్య, ఇద్దరు బిడ్డలు కోర్టులో ఒకమూల నిల్చొని ఉన్నారు. బిడ్డలు తండ్రి దగ్గరకు పోవాలని చూస్తున్నారు. తల్లి వాండ్లను పట్టుకొని వెళ్ళనివ్వటంలేదు. వంచిన తల ఎత్తకుండ విచార వదనంతో దుఃఖభారంతో ఒక రాయిలా వుంది.

నేరస్థుడుచేసిన నేరం దొంగతనం. అతని పేరు ఆనందరావు. B.A దాకా చదివాడు. 5,6 చోట్ల చిన్నచిన్న ఉద్యోగాలు చేశాడు. కాని స్థిరంగా ఉండే ఉద్యోగము దొరకలేదు. ఉన్న సొమ్ము అంతా అయిపోయింది. భార్యా బిడ్డలను పోషించే బాధ్యత నెత్తిమీద వున్నది. 3రోజులు పస్తువడుతున్నారు. ఆనందరావుకు తనను గురించిన చింతలేదు. బిడ్డలు ఎలాగ అన్న చింతలో వేరేచేసేదిలేక తన అంతరాత్మకు విరుద్ధంగానే ఆపని చేశాడు. ఆపని చేయకూడదని తనకు బాగా తెలుసు. కాని పరిస్థితులు అతనిని అలా చేసినవి.

ఉద్యోగం కొరకు ఒక ఆఫీసుకు వెళ్ళాడు. అచట టేబిలు దగ్గర కూర్చొని యజమానిని ఉద్యోగం కొరకు ప్రార్థించాడు. ఆయన "ఏం లాభములేదు, ఇక్కడ ఏవిధమైన ఉద్యోగం దొరకదని చెప్పాడు. ఇంతలో యజమానికి ఫోను వచ్చింది. ఆయన ప్రక్కకు తిరిగి ఫోనులో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆనందరావు దృష్టి ఆ టేబిలుమీద ఉన్న మనీపర్సు మీద పడ్డది. ఇంటివద్ద నకనకలాడే భార్యా పిల్లలు గుర్తుకొచ్చారు. ఇంటికి వెళ్ళగానే తన భార్య దీనదృష్టి కళ్ళలో మెరిసాయి. తమపరిస్థితి తెలిసి

నందువల్ల ఏమీ అడుగలేదు. కాని అవతల పిల్లల స్థితి చూస్తే గుండె తరుక్కుపోతోంది. డబ్బు చూడగానే తన భార్య యొక్క మెరిసే కనులలో స్వర్గాన్ని చూచినట్లు ఆనందరావు అనుభూతి పొందాడు. ఆలస్యానికి ఆలోచనలకు అచట ఆస్కారము లేదు. వెంటనే అతని చేతులు పర్సుమీదకు పోయినవి. చేతులు వణుకుతున్నాయి. వణక్కుండా వుండటానికి ప్రయత్నం చేస్తూ లావుగా ఉన్న ఆ పర్సును చేతుల్లోకి తీసుకున్నాడు. వెంటనే పర్సు జేబులోనికి పోయింది. అచటినుండి బయటకు చేరి బెదురు చూపులతో ఇంటిదారి పట్టాడు. పరుగెత్తుదామనుకున్నాడు. కాళ్ళు సాగలా. ఎంత త్వరగా నడుద్దామనుకున్నాడో అంత ఆలస్యమవుతున్నది. ఇంతలో ఆఫీసు జవాను వెనకనే పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆనందరావుకు తెలియకుండానే కాళ్ళు వేగంగా పరుగెత్త నారంభించాయి. ఇంతలోనే దొంగ, దొంగ పట్టుకోండి అన్న కేకలు, వెంటనే పదిమంది చుట్టుచేరి అతనిని పట్టుకోవటం జరిగింది. అందరూ అన్నిమాటలూ అన్నారు. కొందరు దెబ్బలుకూడా వేశారు. ఇంతలో పోలీసులు వచ్చి ఆనందరావును పోలీసుస్టేషన్ వైపు తీసుకెళ్ళారు.

× × ×

ఆనందరావు కోర్టులో జరిగినదంతా చెప్పాడు. తను చేసినదానికి శిక్ష వేయమని న్యాయమూర్తిని అర్థించాడు. న్యాయమూర్తి భగవాన్లుగారు ఆలోచనలో పడ్డారు. ఇలాంటి కేసు రావటం ఇదే మొదటిసారి. ప్రతి కేసులోను దొంగ దొంగతనం చేయలేదనటం దానికి తగిన సాక్ష్యంతో పోలీసులు దొంగతనం ఋజువు చేయటం, దానికి తగిన శిక్ష వేయటం అలవాటు. కాని ఇదెక్కడి కేసు. దొంగ దొంగతనం చేశానని ఒప్పుకున్నాడు. దొంగతనం ఏ పరిస్థితులలో చేశాడో కూడా చెప్పాడు. భగవాన్లుగారికి ఆనందరావు చేసింది న్యాయంగా తోచింది. కాని ఆ అభిప్రాయం బయటపెడితే ఇంకేమయినా ఉందా? తనను కూడ దొంగకింద జమకట్టరూ? దొంగతనానికి ఏ శిక్ష విధించాలో అందరకు తెలుసు. తనకూ తెలుసు. తను ఎంతసేపటికి దొంగ, దొంగతనం చేశాడా? లేదా? అనేది మాత్రమే నిర్ణయించాలి. దొంగతనం ఋజువు అయితే ఏ శిక్ష వేయాలో అది న్యాయశాస్త్రంలో ఉంటుంది. ఏ పరిస్థితులలో చేశాడు అనేది విచారించటం న్యాయమూర్తి పనిగాదు. మరి ఎవరు విచారించాలి? ప్రభుత్వమా? కేసు పెట్టింది ప్రభుత్వ ప్రతినిధులైన పోలీసుశాఖేగా? ఈ విధమైన ఆలోచనలు భగవాన్లుగారి మెదడులో మెదులుతున్నాయి. ప్రేక్షకులంతా ఎందుకు న్యాయమూర్తి ఆలోచించుచున్నారు. ఇందులో ఏముంది? దొంగ, తను దొంగనని ఒప్పుకున్నాడు. శిక్ష వేయటానికి ఇంత ఆలోచన ఎందుకు? అని గుసగుసలాడుతున్నారు. న్యాయమూర్తి చివరికొక నిర్ణయానికి వచ్చారు. ముఖంలో విషాదరేఖలు గోచరించినవి. నేరస్థునకు శిక్ష వేశారు. న్యాయశాస్త్ర ప్రకారం 2 సంవత్సరములు కఠినశిక్ష వేశారు. ఆనందరావు ఒక్కసారి తన భార్యాపిల్లల వైపు చూచాడు. నేను తప్పు చేశాను క్షమించు సుందరీ అన్నట్లున్నాయి ఆనందరావు చూపులు ఆనందరావు భార్య సుందరికూడ అదేసమయ

యములో ఆనందరావు వైపు చూసింది. స్వామీ! మా కొరకు ఎందుకు ఇలాటివని చేశారు. మీ వియోగాన్ని నేనెలాభరింపగలను. అన్నట్లున్నాయి సుందరి నయనాలు. ఆనంద రావు ఇక సుందరి వైపు చూడలేక ముఖం ప్రక్కకు తిప్పుకొని పోలీసులతో వెళ్ళి పోయాడు. అంతే. సుందరి ఇద్దరు పిల్లలను గట్టిగా హృదయానికి హత్తుకుంది. న్యాయ మూర్తి భగవాన్లుగారు నిజంగా న్యాయమూర్తులు. అని అందరన్నారు. కాని భగవాన్లుగారు మాత్రం ఆ రోజుకు కోర్టు చాలించి ఇంటికి వెళ్ళారు.

× × ×

మరునాడు పోస్టులో ఆనందరావు భార్య సుందరిపేర నూరురూపాయలు మనియార్డరు వచ్చింది. ఆనందరావు జైలునుంచి వచ్చేదాక ప్రతినెలా నూరురూపాయలు పోస్టులోవస్తవి. వానిని స్వీకరించమని ప్రార్థిస్తూ ఒక ఉత్తరం వచ్చింది. సుందరి ఉత్తరం చదువుకొని రెండు కన్నీటి చుక్కలు రాల్చింది. అవి ఆనంద బాష్పాలో! దుఃఖాశ్రువులో!

## భారతనారి

రణముల్ చేసిరి సత్యభామ మొదలౌ రాజీవనేత్రిల్ ధృతిన్
చణలౌ తేరియయు గార్గియుగ్ జదివిరాశాస్త్రౌఘముల్ భక్తితోఁ
బణమందున్ మనసాధ్వులే ఘనముగాఁ బ్రానోస్యమున్ గాంచినా
రణుమాత్రమ్మును సందియమ్ము వల దాయాస్త్రీ చరిత్రమ్ములన్.

మానిత మాధురీ భరిత మంజుల శిల్పకళావిశేషమున్
గాన సుధాపరిపూర్ణ కలకంఠవిరాజిత వాక్సమత్కృతిన్
ధ్యానవిలీన మానస పథాంచిత భక్తిగుణాను రక్తియున్
బూనుచు మానినీమణులు పోలుదు రెందును బూరుషాళితోన్.

పావనసేవలన్ బ్రజకు వాంఛిత బోధన నందఁ జేయుచో
దేవత యండ్రు స్త్రీని ధర దివ్యకలాన్విత విజ్ఞలందఱున్
బోవ సమర్థలై మనలఁ బూర్వ నవీన విశేష విద్యలన్
భావపరంపరన్ వెలుఁగు భామినులందఱు పూజనీయులే.

—శ్రీ శాస్త్రి

# దానపత్రము

చిలకలూరిపేట శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ సంఘ అధ్యక్షులు శ్రీ గ్రంధి వెంకటరత్నంగారికి, శ్రీ రాచమల్లు నాగయ్యగారి కుమారుడు రంగనాయకులు యిచ్చిన దాన పత్రిము.

ధర్మ సంఘ వాణిజ్య భవనముల మీద నాచే నిర్మింపబడిన భవనమును శ్రీ వా. క. ప. గ్రంధాలయమునకై యిందుమూలముగా మీకు దానమొనర్చడమైనది.

చిలకలూరిపేట
2-12-1963

ఇట్లు,
రాచమల్లు రంగనాయకులువ్రాలు.



